





# జీవిత చరిత్ర

## గాంధీజీ

## ఆత్మ కథ - 1,2





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050005765,5010010031799

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

D L I

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆంధ్రగ్రంథమాల—౧౦

# ఆత్మకథ

## ప్రథమసంపుటము

అనువాదకుఁడు:

శతావధాని వేలూరి శివరామశాస్త్రి

ప్రకాశకుఁడు:

కాశీనాథుని నాగేశ్వరరావు

౧౯౨౭]

[వెల రు ౧-౦-౦

# విషయ సూచి

## మొదటిభాగము

## మూఁడవభాగము

## జన్మాదికము

గాంధీకుటుంబమువారు మొదట * పచారుదినుసులు అమ్మువారై యుందురు. కాని మా తాతగారికి పైమూవురు పురుషులు కాఠియావాడునందలి కొన్ని సంస్థానములందు మంత్రులుగా ఉండిరి. ఓతాగాంధి యను మాఱుపేరు కల ఉత్తమచందు గాంధీ అను మా తాత మిక్కిలి నియమపాలకుఁడై ఉండనోపును. ఏలన, కొన్ని రాజకీయము లగు కుట్రలవలన ఆయన పోరుబందరు దివానుగిరి విడిచి జూనాఘడ్ అను సంస్థానమును ఆశ్రయింపవలసివచ్చెను. అచట అతఁడు నవాబునకు ఎడమచేతితో సలాముచేసెను. ప్రత్యక్షమైన ఈ అవినయమునకు ఒకఁడు కారణ మడుగఁగాఁ 'కుడిచేయి ఈవఱకే పోరుబందరునకు సమర్పితమయినది' అని అతఁడు అనెను.

భార్య చనిపోఁగా, ఓతాగాంధి మరల పెండ్లాడెను. అతనికి ప్రథమకళత్రమున నలువురును, ద్వితీయకళత్రమున ఇద్దఱును కుమారులు. ఈ ఓతాగాంధి కుమారు లందఱు ఏకగర్భసంజాతులు కారని నేను బాల్యమున గ్రహించితిననిగాని, ఒరులవలన ఎఱిఁగికొంటిననిగాని అనుకొనను. ఈ ఆఱుగురు అన్నదమ్ములలో అయిదవవాఁడు కబాగాంధి అని నామాంతరము కల కరంచంగు గాంధి. ఆఱవవాఁడు తులసీదాసు

* గుజరాతు, కాఠియావాడులలో పచారుదినుసులు అమ్మువారికి 'గాంధి' అని పేరు.

గాంధి. ఈ సోదరులు ఇరువురు ఒకరిపిదప మఱియొకరు పోరుబందరు నందు ప్రధానామాత్యులుగ నుండిరి. ఇందు కబాగాంధి నాతండ్రి. ఆయన రాజస్థానిక-కోర్టులో ఒక సభ్యుఁడు. ఆకోర్టు ఇపుడు అంతరించెను కాని అది ఆకాలమున రాజులకును, తత్కులజులకును తగవులను దిద్దజాలినదిగా ఉండెడిది. ఆయన కొంతకాలము రాజకోటలోను, పిదప వాంకనేరులోను దివానుగా ఉండెను. ఆయన చనిపోవువఱకును రాజకోటసంస్థానమున పింఛను పుచ్చుకొనుచుండెను.

కబాగాంధి కళత్రవియోగములవలన నాలుగు మాఱులు పెండ్లియాడెను. ప్రథమ ద్వితీయకళత్రములకు ఇద్దఱు కూఁతుండ్రు; తుది భార్య యగు పుత్లీబాయికి ఒకకూఁతురు, మరి ముగ్గురు కొడుకులును; అందు నేను కడగొట్టుబిడ్డఁడను.

నా తండ్రి కులాభిమాని, సత్యప్రియుఁడు, శూరుఁడు, ఉదారుఁడు; కాని కోపిష్ఠి. కొంచెము విషయ లోలుఁడనియు అనవలయును. ఏలయన, అతఁడు నాలుఁగవపడి దాఁటినపిదప నాలుగవతూరి పెండ్లియాడెను. కాని లంచగొండి కాఁడనియు, ఇంటను బయటను గూడ పక్షపాతములేని న్యాయశీలము కలవాఁడనియు పేరు మోసెను. ఆయన సంస్థానాభిమానము సర్వవిదితము. తన ప్రభువగు రాజకోటరాజును ఒక అసిస్టెంటు పొలిటికల్ ఏజెంటు తూలనాడఁగా ఆయన అవరోధించెను. ఆ యేజెంటు కినిసి, 'పొరపాటు చేసితినని విన్నవించుకొని శరణు వేఁడికొంటివేని క్షమింతును' అనెను. అందులకు అతఁడు ఒప్పుకొనమి కొన్ని గంటలు నిర్బంధమున ఉంపఁబడెను. అటులయినను అతఁడు చలింపకుండుట చూచి ఆ యేజెంటు విడిచి పుచ్చెను.

# ౧ జన్మాదికము

మా తండ్రికి సొమ్ము కూడఁబెట్టవలయునను ఆశ లేనే లేదు, కాన మాకు మిగిలినది కడుఁ గొలఁది.

మా తండ్రి కేవలము అనుభవశాలి. ఆయన అయిదవ గుజరాతి క్లాసు వఱకు చదివినాఁ డన్నచో అక్కడి కెక్కువ. చరిత్రము, భూగోళశాస్త్రము ఆయన ఎఱుఁగఁడు. కాని నిత్యవ్యవహారములలో కలిగిన మంచి అనుభవము గట్టి చిక్కులను విడఁదీయను, వందలతర బడి జనమును పరిపాలింపను అన్నివిధముల చాలియుండెను. ఆయ నకు మతశిక్ష కడుఁ గొలఁది. కాని దేవళములను తఱచు దర్శించుట వలనను, మతవాదముల వినుటవలనను చాలమంది హిందువులకు కలుగు ధర్మపరిజ్ఞానము ఆయనకును కలదు. కుటుంబమునకు ఆప్తుఁడగు ఒక పండిత బ్రాహ్మణుని ప్రేరణచే ఆయన అంత్యదినములలో గీతా పారాయణము మొదలిడెను. ఆయన ప్రతినాఁడును పూజాకాలమున కొన్ని శ్లోకములు ఎలుఁగెత్తి చదువుచుండువాఁడు.

నా చిత్తమున మా అమ్మ పరమసాధ్వి యను విషయము హత్తు కొనిపోయినది. ఆమె మిగుల దైవచింత కలది. ఆమె నిత్యము పూజ చేసికొనక భోజనము మాట తలపెట్టునది కాదు. హవేలీకి (విష్ణ్వాలయము) పోవుట ఆమెకు నిత్యవిధులలో ఒకటి. నాకు జ్ఞప్తి ఉన్నంతవఱకు ఎన్నడు ఆమె *చాతుర్మాస్య మానినటులు లేదు. ఆమె అతికఠినములగు నోములు నోఁచి నిర్విఘ్నముగా నెఱవేర్చె డిది. పట్టిన నోము విడువను ఆమెకు జబ్బొక సాకు కాదు. ఆమె §చాంద్రాయణము చరించుచుండఁగా జబ్బుపడుటయు, జబ్బు ఆమె

* వర్షర్తువున నాలుగు నెలలు ఏకభోజనము చేయువ్రతము.

§ చంద్రుని హాని వృద్ధుల ననుసరించి అన్నకబళముల తగ్గించుట, పెంచుట.

నిసుమంతయు చలింపఁజేయలేకపోవుటయు నాకు గుఱుతు. వరుసగా రెండు మూఁడు నిట్రుపాసములు ఆమె కొక లెక్క కాదు. చాతుర్మాస్యలలో ఒకపూఁట మాత్రమే భుజించుట ఆమె కలవాటు. అంతటితో తృప్తిచెందక, ఆమె ఒకచాతుర్మాస్యలో దినము విడిచి దినము ఉపవసించినది. మరియొక చాతుర్మాస్యలో సూర్యుని చూచిగాని భుజింపనని వ్రతము పూనెను. ఆరోజులలో సూర్యదర్శనమయినదని మాఅమ్మకు చెప్పుటకు పిల్లల మందఱమును నిలువఁబడి సూర్యునిమీఁద కనులు పెట్టుకొని యుండువారము. నడివర్షాకాలమున సూర్యదర్శనము తఱుచు లభింపదని అందఱెఱుఁగుదురు. సూర్యుఁడు హఠాత్తు కానిపింపఁగా మేము మా అమ్మ కడకు పరువెత్తికొని వెళ్లి, 'అమ్మా, అమ్మా! సూర్యుడు కనుపడుచున్నాడు, రా' అని చెప్పిన రోజులు నాకు గుఱుతు. ఆమె స్వయముగా దర్శనముచేసికొన పరుగుపరుగున వచ్చెడిది కాని అంతలో సూర్యుఁడు మాయమయి పోవువాఁడు. ఆమె 'పోనీ! నేఁడు నేను భుజించుట ఈశ్వరునికి ఇష్టము కాదు' అని సంతోషముగా పలుకుచు గృహకృత్యములకు పోయెడిది.

మా అమ్మకు వ్యవహారజ్ఞానము మెండు. సంస్థానమునకు సంబంధించిన విషయములు ఆమెకు లెస్సగా తెలియును. రాణివాసమంతయు ఆమె తెలివితేటలకు మెచ్చుకొనునది. బాల్య మిచ్చిన వీలును ఉపయోగించుకొని నేనును ఆమెవెంట రాణివాసమునకు తఱుచు చనుచుండువాఁడను. రాజమాతకు మాయమ్మకు జరుగుచుండెడి నాఁటి సరససంభాషణములు నేఁటికిని నాకు గుఱుతు.

ఈ దంపతులకు సుదామపురి అను పోరుబందరున 1869 సం. అక్టోబరు 2 వ తేదీని (శుక్ల సం. భాద్రపద బహుళ ద్వాదశి శని

వారము) నేను జనించితిని. పోరుబందరున నాశైశవము కడచెను. బడిలో వేయుట నాకు గుఱుతు ఉన్నది. ఎక్కములు వల్లించుట నాకు కొంతచిక్కే అయినది. అపుడు తోడిబాలురతో మాపంతులను తిట్టుట తక్క మరియేమియు నానేర్చినది గుఱుతున లేకపోవుట చూడఁగా, నా బుద్ధి కడు మందమైనదనియు, నాకు ధారణ తక్కువ అనియు తెలము.

## ౨

## బాల్యము

నా తండ్రి పోరుబందరు విడిచి రాజస్థానిక కోర్టులో సభ్యుఁడుగా రాజకోటకు వెళ్లునాఁటికి నేను సుమారు ఏడేండ్ల వాఁడను కావచ్చును. నన్ను అచట ఒక ప్రైమరీస్కూలులో చదువ వేసిరి. అందు నన్ను చదివించిన ఉపాధ్యాయుల పేరులు, ఇతర విషయములతోఁగూడ ఆరోజులు అంతయు నాకు గుఱుతున్నవి. పోరుబందరు నందువలె ఇచటఁగూడ నావిద్యాభ్యాసంగమును గుఱించి వ్రాయఁదగిన దేదియు లేదు. నే నొక విద్యార్థిమాత్రుఁడనై యుందును. నేను ఈ స్కూలునుండి సుబర్బుస్కూలునకును, అటనుండి హైస్కూలునకును వెళ్లితిని. నాఁటికి నాకు పండ్రెండేండ్లు. ఈ కొలఁదికాలములో నేను ఉపాధ్యాయులతోఁ గాని, సహాధ్యాయులతోఁ గాని, ఎన్నఁడేని బొంకులాడియున్నటులు నాకు గుఱుతు లేదు. నాకు బిడియము హెచ్చుగుటచే సమాజమును తప్పించుకొనుచుండువాఁడను. నాపుస్తకములు, నాపాఠములును నాకన్న జతగాండ్రు. వేళకు సరిగా బడికి పోవుట, బడి మూయఁగనే ఇంటికి పరుగిడుట—ఇదియే ప్రతిదినము నా కలవాటు. వాచ్యముగా నేను పరుగిడువాఁడను. ఏలన, నాకు ఇతరులతో మాటలాడుట దుస్సహము. ఎవరేని గేలిచేసిపోదు రనియు నాకు భయము. హైస్కూలున తొలియేఁడు పరీక్షాసమయమున సంభవించిన ఒకవిషయము వ్రాయఁదగియున్నది. జైల్స్ అను పరీక్షకుఁడు (Educational Inspector) పరీక్షింపవచ్చెను. అతఁడు

వర్ణక్రమ (Spelling) పరీక్షకుఁగాను అయిదు పదముల నిచ్చెను. అందు ఒకటి కెట్టిల్ (Kettle). నేను దానిని తప్పు వ్రాసితిని. ఉపాధ్యాయుఁడు తన బూటుకొనతో నన్ను దిద్దఁజూచెను గాని నేను దిద్దఁబడనైతిని. 'పొరుగువాని పలకలో చూచి వ్రాయుట ఆయన ఉద్దేశము' అని ఊహించుట నాతల దాఁటిన విషయము. ఏలన, ఒకరి పలకలో ఒకరు చూచి వ్రాయకుండ ఉపాధ్యాయుఁ డచట నిలువఁబడెనని నాతలఁపు. తుద కేమైన దనఁగా, నేనుతక్క నందఱును ప్రతిపదమునకు వర్ణక్రమము సరిగా వ్రాసిరి. నేనుమాత్రము దద్దమ్మను. తరువాత ఉపాధ్యాయుఁడు నామూఢత్వమును నాకు తెలుపఁజూచెను గాని ఆయన యత్నము వమ్మైనది. దొంగతనముగా చూచి వ్రాయు విద్య నే నన్నఁడును నేర్వలేకపోతిని.

ఇది ఉపాధ్యాయునిపట్ల నాకుఁగల వినయమును కొంచెమైనను తగ్గింపలేదు. పెద్దల దోషములయెడ అంధుఁడనైయుండుట నాస్వభావము. తరువాతఁగూడ ఈ యుపాధ్యాయునిగుఱించి ఇంకను చాల దోషములు నాయెఱుకకు వచ్చినవి కాని ఆయనపట్ల నావినయ మట్లే యుండెను. ఏలన, నేను పెద్దల యాజ్ఞ పాలించుటయే నేర్చితిని గాని వారి పనుల తర్కింప నేర్వలేదు.

నాఁటివే యగు మరి రెండువిషయము లెల్లపుడు నాస్మృతిలో హత్తుకొనియున్నవి. బడిపుస్తకములు తక్క ఇతర పుస్తకము చదువుటలో నాకు రుచి తక్కువ. దినపాఠములు చదువవలసియే యుండెను. ఏలనన్, ఉపాధ్యాయుని మోసగించుట నాకు ఎంత ఇష్టముకానిపనియో ఆయనచే మాటపడుటకూడ నాకు అంత ఇష్టముకాని పని. కావున నేను పాఠములు వల్లించుచుండువాఁడను. కాని తఱుచుగా నామనస్సుమాత్రము అచట ఉండెడిది కాదు. ఈ రీతిగా నాకు పాఠములే

సరిగా రానపుడు ఇఁక అన్యగ్రంథపఠనముమాట యెక్కడ? కాని ఒకానొకపుడు మాతండ్రిగారు కొనిన ఒకపుస్తకముపై నాకనులు పడినవి. అది శ్రవణపితృభక్తినాటకము. (పితృభక్తి కల శ్రవణునిగురించి నాటకము.) నేను అతిశ్రద్ధాళువనై దానిఁ జదివితిని. ఆతఱినే బొమ్మలాటగాండ్రును మానివాసమునకు వచ్చిరి. వారు చూపు బొమ్మలలో అంధులగు తలిదండ్రులను కావడిలో నుంచుకొని యాత్రకుఁ గొనిపోవు ఈశ్రవణుని బొమ్మయు కలదు. ఈపుస్తకమును, ఆబొమ్మయు నామనస్సుపై మాయని ముద్ర వేసెను. 'నీవు లక్ష్యముగా గ్రహించి చరింపవలసిన వస్తువొకటి ఇచట ఉన్నది' అని నేను నాకు ఆదేశించుకొంటిని. శ్రవణుఁడు చనిపోవగా, అతని తలిదండ్రుల కరుణవిలాపము నేఁటికిని నాకు స్మృతికివచ్చుచున్నది. ఆజాలిపాట నన్ను చాల ద్రవింపఁజేసెను. నాతండ్రిగారు కొనియిచ్చిన జంత్రముపై నేను దానిని పాడితిని.

ఇట్టిదే వేఱొక నాటకమునకు సంబంధించినది కలదు. సరిగా ఆసమయముననే ఒక నాటకసమాజమువారి ప్రదర్శనము చూచుటకు నేను మా నాయనగారి అనుజ్ఞ సంపాదించుకొంటిని. అది నాహృదయము మారగొన్న హరిశ్చంద్రనాటకము. దానిఁ జూడ నాకు విసువు లేదు. కాని దానిఁ జూడ నాకు ఎన్నితూరులు అనుజ్ఞ దొరకును? అదియే నామనస్సున ఎప్పుడు తిరుగుచుండెడిది. నాలో నేనే లెక్కలేనన్ని మాఱులు హరిశ్చంద్రనాటక మాడియుందును. 'అందఱును హరిశ్చంద్రునివలె ఏల సత్యసంధులు కారాదు?' అని రేయుంబవలు నాలో నేను ప్రశ్నించుకొనుచుంటిని. హరిశ్చంద్రునివలె సత్యమును పాలించుటయు, హరిశ్చంద్రునివలె విపత్తులన్నియుఁ గడచుటయు అను ఈ ఉత్తమధర్మము నాలో ఆవేశించినది. హరిశ్చంద్రకథలోని ప్రతి అక్షరమును నిక్కమని నా నమ్మిక. దాని తలపోయు మాత్రము

నచే నాకు దుఃఖ మాఁగెడిది కాదు. హరిశ్చంద్రుఁడు ఒక చారిత్రిక పురుషుఁడు కాఁడు అని లోకజ్ఞానమువలన నాకిపుడు తోఁచుచున్నది. నాకు మాత్రము శ్రవణ హరిశ్చంద్రులు సజీవసత్యములే. మరల నేను ఇపుడు ఆనాటకములు చదువుదునేని వెనుకటివలెనే ద్రవించుట నిక్కువము.

3

## బాల్యవివాహము

ఈ ప్రకరణము వ్రాయకుండుట నా యభీష్టము. అయినను ఈ కథాక్రమమునందు ఇట్టి చేఁదు ఎంతయో మ్రింగ వలసియున్నాను. నేను సత్యమునకు పూజారి నగుచో మార్గాంతరము లేదు. నాకు పదుమూఁడవయేఁట పెండ్లి అయినదని యిచట గ్రంథస్థము చేయుట నా పరితాపయుతమగు విధి. నారక్షణలో ఉన్న బాలురను, ఆనాఁటి నా ప్రాయమువారిని చూచుచుండఁగా, నా పెండ్లి గుఱుతు వచ్చి నన్నుఁ గూర్చి వగచికొనను, నా దౌర్భాగ్యమును తప్పించుకొనుటఁజేసి వారిని అభినందింపను నాకు మన సగుచున్నది. పదుమూఁడేండ్ల ప్రాయమున నైన ఆ నావివాహమును సమర్థించు నైతిక మగు ఏవిధియు నాకు కానరాదు.

పాఠకుఁడు పొరపడకుండుఁగాక, నాకు అయినది పెండ్లి కాని ప్రధానము కాదు. కాఠియావాడునందు ప్రధాన మనియు, పెండ్లి అనియు రెండు వేఱు వేఱు సంస్కారములు కలవు. పెండ్లికిఁగాను పిల్లల తలిదండ్రులు ముందు చేసికొను ఒప్పందము ప్రధానము. అది అతిక్రమణీయముగాదు. కుఱ్ఱఁడు చనిపోవుచో ప్రధానమువలన పిల్లకు వైధవ్యము రాదు. అది కేవలము తలిదండ్రుల ఒడంబడికయే కాని పిల్లలకు దానితో సంబంధము లేదు. పిల్లలకు ఈ ప్రధానము సంగతి తఱుచు తెలియదు కూడ. నాకు ముమ్మాఱు ప్రధానము జరిగినటులు

ఉన్నది కాని ఎప్పుడో ఎఱుఁగను. ప్రధానము అయిన మొదటి ఇరువురు బాలికలు ఒకరితరువాత ఒకరు చనిపోయి రని వింటిని. కావున నాకు ముమ్మాఱు ప్రధానము అయినదని ఊహించుచున్నాను. మూఁడవ ప్రధానము నా ఏడవయేఁట జరిగెనని కొంచెము గుఱుతు ఉన్నది కాని దానిగుఱించి నాతో చెప్పినటులు మాత్రము గుఱుతు లేదు. వివాహమున వధూవరులు కర్మలు నెరవేర్పవలసి యుందురు. ఈ ప్రకరణమునందు నా పెండ్లికి సంబంధించిన కొన్ని విషయములు మాత్రము వ్రాయుదును. నా పెండ్లి నాకు సరిగా గుర్తుకలదు.

మేము అన్నదమ్ములము మూవురము అని చదువరులకు తెలిసి యున్నది. మొదటివానికి ఈవఱకే పెండ్లి అయెను. నాకంటె రెండు మూఁడు ఏండ్లు పెద్ద అయిన నా రెండవ అన్నకును, నాకన్న ఒక యేఁడు పెద్ద కాఁదగిన మా పెత్తండ్రికొడుకునకును, నాకును కలిపి ఒకలగ్నముననే పెండ్లి చేయ నిశ్చయించిరి. ఇందు మా బాగోగుల తలంపు లేదు. మా ఇష్టానిష్టముల ప్రసక్తి మొదలే లేదు. అది కేవలము వారి అనుకూల్యము, వ్యయము తగ్గుట—వీనికి సంబంధించినది.

హిందూసంసారములందు పెండ్లి యనిన ఒక స్వల్పవిషయము కాదు. దాతృప్రతిగ్రహీతలు పెండ్లితో తఱుచు కూలిపోవుదురు. వారు సొమ్మును, సమయమును వమ్ముచేయుదురు. బట్టలు పాఁతలు, నగలు నాణెములు, విందులు వింతలు తయారుచేయుటకు కొన్ని నెలలు పట్టును. ఇవి సమకూర్చుటలో నొకరినొకరు మించఁ బ్రయత్నింతురు. కంఠమాధుర్యము ఉన్నను లేకున్నను, గొంతు బొంగురువోవ పాడి రోగములుగూడ తెచ్చికొని ఇరుగుపొరుగువారి శాంతికి భంగముచేయుదురు. ఇరుగుపొరుగువారుగూడ ఈ సందడిని దండడిని, ఈ చెత్తను చెదారమును

నెమ్మదిగా సైరింతురు. ఏలయనఁగా, వారివంతు వచ్చినపుడు వారికిని ఇటులు చేయవలసియుండునని తెలియును.

మా పెద్దలు ఈపీడ నంతయు ఒకసారియే ఝూడాచేయుట మేలనుకొనిరి. తక్కువ వ్యయము, ఎక్కువ వైభవము; ముమ్మారు ఖర్చు పెట్టుటకుబదులు ఒకమారు ఉదారముగా వ్యయము చేయ నగును గదా! నాతండ్రి పెత్తండ్రులు ముదుసండ్రు. వారు ఇఁక జరుపవలసిన కడపటిశుభకార్యములు ఇవియే. చరమవయస్సున శుభకార్యములు చూచుకొనఁ దలఁచుట వారికి పాడియే. ఇన్ని సందర్భములఁబట్టి మూఁడు పెండ్లిండ్లును నిశ్చితము లైనవి. పైన నేను చెప్పినట్లు పెండ్లి పనులు చేయుటకు కొన్ని నెలలుపట్టెను.

ఈప్రయత్నములఁ జూచియే మేము రాఁబోవు విషయమును పసిపట్టితిమి. మంచి బట్టలు, మేళతాళములు, ఊరేఁగింపులు, విలువ విందులు, ఆడుకొన ఒకక్రొత్తపిల్ల-ఇవన్నియు చేకూఱునని తెలియుట కంటె నాకు వేఱేమియు తెలిసినటులు లేదు. భోగాభిలాష తరువాత. గ్రంథస్థము చేయఁదగిన కొన్నిమాత్రము వ్రాసి నాసిగ్గుపాటును తెరచాటు చేయ సంకల్పింతును. అదిగూడ ముందు ఉగ్గడింతును. ఈ నా ఆత్మకథలో ముఖ్యముగా నేను వ్రాయఁదలఁచుకొనిన ప్రధానాంశమునకును, దీనికిని గల సంబంధము కొలఁది.

పెండ్లికిఁగాను నన్నును, మా అన్నను రాజకోటనుండి పోరుబందరునకు కొంపోయిరి. వివాహనాటకమునకు పూర్వరంగముగా జరిగెడి పసుపునలుఁగు మొదలగు తమాషాలు చాల గలవు కాని వాని వివరింపక విడుచుట లగ్గు.

మాతండ్రి దివానే; అయినను నవుకరు. రాజుగారికి విశ్వాసపాత్రుఁడు గాన మరింత పరాధీనుఁడు. చివరనిమిషమువఱకు రాజుగారు ఆయనకు పోవ ననుజ్ఞ ఈఁయలేదు. పోరుబందరునకును రాజకోటకును ౧౨౦ మైళ్లు; ఎడ్లబండిమీఁద అయిదునాళ్లు ప్రయాణము. రాజుగారు అంచెగుఱ్ఱపుబండ్లను ఉంచి మూఁడునాళ్లకే చేరునటులు ఏర్పాటు చేసిరి. మూఁడవ మకాములో బండి బోల్తాపడెను. మాతండ్రికి గాటపుదెబ్బలు తగిలెను. ఒడలినిండ దెబ్బలతో ఆయన ఇలు చేరెను. ఆయనకును, మాకును ఉత్సాహము సగమాయెను కాని వివాహము మానుటకు వీలు లేదు. ఏలన, లగ్నములు మార్ప శక్యమా? నేను బాలోల్లాసముతో పెండ్లి కులాసాలో మునిఁగి మాతండ్రిగారి గాయములకు దుఃఖింప మఱచితిని.

నేను పితృభక్తుఁడను; అంత విషయ భక్తుఁడనుగూడ. 'విషయ' మనగా ఇంద్రియములని కాదు. కేవలము భోగమాత్రమనియే యర్థము. తలిదండ్రుల నుపచరించుటకు సమస్తమును త్యాగము చేయవలయును అను ఉత్తమధర్మము నే నింకను గ్రహింపలేదు. నాభోగాభిలాషను దండించుటకో యన ఒకటి జరిగెను. నాఁటినుండియు అది నన్ను బాధించుచునే ఉండెను. దానిని ముందు తెలిపెదను. నిష్కుళానందుఁడుచెప్పెను:

‡'త్యాగ న టకే రే వైరాగ వినా, కరీ యే కోటి ఉపాయ జీ.'

క. ఎన్ని యుపాయంబులనుం
బన్నినయేనియును విషయవాసన విడదే,

‡ ఈ పాటను నే నెప్పుడేని పాడినను, ఎవరేని పాడఁగా వినినను, ఈ కటువిషయము చప్పున స్మృతిఁ దవిలి నన్ను లజ్జాపూరితుని చేయుచుండును.

కున్నను నీకుం ద్యాగం
బన్నది పెనుబండిసున్న యగుఁ జూడుమురా!

మాతండ్రిగాయములతో నొగిలియు నగుమోము పెట్టి, క్రియాకలాపమంతయు నిర్వహించెను. నేను అది తలఁచుకొనినపుడు వివాహమున కర్మకాండచేయ ఆయన ఎచటనెచట కూరుచుండెనో ఆయా ప్రదేశములు అన్నియు నేఁటికిని నాకనుల వ్రేలును. బాల్యమున నాకు పెండ్లి చేసినందులకుఁగాను ఒకనాఁడు నాతండ్రిని తీవ్రముగా విమర్శింతునని అపుడు నేను తలఁచితినా? ఆనాఁడు ప్రతిదియు సక్రమముగను, యోగ్యముగను, మనోహరముగను కానిపించెను. పెండ్లి చేసికొనవలయు నను ఉబలాటము నాకును గలదు. అపుడు నాతండ్రిగారు చేసిన ఏర్పాటులన్నియు నిర్దుష్టములుగ కానిపించెను. ఇవి యెల్లను నాకు చక్కఁగ గుఱుతు కలదు. మేము ఇరువురము వేదికపై కూర్చున్న తీఱుఁగు, * సప్తపది జరిపినరీతి, ఒకరు త్రావిన † కంసారు ఒకరి నోటికి అందించిన పోలిక, సంసారము చేయ మొదలిడిన విధము నేఁటికిని నాయెదుట చిత్తరువు పోల్కి ఉండును. ఓహో, ఆతొలి రేయి! ఏమియు తెలియని ఇరువురు పిల్లలు!! వారికి తెలియకుండనే అపాంతము సంసారసాగరమున ఉఱికిరి. తొలిరేయి మెలఁగవలయు మెలఁకువను మావదినెగారు నాకు చక్కఁగా బోధించిరి. నాభార్యకు ఎవరు బోధించిరో నే నెఱుఁగ. ఆమాట ఆమె నెన్నఁడు నే నడుగలేదు; ముందును అడుగఁ దలఁప లేదు. మేము ఒక్కరి మొగమును మరియొకరు చూడ మోమోటమి కలవారమని పాఠకులు

* సన్నెకల్లు త్రొక్కించుట.

† ఇది గోధుమలతో చేసిన ఒకానొక పదార్థము. వివాహ మయినపిదప వధూవరు లిరువురు పరస్పరము భుజింతురు.

దృఢముగా ఎఱిఁగియుండవచ్చును. నిక్కముగా మాకు సిగ్గు హెచ్చు. నేను ఆమెతో మాటలాడు టెట్టులు? అదిగాక, ఏమి మాటలాడుదును? మావదినెగారి శిక్షణము నన్ను సుదూరము తీసికొనిపోలేదు. అట్టి విషయములలో శిక్ష నిక్కముగా అక్కఱగాదు. శిక్షను ఇసుమంతయు అక్కఱ లేకుండఁ జేయుటకు పూర్వజన్మ సంస్కారములు బలవత్తరములు. క్రమముగా మాకు పరిచయము బలిసినది. అఱగొఱ లేక మాట కలిసినది. మేము సవయస్కులము. అయినను భర్త్రధికారమును చలాయించుటకు నేను ఆలస్యము చేయలేదు.

# ౪

## యాజమాన్యము

నాకు పెండ్లి అయిన దినములలో దమ్మిడికో, కానికో కాని– వెల సరిగా గుఱుతు లేదు– చిన్న చిన్న పత్త్రికలను అమ్ముచుండువారు. వానిలో దంపతులప్రేమ, పొదుపు, బాల్యవివాహములు, ఇంకను ఇట్టి ఇతరవిషయములను గుఱించిన చర్చ ఉండెడిది. ఇవి నాకు అందినపుడెల్ల సాకల్యముగ చదివెడువాఁడను. నాకు రుచింపని వానిని మఱచుటయు, రుచించినవానిని అనుష్ఠించుటయు నాచొప్పు. ఏకపత్నీవ్రతము ధర్మమని ఈపత్రికలలో నిరూపింపఁబడినది. అది నామదిలో గాఢముగా నాటుకొనెను. సత్యానురాగము నాశీలము కావున భార్యను అతిచరించుట శంకాదూరము. మరియు ఆయీడున ఏకపత్నీవ్రతము భంగించుటయు నాకు అసంభవము.

అయితే ఆసద్విచారము నాకు ఒక దుష్పరిణామమునకు హేతువైనది. నేను ఏకపత్నీవ్రతము పాలించుచో ఆమెయు పాతివ్రత్యమును పాలింపవలయుఁగదా! అని నేననుకొంటిని. ఈయాలోచనతో ఆమెయెడ నాకు అనుమానము పుట్టెను. ఆమెనుండి నమ్మికను లాగుటకు ఆమెవిధి సులువుగా నాఅధికారములోనికి మార్పఁబడెను. ఆనమ్మికను బలాత్కరించి పుచ్చుకొనుటకు నేను నాయధికారమును మెలఁకువతో కాపాడుకొనవలయును. ఆమెను తప్పఁదలఁప కారణమేమియు లేదు; కాని అనుమానమునకు కారణములతో ఏమిపని! నాకన్నంతయు ఆమె పోకలమీఁదనే. కావున ఆమె నాసెలవు లేక ఎక్కడికిని పోవ

వీలు లేదు. ఇది మా కలహమునకు బీజ మాయెను. ఈ నిర్బంధము మైత్రము మీఁద ఒకవిధమగు చెఱ అయినది. అయితే కస్తూరిబాయి ఇటువంటివానిని సహించు పిల్ల కాదు. ఇష్టము వచ్చినపుడు ఎప్పుడేని ఎచటికేని నాకు చెప్పకుండఁగనే వెళ్లి పోవుట పెట్టుకొన్నది. నారోష్టు వలన ఆమె ఎక్కువ స్వాతంత్ర్యము తీసికొనుటయు, నాకు ఎక్కువ కోపము కలుగుచుండుటయు పర్యవసించెను. క్రొత్తగా కాఁపురము చేయు మాకు మాటలు లేకపోవుట పరిపాటి ఆయెను. నానిర్బంధములకు లోఁగక తన యిచ్ఛవచ్చినటులు చరించుట కస్తూరిబాయికి నేరము కాదు. కోవెలకుఁగాని, చెలులయిండ్లకుఁగాని పోఁగూడదను ఆజ్ఞను ఏమంచిపిల్ల యేని సహింపఁగలదా? నాకు ఆమెను నియమించు అధికారము ఉండుచో, ఆమెకుఁగూడ అట్టి అధికారమే ఉండదా? ఈమాట నేఁడు నాకు తెలియును; కాని నాఁడు భర్తృత్వాధికారమును చలాయింపవలెననునదియే నాకు తెలిసిన విషయము.

అయితే మా బ్రతుకంతయు పోట్లాటలతో సరి యని పాఠకుఁడు తలపోయ కుండుఁగాక. నా నిర్బంధమునకు ప్రేమయే మూలము. నేను నా భార్యను ఆదర్శస్త్రీని చేయఁదలఁచితిని. నా భార్య పవిత్రముగ మనుటయు, నా నేర్చినది నేర్చుటయు, చేఁతలో, తలఁపులో, నాతో సమముగా ఉండుటయు నా కోరిక.

కస్తూరిబాయికి అట్టి కోరిక ఉండెనో లేదో నే నెఱుఁగ. ఆమెకు అక్షరములు రావు. స్వభావముగా అమాయిక; స్వతంత్ర; పట్టుదలకలది. నాతో మట్టుకు మితముగ మాట్లాడెడిది. చదువు రాకపోయెనే యని ఆమెకు చింత లేదు. నావిద్యావ్యాసంగము ఆమెను అట్టి సాహసమునకు పురికొలిపినటులు నా అనుభవములో లేదు. ఈకోరిక యంతయు కేవలము నాదే. నేను మిక్కుటముగా ఆమెనే ప్రేమించితిని.

కాన ఆమెయు నన్ను అట్లులే ప్రేమింపవలె నని నాకోరిక. అయితే అట్టి అన్యోన్యప్రేమ లేకున్నను, ఒకపక్షమునకైనను సంపూర్ణమగు ప్రేమ ఉండుటచే, అది తీఱని వెత కాలేదు.

నేను మిగుల భార్యాసక్తుఁడను. పాఠశాలయందును అదే తలపోఁత. ఎపుడు చీఁకటి పడునా, ఎపుడు పోయి వ్రాలుదునా, అనియే బెంగ. ఎడఁబాటు దుస్సహ మయ్యెడిది. కల్లిబొల్లి మాటలతో నడిరేయివఱకు నిదుర పోనిచ్చువాఁడఁ గాను. ఇట్టి మహాహీనమగు భోగాసక్తితోపాటు కర్తవ్యపరాయణతయే లేకున్నచో, నేను తెవులుగొంటనై యుందునో! అకాలమృత్యువువాతనే కూలియుందునో! లేక ఈప్రపంచకమున ఎట్టి జీవచ్ఛవమునై ఉండియుందునో! కాని ప్రతి ఉదయమున నిత్యకృత్యములు తీర్పవలసి యుండెను. కల్ల అఁగరాదు. నన్ను అనేకసమయములలో రక్షించినది ఈతుదివస్తువే.

కస్తూరిబాయికి చదువు రాదని లోఁగడనే చెప్పియుంటిని. ఆమెకు చదువు చెప్పవలయునని నాకు కడుఆతురత. కాని విషయాసక్తి కాలమును మిగుల నిచ్చెడిది కాదు. మరియు ఆమెకు ఇష్టము లేకున్నను చదివింపవలెను. అదియు రాత్రి. పెద్దలసమక్షమున దాపున ఉండుటకే నాకు సాహసము లేదు; ఇఁక మాటలాడుట యెడ? కాఠియావాడునందు నాఁడును, కొంతవట్టు నేఁడును, ఒక కొత్తరకపు పనికిమాలిన ఘోషా కలదు. కావున ఎలఁబ్రాయమున నేను కస్తూరిబాయిని చదివింపఁ జేసిన ప్రయత్నములు చాలవట్టు వమ్మైయెనని ఇయ్యకొందును. కామాంధ్యముగడచి మెలఁకువ వచ్చుసరికి నాకు లోకయాత్ర మొదలై తీరిక దొరకక పోయెను. ఉపాధ్యాయులను పెట్టి చదువు చెప్పించు ప్రయత్నమును సాగలేదు. కాఁగా కస్తూరిబాయికి సామాన్యములగు ఉత్తరములు వ్రాయను, గుజరాతీపుస్తకములు చదువను

మాత్రము పట్టువడినది. ఆమెయెడ నాకు ఉన్మత్తప్రేమయే లేనియెడల ఆమె నేటికి విదుషియై ఉండెడిదని నా నమ్మకము. ఏలనఁగా, నేను అపుడు ఆమెకు విద్యయెడఁ గల అనిష్టమును తొలఁగించియుందును. శుద్ధప్రేమకు సాధ్యము కానిది ఉండఁబోదు అని నా విశ్వాసము.

లాలసయొక్క చెఱుపులనుండి కొలఁదిగనో, గొప్పగనో, నన్ను కాపాడిన ఒక విషయమును చెప్పియుంటిని. చెప్పదగిన మరియొక విశేషము: 'ఎవనినిష్ఠ పవిత్రమై ఉండునో వానిని తుదికి పరమేశ్వరుఁడే రక్షించును.' అని అనేకదృష్టాంతములు నన్ను నమ్మించినవి. అతిబాల్యవివాహము అను దురాచారముతోపాటు దాని చెడుగులను కొంతవట్టు తగ్గించుటకు హిందువులలో మరియొక ఆచారము కలదు. తలిదండ్రులు నూతనదంపతులను చిరకాలము ఒకచో కలిసి ఉండనీయరు. నూతనవధువు అర్ధకాలముకంటె ఎక్కువకాలము పుట్టింటనే ఉండును. మాకును అటువలెనే. మాకు పెండ్లి అయిన అయిదేండ్లలో (౧౩ ఏఁడునుండి ౧౮ వఱకు) మేము కలిసియున్న కాలము మొత్తముమీఁద మూఁడేండ్లకు పైఁబడదు. ఆఱునెలలు కాక మునుపే పుట్టింటినుండి కస్తూరిబాయికి పిలుపు వచ్చెడిది. ఆనాఁడు ఆపిలుపులు నాకు కష్టముగ ఉండెడివి కాని అవి మమ్ము ఇరువురిని రక్షించినవి. పదునెనిమిదవయేఁట నేను ఇంగ్లాండునకు పోయితిని. అది మాకు చక్కని విలంబవియోగమంత్ర మాయెను. ఇంగ్లండునుండి నేను మరలి వచ్చినపిదపఁగూడ మేము ఆఱునెలలకంటె ఎక్కువ కాలము కలిసి కాఁపురము చేయలేదు. ఏలనఁగా, నేను రాజకోటనుండి బొంబాయికిని, బొంబాయినుండి రాజకోటకును పరుగులెత్తవలసివచ్చెను. తరువాత దక్షిణఆఫ్రికాకు పోవలసివచ్చెను. దానితో నాకు విషయవాసననుండి విముక్తి.

౫

# హైస్కూలులో

వివాహకాలమున నేను హైస్కూలులో చదువుకొనుచుంటినని లోఁగడనే వ్రాసియుంటిని. మేము మువ్వురు సోదరులము ఒక పాఠశాలయందే చదువుచుంటిమి. జ్యేష్ఠునిది చాలపయితరగతి. నాతోపాటు పెండ్లి అయిన రెండవ సోదరుఁడు నాకు పైతరగతిలోనే ఉండెను. మాకు ఒకయేఁడు వివాహముతో విద్యానాశ మాయెను. ఈ నా అన్నపని మరీ అన్యాయము. ఆయన బడి మానెను. ఎందఱు పిన్నవాండ్రు అతని అవస్థకు పాలుపడిరో దైవమునకే ఎఱుక! నేఁటి మన హిందూసంసారములందు మాత్రము విద్యావివాహములు రెండును సమముగా నడుచును.

నా చదువు ఎడతెగక సాగుచుండెను. హైస్కూలున నాకు మొద్దబ్బాయి అని గణన లేదు. నాయెడ ఉపాధ్యాయులకు వాత్సల్యము. కుఱ్ఱని నడవడిఁగూర్చియు, విద్యను గూర్చియు తలిదండ్రులకు ప్రతియేఁడును ఉల్లాకు (Certificate) పంపుచుండుట మామూలు. నాకు ఎపుడును చెడ్డ ఉల్లాకు లేదు. అదియటుండ, నేను రెండవతరగతి గెలుపొందినపిదప బహుమతులుకూడ సంపాదించితిని. అయిదవ తరగతిలో నాలుగును, ఆఱవతరగతిలో పదియును రూపాయలు విద్యార్థి వేతనము పడసితిని. ఇది కేవలము నా ప్రజ్ఞవలనఁ గాదు; మఱి అదృష్టమువలన. ఏలన, ఈ వేతనములు అందఱకుఁ గావు; అవి కేవలము కాఠియావాడులోని సోరఠు డివిజనునుండి వచ్చువారిలో శ్రేష్ఠులకుమాత్రము.

మరియు నలువంద్రడు, ఏబంద్రడు గల తరగతిలో స్కూలునుండి వచ్చు పుత్రులను ఎక్కుడుమంది ఉండువారు కారు.

నా తెలివితేటలవిషయమై నాకు తృప్తి ఉన్నటులు గుఱుతు చాలదు. బహుమతులుగాని, వేతనముగాని లభించినప్పుడు ఆశ్చర్యము కలిగెడిది. కాని ప్రవర్తనమును కడుమెలఁకువతో కాపాడుకొనుచుం డువాఁడను. నలుసంత దోసఁగు కానిపించినను కన్నులజోట జోట నీరు ఉరిలెడిది. దండ్యుఁడ నయినపుడుగాని, 'వీఁడు దండ్యుఁడు' అని గురువు అనుకొనినపుడుగాని నా చింతకు మేర లేదు. నే నొకతూరి దెబ్బలు తిన్నట్లు ఉన్నది. కొట్టిరని నే నంతగా వగవలేదు. కాని కొట్టఁదగిన నేరము చేసితి నని అనుకొనిపోవుదురుగదా అని మిగుల వగచితిని; వెక్కి వెక్కి ఏడిచితిని. ఈ ముచ్చట నేను ఒకటవ తరగతి లో ఉండఁగనో, రెండవతరగతిలో ఉండఁగనో. నేను ఏడవతరగతిలో ఉండఁగా ఇట్టిదేమరియొకటి: అపుడు హెడ్‌మాస్టరు దొరాబ్జి ఎదుల్జీ గిమీ. అతఁడు శిష్యవత్సలుఁడు, నియమపాలకుఁడు, విధివర్తి, సుశిక్షకుఁడును. ఆయన పయితరగతులలోని బాలురకు శరీరవ్యాయామము, క్రికెట్ వ్యాయామము తప్పనిసరిగా చేసెను. నాకు రెండును గిట్టనివి. ఈనియమమునకు ముందు నేను క్రికెట్ గాని, ఫుట్‌బాల్ గాని మరి యేదిగాని ఆడిన పాపమున పోలేదు. దానికి కారణము నేఁడు నాకు తప్పని తెలిసిన బిడియమే. శరీర వ్యాయామమునకు చదువుతో పొత్తు లేదనివాఁడు నాకు దురూహ. విద్యాప్రణాళికలో మనశ్శిక్షకు ఎంత తావు కలదో శరీరవ్యాయామమునకును అంతతావు ఉండవలయు నని నాకు నేఁడు తెలియును.

వ్యాయామమును విడినందువల్ల నాకు లోటు లేదని చెప్పఁ గలను. ఏలన బయలున చాల దవ్వు నడుచుట మంచిదని అచటనచట

చదివి ఆపలవాసను గమనించి నేటికిని నేను అలవాటులో ఉంచుకొనిన నడకను అలవరించికొంటిని. ఈవ్యాయామముచే నాకు తగురీతి శరీరపాటవము కలిగెను.

మాతండ్రిగారికి పరిచర్య చేయవలయు నను మిక్కుటమగు అభిలాషయే శరీరవ్యాయామమునెడ అనిష్టమునకు కారణము. బడి వదలఁగనే ఇంటికి పరువిడి మాతండ్రిని పరిచరించుచుండు వాఁడను. వ్యాయామనియమము దీనికి అడ్డు తగిలెను. మాతండ్రిగారికి నేను పరిచర్య చేయవలయునుగాన నాకు ఈనియమము లేకుండ జేయుఁడని గిమీగారికి విన్నవించుకొంటిని. ఆయన నామాట వినలేదు. ఆరోజులలో శనివారమునాఁడు ప్రొద్దుటిపూఁటబడి. ఆశనివారపు సాయంకాలమున నాలుగుగంటలకు వ్యాయామమునకై ఇంటినుండి బడికి పోవలసివచ్చెను. నాకు గడియారము లేదు. మబ్బులు నన్ను మోసగించెను. నేను బడికి వెళ్లునటికు అచట ఒకపిట్టయేని లేదు. మఱునాఁడు గిమీగారు హాజరుపట్టీ పరీక్షించుచు నన్నుఁ జూచి నీవేల నిన్న హాజరు కావైతివని అడిగిరి. నేను జరిగినది చెప్పితిని. ఆయన నామాట నమ్మక అణాయో, రెండణాలో కాని (నాకిపుడు గుఱుతు లేదు) జరిమానా వేసెను.

నేను అబద్ధాలకోరనిపించుకొంటిని. ఇది నాకు ఎంతో వంత కలిగించెను. నేను జూటాకోరును కానని ఎటులు సమర్థించుకొనఁగలను? ఉపాయాంతరము లేదు. మిగుల దుఃఖించితిని. సత్యమును నమ్మికొన్న వాఁడుఎల్లపుడును జాగ్రత్తగా ఉండవలెనని నేను గమనించితిని. బడిలో నేను అశ్రద్ధగా నుండుటకు ఇదియే ఆది; ఇదియే అంతమును. జరిమానా వేసిన సొమ్ము తిరిగి యిచ్చునటులు చేసికొనఁగలిగితినని నాకు కొండగుఱుతు.

## ౫. హైస్కూలులో

'బడి వదలఁగనే మావాఁడు నాకడ ఉండవలసి యున్నా' డని మా నాయనగారి కోరికమీఁద తుదకు నాకు వ్యాయామమునుండి విడుదల కలిగినది. నేను వ్యాయామమును ఏమరుటచే కొఱవడకున్నను మఱి యొక ఏమరికకు దండము లర్పించుకొనుచునే యున్నాను. 'దస్తూరి విద్యలో ఒకభాగముకాదు' అను ఈ ఉద్దేశము నాకు ఎపుడొదవెనో తెలియదు కాని నే నీ ఉద్దేశమును ఇంగ్లాండు వెళ్లువఱకు నిలువ ఉంచుకొంటిని. తరువాతఁ దరువాత, ముఖ్యముగా దక్షిణ-ఆఫ్రికాలో అచట పుట్టి అచట విద్యావంతులైన పిన్నవారలయు, లాయరులయు చక్కని వ్రాఁతను మాచి సిగ్గిల్లి నేను దానిని ఏమరినందులకు పశ్చాత్తాపపడితిని. చెడుదస్తూరిని అసమగ్రమగు విద్యయొక్క చిహ్నముగా పరిగణింపవచ్చునని నే నరసితిని. పిదప నేను వ్రాయసమునకు పాటుపడితినిగాని తరుణము తప్పెను. నాబాల్యమునందలి లోపమును నే నెన్నఁటికిని దిద్దుకొనలేకపోతిని. నన్ను చూచి ప్రతిచిన్నవాఁడును, ప్రతిచిన్నదియు జాగ్రత్తపడుగాక! మంచిదస్తూరివిద్యలో ఒకముఖ్యాంశమని గుర్తించుఁగాక! అక్షరముల దిద్దించుటకుముందు బాలురకు చిత్రలేఖనము నేర్పుట యుక్తతరమని నాకు నేఁడు తోఁచుచున్నది. పూవులు, పిట్టలు మొదలగు వానిని పరికించి గీయునట్లులే అక్షరములను గూడ పరికించి వ్రాయుట తగును. వస్తువులను చూచి వ్రాయుట నేర్చికొన్న పిదపనే వ్రాఁత నేర్పుట తగును. అపుడు ఆవగవడి అందముగా నిలువఁబడును.

నాఁటి బడిమాటలు చెప్పఁదగినవి రెండు కలవు. వివాహముచే నాకు ఒకయేఁడు విద్యానాశము వాటిల్లినది. దానిని పూడఁదీయుటకు ఉపాధ్యాయుఁడు పయితరగతి లోనికి దాఁటించెను. కష్టించి వ్యాసంగము చేయువారికి సాధారణముగా ఈవీలు ఉండెడిది. కాన నేను మూఁడవతరగతిలో ఆఱునెలలే ఉండి వేసఁగి సెలవులకుముందు జరుగు

పరీక్షలు అగుపిదప నాలుగవ తరగతిలోనికి దాఁటింపఁబడితిని. నాలవ తరగతి మొదలుకొని చాల పాఠములు ఇంగ్లీషునవే బోధింపఁబడు చుండెను. నాకు నడిసముద్రములో ఉన్నటు లుండెను. రేఖాగణితము (Geometry) నాకు క్రొత్త. దానిసంగతి బాగుగా నాకు తెలియదు. అంగ్లములో బోధించుటచే అది మరికొంచెము రాయిఅయెను. ఉపాధ్యాయుఁడు మంచి బోధకుఁడేకాని, నాకు మాత్రము తెలియకుండెను. పలుమాఱులు మనస్సు చెదిరి రెండేండ్ల చదువు ఒక యేడు మింగఁదలఁచుట పేరాస యని మరల మూఁడవతరగతిలో చేరఁ దలంచితిని. ఇటులు చేయుట నాకేకాక నాగురువునకును తలవంపుల మారి పని; ఏలన, నావ్యాసంగమును విశ్వసించికదా ఆయన నన్ను పైన వేసినాఁడు అను ఈరెండుభయములును నన్ను ఆతరగతియందే ఉంచెను. ప్రబలముగా వ్యాసఁగము చేసి యూక్లిడ్‌లో ౧౩ వ ప్రాపొజిషన్ వఱకు రాఁగా అటనుండి రేఖాగణితమునందలి సంపూర్ణ సౌలభ్యము గోచరించెను. తనంతట తాను తెలివితేటలను సరళప్రయోగమును ఉపయోగించి చూడఁదగిన విషయము ఏదియయినను రాకపోదు. నాఁడు మొదలుకొని ఎప్పటికిని నాకు రేఖాగణితమునెడ సౌలభ్యమును, అభిరుచియు కలిగెను.

సంస్కృతము మరీ కష్టమనిపించెను. రేఖాగణితమున ధారణలో ఉంచుకొనఁదగిన దేదియు లేదు. ఇఁక సంస్కృతమునవో ప్రతిదియు కంఠపాఠముగా ఉంచుకొనవలెనని నా ఊహ. ఈపాఠము కూడ నాలుగవతరగతినుండి ఆరంభింపఁబడును. ఆఱవ తరగతిలోనికి వచ్చుసరికి బెదిరిపోతిని. సంస్కృతోపాధ్యాయుఁడు పాఠము ఎక్కువ ఇచ్చి అంతయు ఒకమాఱు నూఁకిపోయు స్వభావము కలవాఁడు. సంస్కృతోపాధ్యాయులకును, ఫారసీకోపాధ్యాయులకును ఏదో ప్రతి

స్పర్ధ ఉండెడిది. ఫారసీ మాల్వీ సామ్యుఁడు. ఫారసీ మిగుల తేలిక యనియు,మాల్వీ విద్యార్థులయెడ దయాదాక్షిణ్యములు కలవాఁడనియు బాలురు తమలో తాము అనుకొనుచుండెడివారు. ఈ తేలికదనము నన్ను జెల్లించెను. ఒకనాఁడు పోయి ఫారసీ తరగతిలో కూరుచుంటిని. అందులకు సంస్కృతోపాధ్యాయుఁడు దుఃఖించెను. అతఁడు నన్ను పిలిచి "ఓయీ, నీ వెవరి కుమారుఁడవు? నీమతభాషను నీవు నేర్చికొనవా? నీకు తెలియనిచో నాకడకు ఏల రావు? నాశక్తికొలఁది విద్యార్థులకు సంస్కృతము బోధించు కోరిక నాకు కలదు. చదివిన కొలఁది తన్మయము చేయు విషయములు మీకు కానిపించును. అధైర్యము వలదు. మరల వచ్చి నా క్లాసులో కూరుచుండుము' అనెను.

వారిదయచే నాకు సిగ్గు పుట్టెను. గురుప్రేమను తిరస్కరింపఁ జాలకపోయితిని. నేఁడు నాయాత్మ కృష్ణశంకరపాండ్యాగారి ఉపకారమును స్మరించుచున్నది. ఆనాఁడు ఆ కొలఁది సంస్కృతము నేని నేను చదివియుండనిచో మనశాస్త్రములందు ఆనందింప శక్తుఁడఁ గాక పోవు వాఁడనే. నిజమునకు 'నేను సంస్కృతము ఎక్కువ చదువుకొనలేదే' అని నాకు విచారము కలదు. ఏలన ప్రతిహిందూబాలుఁడును, బాలికయు సంస్కృతము చక్కఁగా చదువుకొనితీరవలయునని ఇటీవల ఎఱిఁగికొంటిని.

భరతవర్షమున ఉన్నతవిద్యాప్రణాళికలో మాతృభాషయు, ఉపరి హిందీ సంస్కృత ఫారసీ అరబ్బీ ఇంగ్లీషు భాషలు పాఠ్యములుగా చేయఁదగినవని నాఆశయము. ఈసంఖ్యకు భీతిల్లఁ బనిలేదు. మన విద్య యింతకంటె క్రమబద్ధమై ఉండి బాలురకు ఇతరభాషలో పాఠములు నేర్వవలసిన బరువు లేకుండినచో ఈభాషలన్నియు నేర్చికొనుట ఒకశ్రమగాక మహోల్లాస మగునని నాకు దృఢవిశ్వాసము.

ఒక భాష శాస్త్రీయముగా అభ్యసించినచో మిగిలిన భాషలు సులభ తరములు.

అసలు హిందీ గుజరాతీ సంస్కృత భాషలు ఏకభాషయే అనదగును. అట్లే ఫారసీ అరబ్బీ భాషలు ఏకభాష. ఫారసీ భాష ఆర్యభాష అయ్యును, అరబ్బీ భాష హీబ్రూకు చెందియున్నను ఈ రెంటికిని ఒక దగ్గఱ చుట్టఱికము ఉన్నది ఈరెండును ఇస్లాము మతముతో వర్ధిల్లినవి. ఉరుదూభాషను వేఱుగా ఎన్నను. ఏలనఁగా: దాన హిందీ వ్యాకరణసమావేశమును, ఫారసీ అరబ్బీ పదములును గలవు. గుజరాతీలోఁగాని, హిందీలోఁగాని, బంగాళీలోఁగాని, మరాటీలోఁగాని మంచి ప్రవేశము ఉండవలయు నన్నచో సంస్కృత మెటులు రావలయునో ఉరుదూలో పాండిత్యము సంపాదింపవలయు ననిన ఫారసీ అరబ్బీలు రావలెను.

మంర్వా ర్త (౧)

హైస్కూలులో వేలువేలుసమయములందు నాకుఁగల కొలఁది మిత్రులలో ముఖ్యులు ఇద్దఱు. వీరి మైత్రులలో ఒకటి చాలకాలము మనలేదు. అయినను నేను నామిత్రుని పరిత్యజింపలేదు. నేను మరియొకనిసావాసము పట్టితి నని అతఁడు నన్ను పరిత్యజించెను. ఈరెండవవానిమైత్రి నాజీవితమున చింతాకరమైన ప్రకరణము. అది చాలకాలము ఉండెను. సంస్కారదృష్టితో నేను ఆచెలిమి చేసితిని.

ఇతడు తొలుత మాచిన్నన్న చెలికాఁడు. వారు ఇరువురును సహాధ్యాయులు. అతనిలోటులు నే నెఱుఁగుదు గాని అతఁడు విశ్వాసి యని నా తలఁపు. మా అమ్మయు, పెద్దఅన్నయు, ధర్మపత్నియు చెడు సావాసము పట్టుచుంటివని నన్ను మందలించిరి. అభిమానము కల నేను ఆలి ఎచ్చరికను సరకుగొందునా? అయితే నేను మా అమ్మగారియు, అన్నగారియు మాటను ఉల్లంఘింప సాహసింపను. అయినప్పటికిని 'మీరు ప్రతిపాదించు దోషములు అతనియందు ఉన్నమాట నిక్కమే కాని వానిగుణము మీరు ఎఱుఁగరు. అతఁడు నన్ను చెడుదారికి తిప్ప లేఁడు; ఏలయనఁగా అతనిని మంచి త్రోవలోనికి తెచ్చుటకే నే నతని చెలిమి చేయుచుంటిని. అతఁడు తన దోషములను సంస్కరించుకొనుచో ఉత్తముఁడు కాఁగలఁడు. మీరు నాకొఱకు దిగులుపడవలదు' అని వారికి నచ్చఁబలికితిని.

ఇది వారికి నచ్చిన దనుకొనెనుగాని వారు నామాటలు విని నాదారిని మాత్రము నన్ను పోనిచ్చిరి.

నాదే పొరపాటని పిదప తెలిసివచ్చినది. సంస్కారము కావించుటకొఱకయినను లోతునకుఁ బోవరాదు. సంస్కర్తకును, సంస్కార్యునకును గాఢమైత్రి ఉండుటకు వీలులేదు. మైత్రిలో అద్వైతభావన కలదు. అట్టిది ప్రపంచమున అరుదు. సమగుణశీలుర మైత్రియే శోభించును; నిలుచును. మిత్రులు ఒకరిపై మరియొకరు ప్రతిబింబింతురు. కావున మైత్రిలో సంస్కరించుటకు అవకాశము కడుఁ గొలఁది. అతి మైత్రి తగదని నా అభిప్రాయము. ఏలన మనుజుఁడు గుణముకన్న దోషమును వడిగా గ్రహించును. ఆత్మమైత్రి, ఈశ్వరుని మైత్రి కోరువాఁడు ఏకాకిగా ఉండవలయును; లేదా ప్రపంచము నంతయు తనకు మిత్రముచేసికొనవలయును. ఈపయివిచార మంతయు యోగ్య మగుఁగాక, అయోగ్య మగుఁగాక! గాఢమైత్రి చేయవలయునను నాపూనిక వ్యర్థమయినది.

నాకు ఇతనితో పరిచితి కలుగునాళ్లలో రాజకోటలో సంస్కరణము తరంగమువలె ఉబుకుచుండెను. మా ఉపాధ్యాయులలో పలువురు చాటుగా మద్యమాంసములు స్వీకరించుచున్నా రని అతఁడు నాకు చెప్పెను. ఈజట్టునకు చేరిన సుప్రసిద్ధులగు రాజకోట వాస్తవ్యులను పలువురను అతఁడు పేరుకొనెను. ఇంకను హైస్కూలు పిల్లలుగూడ కొందఱు కల రనెను.

నాకు వింతయు, వెతయు కలిగెను. 'వా రటులు చేయుటకు హేతు వేమి?' అని నే నడిగితిని. అతఁడు ఇటు లనెను:

'మాంస భోజులము కాము కావున మనది దుర్బలజాతి. తెల్లవారు మాంస భోజులు కావుననే మనలను ఏలఁగలుగుచున్నారు.

## ౬ దుర్వార్త (౧)

నే నెంత బలిష్ఠుఁడనో' ఎంత దవ్వు పరుగిడఁ గలనో నీ వెఱుఁగవా? ఏల? నేను మాంసాశిని. మాంసాశులకు కుఱుపులును, గ్రంధులును పుట్టవు. ఒకవేళ పుట్టినను వెంటనే మానును. మన ఉపాధ్యాయులును, ఇంకను సుప్రసిద్ధులును పెక్కిపప్పలై మాంసము తినుచుంటి రను కొంటివా? దాని గుణము వారికి తెలియును. కాన నీవును అటులు యత్నింపవలయును. యత్నమువంటి దేదియు కాదు. తిని చూడు: దానివలన ఎంత బలము కలుగునో!'

ఈవాద మంతయు ఒకనాఁటిది కాదు. ఇది అతఁడు అనేక దినములు నన్ను ఒప్పించుటకు సోదాహరణముగ చేసిన దీర్ఘ ప్రసంగముల సారము. మా చిన్నన్న ఇదివరకే ఈవలలో పడెను. కాఁగా అతఁడు నామిత్రుని వాదములను సమర్థించెను. నేను నామిత్రుని ముందరను, మా చిన్నన్న ముందరను దోమను; వా రిరువురును బలిష్ఠులు, ద్రఢిష్ఠులు, ధీరులఁను. నామిత్రుని పరాక్రమము చూచి నేను టిచ్చపడితిని. అతఁడు ఎంతదూరమైని రివ్వునఁ బాఱును; ఎత్తు దూఁకుటలోను, దూరము దూఁకుటలోను పెట్టినది పేరు. అతనికి ఎన్నిదెబ్బలు కొట్టినను లెక్కలేదు. అతఁడు తఱుచుగా తన పరాక్రమమును నాకు చూపువాఁడు. తనకు లేని శక్తులు ఇతరులలో చూచి ఆశ్చర్యపడుట స్వాభావికముగాన నేనును ఇతని జూచి ఆశ్చర్యపడితిని. తరువాత అతని యంతవాఁడ నగుటకు నాకు ఆశ జనించెను. నేను దుముకలేను; పరుగిడలేను. నేను అతనివలె ఏల కాఁగూడదు?

మరి నేను పిఱికిపందను. దొంగ లనిన, దయ్యము లనిన, పాము లనిన నాకు భయము. రాత్రి గడప దాఁటలేను. చీఁకటిలో ఎక్కడికి పోను. ఒకదిక్కునుండి దయ్యములు, మరియొకదిక్కునుండి దొంగలు, ఇంకొక దిక్కునుండి పాములు నన్ను మింగునటులు ఉండుట

వలన నేను చీఁకటిలో పరుండుట కల్ల. గదిలో దివ్వె లేక పరుండలేను. నా ప్రక్క నిదురించు నా భార్యకు ఈ యౌవనదశలో నా భయములన్నియు ఎటులు చెప్పఁగలను? నాకంటె ఆమె ధీర అని నాకు తెలియును. నాలో నేను సిగ్గిలితిని. ఆమెకు పాములన్న, దయ్యము లన్న భీతి లేదు. ఆమె చీఁకటిలో ఎటకేని పోఁగలదు. నాలోటులన్నియు నా మిత్రుఁ డెఱుఁగును. 'నేను పాములను చేతితో పట్టుకొనఁగలను; దొంగలను తఱిమివేయఁగలను; దయ్యములను నమ్మను' అని అతఁడు నాతో చెప్పుచుండును. ఇది యంతయు మాంసాశన ప్రతాపమని చెప్పఁ బని లేదు.

ఆ కాలములో నర్మదకవి కట్టిన ఈ పాటను బడి పిల్లలందఱు పాడుచుండువారు:

*గీ. తెల్లవానిని జూడరా నల్లవారి
నాయనమ్మలఁ జేసి యున్నాఁడు నేఁడు
దేన నునుకొంటివో వాఁడు తినును మాంస
మలరు నద్దాన మరి పొడ వడుగు లైదు.

ఇది యంతయు అది చేయవలసిన పని చేసెను. నేను లోఁగితిని. మాంసాశనము మంచిదనియు, అది నన్ను బలిష్ఠునిగను, వీరునిగను చేయుననియు, దేశమంతయు మాంసము తిన నారంభించెనేని తెల్లవారిని జయింపవచ్చుననియు—ఈయూహలు నానాఁటికి నాలో నాటుకొనెను.

మాంసభక్షణమునకు శుభముహూర్తము నిశ్చయింపఁబడెను. అది చాటుగా జరుగవలెను. ఏలన: గాంధులది వైష్ణవసంప్రదాయము;

* అంగ్రేజో రాజ కరే, దేశీ రహే దబా ఈ,
దేశీ రహే దబాఈ, జోనే బేనాం శరీర భాఈ
పేలో పాంచ హాథ పూరో, మాంసనేవే.

## ౬ దుర్వార్త (౧)

అందును మాతలిదండ్రులు పరమవైష్ణవులు. వారు తప్పక ప్రతిదినము కోవెలకు పోదురు. మాకుటుంబమునకును ప్రత్యేకము కోవెలలు కలవు. గుజరాతులో జైనసంప్రదాయమునకు వ్యాప్తి ఎక్కువ. ప్రతిచోటను, ప్రతివిషయమునను దాని అధికారము మెండు. జైనులలోను, వైష్ణవుల లోను గల యంత మాంసనిషేధము, మాంసతిరస్కారము హిందూదేశమునఁగాని, మరియే దేశమునఁగాని లేదు. ఇది నేను పుట్టిపెరిగిన కుటుంబములోని సంస్కారము.

నేను నా తలిదండ్రులకు పరమభక్తుఁడను. వారు నేను మాంసము తింటినని విన్నవెంటనే నాలుక పీఁకుకొని చత్తురనియు నాకు తెలియును. నాకు అపుడు సత్యనిరతియు ఎక్కువగనే ఉండెను. నేను మాంసాశనము చేయ మొదలిడుచో నాతలిదండ్రులను మోసగింప వలసియుండునని తెలియదనిగూడ చెప్పఁజాలను. ఇట్టిస్థితియందు నా మాంసాశన నిశ్చయము మిక్కిలి భయంకరముగ నుండెను; కాని నా మనస్సంతయు సంస్కారదీక్షమీఁద ఉండెను. నేను మాంసము తినఁదలఁచుట జిహ్వాచాపల్యమునఁ గాదు. మాంసము మంచి చవియని నేనెఱుఁగను. నాకు బలము కావలయును; పరాక్రమము కావలయును; నా దేశమువారు ఎల్లరును అటువంటివారు కావలయును. అటులగుచో తెల్లవారిని జయించి హిందూదేశమును స్వతంత్రము చేయవచ్చును అని నాకోరిక. స్వరాజ్య మను పదము నాఁటికి నాకర్ణగోచరము కాలేదు. కాని స్వాతంత్ర్య మన నేమియో నాకు తెలియును. సంస్కారపు పిచ్చి నన్ను అంధుని జేసెను. రహస్యగోపనము చేయఁగలిగి, తలిదండ్రులకు ఈవిషయము తెలియఁబడకుండ కాపాడుకొనుట సత్యమునుండి తొలఁగుట కాదని నేను నమ్మితిని.

## ౭

## దుర్వార్త (౨)

నియత దినము వచ్చెను. నాఁటి నాస్థితిని వర్ణింప నలవి కాదు. ఒక వంక సంస్కరణమునందు ఉత్సాహము, జీవితమునందు ఒక మహా పరివర్తనము చేయు వింత; ఇంకొకవంక దొంగవలె చాటుగా చేయు సిగ్గు. ఈరెంటిలో దేనికి ప్రాధాన్యమో నేను చెప్పఁజాలను. నది యొడ్డున ఏకాంతస్థలము వెదకుచు వెళ్లితిమి. దూరమున ఎవరికి కనరాని స్థలము లభించినది. అచట నాజీవితమున తొలిసారి మాంసమును చూచితిని. అచట కల్లు రొట్టెయు కలదు. నాకు రెంటిలో నేదియు రుచింపలేదు. మాంసము తోలువలె బిఱుసుగా ఉండెను. దాని తినుట అశక్యమాయెను. నాకు వమన మగునట్లుండుటచే దానిని పరిహరించితిని.

ఆరాత్రి నాకు ఇంతయైన నిద్రలేదు. ఏవేవో పీడకలలు. కన్నుమూఁతపడఁగనే నాకడుపులో బ్రతికియున్న ఒక మేఁక 'మే మే' యని అఱచినటులు కాఁగా సంతాపముతో త్రుళ్లిపడి లేచుచుంటిని. అయితే మాంసాశనము ఒక విధి గదా యని తెలివి తెచ్చుకొని క్రమ్మఱ కొంచెంతలు ధైర్యము తెచ్చుకొనుచుంటిని.

నామిత్రుఁడు అంతంతమాత్రమున వదిలిపెట్టువాఁడు కాఁడు. అతఁడు మాంసముతో పలురకముల పాకముల రుచికరములుగ తయారు చేయ మొదలిడెను. ఇఁక తినుటయు నదీతీరమందు ఏకాంతమునఁగాదు; ఒక గొప్పభవనమున. అందు భోజనశాలలు, మేజాబల్లలు, కుర్చీలు

కలవు. నామిత్రుఁడు అందలి ప్రధానపాచకుని మంచిమాటచేసికొని ఆదివ్య భవనమును మా ఉపయోగమునకు పుచ్చుకొనెను.

ఈ రొంర పాటినది. రొట్టెపై రోఁతపోయినది. మరి మేఁక లపై జాలి జారిపోయినది. పట్టి మాంసము కాకున్నను మాంసముతో కలిపి వండిన వంటకములలో రుచిమరగితిని. ఇటులు ఒక సంవత్స రము కడచెను. మాంసపు విందులన్నియు వెరసి ఆఱుకంటె ఎక్కువ కాలేదు. ఏలనఁగా: ఆరాజభవనము ఎల్లప్పుడు చిక్కదు. మరియు రుచియు, విలువయుఁ గల మాంసపు వంటకములు మాటిమాటికి సిద్ధము చేయుట కాని పని. ఈ 'సంస్కారణమును' భరింప నాకడ ధనము లేదు. దీనికి కానలసిన దంతయు నామిత్రుఁడే ఖర్చు పెట్టవలసియుం డెను. అతనికి ఆడబ్బు ఎక్కడి నుండి వచ్చెడిదో తెలియదు. నన్ను మాంసభోజిగా మార్చుటకు, భ్రష్టునిగ చేయుటకు దీక్షితుఁ డగుటచే ఎట్లో తెచ్చి ఖర్చుపెట్టుచుండెను. అయితే అతనికి ఆడబ్బు వచ్చు ఉపాయ ములును మితములయి ఉండవలయును గాన మా విందులు నూటి కొక నాఁడు కోటి కొకనాఁడును కావలసి వచ్చెను.

ఈ దొంగవిందులు కుడువ పోసఁగిననాఁడు నేను ఇంట అన్నము తినువాఁడను గానని చెప్పనక్కఱలేదు. మా అమ్మ ఎప్ప టట్ల అన్నమునకు పిలిచి నా ప్రాలుమాలికకు కారణ మడిగెడిది. 'నాకు నేఁడు అన్నము అఱుగలేదు, ఆఁకలి లేదు,' అని నేను సాకులు చెప్పవలసివచ్చెడిది. నేను ఇటులు ముందరికాళ్లకు బంధములు వేయుట అతిఖేదముతోడనే. బొంకుచుంటిననియు, విశేషించి మాఅమ్మతో ననియు నాకు తెలియును. పిల్లలు మాంసభోజు లయిరని తెలియుచో

తలిదండ్రుల గుండెలు బ్రద్దలగుననియు నాకు తెలియును. ఇది యంతయు నాగుండెలు నమిలివేయుచుండెను.

మాంసముతినుటయు, దానిని హిందూదేశమున ప్రచారముచేయుటయు ఆవశ్యకమైనను తలిదండ్రుల వంచించుటయు, వారితో బొంకుటయు మాంసము విడనాడుటకంటె ఎగ్గు. కాన వారు బ్రతికియుండఁగా మాంసముతినుట కానిమాట. వారి అనంతరము నేను పెద్దనయిన పిమ్మట బట్టబయలుగా మాంసము తిందునుగాని ఆ గడియవచ్చువఱకు ఇఁక మాంసము ముట్టను అని నిశ్చయించుకొంటిని.

ఈ నాపూనికను నామిత్రునకు తెలిపి మరి దానిదెస చూడలేదు. తమకొడుకు లిరువురు మాంసభోజు లయిరని మాతలిదండ్రు లెన్నఁడు ఎఱుఁగరు.

మాతలిదండ్రులకు బొంకకుండవలయు నను మంచి ఆలోచన చేతనే నేను మాంసమును పరిత్యజించితినిగాని నామిత్రుని సావాసము మాత్రము పరిత్యజింపలేదు. ఇతరులను సంస్కరింపవలయు నను నా ఉత్సాహమే నా కొంప ముంచినది. ఇట్లని అపుడు నాకు రవ్వంతయు తెలియదు.

అతని సంగడము నన్ను వ్యభిచారమునఁగూడ దింపియుండును గాని వెంట్రుకవాసిలో తప్పిపోయెను. ఒకనాఁడు అతఁడు నన్ను భోగముదాని యింటికి తీసికొనిపోయెను. చెప్పవలసినవి చెప్పి అతఁడు నన్ను లోనికి పంపెను. చేయవలసినదంతయు లోఁగడనే ఏర్పాటు చేసెను. రొక్కము లోఁగడనే ఇచ్చివేసెను. నేను పాపపు కోఱలలో పడితిని; కాని భగవంతుఁడు అనంతకృపతో నా ప్రయత్నమును ప్రతిఘటించి నన్ను కాపాడెను. ఈపాపగుహలో నాకు కనులు

కనబడలేదు; నోట మాట రాలేదు. నేను పఱుపుమీఁద ఆమె ప్రక్కను కూర్చుంటినిగాని నానోరు బిగిసికొనిపోయెను. ఆమె ఎంతో సేపు ఓపిక పట్టలేక తిట్టుచు, తిమ్ముచు ద్వారము చూపెను. దానితో నామగతనమునకు కళంకము కలిగినటులు సిగ్గుపడి 'భూమి తనలోనికి దారి యీరాదా?' అనుకొంటిని. అయితే నా కీయాపద తొలఁగించినందులకు పరమేశ్వరునకు మ్రొక్కుచునే యుంటిని. నా జీవితమున ఇట్టివే మరి నాలుగు కలవు. వానిలో నాప్రయత్నముకంటె నాఅదృష్టమే నన్ను ఎక్కువ రక్షించెను. నీతినిబట్టి పరిష్కరించువో ఇవి యన్నియు దోషములే. ఏలన: ఇందు విషయాభిలాష కలదు. క్రియ ఎట్టిదో అదియు అట్టిదే. లౌకికదృష్టిలో సాక్షాత్తుక్రియకే దోషమని పరిగణన. ఇట్టి దృష్టిలో మాత్రమే నేను దోషినికాను. ఈశ్వరానుగ్రహమువలన కర్తకును, అతనికి సంబంధించినవారికినిగూడ తప్పి పోవు కొన్ని కర్మలు కలవు. అటులు తప్పి పోయినపిదప, సరియగు జ్ఞానము కలిగిన వెంటనే మనుష్యుఁడు తనను తప్పించినందులకుఁగాను ఈశ్వరానుగ్రహమును మననము చేయును. మనుష్యుఁడు ఎంత ప్రయత్నించినను వికారము చెందుట మనకు తెలియును. అటులే భగవంతుఁడు అడ్డుపడి ఎదుఱొడ్డి రక్షించుటయు మనకు తెలియును. ఇదియంతయు ఎటులు సంభవించును? మనుజుఁడు ఎంతవట్టు స్వతంత్రుఁడు? ఎంతవట్టు పరతంత్రుఁడు? ఎంతవట్టు పురుషప్రయత్నము పనిచేయును? ఎపుడు ఈశ్వరేచ్ఛ రంగమున ప్రవేశించును? ఇది యంతయు గహనము; ఎన్నటికిని గహనమే.

ఇఁక ప్రకృతమునకు వత్తము. ఇంత జరిగినను నామిత్రుని దుస్సాంగత్యము నెడ నాకనులు మూసికొని పోయియే ఉండెను.

నే నెన్నఁడును అతని విషయములో ఊహింపని కొన్ని దోషములు సాక్షాత్తు నాకంటికి కానఁబడినవఱకును నాకుఁగాను కొన్ని కటువిష యములు నిలుచ యుండెను. వానిని పిదప సమయానుక్రమముగా తెలుపుదును.

అయినను ఒకవిషయముమాత్రము ఈసమయమునకే సంబంధించి నదిగాన ఇచట చెప్పఁదగినది. నాకును, నాభార్యకును మనస్సులు కలి యక పోవుటకుఁ గల కారణములలో ఒకటి ఇతని స్నేహమే. తఱచు నాకు భార్యయెడ మిక్కిలి వలపును, అనుమానమును కలదని చెప్పియే యున్నాను. ఈ మిత్రుఁడు నా అనుమానాగ్నిని ప్రజ్వరిల్లఁజేసెను. మిత్రుఁడు కల్లలాడునని నే నెన్నఁడును అనుకొనలేదు. అతనిమాట నమ్మి నాధర్మపత్నిని తఱచు హింసపెట్టితిని. నే పెట్టిన హింసకు నేను నన్ను ఎప్పుడును క్షమించలేదు. ఇట్టి కష్టములను ఒక్క హిందూస్త్రీయే సహింపఁగలదు. కావున నే నేను స్త్రీని క్షమయొక్క అవతారముగా పరిగణింతును. బంటును అకారణముగా అనుమానిం చుచో అతఁడు పనిమానుకొనవచ్చును. కొడుకు తండ్రియింటినీడ త్రొక్కకుండవచ్చును. మిత్రుఁడు మైత్రికి నీరు వదలవచ్చును. భార్య భర్తను అనుమానించుచో నోరు మూసికొని పడియుండును. కాని భర్త భార్యను అనుమానించుచో ఇఁక ఆమె పని పాడే. ఆమె ఎటకు పోవును? ఉచ్చవర్ణమునకు చెందిన హిందూవనిత విడాకులకుఁగాను న్యాయస్థానముల కెక్కదు. న్యాయము ఆమెకు తారకము కాదు. నేను నాభార్యను అటువంటి బెడదలోనికి నెట్టుట ఎట్టులును మఱవఁజాలను; అందులకు నన్ను మన్నించుకొనను జాలను.

౮

## దొంగతనము—ప్రాయశ్చిత్తము

ఈ నామాంసాహారకాలమునను, తత్పూర్వమునను నా అకార్యములు చెప్పుటకు కొంచెము బాకీయున్నది. అవి నా వివాహమునకు కొంచెముముందో, లేక వెనువెంటనో అయియుండును.

నాచుట్ట మొకఁడును, నేనును పొగత్రాగుటకు వేడుకపడితిమి. పొగత్రాగుటయందు మేలు కలదనికాదు; దానిపరిమళమునకు మోహపడి కాదు. మా పినతండ్రికి ఈయలవాటు కలదు. అతఁడు పొగద్రావుచుండఁగా చూచి మేముకూడ సిగరెట్లతో చిన్న మబ్బుల తయారు చేయవలయు నని తలంచితిమి. మావద్ద ధనము లేదు. కాన మాపినతండ్రి కాల్చిపాఱవైచిన సిగరెట్టు ముక్కలను తీసి దాఁచ మొదలిడితిమి.

అవి అనుకొన్నపుడు దొరకెడివి కావు; దొరకినను ఎక్కువపొగ వచ్చెడిది కాదు. కావున నౌకరుల సొంతసొమ్ములోనుండి డబ్బులు ముచ్చిలించి బీడీలు (దేశవాళీసిగరెట్లు) కొన మొదలిడితిమి. పిమ్మట వానిని దాఁచుట ఎచట అనునది ఒక పెద్ద విషయము. పెద్దలయెదుట మేము కాల్పలేముగదా! ఈదొంగ డబ్బులతో కొన్ని వారములు ఎటులో కడపితిమి. ఈలోపుగా కొన్ని మొక్కలకాడలకు సన్ననిబెజ్జములు కలవనియు, అవి సిగరెట్ల పనిచేయు ననియు వింటిమి. మేము వానిని తెచ్చి ఈక్రొత్త ధూమపానము మొదలుపెట్టితిమి.

## ౮ దొంగతనము-ప్రాయశ్చిత్తము

వీనితో మాకు తృప్తికలుగ లేదు. మా పరతంత్రతకు కడు వగచితిమి. పెద్దల అనుజ్ఞ లేక ఏమియు చేయఁజాలకపోవుట మాకు దుర్భరముగ నుండెను. తుదకు విసిగి విసిగి ఆత్మహత్యకు తెగఁబడితిమి.

అయితే ఆత్మహత్యకు ఉపాయమేమి? మాకు విషము ఎచటి నుండి దొరకును? ఉమ్మెత్తగింజలు చెడ్డ విషమని తెలిసికొంటిమి. వానికొఱకు అడవిలో వెతికికొనుచు పోయి కడు దవ్వున వానిని సంపాదించుకొంటిమి. సాయంకాలము మంచి ముహూర్తమని నిశ్చయించుకొంటిమి. కేదారేశ్వరుని మందిరమునకుపోయి, దీపప్రమిదలో నేయివైచి, దేవదర్శనము చేసికొని మాఱుమూలకు వెతికితిమి. 'అయితే ప్రాణములు వెంటనే పోకున్నచో? చచ్చుటచే కలుగు లాభమేమి? పరాధీనతతో మాత్రము బ్రతికి యుండఁగూడదా?' అను ఈ ఆలోచనలతో మాధైర్యము అడుగంటెను. అప్పటి కప్పుడే రెండుమూఁడు గింజలు మింగివైచితిమి. ఇఁక తిన సాహసింప లేకపోతిమి. మాకు ఇరువురకును చావనిన భయము కలిగెను. కొంచెము కుదుటఁ బడుటకును, ప్రాణములను పాపుకొను ఊహను తొలఁగించుకొనుటకును రామమందిరమునకు పోవ నిశ్చయించుకొంటిమి.

ఆత్మహత్య చేసికొనుట తలఁచుటంత తేలికపని గాదని నాకు తెలిసివచ్చెను. నాఁటినుండియు ఎవఁడేని ఆత్మహత్య చేసికొందునని అనినచో నా కామాటమీఁద యింతయైన పాటి లేదు.

ఈఆత్మహత్యావిచారము తుదకు సిగరెటుపీకలకు ఒకసలాము చేయింపను, సిగరెట్లు కాల్చుటకు నౌకరుల డబ్బులు దొంగిలింపకుండ జేయను పరిణమించెను.

నేను పెద్దవాఁడనైన పిమ్మట ఎన్నఁడును పొగత్రాగు కోరిక పుట్టలేదు. అంతియకాక అది చాల అనాగరకము, హానికరము, రోఁత అని నా ఉద్దేశము. ప్రపంచమున దానికొఱకు ఇంత పెద్దమోజు ఎందుకో నాకు తెలియకున్నది. పొగత్రాగువారితో నిండిన రైలుబండ్లలో నేను ప్రయాణముచేయఁజాలను. అచట నాకు ఊపిరి ఆడదు.

దానిపిదప దానికంటెను మిగుల తప్పయిన నేరము మరియొకటి. నేను పండ్రెండు పదుమూఁడేండ్లవాఁడనయి యుండఁగా, అంతకు తక్కువయే కావచ్చును, మొదట సిగరెట్లకోసము డబ్బులు దొంగిలించితిని. పదియేనేండ్లనాఁట రెండవ మ్రుచ్చిమి. అది మాంసభోజియైన మా అన్న మురుగునుండి కొంచెము బంగారము. ఈయన్న ఇరువదియైదురూపాయలు అప్పుపడెను. మేమిద్దరము ఈఅప్పు తీర్చుట ఎట్లను విచారమున మునిఁగితిని. అతనిచేత గట్టి మురుగు ఉన్నది. దానిలో ఒక తులము చిన్నముక్క తెగఁగొట్టుట ఎంతో పని కాదు.

ఆపనియు జరిగెను; అప్పు తీరెను. ఇది నాకసహ్యమయ్యెను. కాని ఇఁక చౌర్యము చేయఁగూడదని నిశ్చయించుకొంటిని. మరియు ఆవిషయమును మాతండ్రిగారితో మనవిచేసికొనను రూఢి చేసికొంటిని. కాని వారిఎదుట నోరు విప్ప సాహసింపఁజాలకపోతిని. నాతండ్రి కొట్టునని భయపడి కాదు. నాకు అట్టిభయము లేదు. ఆయన మాలో ఎవ్వరినేని కొట్టిన గుఱుతు లేదు. ఇఁక నేమి? ఆయనకు ఈమాట మనస్తాపము కలిగించిపోవునని. దోషస్వీకారము చేసిఁగాని శుద్ధి కలుగదు. కాన వారికి మనస్తాపము కలిగించుటకును ఒడి గట్ట వలెనని తోఁచెను.

# ౮ దొంగతనము-ప్రాయశ్చిత్తము

తుదకు నేను నాతప్పును ఒక చీటిపై వ్రాసి మాతండ్రిగారికి నివేదించి శరణు కోరుటకు నిశ్చయించుకొంటిని. ఒకచిన్న కాకితము మీఁద వ్రాసి నేనే తీసికొని పోయి ఇచ్చితిని. ఈచీటిలో నేను నా తప్పు వ్రాయుటయే కాక దానికి తగిన శిక్ష విధింపుఁ డనియు కోరి నా దోషమునకుఁగాను మీరు ఇంతయు దుఃఖింపవలదని ముగించితిని. ఇఁకమీఁద నే నెన్నఁడును చౌర్యము చేయననియు శపథము చేసితిని.

నేను ఆచీటిని మా నాయనగారికి ఇచ్చుచు వడఁకిపోవుచుంటిని. ఆయన అపుడు భగందరమువలన బాధపడుచు మంచముపట్టి ఉండెను. ఆయన శయ్య ఒకబల్ల. చీటి వారి చేతికి ఇచ్చి నేను ఎదురుగా కూరుచుంటిని.

వారు దాని నంతయు చదివిరి. ముత్యములంతలేసి కన్నీటి బొట్లు గండఫలకములనుండి జాఱి ఆచీటిని తడిపివేసెను. ఒక నిమిషము ఆయన కనులు మూసికొని ఆలోచనలో మునిఁగి పిదప ఆచీటిని చింపివేసెను. లోఁగడ ఆయన దానిఁ జదువ లేచెను. ఇపుడు మరల శయనించెను. నాకును అపుడు ఏడుపు వచ్చెను. నేను నాతండ్రి వేదనను గ్రహించితిని. నేను చిత్రకారుఁడనేని నేఁడు అది యంతయు చిత్రింపఁగలిగి యుందును. అది యింకను నాకనులకు కట్టినటులున్నది.

ఆ ప్రేమబాష్పములు నాహృదయమును ఘాతము చేసి నాపాపమును కడిగివైచెను. అనుభవించిన వానికే ఆప్రేమ తెలియును—

*ద్వి. అనురాగశరముల యనుభూతి వెలయు
మనుజునకే దాని మహిమలు తెలి... .

* రామ-బాణ వాగ్యాంకే హోయ తే జాణేం.

# ౯

## నా పితృనిర్యాణము - నా మహాపమానము

ఇపుడు ఇపుడు నాకు పదునాఱవయేఁడు. నాతండ్రిగారు భగందరముచే బాధపడుచు మంచమెక్కినని పాఠకులకు తెలియును. మా అమ్మగారును, ఒక పురాణభృత్యుఁడును, నేనును వారి ముఖ్యపరిచారకులము. నాది 'నర్సు'(Nurse)పని-అనఁగా-కట్టువిప్పికట్టుకట్టుట-మందు ఇచ్చుట-అక్కఱ కలిగినపుడు మందులు నూఱుట, కలుపుట మొదలగునవి-నాపని. ప్రతిరాత్రియు నేను వారి కాళ్ళుపిసికి, వారు 'ఇఁక చాలును' అని సెలవు ఒసఁగినపిదపనే విరమించువాఁడను; లేక, వారు నిద్రించినపయినే విరమించువాఁడను. ఈసేవ నాకు మిగుల ప్రియము. నేనిది ఎపుడును ఏమరినటులు గుఱుతులేదు. నిత్యకృత్యములకు పోఁగా మిగిలిన కాలము నంతయు బడికిని, పితృసేవకును పంచితిని. నాకు వారు సెలవు ఇచ్చిన యపుడును, వారికి కొంచెము తిన్నగా ఉన్నపుడును మాత్రమే సాయంకాలము షికారు వెళ్లువాఁడను.

ఆ యేఁడే నాభార్య గర్భవతిగ నుండెను. అది నేఁడు నాకు ఇరుతెఱఁగులసిగ్గు. ఏలన, నేను విద్యార్థినై యుండియు బ్రహ్మచర్యమును విడుచుట ఒకటి; నాకు విధియగు విద్యావ్యాసంగముకంటెను, మరియు బాల్యమునుండియు నాకు శ్రవణుఁడు గుఱికాన పూర్వవిధికంటె బలవత్తరమగు పితృసేవకంటెను ఎక్కువగా భోగసేవఁజేయుట రెండు. ప్రతిరాత్రియు నాచేతులు మా తండ్రిపాదములమీఁద; మనస్సు పడక

గదిమీఁద. అందును స్త్రీసంగమమును వైద్యశాస్త్రము, మతము, లోక జ్ఞానముకూడ నిషేధించిన సమయము. వదలిపెట్టిన చాలును అని సంతోషించి, మా తండ్రిగారికి నమస్కరించి సూటిగా పడకటింటికి పోవు వాఁడను.

సరిగా ఆదినములలోనే మాతండ్రిగారికి క్రమక్రమముగా వ్యాధి ఎక్కువ అగుచుండెను. ఆయుర్వేదవైద్యుల పూఁతలు, హకీములపట్టీలు, కూరగాయవైద్యుల గుప్తౌషధములు,అన్నియు అయినవి. ఒక ఆంగ్లేయ వైద్యుఁడుకూడ తనశక్తిని వినియోగించెను. అతఁడు ఇఁక శస్త్రచికిత్సతప్ప వేఱు గతిలేదని చెప్పెనుకాని అందులకు కుటుంబ వైద్యుఁడు అడ్డమువచ్చెను. అంత పెద్దయీడున శస్త్రచికిత్సకు అతఁడు సమ్మతింపలేదు. ఈవైద్యుఁడు సమర్థుఁడు, సుప్రసిద్ధుఁడును కావున ఆయన మాట నెగ్గెను. శస్త్రచికిత్స మూలఁబడెను; అందులకుఁ గొన్న మందులన్నియుఁ గోఁతఁబడెను. కుటుంబవైద్యుఁడు శస్త్రచికిత్సకు అంగీకరించియుండుచో గాయము కుదిరియుండునని నాతలఁపు. ఆ శస్త్రచికిత్సయుఁ బొంబాయిలోఁ బ్రసిద్ధుఁడైన ఒకగొప్ప వైద్యునిచేతనే చేయింపఁదలఁచినది. కాని ఈశ్వరేచ్ఛ భిన్నముగా నుండెను. మరణము నెత్తిమీఁద కూర్చుండినపుడు ఎవరికి మంచి ఉపాయము తోఁచును? అటు పిమ్మట ఉపయోగహీనమైన శస్త్రచికిత్సాసంబంధములగు పరికరము లన్నిటితో మా తండ్రిగారు బొంబాయినుండి ఇలుచేరిరి. ఆయనకు ఇఁక జీవింపనని అధైర్యము కలిగెను. ఆయన క్రమక్రమముగా నీరసించిపోయెను. పడకలోనే అన్ని పనులు కావలసియుండెనుగాని, ఆయన చిట్టచివరవఱకును అట్టిదాని కియ్యకొనక పట్టుపట్టి ఎట్లో స్వయముగనే లేచి ఆవలికి వెళ్లుచుండువారు. బహిశ్శుద్ధివిషయమై వైష్ణవవిధులు అంత కఠినమైనవి.

అట్టి శుద్ధి ఆవశ్యకమనుటకు సందియము లేదు. కాని రోగికి ఇసుమంతయు నొప్పి లేకుండ, శయ్యపై ఇంచుకయు మైలసోఁకకుండ, సంపూర్ణ మగు పరిశుభ్రతతో ఆవశ్యకకృత్యములన్నియు, స్నానముతోఁగూడ, పడకయందే జరుపఁగలుగుట పాశ్చాత్య వైద్యశాస్త్రము మనకు నేర్పినది. అట్టి శుచి ఈ వైష్ణవమందు అంతర్గతమైయున్నది. కాని మా తండ్రిగారు అంతపట్టు పట్టుట నాకు కేవలము ఆశ్చర్యముగ ఉండెడిది. దానికి నేను మెచ్చుకొనువాఁడను.

కాళరాత్రి వచ్చెను. మా పినతండ్రి అపుడు రాజకోటలో నుండెను. మా తండ్రి అపాయస్థితిలో ఉండెనని తెలిసి అతఁడు రాజకోటకు వచ్చెనని కొంచెము గులుతు. వారిరువురకును సోదరప్రేమ మెండు. మా పినతండ్రి పగలంతయు మా తండ్రిపడకకడనే కూర్చుండి, రాత్రి మమ్ములనందఱను నిద్రింపఁ బంపివేసి, ఆ పడక ప్రక్కనే పరుండియుండువాఁడు. ఇదియే కడరాత్రియని ఎవరికిని దెలియదు. ఎప్పుడును భయము మాత్ర ముండెడిది.

అది రాత్రి 10½-11గంటల సమయము. నేను కాళ్లు పట్టుచుంటిని. మా పినతండ్రి 'నీవు పోయి పరుండుము; నేనుఉందును' అనెను. నేను సంతసించి సూటిగా పడకటింటికి పోయితిని. నా భార్య, పాపము! గాఢనిద్రలో ఉండెను. నేనచ్చట నుండఁగా ఆమె యెటులు నిద్రపోఁగలదు? నే నామెను లేపితిని. అయిదాఱు నిమిషములలో నాకరుతలుపు తట్టెను. నేను కంగారు పడితిని 'లెండు, నాయనకు చాల జబ్బుగా నున్న'దని అతఁడనెను. వారికి చాలజబ్బుగా ఉన్నదని నాకు తెలియకనే తెలియును; కాని ఆ క్షణములో 'చాల జబ్బు' అనుదానికి

నాకు విశేషార్థము గోచరించెను. నేను మంచముపైనుండి దుమికి, 'ఏమి జరిగినది? చెప్పు' మంటిని. 'నాయన లేఁడు' అని అతఁడనెను.

అంతయు అయిపోయినది. చేతులు కాలిన పిదప ఆకులు వెతుకు టెందుకు? నాకు పట్టరాని దుఃఖమును, సిగ్గును కలిగెను నేను మా తండ్రిగారి గదికి ఉఱికితిని. పశుప్రవృత్తి నన్ను అంధునిచేయకున్న యెడల అంతిమక్షణములలో, మాతండ్రిగారి ప్రయాణావేదనలో, నేను పాలు గొనియుందునుకదా! అను కొంటిని. నేను ఆయనకు కాళ్లు పట్టుచుండి యుందును, ఆయన నాచేతులలో పోయియుందును. కాని ఆభాగ్యము మా పినతండ్రికి లభించెను. మా పినతండ్రి అన్నగారియెడ పరమభక్తుఁడు. కావున ఆయనకే అంత్యసేవ చేయు సౌభాగ్యము దక్కెను. మా తండ్రి గారు మరణము ఆసన్నమాయెనని తెలిసి, కలమును, కాకితమును సైగ చేసి తెప్పించి, 'సిద్ధముచేయుఁడు' అని వ్రాసెను! పిదప తనదండనున్న తాయెతును, మెడనున్న బంగారపు తులసి తావళమును తీసివైచెను. పిదప ఒక నిమిషముపైని ఆయన మరి లేఁడు.

నేను గత ప్రకరణమున సూచించిన అవమాన మిదియే. తండ్రి ప్రాణము పోవుచున్నపుడుగూడ తరుణిపై మోహము. నాకు ఇది మాయని మచ్చ. నాకు తలిదండ్రులయెడ భక్తి అపారమైనను, అందులకు నాసర్వస్వమును ధారపోయఁ గలిగినను, అది యింకను మిగుల కొఱనడి యున్నదని తేలినది. ఏలన, ఏసమయమున మెలఁకువతో ఉండవలయు నో ఆసమయమున నామనస్సు విషయాసక్తమయియున్నది. కాన అది ఎన్నఁటికిని క్షమింపరానిది. కావుననే నేను ఏకపత్నీవ్రత పాలకుఁడనైనను కామాంధుఁడ నని అనుకొందును. దీనిని మారణము చేయుటకు

నాకు చాలకాలము పట్టెను. దానిని నేను వశము చేసికొనువఱకును పలుగండములు దాటవలసివచ్చెను.

నాకు ఇరుతెఱఁగుల అవమానకరమైన ఈప్రకరణమును ముగింపక మునుపు నా భార్యకు కలిగిన నరమువంటి ఆబిడ్డ మూఁడు నాలుగు నాళ్లకంటె ఎక్కువ జీవింపలేదని నేను చెప్పుదును. అంతగాక ఇంకేమి కాఁగలదు! నా ఉదాహరణమును గమనించి వివాహితు లందఱు మేలు కందురుగాక!

౧౦

## మతములలో స్వల్పప్రవేశము

నేను ఆఱు ఏడు ఏండ్లు మొదలుకొని పదునాఱవ యేఁడువఱకు విద్యావ్యాసంగము చేసితిని గాని బడిలో మతవిషయము తక్క మిగిలిన విషయము లెన్నియో చెప్పుకొంటిని. సులభముగా ఉపాధ్యాయులవలన మాకు లభింపఁదగిన విషయము గూడ లభింపలేదు. నా పరిసరములలో కొంత కొంతయుఁగా కొన్ని విషయములు గ్రహించుచుంటిని. 'మతము' అను ఈ పదమును వ్యాపకమగు అర్థమున ప్రయోగించుచున్నాను. మత మనఁగా ఆత్మసాక్షాత్కార మనిగాని, ఆత్మజ్ఞానమనిగాని నా అభిప్రాయము.

మాది వైష్ణవ సంప్రదాయము కావున నేను తఱుచు విష్ణ్వాలయమునకు వెళ్లవలసియుండెడిది. కాని దానియెడ నాకు శ్రద్ధకలుగలేదు. దాని వైభవము నాకు అభిమతము కాలేదు. అచట కొంత దుర్నీతియు జరుగునని విని దానియెడ ఉదాసీనుఁడ నైతిని. కావున కోవెలవలన నాకు అబ్బిన దేమియు లేదు.

అయితే, నాకు అచట ఏది అబ్బకపోయెనో అది మా కుటుంబమున పురాణదాసి వలన అబ్బినది. ఆమె వాత్సల్యము నాకు ఇప్పుడును గుఱుతున్నది. భూతప్రేతాదుల భయము నాకు కలదని లోఁగడనే చెప్పితిని. రంభయని పేరు కల ఈ నాదాది ఈ భయము పోవుటకు రామనామము మందు అని చెప్పెను. నాకు ఆమె మందు మీఁద కంటె

ఆమెమీఁద ఎక్కువ నమ్మికక. కావున ఆలేఁత వయసున భూతప్రేత భయ నాశనమునకు రామనామమును జపముచేయ మొదలిడితిని. ఇదయితే ఎన్నో నాళ్లు జరుగలేదు కాని, ఆలేఁత వయసున మనస్సులో పడిన బీజము పొల్లు కాలేదు. రామనామము నాకు నేఁడు అమోఘమగు ఓషధి అగుటకు కారణము నాఁడు ఆరంభవిత్తిన విత్తనమే.

సరిగా ఆ రోజులలో రామాయణ మనిన అత్యాదరము కల మా పెదతండ్రి కొడుకొకఁడు నా చిన్నన్నకును, నాకును రామరక్షా స్తోత్రము నేర్పనేర్పాటు చేసెను. మేము దానిని వల్లించి ప్రతిఉదయమునను స్నానమయిన పిదప పారాయణము చేయ నియమించుకొంటిమి. మేము పోరుబందరులో ఉన్నంతకాలము ఆ దీక్ష సరిగా జరిగినది; కాని రాజకోటకు వచ్చుసరికి శిథిలమయినది. దానియందు నాకు అంతగా నమ్మకము లేదు. రామరక్షను పారాయణము చేయుటకు హేతువులు రెండు: ఒకటి-నాకు మా అన్నగారియెడఁ గల ఆదరము, రెండు- నేను రామరక్షను స్ఫుటముగా ఉచ్చరింపఁగల నను గర్వము.

మాతండ్రి జబ్బులో కొంతకాలము పోరుబందరునందు ఉండెను. ఆయన అచట ప్రతి సాయంకాలము రామాయణము వినుచుండువాఁడు. ఆరామాయణపఠనము నాకు బాగుగా నెలకొనినది. చదువువాఁడు గొప్ప రామభక్తుఁడు. ఆయనపేరు లాధామహారాజు; బిలేశ్వరనివాసి. ఆయనకు కుష్ఠు ఉండెననియు, ఆయన మందులు మాఁకులు తినక బిలేశ్వరుని దేవాలయమున శివనిర్మాల్యమునందలి మారేడు పత్రిని కట్టి రామనామము నిత్యము పారాయణము చేయుచుండెడువాఁడనియు, తుదకు కుష్ఠు సంపూర్ణముగా కుదిరె ననియు వింటిని. అతని విశ్వాసముచే అతనిది వజ్రకాయ మాయెనని అనుకొనిరి. ఇది నిక్కము

కావచ్చును, కాకపోవచ్చును. ఎటులైనను మేమీకథ నమ్మితిమి. మరియు లాధామహారాజు రామాయణము చదువ మొదలిడిన నాఁటికి అతని శరీరముమీఁద ఒక మచ్చయైన లేదు. లాధామహారాజు స్వరము మధురము. అఁతడు *ద్విపదలు, †చౌపదములును పాడి అర్థము చెప్పుచు పరవశుఁడై శ్రోతలను పరవశులను కావించుచుండెడు వాఁడు. నాకు అపుడు పదుమూఁడేండ్లు ఉండును; కాని ఆపురాణము వినినపుడు మైమఱచు చుండువాఁడ నని గుఱుతు. ఆరామాయణ శ్రవణమే నాకు రామాయణముపై ఆదరము కలిగించుటకు కారణము. భక్తిగ్రంథముల లో తులసీదాసు రామాయణము ఉద్గ్రంథమని నేఁడు నే నెంచెదను.

ఇటు పిమ్మట కొన్నిమాసములకు మేము రాజకోటకు వచ్చితిమి. అచట రామాయణ కాలక్షేపము లేదుకాని ప్రతి ఏకాదశియు భాగవతకాలక్షేపము జరిగెడిది. అప్పుడప్పుడు నేను వినఁబోయితిని గాని పౌరాణికుఁడు శ్రోతలను పరవశులఁగావింప లేకపోయెడువాఁడు. భాగవతము భక్తి జనకమగు గ్రంథమని ఇపుడు ఎఱుఁగుదును. నేను దానిని ఘూర్జరభాషలో తన్మయుఁడనై చదివితిని. నామూఁడు వారముల ఉపవాస దీక్షలో పండిత మదనమోహన మాలవ్యులు మూలమునందలి కొన్నిఘట్టములు చదువఁగా వింటిని. మాలవ్యవంటి మహాభక్తునివలన చిన్నతనముననే దాని వినఁగల భాగ్యము నా కుండెనేని ఆవయసుననే దానిపై గాఢప్రీతి కలిగెడిదికదా! అని అనుకొంటిని. ఆ వయస్సున ఉత్పన్నములగు శుభాశుభ సంస్కారములు లోఁతుగా వేరుల్రొక్కుకొనును కావున ఆవయసున అటువంటి ఉత్తమగ్రంథములు ఎక్కువ వినఁజాలకపోతినే అని నాకు సర్వదా విచారము.

* దోహా † చౌపాఈ

## ౧౦ మతములలో స్వల్పప్రవేశము

అయినను నాకు రాజకోటలో సర్వమత సంప్రదాయములందును సమత్వము అనాయాసముగా ఏర్పడినది. హిందూమతముయొక్క ప్రతిసంప్రదాయమునెడను ఆదరభావము కుదిరినది. ఏలయన, అచట మా తలిదండ్రులు రామాలయమునకును, శివాలయమునకును వెళ్లుచుండువారు. మమ్ములను తమతో తీసికొనిపోయెడివారు; లేక, మమ్ము పంపుచుండెడివారు. జైనధర్మాచార్యులు తఱచు మా నాయనగారికడకు వచ్చుచుండువారు. మేము జైనులము కాకున్నను, నిషిద్ధమైనను, వారు మాయింట భుజించుచుండువారు. వారు మా తండ్రితో ధర్మచర్చయు, వ్యవహారచర్చయుఁగూడ చేయుచుండువారు.

ఇంతేకాక, మా తండ్రికి మహమ్మదీయులలోను, పారసీకులలోను మిత్రులు కలరు. వారు తమతమ మతములఁగూర్చి తఱచు మాటలాడుచుండువారు. మా తండ్రియు గౌరవముతోడను, శ్రద్ధతోడను ఆలకించుచుండువాఁడు. నేను వారికి 'నర్సు'గా ఉండుటచే తఱచు వారి సంభాషణము విన వీలయ్యెడిది. ఈవిషయములన్నియు కలిసి అన్ని సంప్రదాయములందును సమత్వమును కలిగించుటకు సాయపడెను.

అప్పుడొక క్రైస్తవమతము మాత్రమే మిగిలినది. దానియెడ నాకు ఒక విధమైన అరుచి పుట్టెను. ఆరోజులలో క్రైస్తవమతబోధకులు హైస్కూలు దాపున ఒకమూల నిలువఁబడి హిందువులను, వారి దైవములను నిందించుచు ఉపన్యసించుచుండువారు. అందులకు నాకు సహనము లేకుండెడిది. వారిని వినుటకు నేను ఒక్కమాఱే అచట నిలిచియుందును కాని దానితో మరి పని లేకపోయినది. ఆసమయముననే సుప్రసిద్ధుఁడగు ఒక హిందువు మతమునఁగలిసెనని వింటిని. అప్పుడతఁడు గోమాంసము తినక తప్పకపోయెననియు, సారా త్రాపక తప్పకపోయె

ననియు, వేషమునుగూడ మార్చక తప్పక పోయెననియు, పిదప అతఁడు హాటుతోఁ గూడ సర్వము పాశ్చాత్యవేషముతో సంచరించుచుండెననియు ఊరును నాడును మ్రోఁగిపోయెను. ఈమాట వినఁగా నాకు వ్యథ కలిగెను. గోమాంసము తినుట, సారా త్రావుట, వేషము మార్చుట, వీనిని విధించు మతము మత మనిపించుకొన దని తలఁచితిని. ఈ క్రొత్త క్రైస్తవుఁడు అప్పటికప్పుడే తన పెద్దల మతమును, వారి ఆచారములను, వారి దేశమును నిందింప మొదలిడె ననియు వింటిని. ఇవి అన్నియు క్రైస్తవమతముపట్ల అరుచి పుట్టించెను.

ఈరీతిగా నాకు ఇతరమతములందు సమభావము కలిగె నన్నంత మాత్రమున నాకు ఈశ్వరునియందు గాఢమగు శ్రద్ధ ఉండె నన్నమాట కాదు. ఈసమయమున నాకు మాతండ్రిగారి గ్రంథసంచయమున ఉన్న మనుస్మృతి చూడ నాసఁగెను. అందలి సృష్టి మొదలగు విషయములు నాకు ఎక్కువగా శ్రద్ధ కలిగింపకపోవు టటుండ, కొంచెము నాస్తికత కలిగించెను.

అపుడచట మాపితృవ్యపుత్రుఁడు కలఁడు. అతఁడు గొప్ప మేధావి అని నాతలఁపు. అతనికి నాసందియము లెఱిఁగించితిని గాని ఆయన వానిని పోఁగొట్టలేదు. 'నీవు పెద్దవాఁడ వైనపుడు నీయంతట నీకే తెలియఁగలవు. నీవేమి? నీయీడునకు ఈప్రశ్న లేమి? ఇవి నీయీడు నకు తగవు' అని యీమాటలతో నన్ను పంపివేసెను. నేను ఊరకుంటిని గాని మనసులో తృప్తి లేదు. మనుస్మృతిలోని భక్ష్యాభక్ష్య ప్రకరణము మొదలైనవి లోకాచారమునకు విరుద్ధముగా ఉన్నటులు కానిపించెను. దీనికిఁగూడ ఆయన అదియే సమాధానము చెప్పెను. తెలి

విద్య, విశ్వయము బాగుగా అభివృద్ధి చెందినపిదప నేను బాగుగా తెలిసికొనఁగల నని నాలో నే ననుకొంటిని.

అపుడు మనుస్మృతి అహింసను బోధింపలేదు. నేను నామాంసభోజనకథను పైన చెప్పియుంటిని. మనుస్మృతి ఆ మాంసభోజనము పక్షమే అని తోఁచినది.

పాములు, నల్లులు మొదలయినవానిఁ జంపుటకూడ నీతివిహితమే అని అనుకొంటిని. ఆసమయమున అదియొక విధి యనుకొని నల్లులు మొదలగు వానిని చంపియున్నటులు గుఱుతు.

కాని ఒకవిషయము నాలో వేరుతన్నుకొనెను. అది యేదనఁగా, 'సృష్టికి నీతి మూలము, నీతికి సత్యము మూలాధారము' అనునది. కావున నాకు సత్యమే కావలసినది. దైనందినము సత్యముయొక్క మహిమ నాదృష్టిలో పెరుఁగుచున్నది; మరియు దానినిగుఱించి నాయొనర్చిన లక్షణమును విస్తారమగుచునే యున్నది.

మరియు ఒకగుజరాతీ నీతిపద్యమును నాహృదయమున అంకితమై పోయెను. అందలి 'అపకారికి ఉపకారము చేయుట' అనునది నాకు జీవనసూత్ర మాయెను. నేను అనేక ప్రయోగములు కూడ చేసి చూచితి ననిన నాకు దానిపై నెంతగుఱియో తెలియఁగలదు. ఇచట చమత్కారములగు పద్యముల నుదాహరింతును.

సీ. జలమును నీకీయఁగలవాని కిం దేని నొసఁగుమీ కడుపార నోగిరంబు
వందనంబును జేయువానికిఁ జేయుమీ భక్తిమై సాష్టాంగవందనంబు
దమ్మిడి నీకిచ్చు ధన్యాత్మునకు మాఱుగా నిమ్ము మేల్మిబంగారుకాసు
కష్టంబులందు నక్కఱవచ్చువానికి నిమ్ము నీసెమ్మెనినేని కోసి

# ఆత్మకథ

ఒకటి యొసఁగినఁ బదిరెట్టు లొసఁగవలయు
చెట్ట చేసిన మేలును జేయవలయు
ప్రాఁతకాలము నాఁటి యీ చేఁత లెల్ల
అనుపూర్విగ సత్యరహస్య మరయ. *

* పాణీ ఆపనే పాయ, భలుం భోజన తో దీజే,
ఆవి నమావే శీశ, దండవత కోడే కీజే;
ఆపణ ఘసే దామ, కామ మహోరోం నుం కరీప,
ఆప ఉగారే ప్రాణ, తే తణా దుఃఖ మాం మరీప;
గుణ కేడే తో గుణదశ గణో, మన వాచా కర్మే కరీ,
అవగుణ కేడే జే గుణకరే, తే జగమాం జీత్యో సహీ.

## ౧౧

## సీమకు ప్రయాణ సన్నాహము

నేను ౧౮౮౭ సంవత్సరమున మెట్రిక్యులేషన్ పరీక్ష ఇచ్చితిని. అపుడు అహమదాబాదు, బొంబాయియు పరీక్షాకేంద్రములు. దేశము దరిద్రమగుటచే కాఠియావాడువిద్యార్థులు దాపునయున్నట్టియు, కొద్దిఖర్చుతో సరిపోవునట్టియు, అహమదాబాదు కేంద్రమునకే పోవ నభిలషింతురు. మా కుటుంబముయొక్క ఆర్థికస్థితికూడ అంతంతమాత్రముగా నుండుటచే నేనును ఆకేంద్రమునకే పోవలసివచ్చెను. రాజకోట నుండి అహమదాబాదునకు ఒంటరిగ పయనించుట నాకదియే మొదలు.

మెట్రిక్యులేషను అయిన పిదప కాలేజిలో చదువుమని మా పెద్దలు ప్రోత్సహించిరి. భావనగరమునను, బొంబాయిలోను కాలేజీలు కలవు. భావనగరమున ఖర్చు తగ్గును గాన అచటి శ్యామలదాసు కాలేజిలో జేరితిని. చేరితిగాని అక్కడ అంతయు అయోమయముగానుండెను. ఉపాధ్యాయులు చెప్పునది నాకు తెలియలేదు. అది వారిలోటు కాదు. ఇంతియకాక అచటి అధ్యాపకులకు పెద్దపేరు. కాని నేను కసరుగాయను. మొదటి ఆఱునెలలు ముగియఁగనే ఇంటికి వెళ్లితిని.

'మావుజీ దవే' అనువారు మా కుటుంబమునకు పురాణ మిత్రము. మాకు మంచి చెడుగులు చెప్పువారు. బ్రాహ్మణులు; విద్వాంసులు; వ్యావహారకుశలురు. మా తండ్రిగారు గతించిన పిదపఁగూడ మా కుటుంబ కష్టసుఖములను ఆరయుచుండెడివారు. నా సెలవుదినములలో వారు

మా యింటికి వచ్చిరి. ఆయన మా అమ్మగారితోను, పెద్ద అన్నగారితోను సంభాషించుచు నా చదువునుగూర్చి ముచ్చటించిరి. నేను శ్యామలదాసు కాలేజిలో చదువుచుంటినని తెలిసికొని, "ఇపుడు కాలము తారుమారయినది. తగినవిద్య లేక మీలో నెవరును మీ తండ్రిగారి హోదా పొంద నాశింపఁజాలరు. ఈ కుఱ్ఱవాఁడింకను చదువుకొనుచు ఉండుటవలన ఇతఁడు ఆ హోదాను నిలుపుకొనునట్లు చూడవలెను. ఇతఁడింకను బి. ఏ. ప్యాసు అగుటకు నాలుగైదేండ్లు పట్టును. అంతవఱకు తంటాలు పడినను నెలకు ఏఁబది అఱువది రూపాయలు సంపాదింపఁగలుగునే కాని దివాను కాలేఁడు. ఇతఁడు నా కుమారునివలె లాయరు అగుటకు ఇంకను చాల కాలము పట్టును. నాఁటికి దివానుగిరికి ప్రయత్నించు లాయరులు పలువురు ఉందురు. మీ రితనిని ఇంగ్లండు పంపుట శ్రేయమని నా అభిప్రాయము. బారిస్టరగుట చులకన అని నా కొడుకు కేవలరాము చెప్పును. మూఁడేండ్లకు తిరిగి రావచ్చును. వ్యయమును నాలుగైదు వేలకు మించదు. ఇంగ్లాండునుండి బారిస్టరై తిరిగివచ్చిన అక్రొత్తయూతఁడెంత దర్జాగా ఉన్నాఁడో చూడుఁడు! అతఁడు అడిగినఁజాలు, దివానుగిరి యిత్తురు. ఈ సంవత్సరమే మోహానదాసును ఇంగ్లాండు పంపుట నాకు మిగుల అభిమతము. కేవలరామునకు ఇంగ్లాండులో పలువురు మిత్రులున్నారు. అతఁడు వారికి పరిచయపత్రములను ఈఁగలఁడు. కావున ఇతనికి ఇంచుకయు కష్టము కలుఁగదు" అని జోషీజీ (మేము మావుజీదవేగారిని ఇటులు పిలుచు వాడుక) నావంక తిరిగి తన సలహాను అంగీకరించినటులే తలఁచి—"నీవు ఇక్కడ చదువుటకంటె ఇంగ్లాండులో చదువుకొనుటకు అభిలషింపవా?" అని అడిగెను. నాకు దీనికంటె సంతోషజనకమైనది వేతొండు లేదు. నేను కాలేజి కఠినవిద్యచే విసిగితిని. కావున ఈమాట

## ౧౧ సీమకు ప్రయాణసన్నాహము

వినఁగనే ఎగిరిపడి, 'నన్ను ఎంతవడిగా పంపిన అంత మేలని అంటిని. పరీక్షలు వడిగా ప్యాసగుట సులభము కాదు. కావున 'అయ్యా! నన్ను వైద్యమునకు పంపకూడదా?' అని అడిగితిని.

మా అన్న నా మాటకు అడ్డమువచ్చి—"నాన్నకు వైద్యమనిన ఇష్టములేదు. 'మనము వైష్ణవులము. మనకు పీనుఁగులను కోయుట పాడిగాదు' అని వారు చెప్పుట నిన్ను ఉద్దేశించియే. నీవు వకీలు వగుట వారి కభిమతము" అనెను.

జోషీజీయు మా అన్నగారి పాటనే మరల ఇటులు పాడిరి: "నేను మీతండ్రివలె వైద్యవృత్తిని ద్వేషింపను. శాస్త్రనిషేధమును నాకు కానరాదు. కాని నీవు వైద్యము ప్యాసు అయినను 'దివాను' కాలేవు. నీవు దివాను కావలయును. చేతనయినచో అంతకంటె గొప్పవాఁడవు కావలెను. అటులయిననే మీ యీ గొప్పకుటుంబమును కాపాడఁ గలవు. కాలము వడిగా మార్పు పొందుచున్నది. దినములు గడచినకొలఁది కష్టము పెరుఁగుచున్నది. కావున బారిష్టరగుట తెలివిగల పని" అని యిటులు చెప్పి, మా అమ్మగారితో "ఇఁక నాకు సెల విండు. నేను చెప్పినది కొంచెము ఆలోచింపుఁడు. మరల నేను తిరిగి వచ్చుసరికి ఇంగ్లాండు ప్రయాణము సిద్ధమగు ననుకొందును. నేనును చేయఁగలిగిన సాయ మున్నచో చేసెదను" అనెను.

జోషీజీ వెళ్లిపోయెను. నేను సౌధములు కట్ట మొదలిడితిని.

మా పెద్ద అన్నగారు ఆలోచనాసముద్రమున నిమగ్నులైరి. నన్ను ఇంగ్లాండు పంపుటకు ఇంత ద్రవ్య మేది? మరియు నావంటి పిన్నవానిని ఒంటరిగా సముద్రముల కావలికి పంపఁదగునా?

మా అమ్మగారును చింతలో పడిరి. ఆమెకు నన్నెడఁబాయుట అనిష్టము. కాని నన్ను మానిపించుటకు ఇటు లొక యెత్తు ఎత్తెను: "మీ పినతండ్రిగారు ఉన్నారుకదా కుటుంబజ్యేష్ఠులు! మొదట వారితో ఆలోచింప వలయును. వారికి అంగీకారము అయ్యేనేని పిదప ఆలోచింతము." అని.

మా అన్నగారికి మరియొక ఆలోచన కలిగెను. 'పోరుబందరుపై మనకు కొంతహక్కు ఉన్నది. అచట లేలీగారు వ్యవహారాధికారులు. వారికి మన కుటుంబమనిన గౌరవము. మరియు పినతండ్రిపై ఆయనకు విశేషాభిమానము. నీ విద్యావ్యయమునకు సంస్థానము వారు కొంత సాయము చేయునటులు వారు తోడుపడవచ్చును' అని మా యన్న నాతో ననెను.

నాకు ఈ మాటలు బాగుగా ఉండెను. పోరుబందరునకు పోవ మూట కట్టితిని. ఆరోజులలో రైళ్లు లేవు. ఐదు దినములు ఎద్దుబండిమీఁద ప్రయాణము. నేను పిఱికివాఁడనని చెప్పనే చెప్పితిని. కాని ఆ సమయమున ఇంగ్లాండునకు పోవుదు మను ఆవేశముముందు నా పిఱికితనము పటాపంచ లాయెను. ధోరాజీ వఱకు ఎడ్లబండిలో పోయితిని. ఒంటె బండ్లకంటె ఒకనాఁడు ముందు పోవునని అటనుండి ఒంటెమీఁద పోయితిని. ఇదియే నాకు తొలిసారి ఒంటెపై పోవుట.

నేను పోరుబందరును చేరి మా పినతండ్రికి సాష్టాంగ నమస్కారములు చేసి అంతయు చెప్పితిని. వారు ఆలోచించి ఇట్లనిరి: "స్వధర్మమును రక్షించుకొనుచు ఇంగ్లాండునం దుండుట శక్యమని నాకు తోఁపదు. నేను వినిన విషయములఁబట్టి నాకు సందేహమే కలుగుచున్నది. నా చూచుచున్న ఈబారిస్టరులకును, తెల్లవారికిని భేదము

కానిపింపదు. వారికి ఆహారమునెడ విధినిషేధములు లేవు. చుట్ట లేక వారి నోరు ఎప్పుడును ఊరకుండదు. లజ్జ లేక వారు ఇంగ్లీషువారి ఉడుపులు ధరింతురు. ఇటు లుండుట మన కుటుంబసంప్రదాయము కాదు. నేను కొలఁదిలో తీర్థయాత్రకు పోవుచుంటిని. ఇఁక ఎన్నాళ్లో బ్రతుకను. కాటికి కాళ్లు చాఁచుకొని సముద్రయానమును ఎట్లు సమ్మతింప సాహసింతును? కాని నేను నీదారి కడ్డురాను. ఈవిషయమై నిక్కముగా కావలసినది మీ అమ్మగారి అనుమతి. ఆమె అంగీకరించునేని, పో, పరుగు! నేను అడ్డురానని ఆమెతో చెప్పు. నేనును ఆశీర్వదించి పంపుదును.”

‘నాకు కావలసినదియు అంతే. మా అమ్మగారి అనుమతిని పుచ్చుకొన యత్నింతును కాని మీరు లేలీగారికి సిఫారసు చేయరా!’ అని నేను అడిగితిని.

‘నే నెట్లు చేయఁగలను? అయితే అతఁడు మంచివాఁడు. నీవు ఉత్తరము వ్రాసికొనుము. మన కుటుంబమునుగూర్చి వారికి తెల్పుచో అతఁడు తప్పక మాటాడ నవకాశ మిచ్చును. మరియు సాయముకూడ చేయవచ్చును’ అనిరి.

మా పిన్నాయన నాకు కాసంత సిఫారసుముక్క ఏల వ్రాసి యీయ లేదో నేను చెప్పఁజాలను. నిషిద్ధమని వారి అభిప్రాయములో ఉన్న ఈనా విదేశ గమనమునకు తాము ప్రత్యక్షముగా సాయపడుటకు వెనుదీసిరని నాకు కొంచెముగా గుఱుతు.

లేలీగారికి ముందు ఒకజాబు వ్రాసి వారి యనుమతిని గొని వారిని దర్శింపఁబోయితిని. మేడమెట్లు ఎక్కుచు ఆయన నన్ను చూచి, ‘బి. ఏ. ప్యాసు కమ్ము! పిదప ననుఁ జూడ రమ్ము! నీకు ఇపుడు ఏమియు సాయ

ము చేయఁబడదు' అని రెండుమాటలు చెప్పి పైకి వెళ్లిపోయిరి. నేను దొరగారిని చూచుటకు చాల తయారుచేసికొంటిని. నేను మెలఁకువతో కొన్ని వాక్యములు వల్లించికొనిపోయితిని. వంగి వంగి రెండుచేతుల తో సలాముచేసితిని. కాని అవి యన్నియు ఉప్పునకుఁగూడ కా లేదు.

పిదప నా భార్యనగలపై దృష్టి పోయెను. మాఅన్నగారి యెడ నాకు పరమవిశ్వాసము కలదు. ఆయన ఉదారత నిస్సీమము. ఆయనకు నాపై పుత్రవాత్సల్యము.

నేను పోరుబందరును విడిచి రాజకోటకు వచ్చి జరిగినదంతయు చెప్పితిని. నేను జోషీజీతో ఆలోచించితిని. అక్కఱయగుచో అప్పు చేసియేని ఇంగ్లాండు వెళ్లుమని ఆయన సలహా యిచ్చెను. నా భార్య నగకట్టు రెండుమూఁడు వేలు చేయుననియు,దానిని అమ్మి ఇంగ్లాండు నకు పోదుననియు అంటిని. ఎటు లేని ద్రవ్యమును సమకూర్తునని మా అన్న వాగ్దానము చేసెను.

కాని మా అమ్మకు ఇంకను ఇష్టము లేదు. ఆమె నలుసులు ఏఱుఁదొడఁగెను. ఇంగ్లండులో యువకులు చెడిపోదురని ఆమె కెవరో చెప్పిరి. మరియొకఁడు గోమాంసము తిందురని, ఇంకొకఁడు కల్లులేనిది బ్రతుకనేలేరని చెప్పిరి. 'ఇది యంతయు నేమి?' అని ఆమె ప్రశ్నించెను.

నే నంటిని— 'నన్ను నమ్మవా? నేను నీకడ బొంకను. నేను ఇవి యేమియు ముట్టనని ఒట్టుపెట్టుకొందును. మరియు అటువంటి అపాయ మేదేని ఉన్నయెడల జోషీజీ నన్ను వెళ్లు మనునా?'

'నాకు నీపై నమ్మిక ఉన్నది కాని అంతదూర దేశమున ఉన్నచో ఎటులు నమ్ముట? నా కేమియు తోఁచుటలేదు. బేచరజీస్వామిని అడిగి చూతును' అని ఆమె యనెను.

# ౧౧ సీమకు ప్రయాణసన్నాహము.

బేచరజీస్వామి అసలు మోఢ్ వైశ్యుఁడు. పిదప జైన సాధువు ఆయెను. ఆయనయు జోషీజీవలెనే మాకుటుంబమునకు మేలు కోరు వాఁడు ఆయన నా పక్షమునకు వచ్చి, 'ఇతనినుండి మూఁడు వాగ్దానములఁ పుచ్చుకొని ఇంగ్లండునకు పంపవచ్చును' అని చెప్పి, 'మద్యమును, మాంసమును, మహిళను ముట్టను'నని నాచే ప్రమాణము చేయించిరి. ఇది జరిగినపిదప మా అమ్మ అంగీకరించెను.

హైస్కూలునందు నన్ను వీడుకోలుఁపుటకు సమ్మేళనము జరిగెను. రాజకోటలోని ఒకపిన్నవాఁడు ఇంగ్లాండు పోవుట ఒక అసాధారణ విషయము. నేను నా కృతజ్ఞత తెలుపుచు కొన్నిమాటలు వ్రాసితిని. కాని వానిని చదువ నాపని అట్టిట్లైనది. నాఁడు వానిని జదువ నాతల తిరిగినది. నా మేను వడఁకినది. ఇది నాకు గుఱుతు.

పెద్దల దీవెనలతో బొంబాయికి పయనమైతిని. బొంబాయికి ఇదియే నా ప్రథమప్రయాణము. మాయన్న నన్ను అనుగమించెను. కాని ఇల్లు అలుకఁగనే పండువా? బొంబాయిలో కొన్ని గండములు గడవవలసియుండెను.

## ౧౨

## జాతి బహిష్కారము

మా అమ్మ ఆజ్ఞను, ఆశీర్వాదమును బడసి పసుఁబాపను, భార్యను విడిచి అధికోత్సాహముతో బొంబాయికి బయలుదేఱితిని. జూన్ జులై నెలలలో భారత సముద్రము (Indian Ocean) చాల ఒడుదుడుకుగా నుండును. 'మీ తమ్మునికి సముద్రయానము ఇదియే మొదలు గాన నవంబరువఱకును వెళ్లుట మంచిది కాదు; మొన్న నీనడుమనే తుపానుచే ఒక స్టీమరుకూడ మునిఁగిపోయినది' అని కొందఱు మిత్రులు బొంబాయిలో మా అన్నకు చెప్పిరి. కావున వెంటనే వెళ్లుటకు మా అన్న అంగీకరింపలేదు. అచట ఒక మిత్రునియింట నాకు బస ఏర్పఱచి మా అన్న రాజకోటకు మరలి తన యుద్యోగమునఁ జేరెను. నాకుఁ గావలసిన ప్రయాణవ్యయమును మా బావదగ్గఱనిచ్చి నాకిమ్మనియు, వలసిన సాయమునంతయు చేయుఁడని తనమిత్రులతోడను చెప్పి పోయెను.

బొంబాయిలో నాకు ప్రొద్దు పోయెడిది కాదు రేయుంబవలు సీమ ప్రయాణపు కలవరింతలే.

ఇంతలో మా కులమువారిలో నా సముద్రయానమునుగూర్చి ఆందోళనము సాగెను. అంతవఱకు మా వర్ణమువారైన మోఢ్ బనియాలు ఎవరును సీమ త్రొక్కలేదు. నేను సీమకు పోఁదలఁచితిఁ గాన నన్ను వెలివేయవలయునని కులమున కొందఱకు ఆవేశము కలిగెను. అందులకు ఒకసభ జరిగెను. కులస్థులు చాలమంది వచ్చిరి. నన్ను పిలుచనంపిరి. నాకు

అంత సాహసము ఎటులు వచ్చెనో నాకే తెలియదు; నే నాసభకు నిర్భయముగా వెళ్లితిని. ఆ కులపు పెద్దయగు సేటునకును, మాతండ్రికిని నెయ్యము కలదు. మరియు ఆయన మాకు దూరబంధువు.

'కులధర్మమునుబట్టి నీవు సీమ కేఁగుట పాడిగాదు. సముద్రయానము మనకు నిషేధము. మరియు అచట ధర్మపాలనము చేయుట అశక్యమనియు వింటిమి. అచట దొరలతో కలిసి తినుట, త్రావుట తప్పని సరి' అని సేటు నాతో అనెను.

నేనిటులు బదులు పల్కితిని:—'సీమకు వెళ్లుట ఎంతమాత్రము ధర్మేతరము కాదు. నే నచటికి విద్యకొఱకే పోవుచున్నాను. తాము దేనికి భయపడుచున్నారో వానిని తాఁకనని మా అమ్మచెంత శపథము చేసితిని. అది నన్ను కాపాడఁగలదు'.

'నీ వక్కడికి వెళ్లిన పిదప ధర్మమెంతయు సాగకుండుట నిక్కము. మీతండ్రిగారికిని, నాకును ఎట్టిచెలిమి కలదో నీ వెఱుఁగుదువు గాన నామాట నీవు వినవలెను' అని సేటు పల్కెను.

'అయ్యా, నే నా చెలిమి నెఱుఁగుదును. మీరు నాతండ్రివంటి వారే కాని సీమకు వెళ్లవలె ననునానిశ్చయమును మార్చుకొనఁజాలను. వేఱుఉపాయము లేదు. మా తండ్రిగారికి మిత్రుఁడును, సలహా చెప్పువాఁడును, విద్వాంసుఁడును అగు ఒకబ్రాహ్మణుఁడు కలఁడు; ఆయనకు సీమకు వెళ్లుటయం దేమియు దోషము కానరా లేదు. మా అమ్మగారును, అన్నగారును అంగీకరించిరి' అని నే నంటిని.

'కులమువారి ఆజ్ఞను నీవు మన్నింపవా?'

'నాకు వేఱుదారి లేదు. కులమువారు దీనిలో కల్పించుకొనఁ గూడదనియే నా తలఁపు'.

ఈ ప్రత్యుత్తరముతో సేటునకు ఆగ్రహము కలిగి నాలుగు చీవాట్లు వేసినాడు. నేను నిబ్బరముగా కూర్చుంటిని.

'నేడు ఇతనిని వెలివేసితిని. వీనికి సాయముచేయువారికిని, వీనిని సాగనంపుటకు స్త్రీ మరు రేవునకు పోవువారికిఁగూడ ఒకరూపాయి పావలా జరిమానా వేసితిని' [సాలగ్రామదానము] అని సేటు ఆజ్ఞాపించెను.

నేను ఇసుమంతయు చలింపలేదు. సేటుకడ సెలవు గైకొని వెడలివచ్చితిని. మా అన్నకు ఈవిషయము తెలిసినచో వెనుకకు పీఁకు నేమో అని అనుకొంటిని గాని ఆయన 'కులమువారు వెలివేసినను భయపడవలదు; నీవు సీమకు వెళ్లుట మానవలదు.' అని వ్రాయుట పరమ భాగ్యము.

ఇది జరిగిన పిమ్మట నాకు తొందర ఎక్కువ ఆయెను. వీరందఱును మా అన్నగారికి ఎక్కువ ఒత్తిడి కలిగించినచో వారి అభిప్రాయము ఎక్కడ మాఱునో యని నేను తొట్రుపడుచుండఁగా, జునఘుడు వకీలు ఒకఁడు ఇంగ్లండునకు బారిస్టరు పరీక్షకుఁగాను సెప్టెంబరు నాలుగవ తేదీని బయలుదేఱు ఓడపై పోవుచున్నాఁడని వార్త వచ్చెను. నే నావార్త మా యన్నగారి మిత్రులకు ఎఱిఁగించితిని. ఇట్టి సహవాసము పోఁగొట్టుకొనఁ గూడదని వారును అంగీకరించిరి. ఇఁక అవకాశము ఎంతయో లేదు. మా అన్నకు తంతి నీయఁగా ఆయనయు అంగీకరించెను. మూబావను పైక మిమ్మని అడిగితిని. అతఁడు సేటు ఆజ్ఞ ప్రస్తావించి, 'నన్ను వెలివేసెదరు గాన ఈయఁజాల'ననెను. పిదప నేను మా కుటుంబమునకు మిత్రులగు ఒకరి యింటికి వెళ్లి, నా పయనమునకు ఆవశ్యకమగు సొమ్మును బదులిచ్చి మా అన్నవద్ద వసూలు చేసికొనుఁడని

కోరితిని. ఆయన నాకోరిక నెఱవేర్చుటయే కాక నన్ను చాల ప్రోత్సహించెను. వారి కెంతయు కృతజ్ఞత తెలుపుకొంటిని. వారు ఇచ్చినడబ్బును పుచ్చుకొని వెంటనే టిక్కెట్టు కొంటిని. నే నిఁక ప్రయాణమునకు పరంజామా సిద్ధముచేసికొనవలెను. అనుభవశాలియగు ఒక మిత్రుఁడు బట్టలు మున్నగు వానిని తయారుచేయించెను. అవి చాల వింతగా నుండెను. అందు కొన్ని నాకు బాగున్నవి; కొన్ని బాగులేవు. ఇటీవల నేను తాల్చుటకు అంగీకరించు నెక్‌టై ఆనాఁడు ఏవగించుకొంటిని. పొట్టి చొక్కా (జాకెట్టు) తొడుగుకొనుట నాకు సిగ్గాయెను. ఇంగ్లాండునకు పోవు ఉత్కటమగు ఇచ్ఛముందు ఈ అనిచ్ఛకు అట్టే తావు లేదు. ఇఁక పయనమున కావలసిన తినుబండము నాకడ నిండుగాఁ గలదు. జునఘడ్ వకీలు త్ర్యంబకరాయి మజిముదారుగారి గది (కేబిను) లోనే నా మిత్రులు నాకొక శయ్యను (బెర్తు) పుచ్చుకొనిరి; మఱియు వారితో నాకు పరిచయము గలిగించిరి. ఆయన వయసు వాఁడు; జ్ఞానము, లోకానుభవము కలవాఁడు. నేను ఇంకను లోకానుభవము లేని పదునెనిమిదేండ్ల కసరుగాయను. మజముదారుగారు 'ఇతని గుఱించి మీరు భయపడవల' దని చెప్పిరి.

ఇటులు నేను ౧౮౮౮ సం. ౪వ సెప్టెంబరు నాఁడు బొంబాయి నుండి బయలుదేఱితిని.

## ౧౩

## తుదకు సీమ

నాకు సముద్రయానము వలన తఱుచు అందఱకు వచ్చు వాంతి మొదలగు వ్యాధి రానేలేదు. కాని దినములు గడచిన కొలఁది ఆరాటముగా నుండెను. కొట్టు పెత్తనగానితో మాటలాడుటకుఁగూడ నాకు కొంకు. నాకు ఇంగ్లీషు మాటలాడుట ఎప్పుడును అలవాటు లేదు. రెండవ సెలూనులో ఒక్క మజుముదారుగారు తక్క తక్కినవారందఱు ఆంగ్లేయులే. వారితో నేను మాటలాడఁజాలకుంటిని. వారు నాతో మాటలాడ తటస్థించినపుడు వారి ఉద్దేశము తెలియునది కాదు. తెలిసినపుడును బదులు చెప్పఁజాలకుంటిని. నేను పైకి తెలియఁ జెప్పుటకు ముందు ప్రతివాక్యమును లోపల కూడఁబలికికొనవలసి వచ్చెడిది. భోజనసమయములందు కత్తులను, ముల్లుగరిటెలను వాడుట నే నెఱుఁగను; మఱియు చేసినపదార్థములలో మాంసము లేని పదార్థ మేదో అడుగుటకు నాకు ధైర్యము చాలదు. అందువలన నే నెన్నఁడును భోజనశాలలో పదిమందితో కలిసి భుజింప లేదు. ఎప్పుడును నా గదిలోనే భుజించుచుంటిని. భోజ్యము లన్ననో, ముఖ్యముగా నేను తెచ్చుకొన్న చిఱుదిండ్లును, పండ్లును. మజుముదారుగారికి ఇట్టి బాధ లేదు. ఆయన అందఱిలోను కలిసిపోఁగలఁడు. ఆయన అందఱితోను కలిసి మెలిసి స్టీమరు పైతట్టున సంచరించుచుండఁగా, నేను పగలు నా గదిలో దాఁగియుండి, సాయంకాలమున కొలఁదిమంది ఉన్నప్పుడే పైకిఁ బోవ సాహసించుచుండువాఁడను. మజుముదారుగారు నీవును

చాటసారు లందఱితో కలిసిమెలిసి యుండుమనియు, బిడియపడక మాటాడుమనియు ఎల్లప్పుడు చెప్పుచుండెను. మరియు లాయరులు నోరు కలవారుగ ఉండవలయునని తన అనుభవములు కొన్ని చెప్పెను. మరియు అవకాశము చిక్కినప్పుడెల్ల ఇంగ్లీషు మాటలాడుమనియు, తప్పులకు లెక్క గొనవలదనియు, పరభాషలో తప్పులు రాక మాన వనియు వారు బోధించిరి. కాని ఏదియు నా జంకును తీర్చలేదు.

ఒక ఆంగ్లేయుఁడు దయతో నన్ను మాటలలోనికి దింపెను. ఆతఁడు నా కంటె పెద్ద. నీవు ఏమి తింటివి? నీ కేమిపని? నీ వెక్కడికి వెళ్లుచుంటివి ? నీ కే మోమోట మేమిటి ?-ఈరీతిగా ప్రశ్నించెను. ఆయన నన్ను అందఱితో పాటు పంక్తికి రమ్మనియు సలహా ఇచ్చెను. నా మాంసత్యాగదీక్షకు నవ్వి,మిత్రుని విధమున, మేము ఎఱ్ఱ సముద్రము (Red Sea) లో ఉండఁగా, ఇటులు చెప్పెను—'బిస్కే సముద్ర మును చేరనంతవఱకు నీవనుకొన్నటు లుండును గాని పిమ్మట నీ నియ మమును మార్చుకొనవలసి యుండును. మాంసము తిననియెడల బ్రతు కఁజాలనంత చలి ఇంగ్లండులో ఉండును.'

'అచట మాంసము వర్జించియు బ్రదుకవచ్చునని జనులు చెప్పఁగా వింటినే' అని నే నంటిని.

'అది వట్టి కల్ల. నా యెఱుకలో అట్టివా రెవరును లేరు. ఒకటి చూడు: నేను సారా త్రావుచున్నను నిన్ను త్రావు మంటినా? కాని మాంసము తినితీరవలెను. తినకున్న బ్రదుకఁజాలవు.'

'మీ ఉపదేశమునకు వందనములు కాని నేను మాంసము ముట్టనని మా అమ్మగారికడ యథావిధిగ ప్రమాణముచేసితిని కావున తినఁజాలను. అది లేకుండ జరుగదేని ఇంటికి తిరిగి వెళ్లుటయే మేలని తలఁతును.'

మేము బిస్కే సముద్రమునఁ జొరఁబడితిమి కాని మద్యమాంసముల అక్కఱ కానరాలేదు. మాంసము ముట్టలేదని ఉల్లాకులు (సర్టిఫికేటులు) పుచ్చుకొమ్మని ఇంటికడ చెప్పిరి. కావున నే నా ఆంగ్ల మిత్రుని ఒక సర్టిఫికెట్టు ఇమ్మని కోరితిని. అతఁడు సంతోషముతో ఇచ్చెను. నేను దానిని కొంతకాలము ముల్లెవలె దాఁచుకొంటిని. మాంసభోజులు కూడ మాంసభోజులు కానియటులు సర్టిఫికేటులను సంపాదించుచుండుట చూఁచినపిమ్మట నాకు దానిపై మోజు తగ్గెను. నా మాటను నమ్మనిచో సర్టిఫికేటు సంపాదించుకొని మాత్రము లాభమేమి?

ఎట్లో ప్రయాణము ముగిసి మేము సౌతాంప్టను చేరితిమి. అది శనివారమని అనుకొందును. నా మిత్రులు తెల్ల ఉన్నిసూటు (లాగు, కోటు, వేస్టుకోటు) తయారు చేయించి యిచ్చిరి. ఓడలో నల్ల సూటే ధరించితిని. రేవులో దిగినపుడు సూటు బాగుగా ఉండునని దాని తాల్చితిని. అవి సెప్టెంబరు తుది దినములు. అచట నున్న వారిలో నేను గాక మరియెవ్వరును అట్టిదుస్తులఁ దాల్పలేదు. చాలమంది తమ సామగ్రిని తాళపుచెవులతో కూడ గ్రిండ్లే కంపెనీ ఏజంటు వశమున ఉంచిపోవుచుండుట చూచి నేనును అట్లు చేయవలయునని నా సామానును తాళపుఁజెవులతో అతని వశముననే ఉంచితిని.

నా కడ డాక్టరు ప్రాణజీవన మెహతా, దలపతిరాం శుక్ల, రణజీత్ సింహ మహారాజు, దాదాభాయి నౌరోజీగార్ల పేర నామిత్రులు ఇచ్చిన సిఫార్సు ఉత్తరము లున్నవి. లండనులో విక్టోరియా హోటెలులో బసచేయుఁడని ఓడలో ఒకరు మాకు సలహా ఇచ్చిరి. దాని ననుస

రించి నేనును మజుముదారు గారును ఆ హోటేలునకే వెళ్లితిమి. ఏటికేసినటులు తెల్లదుస్తులలో ఉన్నది నే నొక(డనే కాన అదియే దుర్భరమాయెను. మఱియు మఱునా(డు ఆదివారమగుటచే గ్రిండ్లే కంపెనీ వారు నా(డు సామానుల నియ్యరని హోటెలులో తెలిసినందున నా రుసరుస మఱికొంత ఎక్కుడాయెను.

సౌతాంప్టనునుండి డాక్టరు మెహతాగారికి నేను తంతినిచ్చితిని గాన ఆయన ఆదివారమున రాత్రి ఎనిమిది గంటలకు హోటలునకు వచ్చి నన్ను చాల నాదరించెను. నా ఉన్నిదుస్తుల( జూచి ఆయన నవ్వెను. మాటలాడుచుండ(గా ఆయన టోపిని అచింతితముగా తీసికొని దాని మృదుత్వమును తెలిసికొన(గోరి అవకతవకగా చేతితో అటిటు నిమిరి దానిపై రోమములను కల(చితిని. మెహతాగారు కొంచెము కోపదృష్టితో నన్ను వారించిరికాని అప్పటికే పొరపాటు జరిగిపోయినది. ఈ ఘటన ముందరికి మందలింపు. ఇది నాకు పాశ్చాత్యదేశాచారమున మొదటి పాఠము._అందుల విశేషములగూర్చి మెహతాగారు ఇటులు ఉపదేశించిరి: ఇతరుల వస్తువుల తాకకుము. హిందూదేశము నందువలె ఇచట ప్రథమ పరిచయముననే ఎవరిని ప్రశ్నలు వేయకుము. బిగ్గఱగా మాటలాడవలదు. మనము హిందూదేశములో 'అయ్యా' (Sir) అని సంబోధించినటులు ఇచట సంబోధింపవలదు. ఏలన ఇచట నౌకరులును తాబేదారులును మాత్రమే వారి యజమానులను 'అయ్యా' అని సంబోధింతురు_ఇత్యాది. హోటెలు వ్యయ మధికమగును గాన ఏదో ఒక కుటుంబమున ప్రవేశింపుమని ఆయన చెప్పెను. సోమవారము ఆవిషయమును నిర్ధారింప నిశ్చయించితిమి.

శ్రీమజముదారుగారికిని, నాకును హోటెలు కష్టముగానే యుండెను. మిగుల వ్యయము కూడ. మాల్టానుండి సింధుదేశీయు లొకరు

మాతోపాటు వచ్చిరి. వారికిని మజముదారుగారికిని నేస్తము కలిగెను. వారికి లండను క్రొత్తగాదు. ఆయన మాకు అద్దెగదులు విచారింతుమని చెప్పెను. మేమును అందు కంగీకరించితిమి. సోమవారమునాఁడు గ్రిండ్లేకంపెనీనుండి మా సామానులు రాఁగనే హూటెలువారికి ఈయ వలసిన సొమ్మును ఇచ్చివేసి మా సింధుమిత్రుఁడు మాకుఁగాను అద్దెకుఁ గొన్న గదులలో ప్రవేశించితిమి. హోటెలువారు మూఁడు పౌనులు అనఁగా మూఁడు కాసులు పుచ్చుకొన్నటులు గుఱుతు. నేను గుండెలు బాఁదుకొంటిని. నే నింత డబ్బిచ్చినను కటిక ఉపవాసము చేయవలసి వచ్చెను. ఏలన నాకేదియు రుచింపలేదు. ఒకపదార్థము త్రోసివైచి మరియొకటి తెమ్మందునుగదా అదియు నంతే. డబ్బో, రెంటికిఁగూడ గూబలు నులిమి వసూలు చేసిరి. ఇంతవఱకు బొంబాయినుండి నేను తెచ్చుకొన్న పదార్థములు తినియుంటిని.

ఈక్రొత్తగదులలోఁగూడ నాకు సరిగా లేదు. నా మనస్సు ఎప్పుడును దేశముమీఁద, ఇంటిమీఁద. అమ్మమీఁద బెంగ. రాత్రి ఇంటి సంగతులు గుర్తు వచ్చి కన్నీరు ఓడుచుండుట వలన నిద్ర యను మాటలేదు. నాకష్టము నొకరితో చెప్పుకొనునది కాదు. ఒకవేళ చెప్పి కొనినను ఫలమేమి? ఇది పోవుఉపాయము లేదు. ప్రతిదియు క్రొత్త. ప్రజలు, వారి ఆచారములు, వారి యిండ్లుగూడ క్రొత్త. పాశ్చాత్య దేశాచారము నాకు సరిక్రొత్త కావున కడు మెలఁకువతో ఉండ నాయెను. శాకాహార ప్రతిజ్ఞ యొకటి పైపెచ్చు. ఇఁక భోజ్యములు కూడ అరుచ్యములు. నా పని అటుచూచిన నుయ్యి, ఇటుచూచిన గొయ్యి. ఇటు ఇంగ్లండులో ఉండలేను, అటు ఇండియాకు మరలను లేను. 'రానే వచ్చితివి ఈమూఁడేండ్లు ఉండ నిశ్చయింపుము' అని నా అంతరాత్మ బోధించెను.

# ౧౪

## నా అభిరుచి

డాక్టరు మెహతాగారు, నేను విక్టోరియాహోటెలులోనే ఉందు ననుకొని సోమవారమునాఁడు అచటికి వెళ్లిరి. మేము అచటి నుండి వెళ్లితిమని ఎఱిఁగి మా క్రొత్తబస విలాసము తెలిసికొని మరల అక్కడికి వచ్చిరి. నేను ఓడలో పట్టి తెలివితక్కువచే తామర తెచ్చుకొంటిని. ఎట్లనఁగా—మేము స్నానాదులకు సముద్రోదకము ఉపయోగించుచుంటిమి. అందు సబ్బు కరఁగదు. నాగరకత అనుకొని నేను సబ్బు రుద్దుకొనుచుంటిని. దానివలన శరీరము పరిశుభ్రము అగుటకు బదులు జిగటలు సాగ నారంభించెను. అందువలన తామర పుట్టెను. నేను డాక్టరు మెహతాగారికి చూపఁగా వారు అసెటిక్ ఆసిడ్ (acetic acid) పూయుమనిరి. అది పూయఁగనే భగ్గున మండి ఏడ్పు వచ్చుట నాకు గుఱుతు. నా గదిని, అందలి ఏర్పాటును వారు పరీక్షించి బాగుగా లేదనునటులు తలత్రిప్పిరి. 'ఇచట బాగుగ లేదు. మనము ఇంగ్లాండు వచ్చుట విద్యాభ్యాసమునకే యైనను విశేషముగ ఇచటి ప్రజల ఆచారవ్యవహారములఁ గూడ గ్రహింపవలయును. ఇందులకు ఎవరి కుటుంబముననో ఒకరి కుటుంబమున ఉండుట ఆవశ్యకము. దానికి ముందు ఎవరికడనేని ఆ పద్ధతి నేర్చుకొనవలెను. నే నట్టిచోటునకు నిన్ను తీసికొని వెళ్లెదను రమ్ము' అని మెహతాగా రనిరి.

నేను కృతజ్ఞతతో ఇయ్యకొని వారి మిత్రుల బసకు చేరుకొంటిని. ఆ మిత్రుఁడు నన్ను సోదరునివలె చూచెను. ఇంగ్లీషువారి ఆచారాదుల

ను శిక్షించెను. ఇంగ్లీషు మాటలాడుటయు అలవాటు చేసెను. నా భోజనవిషయము మాత్రము కడు కష్టమాయెను. ఉప్పును పోపును లేని కూరలు నాకు సయింపవు. నాకేమి చేయవలెనో భోజనము పెట్టు నామెకును తోచకుండెను. ఉదయమున ఓటుపిండిజావ (oatmeal porridge) ఉండెడిది. దానితో చాలవట్టు కడుపు నిండెడిది కాని మధ్యాహ్నమునను, సాయాహ్నమునను, ఏమియు రుచించునది కాదు. ఇంచు మించు ఉపవాసము. ఆ మిత్రుఁడు మాంసము తినవలెనని ప్రతిదినమును వాదించుచుండెను గాని నేను నా శపథమును తెలిపి ఊరకుండువాఁడను. మధ్యాహ్న సాయాహ్నములందు మురబ్బా, ఆకుకూర, రొట్టెయు ఉండెడివి. నేను బాగుగా తినువాఁడ నగు టచే అది సరిపోవునది కాదు. మరల నడిగి వేయించుకొనుట ఒప్పుకా దని మరి రెండు మూఁడు రొట్టెముక్క లడుఁగుటకు బిడియపడువాఁడను. పైఁగా ఆ రెండు పూఁటలలో నేదో ఒకపూఁట పాలు శూన్యము. ఈ పద్ధతి చూచి పట్టఁజాలక నా మిత్రుఁడు "నీవు నాసోదరుఁడవై యుండుచో ఈపాటికి మూట కట్టించియుందును. ఇచ్చట తప్పని సరియైన విషయము తెఱుఁగక, చదువురాని నీ తల్లికడ చేసిన ప్రమాణమునకు ఏమి విలువ? అది ప్రమాణమే కాదు. అది 'లా' ననుసరించియు ప్రమాణముగా పరిగణింపఁబడదు. అట్టి ప్రమాణమునకు బద్ధుఁడవై యుండుట అజ్ఞానము. ఇదిగో చెప్పుచున్నాను. ఈ పట్టుదల వలన ఇచ్చట నీకేమియు మేలుకలుగఁబోదు. మఱియు నీవు మాంసము తిన్నటులు, అది రుచించినటులు ఒప్పుకొనుచున్నావు. ఆవశ్యకము కాని చోట తిని ఆవశ్యకమగుచోట మానుచున్నావు. ఔరా అభాగ్యము!" అని అతఁడనెను.

## ౧౪ నా అభిరుచి

నేను మాత్రము చలింపలేదు. దీనిగురించి రోజును వాదప్రతి వాదములు జరుగుచునే యుండెను. ఆయన వాదించినకొలఁది నేను మరి కొంచెము బిగియుచుంటిని. నేను ప్రతిదినము భగవంతుని రక్షింప ప్రార్థించుచుంటిని. ఆ రక్షణయు కలుగుచుండెను. నేనటులు ప్రార్థించుట నాకు భగవంతునిఁగూర్చి బాగుగా తెలిసి కాదు. నన్ను అటులు చేయించునది నమ్మకము—అదియు చిన్ననాఁట రంభ విత్తినవిత్తనమే.

ఒకనాఁడు నా మిత్రుఁడు బెంథంగారు వ్రాసిన Theory of Utility అను గ్రంథమును చదువసాగెను. నా పని అయినది. ఆ భాష నాకు తెలియలేదు. అతఁడు బోధింప మొదలిడెను. నేను ఇటులంటిని—"అయ్యా, నన్ను క్షమింపుఁడు. ఈ గహనవిషయములు నాతల దాఁటినవి. మాంసాహార మావశ్యకమని ఒప్పుకొందును. కాని నేను నా ప్రమాణమును జవదాఁటను; దాని గురించియు వాదింపను. నేను మీతో వాదించి జయింపలేనని ఒప్పుకొందును. అజ్ఞుఁడనని గాని, పెంకెననిగాని, తలఁచి నన్ను విడిచిపెట్టుఁడు. తమ ప్రేమకు మెత్తును. తాము నా హితైషులని ఎఱుఁగుదును. మీరు నా మేలునకే మరల మరల చెప్పుచున్నారనియు తెలియును. కాని నేను నా నిశ్చయము విడువజాలను. ప్రతిజ్ఞ ఎన్నఁడును ప్రతిజ్ఞయే. అది అనుల్లంఘనీయము."

నామాటల కతఁడచ్చెరువొందెను. అతఁడా పుస్తకము మూసి, 'మంచిది. ఇఁక వాదింపను' అనెను. నేను సంతోషించితిని. అతఁడా విషయమై మరల నెన్నఁడును వాదింపలేదు గాని నన్ను గురించి యాతఁడు చింతించుట మాత్రము మానలేదు. అతఁడు పొగ త్రాగును; సారా త్రాగును; కాని, నన్ను ఎపుడుగాని త్రాగు మనలేదు. అసలు ఆ రెండును నాకు వలదు అని చెప్పెను. నేను మాంసము తిననిచో

నాదారుపడిపోవుదుననియు, ఈరీతిగా నున్నచో నాకు ఇఁక సీను ఇంద దనియు ఆయనకు తెంగ.

ఇటులు నే నొకనెల ఉమేదువారీ చేసితిని. ఆ మిత్రుని యిల్లు 'రిచ్‌మండు'లో కలదు. కావున వారమునకు ఒకటి రెండు మాఱుల కంటె లండను పోవ వీలులేదు. కావున నా కొకకుటుంబమున బస ఏర్పా ఉపవలయునని డా|| మెహతాగారును, దలపతరాం శుక్లాగారును నిశ్చ యించిరి. వెస్టు—కెన్సింగ్టనులో ఒక ఆంగ్లో ఇండియను కుటుంబమున శ్రీశుక్లాగారు నాకు వసతి ఏర్పటిచిరి. ఆ యింటియామె వితంతువు. ఆమెకు నా శపథ మెఱిఁగించితిని. ఆమె నన్ను మెలఁకువతో చూతు ననెను. నే నచట ప్రవేశించితిని. కాని అచటఁగూడ నాకు కటిక ఉపవాసమే. తినుబండము కొంత పంపుటకుఁగాను ఇంటికి వ్రాసితిని గాని అప్పటి కింకను రాలేదు. ప్రతిదియు అరుచ్యము. 'ఇది బాగుగా నున్నదా?' అని ఆమె ప్రతిదినము ప్రశ్నించునది కాని ఆమె ఏమి చేయఁ గలదు? నా బిడియము ఎప్పటట్లనే యుండెను. నా ముందు పెట్టిన దానికంటె ఎక్కువ యేమియు అడుగ లేకుంటిని. ఆమెకు ఇరువురు కూఁతుండ్రు. వారు చెటియొక రొట్టెముక్కను బలవంతముగా వేయు చుండిరి. రొట్టెకు రొట్టె వేసినఁగాని నాకు చాలదని వారికి తెలియదు.

నా కిప్పటికి నిలువ చిక్కెను. నే నింకను సరిగా చదువు మొద లిడలేదు. శుక్లాగారి ధర్మమా అని వారిచ్చిన వార్తాపత్రికల చదువు చుంటిని. ఇండియాలో నే నెన్నఁడు అట్టిపని చేయలేదు. కాని ఇచట ప్రతిదినము చదివి వానియెడ రుచి కల్పించుకొనఁగలిగితిని. డెయి లీన్యూస్, డెయిలీ టెలిగ్రాఫ్, పాల్‌మాల్ గెజెట్ రోజును చూచెడి వాఁడను. కాని చదువుటకు గంటకంటె ఎక్కువ పట్టెడిది కాదు.

ఇఁక నేను ఊరు తిరుగ మొదలుపెట్టితిని. మాంసము లేని దుకాణములు (restaurant) వెదుకఁ జొచ్చితిని. నగరమున అట్టివి కొన్ని కలవని గేస్తురాలు (landlady) తెలిపెను. నేను ప్రతిదినము పది పండ్రెండు మైళ్లు తిరిగి చవుకహోటలు దుకాణములో కడుపునిండ రొట్టె తినుచుండువాఁడను గాని ఎప్పుడును తృప్తి లేదు. ఇట్లు ఊరు తిరుగుచుండఁగా ఒకనాఁడు ఫారింగ్డన్ వీథిలో శాకాహారాలయము (vegetarian restaurant) పట్టుకొంటిని. తనకు కావలసిన వస్తువు దొరకినపుడు బాలునికి ఎట్టి సంతసము కలుగునో దానిఁ జూడఁగనే నాకును అట్టి సంతసమే కలిగెను. నేను లోపలికి వెళ్లకముందు ద్వారసమీపమున ఒక గాజు కిటికీలో అమ్మకమునకు ఉంచిన కొన్ని పుస్తకములను చూచితిని. వానిలో Salt's Plea for Vegetarianism అను పుస్తకము చూచి ఒక షిల్లింగునకు దాని కొని తిన్నగా భోజనశాలలోనికి వెళ్లితిని. నేను ఇంగ్లాండులో కాలు పెట్టిన పిదప కడుపార భుజించిన దానాఁడే. భగవంతుఁడు నన్ను రక్షింప వచ్చినటు లుండెను.

నేను సాల్టుగారి పుస్తకమును సంపూర్ణముగా చదివితిని. అది నాకు నచ్చెను. ఈ పుస్తకము చదివిననాఁడు మొదలుకొని మనఃపూర్వకముగా నేను శాకాహారినైతినని చెప్పుకొనవచ్చును. నేను మా అమ్మగారి ముందు ప్రమాణము చేసిన దినము నాకు ఆనందదాయకమాయెను. నేను చేసిన ప్రమాణమును, సత్యమును అనుసరించి అప్పటికి మాంసము త్యజించినను, ప్రతి హిందువును మాంసభోజి కావలెననియు, నేనును ముందు ఒకనాఁడు స్వతంత్రముగాను, బహిరంగముగాను మాంసభోజిని కాఁగలననియు, అందులకు అందఱను తయారు చేయుదుననియు ఇచ్ఛగించితిని. కాని నే నిప్పుడు నిర్ణయించుకొనిన శాకాహారము ఇప్పటినుండియు వ్యాప్తి

## ౧౫

### ఆంగ్లవేషము

దినదినము నాకు శాకాహారమునెడ నమ్మకము పెరుఁగసాగెను. సాల్టుగారి పుస్తకము చదివిన పిదప ఆహారవిషయములను గూర్చిన పుస్తకములను చదువవలె ననుఆసక్తి మెండాయెను. దొరకిన పుస్తకములనెల్ల చదివితిని. వీనిలో హోవర్డు విలియమ్సుగారు వ్రాసిన 'ఎతిక్స్ ఆఫ్ డయట్' అను గ్రంథ మొకటి. అందు ఆదికాలము నుండి నేఁటివఱకు మనుష్యుల ఆహారములనుగూర్చి చర్చ కలదు. మరియు అందు పైథాగరస్, జీసస్ మొదలుకొని నేఁటివఱకును ఉన్న మత కర్తలును, ప్రవక్తలును అందఱును ఆకు బువ్వయే తిన్నవారు అని నిరూపింపఁబడినది. డాక్టర్ ఆనా కింగ్స్‌ఫర్డ్ అనునామె వ్రాసిన The Perfect Way in Diet అను గ్రంథము ఉత్తమ మైనది. డాక్టరు అల్లిన్సన్‌గారు ఆరోగ్యమును గుఱించి వ్రాసిన వ్రాఁతలు ఉపాదేయములు. ఆయన రోగుల ఆహారపద్ధతిని నియమించి దాని వలన రోగముల కుదుర్చు ప్రణాళికను ఒకటి చూపించెను. ఆతఁడు ఆకు బువ్వయే తినును. తనకడకు వచ్చు రోగులకుఁగూడ ఆకుబువ్వయే తినక తప్పదని చెప్పును. ఈ గ్రంథములను అన్నిటిని చదివినందువలన ఆహార పరీక్ష నాజీవితమున ఒక ముఖ్యవిషయ మాయెను. ఈ పరీక్ష ఆరంభించుట ఆరోగ్యము కొఱకే యైనను పిదప పిదప ఈ శాకాహార విధానమునకు ధర్మదృష్టియే ప్రధానహేతు వాయెను.

## ౧౫. ఆంగ్లవేషము

ఇది యిటు లుండఁగా, నా మిత్రునకు నా భోజనమును గుఱించిన బెంగ పోలేదు. మాంసము తిననిచో నేను నానాఁటికి చిక్కిపోదుననియు, మరియు ఇంగ్లీషువారిలో కలిసియుండలేనందున మందుఁడనయిపోదుననియు తలఁచి నన్ను మాంసము తినుమని పట్టుపట్టెను. ఇది యంతయు అతి ప్రేమచేతనే. నేను శాకాహారగ్రంథములను చదువుచుండుటచే నాకు విపరీతములు కూడ పుట్టునని అతనికి తోఁచెను. మఱియు నేను నా చదువు మాని ఆహారపరిశోధనలతో కాలము గడపుచు వ్యర్థుఁడ నయిపోదునని అతఁ డెంచెను. ఇటులు తలఁచి నన్ను మార్చుటకు చరమ ప్రయత్న మొకటి చేసెను. ఒకనాఁడు నన్ను నాటకమునకు రమ్మని పిలిచెను. నాటకము చూడఁబోవుముందు హోల్ బర్న్ రెస్టరెంటులో మా భోజనము. అది నా కొకనగరువలె నుండెను. విక్టోరియా హోటెలు వదలినపిదప అంతపెద్ద హోటెలును నేను చూడలేదు. విక్టోరియా హోటెలు నాకు అనుభవము కలిగించుటకు ఆట్టే ఉపయోగింపలేదు. ఏలనఁగా నే నచట ఇతికర్తవ్యతామూఢుఁడనై యుంటిని. నన్ను ఈ హోటెలునకు తీసికొనిపోవుచో అక్కడ పలువురు భుజించుచుండువారు ఉందురనియు, నేను మధ్య ఏమి ప్రశ్నించినను అవినయమగుననియు అతఁడు తలఁచి ఈ యెత్తు ఎత్తెను. మేము పలువుర నడుమ ఒకబల్లముందు కూర్చుంటిమి. మొదటి వాయి 'సూప్'. అది దేనితో చేసిరో అని నాకు విచికిత్స. కాని మిత్రుని అడుగరాదు. కాన వడ్డనవానిఁ బిలిచితిని. అది కనిపట్టి నా మిత్రుఁడు ఏల పిలుచుచుంటివని గట్టిగా అడిగెను. 'ఇందు మాంసము కలియలేదుగదా' అని అడుగుటకని సంకోచించుచునే తెలిపితిని. 'నీవు ఇట్టి సమాజములో ఉండఁదగవు. ఎటులు మెలఁగవలయునో నీకు తెలియనియెడల ఇంకొక భోజనశాలకు పోయి భుజించి నా వచ్చువఱకును వెలుపల వేచియుండుము'

అని అతఁడు కోపముగా అనెను. నే నీప్రస్తావనకు సంతసించి నిర్గమించితిని. దాపుననే ఒక శాకాహారశాల కలదు గాని ప్రొద్దుపోవుటచే అది మూయఁబడెను. ఆరేయి నాకు అన్నము సున్న. పిదప మే మిరువురము ను నాటకము చూడఁబోతిమి. నా మిత్రుఁడు ఈ ఘటననుగూర్చి మరి యెన్నఁడును ఒక మాటయేని తేలేదు. నాకును అట్టి పనితో పని లేదుకదా!

మా కిదియే తుట్టతుది మిత్ర కలహము. దాన మా మైత్రి కెట్టి భంగమును కలుగలేదు. ఈతని ప్రసయామునకు మూలము ప్రేమయే. కావుననే ఆచరణమందును, భావమందును మాకు భేదము ఉన్నప్పటికి ఆయనపై నాకు ఆదరము మెండాయెను.

నేను మాంసాహారము వర్జించినను మిగిలిన వ్యవహారములలో ఆంగ్లేయసమాజమున సరిగా మెలఁగికొనఁగలనని నామిత్రునకు ఎఱింగింప నిశ్చయించితిని. అందులకుఁ గాను నాకు అశక్యమైన ఆంగ్లపద్ధతుల నన్నిటిని అవలంబింప దొరఁకొంటిని.

నే నిచట తొడుగుదుస్తులు బొంబాయి తరహావి. అవి ఇంగ్లీషు సంఘమునకు పనికిరావని ఆర్మీ అండ్ నేవీ స్టోర్సులో క్రొత్తవి తయారు చేయించితిని. పందొమ్మిది షిల్లింగులుపెట్టి చిమ్నీ పాట్ టోపి కొంటిని. అది ఆరోజులలో ఎక్కువ వెల. ఇది చాలక వేషనాగరకతకు నడిగడ్డయైన బాండ్ వీథిలో ఒక ఈవినింగ్ సూటునకు పది పౌనులు పాడుచేసితిని. మా అన్నగారికి రెండుపేటల బంగారు గడియారపు గొలుసును పంపుఁడని వ్రాయఁగా ఆయన దయతో పంపెను. సిద్ధముచేసి యుంచిన నెక్టైని తొల్చుట అనాచారము గనుక దానిని ముడివైచి కట్టుకొనుట నేర్చికొంటిని. హిందూదేశమున

ఇంటి మంగలి క్షౌరముచేయుచుండఁగా అద్దము చూచుకొనుట విలాసమునకే. ఇచట ప్రతిదినము ఒక పెద్ద అద్దము ముందు నెక్ టైని సవరించుకొనుచు సరియగు వేషాచారము ననుసరించి పాపట దిద్దుకొనుచు పది నిమిషములు పాడుచేసితిని. నాకేశపాశము మృదువు కాదు. బ్రష్‌తో దానిని దిద్దుట బ్రహ్మస్త్రో బ్రహ్మ అయ్యెడిది. తలమీఁద టోపిని పెట్టినపుడును, తీసినపుడును, చేయి అలవోకగా తలపైకి వెళ్లి జుట్టును సవరించెడిది. తగు మనుష్యులలో, అనఁగా మంచి సమాజములోఁ గూర్చుండినపుడు తఱుచు చేతితో తలను సరిచేసికొనుచుండవలసినదే. ఇది యొక సభ్యక్రియ; వేషాచారము—అనఁగా ఫాషన్.

నృత్యము, ఫ్రెంచిభాషను మాటలాడుట, ఉపన్యసించుట-వీనిని అభ్యసించినఁగాని ఫాషన్ పూర్తికాదని వింటిని. ఫ్రెంచిభాష ఫ్రాన్సుదేశమునందేకాక యూరపుఖండమున కంతటికి రాష్ట్రభాష. నే నాదేశముల నన్నిటిని చూడఁదలఁచితిఁ గాన నృత్యము నేర్వ నిశ్చయించి ఒక పాఠశాలలో ఒక టెరమునకు మూఁడుపౌనుల జీత మిచ్చితిని. మూఁడువారములలో ఆఱుపాఠములు చెప్పికొని యుందును. తాళగతి గ్రహింప నా తరము కాలేదు. పియానోను అనుసరింపలేక పోతిని. ఇఁక నా గతి యేమి? కౌపీన సంరక్షణార్ధ మయం పటాటోపః. వెనుక ఒక సన్న్యాసి తన గోఁచిని కొఱుకకుండ ఎలుకలకు పిల్లిని పెంచెనఁట. పిల్లిని పెంచుటకు ఒకఆవు. ఆ ఆవును కాచుటకు ఒక గొల్లఁడు. ఈరీతిగా గోఁచిగుడ్డకుఁగాను అతనికి సంసార మేర్పడెను. పాశ్చాత్యసంగీత మలవరించుకొనుటకు ఫిడేలు నేర్చుకొనవలెనని ననుకొంటిని. మూఁడు పౌనులు ఫిడేలున కిచ్చితిని. జీతమునకు కొంత. ఉపన్యాసధోరణి నేర్పుటకు మరొక గురువునకు ఒక గినీ ప్రవేశపు రుసుము క్రింద ఇచ్చితిని. ఆయన Bell's Standard Elocutionist ను

కొను మనఁగా దానిని కొంటిని. అది పాఠ్యపుస్తకము. అందు పిట్టుగారి ఉపన్యాస మారంభించితిని.

కాని ఆ బెల్ * అను ఆయన నా చెవిలో గంట వాయించుటచే నేను మేలుకంటిని.

నేను యావజ్జీవము ఆంగ్ల దేశమున నివసింపను. ఎందుల కీఁక నీవ క్తృత్వాభ్యాసము ? ఈ నృత్యము న న్నెటులు సభ్యుని చేయును? ఫిడేలు ఇండియాలోనే నేర్వనగును. నే నిచటికి విద్యార్థినై వచ్చితిని కాన విద్యావ్యాసంగము చేసితీఱవలెను. ఇన్స్ ఆఫ్ కోర్టులో చేరుటకు యోగ్యుఁడను కావలెను. నా నడవడి నన్ను సభ్యునిఁ జేసినఁ జాలు. కానిచో ఆ యాశ వలదు.

ఇట్టివిట్టివి మరికొన్ని ఊహలు తోఁపఁగా, వాని నన్నియు వక్తృత్వోపాధ్యాయునకు వ్రాసి, ఇఁకముందు రాఁజాలనందులకు క్షమింపుఁడని ప్రార్థించితిని. అప్పటికి రెండుమూఁడు పాఠములే ఆయెను. అట్టిదే మరియొక ఉత్తరము నాట్యాచార్యునకు వ్రాసి, ఫిడేలు ఉపాధ్యాయ కడకు స్వయముగా వెళ్లి, ఎంత వెల వచ్చిన అంత వెలకే ఆఫిడేలును అమ్మఁగోరితిని. నాతో చనవుగా ఉండును గాన నేను తప్పుదారిఁ బడితి నని తెలిసికొంటినని ఆమెకు చెప్పితిని. ఆమెయు నా నిశ్చయమును ప్రోత్సహించి సంపూర్ణముగా వీనిని మానుమని చెప్పెను.

నాకు ఈ వ్యామోహము రెండుమూఁడు నెలలు ఉండియుండును. వేషమును గుఱించి పట్టింపు చాల సంవత్సరములవఱకు పోలేదు. ఇటుపయిని నేను విద్యార్థి నయిపోతిని.

* బెల్ = గంట అని శ్లేష.

## మార్పులు

ఆటపాటలలో పడి నేను ఇచ్చవచ్చినట్లు కాలము గడపితినని ఎవరును తలంపకుందురుగాక! అప్పుడుఁగూడ నేను ఒడ లెఱిఁగియే మసలితినని పాఠకుఁడు పోల్చియుండును. ఆ వ్యామోహకాలము కొంత ఆత్మపరీక్షచేఁగాని పోలేదు. నేను వాడిన ప్రతి దమ్మిడికిని పద్దు వ్రాసితిని. వ్యయమునకు లెక్క కలదు. ప్రతి చిన్న పద్దును, అనఁగా మోటారు కిరాయి, తపాలఖర్చు, వార్తాపత్రికలకు వెచ్చించు ఒకటి రెండుకానులు మొ. అన్నియు వ్రాసి ప్రతిదినము పరుండఁబోవునపుడు నిలువ తేల్చుచుంటిని. ఆయలవాటు నేఁటికిని కలదు. దీనివలన చాల ప్రయోజనము లేర్పడెను. లక్షలకొలఁది ధర్మాదాయము అనేకవిషయములకు నా చేతులమీఁదుగా వ్యయమగుచున్నది. శాఖోపశాఖలైన ఇన్ని విషయములకు వ్యయముచేయుచున్నను, మితముగను, సరిగను వ్యయముచేసితిని. ఎపుడును బాకీలు రావలసియున్నవని లెక్కచూపలేదు. మఱి నిలువ చూపితిని.

ఈవిషయమును ప్రతిపిన్నవాఁడును శ్రద్ధతో గమనించి, తనకు వచ్చు ప్రతిపైసకు, తా నిచ్చు ప్రతిపైసకును లెక్కవ్రాయుచో, తుదకు నా వలెనే మేలు పడయఁగలుగుట నిక్కము.

నేను ఇంతశ్రద్ధగా నున్నందులనే వ్యయము తగ్గించుట ఆవశ్యకమని తెలిసికొనఁగలిగితిని. కాన వ్యయమును సగపడ తగ్గింప నిశ్చయించితిని. నా పద్దుపుస్తకము చూడఁగా అందు బాడుగలు ఎక్కువ కాని

పించినవి. మఱియు నే నొక కుటుంబములో నివసించుచున్నందున ప్రతివారము వారికి ధన మీవలసివచ్చెను. మరియు మర్యాదకొఱకు ఆ కుటుంబమువారితో విందులకుఁ బోవుటయు, విందులకుఁ గొంపోవుటయు తటస్థించెడిది. ఈ రెండు పక్షములలోను వ్యయము నేనే భరింపవలసివచ్చెడిది. ఏలన, విందునకు పిలిచినఆమె స్త్రీ యైనచో పురుషుఁడే వ్యయము భరించుట దేశాచారము. కుటుంబమువారు ప్రతివారము పుచ్చుకొను డబ్బులో విఱుగఁగోసికొనరు. కావున ఇట్టి వ్యయము పరిహరింపవచ్చునని తోఁచెను. మఱియు ఈ మూఁబఱఖర్చుచే ధనికుఁడనను దురూహకు కారణ మగుచున్నదనియు తోఁచెను.

ఈ కుటుంబమున ఇఁక నివసింపక ప్రత్యేకముగా గదుల నద్దెకుఁ గొనుట నిశ్చయించితిని. నేను చేయవలసిన పనినిబట్టి అనుకూలముగా అచటికచటికి మాఱుటకు నిశ్చయించితిని. దానివలన సమకాలముననే అనుభవమును గడింపవచ్చునని తోఁచెను. పని ఉన్న స్థలములకు కాలి నడకలో అరగంటకు చేరుటకు వీలైనంత దాపున గదులను అద్దెకుఁ గొనుచుంటిని. దాన బండ్లబాడుగ తగ్గినది. ఇంతకు ముందు నే నెక్కడికి వెళ్లినను ఏదో యొకవిధ మగు యానమునీఁద నే పోవుచుంటిని. దాన గమనవ్యాయామమునకు కొంతకాలము వ్యయపఱుపవలసివచ్చుచుండెను. ఈ యేర్పాటుచే ధనమును, తీఱికయు కూడివచ్చెను. ఇట్లు ప్రతిదినము చాలదూరము నడుచుచుండుటవలన నే ఆంగ్లదేశమున నాకు జబ్బు రాకుండుటయే కాక చాలవఱకు దార్ఢ్యమును కలిగెను.

నేను రెండుగదులు తీసికొంటిని. ఒకటి కూర్చుండుటకు, రెండవది పన్నుండుటకు. ఇది రెండవ దశ. మూఁడవది ముందు.

## ౧౬. మార్పులు

ఈ మార్పులు నా వ్యయములో సగము తగ్గించెను. బారిస్టరు పరీక్షకు ప్రతిదినము కొలఁదికాలము వినియోగించినఁ జాలును. దీని విషయమై నాకు అధైర్యము లేదు. ఇఁక మిగులుకాలము? ఇంగ్లీషు భాషలో ప్రవేశము తక్కువ అను విచారము నన్ను మెండుగ పీడించుచుండెను. 'మొదట బి.ఏ. ప్యాసు కమ్ము. పిదప న్యాయవాదవు కమ్ము' అను సర్ ఫ్రెడరిక్ లేలీగారి మాటలు నే మఱువలేదు. (ఆయన కప్పటికి సర్ బిరుదము లేదు. పిదప వచ్చెను.) కావున బారిస్టరు పట్టాకాక మరియొకటి సంపాదింపవలెను అని తలఁచి ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విద్యాలయములను గూర్చి నా మిత్రులతో సంప్రతింపఁగా, వారు ధనవ్యయమును, కాలవ్యయమును అధికముగ చేయఁగలుగుచో అక్లే చదువవచ్చు ననిరి. 'కఠినపరీక్షలో కృతార్థుఁడవు కాఁగోరినచో లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు పెట్టుట మంచి' దని ఒక మిత్రుఁ డనెను. అందు ధనవ్యయము లేదు; పైఁగా మంచి కాలక్షేపము; మంచి లోకజ్ఞానమును కలుగును—అని మొదట నేను సంతోషముతో అంగీకరించితిని గాని పాఠ్యగ్రంథపట్టిక చూడఁగా అమ్మో అనిపించెను. లాటినుభాషయు, మఱియొక ఆధునిక భాషయు అనివార్యములు. నాకు లాటి నెట్లు కొఱుకఁబడును అని నే ననుకొనఁగా, నామిత్రుఁడు 'లాయరులకు లాటిను ఆవశ్యకము. దానివలన లా పుస్తకములు చక్కఁగా అర్థమగును. రోమనులా పరీక్షాపత్రము లాటినుభాషలోనే ఉండును. ఇంతియకాక లాటినువచ్చుచో ఇంగ్లీషు కరతలామలకమే' అని చెప్పెను. అది నాకు బాగుగా నచ్చెను. ఎంత కష్టమైనను లాటిను చదువ నిశ్చయించితిని. ఫ్రెంచిభాషను అదివఱకే ప్రారంభించితిఁ గాన అది మరియొక భాషక్రింద ఉపయోగించుదమని తలంచితిని. ఒక ప్రైవేట్ మెట్రిక్యులేషన్ క్లాసులో చేరితిని.

ప్రతి ఆఱునెలలకు పరీక్షలు. నా కిఁక ఐదునెలలే ఉండెను. ఇది నాకు అశక్యమైనను లోఁగడ ఆంగ్ల సమాజములో సభ్యుఁడ ననిపించుకొనవలయునని నన్ను పట్టుకొన్న పట్టుదలయే ఇపుడు నన్ను అతి శ్రద్ధగల విద్యార్థిగా మార్చినది. నే నొక నిమిషమైనను వృథచేయకుండఁ జదువుటకు కాలనిర్ణయపట్టికను సిద్ధపఱిచితిని గాని నాకు అయిదునెలలలో లాటిను ఫ్రెంచిభాషలను, తదితరవిషయములను గ్రహించుటకు తగిన తెలివియు, ధారణయు లేకపోయినవి. లాటినులో తప్పిపోయితిని. నాకు అందులకు కొంత చింత కలిగెఁ గాని ఉత్సాహము తగ్గలేదు. నాకు లాటినులో ఆసక్తి కలిగెను. 'మరల పరీక్ష వచ్చువఱకు ఫ్రెంచికూడ వృద్ధియగును. సైన్సుగ్రూపులో మఱొక క్రొత్త విషయము తీసికొన నగును' అని తలఁచి మొదట కెమిస్ట్రిని (రసాయనశాస్త్రము) తీసికొంటిని. అది మంచివిషయమే కాని ఎక్స్పెరిమెంట్లు లేవు కాన నాకు రుచింపలేదు. ఇండియాలో కెమిస్ట్రి అనివార్యము కావున ఆంగ్ల దేశమునఁగూడ దానినే తీసికొంటిని. రెండవసారి 'వేఁడి-వెలుఁగు' అను విషయముల తీసికొంటిని. అది సులభమని మిత్రు లనుటయు కాక నాకును అట్లులే యుండెను.

మరల పరీక్షకు పెట్టఁదలఁచితిని గాన నా వ్యయ మింకను తగ్గింపఁదలఁచితిని. ఇంకను నాఖర్చు కరామతులు నా కుటుంబమునకు తగినటులు లే వనుకొంటిని. తాను జీవనమునకు ఎంత త్రొక్కులాటపడుచున్నను నే నడిగినపుడెల్ల ధనము పంపు మా యన్నను తలఁచికొన్న కష్టముగా నుండెడిది. ఇచట నెలకు ఎనిమిది మొదలు పదియేను పౌనులవఱకు ఖర్చుపెట్టువారిలో పలువురు శిష్యభృతి (scholarship పడసినవారే యని తెలిసికొంటిని. నా కంటె తక్కువఖర్చుపెట్టువారిని ఎఱుఁగుదును. ఒక విద్యార్థి బీద లుండుపేట (slum) లో వార

మునకు రెండు షిల్లింగు లద్దె యిచ్చి ఒకగదిని పుచ్చుకొనెను. లాక్ హార్ట్ చీప్ కోకో రూమ్సులో అతఁడు రెండు పెన్నీ లిచ్చి కోకో, రొట్టెలతోఁ గడపుచుండెను. అట్టిది నాకు కేవలము అసాధ్యము కాని ఇఁక ఒకగదిలో ఉండవచ్చును. రెండు గదు లక్కఱలేదు. నేనే వండు కొనవచ్చును; దాన నెలకు నాలుగైదు పౌనులు కలిసివచ్చును అని నిశ్చయించితిని. తక్కువ ఖర్చుతో జీవనము చేయుటను (simple living) గుఱించిన కొన్ని పుస్తకములుకూడ దొరకెను. రెండు గదులను వదలి ఒకటియే అద్దెకుఁ గొంటిని. మఱిశాయి (stove) కొని ప్రాతరాహారము వండుకొనుటయు ఆరంభించితిని. ఓటుపిండిపులుసును, కోకోను తయారు చేయుటకు ఇరువది నిమిషములకంటె ఎక్కువ పట్టలేదు. మధ్యాహ్నభోజనము పరత్ర. సాయంభోజనము ఇంటికడ. కోకో రొట్టెలతో సరిపెట్టుకొంటిని. ఇందులకు దినమునకు సుమారు పదియేను పెన్నీలు సరిపోవుచుండెను. మఱియు నేను బాగుగా వ్యాసంగము చేసినకాల మదియే. మితవ్యయముతో సౌమ్యజీవనముచేయుట వలన విద్యావ్యాసంగమునకు నాకు కావలసినంత తీఱిక ఉండెడిది. నేను పరీక్షు నెగ్గితిని.

నే నిటులు పొదుపుగా ఉండుటవలన చాల కష్టముల పాలైతి వని పాఠకుఁడు తలఁపకుండుఁగాక! అందులకు బదులుగా ఈ మార్పు నా ఆంతర జీవితమునకును, బాహ్యజీవితమునకును ఐక్య మాపాదించెను. నా కుటుంబాదాయమునకు తగిన రీతిగా వ్యయమును సమకూర్చెను. జీవనము అధిక సత్యమయ మాయెను. నా ఆనందమున కంతము లేకుండెను.

## భక్ష్యపరిశీలనము

నేను లోఁతుగా పరిశీలించికొనినకొలఁది బాహ్యాభ్యంతరములైన ఆచారములను మార్చుకొనవలసిన ఆవశ్యకత గోచరింపఁజొచ్చెను. ఉనికియందును, వ్యయమునందును మార్పు చేయుటతోపాటుగనో, అంతకు ముందుగనో భక్ష్యములలోఁగూడ మార్పుచేయ మొదలిడితిని. శాకాహారమును గుఱించి వ్రాసిన గ్రంథకర్తలు మత వైద్య ప్రకృతి శాస్త్రానుగుణ్యముగను, ఆచరణానుగుణ్యముగను, లోఁతుగా పరిశీలించియే వ్రాసిరి. 'మానవుఁడు తక్కిన జంతువులకంటె అధికుఁడైనందులకు ఫలము వాని చంపి తినుట కాదు. బలిష్ఠుఁడు దుర్బలురను కాపాడవలెను. మానవులలో మానవులకు పరస్పరము ఎట్టి సాహాయ్యకము ఉండునో మిగిలిన అన్నింటియెడలఁగూడ అట్టి సాహాయ్యకము ఉండవలయును' అని వారు నైతికముగా నిర్ధారించిరి. మఱియు మానవుఁడు తినుట రుచికి కాదు, మఱి బ్రతుకుటకు, అను సత్యమును వారు పైకిఁ దీసిరి. ఆ గ్రంథకర్తలలో చాలమంది మాంసమునే కాక, గ్రుడ్లను, పాలను నిషేధించిరి. తామును అట్లు నడుచుకొనిరి. మనుష్యునిశరీరనిర్మాణమునుబట్టి చూచినచో వండిన పదార్థము సరిపడదనియు, పళ్లు వచ్చువఱకు తల్లి పాలు త్రావవలెననియు, పిమ్మట ఫలాదులను తినవలె ననియు కొందఱు వ్రాసిరి. వైద్యశాస్త్రమునుబట్టి ఊరుఁగాయలు, పచ్చళ్లు, పోపులు, మసాలాలు మొదలగునవి పరిత్యాజ్యము లనిరి. శాకాహారము అందఱకు అందుబాటులోని దనియు, వెల

తక్కువ యగు ననియు వారు నిర్ణయించిరి. ఈ నాలుగు విషయములు నా అనుభవమునకు వచ్చెను. శాకాహారభోజనశాలలలో ఈ నియమములు పాటించువారిని పలువుర కలిసికొంటిని. ఆంగ్ల దేశమున శాకాహార ప్రచారక సంఘముకూడ ఉన్నది. వారొక వారపత్రిక ప్రకటింతురు. నేనాసంఘమున చేరితిని. నేనాపత్రికకు చందాదారుఁడను. కొలఁదినాళ్లలో నేను కార్యనిర్వాహకసంఘసభ్యుఁడుఁగా ఎన్నుకొనఁబడితిని. అందు శాకాహారమును బహునిష్ఠతో పరిపాలించువారు నాకు పరిచితులైరి. నేనును భక్ష్యపదార్థశోధన మొదలుచేసితిని.

ఇంటినుండి వచ్చిన చిఱుతిండి వస్తువులు, ఊరుఁగాయలు మొదలగు వానిని మానితిని. మనస్సు మాఱుటచే వానిపై విరక్తి కలిగి, వెనుక రిచ్మండులో ఉన్నపుడు నా జిహ్వకు చప్పగా కానిపించిన మసాలా లేని స్పినక్ (బచ్చలి) ఇపుడు రుచిగా ఉండెను. ఇట్టి శోధనల వలన రుచికి ముఖ్యస్థానము మనస్సుకాని నాలుక కాదని తెలిసెను.

ఆర్థికదృష్టి సర్వదా నా దృష్టిలో నుండెను. ఆరోజులలో కొందఱు కాఫీలు, టీలు హానికరములని నిరసించి, కోకోను స్వీకరించుచుండువారు. తినుట శరీరవ్యాపారమునకే అని నిశ్చయించి, టీ కాఫీలు వదలి కోకో పుచ్చుకొనుచుంటిని.

శాకాహారభోజనశాలలో రెండు విభాగము లుండును. ఒకదానియందు కావలసినపదార్థములు తిని తిన్నవానికి మూల్య మీవలెను. అందు ఫ్లూఁటుకు ఒకటి రెండు షిల్లింగులుగూడ పట్టును. దానికి ధనికులు పోవుచుందురు. రెండవ విభాగమున ౬ పెన్నీలకు ఒక రొట్టె ముక్కయు, మరి మూఁడు పదార్థములును పెట్టుదురు. నేను మితవ్యయ దీక్షఁ బూనిన పిదప వాడుకగా ఆఱణాల (పెన్నీల) నిచ్చియే భుజింప మొదలిడితిని.

ఈ పరిశీలనముతో ఉపపరిశీలనములుకూడఁ గొన్ని కలవు. కొంతకాలము గంజి (starch) గల పదార్థములు విడిచితిని. కొంతకాలము రొట్టె, పండ్లుమాత్రము తినియుంటిని. కొంతకాలము జున్ను, పాలు, గ్రుడ్లు. ఈచివరపరిశోధనము గమనింపఁదగినది. ఇది పదియేనునాళ్ల కన్న ఎక్కువకాలము సాగలేదు. గంజిలేని పదార్థములు తినవలెనని బోధించిన సంస్కర్త గ్రుడ్లు తినుట మంచిదనియు, అది మాంసాహారము కాదనియు సమర్థించెను. గ్రుడ్లు తినుచో జీవజ్జంతువులకు హానిచేయుపని లేదుగదా అని సామాన్యముగా తోఁచెను. అందువలన కక్కుఱితి పడితిని. ఈ ప్రమాద మెంతోకాలము ఉండలేదు. నా ప్రమాణమునకు క్రొత్తవ్యాఖ్యానము చెప్పుట నా పని కాదు. ప్రమాణము చేయించిన మా అమ్మగారి ఉద్దేశము నాకు తెలియదా? గ్రుడ్లుకూడ మాంసమనియే ఆమె ఉద్దేశము. ఈప్రమాణముయొక్క సత్యమగు ఉద్దేశము స్ఫురింపఁగనే గ్రుడ్లను, గ్రుడ్లతోపాటు పరిశోధనమును మానితిని.

ఈ విషయము గమనింపఁదగినది. ఇంగ్లండులో మాంసమును గుఱించి మూఁడు లక్షణములు చూచితిని. మొదటి లక్షణమున పశుపక్షుల మాంసమే మాంసము. ఈలక్షణానుయాయులగు శాకాహారులు పశుపక్షిమాంసము పరిత్యజించి మత్స్యముల స్వీకరించిరి; ఇఁక గ్రుడ్లను స్వీకరించిరని చెప్పనక్కఱలేదు గదా! రెండవలక్షణము సకల జీవజ్జంతువుల మాంసము మాంసము. ఈ లక్షణమున మత్స్యాహారము నిషిద్ధము కాని గ్రుడ్లు తినవచ్చును. ఇఁక మూఁడవది—సకల జీవజ్జంతుమాంసమును, వానివలన ప్రభవించు పదార్థమును—అనఁగా, గ్రుడ్లు, పాలు మొదలైనవి అంతయు మాంసకోటిలో పరిగణితమగును. నేను మొదటి లక్షణమంగీకరింతునేని గ్రుడ్లే కాక చేపలఁ గూడ గొనవలసియుండును. నా ప్రమాణమునుబట్టి గ్రుడ్లు పనికిరావు. కావ నేను వాని విడిచితిని. శాకా

హారభోజనాగారములలో చాల పదార్థములలో గ్రుడ్లు కలియునని తేలినది. కావున నేనట ప్రతిపదార్థమును గ్రుడ్లు కలిసెనా, లేదా అని అడుగవలసివచ్చినది. దీనివలన నాకొకవిధముగా చిక్కు తోలఁగినది: ఏలయన, నా ఆహారమును సాదావస్తువులకు నియమించుకొనఁగల్గితిని. నాకు రుచించు చాల పదార్థములు పరిహరింపవలసిన చిక్కు కూడ పోసఁగెను. కాని నా ప్రమాణమును సరిగా అనుష్ఠించుచుండుటవలన ఈచిక్కులు క్రమక్రమముగా తొలఁగి విస్పష్టముగా ఆరోగ్యకరమును, సూక్ష్మమును, స్థాయియునగు చవియెడ అధికప్రీతి ఏర్పడెను.

ఇంకను సత్యపరీక్ష ముందున్నది. అది రెండవ ప్రమాణము గురించి. భగవంతుఁడు కాపాడుచుండఁగా ఎవరు హాని చేయఁగలరు?

ఈప్రకరణము ముగించుటకు రెండవ ప్రమాణమునకు సంబంధించిన విషయములు చెప్పుట ఆవశ్యకము. ప్రమాణములకు తమకు తమ కనుకూలముగా క్రొత్తక్రొత్త అర్థములు తీయుట జగత్తునందంతటను గలదు. అది కలహకారణము. ప్రమాణము ఎంత విస్పష్టముగా నున్నను మూలమునకు తమకు అనుకూలమగునట్లు అర్థము చెప్పుదురు. మహాధనికులనుండి నిఱుపేదలవఱకును ఇట్టివారు కలరు. స్వార్థపరాయణత్వము వారిని అంధులఁ గావించును. వారు దానికి గోడమీఁది పిల్లి వాటముగా అర్థముచెప్పి, ఆత్మవంచన చేసికొని, లోకమును, దైవమును వంచింపఁ బ్రయత్నింతురు. ప్రమాణము చేసినవాఁడు ప్రమాణము చేయించిన వాని అర్థమును అనుసరించుటయే ఉత్తమపద్ధతి. రెండు అర్థములు చెప్ప వీలు కలిగినచోట దుర్బలుని అర్థము అంగీకరించుట ఒకపద్ధతి. ఈ రెండు పద్ధతులను త్రోసివేయుచో అన్యాయమునకును, కలహమునకును ఆస్పదమగును. సత్యమునే కోరువాఁడు సులభముగా ఉత్తమపద్ధతి నవలంబిం

చును. అతనికి క్రొత్త అర్థములకు విద్వాంసుల సలహాతో పనిలేదు. మాంసమునకు ఉత్తమపద్ధతి ననుసరించి మా అమ్మగారి అర్థమే నాకును అర్థము గాని ఇఁక నాగొప్పఅనుభవము గాని, పాండిత్యగర్వము గాని చెప్పు అర్థము ఒక అర్థము కాదు.

ఇంగ్లండులో ఆర్థికదృష్టిని, ఆరోగ్యదృష్టిని పురస్కరించుకొని నా పరిశోధనములు జరిగినవి. ధర్మదృష్టి ననుసరించి ఈవిషయము దక్షిణ ఆఫ్రికాకు వెళ్లకముందు పరిశోధింపఁబడలేదు కాని వెళ్లినపిమ్మట తీవ్రముగా పరిశోధనములు చేసితిని. వానిని ముందు తెల్పెదను. ఎటులేని వీని యన్నిటికిని బీజము ఇంగ్లాండులోనే నాటఁబడెను. మతములో ఉన్నవానికంటె క్రొత్తగా మతములో చేరినవానికే పట్టుదల ఎక్కువ. ఇంగ్లండులో శాకాహారము అనునది సరిక్రొత్త. ఇంచుమించు నాకును అట్టిదే. ఏలనఁగా, నాకు మాంసాహారమే మంచిదని నమ్మకము. కాని పిదప బుద్ధిచేత శాకాహారములోనికి మారితిని. కావున నేను నూతనముగా మతములో కలిసిన వాని అభిమానముతో నాకు నివాసమైన బేసువాటరుపేఁటలో ఒక శాకాహారపు క్లబ్బు పెట్టఁదలఁచితిని. అచట కాఁపురమున్న సర్ ఎడ్విన్ ఆర్నాల్డుగారిని ఉపాధ్యక్షునిఁగాఁ గోరితిని. వెజిటేరియన్ పత్రికా సంపాదకుఁడు ఓల్డ్ ఫీల్డ్ గారు అధ్యక్షులు. నేను కార్యదర్శిని. కొంతకాలము ఆ క్లబ్బు బాగుగనే నడచెను. కాని కొలఁదినెలలలో అంతరించెను. ఏలనఁగా, కాలక్రమమున ఒకచోటినుండి మరియొకచోటునకు నేను మారుట నియమముగా పెట్టుకొన్నందువలన నే నాప్రదేశము వీడితిని. కాని వినయముతో కూడుకొనిన ఈ కొలఁది అనుభవము కొన్నిసంస్థలు స్థాపించి ప్రచారములోనికి తేఁగలుగు శక్తిని నాకు ప్రసాదించెను.

## బిడియము నా డాలు

శాకాహారసంఘసభ్యులు నన్ను కార్యనిర్వాహకసభ్యులలో ఒకనిఁగా ఎన్నుకొనిరి. నేను ప్రతిసభకు వెళ్లుట పెట్టుకొంటిని. కాని ఎల్లపుడును నాకు వాగ్బంధము. డాక్టరు ఓల్డ్ ఫీల్డ్ గారు 'నీవు నాతో మాటలాడునపుడు చక్కఁగా మాటలాడుదువుకదా! సభలో ఒకనాఁడేని పెదవి కదుపవేమి? నీవు మగతేనెటీఁగవు' అని మందలించిరి. ఈ పరిహాసమునకు నే నానందించితిని. తేనెటీఁగలు ఎప్పుడును పని చేయుచుండును; మగతేనెటీఁగ మాత్రము పెద్ద సోమరిపోతు. అందఱు సభలో తమ తమ ఉద్దేశము ఉద్ఘాటించుచుండఁగా నేను మెదలక కూర్చుండుట కొంత వింత కాకపోదు. నాకు మాటలాడవలయు నని ఆశ లేక కాదు, మరి మాటలాడ లేక; అభిప్రాయమును సరిగా మాటలలో పెట్టలేక. సంఘములో అందఱకును విషయగ్రహణము కలదనియు, నాకు మాత్రము లేదనియు నా ఊహ. ఎట్లులో మాటలాడి తీఱవలెను అని సాహసించువఱకు విషయము మాఱి మరొక విషయమునఁ బడుట పొసఁగెడిది. ఇటులు కొంతకాలము జరిగెను.

ఒకతూరి మా సంఘమున ఒక గంభీర విషయము చర్చకు వచ్చెను. ఆసభకు వెళ్లకుండుట అనుచితమును, అవినయమును. మఱి మాటాడక మూఁగవోటు ఇచ్చుట పిఱికితన మనుకొంటిని. అందలి విషయ మిది: థేమ్స్ ఐరన్ వర్క్సు కంపెనీ అధ్యక్షుఁ డగు హిల్సుగారు ఆసభకు అధ్యక్షుఁడు. అతఁడు నీతివాది (Puritan). కేవలము వారి ద్రవ్యసా

హాయ్యముచేతనే ఆసంఘము నిలిచియున్న దనవచ్చును. సభ్యులలో చాలమంది ఆయన గొడుగునీడలలో నుండునట్టివారే. శాకాహార విషయమున సుప్రసిద్ధుఁడగు అల్లిన్సన్‌గారు కూడ కార్యసంఘమున ఒక సభ్యుఁడు. అప్పుడు సంతానము కలుగకుండు ఉపాయములు చేయవలయునను విషయము క్రొత్త క్రొత్తగా మొలకెత్తినది. డాక్టరు అల్లిన్సన్‌గారికి సంతాననిరోధ మభిమతము. దానినిగూర్చి ఆయన పాటకపు వారికి బోధించుచుండెను. ఈ పద్ధతులు నీతి మూలచ్ఛేదకరములు అని డాక్టరు హిల్సుగారి ఆశయము. ఈశాకాహారసంఘము కేవలము ఆహారప్రచారమే కాక నీతిప్రచారము కూడ చేయవలయుననియు వారి ఉద్దేశము. ఇట్టి విపరీతభావములు కల అల్లిన్సన్‌గారివంటి మనుష్యులనీతిబాహ్యములైన ఉద్దేశములు సంఘమున నుండరాదని హిల్సుగారి తలఁపు. కావున అల్లిన్సన్‌గారిని ఆసభనుండి పాఱ కొట్టుటకు తీర్మాన ముపపాదింపఁ బడెను. ఈ చర్చ నా హృదయము నాకర్షించెను.

సంతానము కలుగకుండ ఉపాయములు చేయవలయునను అల్లిన్సన్‌గారి ఉద్దేశములు భయంకరములనియే నే నెంచితిని. హిల్సుగారు నీతివాది (Puritan) కావున అల్లిన్సన్‌గారికి ప్రతికూలుఁడగుట ఒప్పుకొంటిని. హిల్సుగారి ఔదార్యమునుబట్టి వారియందు నాకు ఆదరము కలదు. కాని నీతివిషమున అభిప్రాయభేద మున్నంతమాత్రమున శాకాహారసంఘమునుండి ఒకసభ్యుని తొలఁగించుట పాడి గాదని నాకు తోఁచెను. హిల్సుగారు నీతివాది కాన వారికి ప్రత్యేకము అనుకూలత ఉండవచ్చును గాని దానికిని, సంఘోద్దేశమునకును సొంతు లేదు. సంఘముయొక్క ఉద్దేశము శాకాహారమును విజేవిచేయుట గాని మఱి ఏనీతిమార్గమును విజేవిచేయుట గాదు. కాన నీతిని గూర్చిన

అభిప్రాయము లెటు లున్నను శాకాహార లైనవా రందఱును ఈ సంఘమున ఉండ నర్హు లనియే నేను తలఁచితిని.

ఈ విషయమున సంఘసభ్యులలోఁ గూడఁ గొందఱు నాతో ఏకీభవించియున్నను ఈతూరి నేనే మాటలాడఁ దలఁచితిని. అది యెట్టులు సాగఁగలను? నాకు ధైర్యము లేదు. కావున వ్రాసి జేబులో పెట్టి తీసికొని వెళ్ళితిని. దానిని గూడఁ జదువలేక అధ్యక్షున కిచ్చితిని. ఆతఁ డింకొకరిచే చదివించెను. డా. అల్లిన్‌సన్‌గారి పక్షము ఓడినది. మొదటి ప్రయత్నముననే నాకు పరాజయము కలిగెను గాని నా అభిప్రాయము సరియైనదని సంతృప్తి నాకుఁ గలదు. పిదప నా సభ్యత్వము నేను విడుదల కోరినటులు కొంచెము గుఱుతు.

ఆంగ్ల దేశమునందు ఉన్నంతవఱకు నాకు ఆ బిడియము వదలనే లేదు. మిత్రుల యింటికి వెళ్ళినఁగూడ పదిమంది చేరుచో నాకు వాగ్బంధ మయ్యెడిది.

నే నొకతూరి 'వెంటనర్' అను ఊరు వెళ్ళితిని. కూడ మజుందారుగారును గలరు. బస ఒక శాకాహారి యింట. 'ది ఎతిక్స్ ఆఫ్ డయట్' అను గ్రంథము వ్రాసిన హోవర్డుగారు గూడ అచటనే నివసించుచుండిరి. ఇది రేవును, ఆరోగ్యస్థానమును. మేము హోవర్డుగారితో మాటలాడితిమి. ఆయన శాకాహార ప్రవర్తకసభలో ఉపన్యసింప మ మ్మాహ్వానించెను. అట్టి సభలలో వ్రాసికొని వెళ్ళి చదువుట తప్పు గాదని తెలిసికొంటిని. పరస్పరసంబంధము పోకుండ నుండుటకును, క్లుప్తముగ నుండుటకును పలువురు అట్లే చేయుదురని నాకు తెలిసెను. ఆశువుగా ఉపన్యసించుట నా కసంభవము కాన అనుకొనిన విషయములను వ్రాసి తీసికొని వెళ్ళితిని. అది ఒక ఫూల్‌స్కేప్ టావుకంటె

హెచ్చు లేదు కాని లేచి నిలువఁబడుసరికి నా కనులు పచ్చ బడెను. నేను వణఁకులాడితిని. అటులు కాఁగా మజుమదారుగారు దాని చదివిరి. వారు ప్రత్యేకముగను ఉపన్యసించిరి. అపుడు శ్రోతలు కరతాళధ్వనులు చేసిరి. నాకు చాల లజ్జ పొడమెను. నా అసమర్థతకు విచారము కలిగెను.

నే నాంగ్లదేశము విడుచునపుడు ఉపన్యాసమునకు చరమప్రయత్నము చేసితిని. అపుడు గూడ అస్తవ్యస్తమైనది. శాకాహారు లగు మిత్రులకు హాల్‌బర్న్ రెస్టారెంటులో విందు ఏర్పాటు చేసితిని. అది శాకాహారాగారము కాకున్నను నేను తదధిపతితో చెప్పి శాకాహారములనే చేయించితిని. నా మిత్రు లీక్రొత్తపద్ధతికి చాల సంతసించిరి. విందులన్నియు వినోదమునకే యైనను పాశ్చాత్యులు దాని నొక విద్యగా పట్టిరి. అవి చాల వైభవముతో, సంగీతములతో, ఉపన్యాసములతో జరుపఁబడును. నేను చేసిన ఈ చిన్న విందులోఁగూడ అట్టివి కొన్ని లేకపోలేదు. అందు కొన్ని ఉపన్యాసములు కావలసివచ్చెను. నా వంతు రాఁగనే నేను లేచితిని. ఆలోచించి ఆలోచించి ఒక విషయమును కొలఁది వాక్యములలో సిద్ధము చేసికొంటిని. నాకు మొదటి వాక్యముపైని ఇఁక సాగలేదు. తొల్లి అడిసన్ గారి మాదిరి అయినది. హౌస్ ఆఫ్ కామన్సులో ఆయన ఉపన్యసింపలేచెను. అదియే ఆయనకు ఉపన్యసింప తొలిసారి. ఆయన అటులు లేచి—'నేను కనుచున్నాను. నేను కనుచున్నాను. నేను కనుచున్నాను' అని ముమ్మాఱు అనిరి. ఇఁక పైని మాట నడవలేదు. అది చూచి ఒక పరిహాసకుఁడు లేచి, 'ఇతఁడు ముమ్మాఱు కనెనుగాని పుట్టిన దేదియు కానరాదే!' అనెను. నే నీవిషయమును మూలముగా తీసికొని హాస్యరసము ఊరునటులు మాటాడఁదలఁచితిని. దీనితో గణాధిపతిపూజ చేసితిని గాని వెంటనే స్వస్తి అయిపోయినది. ఆలోచన అంతయు మఱచితిని. నేను అందఱను నవ్వింపఁ

దలంచి నేనే నవ్వులపాలై పోతిని. తుదకు 'తమరు దయతో విచ్చేసి నందులకు వందనములు' అని తుంచివేసి కూలంబడితిని.

నా కీ బిడియ మెన్నఁడును వదల లేదు గాని దక్షిణ-ఆఫ్రికాలో చాలవఱకు తగ్గెను. ఆశువుగా నేను మాటాడఁజాలను. శ్రోత్రవారు పలువురు కానిపించినచో నాకు కడు సంకోచము కలుగును. నేను మాటలాడకుండ తప్పించుకొనుటకే యత్నింతును. నేఁటికైనను పదుగురు మిత్రులు కలిసినపుడు గాలి పోగుచేసి మాటలాడుట నాచేతకాదు.

అపు డపుడు పరిహాసమునకు పాలగుట ఒకటే కాని ఈ బిడియమువలన నాకు కలిగిన లోటు లేదు. అందులకు బదులు అది మేలే చేసెను. అప్పుడు దుఃఖకరమైన ఈ సంకోచము ఇపుడు సంతోషకర మాయెను. దానివలన నాకుఁ గలిగిన ఫలము మితపదోపయోగము. తలంపులను నిరోధించు శక్తి సహజమైపోయెను. నానోటినుండిగాని, కలము నుండిగాని, అర్థము లేని మాట ఒకటేనియు రాదని నాకు నేను ఉల్లాకు (సర్టిఫికేట్) నిచ్చుకొనఁగలను. నా మాటలోఁ గాని, వ్రాఁతలోఁ గాని, తప్పు దిద్దుకొనవలసిన అక్కఱ కలిగినటులు గుఱుతు చాలదు. ఇట్లు చాల చిక్కులును, వృథాకాలవ్యయమును తప్పెను. సత్యారాధకునకు మౌనావలంబనము ఆవశ్యకమని అనుభవము నాకు బోధించెను. తెలిసిగాని, తెలియకగాని, అతిశయోక్తికి మొగ్గుటయు, సత్యమును మఱుఁగుపఱచుటయు మానవునకు సహజ దౌర్బల్యము. దాని నతిక్రమించుటకు మౌన మావశ్యకము. మితభాషి అర్థములేని మాటలు ఉపయోగింపఁడు; అతఁడు ప్రతిమాటను తూఁచి మాటాడును. మాటలాడుటకు

మొగము వాచికొన్నవారిని మనము పలువుర నెఱుఁగుదుము. మాటాడుటకు అనుజ్ఞ కావలయునని వేధింపఁబడని అధ్యక్షుఁడనుచు ఏసభయుందేని ఉండఁబోఁడు. అనుమతింపఁబడఁగనే వక్త సామాన్యముగా కాలనియతి దాఁటును. మరియును కాలము కావలయు ననును. అనుమతి లేకున్నను ఉపన్యసించుచునే యుండును. వీనివలన లోకమునకు మేలేమియు లేదు. కేవలము కాల మారణము. నా బిడియమే నాకు డాలైనది. నన్నదియే పక్వము చేసినది. సత్యారాధనమున కది మిత్రమైనది.

## ౧౮

## అసత్యా ప్రణము

నలుబది యేండ్ల వెనుక ఆంగ్ల దేశమునందు హైందవ విద్యార్థుల సంఖ్య ఈ కాలమును బట్టి చూచినచో చాల తక్కువ. వారు వివాహితులయ్యును అవివాహితులము అనియే చెప్పుకొనువారు. దీనికి కారణము కలదు. ఇంగ్లాండులో విద్యార్థిమాత్రుడు బ్రహ్మచారియే. 'వివాహతో విద్యానాశాయ' అని వారు విద్య పూర్తికానిచో పెండ్లియాడరు. పూర్వము మనము బ్రతికియున్న కాలములో విద్యార్థికి బ్రహ్మచారి యనిపేరు. మన కిపుడు బాల్యవివాహము వచ్చిపడినది. కాని ఇంగ్లండులో దాని ఊరును పేరును ఎవరికిని తెలియదు. భారతీయవిద్యార్థులు సిగ్గిలి తమకు వివాహమైనదని చెప్పుకొనరు. ఇందులకు మఱియొక కారణము కలదు. ఆదేశమున పెండ్లియైనవారు పెండ్లికాని యువతులతో కలిసిమెలిసి యుండరాదు. కావున తమకు వివాహమైనదని తాము నివసించుచున్నవారికి తెలియుచో ఆకుటుంబమునందలి యువతులతో కలిసిమెలిసి యుండుటకును, ఆమోదప్రమోములు చేయుటకును స్వాతంత్ర్యము ఉండదు. ఈ ఆమోదప్రమోదములు చాలవఱకు నిర్దోషములు. తలిదండ్రులకును ఈ ఆమోదప్రమోదములు సమ్మతములు; ఏలనఁగా, ఆదేశమున వరుఁడే వధువును నిశ్చయించుకొనవలయుఁగాన కన్యలును, యువకులును కూడ సంచరించుట స్వాభావికము. ఇంగ్లండు దిగుటతోడనే హైందవవిద్యార్థులు ఆంగ్లేయులకు ఎంతయు సహజమైన ఈ ఆచారమున పడినచో దాని పరిణా

మము భయంకరము. అట్టివి అనేకము విన్నాము. భారతయువకులు ఈ వ్యసనమునకు పాల్పడి కన్యలతో కలిసిమెలిసి యుండుటకు అసత్య జీవనము జరుప నొడంబడిరి. ఆంగ్లేయులపట్ల అది అనింద్యము. భారతీయులకు మాత్ర మది తగదు. నేనును ఈ వలలో పడితిని. నాకు పెండ్లియాయెను. కొడుకుల నెత్తితిని. ఐనను అపట బ్రహ్మచారి నైతిని. ఆ నటనవలన నా కేమియు ఆనందము కలుగలేదు. నా బిడియమును, మౌనమును నన్ను నట్టేట త్రోయలేదు. నేను మాటలాడకున్నచో నాతో మాటాడుటకుఁ గాని, నాతో తిరుగుటకుఁ గాని, ఎవతె ఉత్సహించును?

నాకు పిటికితన మెంతయో బిడియ మంత. 'వెంటనరు'లో నేను ఉన్నటువంటి కుటుంబములలో ఇంటియామె కూఁతురు అతిథులను షికారునకు తీసికొనివెళ్లుట ఒక ఆచారము. ఆమె ఒకనాఁడు నన్ను చేరువనున్న చక్కని గుట్టలకు తీసికొనిపోయెను. అసలు నాదే వడి నడక. ఆమెది నాకన్న. అదియు ఇదియు మాటలాడుచు నన్ను వడిగా లాగుకొని పోవుచుండెను. ఒక్కొక్కతడవ నేనును ఏదో చెప్పుచునే యుంటిని. తుదకు 'ఔను' అనియో, 'కాదు' అనియో, 'అహో, ఎంత బాగుగా నున్నది!' అనియో, మెల్లగా అనుచు పోవుచుంటిని. ఆమె పిట్టవలె పోవుచుండెను. ఎంతసేపటికి మరల ఇంటికి పోఁగలమా అని నేను నివ్వెఱపోవుచుంటిని. ఇటులు మేము పర్వతశృంగ మెక్కితిమి. అంతటి ఎత్తు మడమల జోడు తొడిగికొనియు ఈఇరువది ఇరువదియైదేండ్ల కన్య శరవేగమున దిగుచుండెను. నేను క్రిందికి దిగుటకు క్రిందుమీఁద దగుచుంటిని. పైపెచ్చు ఆమె ఎచట చూచిపోవునో యని లజ్జ. ఆమె వెనుదిరిగి నవ్వుచు ఇటు దిగు మటు దిగు మనియు, ఊఁత యిచ్చి దింపనా అనియు అడుగసాగెను. నావి కోడిపిల్లగుండెలు.

ఈసాయముగూడ నెటులు చేయించుకొనఁగలను? తుదకు అతికష్టము మీఁద ప్రాఁకియు దేఁకియు, కొన్నిచోట్లుల కూరుచుండియు, ఎటులో క్రిందికి ఊడిపడితిని. ఆమె శాబాష్ శాబాష్ అని బిగ్గఱగా నవ్వి నన్ను ఎంత సిగ్గిలఁజేయఁగలదో అంత సిగ్గిలఁజేసెను.

అయితే అన్నిచోట్లులను ఈవిధముగా తప్పించుకొన శక్యమగునా? భగవంతుఁడు నా అసత్యవ్రణమును మాన్పఁ దలఁచెను. బ్రైటన్ అను గ్రామము వెంటనరువంటి ఆరోగ్యస్థానము. ఒకతూరి నేనటకు వెళ్లితిని. ఇది వెంటనరు వెళ్లుటకు ముందు. నే నా బ్రైటనులో ఒకపూటకూళ్ల యింటికి పోతిని. అందు సామాన్య స్థితిగతులు గల ఒకవృద్ధవితంతువు కానిపించెను. ఇంగ్లండులో ఇది నాకు ప్రథమ వత్సరము. అచట ఆహారపదార్థవివరణము పరాసుభాషలో ఉండెను. నా కాభాష తెలియదు. ఆ వృద్ధవిధవ ప్రక్కనే నే నుంటిని. నేను క్రొత్తవాఁడ ననియు, కలవరపడుచుంటి ననియు ఆమె గ్రహించి, 'నీవు క్రొత్తవానివలె ఉన్నావు. ఏమియో కలవర పడుచున్నావు. ఏమియు అడిగి తెప్పించుకొనలే దేమి?' అనెను. నేను ఆపదార్థపట్టికలో ఒక్కొక్క అక్షరమే కూడఁబలుకుకొనుచు వడ్డనవానిని పిలువవలె ననుకొనుచుండఁగా ఆమె పైరీతిగా అడిగెను. నే నామెకు వందనమిడి, 'నేను శాకాహారి' ననియు, 'నాకు పరాసుభాష రా' దనియు, 'ఏది గ్రాహ్యమో, ఏది అగ్రాహ్యమో తెలియక తికమక పడుచుంటి' ననియు చెప్పుకొంటిని.

అయితే నేను నీకు అంతయు తెలిపెద నని ఆమె అందలి భక్ష్యాభక్ష్యములు తెలిపెను. ఈరీతిగా ఆమెకును నాకును ప్రథమపరిచితి. అది క్రమముగా మైత్రిగా పరిణమించి నేను ఇంగ్లండున ఉన్నంత

మఱియును, పిదపఁగూడ, అనుస్యూతమాయెను. ఆమె లండనులో తన యింటి విలాసము ఇచ్చి ప్రతిఆదివారము తనయింటికి విందునకు నిమంత్రించెను. ఇంతియ కాక విశేషములు వచ్చినపుడును, నన్ను నిమంత్రించుచుండెను. నాబిడియము పోఁగొట్ట నామె సాయపడెను. నన్ను పడుచులకుఁ జూపి నాకు వారితో సంభాషణభాగ్యమును కలిగించుచుండెను. ముఖ్యముగా ఒకపడుచు ఆమెయింట ఈసంభాషణములకుఁగాను ఉండెడిది. మేము మాటలాడుచుండఁగా ఆ వృద్ధకుటుంబిని అచటినుండి వెడలిపోవుచుండెడిది.

మొదట మొదట నాకు ఇదియంతయు క్రిందట్టు మీఁదట్టుగా ఉండెడిది. నేను మాట కలుపలేను; పరిహాసములు పన్నలేను. కాని ఆమె నన్ను దారిలో పెట్టెను. నేను చారిని బడితిని. కొలఁదికాలములో ఆదివారమున యెదురుచూచి ఆపడుచు చెలితో సంభాషింప నుత్సహించితిని.

ఆవృద్ధవితంతువు నన్ను ఎక్కువగా ప్రలోభింపఁ జేయఁ దొడఁగెను. మమ్ము సమావేశపఱచుట కామె కేదో ఉద్దేశము ఉండును.

నాపని సందేహములో పడెను. నాకు పెండ్లి అయినదని చెప్పియుండినచో ఎంతబాగుగా నుండెడిది? అని నేననుకొంటిని. అటులు చెప్పియుండినచో ఆమె మాకు ఈ సమావేశము కూర్చియుండెడిది కాదు. అయినను ఈ తప్పు దిద్దికొనుటకు ఆలస్యము కాలేదు. నేను సత్యము చెప్పుచో అధిక సంకటమున కూలను. ఇటు లూహించి ఆమెకు ఈక్రిందిలేఖ వ్రాసితిని:—

‘బ్రైటనులో మనకు పరిచితి కలిగిన నాఁటనుండి నేనన్న మీకు దయ. నన్ను కన్నకొడుకువలె భావించితిరి. నాకు పెండ్లి చేయ

వలయు నని మీతలంపు. అట్టి తలంపుతో నాకు పడుచుల చెలిమి కలుగఁజేయుచున్నారు. విషయములు ముదిరిపోకుండ నేను తమ దయకు అపాత్రుఁడనని అంగీకరింతును. ముని మొదటనే నేను గృహస్థుఁడ నని తమ కెఱిఁగించియుండవలసినది. భారతవిద్యార్థు లందఱును అవివాహితులమని చెప్పుకొందురని యెఱిఁగి నేనును అటులే చేసితిని. అది తప్పని ఇపుడు తెలిసెను. మఱియు ఒకటి చెప్పఁదగినది. నాకు బాల్యముననే పెండ్లి ఆయెను. నా కొక కొడుకుగూడ. ఇంతకాలము నుండి మీ కిది మఱుఁగుపఱచినందులకు చాల విచారించుచుంటిని. కాని సత్యము చెప్పు ధైర్యము ఈశ్వరుఁ డనుగ్రహించినందులకు ఆనందించుచున్నాను. మీరు నన్ను క్షమింపరా? ఆపడుచుకడ నేను మేరదాఁటిపోలేదని నిక్కము చెప్పుచున్నాను. నేనుండవలయు స్థితి నాకు తెలియును. నా పెండ్లిమాట తెలియక మీరు సహజముగా నాసమావేశము కోరియుందురు. విషయములు ఇంతకు మించి పోకుండ నుండుటకు సత్యోద్ఘాటనము ఆవశ్యకము.

‘ఈలేఖ అందినపిదప నేను మీ ఆతిథ్యమునకు అనర్హుఁడ నని మీకు తోఁచుచో నేనది తప్పుగా తీసికొనను. మీదయకును, మమత్వమునకును నే నెన్నఁటికిని అప్పు తీర్పలేను. ఇటుపయిని నన్ను నిషేధింపక మీఆతిథ్యమునకు అర్హుఁడ నని తలంతురేని నేను అన్నివిధముల ఆ అర్హతను కాపాడుకొని, యెప్పటివలె సుఖినై, దానిని మీ ప్రేమకు చిహ్నముగా పరిగణింతును.’

నేను అటువంటి ఉత్తరము ఒక నిమిషములో వ్రాయఁజాలనని పాఠకుఁడు తెలిసికొనుఁగాక! ఎన్ని చిత్తు లయినవో నే నెఱుఁగ. కాని దానితో నాబరువు పోయినది. ఇంచుమించు తిరుగు తపాలాలోనె ఆమె కడనుండి ఉత్తరము వచ్చెను.—

# ఆ త్మ క థ

'నీవు అంతయు విప్పివేసి వ్రాసిన లేఖ అందినది. మే మిరువురమును చదువుకొని ప్రక్కలు పడ నవ్వుకొంటిమి. నీ అసత్యాచరణము క్షమింపఁదగినది. సత్యము చెప్పి మంచి పని చేసితివి. నాపిలుపు ఎప్పటి వలెనె ఖాయము. రేపటి ఆదివారము నీ కెదురు చూతుము. నీబాల్య వివాహచరిత్ర యంతయు మాకు వినిచి వినోదపెట్టుదువుగాక! దీనివలన మన మైత్రికి స్వల్పమును లోపము లేదని వేఱే ప్రమాణము చూప వలయునా?'

నే నీరీతిగా అసత్యాచరణమును మొదటికంటఁ కోసివైచితిని. అటుపిమ్మట ఆవశ్యక మయినప్పుడు నావివాహమునుగూర్చి సత్యము వచింప సంశయింపలేదు.

## ౨౦

### మతపరిచితి

సీమలో నాయున్న రెండవయేఁడు చివర దివ్యజ్ఞాన సామాజికులు ఇరువురు నాకు పరిచితులయిరి. వారు సోదరులు, అవివాహితులును. వారు నన్ను గీత చదువ ప్రేరించిరి. వారు సర్ ఎడ్విన్ ఆర్నాల్డుగారి గీతానువాదము చదువుచుండిరి. తమతో కలిసి సంస్కృతగీత చదువుటకు వారు నన్ను పిలిచిరి. నేను సిగ్గిలితిని. ఏలన, నేను దానిని చదివియుండలేదు. గుజరాతీ అనువాదమునుగూడ చదివియుండ లేదు. నావిషయమును వారికి కొంకుతో ఎఱిఁగించితిని. నాకు సంస్కృతమున ప్రవేశము అల్పమయ్యును అనువాదము మూలమునకు ఎచట భేదించెనో అది తెలిసికొను శక్తి కలదని తలఁచి, ఆవిషయమును తెలిపి, వారితో గీత చదువ దొరఁకొంటిని. ద్వితీయాధ్యాయమునందలి-

'ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే.
క్రోధాద్భవతి సంమోహస్సమ్మోహాత్ స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాద్వినశ్యతి.'

ఈశ్లోకములు నా మనస్సున నాటుకొన్నవి. నేఁటికిని వాని ధ్వని నా చెవులలో ఝుమ్మనుచున్నది. భగవద్గీత అమూల్యగ్రంథమను విశ్వాసము దినదినము ప్రబలుచున్నది. తత్త్వజ్ఞానమున దానితో సాటియగు గ్రంథము మఱొండు లేదని నిక్కముగా నా నమ్మిక. నాకు

మనసు చెదరినపుడు గీత అమూల్యమగు సాయము చేసెను. ఇంచుమించు ఆంగ్ల గీతానువాదము లన్నియు నేఁజదివితిని. ఆర్నాల్డుగారి అనువాదమే ఉత్తమమైనదని నాతలఁపు. అతఁడు మూలానుయాయి. అది ఒక అనువాదమువలె నుండదు. నే నీ మిత్రులతో గీత చదివినను దానిని చక్కఁగా చదివితినని చెప్పఁజాలను. అటు పిమ్మట కొన్ని సంవత్సరముల యనంతరముననే అది నిత్యపారాయణములో పడినది.

మరియు వారు ఆర్నాల్డుగారి లైట్ ఆఫ్ ఏషియా అను గ్రంథమును (బుద్ధచరితము) చదువుమని చెప్పిరి. అంతకుముందు నేను ఆర్నాల్డుగారు ఒక గీతనే అనువదించి రనుకొంటిని. నేను బుద్ధచరితను గీతకంటె ఎక్కువ రుచితో చదివితిని. గ్రంథమును చేతఁ బెట్టుకొనినచో క్రింద నుంప ఇష్టముండెడిది కాదు. వా రొకనాఁడు నన్ను బ్లావట్స్కీ భవనమునకుఁ గొంపోయి మదాం బ్లావట్స్కీ గారికి, ఆనిబిసెంటు సతిగారికిని నన్ను పరిచితుఁ జేసిరి. బిసెంటుగారు అప్పుడే దివ్యజ్ఞాన సమాజమున కలిసెను. అపుడు ఆమె కలయికను గూర్చి పత్రికలలో చమత్కారముగా చర్చలు జరుగుచుండెడివి. నేను ప్రతిచర్చను ఆసక్తితో గమనించుచుంటిని. వారు నన్ను సమాజమున చేర సలహా నిచ్చిరి. 'నా మతమును గూర్చియే నా కేమియు తెలియనపు డిఁక ఇతరమత సంప్రదాయమున చేరుటయా?' అని నేను వినయముతో నిరాకరించితిని. వారు చెప్పిన మీఁదట నేను 'కీ టు థియాసఫీ' అను మదాం బ్లావట్స్కీ రచితమగు గ్రంథమును చదివినట్టులు గుఱుతు. ఆ పుస్తకము హిందూమతగ్రంథములఁ జదువ తృష్ణ కలిగించెను. మఱియు హిందూమతము అంధవిశ్వాసయుత మని పాదిరీలు హిందూమతముపై మోపిన నిందను తొలఁగించెను.

## ౨౦ మతపరిచితి

ఆ కాలముననే మాంచెస్టరునుండి వచ్చిన ఒక మంచి క్రైస్త వుఁడు శాకాహారాగారమున నాకు కలిసెను. అతఁడు క్రైస్తవమతము గురించి మాటలాడెను. రాజకోటలో నే నెఱిఁగిన పాదిరీలచర్యలు అతనికి చెప్పితిని. అతఁడది విని నగచెను. 'నేను శాకాహారిని. నేను త్రాగను. నా తోడి క్రైస్తవులు మాంసభోజులు, మద్యపాయులు-నిస్సంశయము. కాని ఈ రెంటిని బైబిలు తినుమని విధింపదు. బైబిలు చదువుదో తనుకే తెలియును' అనెను. నేను సరి యంటిని. అతఁడు నా కొకబైబి లిచ్చెను. ఆయనయే బైబిలులను అమ్ముచున్నటులును, పటములు అనుక్రమణిక మొదలగునవి కల ఒక ప్రతిని నే నాయన కడ కొంటిననియు కొంచెము గుర్తు. కాని చదువ మొదలిడితిని. కాని ఓల్డ్ టెస్టామెంటు (ప్రాఁతనిబంధన) సాగలేదు. సృష్టిని గూర్చిన అధ్యాయములును, పదపడి అధ్యాయములను చదువు చుండఁగా నిదుర వచ్చెను. చదివితి ననిపించుకొనుటకు ఎట్లో మిగిలిన భాగములను చదివితిని. ఏవియు రుచింపలేదు. నంబర్సు అను భాగము వెగటుగా నుండెను.

కాని న్యూటెస్టామెంటు చాల ఆకర్షించెను. ముఖ్యముగా అందలి సెర్మన్ ఆన్ ది మౌంట్ (గిరి-ప్రవచనము). గీతకును, దీనికిని సాటి యనుకొంటిని.

'ఎవరు ఎటులు చేయుదురో వారు అట్టిఫలము అనుభ వింతురు. అనఁగా అన్యాయమును పాఱఁద్రోలవలయునని మీ తలఁపు. కాని నే నందునుగదా, అన్యాయముచే అన్యాయమును పాఱఁ ద్రోలలేరు. ఎవరేని నీ కుడి చెంపమీఁద లెంపకాయ కొట్టినచో, నీవు

నీయొడమచెంప కూడ వానికేసి త్రిప్పుము. ఎవ రేని నీ యుత్తరీయమును లాగికొన్నచో, నీ యంతరీయమును కూడ ఇచ్చివేయుము.' *

అను ఈవాక్యములు నాకు అత్యానందము కలిగించినవి. 'జలమును నీ కీయఁగలవాని కిందేని ఒసఁగుమీ కడుపార నోగిరంబు' అనుశ్యాములభట్టు వాక్యములు మనసున తగిలెను. అపరిపక్వమయిన నా మనస్సు గీత, బుద్ధచరిత, గిరి-ప్రవచనము, వీనిబోధములలో ఐక్యమన్వేషింపఁ జొచ్చెను. అట్టిత్యాగమే ఉత్తమమత మని నాకు నచ్చెను.

ఈ వ్యాసంగము అన్యమతాచార్యుల జీవితములు చదువ ప్రేరించెను. కార్లయిలు వ్రాసిన 'హీరోస్ అండ్ హీరో వర్షిప్' అను గ్రంథము నొక మిత్రుఁడు చదువుమనెను. అందు మహమ్మదు జీవితము చదివి అతని మాహాత్మ్యమును, వీరత్వమును, తపశ్చర్యను తెలిసికొంటిని.

పరీక్షలు దాపరించుటచే ఇఁక అవకాశము లేక అపుడు ఇఁక నేమియు చదువలేకపోతిని. కాని వివిధమతములను తెలిసికొనవలెనని మాత్రము మనస్సులో వేసికొంటిని.

నాస్తికమతము కూడ తెలిసికొనుట మంచిదికదా అనుకొంటిని. బ్రాడ్లాగారి పేరును, పేరుతోపాటు అతనిమతమును ప్రతి హిందువును ఎఱుఁగును. నాస్తికతనుగూర్చి నే నొకపుస్తకము చదివితిని. దాని పేరు మాత్రము గుఱుతు లేదు. నా కది రుచిగా లేదు. ఏలన, నే నపుడే నాస్తిక మరుభూమిని దాఁటితిని. అపుడే బిసెంటుగారు నాస్తిక

* 'But I say unto you that ye resist not evil: But whosoever shall smite thee on thy right cheek, turn to him the other also. And if any man take away thy coat let him have thy cloak too.'

మతమునుండి ఆస్తికమతములో కలిసెను. ఆ విషయముకూడ నాస్తిక మతమునెడ అనిష్టకారణ మాయెను. బిసెంటుగారు వ్రాసిన 'నేను ఎటులు దివ్యజ్ఞానసమాజమున కలిసితిని' అను గ్రంథము నేను చదివితిని.

ఆ రోజులలోనే బ్రాడ్లాగారు చచ్చిరి. వోకింగ్ సెమిట్రీలో ఆయనను పూడ్చిరి. అపుడు లండనులోని భారతీయు లందఱు ఆ శవముతో వెళ్లిరి. నేనును. అంత్యక్రియలు చూచుటకు కొందఱు ఫాదిరీలుకూడ వచ్చిరి. తిరిగివచ్చునపుడు స్టేషనులో రైలుకొఱకు వేచియుండనాయెను. అచట ఒక నాస్తికాగ్రేసరుఁడు ఒకఫాదిరీని చూచి 'దేవుఁడు కలఁడా?' అనెను.

'ఉన్నాఁడు' అని ఆ మంచిఫాదిరీ మెల్లగా ప్రత్యుత్తరించెను.

'భూమి చుట్టుకొలత ౨౮,౦౦౦ మైళ్లు అని మీరును అంగీకరింతురా?' అని ఆ నాస్తికుఁడు ఫాదిరీకి పరాజయముకూర్పఁ దలఁచి అడిగెను.

'అంగీకారము.'

'అయితే, అయ్యా! ఈశ్వరుని కొలత ఎంత? ఆయన ఎచటఁ ఉండును?'

'మనము తెలిసికొనవలయును గాని ఆయన మన యిరువుర హృదయములందును కలఁడు.'

'అయ్యా అయ్యా! ఇప్పటికిని నన్ను పసికాయనుగా తలఁపకుఁడు.' అని అతఁడు మా కేసి జయదృష్టితో చూచుచు అనెను.

ఫాదిరీ నమ్రుఁడై మౌనము తాల్చెను.

ఈ సంభాషణయు నాకు నాస్తికమతముపై అసూయ పెంచెను.

## ౨౧

## నిర్బల కే బల రామ్ *

నాకు హైందవ మతమునందును, జగత్తులోని ఇతరమతములందును కొంచెము ప్రవేశము ఉన్నను, విషమ సమయములలో అది నన్ను రక్షింపఁజాలదని నే నెఱిఁగియుండవలసినది. ఆపత్సమయమునందు ఏ వస్తువు మనుష్యుని రక్షించునో ఆసమయమున దానిగుఱించి భావము ఉండదు, జ్ఞానమును ఉండదు. నాస్తికుఁడు తన ఆపత్తు తప్పుటకు స్వభావము కారణ మనును; ఆస్తికుఁడు తనను ఈశ్వరుఁడు రక్షించెనసును. మరియు తన వేదాంతాధ్యయనము గాని, తపస్సు లేక సాధన గాని, ఒక కారణముగా ఎంచును. ఈ రీతిగా ఎవరికి తోఁచినట్లు వారికి అనుమింప అధికారము ఉన్నది. కాని రక్షింపఁబడిన సమయమున తనను తన సాధనయే రక్షించినదో, మఱి యెవఁడేని రక్షించెనో తనకు తెలియదు. ఎవఁడు తన నిష్ఠాబలమునకు గర్వించునో వాఁడు తన నిష్ఠాబలము దుమ్మెధూళి అగునని ఎఱుఁగఁడా? అట్టి సమయములందు అనుభవము లేని శాస్త్రజ్ఞానము వృథా.

కేవల శాస్త్రజ్ఞానముయొక్క వైయర్థ్యము మొదట నా కనుభవ మైనది సీమలో. అంతకు ముందు జరిగిన విషయములలో నాకు ఠక్షణ మెట్లాదవెనో చెప్పఁజాలను. అప్పటికి నేను చిన్నవాఁడను. కాని నేఁడు నా కిరువదేండ్లు. గృహస్థాశ్రమము బాగుగా అనుభూత మైనది. పెండ్లము, పైఁగా పిల్లఁడు.........

* బలము లేనివారికి రాముఁడే బలము.

## ౨౧ నిర్బల కే బల రామ్

నాకు గుఱుతు కలంతవఱకు సీమలో నా యున్న చివర యేఁడు, అది ౧౮౯౦ సంవత్సరము, ఆ సంవత్సరమున పోర్ట్స్‌మతులో శాకాహారసభ జరిగెను. దానికి నేనును, నా మిత్రుఁ డొక్కఁడును ఆహూతుల మైతిమి. పోర్ట్స్‌మతు సముద్రపు రేవు. ఆయూరునందు నావిక జనము బహుళము. అచట చెడుపేరు గల స్త్రీలు సాక్షాత్తు భోగము వారు కారు. కాని నీతినియమల యేమియు పట్టుదల లేనివారు పలువురు కలరు. మేము అటువంటి ఒకయింట దిగితిమి. సన్మానసంఘమువారికి ఆ విషయము తెలియదని వేఱ చెప్ప నక్కఱలేదు. ఎపుడో ఒకసారి వచ్చిపోవు నా వంటి బాటసారులకు పోర్ట్స్‌మతు వంటి పత్తనమున ఏవి మంచి బసలో, ఏవి చెడుబసలో తెలిసికొనుట దుస్తరము.

రాత్రి సభనుండి మే మింటికి వచ్చితిమి. భోజనానంతరమున పేకాటకు కూర్చుంటిమి. సీమలో గొప్పగొప్పవారి యిండ్లలోఁగూడ గృహిణులు అతిథులతో పేకాడుట ఆచారము. ఆ పేకాటలో అందఱును నిర్దోషములైన ఛలోక్తుల నాడుచుందురు. ఇచట బీభత్సవినోద మారంభమాయెను.

నా మిత్రుఁ డీవిద్యలో నేర్పరియని నే నెఱుఁగ. నాకును ఈవినోదము ఇంపిత మాయెను. నేనును అందు దిగితిని. మాటలు చేతలలోనికి దిగఁజొచ్చెను. పేక నావల నుంచునవసరము వచ్చెను: కాని భగవంతుఁడు నా మిత్రుని హృదయమున ప్రవేశించెను. అతఁ డిట్లనెను: 'నీవు నా! ఈఘోరకలిలో? ఈపాపములో? నీ కిచట పని లేదు పో, లేచి పో.'

నేను సిగ్గున మగ్గితిని. అతని ముదల కైకొంటిని. హృదయమున నా మిత్రునకు కృతజ్ఞత చూపితిని. మా అమ్మగారిముందు నా చేసిన ప్రమాణము గుఱుతు తోఁకెను. నేను పాఱిపోతిని. నేను వడఁకుచు నా

గదికి పోతిని. వేఁటకాని తప్పించుకొన్న లేడివలె నాగుండెలు తటతట కొట్టుకొనెను.

పరకాంత యెడల నాకు వికారము కలుగుట కిది ప్రథమపర్యాయము. ఆరాత్రి నాకు నిదురపట్టలేదు. అనేకవిచారములు నన్నావరించెను. ఈ యింటినుండి లేచిపోనా? నే నీపత్తనమునుండియే పాఱిపోనా? నే నెచట నుంటిని? నేను కాఁపురవలమీఁద నుండనినో నాగతి యేమగును? ఇటు లనుకొని అప్పటినుండి అతిజాగ్రత్తతో మెలఁగ నిశ్చయించుకొంటిని. ఆయింటినే కాక యెట్టులేని పోర్ట్ సుమతునే విడిచిపోఁదలఁచితిని. సభలు ఇఁక రెండునాళ్లకెక్కువ జరుగవు. ఆ మఱునాఁటి సాయంకాలమే నేను పోర్ట్ సుమతునుండి నిష్క్రమించినటులను, నా మిత్రుఁడు మఱికొంతకాల మచట నున్నటులును గుఱుతు.

ఆ సమయమున నాకు మతమునుగూర్చిగాని, దైవమునుగూర్చిగాని, దైవసాహాయ్యమునుగూర్చిగాని, తెలియదు. నన్ను ఆసమయమున ఈశ్వరుఁడు రక్షించెనని అనుకొనుట తెలిసీ తెలియని స్థితి. అన్ని ఇక్కట్టులలో నన్నాఁతఁడు రక్షించెను. కాని జీవితముయొక్క వివిధ రంగములందు నా కిది యనుభవము. 'ఈశ్వరుఁడు నన్ను రక్షించె' అను వాక్యమునకు అర్థము నేఁడు నాకు చక్కగా తెలియును; కాని యింకను దీనివిలువ సరిగా గుఱుతింపఁజాలకున్నాననియు నే నెఱుఁగుదును. అనుభవముచేతనే అది తెలియఁదగినది. కాని యెన్నియో ఆధ్యాత్మిక యత్నములందును, లాయరుపనియందును, సంస్థాసంచాలనములందును, రాజకీయవ్యవహారములందును నాకు ఘాసఁగిన విషమఘటనలలో భగవంతుఁడు నన్ను రక్షించెనని చెప్పఁగలను. ఉపాయము లన్నియు ఊరేఁగినపుడు, సహాయులు దిగనాడినపుడు, అనువు లంతరించినపుడు, ఎటనుండియో, ఎటులో ఆసాహాయ్యము వచ్చునని నా యనుభవము.

స్తుతియు, ఉపాసనయు, ప్రార్థనయు, ఇవి గ్రుడ్డినమ్మకములు కావు. అవి పాన భోజన స్థాన గమనముల కంటె అధికసత్యములు. ఇవియ సత్యములు, మిగిలినవి అసత్యము లన్నచో అతిశయోక్తి కాజాలదు.

ఈ ఉపాసన, ఈ ప్రార్థన వాణీవైభవము కాదు. దీనికి కావలసిన నాలుక కాదు, హృదయము. కావున భక్తిని నించి హృదయమును నిర్మలము చేసికొంటిమేని, మన మా అనంతమున కెగురగలము. ప్రార్థనకు జిహ్వతో పని లేదు. అది స్వభావముచేతనే అద్భుత వస్తువు. వికారరూపములగు మలములను, అనగా కామాదులను, శుద్ధి చేయుటలో హృదయపూర్వకమైన ఉపాసన ఉత్తమ సాధనమని చెప్పుటకు నేను సందేహింపను. అయితే ఆ ఉపాసన అతి వినతితో, అతి నమ్రతతో పొంది పొసగి యుండవలయును.

## ౨౨

## నారాయణ హేమచంద్రుఁడు

ఆ రోజులలో నారాయణహేమచంద్రుఁడు సీమకు వచ్చెను. అతఁడు మంచి లేకరి అని వినియుంటిని. నేషనల్ ఇండియన్ అసోసియేషన్‌కు సంబంధించిన మానింగ్ కన్యా గృహమున మేము కలిసికొంటిమి. నేను ఇతరులతో కలిసిమెలిసి యుండలేనని మానింగ్ కన్య ఎఱుఁగును. నేను ఆమె యింటి కేఁగినప్పుడు, ఎవరేని పలుకరించి నపుడు తప్ప, నేను ముఖపిధానముగా కూర్చుండువాఁడను. ఆమె నాకు అతనితో పరిచితి కలిపెను. అతనికి ఇంగ్లీషు రాదు. అతనిది వింత వాలకము. ఒక వికారపు లాగు, అట్టిదే పార్శీపద్ధతిని ముడతలుపడి మురికియైన బూడిదరంగు కోటు; నెక్‌టైగాని, కాలరుగాని లేదు. కుచ్చులు కట్టిన ఉన్నిటోపీ. పైని సాదుగుపాటి గడ్డము.

అతఁడు బక్కపలుచన, పొట్టి. అతని గుండ్రపుమోమున మశూచి మచ్చలు. ముక్కు కొన వేలినదియుఁ గాదు, మొద్దు పాలును లేదు. మాటిమాటికి అతని చేయిగడ్డము మీఁద.

నాగరకసంఘమున ఆ వింతవాలకపు మనుష్యుఁడు వేలుపెట్టి చూపించునటు లుండుట సిద్ధము.

'నేను తమ్మును గుఱించి చాల వింటిని. మీ గ్రంథములు కొన్ని చదివితిని. మీరు నా యింటికి దయచేయరా?' అని నే నంటిని.

అతనిది ఇంచుమించు బండగొంతుక. నవ్వుచు అతఁ డిట్లనెను—
'మీబస ఎచట ?'

'స్టోరువీథిలో.'

'అగుచో మనము ఒకచోటివారమే. నాకు ఇంగ్లీషు చదివి కొనవలెనని ఉన్నది. చెప్పెదరా ?'

'నాకు తెలిసినదానిలో మీకు చెప్పుటకు నాకును సంతసమే. నాశక్తికొలఁది చెప్పెదను. మీకిష్టమేని నేనే తమకడకు వచ్చెదను.'

'వలదు, నేనే వత్తును. నా కడ పాఠమాల కలదు; దాని తీసికొని వత్తును.'

సమయము నిశ్చిత మాయెను. వడిగా మాకు నిండుసెయ్యము కలిసెను.

నారాయణ హేమచంద్రునకు ఇంచుకయు వ్యాకరణము రాదు. అతనికి గుఱ్ఱము అనునది క్రియ. పరువెత్తుట అనునది విశేష్యము. ఇట్టి విచిత్రోదాహరణము లింకను కొన్ని నాకు గుఱుతు కలవు. కాని అతని అజ్ఞానము నాకు కొఱుకఁబడలేదు. నా స్వల్పవ్యాకరణజ్ఞాన మాతనిమీఁద పాఱలేదు. వ్యాకరణము రాకపోయెనే అను దుగ్ధ అతనికి లేదు.

కొంచెమేనియు చింతలేక అతఁ డిటు లనెను—'నేనెన్నఁడును మీ వలె బడికి పోలేదు. నాఉద్దేశము ప్రకటింపవలసినపుడు వ్యాకరణావశ్యకత నాకు కానరాలేదు. సరియ, మీకు బంగాళీ వచ్చునా? నాకు వచ్చును. నేను వంగదేశము తిరిగితిని. మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు గ్రంథములు గుజరాతీవారికి అనువదించి ఇచ్చినది నేను. ఇంకను

ఇతరభాషలనుండి గొప్ప గ్రంథములను అనువదించి గుజరాతీవారికి సమర్పింపవలెను. నా అనువాదము మక్కికి మక్కి కాదు. భావమాత్రము తెచ్చినఁ జాలును, నాకు తృప్తి. నా పిమ్మట ఇతరులు వారి విజ్ఞానముతో ముందుముందు ఇంకను చక్కఁగా చేయఁగలుగుదురు. వ్యాకరణ సాహాయ్యము లేక నేను గ్రహించినది నాకు చాలును. తృప్తోఽస్మి. నాకు మరాటీ, హిందీ, బంగాళీ ఈమూఁడును వచ్చును. ఇప్పుడు ఇంగ్లీషు మొదలు వేసితిని. నాకు కావలసినది శబ్దరాశి. అంతటితో నా ఆశ తీఱు ననుకొంటిరా? ఊహుఁ. నేను ఫ్రాన్సు వెళ్లవలెను. ఫ్రెంచి నేర్వవలెను. ఆ పరాసుభాషలో మంచిగ్రంథములు కొల్లలుగా ఉన్నవని వింటిని. వీలు అయినచో జర్మనీ వెళ్లవలెను. ఆ భాష నేర్వవలెను' అని యిటు లాతఁడు విడిచిపెట్టక మాటలాడుచుండువాఁడు. ఆయనకు భాషల నన్నిటిని చుట్టఁబెట్టి మ్రింగవలయు నన్నంత ఆశ. మఱి పరదేశములు తిరుగను అట్టి యాశయే.

'అయితే మీ రమెరికాకును పోవుదురా?'

'తప్పక. ఆ క్రొత్తప్రపంచము చూడక మఱి ఇండియాకు మళ్లుదునా?'

'అయితే డబ్బు?'

'నాకు డబ్బుతో పనిలేదు. నాకు మీవలె హోషు అక్కఱలేదు. నేను తినున దెంత తాల్చెడి దేమి? నా పుస్తకము లిచ్చుకొలఁది డబ్బును, మిత్రు లిచ్చునదియు చాలు. నేను మూఁడవ తరగతిలోనే పయనింతును. అమెరికాకు వెళ్లుచో డెక్ మీఁదనే.'

నారాయణ హేమచంద్రుని ఈ మాదిరి ఋజువర్తన మనునది అది ఆయన సొంతము. మఱియు దానికి తూఁగు మంచి మనస్సును

ఆయనకు కలదు. గర్వస్పర్శయు లేదు; అయినను ఒకటి : తన శక్తిని గుఱించి మించిన నమ్మకము.

మేము రోజును కలియుచుంటిమి. మా పనులలో, చేఁతలలో కొంతవట్టు పోలిక కలదు. మేమిరువురము శాకాహారులము. తఱుచు మాకు ఒక్కఁడనే భోజనము. ఇది నాకు నేనే వండుకొని వారము ౧౩ షిల్లింగులతో గడుపు కాలము. నే నొకొక్కప్పుడు అతని గదికిని, అతఁడొకొక్కప్పుడు మాగదికిని పోవుచు వచ్చుచుండువారము. నా వంటక మింగ్లీషుమాదిరి. అతనికి హిందూమాదిరి తప్ప మరొకటి గిట్టదు. అతనికి పప్పు లేనిది ముద్ద దిగదు. నేను ముల్లంగితో సూపు చేయఁగా ఆయన మూతి ముఱుకటించువాఁడు. ఒకనాఁడు ఆయన ఎటులో వేఱుసెనగ లంకించుకొని వచ్చి వండి నాకు పెట్టవచ్చెను. నేను లొట్టలువేయుచు తింటిని. ఈరీతిగా నే నాయనకు, ఆయన నాకు పెట్టుట పతమారెను.

ఆ దినములలో కార్డినల్ మానింగుగారి పేరు ప్రతివాని పెదవులమీఁదను ఆడుచుండెను. నౌకాశ్రయమునందలి పనివాండ్రు కట్టిన సమ్మె జాన్ బరన్సు గారును, కార్డినల్ మానింగుగారును చేసిన ప్రయత్నముల వల్ల అంతమొందెను. కార్డినల్ మానింగుగారి నిరాడంబరమైన సౌమ్యజీవనమును గూర్చి డిజరాలీ మంత్రిగారి అభినందనమును నేను హేమచంద్రునికి చెప్పితిని. 'నే నాసాధు పురుషుని చూచుట జరూరు' అని అతఁడనెను.

'అతఁడు చాల గొప్పవాఁడు. నీ కెటులు చూడ వీలగును?'

'ఓ, కలుగును. దానికి మార్గము చెప్పెదను. నే నొక గ్రంథకర్త నయినట్లును, ఆయన పరోపకారప్రవీణతకు ప్రత్యక్షముగా ధన్యవాదముల నర్పింపఁ దలఁచినట్లును; మరొకటి, నాకు ఇంగ్లీషు రాదు గనుక

మిమ్ము దుబాసిగా తీసికొనివచ్చునట్లును-ఈయర్థమంతయు వచ్చునటులు నా పేరున మీ రొకఉత్తర మాయనకు వ్రాయుఁడు. తెలిసినదా?'

నే నటు లొక లేఖ వ్రాసితిని. రెండుమూ న్నాళ్లలో కార్డినల్ మానింగుగారు సమయ మేర్పఱచుచు ప్రత్యుత్తరించిరి.

మేమిరువురము వెళ్లితిమి. నేను ఒకరి దర్శనమునకు వెళ్లునపుడు తొడుగుకొను మామూలైన దుస్తులను తొడిగితిని. నారాయణ హేమచంద్రుఁడు తన సనాతన పద్ధతిలోనే యుండెను: మామూలు కోటు, మామూలు లాగు. నేను కొంచెము పరిహాసము చేసితిని. అతఁడు నా నవ్వో గురఁగొట్టి యిట్లనెను: 'నాగరకపు పిల్లకాయలు మీరందఱు పందలు. మహాపురుషు లెన్నఁడునుహృదయమును చూతురుగాని పైపైనిచూడరు.'

మేము కార్డినల్ మహాలు చొరఁబడితిమి. అది పెద్ద నగరు. మేము కూర్చున్నంతనే బక్కపలుచని పొడుగుపాటి ముదుసలి యొకఁడు వచ్చి కరస్పర్శ చేసెను.

నారాయణహేమచంద్రుఁడు అభివందనముతో ఇటు లనెను:—

'నేను మీసమయ మపహరింపను. నేను మీ కీర్తి చాల వింటిని. మీరు సమ్మెకట్టిన పనివాండ్రకు ఉపకారము చేసితిరి. ఇక్కడికి వచ్చి మి మ్మభినందింపవలెనని మనసు పుట్టినది. ప్రపంచమున సాధుపురుషుల దర్శనము చేసికొనుట నాకు రివాజు. అందులకు తమ కీ కష్టము కూర్చితిని.'

అతని గుజరాతీ పలుకులకు నేను తర్జుమా చేసితిని. 'మీ రాకకు సంతసము. మీకు ఇచట నివాసము సుఖకర మగుఁగాక! అని ఆసింతును. మఱియు మీ రిచటి జనముతో పరిచితు లగుదురు గాక! భగవంతుఁడు మీకు మంగళ మొసఁగుఁగాక!' అని మానింగుగారు ఈమాటలు పలికి నిష్క్రమించెను.

## ౨౨ నారాయణ హేమచంద్రుఁడు

నారాయణ హేమచంద్రుఁ డొకనాఁడు పర్టు తొడుగుకొని, దోవతి కట్టుకొని నా బసకు వచ్చెను. ఆ యింటి గేస్తురాలు తలుపు తీయుచునే భయపడెను. తత్తఱపాటుతో (నేను మాటిమాటికి మకాము మార్చుచుంటినని పాఠకుఁ డెఱుఁగు. ఇది మరల క్రొత్తమకాము. ఈమె క్రొత్తయామె. ఈమె నారాయణహేమచంద్రు నెఱుఁగదు.) నా కడకు పరువెత్తుకొని వచ్చి, ఒక రకపు పిచ్చివాఁడు మీకొఱకు వేచి యున్నాఁ డని చెప్పెను. నేను ద్వారముకడకు వెళ్లి నారాయణ హేమచంద్రునిఁ జూచి నివ్వెఱ పోయితిని. అతఁ డెప్పటివలె చునే ఉండెను.

'బజారులో పిల్లలెవ్వరును మిమ్ముఁ జూచి అల్లరి దు.

'వారు నావెంటఁ బడిరి కాని నేను వారివఁ దానితో వెనుదిరిగి పోయిరి.' ామచంద్రుఁడు

లండనులో కొన్ని మాసము లుండి పరాసుపుస్తకముల పారిస్ వెళ్లెను. అతఁడు పరాసుబా సరిచూడఁగలిగినంత ననువదింపను బూనుకొనెను. అతను వానిని చదువనిచ్చెను. అది ఫ్రెంచి నాకును వచ్చును గాన ర్థము. అనువాదము కాదు, మఱి వెళ్ల వలయునను తన నిశ్చయమును నిర్వ

తుద కతఁడు 'పడి డెక్ టికెట్టు సంపాదించెను. పర్టు, హించెను. తంజాఋులోనికి వెళ్లఁగా, అది అచట అసభ్యవేషమై దోవతి కట్టినా బైడ్ స్టేట్ సులో అతఁడు ప్రాసిక్యూషన్ చేయఁ వందువలన తరువాత అతనిని విడిచిరని గుర్తు.

## ౨౪

## పట్టా పుట్టినది-కాని పిమ్మట?

బారిస్టరు పరీక్ష నిచ్చుటకు నేను సీమకు వెళ్లితిని. అది ఏమైనది? దీని గురించి లోగడ చెప్పనైతిని. దాని గురించి కొంచెము వ్రాయుటకు ఇది తరి.

బారిస్టరు పరీక్ష నిచ్చుటకు రెండు నియమములు: ఒకటి నియతకాలపరిపాలనము, రెండు పరీక్షలిచ్చుట. ఇంచు మించు మూడేండ్ల పరిమితమైన కాలమును పండ్రెండుగా విభాగించి, అటులు ప్రవిభక్తమైన కాలమున ఒకొక్క ప్రవిభాగమున జరుగు ఇరువది నాలుగు విందులలో కనీసము ఆరువిందులు కుడుచుట నియతకాల పరిపాలనము.* విందులు కుడుచుట అనగా సాక్షాత్తు తినుట కాదు. నియతములగు గంటలయందు హాజరై విందు జరుగు కాలమంతయు ఉండుట. సామాన్యముగా అందరును పక్వాన్నములు భుజింతురు. కొందరు కొన్ని మద్యము గ్రోలుదురు. ఒకొక్కవిందునకు రెండుమూడు రూకల వెల. ఇది మితమే. ఏలయన్న, హోటెలులో ఒక్క మద్యమునకే అంత వెల యుండును. నవనాగరకులు కాని హిందువులకు అన్నము వెలకంటె తదంతర్లీనమైన మధువునకు అంత వెల అయిన దన్నచో వింతయే. సీమలో నాకీసంగతి క్రొత్తగా తెలిసినపుడు హృదయా

* అనగా మూడుసంవత్సరములకు పండ్రెండు టెరములు (terms); ఒక్కొక్క టెరమునకు పండ్రెండు విందులు; సంవత్సరమున కిట్టి టెరములు నాలుగు, విందులు తొంబది యారు.

ఘాతము కలిగెను. త్రాగుటకు ఇంత డబ్బు ఏల పాడు చేయుదు రని ఆశ్చర్యమయినది. తరువాత నాకది అర్థమైనది. నేను తలుచు అందు తిన్నది లేదు. ఏలనఁగా, అందు నాకు తినఁదగినవి రొట్టెయు, బంగాళాదుంపయు, కాబేజియుమాత్రము. మొదట వీనియందు నా కిష్టములేక తినలేదు; రుచిపడిన పిమ్మట ఇంకను పెట్టుమని అడుగుటకు సాహసించితిని.

విద్యార్థులకిడు నాహారముకన్న ఉపాధ్యాయులకిడు నాహారము మేలుతరమైనది. నాతోపాటు శాకాహారి ఒక పార్సీవిద్యార్థి కలఁడు. మేము శాకాహారులము కావున ఉపాధ్యాయులకు పెట్టు శాకాహారములలో కొన్ని మాకు పెట్టుఁడని విన్నవించుకొంటిమి. మా విన్నపము కైకోలాయెను. మాకును శాకములు, ఫలములు రాఁదొడఁగెను.

అందు నలువురు విద్యార్థుల ముఠాకు రెండు సారాబుడ్లనిత్తురు. నేను సారా సోఁకను, కావున ముఠా నిండుటకు ప్రతివారును నన్ను ఆహ్వానించువారు. ఏలనఁగా వారు మువ్వురే రెండుకాయలను పీల్చి వేయవచ్చును. ప్రతి యిరువదినాలుగు విందులకును ఒకటి పెద్దవిందు. దానికి గ్రాండు నైట్ అని పేరు. అందు మామూలువి కాక షాంపేన్, పోర్టువైన్, షెర్రీ మున్నగు మద్యములు ఉండును. ఆనాఁడు నాకు ప్రత్యేకముగా పిలుపుమీఁద పిలుపు, పిలుపుమీఁద పిలుపు ఉండెడిది.

ఈవిందులవలన బారిష్టరగుటకు అధిక-అర్హత ఎటులు కలుగునో నాఁటికిని, నేఁటికిని నాకు తెలియరాదు. మొదటమొదట ఈవిందులకు కొలఁదిమంది విద్యార్థులు వెళ్లెడువారు. విద్యార్థులకును, ఉపాధ్యాయులకును పరస్పరము సంభాషణములకు అవకాశము ఉండెడిది. ఉపన్యాసములును జరిగెడివి. వీనివలన మెలఁగుపడిన లోకజ్ఞానమును, కొంత నాగరకతయు, ఉపన్యాససమర్థతయు

విద్యార్థులకు అబ్బెడిది. నాకాలము వచ్చునరికి అవన్నియు దాటిపోయెను. ఉపాధ్యాయులు విద్యార్థులకు ఎడముగా కూర్చుండిరి. దాని అర్థ మంతరించెను. ఆచారము మిగిలెను. పూర్వాచారపరాయణమైన ఇంగ్లాండునందు ఆ ఆచారము వదలక వచ్చుచున్నది.

బారిష్టరు పరీక్షకు చదువవలయు గ్రంథములు చులుకన కావున బారిష్టర్లకు డిన్నర్ బారిష్టర్లని నవ్వులాటపేరు. డిన్నరు బారిష్టర్లనఁగా తిండిపోతు బారిష్టర్లు. నామమాత్రమునకు పరీక్షలని అందఱకు తెలియును. నారోజులలో రెండు పరీక్షలు: రోమన్‌లాలో, కామన్ లాలో. ఈపరీక్షకు నియతగ్రంథములు కలవు. విడివిడిగా చదివి, విడివిడిగనే పరీక్ష నీయనగును. కాని ఎవ్వరును చదివిన పాపమునఁబోరు. రెండువారములు రోమన్‌లాటీకను బట్టీ పెట్టియు, రెండుమూఁడు నెలలు కామన్‌లాటీకను చదివియు పరీక్ష ఇచ్చినవారిని చాలమందిని నేనెఱుఁగుదును. ప్రశ్నములు తేలిక; పరీక్షకులు ఉదారులు. రోమన్ లాపరీక్షలో నూటికి ౯౫ నుండి ౯౯ మందిపఱకును, అసలు పరీక్షలో నూటికి ౭౫ గురును, అంతకు ఎక్కువమందియు నెగ్గుచుండెడివారు. ఈరీతిగా పరీక్షాభయములేదు. సాలునకు పరీక్షలు నాలుగుతూరులు. ఇంత వీలైనపరీక్షలు కష్ట మనిపింపవు.

నేను అసలు పుస్తకములన్నియు చదువఁ దలఁచితిని. ఈగ్రంథములు పఠింపకుండుట మోసమని నాతలఁపు. నేను వానికొఱకు చాల వెచ్చించితిని. రోమన్‌లాను లాటిన్ భాషలో చదువ నిర్ణయించితిని. నేను లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు లాటిన్ చదివియుంటిని. అది యిపు డుపకరించెను. ఈచదివిన చదువున కంతయు విలువ లేకపోలేదు. అది దక్షిణ-ఆఫ్రికాలో ఉపయోగించెను. దక్షిణ-

ఆఫ్రికాలో రోమన్ డచ్చిలా ప్రమాణము. ఇటులు లాటిన్ చదివి కొనుట దక్షిణ-ఆఫ్రికాలా తెలిసికొనుటకు సాయపడినది.

ఇంగ్లాండు కామన్‌లాను అహోరాత్రములు చదువఁగా నాకు బరువుగా తొమ్మిది నెలలు పట్టెను. బ్రూమ్సు 'కామన్‌లా' పెద్దది కాని రుచిగా ఉండెను. కాని కాలమును మ్రింగివేసెను. స్నెల్ సు 'ఈక్విటీ' హృదయంగమము కాని అర్థము చేసికొనుట కొంచెము కష్టము. వైట్ అండ్ ట్యూడర్ 'సు 'లీడింగ్ కేసెస్' అను గ్రంథమునుండి కొన్ని కేసులు పఠితవ్యములు ఆ గ్రంథము మనోహరము, జ్ఞానదాయకమును. విలియమ్సు అండ్ ఎడ్వర్డ్ సు 'రియల్ ప్రాపర్టీ', గుడీవ్ స్ 'పెర్సనల్ ప్రాపర్టీ' అను గ్రంథములు సంతోషముగా చదివితిని. విలియంగారి పుస్తకము నవలవలె తీసికొనిపోవును. అట్టి అభిరుచితోడనే నేఁ జదివిన గ్రంథము మెయిన్ సు 'హిందూలా.' హిందూదేశమునకు నేను మరలి వచ్చునపుడు స్టీమరులో దానిని చదివినగుర్తు. హిందూలా గ్రంథములఁ గూర్చి ఇచట వక్కాణించుట కిది తావు గాదు.

నేను పరీక్ష అయితిని. ౧౮౯౧ సం. జూన్ ౧౦ వ తేదీని పట్టా పుట్టెను. ౧౧వ తేదీని ఇంగ్లాండు హైకోర్టులో రెండున్నర షిల్లింగు లిచ్చి పేరు రిజిష్టరు చేయించుకొంటిని. ౧౨ వ తేదీని ఇంటికి బయలుదేరితిని.

ఇంత చదివినను నా బెంగకును, భీతికిని అంతు లేదు. కోర్టులో వాదించుటకు నేను తగనని భయము వేసినది.

ఆ క్షోభ వర్ణించుటకు మరొక ప్రకరణ మావశ్యకము.

## ౨౫

## నా బెంగ

బారిస్టరుపరీక్ష ఇచ్చుట సులభమే కాని బారిస్టరుగా పని చేయుట దుర్లభము. నేను లా అంతయు నేర్చితిని గాని వాదించుట నేర్వలేదు. నేను ధర్మసిద్ధాంతములను (Legal Maxims) అభిరుచితో చదివితిని కాని వానిని నావాదములలో ఎప్పుడెపుడు ఉపయోగపఱచుకొనవలయునో తెలియదు. 'ఇతరులకు అపకారము కలుగకుండు రీతిని నీవస్తువును వాడుకొనుము' అను నిది ఒకధర్మవచనము. ఈధర్మవచనము తన క్లయింటుకు లాభించుటకు ఏచందముగా ఉపయోగింపవలయునో నాకు తెలియలేదు. ఈసిద్ధాంత శీర్షిక క్రింద ముఖ్యములైన కేసు లన్నియు చదివితిని కాని అవి వాదించుపట్ల ఈధర్మ వచనము ఉపయోగించునను నమ్మకము కలిగింపలేదు.

మఱి నేను ఇండియను లా చదువనే లేదు. హిందూలా మహమ్మదీయ లాలు అవ లెట్లుండునో ఎఱుఁగను. ప్లయింటు ఎటులు వ్రాయవలయునో నేర్చికొనలేదు. నట్టేట నున్న ట్లుంటిని. సర్ ఫిరోజిషా మెహతాగారు కోర్టులలో సింహగర్జనములు చేయుదురని వింటిని. అతఁడీవిద్యను సీమలో ఎటులు నేర్చెనో అని నేను ఆశ్చర్యపడితిని. ఆయన నైపుణ్యము ఈజన్మమున నాకు రాదనుట నిక్కమేకాని ఈవృత్తిలో ఉదరపోషణమైన చేసికొనఁగలనా, లేనా? అని నా సంశయము.

నేను లా చదివికొను రోజులలోనె ఈసంశయములచే క్షోభపడితిని. ఒకరిద్దరు మిత్రులకడ తలపోసికొంటిని. దాదాభాయి నౌరోజీ

గారి సలహా పుచ్చుకొమ్మని అందొక రనిరి. నేను సీమకు వెళ్లునపుడు దాదాభాయిగారికిఁగూడ ఒకసిఫార్సు ఉత్తరమును తీసికొని వెళ్లితి నని లోఁగడ చెప్పియుంటిని. నే నాఉత్తరమును చాలకాలమునకు బయటికి తీసితిని. ఏలనఁగా, ఈమహాపురుషుని దర్శించుటకు నాకేమి అధికారము కలదు? వారి ఉపన్యాసము జరుగునని వినినపు డెల్ల నేను హాజరై ఒకమూల కూర్చుండి, చెవులార విని, కన్నారఁ గాంచి పోవుచుంటిని. విద్యార్థుల మేలుగీళ్లు బాగుగా తెలిసికొనుటకు ఆయన ఒకసంఘ మేర్పఱచెను. నేను ప్రతిసభకు వెళ్లెడువాఁడను. దాదాభాయిగారికి విద్యార్థులపట్లఁగల వాత్సల్యమును, విద్యార్థులకు వారి యెడఁగల భక్తిని చూచినపుడు నాకు ఆనంద మయ్యెడిది. క్రమముగా ఒకనాఁడు నేను ధైర్యము తెచ్చుకొని సిఫార్సు ఉత్తరము తీసికొని వెళ్లితిని. 'నీ కిష్టమైనపు డెల్ల వచ్చి నాసలహాను పొందవచ్చును' అని ఆయన అనెను. కాని ఆ అవకాశమును నే నుపయోగించుకొనలేదు. అత్యావశ్యకత లేనిది ఆయనకు కష్టమిడుట తప్పని తలఁచితిని. కావున 'నీక్షోభ నంతయు దాదాభాయికి చెప్పికొనుము' అనిన నామిత్రుని సలహాను ఆసమయమున గ్రహింపసాహసింపలేదు. ఫ్రెడెరిక్ పిన్కట్ గారిని దర్శింపుమని అతఁడె సలహా చెప్పెనో, మరొక మిత్రుఁడే చెప్పెనో, గుర్తు చాలదు. అతఁడు పూర్వాచారపరాయణుఁడు (Canservative). అయినను భారతీయవిద్యార్థులపై ఆయనప్రేమ నిర్మలము, నిస్స్వార్థము. విద్యార్థులందఱును ఆయనసలహాకు పోవుచుందురు. నేనును వారి దర్శనము కోరఁగా వా రంగీకరించిరి. నేను దర్శనమునకు వెళ్లితిని. ఆసంభాషణము నాకు మఱపురాదు. ఆయన మిత్రునితో సంభాషించినటులు నాతో సంభాషించెను. నానిరాశ నంతయు ఒక్క నవ్వుతో ఎగురఁగొట్టెను. 'ఏమిటి? అందఱును ఫిరో

జీపా మొహరీలు కావలయునా? ఫిరోజిషాలు, బదురుద్దీనులు అరుదుగా నుందురు. మామూలు లాయరగుటకు గొప్ప తెలివితేటలు కావలయు ననుకొనకుము. సాధారణమైన ప్రామాణికత్వము, శ్రద్ధయు ఉండినచో చాలును. దాన తగురీతి ద్రవ్య మార్జింపనగును. దావాలన్నియు గుంటచిక్కులుగా నుండవు. మంచిది; నీవే మేమి పుస్తకములు చదివితివి? పాఠపుస్తకములు కాక ఇతరపుస్తకము లేమేమి చదివితివి ?' అని ఆయన అడిగెను.

నేను చదివిన అల్పగ్రంథములు చెప్పితిని. ఆయన కొంచెము నైరాశ్యము చెందెను. అయినను అది క్షణికము. వెంటనే ఆయన చిఱునవ్వుతో ఇటు లనెను: 'నీకథ నాకు తెలిసినది. నీకు ఇతర గ్రంథపరిచయమువలనఁ గలుగు జ్ఞాన విశేషము కొలఁది. నీకు ప్రపంచ జ్ఞానము లేదు. అది వకీలునకు ప్రాణము. నీవు హిందూదేశచరిత్రము నయినను చదివియుండవైతివి. వకీలైనవాఁడు మనుష్యస్వభావము నెఱిఁగియుండవలయును. అతఁడు మొగము చూచి మనుష్యుఁ డెట్టివాఁడో కనిపట్టవలయును. మఱియు ప్రతిహిందువు హిందూదేశచరిత్ర తెలిసికొని తీఱవలయును. లాయరునకు దానితో సంబంధము లేక పోవుఁగాక, దాని తెలిసికొనుట విధి. కే, మాలెసన్‌గార్లి రువురును వ్రాసిన ౧౮౫౭ సం. విప్లవచరిత్రగూడ (Mutiny) నీ వెఱుఁగవు. వెంటనే ఆపుస్తకమును, మఱి మానవస్వభావ మెఱుఁగుటకు ముఖసాముద్రికమును (Phisiognomy)గూర్చి లావేటరుగారును, షెమ్మెల్ పెన్నిక్ గారును వ్రాసిన గ్రంథములు రెంటిని సంపాదింపుము.'

ఈమిత్రపాదులకు నే నెంతయు కృతజ్ఞుఁడను. ఆయన యెదుట నాభయము ఎగిరిపోయెఁ గాని కాలు బయటఁ బెట్టఁగనె ఎప్పటాట. దారిపొడుగునను 'ముఖముచూచి మనుష్యుఁ డెట్టివాఁడో కనిపట్టుట'

అని అనుకొనుచు, మరి ఆరెండు పుస్తకములఁగూర్చి తలపోయుచు ఇంటి కేఁగితిని. మఱునాఁడు లావేటరుపుస్తకము కొంటిని. అంగడిలో షెమ్మెల్ పెన్నిక్ గారి పుస్తకము దొరకలేదు. లావేటరుగారి పుస్తకము చదివితిని. అది స్నెల్ గారి 'ఈక్విటీ'కంటె కఠినముగా నుండెను. షేక్స్పియరుగారి ముఖసాముద్రికమును చదివితిని. అయినను లండను వీథులలో క్రిందినుండి మీఁదికిని, మీఁదినుండి క్రిందికిని షేక్స్పియరు తిరుగుటగుఱించి తెలిసికొను ప్రావీణ్యము కలుగలేదు.

లావేటరు పుస్తకము నాకు ఉపయోగింపలేదు. పిన్కటుగారి ఉపదేశము నాకు సాక్షాత్తు ఉపయోగింపలేదు కాని వారి నెయ్యము చాల తోడుపడెను. వారి నగవుమోమును, ఉదారాకృతియు నాహృదయమున నిలిచియున్నవి. మంచిలాయరగుటకు ఫిరోజిషా మెహతాగారి నైపుణ్యమును, ధారణయు, శక్తియు ఆవశ్యకములు కావు. మఱి ప్రామాణికత్వమును, శ్రమపడి పనిచేయుటయు, అనునవి ఉన్నచో చాలునను ఆయన సలహాను నేను విశ్వసించితిని. ఈ రెంటియందును నేను భాగస్వామి నగుటవలన మరల నాకు ఆశ కలిగెను.

సీమలో నేను కేగారును, మాలెసన్ గారును కలిసి వ్రాసిన గ్రంథములను చదువలేకపోతిని. కాని నాకు సమయము చిక్కుచో మునిముందు ఈగ్రంథములను చదువ నిశ్చయించుకొంటిని. దక్షిణ ఆఫ్రికాయందు ఆమనోరథము తీరెను.

ఇట్టినిరాశలో కొలఁది ఆశగొని 'అస్సాము' అను స్టీమరునుండి బొంబాయిరేవులో దిగితిని. రేవులో సముద్రము అల్లకల్లోలముగా నుండెను. లాంచిలో ఒడ్డు చేరితిని.

## ప్రథమ భాగము

# ౧

## రాయచందుభాయి

బొంబాయి రేవులో సముద్రము ఒడుదొడుకుగా ఉన్నదని వెనుకటి ప్రకరణమున వ్రాసియుంటిని. జూన్ జులై నెలలలో అరేబియా సముద్రము అటు లుండుట క్రొత్తగాదు. ఏడెన్ మొదలుకొని సముద్రము కల్లోలముగనే ఉండెను. ఓడలో అందఱును అస్వస్థులైపోయిరి. సరిగా ఉన్నవాఁడను నేనొక్కఁడనే. డెక్కుమీఁద నుండి తుపానును చూచి ఆనందించుచుంటిని. ప్రొద్దుటి భోజనమునకు నాతోపాటు ఒకరిద్దఱు ఉండువారు. మేము పళ్లెరములను జాగ్రత్తగా పట్టుకొని ఓటుపిండి గంజి త్రావుచుంటిమి. ఏలన ఏమాత్రమేని దానికేసి చూడకున్నచో దానిదారి అది చూచుకొనును.

ఈ బయటితుపాను నా లోపలి తుపానునకు చిహ్నమాత్రము. బయటితుపానునకే నేను చలింపనపుడు లోపలితుపానునకుఁ గూడ చలింపలేదని వేఱుగా చెప్పనక్కఱలేదు. బొంబాయిలో దిగి యింటికి వెళ్లఁగనే జాతిబహిష్కారము సిద్ధముగ నున్నది. ప్లీడరు వృత్తికి నేనసమర్థుఁడనని వెనుకనే చెప్పికొంటిని. మఱి నేను సంస్కర్తను. కాఁబట్టి కొన్నికొన్ని విషయములు ఎటులెటులు సంస్కరించిన బాగుగా నుండునోయని ఆలోచించుచుంటిని. కాని అతర్కితములగు విషయములు కొన్ని నాకొఱకు కనిపట్టుకొని యుండెను.

నన్ను కలిసికొనుటకు మా పెద్ద అన్న రేవులోనికి వచ్చెను. డా. మెహతాగారితోను, వారి పెద్ద అన్నగారితోను ఆయన కదివఱకే

పరిచితి కలదు. డా. మెహతాగారు మాయింటికి రండని గట్టిపట్టు పట్టుటచే మేమందఱము వారి యింటికే వెళ్లితిమి. దాన, సీమలో మొలకెత్తిన మా పరిచయము ఆకు దొడిగినది. ఇక్కడ వారి కుటుంబమునకును,మా కుటుంబమునకును నెయ్యపువియ్య మెక్కువ అయినది.

'అమ్మను ఎన్నఁడు చూతునా'అని నేననుకొనుచుంటిని! ఆమె ఈ లోకమును విడిచిపోయెనన్నవార్త మా యన్న నాకు తెలియనీయ లేదు. ఓడ దిగినపిమ్మట చెప్పెను. నేను సూతకస్నానము చేసితిని. నేను సీమలో నుండఁగనే ఆమె చనిపోయెను. కాని దేశములలో వెతచెందెదనని అంతవఱకును నాకు తెలుపలేదు. ఈ వార్త వినఁగనే నాకు మిక్కిలి వెత గలిగినది; కాని ఆ గాథ ఇపు డప్రస్తుతము. మా తండ్రిగారు పోయినప్పటి వెతకన్న అది మిన్న. నా కోరికలన్నియు గొంతెమ్మకోరికలయినవి. కాని అపుడు నేను దుఃఖమునకు కళ్లెము వదలనటులు గుర్తు. నేను కంట తడిఁ బెట్టలేదు. మా అమ్మగారు చనిపోని రీతిగనే గంభీరించి నా వ్యవహారములు నేను చేసికొనిపోవు చుంటిని. అపుడు డా. మెహతాగారు నాకు పలువురతో పరిచితి కలిగించెను. వారిలో రేవా శంకరజగజీవన్‌గారు ఒకరు. వీరు మెహతాగారి సోదరులు. వీరితో అపుడు కలిసిన మైత్రి యావజ్జీవమైత్రి అయెను. అపుడే డా. మెహతాగారు నాకు రాయచంద్ర లేక రాజచంద్రకవి గారితో పరిచితి కలిగించిరి. వీరు డా. మెహతాగారి పెద్దన్నగారి అల్లుఁగుఱ్ఱలు; రేవా శంకర జగజీవన్‌గారి నగల దుకాణమున భాగస్వాములు. నాకు వీరి పరిచయ మనునది చాల గొప్పమాట. వారికపుడు ఇరువది యైదేండ్లే కాని చూడఁగనే వారు విమలచరిత్రులనియు, విద్వాంసులనియు తెలిసికొనఁ గలిగితిని. మఱియు వారు శతావధానులు. డా. మెహతాగారు రాజచంద్రకవిగారి ధారణాపటిమను కొం

చెము చూడుమనిరి. నాకు వచ్చిన పాశ్చాత్య భాషా భండారమును కొల్ల వెట్టితిని. నేనెటులు చదివితినో రాజచంద్రకవిగారు అటులు చదివిరి. ఆయన సామర్థ్యమును చూచి నే నోర్వలేకపోతిని. కాని ఈధారణ, ఈశతావధానము ఈశక్తులకు నేను ముగ్ధుఁడను కాలేదు. ఏది నన్ను ముగ్ధునిఁజేసెనో అది తరువాత తెలియనాయెను. అది యేదనఁగా: వారి విశాల శాస్త్రజ్ఞానము; నిర్మల చరిత్రము; ఆత్మజ్ఞానమునెడల తీవ్రమగు ఆవేదన. ఈచివరదానికొఱకే ఆయన జీవితమును వినియోగించె నని నాకు పిదప పిదప తెలియఁజొచ్చెను.

ఆ. ఆటలందు పాటలందున బాసట
గాఁగ హరిని జూడఁ గందునేని
పుట్టు విద్ధి తుదిని ముట్టు ముక్తానందు
బ్రతుకునకును సూత్ర మిదియు తలఁప.*

అను ఈ ముక్తానందుని గేయమును రాజచంద్రకవి ఎప్పుడును స్మరించుచుండును. ఈపాట అతని హృదయమున అంకితమైపోయెను.

ఆయన వ్యాపారము లక్షలమీఁద. వ్యాపారమూ ముత్తెములతో, వజ్రములతో, రత్నములతో. అం దతని ప్రజ్ఞ అసామాన్యము. ఎంత చిక్కైనను అతఁ డిట్టే విడఁదీయును. కాని ఆయన బుద్ధి వేఱొకచోట. ఆయన కెప్పుడును పురుషార్థము, ఆత్మసాక్షాత్కారము,హరిదర్శనము ఇదియేమాట. అతని వ్రాఁతబల్లపై చిత్రాల్లతో పాటు ఏదోయొక వేదాంతగ్రంథము, దినచర్య (డయరీ) యూ ఎల్లప్పుడును

* హసతాం రమతాం ప్రగట హరి దేఖుం రే
మారుం జీవ్యుం సఫల తవ లేఖుం రే
ముక్తానంద నో నాథ విహారీ రే
ఓధా జీవన దోరీ అమారీ రే.

ఉండును. వ్యవహారము ముగిసీ ముగియనిముందే ఆయన ఆరెంటిలో ఒకటి చేతఁ దీసికొనును. ఆయన గ్రంథరూపములుగ ప్రకటించిన పలువిషయములు ఈ దినచర్యలనుండి ఎత్తఁబడినవే. అతఁడు లక్షలకొలఁది వ్యాపారస్థులతో మాటాడి వారిని పంపిన వెంటనే ఆత్మజ్ఞానమునకు సంబంధించిన గూఢ విషయముల వ్రాయుచుండును. చూడఁగా అతఁడు సామాన్యవర్తకుఁడు కాఁడు. కేవలము జ్ఞానికోటిలోని వాఁడు. దుకాణములో వ్యాపారములనడుమ ఈశ్వరనిమగ్నుఁడైయుండఁగా అతనిని నేను పెక్కుమారులు చూచితిని. ఇతఁడు సమత్వమును వీడిన నిమిషమొకటియు నాకు కానరాలేదు. ఆయనకు నాతో స్వార్థ మేమియు లేదు. కాని నాకు వీరితో గాఢపరిచయము కలిగెను. నేనప్పటికింకను పనిపాటలులేని బారిష్టరును. నేను వారి దుకాణమునకు వెళ్లినపుడు వేదాంతము వినా వేఱొకమాట లేదు. నాకప్పటికి వేదాంత విషయములందు అంతగా ఆసక్తిలేకున్నను నాకు వారి మాటలే మంత్రములుగా ఉండెను. ఇటు పిదప నే ననేకమతాచార్యులను దర్శించితిని. ప్రత్యేకముగా నే నాచార్యు నన్వేషించితిని. కాని రాయచందుభాయి ఉపదేశములవంటి వేవియుఁ గావు. ఆయన ఉపదేశము సూటిగా నామది నాటుకొనెను. వీరిబుద్ధియందును, వీరి ప్రామాణికత్వమందును నాకు పరమాదరము. మఱియు ఆయన నన్ను అన్యమార్గమునకు కొనిపోవఁడని నాకు విశ్వాసము. ఆయన హృదయ గుహలోని భావములు కొన్ని నా కెఱిఁగించుచుండువారు. ఈశ్వరుని తెలిసీ తెలియక కొట్టుకొనునపుడు ఈపైకారణములచే ఆయనయే నాకు శరణ్యమగుచుండెను. రాయచందుభాయియెడ నాకు ఇంత ఆదర మున్నను నా హృదయసింహాసనమున అతని గురునిగా అభిషిక్తునిచేయఁజాలకపోతిని. ఆసింహాసనమింకను కాళీగా నేయున్నది. నా అన్వేషణమింకనుజరుగుచు నేయున్నది.

## ౧ రాయచందుభాయి

హిందూవేదాంతము గురుపదమునకు ఏమహత్త్వ మిచ్చెనో దానిని నేను మన్నింతును. గురువు లేక గుఱుతు తెలియదనుమాట సత్యము. అక్షరజ్ఞానము కలిగించు గురువు అసమర్థుఁడైనను అంత ఇబ్బంది లేదు; కాని ఆధ్యాత్మికగురువు అసమర్థుఁ డగుచో సాగదు. గురుపదమునకు పూర్ణ జ్ఞానియే అర్హుఁడు. జ్ఞానముఁ బడయుటకు సర్వదా అన్వేషణము వలయు. శిష్యుని యోగ్యత ననుసరించి గురువు లభించును. తనతన యోగ్యత ననుసరించి ప్రతిసాధకునకు ప్రయత్నము చేయుటకు సంపూర్ణాధికారము కలదు. ఫలము ఈశ్వరాధీనము.

దీనివలన నేను రాయచందుభాయిని నాహృదయస్వామిగా చేసికొనకున్నను పలుమాఱు లాతఁడు నాకు మార్గదర్శకుఁడుగను,సహాయుఁడుగను తోడ్పడియెనని ముందుముందు చూడఁగలరు. నా జీవితమందు తమచిహ్నములను గాఢముగా హత్తిపోయినవారు మూవురు. వారు ఆధునికులు. రాయచందుభాయి వారి ప్రత్యక్షసంసర్గమువలనను, 'టాల్‌స్టాయి' 'వైకుంఠము నీ హృదయములోనే' * అను పుస్తకమువలనను, రస్కిను 'సర్వోదయ'† మను పుస్తకమువలనను నా హృదయము చూరగొనిరి. ప్రసక్తి కలిగినపుడు వీరిని వివరింతును.

* The Kingdom of God is within you.

† Unto this eah last.

## ౨

## జీవయాత్ర

మా అన్న నాపై ఆశలు పెట్టుకొని యుండెను. ఆయనకు ధనము, కీర్తి, పదవి—వీని లోభ మెక్కుడుగా నుండెను. ఆయన దోషమును క్షమింపఁగల విశాల హృదయుఁడు. దానికి తోడు నిరాడంబరమైన వర్తనము. కాన ఆయనకు పలువురు మిత్రులైరి. అతఁడు ఈ మిత్రుల సాయమున నాకు కేసులను తెప్పింప నెంచెను. నా ప్లీడరువృత్తి పెద్దగా సాగునని యూహలు పెంచుకొని వానితో పాటు గృహవ్యయమును మిగుల పెంచెను. ఆయన నా ప్రాక్టీసునకు పూర్వరంగము తయారుచేయుటకు చేయని యత్నము లేదు.

నా సముద్రయానమును గురించిన తుపా నింకను వీచుచునే యుండెను. మా కులమున రెండు పక్షములు బయలుదేరెను. అందొక పక్షమువారు నన్ను వెంటనే కలుపుకొనిరి. రెండవ పక్షమువారు వెలివెట్టు పట్టుమీఁదనే ఉండిరి. మమ్ము కలుపుకొనిన పక్షమును సంతసపెట్టుటకు మా అన్నగారు రాజకోటకు పోకముందే నన్ను నాసికకు తీసికొనిపోయి అచట నదీస్నానము చేయించెను. రాజకోట చేరఁగనే కులమువారికి విందిడెను. దీనికి నా మన సొప్పలేదు. కాని మా అన్నకు నాపై అపార ప్రేమ. దానికి తగినటులే వారియెడ నాకు భక్తియు ఎక్కువ. కాన నేను వారి మాటనే మంత్రముగా గ్రహించి వారు చెప్పినటులు చేసితిని. ఈ రీతి జరిగెను గనుక వెలి యనుమాట మరల ఎవరును అనుకొనలేదు.

నన్ను వెలివేసిన వారిలో చేరుటకు నే నెన్నఁడును ప్రయత్నింపలేదు. అయినను ఆ పక్షమునందలి పెద్దలపై ఎన్నఁడును ఈసు పెంచుకొనలేదు. వారిలో కొందఱు నన్ను ఏవగించుకొనుచుండెడు వారు గాని నేను వారి కొదిగి యొదిగియే పోవుచుంటిని. వెలికి విధించిన కట్టుబాటుల కన్నింటికిని నేను తలయొగ్గితిని. ఎవ్వరేని, తుదకు మా అత్తమామలుగాని, అప్పబావలు కాని నన్ను భోజనమునకు పిలిచి నచో వారికి వెలి. నేను వారియిండ్ల జలమేని పుచ్చుకొనకుంటిని. కాని వారు చాటుమాటుగా మాలో కలియుటకు మొగ్గుచుండిరి కాని నీటుగా చేయరాని పని చాటుగా చేయుట యనిన నాకు తలపోటు.

నే నిటులు మెలఁగుచునతో నున్నందున కులమువారు నాకేమియు ఎద్దడి తెచ్చిపెట్టలేదు. ఇంతియ కాదు; నన్ను వెలివానిగా చూచుచున్నను ఆశాఖీయులలో చాలమందికి నాపై ప్రేమ. నేను మా కులమున కేదో తెచ్చిపెట్టెదనని తలఁపకయే వారు నాపూనికకు సాయముగూడ చేసిరి. నేను ప్రతిక్రియ ఏమియు చేయనందువల్ల ఇట్టి మేలు కలిగెనని నా నమ్మిక. నన్ను కులమున కలుపుకొనుటకుఁగాను నేను గందరగోళము చేయ మొదలిడినయెడల, మఱియు అప్పటికున్న పక్షములను ఇంకను పెంపఁదలఁచి శాఖీయులను ప్రేరించినయెడల, వారు తప్పక ప్రతిక్రియ చేసియుందురు; మఱియు నేను సీమనుండి దిగఁగనే నిర్లేపముగా ఉండుటకు బదులు ఈ కలఁతె సుడిగుండములలోఁబడి కేవలము కపట నాటకమున ఏదో వేషము వేయుచుండి యుందును.

మా దాంపత్య మింకను నే ననుకొన్నటులు కుదురలేదు. నేను సీమకు వెళ్లినపిమ్మటఁగూడ ద్వేషదుష్టస్వభావము నన్ను విడువలేదు. అడుగడుగునకు తప్పు లెన్ను నా నైజము యథాప్రకారముగ నే

యుండెను. దీనివలన నా మనోరథ మీడేఱలేదు. నా భార్యకు వ్రాఁత కోఁతలు నేర్పవలయును; కాని నా కామోద్రేకము దాని కడ్డు. లోపము నాది, కష్టానుభవ మామెది. ఒకతూరి ఆమెను పుట్టినింటికి పంపివేయ పనికిఁగూడ పాల్పడితిని. కడు కష్టముల పాలుచేసిన పిదప నే మరల స్వీకరించితిని. కొంతకాలమునకు తప్పంతయు నాదే యని గ్రహించితిని.

బాలుర విద్యాభ్యాసమును సంస్కరింపఁదలఁచితిని. మా అన్నగారికి పిల్లలు కలరు. సీమకుఁ బోవుముందు నాకుఁ గలిగిన పిల్లవానికి ఇపుడు సుమారు నాలుగేండ్లు. కసరతు చేయించి ఈపసికాయల వజ్రకాయులఁజేసి, ఎప్పుడును నా కనుజూపులలో పెంపవలెనని నా తలఁపు. మా యన్నగారు నాకు సాయపడిరి. ఈ కారణముచే ఈవిషయమున ఇంచుమించు కృతార్థుఁడనైతిని. పిల్లలలో ఉండుట నా కెపుడును అభిమతము. పిల్లలతో ఆడుకొనుట, పిల్లలతో నవ్వులాట నాకు నేఁటికిని అలవాటు. నాఁటినుండియు నేను పిల్లలకు మంచి పంతులనని అనుకొందును.

అన్నపాన సంస్కరణ మావశ్యక మనుట విస్పష్టము. అపుడే మా యింట టీ కాఫీలు ప్రవేశించెను. నేను సీమనుండి దిగువఱకే మా యింటికి దొరలయింటిపోశెము కలిగించుట పోలునని మా అన్నగారనుకొనిరి. దానికిఁ దగినటులు ఎపుడో ఉపయోగించు పింగాణి సామాను నిత్యమాయెను. నేను ఈ దిగువరీతిగా పరిపూర్తి చేసితిని. టీ కాఫీలకు బదులు కోకో ఓటుపిండి జావలు మార్చితిని. పేరునకే ఈ మార్పు గాని వాస్తవమునకు ఇవియు టీకాఫీలకు తోడాయెను. మోజాలు, మేజోళ్లు తొఁగడవే వచ్చెను. నేను కోటు, పంట్లము తొడిగి గృహపావనము చేసితిని.

ఈ దెస ఖర్చు పెరిఁగెను. దైనందినము క్రొత్తవస్తువులు వచ్చి చేరుచుండెను. ఇంటి ముందు వెల్లేసుఁగును గట్టితిమి. దీనికి వలసిన ఆదాయ మేది? రాజకోటలో ప్రాక్టీసు పెట్టుట నాకు నగుబాటు. వకీలునకు ఉండవలసిన జ్ఞానము నాకు లేదు. కాని ఫీజుమాత్రము మంచి వకీలున కిచ్చుదానికంటె పదింత లీయవలయును. వ్యాజ్యము నకు నన్నుఁ గుదుర్చుకొనునంత మూర్ఖుఁడు ఎవ్వఁడును ఉండఁడు. ఒకవేళ అట్టివాఁ డొకఁ డున్నను, నా తెలివితక్కువకు తోడు అహంకార మును, మోసమును గూడఁ గలిపి నేను నా ప్రపంచఋణభారమును ఇంకను పెంచుకొనవలయునా?

బొంబాయి వెళ్లి అక్కడ హైకోర్టులో కొంత అనుభవము గడించుకొనుచు, హిందూలా చదివికొనుచు, ఏవో కేసులతో కొన్నాళ్లు కాలము గడపుట మంచిదని నా మిత్రులు కొందఱనిరి. నేను బొంబాయి వెళ్ళితిని.

ఇల్లు పుచ్చుకొంటిని. వంటవాని పెట్టుకొంటిని. నాకు అతఁడు తగినవాఁడే. బ్రాహ్మణుఁడు. అతనిని నేను దాసునివలె చూడలేదు. కుటుంబములో ఒకనిఁగా చూచితిని. అతఁడు లింగముపై నీళ్లు పోసి పటులు ఒడలిపై పోసికొనును. తోముకొనఁడు. కట్టుపంచె మడ్డి; జందెము మడ్డి. శాస్త్రజ్ఞానము సున్న. నాకు ఇతనికంటె మంచి వంట వాఁడు ఎటులు కుదురును?

“ఏమండీ రవిశంకరుగారూ, మీకు వంట చేతకాకపోయినను పోయె, రెండు సంధ్యావందనపు ముక్కలు రాకపోయినచో నెటులండీ?”

"అయ్యో! సంధ్యయా? నాకు సంధ్య నాఁగలి; నిత్యవిధి పాటు. ఏదో ఈ మాదిరి బాఁపనయ్యను నేను. తమ అనుగ్రహమువలన బ్రతుకుచున్నాను. కానిచో నా చేతి ముల్లుకఱ్ఱ ఎచ్చటికి పోవును?"

నేను రవిశంకరునకు గురుత్వము చేయవలసివచ్చెను. నాకు తీరిక కావలసినంత. సగము వంట నేనే చేయువాఁడను. శాకాహారము వండుటలో దొరలపద్ధతి పెట్టితిని. ఒక మరపొయి కొంటిని. రవిశంకరుఁడును, నేనును వంట. ఎవరితోనైనను సహభోజనమునకు నాకు పట్టింపు లేదు. రవిశంకరునకును ఈ యాపత్తి లేదు. మాకు ఇరువురకు జోడు కలిసెను. అయినను ఒక్క చిక్కు: మడిగుడ్డలు విడువ ననియు, అన్నము పరిశుభ్రముగా ఉంచ ననియు రవిశంకరుఁడు పట్టిన ప్రతిజ్ఞను జాగ్రత్తగా కాపాడుకొనుచుండెను.

బొంబాయిలో నాలుగైదు నెలలకంటె ఎక్కువకాల ముండుటకు వీలు కాకపోయెను. దైనందినము వ్యయ మెక్కువ, రాఁబడి తక్కువ.

ఇటులు నేను ప్రపంచములో ఈఁద మొదలిడి వకీలుతనము మంచిది కాదనుకొంటిని. చూడ చూపులగుఱ్ఱము, తిన్నని తెలివి లేదు. పై బొటారము, లో లొటారము. నేను నా కర్తవ్యమును గుఱించి కడు పరితపించితిని.

## 3

### మొదటి కేసు

నేను బొంబాయిలో హిందూ లా చదువుట ఒకవంక, భక్ష్యపరిశీలనము మఱియొకవంక ఆరంభించితిని. ఇందుల నామిత్రుఁడు వీరచంద గాంధీ నాకు తోడు. ఇంకొకవంక మాయన్నగారు నాకు కేసులను తీసికొనిరాఁ బ్రయత్నించుచుండెను.

హిందూలా చదువుట విసువుపని. సివిల్ ప్రొసీజరు కోడ్డు నాకు నడవలేదు. మఱి ఎవిడెన్సు ఆక్టు చందము వేఱు. వీరచంద గాంధీ సొలిసిటర్ పరీక్షకు చదువుచుండెను. అతఁడు బారిష్టర్లను, వకీళ్లనుగూర్చి చిత్రచరిత్రలు చెప్పుచుండువాఁడు. లాలో అగాధజ్ఞానమే ఫిరోజిషాగారి యోగ్యతకును, నిపుణతకును కారణము. ఆయనకు ఎవిడెన్సు ఆక్టు అంతయు బట్టీ. ౩౨ వ సెక్షనులోని ప్రతి కేసును ఆయనకు కంఠపాఠము. బదరుద్దీన్ తయాబ్జీగారి వాదశక్తి చూచి జడ్జీలు డిల్లపోవుదురు.

ఇట్టి అతిరథ మహారథుల కథల వినఁగా నాగుండె నిలువున నీరయ్యెడిది.

మఱియు అతఁడిటు లనెను: 'క్రొత్త బారిష్టరులకు అయిదాఱేండ్లు పని లేకుండుట క్రొత్త కాదు. కావుననే నేను సొలిసిటర్ పనిలో ప్రవేశించితిని. ఇఁక మూఁడేండ్లలో నీ పొట్ట నీవు పోసికొనఁగలవేని అక్కడి కదృష్టవంతుడవు.'

నెలనెలకు గృహవ్యయ మధికమగుచుండెను. ఇంటిబయట బారిష్టరు బల్ల కట్టుట, ఇంటిలోపల ఇంకను బారిష్టరు పనికి తరిఫీదు కావలసియుండుట_ఈ రెంటికిని లోలోపల నాకు పొందు కుదురకుండెను. ఈ హేతువుచే గ్రంథపఠనమునకు సంపూర్ణమగు శ్రద్ధ పొసఁగకపోయెను. ఎవిడెన్సు అక్టుమీఁద ఎట్లో శ్రద్ధ పుట్టించుకొంటిని. మెయిన్సు 'హిందూలా'ను ఉత్సాహముతో చదివితిని. కాని కోర్టులో వాదించుటకు గుండెలు లేవు. ఇఁక నాకష్టము దేవునికే యెఱుక. అత్తింటికివచ్చిన క్రొత్త కోడలికంటె నాపని కనాకష్టమయిపోయెను.

ఈసమయముననే మమీబాయి యను ఒకయామె కేసు తీసికొంటిని. అది స్మాల్ కాజు. దళారికి (Tout) కొంత రుసుము ఈయవలయు ననుమాట వచ్చెను. నేను పైసయు ఈయ నంటిని.

'ఓహో! ఫలానా గొప్ప క్రిమినల్ వకీలు నెలకు మూఁడు నాలుగు వేలు ఆర్జించునే, ఆయనయు రుసు మిచ్చునే!'

'ఆయనతో పోటీ నా కేల? నాకు మున్నూఱు వచ్చినఁ జాలు. మా నాయన అంతకన్న ఎక్కువ సంపాదింప లేదు.'

'అది ఇక్ష్వాకుల కాలము. బొంబాయిలో దినవెచ్చము పెచ్చు పెరిఁగినది. వ్యవహార మెఱిఁగి చరింపవలయును.'

కాని నేను లొంగలేదు. నేను దళారికి రుసు మీకున్నను మమీబాయి కేసు నాకే వచ్చెను. అది చాల తేలిక. ముప్పది రూకలు ఫీజు పుచ్చుకొంటిని. దాని కొకనాఁటికన్న పని పట్టదు.

స్మాల్ కాజ్ కోర్టులో నా కిది 'హరిః ఓమ్.' నేను ప్రతివాది పక్షము. కావున వాదిపక్షపు సాక్షులను క్రాసు చేయవలసివచ్చెను.

లేచి నిలుచుండుటకుగదా, నాగుండెలు టువ్వు టువ్వు మనెను; నా తల తిరిగెను; కోర్టంతయు తిరుగుచున్నటు లుండెను. అడుగుటకు ప్రశ్న రాదు. జడ్జి నవ్వియుండును. ఈతమాషా చూచి వకీళ్లు వినోదించి యుందురు. కాని నేనిది యంతయు చూడఁగలుగు స్థితిలో లేను. నేను కూర్చుంటిని. ఏజెంటును పిలిచి, 'నేనీకేసును నడపఁజాలను. ఇఁక పటేలుగారిని పెట్టుకొనుట లగ్గు. నాకిచ్చిన ఫీజు ఇచ్చివైతును' అని అంటిని. అటులే నీఁబదియొక్క రూకలకు పటేలుగారిని కుదుర్చు కొనిరి. ఆకేసు పటేలుగారికి బాలఖేల.

నేను గబగబ ఇంటికి పోతిని. ఆకేసు ఓడెనో గెలిచెనో నేనెఱుఁగ. మిగుల సిగ్గిలితిని. శక్తి కలుగునంతకు మరల కేసు పట్టఁగూడదని నిశ్చయించుకొంటిని. దక్షిణ ఆఫ్రికాకు పోవునంతకు మరల అటు కేసి చూడలేదు. ఇటులు నిశ్చయించుకొనుట అంత గొప్పగుణము కాదు. అక్కఱనుబట్టి అది గుణమాయెను. కేవలము ఓడిపోవుటకు నాకు కేసులు అప్పగించునంతటి తెలివితక్కువవాఁ డెవఁడును ఉండఁడుకదా!

కాని బొంబాయిలో నాకొఱకు మఱొక కేసు వేచియుండెను. అది కేవలము అర్జీ వ్రాయుట. పోరుబందరులో నిఱుపేద యగు ఒక తురకవాని భూమిని సంస్థానమువారు జప్తు చేసిరి. మాతండ్రిగారి గౌరవమును బట్టి అతఁడు నాసాయము గోరెను. అతని వాదము చాలదుర్బలము; అయినను అర్జీ వ్రాయ నియ్యకొంటిని. దానికి అచ్చు ఖర్చు అతఁడే పెట్టుకొనెను. నేను చిత్తు వ్రాసి నామిత్రులకు వినిచితిని. వారు బాగుగా నున్నదనిరి. దానితో 'పోనీ నేనిట్టి అర్జీలనైన వ్రాయఁ గలుగుదును' అను నమ్మకక కలిగెను. అది నిక్కముకూడ.

డబ్బు పుచ్చుకొనక ఇటులు అర్జీలను వ్రాయుచుండినచో నాకు చాల పని పట్టెడిది. కాని దాన బండి సాగు టెటులు? కావున ఒక

ఉపాధ్యాయపదవికి చూచితిని. నాకు ఇంగ్లీషుభాష సుమారుగా వచ్చును గాన మెట్రిక్యులేషన్ పిల్లకాయలకు ఇంగ్లీషు చెప్పు నుద్యోగము కుదిరినచో బాగుగా నుండును; దాన గృహ వ్యయమునకు కొంత కలిసివచ్చును. ఇటు లనుకొనుచుండగా పత్రికలలో ఒక విజ్ఞాపన పడెను: "ఒక ఆంగ్లోపాధ్యాయుడు కావలయు. ఒకగంట బోధింపవలయు. జీతము ౭౫ రూకలు." ఆవిజ్ఞాపన ప్రసిద్ధికెక్కిన ఒక హైస్కూలువారిది. దానికి వినతి పెట్టుకొంటిని. వారు వచ్చి మాటలాడి పొమ్మనిరి. ఎంతయో ఆనందముతో వెళ్లితిని; కాని నేను బి.ఏ. ను కాకపోవుటచే ఆ హెడ్ మాస్టరు సవిచారముగ అక్కఱలే దనెను.

"అయ్యా, నేను లాటిన్ రెండవ భాషగా మెట్రిక్యులేషన్ పాసు అయితిని".

"నిజమే కాని, మాకు కావలసినది బి. ఏ."

ఇక ఆయాశ ఉడిగెను. చేతులు పిసికికొంటిని. మా అన్నయు చింతచే చిదికెను. ఇక బొంబాయిలో ఎంతకాల మున్నను నిష్ప్రయోజనమని తెల్సికొంటిమి. నేను రాజకోటలో ఉండవలయును. మా అన్నగా రక్కడ ఒక చిన్న వకీలు. ఆయన అర్జీలు మొదలగువాని వ్రాయుపని నా కప్పగింపగలడు. రాజకోటలో సంసార ముండ నే యుండెను గాన బొంబాయిసంసార మెత్తివేయుచో వ్యయమును తగ్గును. ఇట్టియూహలచే బొంబాయిలోని నా ఆఱునెలల చిన్న సంసారమును ఎత్తివైచితిమి.

బొంబాయిలో నేను ప్రతినాడు హైకోర్టునకు వెళ్లుచుంటిని గాని అచట నా కేమియు అంటలేదు. ఎక్కువ నేర్చికొనదగిన జ్ఞాన

మును నాకు లేదు. చాలమాఱులు కేసు లర్థము కాక నిదురించుచుం టిని. ఇందు కొందఱు నాకు తోడుండుటఁజేసి లజ్జాభారము నాకు కొంత తగ్గను. కొంతకాలముపోఁగా పోఁగా, 'హైకోర్టులో కూర్చుండి కూర్చుండి కునికిపాట్లుపడుట దర్జా (Fashion)' అనుకొని లజ్జకు కారణమే మఱచితిని.

ఈకాలమునఁగూడ బొంబాయిలో నావంటి పనిలేని బారిష్టరు లున్నచో వారి బ్రతుకుతెరువునకు నా చిన్న అనుభవమును చెప్పె దను. గిర్గామలో నా ముకాము. నే నెన్నఁడేని బండిలోఁగాని, ట్రాములోఁగాని పోలేదు. హైకోర్టునకు నడచి వెళ్లుట నావ్రతము. వెళ్లుటకు నలుబదియైదు నిమిషములు పట్టెడిది. మరల వచ్చునపుడును నడకయే. నేను ఎండ నోర్వ నలవడితిని. దీన చాల ఖర్చు తగ్గను. మఱియు నామిత్రులు పలువురు రోగములపా లగుచుండ నేనుమాత్ర మెపుడును జబ్బుపడ్డ గుర్తు లేదు. నాకు డబ్బు రాఁదొడగిన పిదపఁ గూడ నడచియే ఆఫీసునకు వెళ్లువాఁడను. నాఁటి యలవాటునకు ఫలము నేఁటికిని పొందుచున్నాను.

# ౪

## మొదటిదెబ్బ

బొంబాయికి స్వస్తి చెప్పి రాజకోట పట్టితిని. స్వయముగా ఆఫీసు పెట్టుకొంటిని. ఇచట కొంచెము బాగుగనే ఈడ్చితిని. అర్జీలు, విన్నపములు వ్రాసినందువలన నెలకు మున్నూఱు రూపాయలు రాఁదొడఁగెను. ఈపని దొరకుటకును నా యోగ్యత కారణము కాదు. మా అన్నగారును, మఱియొక వకీలును ఉమ్మడిగా పని చేయుచుండిరి. ఆ వకీలునకు ప్రాక్టీసు స్థాయపడిపోయెను. ఆవశ్యకములును, రహస్యములునగు అర్జీలనుగాని, లేక తాను ముఖ్యములైనవని అనుకొనినవానినిగాని పెద్దబారిస్టర్ల కతఁడు పంపెడువాఁడు. బీదక్లయింట్ల అర్జీలు నా వంతు.

'ఎవరికిని రుసుము ఈయను' అన్నమాట బొంబాయిలో చెల్లించుకొంటినిగాని ఇచట కొంచెము రాజీపడవలసివచ్చెనని ఒప్పుకొందును. ఈరెండుప్రదేశములలో విషయములు వేఱని వింటిని. బొంబాయిలో దళారులకు రుసుము; ఇచట వకీళ్లకు. ఇంతియకాక, రాజకోటలో కూడ బొంబాయిరీతిగనే ప్రతిబారిస్టరు తనఫీజులో కొంతపాలు రుసుమిచ్చుచుండిరని వింటిని. మా అన్నగారు ఇటులనిరి_"చూడు! నే నింకొక వకీలుతో భాగస్వామినిగదా! నేను నీవు చేయఁగల కేసుల నన్నిటిని నీకే వచ్చునటులు చూడఁగలను గదా! మఱి యట్టియెడ నీవు రుసు మీయనని పట్టినపట్టు వదలకుండినచో నన్ను ఇఱుకున బెట్టినవాఁడ వగుటకాదా? మన మిరువురము అవిభక్తులము. నీకు వచ్చిన ఫీజంతయు మన ఉమ్మ

డిలో కలియును. దాన నాకు పాలు కలదు. ఇఁక నా భాగస్వామికి? అతఁ డీకేసుల మఱియొక బారిస్టరునకు ఇచ్చునను కొమ్ము: అపుడతనికి రావలసిన రుసుమంతయు రాదా?" నేనీవాదముచే లోఁబడిపోతిని. ఇఁక బారిస్టరువృత్తికి ఇట్టికేసులలో పట్టుపట్టరాదని తోఁచెను. నాలో నే నిటులు తేల్చుకొంటిని గాని ఇది ఆత్మవంచన. అయితే మఱి యే కేసులందును రుసు మీయలేదని నాకు లెస్సగా గుర్తు.

ఇటులు నోటికిని చేతికిని ఎడము లేకుండ చేసికొనఁగలిగినను ఈ సమయముననే నా జీవితమునకు మొదటిదెబ్బ తగిలెను. తెల్ల అధికారి ఎటు లుండునో నేను చెవులతో వింటిని గాని కనులతో చూచు నక్కఱ నాకు కలుగలేదు.

గతించిన పోరుబందరురాణావారు గద్దెనెక్కుటకు పూర్వము వారికి మాఅన్న మంత్రిగను, ఉపదేష్టగను ఉండెను. ఆయన ఉద్యోగమున నుండఁగా రాణావారికి కుట్రసలహాచెప్పెనని నేర మొకటి ఆయనపై మోపఁబడెను. అది పొలిటికల్ ఏజెంటుదాఁక డేఁకెను. అతఁడు మాయన్నపై కాలు పెట్టుకొనెను. నాకును అతనికిని సీమలో ఎటులక. నెయ్యము కూడకలదు. ఇపుడు ఆనెయ్యమును బట్టి ఉ ప శాంతి చెప్పి అతనికాలు పోఁగొట్టవలయునని మా అన్నగారికోరిక, నా కిది ఇసుమంతయు గిట్టదు. ఎప్పుడో సీమలో కలిగిన సామాన్యపరిచయమును సఖ్యమును ఇందులకు ఉపయోగించుకొనుట తగదని నా యూహ. మా యన్న నిక్కముగ దోషి యైనచో నా ఉపశ్రవణమువల్ల ఫల మేమి? దోషి కానిచో సక్రమముగా విన్నప మంపుకొని తన నిర్దుష్టతను విశ్వసించి ఫలమున కెదురుచూచుట మేలు. మా యన్నకు ఇది రుచిగా లేదు. "నీకు కతియావాడు తెలియదు. నీ కింకను లోకజ్ఞానము సున్న. ఇక్క

డ పనిచేయున దొక్క పలుకుబడియే. నీవు నాకు తమ్ముఁడ వయ్యు నీకు పైయ్యుఁడైన ఒక అధికారితో ఒకమంచిమాట చెప్పుటకు వెనుదీసి నీవిధిని అతిక్రమించుట పాడి గాదు."

నేను కాదనఁజాలకపోతిని. కావున నా కిష్టము కాకున్నను అధికారి కడకు పోవలసివచ్చెను. అతనికడకుఁ బోవుటకు నా కిసుమంతయు అధికారము లేదు సరికదా, అది నా ఆత్మగౌరవమునకుఁగూడ కొఱఁత కలిగించునని నాకు తెలియును. అయినను ఒకనాఁడు విన్నపము పంపుకొని సెలవు పొందితిని. వెళ్లి మా పూర్వస్నేహము ఎత్తితిని. కాని కఠియావాడునకును సీమకును ఎంత భేదము ? సెలవులో నున్న ఉద్యోగి వేఱు; పనిలో ఉన్న ఉద్యోగి వేఱు. ఆపొలిటికల్ ఏజెంటు చేస్నేహ మొప్పెను గాని దాని తడవుటవలన మఱింత కఱకుతనము తెచ్చికొనెను. 'ఓహో, నీవాపరిచయలాభమును దుర్వినియోగము చేయఁదలఁచుకొని వచ్చితివా?' అని అతని కనులలో నేను చదివితిని. అయినను నా చదువు నేను మొదలుపెట్టితిని. దొరగారు చాల అధీరులై, "మీయన్న చాల కుట్రగాఁడు. నే నేమియు వినను. నాకు అవకాశము తక్కువ. ఏమయినను చెప్పుకొనవలసియున్నచో చెప్పుకొనదగినరీతిగా మీయన్నను చెప్పికొన మనుము" అని అనిరి. నాకు ఈప్రత్యుత్తరము చాలును. అది తగియున్నది. కాని ఆవశ్యకత గ్రుడ్డిది. నేను నాకథ నడుపుచునేయుంటిని. దొరగారు లేచి "మీ రిఁక వెళ్లవలయును" అనెను.

'కడవఱకు వినుఁ'డని నే నంటిని. దానితో అతనికి కోపము వచ్చెను. బంటును బిలిచెను. 'వీరికి త్రోవ చూపుము' అనెను. నేను గొణఁగుచునే యుంటిని. ఆ బంటు బుజములఁబట్టి నన్ను బయటికిఁ బంపెను.

దొర వెళ్లెను; బంటును వెళ్లి పోయెను. నేను రోఁజుచు రొప్పుచు వెలుపలికి నెళ్లి వెంటనే చీటి వ్రాసితిని: 'మీరు నన్ను అవమానించితిరి. మీ బంటు చే నెట్టించితిరి. మీరు ఇందులకు పరిహారము చెప్పుకొననిచో మానవష్టమునకు మీ మీఁద దావా తేఁగలను' అని.

వెంటనే దొర గుఱ్ఱపురౌతుచేతి కిచ్చి ఈ ప్రత్యుత్తర మంపెను:

'మీరు నాకడ అసభ్యముగా వ్యవహరించితిరి. నేను వెలుపలకు పొమ్మన్నను పోయితిరి కారు. గత్యంతరము లేక బంటును పిలిచి మిమ్ము బయటికిఁ బంపవలసివచ్చెను. బంటు పొమ్మన్నను మీరు పోరైతిరి. కావున మిమ్ము బయటికి పంపవలసినంత బలముమాత్రము ఉపయోగింపవలసివచ్చెను. మీ రేమి చేసికొన్నను సరే.'

ఈ ప్రత్యుత్తరము జేబులో మడఁచికొని, తల వంచుకొని ఇల్లు పట్టితిని. జరిగినదంతయు మాయన్నతో చెప్పితిని. ఆయన చాల దుఃఖించెను. నన్నెటులు ఊఱడింపవలయునో ఆయనకు తోఁప లేదు. ఆ దొరపై కేసుపెట్టుట యెటులో నాకు తెలియదు. కావున మా యన్న తనకు మిత్రులైన వకీళ్లతో ఆలోచించెను. సరిగా ఆసమయమున సర్ ఫిరోజిషామెహతాగారు రచటికి ఒకకేసులో వచ్చుట తటస్థించెను. నా వంటి క్రొత్తబారిస్టరు వారిని సందర్శించుట యెటులు? కావున వారిని తీసికొనివచ్చిన వకీలు చేతికి నా కాకితము లిచ్చి వారి సలహా వేఁడితిని. వారిటులు చెప్పిరి:"ఈరోజులలో చాలమంది వకీళ్లయు,బారిస్టరులయు అనుభవ మీరీతిగనే యున్నది అని గాంధితో చెప్పుము. ఆతేఁడు క్రొత్తగా సీమనుండి దిగెను. ఇంకను ఉడుకుపాలు. తెల్ల అధికారుల నతఁడెఱుఁగఁడు. ధనము కావలయుచో, సుఖముగా కాలము గడఁపఁ దలఁచుచో, ఆచీటిని చింపివైచి, ఆ యవమానమును దిగమింగు మనుము!

ఆతనితో కలహించుటవలన ఈతనికి నష్టమే కాని ప్రయోజన మావంతయు నుండదు. ఆతని కింకను లోకజ్ఞానము కావలయును."

ఈ యుపదేశము నాకు విప్రాయముగ నుండెను గాని మింగక తప్పకపోయెను. ఆ యవమానమును దిగమింగి, దాన నిటేవల కొంత ప్రయోజనమునుగూడఁ బడసితిని. ఇఁక ఇట్టిచోలికిఁ బోయి స్నేహమును ఇటు లెన్నఁడును దుర్వినియోగము చేయనని నిశ్చయించుకొంటిని. నాఁటనుండియు ఆ నిర్ణయము నతిక్రమింపలేదు. ఈదెబ్బతో నా జీవితము సంపూర్ణముగా మాఱెను.

౫

## దక్షిణ ఆఫ్రికాకు

నేనా యధికారికడకు వెళ్లుట నిస్సంశయముగా తప్పే. కాని యితని యధీరతముందు, ఇతని క్రోధముముందు, ఇతని ఔద్ధత్యముముందు నా తప్పు కడుఁ గొలఁదిదై పోయెను. దానికి గెంటనక్కఱ లేదు. నే నాతని యవకాశమును అయిదునిమిషములకన్న ఎక్కువ వ్యయము చేసియుండను. అతఁడు నా మాట వినుటకే సైఁపలేఁడాయెను. నన్ను సౌజన్యముగా వెళ్లుమని చెప్పనగును. కాని అతని యధికారమదము పెచ్చుపెరిఁగిపోయెను. అసలతఁడోర్పు లేనివాఁడని పిదపఁ బిదప తెలియనైనది. వచ్చినవారినెల్ల తృణీకరించి పుచ్చుట అతని కలవాటు. కొంచెము కష్టము తోఁచినఁ జాలు నతనికి మంట లెత్తుకొని వచ్చును.

ఇఁక నాపని యంతయు ఈ యధికారిన్యాయస్థానమునందే. అతనిని త్రోవకుఁ దెచ్చుట కానిపని. ఆశ్రయించుట నాకు గిట్టదు. ముందు దావా తెచ్చెదనని బెదరించి తరువాత పలకకుండుటకు మనసొప్ప లేదు.

ఈ నడుమ మా రాష్ట్రములోని చిన్నచిన్న రాజకీయవ్యవహారము లనుభవమైనవి. కాఠియావాడు చిన్నచిన్న రాజ్యముల కూడలి. కావున రాజనీతివేత్తలు ఓ యనిన వేవురు. సంస్థానములలో సంస్థానములకు చిన్నచిన్న కుట్రలు. పలుకుఁబడికిఁగాను ఉద్యోగులలో ఉద్యోగులకు కుట్రలు. ఆ రోజు లట్టివి. సంస్థానాధిపతులకు ఎవ రెంత చెప్పిన అంత. వారు ఇచ్చకములు చెప్పువారికి చెవు లప్పగించిరి. వారు దొర

గారి జవానునుగూడ బుజ్జగింపవలెను. ఇఁక శిరస్తాదారు దొరగారికంటె ఎక్కువ. ఏలన: శిరస్తాదారే దొరగారికన్ను; దొరగారిచెవి. అతఁడే అతని దుబాసి. శిరస్తాదారు పలుకే పాటి. అతని రాఁబడి దొరగారిరాఁబడి కెక్కువ. ఇది కొంచె మతిశయోక్తి యైనను మొత్తముమీఁద జీతమునకు మించిపోయిన సొమ్ము అతనికి వ్యయమగుచుండెననుట నిర్వివాదము.

ఈ దేశమంతయు నాకు విషవాయుపూరితముగా కాననాయెను. నా కిది తగులకుండ నా స్వాతంత్ర్యము నెట్లు రక్షించుకొందునా యని రేయుంబవలు దిగులు.

నా ఉత్సాహ మడుగంటెను. మా యన్న కనిపట్టెను. ఎక్కుడనేని నాకు ఉద్యోగము చిక్కుచో ఈ కుట్ర తప్పించుకొనవచ్చు నని మాకు తోఁచెను. కాని కుట్ర లేనిచో మంత్రిత్వము గాని, జడ్జిపదవి గాని దొరకదు. ఇదియుఁగాక దొరకును నాకుమ పొసఁగిన పొరపు నా వ్యవహారమునకు అడ్డు.

అపుడు పోరుబందరు సంస్థానము ప్రభుత్వమువారి అధికారమునకు లోఁబడియుండెను. ఆసంస్థానాధిపతికి కొన్ని అధికారములు సంపాదించుఉద్యోగ మొకటి నాకు కలదు. ఇది కాక మేరులను ఒక జాతివారిపై వేయఁబడిన హెచ్చుపన్నుల విషయములో నే నారాష్ట్రాధికారిని జూడవలసియుండెను. ఈ యధికారి హిందువైనను దురహంకారమున దొరగారికి తాతవలె నుండెను. ఇతఁడు సమర్థుఁడు. కాని దానివలన రైతుల కేమియుఁ బ్రయోజన మబ్బలేదు. నేను సంస్థానాధిపతికి కొన్ని క్రొత్త అధికారముల సంపాదింపఁగలిగితిని; మఱి మేరులకు కొంచెమేని ఫలము కలుగలేదు. వారి విషయము మనస్సునకు లెస్సగా పట్టించుకొనలేదని నాకు తట్టెను.

కావున ఈ వ్యవహారమునందును నేను నిరాశుఁడ నైతిని. నా క్లయింటులకు న్యాయము కలుగలేదు. న్యాయము కలిగింపఁదగిన సాధనము నా కడ లేదు. తుదకు పొలిటికల్ ఏజెంటునకో, గవర్నరునకో అర్జీ పెట్టుకొనవలయును. అటులు చేయుచో వారు 'దీనితో మా కెట్టిసంబంధమును లేదని త్రోసిపుచ్చి యుందురు. ఏశాసనము చేతనేని తీర్పు దిద్దు వీలున్నచో కొంత మేలుగా నుండెడిది కాని యిచట దొరగారి మాటయే శాసనము.

నా కిటులు ఉక్కిరిబిక్కిరి యాయెను.

ఇంతలో పోరుబందరునుండి మేమన్ దుకాణమువారు మాఅన్నగారి కిటులు వ్రాసిరి—"మాకు దక్షిణాఫ్రికాలో వ్యాపార మున్నది. మాది పెద్ద దుకాణము. మాకు అచటి కోర్టులో ఒక పెద్దదావా కలదు. అది ౪౦,౦౦౦ పవునుల దావా. అది చాలకాలమునుండి వచ్చుచున్నది. మేము అందులకు పెద్ద వకీళ్లను, బారిష్టరులను పెట్టితిమి. నీవు మీ తమ్మునిఁబంపితివేని అతఁడు మా కుపయోగించును. అతనికిని ఉపయోగము కలుగును. అతనికి క్రొత్తదేశముఁజూడను, క్రొత్తక్రొత్త పరిచయము సంపాదింపను అనుకూలించును."

మా యన్న నాతో ప్రస్తావించెను. అచటి వకీళ్లకు తెలియఁజెప్పుటో, లేక వాదించుటో, నాకు స్పష్టముగా తెలియలేదు. కాని అచటికి వెళ్ల కౌతుకము కలిగెను.

'దాదా అబ్దుల్లా అండుకో'లో భాగస్వామియగు సేత్ అబ్దుల్ కరీమ్ జావేరీగారికి (ప్రకృతము గతించిరి) మాయన్న నన్నుఁజూపెను. ఆసేటు—'అది యేమంత కష్టము కాదు' అని నచ్చఁబలికి, మఱియు ఇటులనెను—'మాకచటగొప్పగొప్ప తెల్లవారు మిత్రులు న్నారు. వారితో

మీకు పరిచితి అబ్బును. మీరు మాకు మా దుకాణమున ఉపయోగింతురు. మా వ్యవహార మంతయు ఇంగ్లీషులోనే ఉండును. దానికిని మీ రక్కఱపత్తురు. ఆదేశమునం దున్నంతవట్టు మీరు మా యతిథులు కావున మీకు విడిగా ఖర్చుండదు'.

'తమ కెంతకాలము నాతోపని? ఈవి యెంత యుండును?' అని నే నంటిని.

'ఒకసంవత్సరముకన్న నెక్కుడు పని పట్టదు. మీకు రాకపోకలకు మొదటితరగతి టిక్కెట్టు ఇత్తుము. మఱియు నూటఅయిదుపౌనులు రొక్క మిత్తుము'.

ఈ కొలందిమొత్తమున కచటి కేఁగుట బారిస్టరుపని కాదు; మఱి దాస్యము. అయినను నాకటులేని ఇండియాను విడిచిపెట్టవలయునని యుండెను. క్రొత్తదేశము చూచుకోరిక యొకటి, క్రొత్తఅనుభవము కలుగునను అభిలాష యొకటి నన్ను ఊరించుచుండెను. మఱియు నేను మాయన్నకు ఆ నూట అయిదుపౌనులు పంపవచ్చును. అది కుటుంబవ్యయమునకు ఉపయోగించును. కావున మఱి బేరమాడక దక్షిణాఫ్రికాకు మాటకట్టితిని.

## ౬

### నేటాల్

సీమకు వెళ్లినపుడు కలిగిన వియోగదుఃఖము దక్షిణాఫ్రికాకు వెళ్లునపుడు నాకు కలుగలేదు. మా అమ్మగారు ఇపుడు లేరు. నాకు లోకానుభవము, విదేశ యానానుభవము కలిగెను. బొంబాయి రాజకోటలకు తఱచు రాకపోకలు చేయుచుంటిని.

ఈతూరి భార్యను విడిచి వెళ్లుట కొంచెము కష్టమనిపించెను. సీమనుండి వచ్చినపిదప మరల నొకశిశువు కలిగెను. మా ప్రేమ యింకను లాలసనుండి విడివడలేదు. కాని మెలమెల్లగా మెఱుఁగెక్కుచుండెను. సీమనుండి నేను వచ్చినపిదప మేమొకచో కొలఁదికాల ముంటిమి. అయినను నే నామె కుపాధ్యాయుఁడ నైతిని. ఎట్టులో కొన్ని సంస్కారము లలవాటు చేయఁబూనితిని. అవి పరిపూర్తి యగుటకు మే మిరువుర మొకచో నుండుట ఆవశ్యకమని మే మనుకొంటిమి. కాని దక్షిణ ఆఫ్రికాకు పోవు మహోత్సవము ముందు వియోగము పీసమైన కాలేదు. 'ఒకసంవత్సరములో మరల కలియుదు' మని ఊఱడించి రాజకోట నుండి బొంబాయికి పయనించితిని.

దాదా అబ్దుల్లా కంపెనీవారి యేజెంటు మా రిఫత్తున టికెట్టు రావలయును. ఓడలో కాబిన్ కాళీగా లేదు. ఇపుడు పయనింపకున్న ఇంకొక నెలవఱకు బొంబయిలోనే ఉండిపోవలసి వచ్చును. ఏజెంటు—"మేము మొదటితరగతి టికెట్టు సంపాదించుటకై కడు యత్నించితిమి. కాని లాభము లేకపోయెను. మీ రిఁక వెళ్లఁదలఁచు

కొనినచో డెక్కుమీఁద నే వెళ్లవలయును. మొదటితరగతి భోజనము మాత్రము ఏర్పాటు చేసితిని." అవి నా మొదటితరగతి ప్రయాణపు రోజులు. మఱియు బారిస్టరు డెక్కుమీఁద నెక్కి పయనించునా? అందులకు నేను ఇయ్యకొనలేదు. మఱియు మొదటితరగతి టికెట్టు దొరకలే దనఁగా వింత కలుగుటచే ఆయేజెంటుమాట నేను నమ్మలేదు. కాన అతని యొఱుకమీఁద నేను ప్రయత్నించి ఒక టికెట్టు సంపాదింపఁదలఁచితిని. నేను ఓడపైకిఁ బోయి ముఖ్యాధికారిని చూచితిని. అతఁడు దాఁపఱికము లేకుండ నిటు లనెను:—"మాయోడలో నెన్నఁడును ఇంత యొత్తిడి యుండదు. కాని మొజాంబిక్ గవర్నరు జనరల్ గారు ఈ యోడలో వచ్చుచున్నారు. బెర్తు లన్నియు వారు గుత్తగొనిరి."

"ఏదోవిధముగా నా కొక్కనికి చోటు చేయలేరా?" యని నే నడిగితిని.

అతఁడు నన్ను ఎగదిగఁ జూచి, చిఱునవ్వి, "ఒక్కటే ఉపాయమున్నది. నాగదిలో నుఱియొక బెర్తు కలదు. అది బాటసారుల కిచ్చునది కాదు. అయినను నీ కిత్తును" అనెను. నే నందుల కతని నభినందించి టికెట్టు కొనుటకు ఏజెంటును తీసికొని వచ్చితిని. ఈ రీతిగా ౧౮౯౩ సం. ఏప్రిల్ నెలలో దక్షిణ ఆఫ్రికాలో నాఅదృష్ట మెటు లుండునో యని సంపూర్ణోత్సాహముతో బయలు దేఱితిని.

మొదటి రేవు లాము. అటకు పోవఁ బదుమూఁడు నాళ్లు పట్టెను. త్రోవలో నేనును, కప్తెనును (ఓడఅధికారి) మిత్రుల మయితిమి. అతనికి చదరంగ మన్న ఇష్టము. కాని క్రొత్తగా నేర్చు

కొన్నాళ్ళా డగుటచే అతనికి తనతో ఆడుటకు మఱియొక సరి క్రొత్త వాఁడు కావలయును. కావున నన్ను పిలిచెను. నేను చదరంగమును గూర్చి చాల వింటిని గాని ఆట యెఱుఁగను. నేర్పరులు చదరంగమున తెలివి తేటలకు చాల నవకాశ మున్నదని చెప్పుచు వచ్చిరి. ఆ క్లాప్టెను నాకు నేర్పెద ననెను. నాకు చాల నోర్పు ఉండుటచే మంచిశిష్యుఁడు దొరకె నని అతఁడు సంతోషించెను. ఆటాటకు ఓటమికి వంతు నాదే. ఓడినకొలఁది నాకు బోధించుట కాతని కుత్సాహము మెండగుచుండెను. నా కాయాటపై ప్రీతి కలిగెను. కాని ఆయోడ దిగినపిదప ఆ ప్రీతియు నిలువలేదు; చదరంగములో నాప్రవేశము రాజును మంత్రిని నడపుటకంటెను మించలేదు. లామూ రేవులో ఓడ మూడు నాలుగు గంట లాఁగెను. నేను రేవు చూడ దిగితిని. క్లాప్టెనుకూడ దిగెను. అతఁ డిట్లు లనెను. "ఈ సముద్ర మిచట దగాకోరు: మీరు వడిగా తిరిగి రావలయును."

ఆరేవు చాల చిన్నది. నేను తపాలాకచేరీకి పోతిని. అచట గుమాస్తాలుగా నున్న హిందువులఁ జూచితిని. నాకు సంతోషము కలిగెను. వారితో మాటలాడితిని. ఆఫ్రికావాసులను కొంతమందిని చూచి వారి యోగక్షేమములు కనుఁగొన వేడుక గొంటిని. ఈ పనులచే కొంతకాలము గడచెను.

డెక్కుమీఁద పయనము చేయు కొందఱితో నాకు పరిచితి కలిగెను. వారు ఒడ్డున వంట చేసికొని తీరికగా భుజించుటకు దిగిరి. ఇపుడు వారు ఓడ నెక్కుటకు నావ కుదుర్చికొనిరి. నేనును అం దెక్కితిని. సముద్రము పొడిచెను. రేవు అల్లకల్లోలముగా నుండెను. మా నావకు తగని బరువాయెను. ఓడ నిచ్చెనకు సరిగా మానావను పట్టి నిలుపుటకు వీలు లేనంత బలముగా ప్రవహించుచుండెను. నావ

సరిగా నిచ్చెనకడకు వెళ్లి వెళ్లకముందే ప్రవాహము దానిని వెనుకకు ఈడ్చివేయుచుండెను. ఓడ బయలుదేఱుటకు మొదటి యీల అప్పటికే ఐనది. నాకు తొందర ఎక్కువాయెను. క్యాప్టెను మాయవస్థ నంతయు పైనుండి చూచుచుండెను. అతఁడు ఓడను మఱి యయిదు నిమిషములు లాఁపుట కాజ్ఞయిచ్చెను. నామిత్రుఁ డొకఁడు ఓడకడ నున్న మఱియొక నావకు పదిరూపాయ లిచ్చి నన్ను తీసికొని రమ్మనెను. ఈ బరువునావనుండి నన్నా నావవాఁడు లాగుకొనెను. అప్పటికే ఓడపయికిఁ బోవు నిచ్చెన నెత్తి వైచిరి. దాన నే నొక మోకు పట్టుకొని పైకి ప్రాఁకవలసి వచ్చెను. ఓడ వెంటనే సాగెను. సయాత్రులు దిగఁబడిపోయిరి. క్యాప్టెను ముదలికింపు నిక్కమని అపుడు తెలిసి వచ్చెను.

లామూ దాఁటినపిదప మొంబాసా; మొంబాసా దాఁటినపిదప జాంజిబారు. అచట ఓడ ఎనిమిది మొదలు పది దినములవఱకును ఉండును. అచట మఱియొక యోడకు మారవలసియుండెను.

క్యాప్టెనుకు నాపైఁగల ప్రేమకు సీమ లేదు. కాని అది విపరీతముగా పరిణమించెను. అతఁడు నన్నును, మఱియొక తెల్లవానిని 'విహారము'నకు రమ్మనియెను. మేము మూవురము అతని నావపై ఒడ్డు చేరితిమి. 'విహార'మన నేమో నాకు సరిగా వారియర్థము తెలియ లేదు. అట్టి విషయములలో నే నెంత తెలివితక్కువవాఁడనో అతఁ డెఱుఁగఁడు. ఒక తార్పుగాఁడు మమ్ము మూవురను నీగ్రోస్త్రీల పేటకు తీసికొనిపోయెను. మాకు ముప్వురకు మూఁడుగదులు చూపిరి. నేను బిడియముతో మూఁగనై పోతిని. పాపము! ఆమె న న్నే మనుకొనెనో దైవమునకే యెఱుక. క్యాప్టెను నన్ను పిలిచెను. వెళ్లిన వాఁడను వెళ్లినటులు నేను బయటికి వచ్చితిని. నా బేలతనము

వలేఁడు కనిపట్టెను. అందులకు మొదట నాకు చిన్నతనముగా నుం డెను. కాని ఆమాట తలఁచుకొన్నంత భయము తక్క వేఱు లేదు. కాన ఆ చిన్నతనపు చీఁకు చివికిపోయి, ఆఁడుదానియెదుట ఆవంతయు కలఁగకుండుటకు భగవంతుని తలఁచుకొంటిని. నాహృదయ దౌర్బల్య మునకు వగచితిని. 'గదిలోనికి వెళ్లనని ధైర్యముగా ఏల అనలేక పోతినా' అని అనుతాపము చెందితిని.

నా జీవితమున ఇట్టివానిలో నిది మూఁడవది. కల్ల కపటము లెఱుఁగని పలువురు పిన్నవారు అది యేమో చిన్నతన మనుకొని పాప లిప్తు లగుదురు. అటులు నేను అంటుసొంటు లేక బయటఁబడుట నాపురుషార్థము కాదు. మొట్టమొదటనే 'నే నాగదిలోనికి పోను' అని నిరాకరించినచో అది పురుషార్థము. నే నిటులు బయటఁబడుట కేవల మీశ్వరానుగ్రహము. ఈ ఘటన నాకు ఈశ్వరునిపై నెక్కువ ఆస్థ కలిగించెను. మఱియు కల్ల చిన్నతనమును చాలవఱకు పాఁఱ ద్రోలెను.

ఈ రేవున ఏణ్ణాళ్లుండవలసినందున నేను పట్టనమున బసపెట్టి చుట్టుపక్కల నెల్ల చూచివచ్చితిని. జాంజిబారునందలి వృక్షాదుల పెంపున కొక్క మలబారే సాటి. ఆచెట్లయెత్తు, ఆపండ్ల యురవు చూడ నాకు వింత ఆయెను.

పిదప మాయోడ మొజాంబిక్కులో ఆఁగెను. మేనెల చివర నేటాలు చేరుకొంటిమి.

౭

## కొన్ని అనుభవములు

నేటాలు దేశమునకు రేవుపత్తనము దర్బాను. దానికి పోర్టు నేటాల్ అనియు పేరు. అబ్దుల్లా సేటుగారు నన్ను తీసికొనిపోవుటకు అచ్చటికి వచ్చెను. నేటాలువారు తమతమ మిత్రులం దీసికొనపోవ వచ్చిరి. నాకుం జూడ వారికి హిందువులపై విశేషాదరము ఉన్నటులు పొడంగట్టలేదు. పరిచితులు అబ్దుల్లా సేటుగారిని తేలికగా చూచుట నాకు పొడగట్టకపోలేదు. దానిం జూడ నా ప్రాణము చివుక్కుమనెను. అబ్దుల్లా సేటునకు అది అలవాటైపోయెను. అందఱు నావంక వికారముగం జూచిరి. తతిమ్మా హిందువులకంటె వేషము వేఱుగా నానుండెను. మీంద ఫ్రాక్ కోటు. తలమీంద బంగాళీల పగిడీ వంటి తలపాగ.

సేట్‌గారు నన్నింటికిం గొంపోయిరి. తమగదికి ప్రక్కగదిని ప్రత్యేకముగా నా కేర్పాటు చేసిరి. వారి సంగతి నాకును, నా సంగతి వారికిని ఏమియు తెలియదు. తన తమ్ముండు నా చేతి కిచ్చి పుచ్చిన కాకితములు చదివికొని ఆయన మఱింత గడబిడ పడెను. తనతమ్ముండు తన కొక వెల్లేనుంగును పంపినటులు అతండు తలంచెను. నా వేషభావములు చూచి నాకు దొరల కగునంత వ్యయ మగు ననుకొనెను. మఱియు అపుడు ప్రత్యేకముగ నాకు నియోగింపందగిన పని లేదు. వారివ్యవహారము ట్రాన్సువాలునందు జరుగుచున్నది. వెంటనే నన్నక్కడికి పంపుటలో అర్థము లేదు. అదియుంగాక నా సామర్థ్యమును గుఱించి,

యోగ్యతను గుఱించి యతఁ డే మెఱుఁగును? నన్ను కనిపట్టుచుండుటకు ఎప్పుడును ప్రిటోరియాలో అతఁ డుండవలయును. అది అతనికి వీలా? ప్రతివాదులు ప్రిటోరియాలో. వారు న న్నే విధముగ నైనను తమ పక్షములోనికి తిప్పుకొనెదరేమో? మఱి నా కా దావాలో పని యీయక యుంకేమిపని చూపుదురు? తప్పకఁగల పనియంతయు అతని గుమాస్తాలే నాకన్న బాగుగా నిర్వహింపఁగలరు. మఱియు ఆ గుమాస్తాలు తప్పు చేయుచో వారిని దండింప వీలు. నేను పొరపాటు చేయుచో నన్నటులు చేయ వీలా? ఈ హేతువులచే ఆ దావాలో ఏదో పని నా కప్పగింపనిచో నన్నింటఁ గూర్చుండఁ బెట్టుకొని ఊరక మేపవలసివచ్చును.

అబ్దుల్లా సేటునకు అక్షరజ్ఞానము తక్కువ. కాని అనుభవ జన్యజ్ఞానము కావలసినంత. అతనిబుద్ధి కడు చుఱుకైనది. అదియు నతనికిఁ దెలియును. బాంకు మానేజర్లతో వ్యవహారము గడపుకొనుటకును, తెల్లవర్తకులతో వ్యవహారము నడపుకొనుటకును, వకీళ్లకు తన వ్యవహారములను తెలియఁ జెప్పుకొనుటకును తగినంత ఇంగ్లీషు అతఁ డలవఱచుకొనెను. భారతీయులకు అతఁడన్న గౌరవము. సేటుగారి వర్తకసంఘము అపుడున్న అన్ని వర్తకసంఘములలోను పెద్దది. ఒకవేళ కాకపోయినను హిందూ వర్తక సంఘములందలి పెద్దవానిలో నిది యొకటి. ఇట్టి వీళ్లు ఉన్నను అతని కొకలోటు కలదు. అతనిది అనుమాన స్వభావము.

అతనికి ఇస్లాము మతమునెడల చాల నభిమానము. తత్త్వజ్ఞానము గుఱించి మాటలాడ నతని కభిలాష. కురాను షరీఫునందును, ఇస్లాము తత్త్వగ్రంథములందును అతనికి సామాన్యజ్ఞానము కలదు. సంభాషణము నందు ప్రమాణవాక్యము లతఁడు కుప్పగూరలుగాఁ గ్రుమ్మరించును.

అతని కలయికవలన నాకు ఇస్లాముమతమున సామాన్యజ్ఞానము కలుగ నాయెను. మా మనస్సులు కలిసినదాది ఇస్లాము తత్త్వమునుగూర్చి ప్రసంగించుకొనఁ దొడఁగితిమి.

నే నచటికి వెళ్లిన రెండవనాఁడో, మూఁడవనాఁడో సేటుగారు నన్ను దర్బానుకోర్టునకు తీసికొని వెళ్లిరి. అచట వారి మిత్రులతో నాకు పరిచితి కలిగించిరి. కోర్టులో తన వకీలుప్రక్క నన్ను కూర్చుండఁ బెట్టిరి. మొదటినుండియు మేస్ట్రేటు నా కేసి మిర్రిమిర్రి చూచుచుం డెను. తుదకు 'తలపాగను తీసివేయుము' అని నా కాజ్ఞాపించెను. 'తీయ' నని నిరాకరించి నేను కోర్టునుండి వెళ్లిపోయితిని.

ఇక్కడికి వచ్చినను నాకొక తగవు వ్రాసి పెట్టియున్నది.

భారతీయులచే పాగలు తీసివేయించుటకుఁ గల రహస్యము అబ్దుల్లాసేటు నాకు తెలియఁజెప్పెను. మహమ్మదీయాచారము పూను వారు తలపాగలఁ దాల్పవచ్చును. కాని కోర్టులకు వచ్చెడు మిగిలిన హిందువులు మాత్రము తలపాగ తాల్పరాదని శాసనము.

ఈ సూక్ష్మభేదము తెలియఁజెప్పుటకు లోఁతునకు దిగవల యును.

ఈ రెండు మూఁడునాళ్లలో అచటి భారతీయులు పలుతెఁగు లుగా నున్నారని తెలిసికొంటిని. ఒకరు తురకవర్తకులు. వీరు 'మేము అరబ్బులము' అని వ్యవహరించుకొనుచుండిరి. మఱియొకరు హిందూ గుమాస్తాలు, లేక పారసీ గుమాస్తాలు. ఇందలి పారసీగుమాస్తాలు 'మేము పారసీకులము' అని వ్యవహరించుకొనుచుండిరి. ఇఁక హిందూ గుమాస్తాలు 'మేము అరబ్బుల'మని చెప్పుకొనవనిచో తమ పని అటూ కాదు, ఇటూ కాదు. ఈముత్తెగలవారికిని సాంఘికసంబంధము కలదు.

మఱియు వీని యన్నిటికంటె ఒక పెద్ద తెగ కలదు. అందు అఱవ వారు, తెలుఁగువారు, ఉత్తరహిందూస్థానమునుండి వచ్చిన ఇన్‌డెన్ చెర్డు కూలికి వచ్చినవారు, మఱియు కూలినాలి చేసుకొనువారు కలరు. ఇన్‌డెన్‌చెర్డు కూలీ లనఁగా అయిదేండ్లు నేటాలు దేశమున పనిచేయు టకు గుత్తగొనఁబడిన (అగ్రిమెంటు)కూలివారు. వీరి కచట గిర్మిటియా లని పేరు. ఈ పదము అగ్రిమెంటుపదమున కపభ్రంశమగు గిర్మిట్ అను పదమునుండి ఉత్పన్నమైనది. పై మూఁడు తెగలవారును వీరితో (గిర్మిటియా) కూలిచేయించుకొను పనితక్క వేఱుసంబంధము పెట్టు కొనరు. దొరలు వీరిని కూలీ లందురు. మఱియు భారతీయులలో పలువురు కూలివారు. కావున భారతీయు లందఱకు కూలీలని పేరు. సామీ అని మఱియొక పేరు. సామి యనుపదము సామాన్యముగా అఱవపేర్లకు చివర నుండును. అది 'స్వామిన్' అను సంస్కృత పదము నకు వికృతి. నమతొంగర మెఱుఁగు భారతీయునకు సామి పదసంబో ధన మిష్టము కానిచో, తనను సంబోధించిన తెల్లవానితో 'నీవు నన్ను సామియన నగునుగాని, సామి యనిన అధికారియని అర్థము: నేను నీ కధికారిని గాను గదా!' అనును. కొందఱు జంకి యూరకుందురు కొందఱు కోపము తెచ్చుకొని తిట్టిగాని, పైఁబడి కొట్టిగాని పంపు దురు. ఏలన సామిపద మతనికి నీచవాచకము. ఇంకొక అర్థమున నత నికి అప్రయుక్తము. దానికి అధికారియని అర్థము చెప్పుట అవమానిం చుట యగును.

కావున నాకు కూలిబారిస్టరు అని పేరు వచ్చెను. వర్తకులకు కూలివర్తకులని పేరు. ఈరీతిగా కూలి యనుమాటకు అసలు అర్థము పోయి భారతీయులు అను నర్థము కలిగెను. తురకవర్తకుల కిది గిట్టదు. కనుక వారు వెంటనే 'మేము అరిబ్బులము' అనిగాని, లేక

'మేము శేవాకులము' అనియో చెప్పుకొనుచుండిరి. ఆ తెల్లవాఁడు మంచివాఁడగుచో క్షమాపణ కోరుకొనును.

ఇట్టి స్థితులలో నేను తలపాగ పెట్టుకొనుట వికటమాయెను. తలపాగను తీసివేయుచో అవమానము మింగి ఊరకుండుటయే. కావున తలపాగ కొక్క సలాముచేసి ఇఁకనుండి ఇంగ్లీషుహాట్ పెట్టుకొనుచుండినచో అవమానము లేక కుక్కజట్టీలు రాకపోవు ననుకొంటిని.

కాని అబ్దుల్లాసేటుగారొప్పరైరి: "నీ వటువంటి దేమయినఁ జేసినచో విషమించును. నీవు ఇటులు చేసినచో తలపాగ తాల్పవలయు ననుకొనువారి నెల్లరను వంచించినటు లగును. అదియుఁ గాక, మన దేశపు తలపాగ మీ తలకు బాగుగా నుండును. ఇంగ్లీషుహాటు పెట్టుకొన్నచో హోటలులో సేవకుఁ డనుకొందురు."

ఈ యుపదేశమున మంచి తెలివియు, దేశభక్తియు, మఱి లఘుస్వభావమును గలవు. అందలి తెలివి తెల్లము. దేశభక్తి లేనిచో ఆమాటలు రావు. హోటలు సేవకునియెడ నైచ్యము ఉండుటచే సంకుచితదృష్టి యున్నది. గిర్మిటియాలలో హిందువులు తురకలు, క్రైస్తవులును అంతర్భూతులు. ఇందలి క్రైస్తవులు మతము పుచ్చుకొన్న గిరిమిటియాలసంతే. ౧౮౯౩ సంవత్సరమునాఁటికే వారిసంఖ్యఅధికము. వారు దొరల వేషములతో చాల మంది హోటళ్లలో సేవకులుగా నుండిరి. అబ్దుల్లాసేట్‌గారు హాటు విషయమున తేలికగా మాటలాడినది వీరిని ఉపలక్షించియే. హోటళ్లలో సేవకత్వము మిగుల నైచ్యమునకు గుఱియగుచుండెను. నేఁటికిని చాలమందికి అనమ్మిక పోకున్నది.

మొత్తముమీఁద అబ్దుల్లాసేటుగారి సలహా నాకు నచ్చెను. ఈ తలపాగతగవు పొసఁగిన పిదప నా పక్షమును నేను సమర్థించుకొనుచు

పత్రికలకు వ్రాసితిని. తలపాగలపై చాల చర్చలు జరిగెను. అన్ వెల్ కమ్ విజిటర్ — 'పిలువని పేరంటకాఁడు' అని నాకు పత్రికలలో పేరు వచ్చెను. మూఁడు నాలుగు నాళ్లలో దక్షిణ-ఆఫ్రికాలో నాకు ప్రఖ్యాతికలిగెను. కొందఱు నా పక్షమును సమర్థించిరి. కొందఱు నా పొగరుఁబోతుతనమును నోరార తిట్టిరి.

నేను దక్షిణ-ఆఫ్రికాలో నున్నంతవట్టు నా పాగ నాతల మీఁదనే యుండెను. మఱియు అచటనే ఎన్నఁడు ఏకారణమున తలసీర తఱలించితినో దాని గుఱించి ముందు ముందు తెలియఁగలదు.

## ౮

## ప్రిటోరియా దారిలో

డర్బానులో నివసించుచున్న భారతీయ క్రైస్తవులతో నాకు వడిగా పరిచయ మాయెను. కోర్టులో దుబాసిగా ఉన్న పాల్ గారు రోమన్ కేతలిక్కు. నే నతని సావాసము పట్టితిని. మఱియు ప్రోటెస్టెంటు మిషనులో బోధకుఁడైన సుభాన్ గాడ్ ఫ్రేగారి సావాసము పట్టితిని. వీరు ఇటీవల గతించిరి. దక్షిణ—ఆఫ్రికా భారతీయ ప్రతినిధి సంఘసభ్యులుగ నిరుడు ఇండియాకు వచ్చిన జేమ్స్ గాడ్ ఫ్రేగారికి వీరు జనకులు. ఈరీతిగ నే నప్పుడు పార్సీ రుస్తుంజీగారి తోడను, ఆదంజీ మియాఖానుగారి తోడను మైత్రి ఒదవెను. వీరిరువురును ఇటీవల గతించిరి. వ్యాపారములు వచ్చినపుడు తక్క ఒండొండ కలసికొనని వీరు తుద కేవిధముగా గాఢమిత్రులైరో ముందు ముందు తెలియఁగలదు.

ఇటులు నాకు పరిచితుల సంఖ్య యెక్కు డగుచుండఁగా అబ్దుల్లాకంపెనీవారికి తమ వకీలుకడనుండి కేసునకు తయారుకావలయు ననియు, అబ్దుల్లా సేట్ గారు తాము వచ్చుటయో, తమ తరఫున ఎవరి నేని పుచ్చుటయో జరుగవలెననియు ఉత్తరము వచ్చెను.

అబ్దుల్లా సేట్ గారు నా కాలేఖను చదువ నిచ్చి 'ప్రిటోరియాకు వెళ్లెదరా?' అనెను. 'నే నావ్యవహారము సాంగోపాంగముగా ఆకళింపుచేసికొని మఱి వెళ్లఁగలను.' అక్కడ ఏమిచేయవలయునో నా కిప్ప

టికి తెలియలేదు' అని నేనంటిని. అనఁగా అతఁడు నా కా వ్యవహారము తెలుప గుమాస్తాలను నియోగించెను.

నే నా కేసును ఆకలింపఁ బూనినతోడనే అందు గుంట ఓనమాలు దిద్ద మొదలుపెట్టవలెనని తెలిసెను. జాంజిబారులో నేనున్న కొలఁది దినములు కోర్టునకు వెళ్లి అక్కడ పని పరిశీలించుచుంటిని. పార్సీ వకీలొకఁడు ఒక సాక్షి ఖాతాలో జమాఖర్చుల గుఱించి అడుగుచుండెను. జమాఖర్చు లన్నచో నా కడవిగొడవ. నేను ఇచ్చట స్కూలు నఁగాని సీములోఁగాని ఖాతా ( Book-keeping ) నేర్చుకొనలేదు.

ఏ కేసును గుఱించి నేను దక్షిణాఫ్రికాకు వచ్చితినో ఆకేసంతయు ఖాతాకు సంబంధించినది. జమాఖర్చు లెక్కలలో నిధియైన వాఁడే దానిఁ దెలిసికొని ఒరులకు తెలుపఁగలఁడు. ఆ గుమాస్తా ఇది జమ, అది ఖర్చు అని చెప్పుకొనిపోవుచుండ నాకు మఱింత గందరగోళముగా నుండెను. పి. నోటు అననేమియో నాకు తెలియలేదు. ఇంగ్లీషు నిఘంటువునందు ఆపదము దొరకలేదు. నాయజ్ఞతను గుమాస్తాకు తెలుపుకొంటిని. అతఁడు పి. నోటు అనఁగా ప్రామిసరీనోటు అని చెప్పెను. ఖాతాకు ( Book-keeping )సంబంధించిన గ్రంథమొకటి కొని చదివితిని. దానితో కొంత ధైర్యము కలిగెను. ఆ దావా అర్థమాయెను. అబ్దుల్లా సేటుగారు జమాఖర్చు వ్రాయుట యెటులో యెఱుఁగఁడు. అయినను ఎంత చిక్కు లెక్కలైనను చిటికలో విడఁదీయఁగల అనుభవము ఆయనకు కలదని నే నెఱిఁగితిని. 'ప్రిటోరియాకు వెళ్లుటకు ఇపుడు నేను తయారు' అని అంటిని.

'మీ రెచట విడియుదురు?'

'తము రెచట విడియ నుందురు?'

'నేను మన వకీలునకు చీటి వ్రాయుదును. ఆయన మీకు విడిది నేర్పఱచును. ప్రిటోరియాలో నాకు మేమన్ మిత్రులు కలరు. వారికిని వ్రాసెదను. కాని మీరు వారియిండ్ల బస పెట్టవలదు. మన ప్రతిపక్షులకు అచట చాల పలుకుబడి కలదు. మన రహస్యలేఖలను వారిలో నెవరేని చూడఁ బోసఁగెనా, కొంప మునిఁగెను. వారితో మీ రెంత విడిగా నున్న నంత మేలు.'

'నేను మీవకీలు ఎచట నుండు మన్న నచట నుందును లేక నేనే వేఱుగా బస కుదిర్చికొందును. ఆవిషయమున మీకు విచారము వలదు. మన రహస్య మొక పిట్టకేని తెలియదని నమ్ముఁడు. కాని వారితో నేను కలిసి మెలిసియే యుందును. ప్రతివాదులతో మైత్రి చేసికొన వలయు ననియే నామతము. వీ లున్నచో ఈవ్యవహారము కోర్టున కెక్కకుండ పరిష్కరించుటకు ప్రయత్నము చేయుదును. ఇంతకు తైయబ్ సేట్ మీకు చుట్టమే కదా!'

ప్రతివాది స్వర్గీయ సేట్ తైయబ్ హాజీఖాన్ మహమ్మదు గారు అబ్దుల్లా సేట్ గారికి దగ్గఱ చుట్టము.

రాజీమాట రాఁగనే అబ్దుల్లా సేట్ గారు కలవెల పడ్డటులు కనుగొంటిని. కాని నేను దర్బాను చేరి ఆరేడు దినము లగుటచే మే మొకరి హృదయ మొకర మెఱిఁగితిమి. నన్ను వెల్లేనుఁ గనుకొనుట దాఁటిపోయెను. అతఁ డిటు లనెను— 'ఔ...నౌ...ను. కోర్టుతో పని లేకుండ పరిష్కృతమగుచో అంతకన్న వేఱు మేలు లేదు. అయినను మేము రక్తబంధువులము. ఒకరితరహా ఒకరికి తెలిసినవారము తైయబ్ సేటు తగవు తేలికగా తేల్చువాఁడు కాఁడు. మన మేమాత్ర మజాగ్రత్తతో నున్నను మన సంగతులన్నియు సంగ్రహించి తుదకు అధః

పాతాళమున కడఁగఁద్రొక్కును. కనుక ఏమిచేయఁదలఁచినను లెస్సగా ఆలోచించి మఱి చేయుఁడు.'

'ఆవిషయమై మీకు తొందర వలదు. దావావిషయమై తైయబ్ సేట్‌గారితోఁగాని, మఱి యెవరితోఁగాని ముచ్చటింప నేమిపని? ఊరక లుకలుకలు పడకుండ ఏదో ఒకదారికి రండని సూచింతును.'

వచ్చిన ఏడవనాఁడో ఎనిమిదవ నాఁడో దర్బానునుండి బయలు దేఱితిని. నాకు మొదటితరగతి టిక్కెట్టు పుచ్చుకొనిరి. పఱుపు వలయుచో అలాయిదాగా అయిదు షిల్లింగులు కట్టుట అచటి మామూలు. అబ్దుల్లా సేటుగారు పఱుపునుకూడఁ గొనుఁడని నొక్కిచెప్పిరి. కాని వట్టి పట్టుదలచే, గర్వముచే, అయిదు షిల్లింగులు పొదుపుచేయ వలయునను తలఁపుచే వద్దంటిని. అబ్దుల్లా సేట్‌గారు నన్ను ఇటులు ముదలకించెను: 'చూడుఁడు. ఇది హిందూదేశము కాదు. అల్లా అనుగ్రహమువలన మనకు భోగించి త్యాగము చేయఁదగినంత సిరి కలదు. మీకు కావలసిన విషయములలో వెనుదీయవలదు'.

నేను ధన్యవాదములు పలికి ఫరవా లేదంటిని.

రైలు నేటాలు ముఖ్యపత్తనమగు మారిట్జుబర్గునకు రాత్రి తొమ్మిది గంటలకు చేరెను. పడుకొనువారికి ఇచటనే పఱుపు లిత్తురు. రైలు జవానొకఁడు వచ్చి 'పఱుపు కావలయునా?' అని అడిగెను. 'నాకడఁ గలదు. అక్కఱ లే' దంటిని. అతఁడు వెళ్లిపోయెను. ఒక బాటసారి వచ్చెను. నన్ను ఎగదిగ చూచెను. నేను 'నల్లవాఁడ!' నగుట చూచెను. అతఁడోర్వలేక పోయెను. పెట్టెదిగిపోయి ఒక రిద్దఱుద్యోగులనుతీసికొనివచ్చెను. వారు మౌనముగ నుండిరి. ఇంతలో మఱియొక ఉద్యోగివచ్చి–'రావయ్యా! నీవు వెనుక పెట్టెలో కూర్చుండవలయును.

ఊఁలెమ్మనెను.

'నాకడ మొదటి తరగతి టిక్కెట్టు కల' దంటిని.

'ఫరవా లేదు. నామాట విను! వెనుక పెట్టెకు పద!'

'నామాటగూడ వినుఁడు! దర్బానులో నన్నిందుఁ గూర్చుండ నిచ్చిరి. నే నిందే పయనింపక తక్కఁదు.'

'ఏమి? లేచిపోవా? నీవు వెళ్లిపోవనిచో పోలీసును పిలిచి నెట్టింతును.'

'సరి, నానినే నెట్టనీ; నాయంతట నేను పోను.'

పోలీసు వచ్చెను. నా చేయి పుచ్చుకొని బయటికిఁ ద్రోసెను. నా సామానుగూడ బయటఁ బడనూకిరి. నే నా కడపటి పెట్టెలోనికి వెళ్ల నిరాకరించితిని. రైలు వెళ్లిపోయెను. నేను చేసంచిమాత్రము తీసికొనిపోయి వెయిటింగు రూములో కూర్చుంటిని. సామాను పడవేసిన చోటనే యుండెను. రైల్వేవారు దాని కాపాడుచుండిరి.

అది చలికాలము. దక్షిణ-ఆఫ్రికాలోని పర్వతప్రదేశములలో చలి యెక్కువ. మారిట్జుబర్గు మిక్కిలి ఎత్తున నుండుటచే మరీ యెక్కువ చలి. నా ఓవర్ కోటు సామానులో ఉన్నది. కాని దాని నిమ్మని కోరినచో మరల నేమి యవమానము నెత్తిపైఁ బడునో యని అడుగక గడగడ వడఁకుచు కూరుచుంటిని. ఆగదిలో దీపము లేదు. నడికిరేయి ఒక బాటసారి ఆగదిలోనికి వచ్చెను. అతఁడు నన్ను పలుకరింపఁ దలఁచె నేమో కాని నేనుమాత్రము మాటలాడు స్థితిలో లేను.

పిమ్మట. ఇపుడు నే నేమి చేయవలయునని ఆలోచించితిని. నాహక్కులకు పోరాడవలయునా? లేక వచ్చినటులు ఇండియా దారి పట్టవలయునా? లేక ఈ యవమానము దిగమింగి నావచ్చినపని చూచు

కాని మరల యిండియాకు పోవలయునా? వచ్చినపని చేసికొనక తిరిగి పోవుచో పిరికితనము. ఇపుడు నాపడిన పాటు మిగుల అల్పము—ఇది లోపలి మహారోగమునకు బాహ్యచిహ్నము— ఈమహారోగము రంగును గురించిన పోరు. సామర్థ్య మున్నచో ఈ పాడురోగమును మొదటి కంట కుదుర్ప యత్నింతును. దీనిగురించి ఎన్నికష్టములు వచ్చినను భరింతును. ఈవర్ణద్వేషమునకు సంబంధించిన అన్యాయమును తొలగింప నెంత ప్రయత్న మావశ్యకమో అంత ప్రయత్నముచేయుదును.

ఇటులు తలంచి తరువాత వచ్చు రైలులో ప్రిటోరియాకు పోవ నిశ్చయించుకొంటిని.

మఱునటి ప్రొద్దున రైల్వే జనరల్ మానేజరుకు ఒక పెద్దతంతి కొట్టితిని. అబ్దుల్లాసేట్ గారికిని ఈసంగతి తెలిపితిని. అబ్దుల్లాగారు వెంటనే జనరల్ మానేజరును చూచెను. అతఁడు రైల్వేవారిది తప్పు కాదనుచు 'గాంధికి ప్రయాణ సౌకర్యము చూడు'మని మాస్టరుకు తంతి నిచ్చితినని తెల్పెనఁట. అబ్దుల్లాసేట్ గారు మారిట్జుబర్గులో హిందూ వర్తకులకును, మఱియు ఇతర స్థలములలోని మిత్రులకును నావిషయమున జాగ్రత్త పుచ్చుకొండని తంతి నిచ్చెను. వారందఱును నన్నుఁజూడ వచ్చి, తమకు తమకు జరిగిన అవమానములఁ జెప్పి, ఇటువంటివి ఆదేశమున క్రొత్తలు గావని నన్నూఱడించిరి. ఒకటి రెండు తరగతులలో ప్రయాణముచేయు భారతీయులు ఏ రైలు-ఉద్యోగులవలననో, ఏ తెల్లవారి వలననో ఇట్టి పాట్లు పడుటకు సిద్ధులై యుండవలయును. ఆనాడంతయు వారి కష్టచరిత్ర శ్రవణముతో గడచెను. రాత్రి రైలు వచ్చెను. అందు నా కొక బెర్తు ప్రత్యేకింపఁబడి యుండెను. నిన్న దర్బానులో పల దన్న పఱుపు టిక్కెట్టును నేఁడు మారిట్జుబర్గులో కొంటిని.

ఆరైలు నన్ను చార్లెస్ టౌనుకు తీసికొనిపోయెను.

# ౯

## ఎక్కువ కష్టములు

పొద్దుటికి రైలు చార్లెస్ టౌను చేరెను. ఆరోజులలో చార్లెస్ టౌను జోహాన్సు బర్గుల నడుమ రైలుదారి లేదు. కాని రాకపోకలకు గుఱ్ఱపుబండ్లు కలవు. గుఱ్ఱపుబండి బాటనడుమ స్టాండర్టన్ అను ఊరికడ రాత్రిపూట ఆగును. నావద్ద గుఱ్ఱపుబండి టికెట్టు కలదు. మారిట్జుబర్గులో నే నొకదినము నిలువయున్నను ఆటికట్టు రద్దుకాలేదు. అదియుఁగాక అబ్దుల్లాసేట్ గారు చార్లెసు టౌనులోని గుఱ్ఱపుబండ్ల ఏజెంటుకు తంతి నంపెను.

కాని ఆయేజెంటు నన్ను దిగఁద్రావ నుద్దేశించెను. మఱియు నేను క్రొత్తవాఁడ నగుట చూచి నీటికెట్టు రద్దుచేయఁబడిన దనెను! నేను వానికి తగురీతి సమాధానము చెప్పితిని. లోపల చోటు లేక కాదు. వాని మనస్సులో నున్నది వేఱు. బాటసారులకు బండిలోపల తావీయవలయును. నేను కూలీని; క్రొత్తవాఁడను! లీడర్ అనఁబడు నాగుఱ్ఱపుబండ్ల అధికారి నన్ను తెల్లవారితోపాటు లోపల కూర్చుండఁబెట్టుట తగ దనుకొనెను. ఆ బండికి ముందిరుదట్టుల రెండుఆసనము లుండెను. లీడరు ఈరెండాసనములలో ఒకదానిపై తప్పక కూరుచుండును. కాని నేఁడు లోనఁ గూర్చుండి నాకు తన చోటు చూపించెను. అది శుద్ధ అన్యాయమనియు, మఱియు అవమానమనియు నాకు తెలియకపోలేదు. కాని ఆయవమానము మింగుటే మేలనుకొంటిని. బలాత్కారించి లోనఁ జొరఁబడ వీలుండదు. నే నతనితావునఁ గూర్చుండ నన్నచో నన్ను దిగవిడిచి

బండి తోలుకొని పోవుట కతఁడు సంసిద్ధుఁడు. అచట నేను దిగఁ బడినచో మఱియొక నాఁడు వృథా. ఇఁక నా మఱునాఁ డే మగునో దైవమున కెఱుక! కాఁబట్టి మనసులో నెంత గుంజాటనపడుచున్నను మొదలక బండితోలువాని పక్కఁ గూర్చుంటిని.

సుమారు మూఁడు గంటలకు బండి పార్కీకోపునకు చేరెను. అచట ఆ గుఱ్ఱపుబండి-తెల్ల అధికారికి నేను కూర్చున్నచోట కూర్చుండవలయునని బుద్ధి పుట్టెను. అతఁడు సిగరెట్ కాల్చుకొన వలెను. మఱియు అతనికి మంచిగాలి కావలెను. అతఁడు బండితోలు వానికడనుండి ఒక మైలగోనె తీసి దానిని తనపాదముల క్రింద బల్లమీదఁ బఱచి, 'సామీ! నీవు దీనిమీఁద కూర్చుండుము. నేను బండితోలువాని పక్క కూర్చుండఁ గోరుదును' అనెను. ఈయవమానము భరింప నాకు సామర్థ్యము లేకపోయెను. భయపడుచు భయపడుచు నేను 'లోపలఁ గూర్చుండవలసిన నన్ను ఇచటఁ గూర్చుండఁబెట్టితివి. నే నెట్లో సహించితిని. నీవిచటఁ గూర్చుండి సిగరెటు కాల్చుటకు నీకాళ్ల కడకూర్చుండు మనుచుంటివి. నేను కూర్చుండను. బండిలోపలికి పోయి కూర్చుండెదను.'

ఈ మాటలు నానోర వచ్చెనో లేదో, అతఁడు నా గూబలు పగులఁగొట్ట మొదలిడెను. నా చేయి పట్టుకొని కిందికి ఈడ్వనెంచెను. నే నా బండి చువ్వలను గట్టిగాఁ బట్టుకొంటిని. మనికట్లు విఱిగినను మాన విడువ వలదనుకొంటిని. బాటసారు లందఱు మమ్ము చూచుచుండిరి. అతఁడు బండుబూతులు తిట్టెను; క్రిందికి పడఁదోయ పాటుపడెను; కొట్టెను. నేనుమాత్రము వదలలేదు. అతఁడు బలిష్ఠుఁడు. నేను దుర్బలుఁడను. చూడఁగా చూడఁగా తెరువరులకు జాలి పుట్టెను. వారు—"పాప మతని విడిచిపెట్టు! అతఁ డన్నది నిక్కము.

అతని తప్పు లేదు. అక్కడ కూర్చుండనియెడల మాకడఁ గూర్చుండఁ గలఁడు. ఇటు పంపుము" అనిరి. 'దాఁటిపోలేదు' అని అతఁడఱచెను గాని అవమానపడి మఱి కొట్టలేదు. నాచేయి వదలి మఱి కొంచెము తిట్టి, బండి కావలిప్రక్కఁ గూర్చున్న హాటెంటాట్ సేవకుని ఆగోనె మీఁదఁ గూర్చుండఁబెట్టి అతనిచోట తాను కూర్చుండెను.

ఎవరి చోటులలో వారు కూర్చుండిరి. ఈల ఆయెను. బండి కదలెను. నాగుండెలు టువ్వుటువ్వు మనుచుండెను. ప్రాణములతో ఆయూరు చేరఁగలనా యని నాకు సంశయము. నడుమ నడుమ నతఁడు నావంక చుఱచుఱఁజూచి, వ్రేలు చూపి, 'చూడు! స్టాండర్టులో దిగనీ! అక్కడ ని న్నేమి చేయుదునో!' అని గాండ్రు మనుచుండెను. నేను మాటాడక కూరుచుండి, 'ఏమి దైవమా, నాకుసాయముర'మ్మని ప్రార్థించుకొనుచుంటిని.

చీఁకటి పడఁగనే స్టాండర్టు చేరితిమి. అచ్చట హిందువుల ముఖములు కొన్ని కనఁబడెను. నాగుండెలు కుదుటఁబడెను. నేను బండి దిగఁగనే వారు వచ్చి, 'మేము తమకోసమే వచ్చితిమి. ఇసా సేట్ గారి దుకాణమునకు పోవుదము. అబ్దుల్లా సేట్ గారు మాకు తంతి కొట్టిరి' అనిరి. ఇది నాకు సంతసము కలిగించెను. సేట్ ఇసా హాజీ సుమర్ గారి దుకాణమునకు పోతిమి. ఆ సేట్ను, ఆయన గుమాస్తాలును నాచుట్టు మూఁగిరి. నేను జరిగిన దంతయు చెప్పితిని. అందులకు వారందఱు వగచిరి. మఱి తాము తాము పడిన కష్టము లొక్కొక్కటి చెప్పి నన్ను ఓదార్చిరి.

గుఱ్ఱపుబండ్ల కంపెనీ ఏజెంటునకు గతవిషయ మంతయు పెద్ద ఉత్తరము వ్రాసితిని. లీడర్ బెదిరింపులును వ్రాసితిని. మఱుసటినాఁటి

బండిలో తగిన యేర్పాటు చేయుఁడని కోరితిని. అందుల కేజెంటు ఇట్లు బదులు వ్రాసెను: 'ఇప్పటినుండి మీరు వచ్చిన బండికన్న పెద్ద బండి బయలుదేరును. దానిని నడుపువారు క్రొత్తవారు. మిమ్ము బెదరించినవాఁడు రేపటికి రాఁడు! మీరు బండిలోపలనే కూర్చుండవచ్చును' ఈయుత్తరముతో కొంత బెంగ పోయెను. నన్ను కొట్టినవానిపై కేసుపెట్టునుద్దేశము నాకు లేకపోవుటచే ఆకథ అంతటితో ముగిసెను.

మఱునాఁడు ప్రొద్దుననే ఇసాసేట్‌గారి నౌకరు నన్ను గుఱ్ఱపు బండి నెక్కించెను. లోపల మంచిచోటిచ్చిరి. ఆరాత్రికి సుఖముగా జోహాన్సుబర్గు చేరితిని.

స్టాండర్టన్ చిన్న ఊరు. జోహాన్సుబర్గు పట్టనము. అబ్దుల్లా సేట్‌గారు జోహాన్సుబర్గునకును తంతి యిచ్చిరి. అచ్చట మహమ్మద్ కాసిమ్ కమరుద్దీన్‌గారి దుకాణపు విలాసము నాకు చెప్పియుంచిరి. అచట కమరుద్దీనుగారి నౌకరు నన్నుఁ దీసికొనిపోవ వచ్చెను. కాని నే నతనిఁజూడలేదు. అతఁడు నన్ను పోల్చలేదు. ఇఁక హోటలునకు పోవ నిశ్చయించితిని. ఆపట్టనములోని హోటళ్ల పేళ్లు కొన్ని యెఱుఁగుదును. బండి కుదుర్చుకొని గ్రాండ్ నేషనల్ హోటలునకు పోతిని. హోటలు మేనేజరును చూచి ఒకగది యిమ్మంటిని. అతఁ డొక నిమిషము ఎగదిగఁజూచి చాల గౌరవముతో 'గదులు ఖాళీగా లే'వని సలాము కొట్టి వెళ్లిపోయెను. మరల బండిమీఁద కాసిమ్ కమరుద్దీనుగారి అంగడికి వెళ్లితిని. అచట నా కెదురుచూచుచున్న అబ్దుల్ గనీసేట్‌గారిని కలిసికొంటిని. వారు నన్నెంతో ఆదరించిరి. నాకు హోటలులో జరిగిన మర్యాద చెప్పుకొంటిని. ఆయన పక పక నవ్వి 'హోటలులో, మీ కెట్లు ప్రవేశము కలుగు ననుకొంటిరి?' అనిరి.

‘ఏమది?’ అని నేనంటిని.

‘ఇక్కడ కొన్నాళ్లున్నచో మీకే గోచరమగును. మేమే ఈ దేశమున ఉండఁగలము. డబ్బుమీఁద ఆశచే ఎన్ని అవమానములు వచ్చినను మఱచిపోయి ఇక్కడ నివసించుచున్నాము.’ అని సేటుగారు దక్షిణ-ఆఫ్రికాభారతీయుల కష్టములను చెప్పిరి.

ఈ సేటు అబ్దుల్ గనీగారిని గురించి యింకను ముందుముందు తెలియఁగలదు.

ఆయన మరల నిటు లనెను: ‘ఈ దేశము మీబోంట్లు ఉండఁదగినది కాదు. రేపు మీరు ప్రిటోరియాకు బయలుదేఱుదురుగదా! ఇఁక మూఁడవ తరగతి బండిలోనే పోవలసియుండును. నేటాలులో ఈ మాదిరి. ట్రాన్సువాలులో ఇంతకంటె. ఇచట ఒకటి రెండు తరగతుల టిక్కెట్టులు హిందువులకు ఈయరు.’

‘మీ రందులకు తగిన ప్రయత్నములు చేయలేదేమో?’

‘మేము అర్జీలు పెట్టుకొంటిమి. కాని మావారే ఒకటిరెండు తరగతులలో పయనింప నొల్లరని ఒప్పుకొనక తప్పదు.’

‘నేను రైల్వే నిబంధనములను చదివిచూచితిని; అం దొకలోపము కలదు. ట్రాన్సువాలు శాసనముల భాష ఋజువైనది కాదు: విస్పష్టముగా ఉండదు; విశేషించి రైల్వే నిబంధనములు.

‘నాకు మొదటి తరగతిలోనే పోవలయునని యున్నది. వీలు కానిచో ప్రిటోరియాకు సరాసరి గుఱ్ఱపుబండి కుదుర్చుకొందును; ముప్పది యేడుమైళ్లేకదా’ అని నేను సేట్ గారితో అంటిని.

## ౯ ఎక్కువ కష్టములు

బండిపైఁ బోయిన ఎంత ధనవ్యయ మగునో, ఎంత కాలవ్యయ మగునో సేట్‌గారు తెల్పిరి. తెల్పి మొదటి తరగతి రైలుబండిలోనే వెళ్లుఁడనిరి. స్టేషన్‌మాస్టరుకు — నేను బారిస్టరుననియు, ఎప్పుడును మొదటి తరగతిబండిగాని మఱొకటి యెక్కననియు, నేను ప్రిటోరియాకు వీలైనంత తొందరగా వెళ్లవలయుననియు, దీనికి ప్రత్యుత్తరము రాక ముందే మిమ్ము కలిసికొందుననియు, మొదటి తరగతి టిక్కెట్టు తప్పక దొరకునని ఆశించుచుంటిననియు ఒక ఉత్తరము వ్రాసి పంపితిని. ఇందు నేను స్వయముగనే కలిసికొందుననుట కొక అర్థ మున్నది. స్టేషన్‌మాస్టరు నన్ను చూడనిచో ఈకూలిబారిస్టరుమీఁద ఏవో కొన్ని యూహలు కల్పించుకొని టికెట్టు ఇచ్చుటకు వీలు లేదని వ్రాసిపంపుటలో సందేహము లేదు. కాని నేను స్వయముగా తప్పెన్నుటకు వీలు లేని తెల్ల వేషము వేసికొని ఎదుటఁబడి అతనితో మాటలాడి మోమోటపెట్టినను పెట్టవచ్చుననుకొంటిని. ఫ్రాక్ కోటు తొడిగితిని. నెక్‌టై కట్టుకొంటిని. టికెటుటాకుగా పోయి బల్లపై ఒక కాసుపెట్టి టికెట్టు ఇమ్మని అడిగితిని. 'ఆచీటి వ్రాసినది మీరేనా?' అని అతఁ డడిగెను.

'ఔను! మొదటి తరగతి టికెట్టు నిచ్చితిరా, చాలకృతజ్ఞుఁడను. నేఁడే నేను ప్రిటోరియా చేరవలయును.' అంటిని.

అతఁడు చిఱునవ్వి, జాలిగొని, ఇటు లనెను—'మాది ట్రాన్సవాలు కాదు, హాలండు. నాకు మీ ఉద్దేశము తెలియును. నాకు మీయెడ సానుభూతి కలదు. మీకు నేను టికెట్టిత్తును గాని ఒకమరతు మీఁదఁ గార్డు వచ్చి మిమ్ము మూఁడవతరగతిలోనికి పొమ్మన్నచో నామాట దక్కింపవలయును. అనఁగా రైల్వే కంపెనీవారిమీఁద దావా తేరాదు. మీ ప్రయాణము సుఖమగుఁగాక! మీరు యోగ్యు

అని నేను గ్రహింపఁగలిగితిని' ఇటులని అతఁడు టికెట్టు నిచ్చెను. నే నతనికి ధన్యవాదము లొసఁగి మీమాటకు బద్ధుఁడనని ఒప్పితిని.

సేటు అబ్దుల్ గనీగారు నన్నుఁబంపుటకు స్టేషనుకు వచ్చిరి: ఈ జరిగిన విషయ మాయనకు వింత ఆయెను! కాని ఆయన ఇటు లనెను. 'ఆతంకము లేక మీరు ప్రిటోరియాకు చేరినచో చాల సంతోషము. కాని గార్డు మిమ్ము ఊరక వదలిపెట్టఁడని బెదురుగనే యున్నది. అతఁ డూరకున్నను తెల్ల బాటసారులు మాత్రము ఊరకుండరు.'

మొదటి తరగతి పెట్టెలో నెక్కితిని. రైలు బయలుదేరెను. జర్మిస్టన్ స్టేషనులో గార్డు టిక్కెట్లు సోదా చూడవచ్చెను. నన్ను చూడఁగనే అతనికి కోపము హెచ్చెను. వెంటనే లేచి మూఁడవతరగతి బండిలోనికి పొమ్మని వ్రేలితో సంజ్ఞచేసెను. నేను నా టిక్కెట్టు చూపితిని. 'ఉన్న నేమి? మూఁడవతరగతిలోనికి పొ'మ్మని ఉఱిమెను.

ఆపెట్టెలో ఒక్క తెల్లవాఁడే ఉండెను. ఆయన గార్డును ప్రతిఘటించి— "ఎందుల కా పెద్ద 'మనిషిని' బాధింతువు? ఆయన మొదటి తరగతి టిక్కెట్టు నీవు కానవా? వారి సరసన కూర్చుండు టకు నాకు బాధ లేదు" అని పల్కి, నాకేసి తిరిగి, "మీరు కూర్చున్న కడనే కుదిరి కూర్చుండుఁ"డని పల్కెను.

'కూలీతో కూర్చుండుటకు నీకే కొంకు లేనిచో మఱి నాకా?' అని గొణఁగుకొనుచు గార్డు వెళ్లిపోయెను.

రాత్రి ఎనిమిది గంటలకు రైలు ప్రిటోరియా చేరెను.

# ౧౦

## ప్రిటోరియాలో మొదటిరోజు

దాదా అబ్దుల్లాగారి వకీలు ప్రిటోరియా స్టేషనులో నన్నుఁ గలిసికొని తీసికొని పోవుటకు ఎవరినేని బంపునని ఆశపడితిని. నన్నుఁ గలిసికొనుటకు భారతీయు లెవరును రారని యెఱుఁగుదును. ఏలన, నే నాపత్తనమున ఏ భారతీయుని యింటను బసచేయనని అబ్దుల్లా గారి కభయ మిచ్చితిని. అది ఆదివారమగుటచే స్టేషనుకడకు ఎవరినేని బంపుటకు ఆవకీలుగారికి వీలు కలుఁగలేదని తరువాత తెలిసెను. నాకే మియుఁ దోఁచలేదు. ఎచటికి వెళ్లుదును? ఏ హోటలునందును నాకు తావీయరని దిగులుపడితిని.

౧౮౯౩ సంవత్సరమునందలి ప్రిటోరియా స్టేషను ౧౯౧౪ సంవత్స రపు ప్రిటోరియాస్టేషను కాదు. నాఁడు దీపములన్నియు మసక మసకగా నుండెను. బాటసారులుకూడ పలువురు లేరు. బాటసారుల నందఱను వెళ్లనిచ్చి టిక్కెట్ కలెక్టరు తీరికగా నున్నప్పుడు నాటిక్కెట్టు నిచ్చి ఏదేని చిన్నహోటలు పేరు గాని, లేక నాకు తావిచ్చు మఱి యొకచోటును గాని చెప్పుమని అడుగుదు ననుకొంటిని. ఎచటను వీలు కలుగనిచో ఆరాత్రి స్టేషనులోనే గడపఁదలఁచితిని. కాని ఈ స్వల్పవిషయ మడిగినను అతఁ డెక్కడ అవమానించిపోవునో యని నేను జంకిపోయిన మాట నిక్కము.

స్టేషను శూన్య మాయెను. తుదకు నా టిక్కెట్టును ఇచ్చి అదియు ఇదియు అడుగఁ దొడఁగితిని. అతఁడు వినయముతో ప్రత్యు

త్తరించెను గాని అది ప్రయోజనజనకము కాదు. కాని మా పార్శ్వమున నిలువఁబడియున్న ఒక అమెరికా నీగ్రో మా మాట లందుకొని ఇటు లనెను—"మీ గీ యూరికి సరిక్రొత్తవారివలె నున్నారు. ఇచట మీకు మిత్రులును ఉన్నటులు తోఁచదు. నాతో దయచేయుఁడు. మి మ్మొక చిన్న హోటలునకు తీసికొని పోవుదును. హోటలు యజమాని అమెరికావాఁడు. వారిని నేను బాగుగా ఎఱుఁగుదును. అతఁడు మీకు వసతి నీయఁగలఁడు."

ఈ పిలుపని పేరంటము మొదట నాకు కొంచెము సంశయము కలిగించెను గాని పిమ్మట అతనికి ధన్యవాదము అర్పించి అంగీకరించితిని. అతఁడు నన్ను జాన్‌స్టన్‌గారి హోటలునకు తీసికొని పోయెను. అతనిని చాటునకు తీసికొని పోయి నాసంగతి చెప్పెను. జాన్‌స్టన్‌గారు అంగీకరించిరి, కాని ఒక నియమము—అందఱిలోఁ గాక నాభోజనము నాగదిలోనే జరుగవలయును.

మఱియు అతఁ డిటు లనెను—"నాకు నలుపు తెలుపు లను నీ భేదములు లేవు. కాని మాహోటలునకు వచ్చువా రందఱును తెల్లవారే. మిమ్ము వారితోపాటు లోపల కూరుచుండఁ బెట్టినచో వారి కది అవమాన మనుకొందురో, మఱి లేచి పోదురో!"

"చిత్తము. ఈ రాత్రి యయినను నన్ను ఉండనిచ్చినందులకు మీకు వందనము. నాకు ఈ దేశవ్యవహారము కొంచెము కొంచెము తెలిసినది. మీకష్టము నే నెఱుఁగుదును. నాగదిలో నేను భుజించుటకు నా కెట్టి ఆటంకమును లేదు. రేపు మఱియొకచోట ఏర్పాటు చేసికొనఁ గల ననుకొందును."

గదిని చూపిరి. లోని కేఁగితిని. భోజనమున కెదురు చూచుచుంటిని. ఒక్కఁడ నుండుటచే నేదో ఆలోచించుకొనుచుంటిని.

సేవకుఁ డింక రావచ్చు ననుకొంటిని. కాని జాన్‌స్టన్‌గారు వచ్చిరి. "మిమ్ములను ఇక్కడ భుజింపుఁడని అన్నందులకు చాల నొచ్చుకొంటిని. అతిథు లందఱకు ఈ మాట చెప్పితిని. చెప్పఁగా వారు తమకు కేట్టి ఆపత్తియు లేదనిరి. వీరు నలువురతో అన్నశాలయందే భుజింపవగును; వీరి రిచట నున్నా ళ్లున్నను సరియు; తమ కేట్టి ఆపత్తియు ఉండఁబోదని వారందఱును అన్నారు."

నేను మరల వారికి ధన్యవాదము లొసఁగితిని. అన్నశాలలో తృప్తిగా భుజించితిని.

మఱునాఁటి ప్రొద్దున వకీలు ఎ. డబ్ల్యు. బేకరుగారిని దర్శించితిని. అబ్దుల్లా సేటుగారు వారిని గుఱించి కొంత చెప్పిరి. ఆకారణమున వారు నాకు చేసిన ఆదరమునకు ఆశ్చర్యము కలుగలేదు. నా కెంతయో అభ్యుత్థానము చేసెను. ఎన్నియో కుశలప్రశ్నము లడిగెను. నాసంగతి యంతయు తెలిపితిని. తరువాత అతఁ డిట్టు లనెను: "మీరు బారిస్టరుగా ఇచట చేయఁదగిన దేదియు లేదు. లోఁగడనే మేము మంచి వకీళ్లను కుదిర్చి యుంచితిమి. ఈ దావా చాల కాలమునుండియు వచ్చుచున్నది. మఱియు చిక్కులమారిది. కనుక కావలసినంత వట్టు ఆవశ్యకములైన విషయములలో మీ సాయము చేకొందును. మా క్లయింటునకును, మాకును ఉత్తర ప్రత్యుత్తరములలోఁగల కష్టము మీరు తొలఁగింపవచ్చును. ఎట్టు లనఁగా, ఇపుడు నేను వారికడనుండి రావలసిన విషయములు అన్నియు మీనుండి తెప్పించుకొందును. ఇది నిక్కముగా మంచి సౌకర్యము. నే నింతవఱకు తమకు బస విచారింపలేదు. తమదర్శన మయినపిదప విచారింపఁ దలఁచితిని. ఇచట వర్ణవైషమ్యము భయపడఁ దగినంతగా కలదు. కావున తమబోఁటివారికి తేలికగా బస దొరకదు. అయితే నే నొక పేదరాలి నెఱుఁగుదును.

ఆమె రొొట్టె లమ్మి జీవించు నొకని యిల్లాలు. ఆమె మీకు తొ విచ్చి కొంచెము డబ్బుచేసికొను నసుకొందును. అచటికి పోదము దయ చేయుఁడు."

అతఁడు న న్నామెయింటికి తీసికొనిపోయెను. ఆమెతో చాటుగా మాటలాడెను. వారమునకు 3 ౧ షిల్లింగులు పుచ్చుకొని ఆమె భోజనము పెట్టుటకు ఒప్పుకొనెను.

బేకరు వకీలే కాఁడు, ఆయన మంచి మతబోధకుఁడును. ఆయాన నేఁటికిని జీవించి యున్నాఁడు. ఆయనపని యిప్పుడు కేవలము మత ప్ర చారము. వకీలుపని మానివేసెను. సిరి సంపద లున్నవి. నేఁటికిని మాయిరువురకు ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నవి. ఆయన— ఉత్తరమున ఒకటే మాట: భిన్నభిన్న రూపములగు విషయములచే ఆయన క్రైస్తవమత ప్రాశస్త్యమును సాధించును. మఱియు జీససును ఈశ్వరున కేకమాత్రపుత్రునిగను, మనుష్య సంతారకునిగను విశ్వసింపని యెడల పరమశాంతి లభింపదని ఆయన ప్రతిపాదించును.

ప్రథమ దర్శనముననే బేకరుగారు నా మతాభిప్రాయము కనుఁ గొనెను. నే నిటు లంటిని—"నేను పుట్టువుచే హిందువను. అయినను నాకు హిందూమత మెక్కుడు తెలియదు. ఇతరమతములమాట అంత కన్న తెలియదు. నిక్కముగను నాస్థితి నాకు తెలియదు. ఇప్పటి నావిశ్వాస మేమియో నాకు తెలియదు. ఎటు లుండవలయునో అదియు తెలియదు. నేను మా మతమును పఠింపవలయు ననుకొనుచు న్నాను. యథాశక్తిగా ఇతరములనుగూడ పఠింపవలయు ననుకొను చున్నాను."

## ౧౦ ప్రిటోరియాలో మొదటిరోజు

బేకరుగారీమాటలు విని ప్రసన్నులై —"దక్షిణ ఆఫ్రికా జనరల్ మిషనుకు నేనొక డైరెక్టరును. నేను స్వయముగా ఒక చర్చి కట్టించితిని. అందు నియమకాలమున తప్పక మతమునుగురించి ఉపన్యసింతును. నాకు రంగు తెగులు లేదు. నాతోపాటు అచట ఇంకను ప్రచారకులు కలరు. అచట మేము దైనందినము ఒంటిగంటకు చేరి కొన్ని నిమిషములు శాంతి జ్ఞానోదయములకు భగవంతుని ప్రార్థించుచుందుము. తాము అక్కడికి వచ్చినచో చాల సంతోషించెదను. అచట నా సహచరులతో తమకు పరిచయము కలుగఁజేయుదును. వారును తమ పరిచితిచే ప్రీతులగుట నిక్కము. తమకు నేను పఠింప కొన్ని గ్రంథములను ఇత్తును. గ్రంథములలో నెల్ల బైబిలే మహాగ్రంథము. మిమ్ములను దానినే పఠింపుఁడని ప్రత్యేకముగా సిఫారసు చేయుదును."

నేను బేకరుగారికి ధన్యవాదములు సమర్పించి ఒంటిగంట ప్రార్థనలకు అందుకొందునని మనవి చేసితిని.

"అటులగుచో తమకొఱకు రేపు ఒంటిగంటకు ఇచటనే వేచియుందును. మన మిచటనుండి ప్రార్థనామందిరమునకు కలసియే పోవుము." అని యీమాటలుకూడ వెనుకటిమాటలకు కలిపెను. మేము పరస్పరము సెలవు పుచ్చుకొంటిమి.

బాగుగా ఆలోచించుటకు నాకు ఇంతవఱకు ఎక్కువ అవకాశము చిక్కలేదు.

జాన్‌స్టన్‌గారికడకు వెళ్లితిని. డబ్బు ఇచ్చితిని. క్రొత్త యింటికి వెళ్లితిని. అక్కడ భుజించితిని. ఆ బిడ దొడ్డయిల్లాలు. ఆమె

నాకు శాకాహారము సిద్ధముచేసెను. వారి కుటుంబములో కలిసిపోవుటకు నాకెంతో కాలము పట్టలేదు.

తరువాత నేనచటనుండి దాదా అబ్దుల్లాగారి మిత్రుని చూడం బోయితిని. అబ్దుల్లాగారు వారికి చీటి వ్రాసి యిచ్చిరి. నేను వెళ్లి ఆచీటి యిచ్చితిని. మాకు పరిచయ మాయెను. వీరు అచటి హిందువుల కడగండ్లు వివరించిరి. వీరు నన్ను తమయింట నుండుడని 'బలవంత' పెట్టిరి. నేను వీరికి ధన్యవాదము లర్పించి నే నిదివరకే బస ఏర్పాటు చేసికొంటినని మనవి చేసికొంటిని. 'తమ కేదేని కావలయునో నన్నడుగుటకు సంకోచింప వలదని వీరు మఱిమఱి చెప్పిరి.

సంజ ఆయెను. భుజించి నాగదిలో విశ్రమించి దీర్ఘాలోచనలో పడితిని. ప్రకృతము నాకు చేయదగు పని లేదు. ఆవిషయము అబ్దుల్లా సేటుగారికి తెలిపితిని. బేకర్ గారు ఇంత మైత్రిచేయుటలోగల అర్థ మేమి? వీరి సహచరుల వలన నాకెంత జ్ఞానము లభించును? క్రీస్తుమతము ఎంతవఱకు చదువుదును? హిందూమతమునకు సంబంధించిన గ్రంథములు నాకెటులు దొరకును? నా నిజమతమును సంపూర్ణముగా ఎఱుఁగనిచో క్రైస్తవ మతస్వరూపము సరిగా నాకు ఎటులు తెలియును? నే నీనిర్ణయమునకు రాఁగలిగితిని: నా చదువంతయు నిష్పాక్షికముగా ఉండవలయును; ఈశ్వరుఁడు చూపించిన త్రోవ బేకరు గణముతో సంచరింపవలయును; నిజమతమును సంపూర్ణముగా తెలిసికొనక అన్యమతమును అంగీకరించు నాలోచనమును పెట్టుకొన్నను.

ఇటులు తలపోయుచు తలపోయుచు నిదురలోఁ బడితిని.

# ౧౧

## క్రైస్తవులతో పరిచయము

మరునాఁడు ఒంటిగంటకు జేకరుగారి ప్రార్థనామందిరమునకు వెళ్లితిని. అచ్చట హారిస్ కుమారితోడను, గాబ్ కుమారితోడను, కోట్స్ మొదలగు వారితోడను పరిచయము కలిగెను. అందఱును ప్రార్థింప మోఁకరించిరి. నేనును వారి ననుకరించితిని. తమకోరికలను గుఱించి ఈశ్వరుని వేఁడుకొనుట అచటి ప్రార్థన. 'ఈదినము శాంతముగాఁ గడచుఁగాక!' అనిగాని, 'ఓ పరమేశ్వరా! నాహృదయద్వారమును తెరుతువుగాక!' అనిగాని ప్రార్థించుట అచట మామూలు. నాఁడు మాత్రము 'క్రొత్తగ వచ్చిన మా మిత్రునకు మార్గము చూపుము! ఓప్రభూ! మాకు కలిగించిన శాంతినే ఇతనికిఁగూడ కలిగింపుము! మమ్ము రక్షించిన యేసురక్షకుఁడే ఇతనిఁగూడ రక్షించుఁగాక! యేసునాథుని పేరనే మేము మీ ప్రార్థనలు చేయుచున్నాము!' అని వారందఱును పరమేశ్వరుని వేఁడుకొనిరి. ఈ సమాజమున భజనకీర్తనలు గాని, సంగీతముగాని లేవు. ప్రతిదినము ప్రార్థన అయినవెంటనే వెళ్లిపోయెడివారము. సరిగా అప్పుడు భోజనవేళ. ప్రార్థనకు అయిదు నిమిషములకంటె ఎక్కుడు కాలము పట్టెడిది కాదు.

హారిస్, గాబ్ అను నీ యిరువురును అవివాహిత ప్రౌఢలు. కోట్స్‌గారు క్వేకరు తెగవారు. పై ఇరువురు స్త్రీలును ఒకచో నివసించుచుండిరి. ప్రతిఆదివారము నాలుగుగంటలకు తమయింట తేనీరు త్రావుటకు నన్ను ఆమంత్రించిరి. ఆదివారములందు కోట్స్

గారును, నేనును కలిసినపుడు ఆవారమున నేను చదివిన గ్రంథముల జాబితా ఇచ్చుచుండువాఁడను. వానినిగుఱించి నా అభిప్రాయములు గూడ చెప్పుచుండువాఁడను. ఈ వృద్ధకుమారికలుగూడ తమఅనుభవములను, తమకు కలిగిన పరమశాంతిని గుఱించి చెప్పుచుండెడివారు.

కోట్సుహృదయము శుద్ధము. అతఁడు బోళావాఁడు. పట్టుదల గలయువకుఁడు. ఈయనకును నాకును ఎక్కువ సంగాతము యేర్పడెను. తఱుచు మేముకలిసి షికారు వెళ్లుచుండువారము. వీరివలన నాకు పలువురు క్రైస్తవులపరిచయము లభించెను. మాపరిచయము వృద్ధియగు కొలఁది అతఁడిచ్చు గ్రంథములును నాబీరువాలో అంతగా వృద్ధియాయెను. నేను కేవలము శ్రద్ధకు వశుఁడనై వాని నన్నిటిని పఠింప ననుతించితిని. ఈ పుస్తకములు చదివి వీనిలోని విషయములను చర్చించుకొనుచుండువాఁడను.

౧౮౯౩ సంవత్సరమున అట్టిగ్రంథము లనేకములు చదివితిని. వానిపేరులన్నియు నా కిపుడు గుఱుతులో లేవు. 'సిటీటెంపిల్' అను గ్రంథముపయి పార్కరుగారు వ్రాసిన వ్యాఖ్యానమును, పియర్సను గారు వ్రాసిన 'ఇన్ఫాలిబుల్ ప్రూఫ్సు'ను, బట్లర్ గారు వ్రాసిన 'అనాలజీ'యును ఈమొదలగునవి కొన్ని గుర్తు. ఈ గ్రంథములలో కొన్ని కొన్ని భాగములు నాకు తెలియకుండెను. కొన్ని నచ్చెను; కొన్ని నచ్చకుండెను. నా ఉద్దేశములన్నియు కోట్సుగారికి తెలుపుచుంటిని. బైబిల్ మతము పరమప్రమాణ మనుటయే ఇన్ఫాలిబుల్ ప్రూఫ్సు గ్రంథకర్తయొక్క ఉద్దేశము. ఈపుస్తకము నాకు నచ్చలేదు. ఈ పార్కరుగారిటీక నీతివర్ధకమే కాని ప్రచారమునందున్న ఏసు మతమున విశ్వాసము లేనివారి కది నిష్ప్రయోజనము. బట్లరుగారి

ఆనాలజీ క్లిష్టము, గంభీరమును అగు గ్రంథము. దీని నయిదారు సారులు చదువవలయును. నాస్తికులను ఆస్తికులనుగా మార్పఁదలఁచుట ఈ గ్రంథోద్దేశ మనుకొందును. 'ఈశ్వరుఁడు కలఁడు' అను సిద్ధాంతములు చదువుట నాకు లాభకారి కాదు. ఏలన నేను నాస్తికావస్థను లేను. ఏసే అద్వితీయమగు అవతారమనియు, అతఁడు మానవులకును, ఈశ్వరునకును సంధికర్తయనియు ఈమొదలగు సిద్ధాంతము నాకు హృదయంగమము కాలేదు.

కోట్సుగారు అంతమాత్రమున అపజయ మొప్పుకొనువాఁడు కాఁడు. ఆయనకు నాపైఁగల కూర్మికి ఎల్ల లేదు. ఒకనాఁడు అతఁడు నామెడలో తులసిదండ చూచెను. చూచి దుఃఖితుఁడయ్యెను. 'ఈ గ్రుడ్డి నమ్మకము నీకు తగదు. దండను త్రెంపుదు నిటు ర'మ్మనెను.

'కూడదు, ఇది మా అమ్మగారి ప్రసాద'మంటిని.

'అందు నమ్మక మున్నదా?'

'అందలి రహస్యము నాకు తెలియదు. ధరింపకున్నచో కీడు కలుగునని నే ననుకొనను. ఆమె నాశ్రేయస్సు కోరి ప్రేమతో వేసిన యీదండను ప్రబలమగు కారణము లేక తీసివేయను. కాలము పక్వమై యిది జీర్ణమై తనంత తాను తెగిపోవుచో మఱియొక తులసిపేరు కొనుటకు నాకు లోభము లేదు. కాని దీనిఁ దెంప వలనుపడదు.'

నామతమున నమ్మిక లేదు కాన నావాద మతనికి నచ్చలేదు. నన్నతఁ డజ్ఞానకూపమునుండి వెలువరించుటకే ప్రయత్నించుచుండెను. మతాంతరములందు కొంత సత్య మున్నను, పూర్ణమగు సత్యము ఏసు మతమునందే కలదనియు, ఆమతము స్వీకరింపనిచో మోక్షము చేకూఱ

దనియు, ఏసునాథుఁడు మధ్యవర్తియై అడ్డుపడకున్నచో పాపప్రక్షాళనము కాదనియు, పుణ్యకర్మములతో నిసుమంతయు ప్రయోజనము లేదనియు అతఁడు వాదించి నన్నొప్పింప ప్రయత్నించుచుండెను.

అతఁడు నాకు గ్రంథపరిచితి కలిగించినటులే ఏసుభక్తుల పరిచితినిగూడ కలిగించెను. ఈపరిచయసంబంధమున ప్లిమత్ బ్రదరన్ కుటుంబ మొకటి.

ప్లిమత్ బ్రదరన్ అనునది ఒక ఏసుసంప్రదాయము. నాకు కోట్సుగారివలన పరిచితు లయినవా రందఱును చదువుకొన్నవారు; పాపభీరువులు. కాని ఈకుటుంబములో ఒకరు ఇటులు వాదించిరి:

'మా మతసౌందర్యము నీ వెఱుఁగవు. మానవుఁడు తన పాపములకు ఎప్పటికప్పటికి ప్రాయశ్చిత్తము చేసికొనవలయు ననునది నీ వాదము అగుచో జన్మమెల్లను ప్రాయశ్చిత్తములతో సరి. ఎడతెగని ఈక్రియాకాండచే ముక్తి యెటులు కలుగును? నీ కెన్నటికిని శాంతి రాదు. మన మందఱమును పాపులమని నీవును అందువు. చూడుము, మా కెంతవిశ్వాసము కలదో! మన ప్రయత్నములు వ్యర్థములు కాని ముక్తి కావలయును. ఈపాపభారము నెటులు మోయఁగలము? దానిని ఏసుమీఁదనే పాఱవేయవలయును. అతఁ డొక్కఁడే పాపరహితుఁడు. అతఁ డొక్కఁడే భగవానుని కుమారుఁడు. ఎవరు తనను నమ్మెదురో వారి పాపము పటాపంచలయిపోవునని ఆయన వర మొసఁగెను. అది ఈశ్వరుని అగాధమగు ఉదారత. ఏసు ముక్తి నీయ గలఁడని నమ్మెదుమేని పాపములు మన కంటవు. మనకు పాపము చేయకతప్పదు. ఈప్రపంచమున పాపస్పర్శ లేకుండు టెటులు? కావున 'ఏసే రక్షకుఁడు' అని నమ్మినవానికే పరిపూర్ణశాంతి. కావున శాంతి మీకా, మాకా?'

## ౧౧ క్రైస్తవులతో పరిచయము

ఈవాదము నాకు నచ్చలేదు. వినయముతో నేను ఇట్లు లంటిని:

'ఏసుమతమువా రందఱును ఇట్లులే వాదించుచో నే నాయేసు మతమును అంగీకరింపఁజాలను. పాపములొనర్చి తత్ఫలము నాకు అంటరాదని నే నెన్నఁడును ప్రార్థింపను. పాపకర్మమునుండి, మఱియు పాపప్రవృత్తినుండి విముక్తుఁడ నగుటకు ప్రయత్నము చేయుదును. అట్టిస్థితి చేకూఱునంతకు అశాంతియే నాకు ప్రియతరము.'

అతఁ డిట్లులు బదు లాడెను:

'ఇది యంతయు నిష్ప్రయోజనము. మరల నొకసారి నా చెప్పిన మాట లాలోచింపుము.'

పాపము! అతఁడు చెప్పినంత చేసితీరెను. బుద్ధిపూర్వకముగా అతఁడు పాపము అనుష్ఠించుచుండెను. అంతటితోఁ బోక వానివలన తన కేమియు మనస్సున చింత లేదని నాకు చెప్పెను.

ఇట్టి సిద్ధాంతములు క్రైస్తవులందఱకు సమ్మతములు కావని వీరిపరిచితికి వెనుక నే నాకు తెలిసెను. కోట్సు పాపభీరువు. ఈతని హృదయము నిర్మలము. సాధనచే హృదయము శుద్ధమగునని యితని నమ్మిక. అవ్వృద్ధకుమారికలకుఁగూడ నిదియే నమ్మిక. నాచదివిన గ్రంథములలో కొన్ని భక్తిపరములు. ప్లిమత్ సోదరప్రసంగమున నాబుద్ధి యెట్లులు మాఱునో యని కోట్సుగారు భయపడుచుండిరి గాని అట్టిసందియమున కవకాశము లేదనియు, అతని వెడమతముచేత ఏసుమతము యొక్క యాథార్థముపై నాకు ఈసు కలుగదనియు నచ్చఁ బలికితిని. నాకుఁ గల తపన వేఱు: అది బైబిలునుగుఱించియు, దాని తత్త్వార్థమును గుఱించియు.

## ౧౨

## భారతీయులతో పరిచితి

క్రైస్తవులనుగూర్చి అధికముగా వ్రాయుముందు అప్పటి నాయితరానుభూతులను చెప్పుట ఆవశ్యకము.

నేటాలురాష్ట్రమున దాదా అబ్దుల్లాగా రెట్టివారో ప్రిటోరియాలో శేఠ్ తైయబ్ హాజీఖాన్ మహమ్మదుగారు అట్టివారు. అందఱకు ఉపయోగించు ఏధర్మకార్యమైనను ఆతఁడు లేక నెఱవేఱదు. నేనచటికేఁగిన మొదటివారముననే వారితో పరిచితి గావించితిని. నేను ఆతనితో ఇటు లంటిని—'నాకు ప్రిటోరియాలోని భారతీయు లందఱితో పరిచయము సంపాదింపవలయునని ఉన్నది. ఇచటి హిందువుల అనుపానులు నాకు తెలిసికొనవలయునని ఉన్నది. కావున మీరు నాకు సాయము చేయవలయును.' ఇట్టులు నేననఁగా నతఁడు అన్ని విధముల సాయము చేయుటకు ఉత్సహించెను.

భారతీయుల నందఱను ఒకచో సమావేశపఱచి వారి స్థితిగతుల నన్నింటిని వివరించి చెప్పుట ఆవశ్యకమని నాకు తోఁచెను. శేఠ్ హాజీ మహమ్మద్ హాజీ జూసబ్ అనువారి పేర నాకడ పరిచయలేఖ కలదు. సభ వారిగృహమున. సభ్యులందఱు మేమన్ వర్తకులు. హిందువులసంఖ్య వేళ్లమీఁద. ప్రిటోరియాలో ఉనికిగల హిందువులు కొలఁదిమంది.

నా జీవితమునం దిది ప్రథమోపన్యాసము. ఆయుపన్యాసమునకు నేను కష్టించితిని. ఉపన్యాసవిషయము సత్యము. వాణిజ్యమున

సత్యము నడపుట అసంభవమని కొందఱువర్తకులు పలుమాఱులు నాతో పలికియుండిరి. నే నపుడును దాని విశ్వసింపలేదు; ఇపుడును విశ్వసింప లేదు. 'సత్యమును, వేపారమును ఈ రెండునుపరస్పరమువిరుద్ధములు' అను చుండు వేపారులు నేఁటికినిగలరు. 'వేపార మనునది వ్యాపారము; సత్య మనునదిధర్మము: కావున వ్యవహారము వేఱు; ధర్మము వేఱు' అని వారి రాద్ధాంతము. వ్యవహారమునందు శుద్ధసత్యము అశక్యము; యథాశక్తి సత్య మాడుట శక్యమని వారి మతము. నేను నాయుపన్యాసమున ఈవిషయ మునంతయు ప్రత్యాఖ్యానము చేసి వేపారులు రెండింతలు సత్యముగా ఉండవలయునని చూపించితిని. స్వదేశమునకంటె విదేశమున ఎక్కుడు సత్యనిష్ఠ ఉండవలయును. ఏలన అచటనుండు ఏకొలఁదిమంది భారతీ యులనో చూచి కోటానకోట్ల భారతీయులుగూడ వీరివలెనే యుం దురని నిర్ణయమగును.

నేను తెల్లవారిని ఉదాహరించి నల్లవాండ్రెంత అశుచిగ నుం దురో, ఎంత దుష్ప్రవర్తనము చేయుదురో చాటిచెప్పితిని.

హిందువులు, ముసల్మానులు, పారసీకులు, క్రైస్తవులు, మఱియు గుజరాతీ, మదరాసీ, పంజాబీ, సింధీ, కచ్ఛీ, సూరతీ ఈ మొదలగు భేద ములు మఱవుఁడని ఉద్బోధించితిని. ఒక సంఘమును స్థాపించి మనవారు పడుచున్న కష్టనిష్ఠురములను అధికారులకు అర్జీలు పెట్టుకొనుఁడనియు, నాకు వీలు ఉన్నంతవఱకు వేతనము కోరకయే పని చేయుదుననియు ముగించితిని.

నా ఉపన్యాసము సభను ఆకట్టె నని గ్రహించితిని.

దానిపై చర్చలు జరిగెను.

తమతమకష్టములు నా కెఱింగింప కొంద ఱంగీకరించిరి. నాకును ఉత్సాహము కలిగెను. వారిలో ఇంగ్లీషు వచ్చినవారు కొలఁదిమంది. అపరదేశమున ఇంగ్లీషువచ్చినచో లాభకరమని నేను వారికి తెలిపితిని. కావున ఇంగ్లీషు చదువుఁడని కోరితిని. పెద్దవారైనను చదువుకొన వచ్చునని కొందఱి యుదాహరణము చూపితిని.

ఎవరయినను చదువుకొనువా రున్నచో చెప్పుటకు నేను సంసిద్ధుఁడ నంటిని. తమకు వీలయినపుడు నేను తమకడకు వచ్చి బోధించుపరతు మీఁద కొందఱు ఇంగ్లీషు చదివికొన నంగీకరించిరి. వీరిలో ఇరువురు ముసల్మానులు ఒకఁడు మంగలి. ఒకఁడు గుమాస్తా. మూఁడవవాఁడు హిందువు. ఒకచిన్న దుకాణాదారు. నేనందఱకు అనుకూలుఁడ నైతిని. బోధకతలో నాకు సందియములేదు. నాశిష్యులుమాత్రము ఏమరిరి గాని నేను విడువుకొనలేదు.

నేను వారియిండ్లకు పోవుటయు కాని వారికవకాశము లేకుండెడిది. కాని నే నోరిమిని విడనాడలేదు. ఇంగ్లీషుపండితుల మగుదమని వారి కెవరికిని కోర్కె లేదు. అయినను ఇద్దఱు ఎనిమిదినెలలకు కొంత తేలిరి. కొంచెము ఖాతావ్రాఁత (Book Keeping) కొంచెము వ్రాఁతకోఁతలు(Correspondence) నేర్చిరి. తన ఖాతాదారులతో మాటలాడుటకు శక్తి కలుగుచో చాలునని మంగలి అనుకొనెను. వారిలో ఇద్దఱు ఇంగ్లీషు వచ్చుటవలన ధనార్జనముచేయు సామర్థ్యము గడించిరి.

సభవలన కలిగిన ఈప్రయోజనమునకు నాకు సంతస మయ్యెను. అట్టి సభలు ప్రతివారమో, ప్రతినెలయో చేయ నిశ్చయింపఁబడెను. ఇంచుమించుగా మే మనుకొన్నటులు సభలు జరుగుచుండెడివి. ఈసభలలో ఒకరిఉద్దేశము లింకొకరు తెలిసికొన వీలు కలుగుచుండెడిది.

## ౧౨ భారతీయులతో పరిచితి

ఈకారణముచే ప్రిటోరియాలో నే నెఱుఁగని భారతీయుఁడు లేఁడు. వారినిగుఱించి నాకు తెలియనివిషయము లేదు. ఈకారణమున అచట నివసించుచున్న బ్రిటిషు ఏజెంటుతో పరిచితి చేసికొన నెంచితిని; వారిని సందర్శించితిని. ఆయనపేరు జాకోబస్ డి వెట్. హిందువులపై ఆయనకు మంచి అభిప్రాయము. కాని అచట నతనికి తగినపలుకుబడి లేదు. "సమయము వచ్చినపుడు సాయపడుదు"నని ఊఱడించి అక్కఱ కలుగు నపుడు నను జూడ ర"మ్మని అతఁడనెను.

రైలువారితో వ్యవహారము జరుప నారంభించితిని. 'మీరు పెట్టుకొనిన ఏర్పాటులను అనుసరించియే హిందువులకు కష్టములు కలుగకుండఁ జూడుఁ'డని కోరితిని. సరియగు వేషభాష లున్నయెడలనే పెద్దతరగతి టిక్కెట్టు లీయఁబడు నని ప్రత్యుత్తరము వచ్చెను. దీనివలన తగినప్రయోజనము సమకూరలేదు. ఏలయనఁగా వేషభాషలు సరిగా నున్నవనుటకును, లేవనుటకును స్టేషన్‌మాస్టరుగదా అధికారి!

హిందువులకు సంబంధించిన కొన్నివ్యవహారపత్రములను బ్రిటిష్ ఏజెంటు నాకు చదువ నిచ్చెను. ఇట్టివి కొన్ని తైయబ్ సేటుగారుగూడ ఇచ్చిరి. ఆరెంజిఫ్రీస్టేటునుండి భారతీయులు ఎంత నిర్దయముగా వెళ్లఁగొట్టఁబడిరో ఆవిషయ మీకాకితములవలన నాకు తెలియనాయెను.

వేయేల? ట్రాన్సువాలు ఫ్రీస్టేటులలోని భారతీయుల జీవనము—సాంఘికము, ఆర్థికము, రాజకీయము, సమస్తమును తెలిసిపోయెను. వీని చదువుటవలనముందు ఇంత ప్రయోజనము కలుగఁబోవునని నేననుకొనలేదు.

ఆయేడు గడఁచినపిమ్మటనో, దావా తేలినపిమ్మటనో గృహాభిముఖుఁడను కాఁదలఁచితిని. కాని దైవము వేఱు తలఁచెను.

## ౧౩

### కూలితనపు అనుభవము

ట్రాన్సువాలు ఆరెంజి ఫ్రీస్టేటులలోని భారతీయులదశను సంపూర్ణముగా చిత్రించుట కిది తావు కాదు. తెలిసికొనఁదలఁచువారు దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహేతిహాసమును చదువవలెను. కాని దానిరూపరేఖ యిచ్చుట ఇచ్చట నావశ్యకము.

ఆరెంజిఫ్రీస్టేటులందు ౧౮౮౮ సంవత్సరముననో, అంతకు ముందో పుట్టిన ఒకశాసనమువలన భారతీయుల స్వాతంత్ర్యము లన్నియు మాసిపోయెను. ఒకవేళ భారతీయుఁ డెవఁడేని అచట నుండఁదలఁచి నచో హోటళ్లలో సేవకుఁడుగనో, లేక మఱియొక బానిస తనమేదేని అవలంబించియో ఉండితీరవలెను. నామమాత్రమునకు ముదరా యిచ్చి వర్తకులను తఱిమివైచిరి. వారు అర్జీలు పెట్టుకొనిరి. ప్రార్థనాపత్రములు పంపుకొనిరి. కాని వారి మాట లెవరు విందురు?

౧౮౮౫ సంవత్సరమున ఒక కఠినశాసనము పుట్టెను. ౧౮౮౬ సంవత్సరమున అది కొంచెము సంస్కరింపఁబడెను. దీనికి ఫల మేమనఁగా, భారతీయుఁడు ట్రాన్సువాలులో ప్రవేశించుటకు మూఁడు పవునులు పన్నియవలయును. వారికి ప్రత్యేకించిన స్థలములలోతప్ప వారికి వేఱుగా భూము లుండరాదు. నిక్కమునకు అదియు భూస్వామిత్వము కాదు. వారికి వోటుహక్కు లేదు. ఆసియాఖండ వాసులకుఁగాను ఈశాసనములు నిర్మింపఁబడెను. కాని వారికంటె

వేఱుగా నున్న శ్వేతేతర జాతులవారికిఁగాను నిర్మింపఁబడిన శాసనములుకూడ ఆసియాఖండవాసులపై ప్రయోగింపఁబడుచుండెను. ఈ శాసనములచే భారతీయుఁడు కాలిబాటలో నడువరాదు. రాత్రి తొమ్మిది గంటలు దాఁటిన పిదప అనుమతిలేక భారతీయుఁ డెవఁడును బయటికి పోరాదు. భారతీయులపై ఈ శాసనము లొక్కొక్కప్పుడు ప్రయోగింపఁబడుచుండెను. ఒకొక్కప్పుడు లేదు. కొందఱు అరబ్బుల మని చెప్పుకొని దాఁటుచుండిరి. ప్రత్యేకముగ అనుమతి కావలసివచ్చెనా, పోలీసువారి 'దయాధర్మబిచ్చము.'

ఈ రెండు శాసనములను చదివి చూడవలసివచ్చెను. నేను రాత్రులందు కోట్సుగారితో కలిసి షికారుపోవుచుంటిని. నేను వెనుదిరిగి యింటికి వచ్చువఱకు పదిగంట లయ్యెడిది. పోలీసు పట్టుకొనిన నా గతియేమి? ఈ విషయమున నాకంటె కోట్సుగారికి ఎక్కువ తొందరగా ఉండెను. అతఁడు తన నీగ్రోనౌకరులకు చీటి (Pass) నీయఁగలఁడు. నాకెటు లీయఁగలఁడు? సేవ్యుఁడు సేవకునకు అనుజ్ఞాపత్త్రము నీయవచ్చును. నేను కోరుదునుగాక! కోట్సుగారు ఈయ సంసిద్ధుఁ డగుఁగాక! అప లతఁ డటు లీయఁ జాలఁడు. అటులు చీటి నిచ్చిన అది దగా.

కావున కోట్సుగారు, వారి మిత్రులు నన్ను క్రాజ్ గారి కడకుఁ గొంపోయిరి. ఆయన సర్కారువారి వకీలు. మే మొకరి మొగము లొకరము చూచికొందుము గదా సహాధ్యాయులము. ఒక్క 'ఇన్'కు సంబంధించిన బారిస్టర్లము. తొమ్మిది దాఁటుచో నాకు చీటి కావలయు ననుట కాతఁడు నొచ్చుకొనెను. నా వేదనలో కొంత పంచుకొనెను. నాకొక చీటి ఇచ్చుటకు బదులు ఒక చేయుత్తరము వ్రాసి యిచ్చెను. దానితో నా యిష్టవేళ సంచరింపవచ్చును. పోలీసు

లద్దు పెట్టరాదు. ఈ యుత్తరమును ఎప్పుడును నాకడ నుంచుకొనుచుం టిని. కాని ఎన్నఁడును దాని యక్కఱ కలుగలేదు. అటులు కలుగ కుండుట కేవలము దైవఘటన.

డాక్టరు క్రౌజు తనయింటికి నన్ను నిమంత్రించెను. మేము మిత్రుల మయితిమి. నేను తఱుచు వారియింటికిఁబోవుచుంటిని. వీరివల ననే నాకు ప్రఖ్యాతుఁడగు వీరి సోదరుని పరిచయము కలిగెను. అతఁడు జోహాన్సుబర్గునందు పబ్లిక్ ప్రాసిక్యూటరు. బోయరుయుద్ధమున ఒక ఉద్యోగిని ఖూనీచేయుటకు కుట్రపన్నెనని అతనికి ఏడేండ్లు శిక్షవేసిరి. అతని సనదును గూడ రద్దుచేసిరి. యుద్ధము ముగిసినపిదప నాతఁడు విడుదల పొందెను. మరల సమ్మానసహితముగా కోర్టున చేర్చికొనఁ బడెను. మరల నతఁడు ప్లీడరుపని చేయ మొదలిడెను.

ఈపరిచయములు పిదప నాకు ప్రజాసేవకు ఉపయోగపడెను. ఇంకను నాకష్టమును తగ్గించెను.

కాలిబాటలో నడచుటకు సంబంధించిన శాసనఫలము నా యెడ విపరీతముగా పరిణమించెను. నే నెప్పుడును ప్రెసిడెంటువీథినుండి ఆవల నున్న మైదానమునకు షికారు పోవుచుండువాఁడను. ఈవీథియందే ప్రెసిడెంటు క్రూగరుగారి గృహము కలదు. అది ఆడంబరముగ నుండదు. దీనిచుట్టు తోఁటయు దొడ్డియు లేదు. సామాన్యగృహములకంటె దీని కాధిక్యము లేదు. ప్రిటోరియాలోని కోటీశ్వరుల యిండ్లు దివ్యభవన ములు. వానిముందు నందన వనములు. కాని ప్రెసిడెంటుగారి స్వభా వము నిరాడంబరము. ఆ యింటిముందు పోలీసు పారా యిచ్చుటచేతనే అదియొక రాజ్యాధికారిగృహమని తెలియనగును. నే నెప్పుడును ఈ పోలీసు ప్రక్కనుండియే పోవుచుంటిని. కాని అతఁ డేనాఁడును నన్నే మియు అనలేదు.

ఇచట పారావాండ్రు వంతులచొప్పున మాఱుచుందురు. ఒకనాఁ డొకపోలీసు ఏమియు సూచింపకయే, కాలిబాట విడువమనియైన చెప్పకయే నన్ను తన్ని తగిలెను. నేను డిల్లవడితిని. నీ వేల యిటులు చేసితివని నేనడుగకముందే ఆ దారిని గుఱ్ఱముపై పోవుచున్న కోట్సుగారు 'గాంధీ, నే నంతయు చూచితిని. నీవు వీనిపై కేసు పెట్టుచో నేను తప్పకసాక్ష్య మీయఁగలను. ఇతఁడు ని న్నిటులు మిగిలినందులకు వగచుచున్నాను' అనెను.

నే నిటు లంటిని—'ఇందు చింత్యము లేదు. పాప మతని కేమెఱుక? అతనికి నల్లవారందఱు ఒకటే. అతఁడు నన్నిటులు పరామరిసించెనో నీగ్రోలను గూడ అటులే పరామరిసించుచుండుననుట తథ్యము. నావఱకు నాకు ఎట్టి అపాయము కలిగినను కోర్టునకు పోవలదని నియమము పెట్టుకొంటిని. కావున నే నితనిపై కేసు పెట్టను.'

కోట్సుగారు ఇటు లనిరి—'నీమామూలు పద్ధతి నీదే. మఱి విచారించి చూచికొనుము; ఇట్టివారికి మన మొకసారి శాస్తి జరుపవలయును.'

కోట్సుగారు ఇటులు పలికి ఆ పోలీసును కోపపడిరి. పోలీసు డచ్చివాఁడు. వారిద్దఱును డచ్చిభాషలో మాటలాడిరి. నా కేమియు తెలియలేదు. చిట్టచివర కా పోలీసు నన్ను క్షమాపణ కోరెను. కాని అతఁ డటులు కోరనక్కఱలేదు. నే నతనిని అదివఱకే క్షమించితిని.

ఇటుపిమ్మట నే నావీథికి పోలేదు. తక్కిన పోలీసువారి కీ విషయ మెటులు తెలియును? ఎఱిఁగి యెఱిఁగి నే నీదెబ్బ లెందులకు తినవలయును? కావున ఇతరవీథులనుండి షికారు పోవుచుంటిని.

ఈ విషయమున భారతీయులనుగూర్చి లోఁతుగ విచారింపసాగితిని. ఈశాసనము గూర్చి బ్రిటిష్ ఏజెంటుతో మాటలాడి, చేయవలసి

వచ్చుచో మాదిరి కొకకేసు చేసి చూతమని భారతీయులతో ఆలోచించితిని. ఈరీతిగా భారతీయుల కష్టములు చదివి, విని, అంతటితో తృప్తిచనక అనుభవము సైతము పొందితిని. ఆత్మగౌరవము నిలువఁబెట్టు కొనఁదలఁచు భారతీయులకు దక్షిణ-ఆఫ్రికా అనుకూలమైనది కాదని గమనించితిని. ఈస్థితిమార్చుట యెట్లు? ఈ విచారముతో నా మనస్సు నానాఁటికి వెక్కసమాయెను.

కాని ప్రకృతము దాదా అబ్దుల్లాగారి దావా చూచుటయే నా ముఖ్యధర్మము.

# ౧౪

## దావా సిద్ధపడుచుట

ప్రిటోరియాలో నేనొక యేఁడుంటిని. అది నాజీవితమున అమూల్యము. నాకు ప్రజాసేవ చేయు నవృత్తము కలుగుటయు, అందు కొంత శక్తి కలుగుటయు ఇచటనే. నాకు మతభావన తీవ్రత దాల్చుటయు, నాకు ప్లీడరుపనిలో సరియగు జ్ఞానము కలుగుటయు ఇచటనే. క్రొత్తబారిస్టరులు ప్రాఁత బారిస్టరులకడనుండి ఏమి నేర్తురో దానివి నేర్చినది నేనిచటనే. నేను ప్లీడరుపనికి కొంచెమేనియు పనికి రాకపోనని తెలిసికొనిన దిచటనే. ప్లీడరుపనికి తాళపుచెవి దొరకినది ఇచటనే.

దాదా అబ్దుల్లాగారి దావా చిన్నదికాదు. నలుబదివేల పౌనులకు, అనఁగా ఆఱులక్షల రూపాయలకు ఈ దావా. ఇది వ్యాపార రీత్యా సంభవించిన దగుటచే ఇందు లెక్కల చిక్కులు తలవెంట్రుక లన్ని. ఇందు కొంత ప్రామిసరీనోటులకును, కొంత నోట్లు వ్రాసియిత్తుమను నోటిమాటలకును సంబంధము కలదు. ఈ దావా కిదియ ఆధారము. ఈ నోటులు మోసముచేసి వ్రాయించుకొనఁబడినవనియు, వానికి తగిన ఆధారములు లేవనియు ప్రతివాదుల పూర్వపక్షము. ఇందు సత్యముగా జరిగిన సంగతులకును, లాకును, సంబంధించిన విషయములు పెక్కులు. ఖాతాలన్నియు చిక్కులపుట్టలు.

వాది ప్రతివాదులు సమర్థులైన సొలిసిటరులను, బారిస్టరులను ఏటి తెచ్చుకొనిరి. వారికడ పని తెలిసికొనుటకు నాకు చక్కని వీలు

దొరికెను. వాదివాద మంతయు సిద్ధముచేసి సొలిసిటరు పరిశీలనమునకు ఇచ్చుటయు, దావా కనుకూల మయిన యథార్థవిషయములను వెదకుటయు నా పని. నేను తయారుచేసిపెట్టిన వానిలో సొలిసిటరు ఎంత తీసికొనెనో ఎంత త్రోసివేసెనో, అటు లాసొలిసిటరు తయారుచేసిన విషయమున పెద్ద బారిష్టరు ఎంత తీసికొనెనో, ఈ విషయమంతయు చూచుటే నా కొకపాఠముగా నుండెను. ఇటులు దావాకు తయారు చేయుటవలన నాకు గ్రహణశక్తియు,వ్యవస్థాశక్తియుకలిగెనని తెలిసెను.

ఈ దావాలో నాకు అభిరుచి పుట్టెను. నే నందు తన్మయుఁడ నైతిని. పత్రములకు సంబంధించిన కాకితము లన్నియు చదివితిని. నా క్లయింటు చాల తెలివిగలవాఁడు. నాపై నాతనికిఁ గల విశ్వాస మునకు మేరలేదు. కావున నా పని కడు సులువాయెను. నేను బుక్ కీపింగునందు అనఁగా ఖాతా లెక్కలయందు సూక్ష్మాంశములఁగూడ చక్కఁగా నేర్చితిని. అందు గుజరాతీ పత్రము లెక్కువ. వీనికి నేనే అనువాదకుఁడను. దీనివలన అనువాదమునందును నాకు శక్తి ఇనుమడించెను.

పైని చెప్పినటులు నే నీదావాపనిలో మునిఁగి తేలుచుంటిని. మతచర్చ యందును, ధర్మకార్యములందును నా మనస్సు బాగుగా లగ్న మయినను, కొంతకాలము వీనికి వినియోగించుచున్నను, అవి అపుడు నాకు అంత ముఖ్యములు కావు. దావా చూచుటయే నాకు ముఖ్యము. అక్కఱ కలిగినపు డెల్ల లా చదువుటయు, లా కేసులు పరికించుటయు నా పని. వాది ప్రతివాదుల కాకితములు నా కడ నుండుటవలన వారికి గూడ ఇంచుమించుగా తెలియని విషయములు కొన్ని నాకు తెలిసె ననుట యీ వ్యాసంగఫలమే.

## ౧౪ దావా సిద్ధపఱచుట

పిన్‌కట్టుగారు చెప్పిన ఒకమాట నాకు అపుడు గుర్తు తగిలెను. దక్షిణాఫ్రికాలో గొప్ప బారిస్టరును, స్వర్గీయుఁడును, అగు లియోనార్డు అను నాయన దీనిని సమర్థించెను. 'యథార్థవిషయము లే ముప్పాతిక లా'—ఇది పిన్కట్టుగారిమాట. అపుడు నాయొద్దనున్న ఒకానొక కేసునందు న్యాయముమాపక్షమైయుండఁగా 'లా' వ్యతిరేకముగనుండెను. ఆశలుడిగి నేను లియోనార్డుగారి సాయము కోరితిని. వారికిఁగూడ దావాలో విషయములన్నియు ననుకూలములనితోఁచెను. కాని అతఁడు—'గాంధీ, నా కొకటి తోఁచుచున్నది. కేసులోనున్న యథార్థ విషయములయెడ మనము జాగరూకులమై యున్నచో పిదప న్యాయము తనంతఁదా సమకూరును. ఈకేసులోనున్న విషయముల నన్నింటిని లోఁతుగా చూడవలయును. ఈకేసునంతయు చక్కఁగా చూచి మరల నాకడకు రమ్మ'నెను. మరల నే నా యంశముల మననముచేయఁగా అది అపూర్వముగా కానిపించెను. అటువంటిదే మఱియొక దక్షిణాఫ్రికా కేసుగూడ మనసునకు తట్టెను. నే నందులకు సంతసించి ఆ విషయమును లియోనార్డుగారికి తెలియఁజేసితిని. ఆయన యిటు లనెను: 'మన మిప్పుడీకేసు గెలువఁ గలము. బెంచిమీఁది కే జడ్జి వచ్చునో చూడవలయును.'

దాదా అబ్దుల్లాగారి కేసులో పనిచేయుచున్నపుడు యథార్థవస్తువుల మహిమ యింత యని తెలియదు. యథార్థవస్తు వనఁగా సత్యము. సత్యము మన మెపుడు కైకొందుమో అపుడు న్యాయము తనంత నదియే మన కనుకూలించును.

మా వాది దావాలో యథార్థవిషయములు బలవత్తరములు కావున 'లా' మావాదిపక్షము అయి తీఱవలయునని తెలిసెను.

అంతియకాక, యీ కేసును ఇటులే జరుగ నిచ్చినచో చుట్టము లును, ఒక పట్టణముననే నివసించువారును అగు ఈ వాది ప్రతి వాదులు నాశన మయిపోవుదురనియు తెలిసెను. దావా తుద కెవరిపక్ష మగునో ఎవరికిని తెలియదు. కోర్టులలో దీని విడిచి యూరకుండుచో ఇటు లనంతముగా పోవుచునేయుండును. దాన ఇరువాగులవారికిని లాభము లేదు. కావున, వీలగుచో, వడిగా తేల్చుకొనుటకువా రుంకించిరి.

నేను త్రైయబ్ సేటును అనురోధించి రాజీచేసికొమ్మని చెప్పితిని. అందులకు మీ వకీలుతో సంప్రతింపుం డంటిని. వాదిప్రతివాదు లిరువురు విశ్వాసపాత్రుడగు ఒక మధ్యవర్తి చెప్పినటులు వినుకొనినచో కేసు సులువుగా తేలిపోవునని సూచించితిని. వీరు ఎంతగొప్పవర్తకులయినను వీరి ధనమంతయు శోషించిపోవునంత వడిగా వకీళ్ల ఫీజు పెరుగఁ జొచ్చెను. ఈకేసు చూచుచో ఇంకొక పని చూచుకొనుటకు అవకాశము లేదు. కావున వారికి దీనితోనే సరిపోవుచుండెను. ఈ నడుమ కాలమున ఒకొళ్ల కొకళ్లకు లోలోపల దౌర్మనస్యము పెరుఁగుచుండెను. నాకు వకీలుపని యన్నచో చీ యనిపించెను. ఒకరి నొకరోడించుటకు లాయరులు 'లా' వెదకుట సాజము. పెట్టిన ఖర్చులన్నియు గెలిచినవానికి రావనువిషయము తెలియుట నా కదియ ప్రప్రథమము. ఒకరు మఱియొకరికి ఖర్చు లిచ్చుటకు 'కోర్టుఫీజ్ రిగ్యులేషన్' ప్రకారము ఒకపద్ధతి యున్నది. కాని లాయర్ల కిచ్చు డబ్బు దానికంటె ఎంతయో యెక్కువ. దీనిని నేను సహింపలేకపోతిని. ఈ యిరువురికి రాజీ కుదిర్చి స్నేహము కలిగించుట నాకు విధి అని తలఁచితిని. ఈసంధి కుదుర్చుటలో నాప్రాణములు తోడుకొనిపోయెను. తుదకు త్రైయబ్ సేటుగా రంగీకరించిరి. మధ్యవర్తి యొకఁడు నియమింపఁ బడెను. దావా అతనిముందు నడచెను. దాదా అబ్దుల్లాగారు గెలిచిరి.

## ౧౪ దావా సిద్ధపఱచుట

అయినను నాకు సంతృప్తి కలుగలేదు. మధ్యవర్తి ఫైసలాప్రకారము దాదా అబ్దుల్లాగారు వెంటనే అమలు జరిపినచో తైయబ్ హాజీఖాన్ మహమ్మదుగారు అన్ని రూపాయలు ఒక్కసారే తెచ్చి సమర్పింపలేరు. దక్షిణ ఆఫ్రికాలో నివసించుచున్న పోరుబందర్ వర్తకులలో వ్రాయని శాసన మొకటి కలదు. దివాలాకంటె చావు మేలు. తైయబ్ సేటు గారు ఒక్క పెట్టున ముప్పదియేడు వేల పౌనులును, ఖర్చులును ఈయలేరు. ఆయన పైసలతో బాకీ తీర్పదలంచెను. కాని దివాలా తీసెనను అపదూఱు వినరాదు. ఈ దశలో ఒకటే దారి. సొమ్ము వాయిదాల మీఁద పుచ్చుకొనుటకు దాదా అబ్దుల్లాగా రంగీకరింపవలయును. అయనయు ఆసమయమున ఉండఁదగిన ఉదారతతో ఆ సొమ్మును దీర్ఘ వాయిదాల మీఁద పుచ్చుకొనుటకు కావలసినంత అవకాశ మిచ్చిరి. ఈ యుభయులను రాజీపఱచుటలో పడిన కష్టము కంటె ఈవాయిదాలకొప్పించుటకు పడినకష్ట మెక్కువ అనిపించెను. దీని కిరువురును సంతసించిరి. ఇరువురికి ప్రతిష్ఠ వచ్చెను. నాయానందమునకు మేరయే లేదు. వకీలుపని యననేమో, దాని సత్యస్వరూపమననేమో నా కపుడు తెలిసెను. నేను మనుజుల గుణమును—మనుజులలోని సత్ పక్షమును కనిపట్ట నేర్చికొంటిని. మనుజులహృదయాంతరాళము లోనికి చొరఁబాఱ నెఱిఁగితిని. వేఱుపడిన వాది ప్రతివాదుల కలుపుటయే వకీలునకు పరమధర్మమని యెఱిఁగితిని. ఈ సత్యము మాయక నాలో నెల్లపుడును ఉనికి యేర్పఱచికొనుటచే నేను ప్లీడరీ చేసిన ఇరువదియేండ్లలో చాలవఱకు వందలతరబడి కేసులు కోర్టుకెక్కకుండఁగనే పరిష్కరింపఁ గలిగితిని. దాన నా కేమియు నష్టి కలుగ లేదు; ధనమును, గోల్పోవలేదు; ఆత్మనా, దానికన్న లేదు.

# ౧౫

## మ థ న

క్రైస్తవమిత్రులవలన నాకుఁ గలిగిన అనుభవములకేసి మరలుట కిది యదను.

బేకరుగారు నా భవిష్యత్తునుగురించి ఆతురపడుచుండిరి. అతఁడు నన్ను వెల్లింగ్టన పట్టణమున జరిగిన సభకు తీసికొని వెళ్లెను. ప్రొటెస్టెంటు తెగవారు ధర్మప్రబోధమునకు, అనఁగా ఆత్మపరిశుద్ధికి కొన్నికొన్ని యేండ్లలో అట్టి సమ్మేళనములను ఏర్పాటుచేయుచుండిరి. ఇవి ధర్మముయొక్క పునః ప్రతిష్ఠకు, లేక ధర్మముయొక్క పునరుద్ధారణకు ఉద్దిష్ట మయినవి. వెల్లింగ్టనులో జరిగిన సమ్మేళనమిట్టిది. దానికి అధ్యక్షుఁడు రివరెండు ఆండ్రూ ముర్రే. ఆయన ఆపట్టణమున ప్రధాన మతాచార్యుఁడు; ప్రఖ్యాతుడు. ఈసమ్మేళనమున కలుగు మతప్రబోధమును, అచటికి వచ్చినవారి మతోత్సాహమును, దాని పవిత్రతయును చూచినచో, నేను ఏసు మతమున కలియక మానననని బేకరుగారి తలఁపు.

కాని బేకరుగారికి ప్రార్థనాబలమే చరమబలము. ప్రార్థనపై ఆయనకు అతివిశ్వాసము. అంతఃకరణపూర్వకముగా చేయఁబడిన ప్రార్థనను తప్పక ఈశ్వరుఁడు వినునని ఆయన నమ్మకము. ఐహికములుఁ గూడ ప్రార్థనచే సిద్ధించి తీరునని నమ్మిన బ్రిస్టల్ నివాసియగు జార్జి ముల్లరువంటివారిని పలువుర నతఁడు ప్రమాణముగా ఉదాహరించును. ప్రార్థనామహిమను నేను తటస్థభావముతో వింటిని. అంతరాత్మ చెప్పినచో జగతిలోనుండు నేశక్తియు ఏసుమతమున కలియకుండ

న న్నాఁపలేదని బేకరుగారితో చెప్పితిని. ఇటులు వాగ్దానము చేయుటకు నేనెంత మాత్రమును సంశయింపలేదు. ఏలయన, అప్పటికప్పుడే నా యంతరాత్మ చెప్పినరీతి నడుచుట నా కలవాటైనది. అంతరాత్మ చెప్పినరీతి నడుచుట నా కానందము. విపరీతాచరణము కష్టజనకము; దుఃఖప్రదమును.

పిదప మేము వెల్లింగ్టన్ పట్టనమునకు పోతిమి. నా వంటి నల్లవానిని బాసటగ నుంచుకొనుటవలన బేకరుగారు చాల కష్టముల పాలైరి. కేవలము నా వలననే దారిలో ఆయన కన్నియో ఇబ్బందులు కలిగెను. నడుమ ఆదివారము తగులుటచే మా పయనము ఆఁగవలసి వచ్చెను. బేకరుగారును, వారి ముఠాయు ఆదివారముల పయనింపరు. మే మాఁగిన స్టేషనులోని హోటలుయజమాని చాల వాద ప్రతివాదములు జరిగిన పిదప నాకు అన్నమిడుట కంగీకరించెను. కాని అన్నశాలలో నాకు అన్నమిడ నించుకయు నియ్యకొనలేదు. బేకరుగారో, సామాన్యముగా లోఁబడువాఁడుకాఁడు. హోటలుకు వచ్చు అతిథులహక్కు-లఁగూర్చి ఆయనను నిలువఁదీయఁ దొడఁగెను. బేకరుగారికిఁ గల కష్టము నే నెఱుఁగుదును. వెల్లింగ్టన్ పట్టణమునఁగూడ నేను బేకరుగారితోడనే ఉంటిని. నా వలన తాను పడుచున్న కడగండ్లను నాకుఁ దెలియకుండఁ జేయుటకై ఆయన పలుపాట్లు పడుచుండెను. కాని నా కవన్నియు తెలియుచునే యుండెను.

ఈ సభయందలి క్రైస్తవు లందఱును చాల శ్రద్ధాళువులు. వారి భక్తి నా కానందము కలిగించెను. నేను రివరెండు ముర్రేగారి దర్శనము చేసితిని. అచట చాలమంది నాకుఁగాను భగవంతుని ప్రార్థించుచుండుట చూచితిని. వారి భజనకీర్తనలు కొన్ని అతిమధురములు.

వెలింగ్‌టన్ సభ ముగ్గిన్నాళ్లు. అచటికి వచ్చినవారి విశ్వాసము నాకు బాగుగా నుండెను. కాని కేవలమాత్రమున నా మతమును, నా విశ్వాసమును ఏల పరిత్యజింపవలెను? స్వర్గముగాని, ముక్తిగాని ఏసు మతమునం గలియనిచో రాదని నమ్ముట నాకు కాని పని. క్రైస్తవ మిత్రులతో నే నిట్టులు తెలుపంగా వారి మనస్సు లెగిరిపోయెను. కాని నే నేమి చేయంగలను?

నా కష్టము లింకను గహనము లాయెను. జీసను పరమేశ్వరుని ఏకపుత్రుం డనుటయు, వారిని నమ్మినవారికే అమృతత్వము కలుగునను టయు నానమ్మికను దాంటిన మాటలు. పరమేశ్వరునకు పుత్రులే ఉం డునెడల మనమందఱమును ఆయన పుత్రులమే. జీసను భగవత్ సముండు గాని, లేక సాక్షాత్తు భగవంతుండు గాని యగుచో, మానవులందఱును భగవత్సములు, లేక భగవంతులు. జీసను తన మృతిచేతనే, మఱియు తన రక్తముచేతనే జగత్తునందలి పాపముల కడిగివైచు నను వాక్య వాచ్యార్థము నమ్ముటకు నాబుద్ధి యెట్టులును సిద్ధము కాలేదు. వ్యంగ్యార్థము కొంత సత్యము కావచ్చును. క్రైస్తవ మతానుసారము 'మనుష్యునకే ఆత్మకలదు. జంతువులు మొదలగు ఇతరములకు ఆత్మ లేదు. వానికి చావుతో సరి.' ఇది నాకు విపరీతమతము.

జీసను త్యాగి, మహాత్ముండు, మహాగురువు అని అంగీకరింతును. కాని అతం డొక అద్వితీయ పురుషుండు కాండు. సిలువపై నతనిమృతి జగత్తునకు ఒక మహాదృష్టాంతము. కాని, ఇతని మృతియందు రహస్యమును, చమత్కారమును అగు ఒకానొక ప్రభావ మున్నదని నాహృదయము సమ్మతింప జాలకుండెను. ఇతరు లీయంజాలని ఏ మహాప్రసాదమును క్రైస్తవుల పవిత్రజీవితములు నా కీయలేదు. ఇతర ధర్మము

లందును క్రైస్తవ సంస్కారమును చూచితిని. సిద్ధాంతదృష్టిలో ఏసు సిద్ధాంతములందు అలౌకికత నాకు కానరాలేదు. త్యాగమునందును హిందువులు క్రైస్తవుల నెన్నిరెట్లో మించిపోదురని తోఁచెను. క్రైస్తవమతము సంపూర్ణ మనిగాని, ప్రపంచమునందలి మతము లన్నిటిలో శ్రేష్ఠమనిగాని నమ్మట నా కసంభవ మాయెను.

సమయము దొరకినపుడెల్ల క్రైస్తవ మిత్రులకు నా యీమథనను చెప్పుకొనుచుంటిని. కాని వారి ప్రత్యుత్తరములు నాకు సంతోషజనకములు కాలేదు.

ఈవిధముగా క్రైస్తవమతము సంపూర్ణ మనియు, అన్నిటికంటె శ్రేష్ఠ మనియు నే నొప్పుకొనఁ జాలకున్నను హిందూమతమైనను అట్టిదని నిశ్చయింపఁ జాలకపోతిని. హిందూ మతమునందలి దోషములు నా కన్నుల వ్రేలుచుండెను. అస్పృశ్యత హిందూమతమున కొకయంగ మనినచో అదియొక జీర్ణాంగమైనఁ గావలయు, లేదా అధునాతనమగు దురాచారమైనఁ గావలయు. ఇన్నివర్ణములు, ఇన్ని శాఖలు, ఇవి యేమో నాకర్థముకాలేదు. వేదములు అపౌరుషేయములనుట కర్థమేమి? అవి అపౌరుషేయములయినబైబిలును, కొరానును అపౌరుషేయములుకావా?

క్రైస్తవ మిత్రులు నన్ను ఏసుమతమునఁ గలుపుటకు ప్రయత్నించినట్లే మహమ్మదీయులును తమ మతమునఁ గలుపఁ బ్రయత్నించిరి. అబ్దుల్లా సేటుగారు మాటిమాటికి నన్నిస్లాము మత గ్రంథములను జదువ నొక్కి చెప్పుచుండిరి. ఆయన యెల్లపుడును దాని సొగసును గూర్చి చెప్పుచుండుట మామూలు.

కవి రాయచందు భాయిగారికి నాకలవర మంతయు ఒక ఉత్తరములో వ్రాసితిని. భారతదేశములోని ఇతర విద్వాంసులకుఁగూడ

ఉత్తరములు వ్రాసితిని. ప్రత్యుత్తరములు అందుకొంటిని. రాయచందుభాయిగారి ఉత్తరమువలన నాకు కొంత సంతృప్తి కలిగెను. 'ఓర్పుతో హిందూమతమును ఇంకను లోఁతుగా ఆరయు'మని అతఁడు వ్రాసెను. మఱియు, 'పక్షపాతము విడుచుచో హిందూమత సిద్ధాంతముల సూక్ష్మతయు, అగాధతయు, ఆత్మవివేకమును, దయయు, ధర్మనిర్ణయమును ఇతరమతములలో కానరా'వని వ్రాసెను.

సేలుగారి కొరాను అనువాదమును కొని చదువఁ దొడఁగితిని. మఱి కొన్ని ఇస్లాముగ్రంథములఁగూడ సంపాదించితిని. ఇంగ్లాండులోని క్రైస్తవమిత్రులకు ఉత్తరములు వ్రాయ మొదలిడితిని. ఆమిత్రులలో ఒకరు నాకు ఎడ్వర్డు మెయిట్లండుగారితో పరిచయము కలిగించిరి. అతనితో ఉత్తరప్రత్యుత్తరము లారంభమాయెను. అన్నా కింగ్స్ఫోర్డు గారును, తానును కలిసి రచించిన 'ది పర్ఫెక్ట్ వే' అను గ్రంథమాయన నా కంపెను. ఇపుడు ప్రచారమునందున్న క్రైస్తవమతము యొక్క ఖండన మాగ్రంథమునఁ గలదు. మెయిట్లండుగారు 'ది న్యూ ఇంటర్ప్రెటేషన్ ఆఫ్ బైబిల్' అను మఱియొక గ్రంథముగూడఁ బంపిరి. ఈ గ్రంథములు హిందూమతము ననుసరించునట్లు ఉండెను. టాల్స్టాయిగారి 'ది కింగ్ డమ్ ఆఫ్ గాడ్ ఈజ్ విదిన్ యు' అను గ్రంథము నన్ను ముగ్ధునిఁజేసెను. ఆగ్రంథము నా మానసమున అంకితమైపోయెను. అందలి స్వతంత్రవిచారశైలిని, ప్రౌఢనీతిని, శుద్ధసత్యమును బట్టి చూడఁగా, ఆ గ్రంథముముందు కోట్స్గా రొసఁగిన గ్రంథము లన్నియు శుష్క దండుగ.

ఆ చదువువలన నేను క్రైస్తవమిత్రు లెన్నఁడును తలఁపని దారిఁ బడితిని. మెయిట్లండుగారితో ఉత్తరప్రత్యుత్తరములు చాల కాలమువఱకు నడచుచునేయుండెను. పరలోకగతు లగునంతవఱకు

రాయచందుభాయిగారికిని, నాకును ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచునేయుండెను. వారు పంపిన గ్రంథములఁ బఠించితిని. ఆ గ్రంథములు 'పంచీకరణము' 'మణిరత్నమాల' 'యోగవాసిష్ఠ' 'ముముక్షుప్రకరణము' హరిభద్రసూరి కృత షడ్దర్శనసముచ్చయము — మొదలగునవి.

నేను నా క్రైస్తవ మిత్రులు తలఁపని దారిఁ బడినను, వీరి సమాగమము వలన నాకుఁ గలిగిన ధర్మజిజ్ఞాసకు వీరికి చాల బాకీపడియున్నాను. వీరి పరిచయము నా కెల్లప్పుడును గుర్తుండఁగలదు. మధురము, పవిత్రమును అగు ఇట్టి నెయ్యములు క్రమక్రమముగా వృద్ధియగుచు వచ్చెనేకాని యిసుమంతయు తగ్గలేదు.

## ౧౯

## ఱేపటిమాట యెవరి కెఱుక?

అబ్దుల్లా సేటుగారి కేసు ముగిసెను. నాకిఁక ప్రిటోరియాలో ఏమిపని? దర్బానుకు వెళ్లి యింటికి తిరిగివచ్చుటకు సన్నాహము చేసితిని. కాని అబ్దుల్లాసేటుగారు వీడుకోలు విందుచేయక నన్ను విడిచిపెట్టునా? నన్నుగౌరవింప సిడెన్‌హాములో ఒకవిందు నేర్పఱచెను.

నాఁడంతయు విందుతో కాలక్షేపము చేయఁ దలఁపఁబడెను. నా కడ కొన్ని వార్తాపత్రికలు ఉండఁగా వానిని దిరగవేయుచు కూర్చుంటిని. ఒకపత్రికలో ఒకకోణమున 'ఇండియన్ ఫ్రాంచైజ్' అను శీర్షికతో కొన్ని వాక్యములు నా కంటఁబడెను. నేటాల్ శాసనసభలో సభ్యుల నెన్నుకొనుటకు భారతీయులకు హక్కులేకుండ జేయ నొకబిల్లు చర్చింపఁబడుచుండెను. ఈ కొలఁది వ్యాస మా చర్చను గుఱించి. నాకా చట్టమావంతయు తెలియదు. విందునకు వచ్చిన అతిథి బృందమునకును దెలియదు.

దానినిగూర్చి అబ్దుల్లాసేటుగారితో ప్రస్తావించితిని. ఆయన ఇటులనియెను: "ఈ వ్యవహారములు మాకేమి తెలియును? వ్యాపారసంబంధమైనచో మాకు తెలియును. ఆరెంజి ఫ్రీస్టేటులో మా వ్యాపారమంతయు ఏటఁగలిసెనని మీరెఱిఁగినదే. అందులకు మేము కొంత కలవరముకలిగించితిమి, కాని ఏమిఫలము? చదువురాదుకాన మే మసమర్థులము. బజారుధరలు తెలిసికొనుటకు పత్రికలు చదివెదము. చట్టముల గొడవ మాకేమి తెలియును? ఆ తెల్లవకీళ్లే మా చెవులును కన్నులును."

## ౧౬. రేపటిమాట యెవరి కెఱుక?

'అయితే ఇచ్చట పెరిఁగి విద్యావంతులయిన భారతీయులలో పిన్నవారనేకులున్నారు. వారు మీకు సాయముచేయరా?' అని అడిగితిని.

అబ్దుల్లా సేటుగారు నిరాశపడి—వారా? 'వారికి మేమనిన అలుసు; కాన నెటులు వత్తురు? నిక్కమునకు మాకును వారనిన అలుసే? క్రైస్తవులుకాన వారు పాదిరీల బానిసలు. ఆ తెల్లపాదిరీలో! సర్కారు బానిసలు.'

ఈ వాక్యములు నా కన్నులఁ దెఱచెను. ఈ శాఖ మనకు సంబంధించినది-అనఁగా వారును మనమును ఒకటి అని తెలుపుట ఆవశ్యకమని తలఁచితిని. ఏసుమతమున కర్థమిదియా? వారు మతాంతరితులైనంత మాత్రమున భారతీయులు కాక విదేశీయులైపోయిరా?

కాని, నేను మన దేశమునకు తిరిగి రా సిద్ధుఁడనైయుంటిని. కావున నా విచారముయొక్క మూర్తరూపమును వారికి చెప్పలేదు. కావున అబ్దుల్లా సేటుగారితో ఊరక యిటులంటిని: 'ఈ బిల్లు శాసనమగుచో మనవారి కష్టములకు అంతముండదు. ఇది భారతవాసులకు ప్రథమోచ్చాటనమంత్రము; మన ఆత్మగౌరవమునకు వేరుపురుగు.'

అబ్దుల్లా సేటుగారు వెంటనే జబాబుచెప్పెను: 'కావచ్చును; కాని ఫ్రాంచైజు మూల మెఱిఁగింతుము. మాకు దాని గుఱించి మొదట నేమియు తెలియదు. మీ రెఱుఁగుదురు గదా ఎస్కాంబిగారిని! అతఁడు మన పెద్దవకీలు. అతఁడు ధీరుఁడు. అతఁడే మొదట ఈ విషయము మా తల కెక్కించెను. అపుడేమిజరిగె ననుకొన్నారు? ఎస్కాంబీ చెడ్డయోధుఁడు కావచ్చును. ఆ సమయమున వార్ఫు ఇంజనీయరు నకును ఆతనికిని నడుమ పిట్ట ఆడుటలేదు. కావున ఆ యింజనీయరు తన వోటుల నన్నిఁటిని ఆఁచికొని ఎన్నికలలో ఎక్కడ ఓడించి

పోవునోయని ఎస్కాంబీగారు దిగులందిరి. అప్పుడాయన మా కావిషయముల నన్నింటిని జెప్పెను. ఆయన ప్రోత్సాహముచే మేమందఱము వోటరుల జాబితాలలో జేరితిమి. ఎన్నికలలో ఎస్కాంబీగారికి వోటు లిచ్చితిమి. అదియటుండె! ఫ్రాంచైజునకు మీ రిచ్చు ప్రాధాన్యము మాయెడల నిష్ఫలము. అదియు మీకు తెలియఁగలదు. కాని మీరుచెప్పునది మాకు తెలియుచున్నది. ఇక మీ సలహా?'

అతిథు లందఱును ఏకగ్రీవముగ నిటులనిరి.—'నిజము, నిజము. అబ్దుల్లాసేటూ! నీవు గాంధిజీని నిలుపవలయును.'

అబ్దుల్లాసేటుగారు దీర్ఘదర్శి. అతఁడిటులనెను: 'ఆయనను నే నిప్పటికి నిలుపక పోవచ్చును. అయినను ఈ విషయమున నాకెంత స్వాతంత్ర్యమున్నదో మీకును అంత కలదు. మీరు నుడివిన మాట నిక్కము. మనమందఱమును వీరిని ఇచట నాఁగుఁడని బతిమాలుదము కాని ఆయన బారిస్టరని మీరు గుర్తుంచుకొనుఁడు. ఆయన ఫీజుమాట యేమి?'

ఫీజు అనినంతనే నా మనస్సు చివుక్కుమనెను. నేను వెంటనే ఇటులంటిని: 'సేటుగారూ! ఫీజుకును దీనికిని సంబంధము లేదు. ప్రజాసేవకు ఫీజా? అసలు నేనుండినచో ప్రజలసేవకుని వలెనే ఉందును. మఱియు వీరందఱితోడను నాకు లోఁగడపరిచయము లేదుగదా! వీరందఱును నాకు సాయముచేయఁగల రను నమ్మిక మీకున్నచో నేనిక్కడ మఱియొక మాసముందును. కాని ఒకమాట: మీరు నాకేమియు నీయనక్కఱలేదు కాని. మనము చేయఁదలచుకొనిన పనికి ముందు కొంత మూలధనము లేనిచో సాగదు. ఏలన: టెలిగ్రాములు పంపవలసియుండును. కొంతగ్రంథము అచ్చువేయింపవలసి యుండును. అచటికి ఇచ

టికి పయనములు చేయవలసి యుండును. ఆయా యీ వకీళ్లతో సంప్రతింపవలసియుండును. నాకు మీ 'లా' రాదు. కనుక కొన్ని లాపుస్తములు నాకు కావలసియుండును. ఇది యంతయు ధనము వినా సమకూరదు. ఈ పనియంతయు నెఱవేర్చుటకు ఒకఁడు చాలఁడనిచెప్పఁబని లేదు. పలువుర సాయము కావలయును.'

అందఱును ఏకగ్రీవముగా నిట్లనిరి: 'అల్లా అనుగ్రహమున ధనము తనంత నదియే నడచివచ్చును. జనము కావలసినంత మంది. మీరు మాత్రము 'ఆగుదును' అని యనుఁడు! అంతయు సరిపోవును.'

వీడుకోలుపు విందుకు వచ్చిన అతిథిబృందమే కార్యనిర్వాహక బృందమాయెను. తొందరగా విందు ముగించి యింటికిఁ బోఁదగునని నేనంటిని. నేను నా మనస్సులో ఇఁక ముందు చేయవలసిన పోరితమునకు రూపరేఖ గీచికొంటిని. వోటరు జాబితాలలోఁ జేరియున్న వారి పేరులను గుర్తిడుకొని మఱియొకమాసమచట నేయుండ నిశ్చయించుకొంటిని.

ఈ విధముగా భగవానుఁడు దక్షిణ-ఆఫ్రికాలో నా జీవితమునకు పునాదివైచి ఆత్మసమ్మాన సంగ్రామమునకు బీజావాపము చేసెను.

బస పెట్టితిని

౧౮౭౩ సంవత్సరమున జీహా మహమ్మదుగారును, హాజీ దాదా సేటు గారును నేటాలు రాష్ట్రమున నివసించు భారతీయులలో ప్రముఖులుగను, వారికి నాయకులుగను ఎన్నబడుచుండిరి. సంపదలో హాజీ ఆదాం సేటుగారు అధికులు. అయినను ఆయనయు, తదితరులును అందఱు కుపయోగించు కార్యములు చేయుటలో హాజీ మహమ్మదు సేటుగారికే ప్రథమస్థాన మిచ్చుచుండిరి. కావున వారియాధిపత్యమున ఒకసభ దాదాఅబ్దుల్లా సేటుగారి యింట జరుపఁబడెను. ఆ సభలో ఫ్రాంచైజా బిల్లును ప్రతిఘటింప తీర్మానము చేయఁబడెను.

స్వచ్ఛందసేవకులు ఏర్పాటుచేయబడిరి. నేటాలులో పుట్టి పెరిఁగిన భారతీయులు—అనఁగా భారతీయులగు క్రైస్తవులలో పిన్న వారు ఈసభకు ఆహ్వానింపఁ బడిరి. దర్బాను కోర్టులో దుబాసిగా నున్న పాలుగారును, మిషన్ హైస్కూలు హెడ్‌మాస్టరు సుభాన్ గాడ్‌ఫ్రేగారును సభ నలంకరించిరి. ఈసభకు భారతీయ క్రైస్తవు లెక్కువగా వచ్చుటకు వీరే కారణము. వీరందఱు స్వచ్ఛందసేవకులుగా చేరిరి.

ఆచుట్టుపట్టుల నున్న వర్తకులలో పలువురును స్వచ్ఛంద సేవకులయిరి. ఈయోగ్యుల పేళ్లు స్మరణీయములు. దావూద్ మహమ్మద్, మహమ్మద్ కాసాం, సం, కమర్ ఉద్దీన్, ఆదం జీ మియాన్ ఖాన్, ఏ. కొలంద వేలుపిళ్లె, సి. లచ్ఛి రాం, రంగస్వామి పడియాచి, ఆమోద జీవ, మొదలగువారు ముఖ్యులు. పార్సీరుస్తుంజీ ఉండనే యుం

డిరి.జోషీ,నరసీరామ్, మఱియు దాదా అబ్దుల్లాకం పెనీ మొదలగు కంపె నీల గుమాస్తాలును స్వయం సేవకు లయిరి. అందఱకు ఉపయోగించు కార్యములలో దిగుటకు వీరికి కొంత ఆశ్చర్య మాయెను. ఇందులకు ఆహ్వానింపఁ బడుటకును, సభలో పాలు గొనుటకును, తా మెల్లరు వచ్చు టకును వారి కిదియ ప్రథమానుభవము. ఈ మహావిపత్తులో పెద్దలు పిన్నలు, ధనికులు పేదలు, సేవ్యులు సేవకులు, హిందువులు, మహమ్మ దీయులు, పారసీకులు, క్రైస్తవులు, గుజరాతీలు, మదరాసీలు, సింధీ యులు ఈ మొదలగు భేదమును, తరతమ భావమును పోయెను. అందఱు భారత సంతానము; అందఱు సేవకులు. బిల్లు రెండవతూరి ప్యాసు అయెనో, మఱి కాఁబోవునో! ఇట్టి కఠినశాసనమునకు భారతీయులు విరోధము చూపింప కుండుటే వారికి వోట్ల హక్కు అక్కఱలే దనుటకు ప్రమాణ మని చర్చాసమయములలో నేటాలు అధికారులు ప్రసం గించు చుండిరి.

నేను సభలో ఆవిషయమును ముచ్చటించితిని. బిల్లు చర్చను ఆఁప వలసినదని అస్సెంబ్లీ ప్రెసిడెంటునకు తంతి నిచ్చితిమి. ప్రధాన మంత్రి సర్ జాన్ రాబిన్ సన్ గారికిని ఇట్టి తంతినే మఱియొకటి యిచ్చితిమి. మఱియొకటి దాదా అబ్దుల్లాగారి మిత్రుఁడు ఎస్కాంబీ గారి కిచ్చితిమి. అస్సెంబ్లీ ప్రెసిడెంటు బిల్లు చర్చ రెణ్ణాళ్ల వఱకు ఆఁపఁబడినదని వెంటనే జబా బిచ్చెను. ఇది మా కందఱకు ఆనంద మయ్యెను.

శాసనసభకు పంపవలసిన పిటిషనును తయారుచేసితిమి. దానికి మూఁడు నకళ్లు కావలసి వచ్చెను. పత్రికలకు పంప మఱొక ప్రతి కావలసి వచ్చెను. వీలయినన్ని చేవ్రాలు చేయింపవలయునని సంకల్పిం పఁబడెను. ఇది యంతయు ఒకరాత్రిలో జరుగవలెను. ఇంగ్లీషు తెలి

సిన స్వయంసేవకులును, తదితరులును రాత్రి యంతయుఁ గూర్చుండి నకళ్లు వ్రాయుచుండిరి. వ్రాయసమున మంచి నేర్పరియగు ఆర్థర్ అను వృద్ధుఁ డొకఁడు మొదట పిటిషను వ్రాసెను. దీనిని ఒకరు చదువు చుండిరి. అయిదుగురు ఏకకాలమున ప్రతులు వ్రాసిరి. ఇటులు అయిదు ప్రతులు తయారాయెను. ఈ అర్జీమీఁద చేవ్రాలు చేయింప వర్తకపు స్వయంసేవకులు తమ సొంత బండ్లలోను, అద్దెబండ్లలోను ఎక్కి బయలు దేఱిరి. వడిగా ఈపని నెఱవేరెను. అర్జీ వెంటనే బటు వాడా చేయఁబడెను. పత్రికలలో స్వాభిప్రాయములతోఁ గూడ అది ప్రకటించుకొనఁ బడెను. శాసనసభలోఁ గూడ కలవరము కలి గెను. సభలో చర్చ జరిగెను. శాసనమునెడ పక్షపాతము తాల్చిన వారు అర్జీలోని ఖండనములకు జవాబులు చెప్పిరి. అవి కుంటి జవా బులు. ఏమి చెప్పిన నేమి? తుదకు బిల్లు ప్యాసు ఆయెను.

ఇటు లగునని మేము లోఁగడనే నిశ్చయించితిమి. కాని ఈ ఆందోళనము వలన భారతీయులలో నూతనప్రాణ ముద్భవించెను. అందఱు మొకటి యనియు, వర్తకపు హక్కులను సంపాదించుటకు ప్రయత్నించి నటులు రాజకీయములగు హక్కులకును ప్రయత్నించుట విధి యని అందఱకుఁ దోఁచెను.

ఆకాలమున రిప్పన్ గారు కాలనీలకు సెక్రటరీ. ఒక పెద్ద అర్జీ నాతనికి పంపుకొన నిశ్చయింపఁబడెను. ఇది ఇంతలంతల పని కాదు. ఒకదినములోపుగ నగునదియు కాదు. స్వచ్ఛందసేవకులు చేర్చుకొనఁ బడిరి. అందఱును తమ చేతనయిన సహాయమును చేసిరి.

అర్జీని తయారుచేయుట నాకు చాల పరిశ్రమ యయ్యెను. తద్విష యమైన కాకితములను, పుస్తకములను సంపూర్ణముగా చదివితిని. హిందూ

దేశములో మా కొకవిధమైన వోట్ల హక్కు కలదు కావున నేటాలులోఁ గూడ వోట్లహక్కు ఉండకమానదని నావాదము. ఈ వోట్ల హక్కు నుపయోగించుకొనఁ గలుగు భారతీయుల జనాభా చాల తక్కువ యగుటచే దాని నిచ్చుట మీకును వీలను విషయమును నావాదము నకు ముఖ్యబిందువుగాఁ జేసితిని.

పదియేను నాళ్ల లో పదివేల సంతకములు సమకూరెను. సంత కములు చేయించుట ఆ స్వయంసేవకులకు క్రొత్త విషయము. వారు రాత్రిమంతయు తిరిగి ఇన్ని సంతకములు చేయించుట సామాన్యకా ర్యము కాదు. 'అర్జీలోని విషయములు సంపూర్ణముగ తెలియని వారి సంతకములు తీసికొనరాదు.' అని మేము తీరుమానించి యుండుటచే అర్జీకి అర్థము విప్పి చెప్పఁగల స్వయం సేవకులను ఏర్పాటు చేయవలసి వచ్చెను. గ్రామములు దూర దూరముగా గిరవాటు వేయఁబడినటు లుండెను. ఎక్కువ పూనికతో పని చేయఁగల సమర్థు లున్నఁగాని ఈకార్యము నెట్టదు. అట్టివారు సమకూరిరి. వా రందఱు తమకు నియో గింపఁబడిన కార్యమును ఉత్సాహముతో నిర్వహించిరి. ఈ పంక్తులు వ్రాయుచుండఁగా దావూద్ మహమ్మద్ సేటు, రుస్తుంజీ, ఆదంజీ మియా ఖాన్, ఆమోద జీవ మొదలగువారు నాయెదుట మూర్తీభవించుచున్నారు. వీ రందఱికన్న ఎక్కువ సంతకములు చేయించుకొని వచ్చిరి. దావూద్ సేటు రోజంతయు సంతకములకొఱకు బండిలోనే ఉండెడువాఁడు. ఈసేవ యంతయు ఆదరపూర్వము. వీరిలో ఒక్కరును దారిబత్తెపు ఖర్చు లయినను అడిగి పుచ్చుకొన లేదు. దాదా అబ్దుల్లాగారి గృహము దీనికి కార్యస్థానమే కాక ధర్మ సత్ర మాయెను. నాకు తోడుపడిన మిత్రులయు, తదితరులయు భోజన మచటనే. మొత్తముమీఁద అందఱును వ్యయ ప్రయాసముల కోర్చిరి.

తుదకు అర్జీ దాఖలు చేయఁబడెను. వేయి ప్రతులు ముద్రించి పంచిపెట్టఁబడెను. భారతీయ దేశసేవకులకు ఈదరఖాస్తువలన నేటాలుతో ప్రథమ పరిచయము కలిగెను. నేనెఱిఁగిన పత్రికలకును, ప్రసిద్ధులగు పత్రికా విలేఖకులకును ప్రతులను బంపితిని.

టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక భారతీయుల కోరికలను అనుమతించుచు సంపాదకీయ వ్యాసము వ్రాసెను. ఇంగ్లాండులో అన్ని తెగల పత్రికలకును నకళ్లు పంపఁబడెను. లండన్ టైమ్సు పత్రిక గూడ మావాదమును సమర్థించుచు వ్రాసెను. బిల్లు ఇఁక మంజూరు కాదని మా కాశ పుట్టెను.

నా కపుడు నేటాలునుండి తరలుట అసంభవము. నా భారతీయ మిత్రు లందఱు చుట్టుముట్టి 'మీ రిచట ఖాయముగ ఉండుఁ' డని ప్రార్థించిరి. నాకుఁ గల కష్టములు చెప్పుకొంటిని. ఇతరుల వ్యయముతో నిఁక నుండరా దని నిశ్చయించు కొంటిని. ప్రత్యేకముగా ఒక యిల్లు కుదుర్చుకొనుట ఆవశ్యకమని నిశ్చయించు కొంటిని. మంచి చోట ఒక చక్కని యిల్లు తీసికొనఁ గోరితిని. బారిస్టరుల హోదాకు తగిన రీతిగా ఉన్నఁగాని నేను నాసంఘమునకు గౌరవము తేఁ జాలనని అనుకొంటిని. అట్టి ఉనికికి సాలుకు కనీసము మున్నూఱు పౌను లయినను లేక సాగనటులు కానిపించెను. అంత డబ్బు వచ్చు కేసు లిచ్చుటకు హామీ పడినయెడలనే అట నుండ నిశ్చయించుకొని నా నిశ్చయమును వారికిఁ దెలిపితిని.

'సార్వజనిక కార్యములకు మీరు చెప్పినంత పైకము మీ కిచ్చుట మా కియ్యకోలు. అంత సొమ్మును మేము సులభముగ వసూలు చేయఁగలము. మీ ప్రాక్టీసునకును, దీనికిని సంబంధము లే దనుకొనుఁడు.'

'అటులు కాదు, నాచేయు ప్రజాసేవకు మీకడ రొక్కము పుచ్చుకొనఁజాలను. ఇందు బారిస్టరు తెలివితేట లేమియు లేవు. మీచే పని చేయించుటయే పనియైనపుడు అందులకు నేను రొక్క మెటులు పుచ్చికొందును? సార్వజనిక కార్యములకు చాల చందాలు వసూలు చేయవలసియుండును. ధర్మనిధినుండి నేను జీతము పుచ్చుకొన సాగినచో ఎక్కువ చందాల నెటు లడుగఁగలను? ఈ పద్ధతిలో తుదకు బండి యాఁగిపోవును. ధర్మకార్యములకు సంవత్సరమునకు మున్నూఱు పౌనులకన్న ఎక్కువ అడుగవలసియుండును.'

'కొంతకాలమునుండి మీసంగతి మాకు తెలియును. వలసినదానికంటె నెక్కువ మీరు పుచ్చికొనరు. మిమ్ము మే మిచట నాఁపుచో మీకు మేము ధనము చూపవలదా?'

'ప్రేమవలన ప్రస్తుతోత్సాహమువలన మీ రిటులు మాటలాడుచున్నారు. ఈప్రేమయు, ఈయుత్సాహమును స్థిరముగ నుండునని నిశ్చయింపఁగలమా? మిత్రునివలె, సేవకునివలె కొన్ని సమయములలో మీతో నేను కాఠిన్యము వహింపవలసిచ్చును. అపుడు నేను మీయాదరమున కెంత పాత్ర మగునది దైవమే చెప్పవలె. ధర్మకార్యములలో నేను మీకడ భృతి గొనఁ గూడ దనుట నిష్కర్ష. కాన మీ కోర్టు వ్యవహారములను ఇచ్చినఁ జాలు. ఇవియు మీకు కష్టి యని నాకుఁ దెలియును. నేను తెల్లబారిస్టరు కాకపోవుటే ఒకకారణము. కోర్టు నన్నెంతవఱకు ఆదరించునో అది తెలియని విషయము. ఇంతియ కాక లాయరుగా నే నెంతవట్టు పనికి రాఁగలనో ముందు చూడవలసియున్నది. నాకు 'రిటెయినరులు'* ఇచ్చుటలోఁగూడ మీ రపా

* అనఁగా ఇంకొక్కరి కేసు పుచ్చుకొనకుండ తమ కేసులోనే పనిచేయించుకొనుటకుఁగాను బారిస్టరులు మొదలగువారికి ముందుగా ఇచ్చు ఫీజు.

యమున కాస్పదము కావచ్చును. అయినను ఈస్వల్పముకూడ నాప్రజాసేవకు ప్రతిఫల మయినటులు కాదా?'

ఇరువదిమంది వర్తకులు ఒక సంవత్సరము నాకు రిటెయినరు లిచ్చుటకు నిర్ధారించుకొనిరి. ఇది యీచర్చకు పరిణామము. నేటాలు విడిచిపోవునపుడు కానుక ఈయఁదలఁచిన సొమ్ముతో దాదా అబ్దుల్లాగారు నాకు కావలసిన కుర్చీలు, బెంచీలు మొదలగువానిని కొనిపెట్టిరి. ఈవిధముగా నేను నేటాలులో పాఁతుకొనిపోతిని.

౧౭

## వర్ణద్వేషము

కోర్టొక త్రాసు. ఆ త్రాసును సమానముగా పట్టుకొనునదొక ముదియ. ఆమెకు పక్షపాతము సున్న. ఆమె గ్రుడ్డిది. అయినను ఆమెది కుశాగ్రబుద్ధి. బ్రహ్మ ఆమెను గ్రుడ్డిదానిఁగాఁ జేసెను. ఏలనఁగా ఆమె మోముమాత్రము చూచి బొట్టు పెట్టదు; మఱి యోగ్యతను జూచి. నేటాలులోని వకీలుసభ దీనికి విపరీతముగా మోము చూచి బొట్టు పెట్టుమని సుప్రీము కోర్టును పురికొలిపెను. అపుడు కోర్టుగూడ తన చిన్నెలను లజ్జలోఁ బడవయిచికొనెను.

సుప్రీముకోర్టులో అడ్వకేటుగఁ జేరఁగోరి నే నర్జీ పెట్టుకొంటిని. బొంబాయి హైకోర్టువారి అనుజ్ఞాపత్రము నాకడఁ గలదు. నేను బొంబాయి హైకోర్టులో ప్రవేశించినతఱి నా యింగ్లీషు సర్టిఫికెట్టును అచ్చట దాఖలు చేయవలసి వచ్చెను. నేటాలు సుప్రీముకోర్టు ప్రవేశమునకు రెండు యోగ్యతాపత్రములను దాఖలు చేయవలయును. తెల్లవారి యోగ్యతాపత్రికలకు ఎక్కువవిలువ కలదని అబ్దుల్లాసేటుగారి వలన విని పరిచితులయిన ప్రఖ్యాతులగు ఇరువురు తెల్లవారికడ యోగ్యతాపత్రికలను పుచ్చుకొంటిని. ఒక వకీలుద్వారా అర్జీని దాఖలుచేయుట కోర్టు విధి. సామాన్యముగా ఈఅర్జీలను అటర్నీజనరలు ఫీజు పుచ్చుకొనకయే దాఖలుచేసికొనును. అబ్దుల్లా సేటుగారి కంపెనీకి సలహాలిచ్చు ఎస్కాంబిగారే అటర్నీజనరలు. నేను వారి దర్శనము చేసికొంటిని. ఆయన సంతోషపూర్వకముగా నా దరఖాస్తును మంజూరుచేసెను.

ఇంతలోనే మాటాపలుకూ లేక వకీలు సభవారు నాకు నోటీసు ఇచ్చిరి. నాదరఖాస్తుతో ఇంగ్లీషు సర్టిఫికెట్టు జతపఱుపక పోవుట ఒకలోపమని వ్రాసిరి. 'అడ్వకేట్లుగా చేర్చుకొనుటకు నియమము లేర్పాటు చేసినపుడు 'నల్లవారిని చేర్చుకొనవచ్చునా, కూడదా?' అని వారు విచారింపలేదు' అనువిషయము వారి విరోధమునకు ప్రధాన కారణము. నేటాలు దేశముయొక్క అభివృద్ధికి అంతటికి తెల్లవారే ముఖ్యకారణము. కావున వకీళ్లలో తెల్లవారి యాధిక్యము సంరక్షించుట తప్పనిసరి యని వారెంచిరి. నల్లవారిని అడ్వకేట్లుగా చేర్చుకొనుట మొదలిడినచో నల్లవారిసంఖ్య క్రమముగా తెల్లవారి సంఖ్యను మించిపోవును. దాన తెల్లవారు కట్టుకొనిన గోడ కూలిపోవును.

నా అర్జీ మంజూరు కాకుండఁ జేయుటకు వారు ప్రసిద్ధుఁడైన ఒక వకీలును బెట్టిరి. అతనికి అబ్దుల్లాసేటువారి కంపెనీతో సంబంధము కలదు. కావున అతఁడు నన్ను ఒక తూరి తనకు కానిపింపవలసిన దని వార్త పంపెను. నేనాయన దర్శనమునకు పోఁగా అతఁడు నిష్కపటముగ సంభాషించెను. నా పూర్వచరిత్రమునుగూర్చి నన్నడిగి తెలిసికొనెను. పిదప అతఁ డిటు లనెను—'మీకు ప్రతికూలముగ నేనేమియు చెప్పలేను. మీరు కాలనీలో పుట్టిన ధూర్తులేమో యని నా భీతి. అర్జీతో మీ మొదటి సర్టిఫికెట్టు లేకపోవుట నా అనుమతికి మఱికొంచెము బల మాయెను. మఱియొకరి సర్టిఫికెట్టులను చూపువారును ఉందురు. ఇచ్చటి తెల్లవర్తకులవద్ద మీరు పుచ్చుకొన్న యోగ్యతాపత్రములు నాలుక గీచికొనను కొఱఁగావు. మీయోగ్యత వారే మెఱుఁగుదురు? వారు మిమ్మెఱుఁగుట ఎంతకాలమునుండి?'

'అటు లగుచో ఇక్కడివా రందఱు నాకు క్రొత్తవారే. ఇచటికి రాకముందు అబ్దుల్లాసేటుగారును నన్నెఱుఁగరు.'

## ౧౮ వర్ణద్వేషము

‘అబ్దుల్లాసేటుగారిదికూడ మీయూరే అంటిరే. మీతండ్రిగారు దివానైనయెడల సేటుగారు మీకుటుంబమును తప్పక ఎఱిఁగియుందురు. ఆయనవద్దనుండి అఫిడవిట్టును తెచ్చినచో ఇఁక మిమ్మేమియు నడుగవలసిన పనిలేదు. ‘మీదరఖాస్తును నామంజూరు చేయలేను.’ అని వకీలుసభవారికి చెప్పెదను.’

ఈమాటలు విన్నంత నాకు కోప ముబికెను. కాని ఆఁపుకొంటిని. నేను మొదటనే సేటుగారికడనుండి యోగ్యతాపత్రికను తీసికొని దాఖలు చేసినయెడల దానిని త్రిప్పివైచి తెల్లవారికడనుండి యోగ్యతాపత్రికలు కావలయునని చెప్పియుండెడివారు. అయితే నన్ను అడ్వొకేటుగ అంగీకరించుటకు నాపుట్టు పూర్వోత్తరములతో నేటి పొత్తు? నాతలిదండ్రులు చెడుగు లగుదురుగాక, నుడుగు లగుదురుగాక! ఆచెడుగునుడుగులతో ప్రకృతమున కేమి ప్రయోజనము? నే నిటులు తలఁచి నిగ్రహించుకొని మెల్లగా నిటు లంటిని—‘ఈ వివరముల నన్నిటిని అడుగుటకు ఈవకీలుసభవారి ఇట్టి యధికారమును నేను మన్నింపకున్నను మీరు కోరిన అఫిడవిట్టును బంప సంసిద్ధుఁడను.’

అబ్దుల్లాసేటుగారికడనుండి అఫిడవిట్టును తీసికొని వకీలుకు ఇచ్చితిని. ఆయన తాను సంతుష్టిపడితి నని చెప్పెను. కాని వకీలుసభవారు తృప్తులు కాలేదు. వారు నా దరఖాస్తున కెదురాడిరి. కాని కోర్టువారు అటర్నీ జనరలుతో పని లేకయే వకీలుసభవారి యాక్షేపమును నిరాకరించిరి. ప్రధాన న్యాయాధీశుఁ డిటు లనెను—‘అర్జీదారు ఇంగ్లీషు సర్టిఫికెటు చూపలేదు అను ఆక్షేపము సయుక్తికము కాదు. అతఁడు కల్ల సర్టిఫికెట్టును బంపెనా అతనిపై నేరమే మోపనగును. ఆ నేరము నిక్కమాయెనా అతనిపేరు వకీలు పట్టిక

నుండి పాటా కొట్టనగును. శాసనములకు నలుపు, తెలుపు అను భేదములు లేవు. కావున గాంధిగారిని చేర్చికొనకుండుటకు కోర్టునకు హక్కు లేదు. అతని దరఖాస్తును మేము మంజూరు చేయుచున్నాము. గాంధిగారూ! మీరు ప్రమాణము చేసి అడ్వొకేటుగఁ జేరుఁడు!'

నేను లేచి రిజిస్ట్రారుకడ ప్రమాణము చేసితిని.

నేను ప్రమాణము చేయఁగనే ప్రధానన్యాయాధీశుఁడు నన్నిటులు సంబోధించెను.

'గాంధిగారూ! మీ రిపుడు పాగను దీసి వేయవలయును. ప్రాక్టీసుచేయు బారిస్టరులకు కోర్టువారు విధించు వేషనియమమును మీరు పాలింపవలయును. కోర్టు నియమములకు మీరు లోఁబడవలయును.'

నాకు నా మర్యాద తెలియును. జిల్లా మేజిస్ట్రేటు కోర్టులో పాగ తీయ నిరాకరించితిని. ఇపుడు సుప్రీముకోర్టువారి యానతికి లోఁబడి తీసివైచితిని. నే నీ ఆజ్ఞను నిరాకరింపవచ్చును. అటులు చేయుట సమ్మతమును కాకపోదు. కాని నేను పోరవలసిన పోరితములు ముందెన్నియో కలవు. వానికొఱకు నా శక్తిని అడఁచి యుంచితిని. తలపాగ పట్టుదల మాత్రముచే నా యుద్ధకళ సమాప్తముకాదు. దాని కింతకంటె దొడ్డ ప్రయోజనము కలదు.

నే నిటులు లోఁబడుటకు (ఇది లోపమా?) అబ్దుల్లాసేటుగారును, తదితర మిత్రులును ఆక్షేపించిరి. కోర్టులో ప్రాక్టీసు చేయునపుడు 'తలపాగ తొల్వ' ధీరత వహింపవలసినదని వారి యభిప్రాయము. నేను వాదించి వారికి నచ్చునటులు చేయఁజూచితిని. 'యస్మిన్ దేశే య ఆచారః' అనుదాని యర్థమును వారికి తెలుపఁజూచితిని.

## ౧౮ వర్ణద్వేషము

‘హిందూదేశమున తెల్ల యధికారి పాగను దీసివేయుమని ఆజ్ఞాపించినచో అపుడు నేను దానికి లోఁబడుట ఎగ్గు. కాని నేటాలుకోర్టులో ఆ కోర్టు ఆచారములను, నియమములను నిరాకరింపరాదు’ అని అంటిని.

నా చెప్పిన కారణములు వారికి నచ్చకున్నను వారు కొంతవట్టు శాంతించిరి. ఒక్క విషయమును వివిధసందర్భములఁబట్టి వివిధవిధములఁగ చూడవలసివచ్చు నను తత్త్వమును వారిచే ఒప్పింపలేక పోతిని. నా జీవితమునం దంతటను సత్యమనెడి పట్టుదలయే సంధి సౌందర్యము నానందింపఁ జేయఁగలిగెను. ఈ పద్ధతి సత్యాగ్రహమునం దనివార్యమగు భాగమనియు నా యుత్తర జీవితమున పరికింపఁగలిగితిని. ఇది తఱచు నా ప్రాణములమీఁదికి తెచ్చిపెట్టుకొను నటుల య్యెడిది. మఱియు నా మిత్రుల అసంతోషమును గూడ తలఁదాల్ప వలసి వచ్చెడిది. సత్యము వజ్రమువలె నెంత కఠినమో కుసుమము వలె అంత కోమలము.

నేటాలు వకీలుసభవారి ప్రతిఘటనముచే దక్షిణఆఫ్రికాలో మఱియొకమాఱు నా పేరు మారుమోఁగెను. పెక్కు వార్తాపత్రికలు ఆ సంఘమువారి ఈసునకోలును తెగడెను. వారి యెదురుమతము ఈసుచేఁ బుట్టినవనియు వ్రాసెను. ఈ ప్రసిద్ధివలన నా పనిలో కొన్ని అంశములు సరళము లాయెను.

## ౧౮

# నేటాలు ఇండియన్ కాంగ్రెసు

న్యాయవాదిత్వము నాకపుడు అప్రధాన మాయెను. తుద వఱకు అప్రధానముగనే అయిపోయెను. నేటాలురాష్ట్రమున నా యునికిని సార్థకము చేయుటకు ప్రజాసేవలో నేను తన్మయుండ నయి తీఱవలెను. విన్నపము లంపుకొనినంత ఫ్రాంచైజు పని పూర్తికాదు. ఇల్లలుకగనే పండుగా! ఎప్పుడును అలజడి జరుగుచుండిననే వలసరాజ్యముల కార్యదర్శికి ఈ విషయము తెలియుచుండును. దీనికై ఒక శాశ్వతసభ వలయునని తోఁచెను. దాన నేను దాదా అబ్దుల్లాగారితోడను, ఇతరమిత్రులతోడను సంప్రతించి స్థిరముగు ఒక ప్రజాసంస్థను స్థాపింపఁ దలపెట్టితిని.

ఈ సభకు పేరు పెట్టుటలో నాకు చాల ధర్మసందేహము కలిగెను. అది ఏపక్షము దెసకును మొగ్గరాదు. కాంగ్రెస్ అను పేరు ఇంగ్లండులోని కన్సర్వేటివ్ పక్షమునకు రుచింపదని నాకు దెలియును. కాని భారతదేశమునకు కాంగ్రెస్ జీవగఱ్ఱ. నేటాలునందు దాని శక్తిని వృద్ధి చేయఁదలఁచితిని. ఆ పేరునకు భయపడుట పిఱికితనమని తోఁచెను. ఈ కారణములు తెలిపి ఈ సంస్థకు 'నేటాల్ ఇండియన్ కాంగ్రెస్' అని పేరిడితిని. ౧౮౯౪ సంవత్సరము మే ౨౨ తేదీని 'నేటాలు ఇండియన్ కాంగ్రెస్' జన్మించెను.

ఆనాఁడు విశాలమగు అబ్దుల్లాగారి గది క్రిక్కిఱిసిపోయెను. సభ్యులందఱును కాంగ్రెసుకు స్వాగతమిచ్చిరి. కాంగ్రెసునియమ

ములు తక్కువ; చందామాత్ర మెక్కువ. నెల కయిదు షిల్లింగులు చెల్లించిననే సభ్యులు కాఁగలరు. శక్తివంచన లేక చందాల నిండని ధనికులు ప్రోత్సహింపఁబడిరి. అబ్దుల్లాగారు తొలుదొల్త రెండుపౌనులు పద్దు వేసిరి. పిదప ఇరువురు మిత్రులు అటులే పద్దు వేసిరి. 'నేను సంకోచింపవలయునా?' అని కొంచె మాలోచించితిని. ఆలోచించి నేనును ఒకపౌను పద్దు వేసితిని. ఇది నాశక్తికి మించినయీవి. కాని నాకు సంపాదనమే సాగఁగినచో ఇది నా తల మీఱినది కాదని తలఁచితిని. దైవ మిందులకు తోడాయెను. ఈ తీరున నెలకు పౌను ఇచ్చు సభ్యులు పలువురు కూడిరి. నెలకు పది షిల్లింగు లిచ్చువారి సంఖ్య ఇంత కెక్కుడు. ఇవిగాక కృతజ్ఞతతో నందికొనిన దొడ్డ యీవులు చాలఁ గలవు.

అడిగినంత నెవరును చందాలీయ రని అనుభవమున దెలిసెను. దర్బానునకు ఆవలనున్న సభ్యులను మాటిమాటికి అడుగు టసంభవము. ఆరంభశూరతాదోష మనుభవమాయెను. దర్బానువారుగూడ ఎన్నిసారులు తిరిగినను చందా లిచ్చువారుకారు.

నేను కార్యదర్శిని. కావున చందాలు వోగుచేయు పని నాది. వసూళ్లకై నా గుమాస్తాను రోజెల్ల త్రిప్పవలసిన గతి పట్టెను. అతని కీపనిపై విరక్తి దోఁచెను. నెల చందాలు కాక ఏఁడాది చందాలు— అదియు ముందుగనే యీవలెనని—పెట్టినచో ఈ స్థితి బాగుపడునని తోఁచెను. అందులకు సభ నేర్పాటుచేసితిని. నెలకు బదు లేఁడాదికి మార్చుటయు, మూఁడుపౌనులు కనీసపు పద్దుగా జేయుటయు అంద ఱకును నచ్చెను. ఈ విధముగా చందాలవసూలుపని సులభమాయెను.

అప్పు తెచ్చి సార్వజనిక కార్యములు చేయరాదని నాకు మొదటినుండియు తెలియును. ధనముతక్క మిగిలిన ఏవిషయమునం దయినను వాగ్దానములఁ బాటింపనగును. వాగ్దానము చేసినవారు మరల దాని నట్లే చెల్లించుకొనుట నే నెన్నఁడును ఎఱుఁగను. నేటాలు భారతీయులుగూడ దీనికి భిన్నులు కారు. ముందు డబ్బు చూచికొనక ఏ పనియు మొదలు పెట్టకపోవుటచే కాంగ్రెసెన్నఁడును ఋణగ్రస్తము కాలేదు.

నా సహచరులు నూతనసభ్యులను చేర్ప నమితోత్సాహమును జూపిరి. ఆ పని వారి కెంతో వేడుకయాయెను. దానితోఁగూడ వారికి అనుభవమును కలిగెను. అనేకులు సంతోషముతో ధనసాహాయ్యకము చేయఁ దొడఁగిరి. దూరప్రదేశములలో గ్రామములందు ఉద్యమమును వ్యాపింపఁజేయుట కష్టతర మాయెను. ప్రజాసేవ యన నేమియో ప్రజకు తెలియదు. అయినను చాల దవ్వులనుండు గొప్ప గొప్ప వర్తకులుగూడ ఉదారతతో మమ్ము బిలిచి ధన మిచ్చుచుండిరి.

ఈ యాత్రలో నొకసారి ఒక సంకటము పొందనాయెను. ఒకదాత ఆఱుపౌను లిచ్చునని మే మనుకొంటిమి. కాని అతఁడు మూఁడు పౌనులకు పైని చిల్లిగవ్వయేని యెక్కుడీయనని పట్టుపట్టెను. మే మా స్వల్పధనమునే అతనికడ కొనినచో మిగిలినవారును అంతియ యిత్తురు. కాఁగా ఎక్కువ వసూలు కాదు. నాఁడు రేయి చాల గడచిపోయెను. మాకందఱకు చాల నాఁకలిగా నుండెను. కాని మే మనుకొనిన మొత్తము రానిదే అన్న మెట్లు తిందుము? ఎంత బతిమాలినను ఫలము కలుగలేదు. దాత పట్టిన పట్టు విడువలేదు. పట్టణమునందలి వర్తకులందఱు చెప్పి చూచిరి. మే మందఱమును రాత్రి

యంతయు వానితో వేఁగితిమి. అతఁడును, మేమును ఒకరికొకరమొక్కింతయైన లోఁగకుండుటకు నిశ్చయించుకొంటిమి. నా సహచరులలో చాలమంది మిక్కిలి కినిసిరిగాని సౌజన్యమును కొంచెమేనియు విడువ లేదు. తుదకు తూర్పురేక లుదయించునపుడు అతఁడు మాకు అఱువౌను లిచ్చెను; విందు చేసెను. ఇది టోంగాటా పత్తనమున జరిగెను. అయినను ఉత్తరపుటెల్లన స్టేంగర్ పత్తనము మొదలు దేశమధ్యమున నున్న చార్లెస్ టౌను వఱకును ఇది ప్రతిధ్వనించెను. దీనివలన మాకు చందానసూళ్లపని తేలికయాయెను.

కాని మా కర్తవ్య మొక ధనసంగ్రహణమే కాదు. కావలసిన దానికంటె ఎక్కువ డబ్బును దగ్గఱ బెట్టుకొనరాదను తత్త్వమును నేను మున్నే నేర్చియుంటిని.

సభలు అక్కఱబట్టి ప్రతివారమును, ప్రతినెలయు జరిగెడివి. ప్రతిసభయందును వెనుక జరిగిన సభాకార్యక్రమ మెల్ల వినిపింపఁబడు చుండెడిది; చర్చలు జరిగెడివి. ఇట్టి చర్చలలో క్లుప్తముగ శాఖాచంక్రమణము చేయక మాటలాడురీతి ప్రజకు తెలియదు. ప్రసంగించుటకు అందఱును వెనుకాడుచుండిరి. సభలలో జరుగవలసిన రీతిని వారికి దెలిపితిని. వారు దానిని బాటించుచుండిరి. వారు ఉపన్యసించు టొకవిద్య యని గ్రహించిరి. ఉపన్యాసమన నేమియో యెఱుఁగనివారుగూడ ఆలోచించి ఉపన్యసింపఁ గడఁగిరి.

సార్వజనిక కార్యములందు సాదరుఖర్చులు గూడ మితిమీఱి పోవుట నే నెఱిఁగి మొదట రసీదుపుస్తకములఁగూడ అచ్చొత్తింప వల దనుకొంటిని. నాకడ సైక్లొస్టయిలు కలదు. దానిమీఁద రసీదులకు, రిపోర్టులకు ప్రతులు తీయించుచుంటిని. కాంగ్రెసు-కోశము సంపూర్ణ

ముగ నుండి సభ్యుల సంఖ్య యెక్కుడై పని మిక్కుటముగా నున్న పుడు మాత్రమే యిట్టివాని వచ్చొత్తించుచుంటిని. ఇట్టిసంఘము లన్నిటికిని పొగుపు అత్యావశ్యకము. అయినను చాల చోటుల ఇటులు జరుగుట లేదని నాకు తెలియును. కావున చిన్నదయినను ముందు అభివృద్ధికి రావలసిన యీ సంస్థను గుఱించిన విశేషము లన్నియు వ్రాయఁదగు నని తలఁచితిని.

ప్రజలు తాము చెల్లించిన మొత్తములకు రసీదులు పుచ్చుకొనఁ గోరువారు కారు. అయినను మేము తప్పక రసీదు లిచ్చుచుండువారము. ఈ రీతిగా పైసకును లెక్క వ్రాయఁబడు చుండెను. అటులగుట ఈనాఁడు పరిశీలించినను ౧౮౯౪ సంవత్సరమున నేటాలు ఇండియన్ కాంగ్రెసు లెక్కలు బరాబరుగ నుండునని ధైర్యముతో చెప్పగలను. ఏ సంఘమున కైనను తప్పులేని లెక్కలే జీవము. లెక్కలు సరిగా లేనిచో సంఘమున కపకీర్తి. లెక్కలను శుద్ధముగా నుంచనిచో సత్యమును శుద్ధముగా నుంచుట అసంభవము.

ఆదేశముననే పుట్టి పెరిఁగి విద్యావంతులయిన భారతీయులకు సేవ చేయుట ఈ కాంగ్రెసుయొక్క రెండవ పని. ఇందులకు 'కలోనియల్ బారన్ ఇండియన్ ఎడ్యుకేషనల్ అసోసియేషన్' అను ఒక సంఘము స్థాపింపఁబడెను. ఇందలి సభ్యు లందఱును విద్యావంతులయిన పిన్నవారు. వారు కొలఁదిగా చందాలు చెల్లించుచుండిరి. వీరి కష్టముల ప్రజకు తెలుపుట, వీరి తెలివిని పైకి దీయుట, వీరికిని హిందూదేశపు వర్తకులకును నెయ్య మలవఱుచుట, వీరిని వీరి జాతికి సేవచేయఁ దెలుపుట — ఇవి ఈ సంఘము పని. ఇదియొక విధమగు వాద వివాదసమితి. అందలి సభ్యులు నియతకాలముల తప్పక పలువిష

యములపై చర్చలు చేయుచుండిరి. ఈ సంఘమునకు ఒకచిన్న గ్రంథాలయము గూడ ఏర్పాటు చేయఁబడెను.

ప్రచారమొనరించుట కాంగ్రెసుయొక్క మూఁడవ పని. దక్షిణ-ఆఫ్రికాయందును, ఇంగ్లాండునందును ఉన్న ఆంగ్లేయులకును, భారతీయులకును నేటాలులోని వాస్తవము తెలుపవలయును. ఈ యుద్దేశము లోపలఁ బెట్టుకొని రెండు కరపత్రములు వ్రాసితిని. 'దక్షిణ-ఆఫ్రికాలోని ప్రతిబ్రిటిషువానికిని ఒకవిన్నపము*' అనున దొకటి. ఇందు నేటాలు భారతీయుల స్థితిగతులు సోదాహరణముగ వివరింపఁబడినవి. 'భారతీయుల వోటుహక్కును గుఱించి ఒకవిన్నపము†' అనునది రెండవది. ఇందుభారతీయుల వోట్లుహక్కును గుఱించి అణా పైసలతో సమస్తము వ్రాయఁబడెను. నేనీరెంటిని వ్రాయుటకు కడుశ్రమపడితిని. శ్రమపడినందులకు ఫలమబ్బెను. అవి విరివిగా ప్రచురమై పోయెను.

ఈ యలజడివలన దక్షిణ-ఆఫ్రికాలోని భారతీయులు చాల మంది మిత్రులయిరి. ఇంగ్లాండునందును, హిందూదేశము నందును గల అన్నిపక్షముల యొక్కయు ఆదరము చేకూరెను. ముందు చేయవలసిన పనికి నీతియు రీతియు కానవచ్చెను.

*An appeal to every Briton in South-Africa.

†The Indian franchise—An Appeal.

## ౧౦

## బాలసుందరము

యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ* అనునది అనేక విషయములలో నా కనుభవ మాయెను. పేదలకు సాయపడుట నాకు ప్రబలాభిలాష. ఆ యభిలాష నన్నా పేదలలోఁ గలిపివైచి నాకు వారితోడి సంబంధము ననాయాసముగా బంధించి వైచెను.

నేటాలు కాంగ్రెసునందు అచట బుట్టిన భారతీయులును,ఉద్యోగులును సభ్యులుగా జేరినను గిరిమిటియా లందు చేరకుండిరి. కాంగ్రెసు ఇంకను వారి పరము కాలేదు. వారు చందాలిచ్చి సభ్యులుగాఁ జేరఁజాలరు. ఎపుడు కాంగ్రెసు వారికి సాయముచేయునో అపుడు వీరును సన్నిహితులు కాఁగలరు. ఇట్టి దొకటి తలఁపని తలఁపుగా సంఘటించెను. అది ఈసమయముననే పొసఁగునని కాంగ్రెసువారు గాని, నేనుగాని సిద్ధపడి యుండలేదు. నేను ప్లీడరీ మొదలుపెట్టి నాఁటికి మూఁడో నాలుగో నెలలు. ఇంకను కాంగ్రెసునకు శైశవము పోలేదు. ఈరోజులలో ఒకరోజున ఒక అఱవయతఁడు తలగుడ్డదీసి చేతబట్టుకొని, ఏడ్చుచు నాముందు నిలునఁబడెను. ఇతడు కట్టుకొన్నవి చినుఁగు పాఁతలు. ఒడలున వడఁకు. ముందటి రెండుపండ్లు ఊడిపోయెను. ఆ కుదుళ్ల నుండి నెత్తురు కాఱుచుండెను. యజమాని ఇతనిని చావ బాఁదెను. నా గుమాస్తా అఱవ. అతనివలన ఇతనికథ తెలిసెను.

*ఎవనికి ఎటువంటి తలఁపు కలుగునో వానికి అటువంటి ఫలము కలుగును.

## ౨౦ బాలసుందరము

వానిపేరు బాలసుందరము. దర్బానులో ప్రసిద్ధుఁడైన ఒక తెల్లవాని కడ ఇతఁడు ఇండెంచర్డు కూలి. యజమానికి ఏదోమాటమీఁద కోపము పెరిఁగెను. ఒడలు తెలియక పట్టుకొని బాఁదెను. బాలసుందరము ముందరిపండ్లు రెం డెగిరిపోయెను.

బాలసుందరమును డాక్టరుకడకుఁ బంపితిని. అపుడచట తెల్ల డాక్టరులే కలరు. బాలసుందరము దెబ్బలను గురించి డాక్టరుసర్టిఫికెట్టు తీసికొని మేజిస్ట్రేటువద్ద అతనిచే ఆఫిడవిట్టు దాఖలు చేయించితిని. మేజిస్ట్రేటు అఫిడవిట్టు చదువుకొని కోపముగొని వెంటనే అతని యజమానికి సమనులు పంపెను.

యజమానికి శిక్షవేయించుట సుతరాము నాఉద్దేశము కాదు. ఎట్టులయినను ఆ యజమానికడనుండి బాలసుందరమును విడుదల చేయించుట నా ఉద్దేశము. ఇండెంచెర్డు కూలితనమును గురించిన చట్టమును చదివితిని. ఎవఁడేని కూలివాఁడు ఏమియూ తెలుపకుండ లేచిపోవుచో యజమాని సివిల్ కోర్టులో దావా వేసికొనవలెను. ఇండెంచర్డు కూలి వాఁ డటులు లేచిపోవుచో యజమాని చేయవలసినది పూర్తిగ వేఱు. వానిపై క్రిమినల్ కేసు పెట్టవలెను. నేరముగనుక నిక్కమైనచో శిక్షయు వేయింపవచ్చును. కావుననే 'ఈ యిండెంచర్డు కూలితనమును, బానిసతనమును ఒక్కటే' అని సర్ విలియమ్ హంటరుగారని యున్నారు. యజమానికి బానిసీఁ డెట్టి యాస్తియో ఇండెంచర్డు కూలియు అట్టి యాస్తియే.

బాలసుందరము విడుదలకు రెండేదారులు. ఇండెంచర్డుకూలి వారికి ప్రొటెక్టరు అని ఒకఁడుండును. అనఁగా వారి రక్షకుఁడు. అతనితో చెప్పి కట్టడి తప్పింపవలయును లేదా మఱొక యజమాని

కడకు బదిలీ చేయింపవలయును. ఒప్పుదలమీఁద బాలసుందరము యొక్క యజమానిచేతనే విడుదల పెట్టించుట రెండవదారి. ఇటు లాలోచించి ముందు ఆ యజమానితో నిటు లంటిని:

'మీమీఁద నేరమును బలపఱిచి యెటులేని మిమ్ము శిక్షింపఁ జేయుట నా యుద్దేశము కాదు. అతని సత్త్రీవ్యవహారముగ బాఁదుట మీకును ఇప్పటికి తెలిసివచ్చియుండును. మీరు మీ కరారునామా నెవరికేని మార్చినచో నాకు జాలును.' దీనికతఁడు తత్క్షణ మంగీకరించెను. 'అటుపిమ్మట నేను రక్షకుని జూచితిని. అయనయు ఒప్పుకొనెను. కాని ఒక క్రొత్తయజమాని కావలయును.

ఒక తెల్లయజమానికి వెదకులాడితిని. నాఁడు భారతీయు లెవరును ఇండెంచర్డుకూలీల భరింపఁజాలకుండిరి. నా కప్పటికి కొలఁది మంది తెల్లవారితోడనే పరిచయము. ఒకరికి ఈ సంగతి తెలిపితిని. అతఁడు దయతో ఒప్పుకొనెను. నే నాతనికి కృతజ్ఞుఁడనైతిని. మేస్ట్రేటు బాలసుందరము యజమానిపై నేరము మోపి తన కరారునామాను మఱొకనికి బదిలీచేయుట కనుమతించెనని రికార్డు చేసెను.

బాలసుందరము కేసు కూలీలలో ప్రాఁకిపోయెను. 'నాకు గిరిమిటియాబంధు'వని పేరు వచ్చెను. నా కీసంబంధమువలన పరమసంతోషము కలిగెను. ఇఁక ప్రతిదినము మా ఆఫీసుకు గిరిమిటియాలు ప్రవాహముగా రాదొడఁగుటచే వారి కష్టసుఖము లెఱుఁగుటకు నా కవకాశము కలిగెను.

ఈ కేసు విషయము దూరముననున్న మదరాసునఁగూడ ప్రతిధ్వనించెను. ఆరాష్ట్రమునందలి వివిధప్రదేశములనుండి నేటాలునకువచ్చిన గిరిమిటియాలు తమగిరిమిటియా సోదరులవలన యీవార్తను తెలిసికొనిరి.

ఈ కేసు మహాగొప్పది కాదు. కాని నేటాలులో తమకుఁ న్యాయము సాధింపఁగలవాఁడొకఁడు బయలుదేరె ననువార్తయే గిరిమిటియాల కెల్ల తృప్తిని, ఉత్సాహమును కలిగించెను.

బాలసుందరము నాకడకు వచ్చినపుడు తలపాగ తీసి చేతఁ బట్టుకొని యుండెనని చెప్పియుంటిని. ఈ దృశ్యమున ఒక విచిత్రమగు కరుణరసముతో మన నైచ్య మంటుకొనియున్నది. నా పాగను తీసి వేయుమని నప్పటి సంఘటనమును వ్రాసియుంటిని. తెల్లవాని జూడఁబోవుచో గిరిమిటియాగాని, క్రొత్త భారతీయుఁడుగాని తన తలపైని టోపీనిగాని, పగిడీనిగాని, పాగనుగాని తీసి చేతఁ బట్టుకొనవలయును. రెండుచేతులు జోడించి నమస్కరించినను అది అత్యల్పము. బాలసుందరము నాకడఁ గూడ నిటులు చేయవలయు ననుకొనెను. ఇట్టిచేతను చూచుట కిదే నాకు తొలిసారి. ఇది నాకు చిన్నతనముగా నుండెను. నేను బాలసుందరముతో పాగను జుట్టుకొమ్మంటిని. అతఁడు చాల సంకోచముతో పాగను చుట్టుకొనియెను. కాని అపు డతనిమోమున సంతోష కళ కానిపించెను.

తమ తోడిమానవులను నీచపఱచుటచే తమకు గౌరవము వచ్చునని నుకొనువారి యుద్దేశము నా కెన్నటికిని అగోచరము.

## ౨౧

## మూఁడు పౌనుల పన్ను

బాలసుందరము కేసుతో నాకు గిరిమిటియాల సంబంధ మెక్కువ ఆయెను. అది యటుండె: ఎక్కువ పన్నులు వేసి సర్కారువారు వీరి నలజడి పెట్టుటవలననే వీరి స్థితిని గుఱించి లోఁతుగా చదువుట ఆవశ్యక మాయెను.

౧౮౯౪ సంవత్సరమున నేటాలు సర్కారువారు గిరిమిటియాలకు సాలుకు తలకు ౨౫ పౌనులు అనఁగా ౩౭౫ రూకలు పన్ను కట్టుటకు బిల్లు తయారు చేసిరి. దీనిని చూచి నేను దిగ్భ్రాంతుఁడనైతిని. ఈ విషయమును కాంగ్రెసులో చర్చకు తెచ్చితిని. అందు ఈ బిల్లును ప్రతిఘటించుటకు ప్రబలప్రయత్నములు చేయుట కేకగ్రీవముగా నిశ్చయింపఁబడెను.

ఈపన్నునకు మూలకారణము లఘువుగా ముందు తెలియఁజెప్పుదును. ౧౮౬౦ సంవత్సరప్రాంతములలో నేటాలునందలి తెల్లవారు అచటి భూములు చెఱకుఁదోఁటల కనుకూలము లని గ్రహించిరి. అప్పుడు వా రా దేశమున కూలీలకు చిక్కుపడిరి. ఆ దేశమునందలి జూలూజాతివారు కూలికిఁ దగరు. ఇతర దేశములనుండి పని బాగులవారు రానిచో బెల్లము, పంచదారయు తయారుచేయుట అశక్యము. దానిచే నేటాలుసర్కారువారు ఇండియాసర్కారువారితో సంప్రతించి భారతదేశమునుండి కూలివారిని వలసగొనిపోవుటకు (రిక్రూట్) అనుమతి పొందిరి. ఈ కూలిజనము నేటాలులో అయిదేండ్లు పనిచేయు

నటులు గిరిమిటుమీఁద [కరారునామా] సంతకము చేయవలెను. గడువు దాఁటుపిదప వారి యిష్టము. అనఁగా అచటనే నివసింపఁదలచినచో నివసింపవచ్చును. శక్తి యున్నచో భూమి బుట్ట కొనవచ్చును. ఇవి తెల్లవారు అపుడు గిరిమిటియాలకు పెట్టిన ఆశలు. వారి ఉద్దేశ మే మనఁగా : ఈ అయిదేండ్లు దాఁటినపిదపఁగూడ భారతీయుల ఒడలి కష్టమువలన తమ పంటలను వృద్ధి చేసికొనవచ్చును.

అయితే భారతీయులు తెల్లవా రనుకొన్నంతకంటె ఎక్కువ లాభకారులైరి. వారు రకరకముల కూరగాయల నధికముగ పండింపఁ దొడఁగిరి. ఇండియానుండి చాలరకముల విత్తనములు తీసికొనిపోయి అచట పెనిచి పండించి అచటి కూరగాయలను చౌకగా గిట్టునటులు చేసిరి; మావితోఁటల పెంచిరి. వీ రింతటితో ఆఁగలేదు. దీనితో పాటు వర్తకముగూడ చేయసాగిరి. ఇండ్లు కట్టుకొనుటకు స్థలములు కొనదొడఁగిరి. కొందఱు కూలివాండ్రు భూస్వాము లైరి. భారత దేశమునుండి వర్తకులు కొందఱు వీరితోపాటు వెళ్లి అచట పాతుకొని పోయిరి. ఇట్టివారిలో కీ. శే. సేట్ అబు బకర్ అమద్ గారు ప్రప్రథములు. వారు కొలఁదికాలములో తమ వ్యాపారమును బాగుగా సాగించిరి.

ఇదియంతయు చూచి తెల్లవర్తకులు కలవెల పడిరి. నల్లవారిని పిలుచుకొని వెళ్లునపుడు వీరికిఁ గల వర్తకపుతెలివిని తెల్లవా రెఱుఁగరు. భారతీయులు స్వతంత్ర వ్యావసాయికు లయినచో ఎటులో ఓర్వవచ్చునుగాని వర్తకములో పోటీపడినచో ఓర్వవచ్చునా?

భారతీయులయెడ అసూయకలుగుట కిది మూలకారణము. దీనికి మరికొన్ని కారణములును చేరెను. నల్లవారి జీవితమునందలి సాదా

పద్ధతులు, కొంచెము వ్యయముతో మప్పితముగా మనఁగలుగుట, అల్ప లాభసంతోషము, ఆరోగ్యనియమ విషయములందలి ఉదాసీనత, చుట్టుపట్టులను శుచిగ నుంచుకొనుటలో అశ్రద్ధ, ఇండ్లను మరమ్మతు చేయించి బాగుచేసుకొనుటకు పిసినిగొట్టుతనము ఈ మొదలగున వన్నియు మతభేదముతో కలిసి జాతివైషమ్యమను అగ్నిహోత్రమును ప్రజ్వ లింపఁజేసెను. ఇది మునిముందు వోటుహక్కు తొలఁగించు బిల్లు-రూపముగను, పిదప గిరిమిటియాలకు తలపన్ను కట్టు శాసనరూపముగను ప్రత్యక్షమాయెను. ఈ శాసనములే కాక పెక్కు చిక్కు లిదివరకే మొలకెత్తి యున్నవి. గిరిమిటియాలను, గిరిమిటికాలము అయిదేండ్లు ముగియకమును పే——అనగా ఇండియా చేరిన తర్వాతనే ముగియునట్లు బలాత్కారముగ పంపివేయుట. ఈ శాసనముల మొదటి సూచన యిది: ఇండియా సర్కారువారు దీని కంగీకరించునట్లు లేదు. పిదప ఈ క్రింది రీతిగా కొన్ని షరతులు ఉద్దేశింపబడెను.

౧. గిరిమిటియాలు తమ నియమితకాలము చెల్లిపోయినంత ఇండియాకు లేచిపోవలయును. కానిచో

౨. రెండేండ్ల కొకతూరి క్రొత్తఒడంబడిక వ్రాయుచుండవలయును. ఒడంబడిక వ్రాసినపుడెల్ల జీతము కొంచెము కొంచెము వృద్ధి చేయఁబడుచుండును.

3. మఱి క్రొత్త ఒడంబడిక వ్రాయక ఇండియాకును తిరిగిపోక నేటాలులోనే ఉండినచో సాలుకు ౨౫ పౌనులు, అనఁగా 3౭౫ రూకల పన్ను చెల్లించు చుండవలయును.

ఈ ఫైసలాను ఇండియా సర్కారువారిచే మంజూరు చేయించుటకు సర్ హెన్రీ బిన్సు, మేసన్ అనువారు ఇండియాకు వచ్చిరి.

## ౨౧ మూఁడు పౌనుల పన్ను

అపుడు ఎల్గిన్ ప్రభువు ఇండియా వైస్రాయి. అతఁడు ౨౪ పౌనులు తలపన్నును మంజూరుచేయక మూఁడుపౌనులు పన్ను మంజూరు చేసెను. ఇది వైస్రాయిగారి పెద్ద లోటు. నేను నాఁడును నేఁడును అట్టులే తలఁతును. ఇట్టులు అతఁడు మంజూరు చేసి ఇండియా మే లేమాత్రము చూడలేదు. నేటాలు తెల్లవారి కట్టి లాభము కూర్చుట యతనికి ధర్మముకాదు. మూఁడు నాలుగేండ్లలో ప్రతి గిరిమిటియాయును, వాని యాలును, పదునాఱేండ్ల కొడుకును పదమూఁడేండ్ల కూఁతురును ఈ తలపన్నును చెల్లింపవలసినవా రగుదురు. నెలకు ౧౮ షిలింగులకంటె ఎన్నఁడును ఎక్కువ సంపాదించి యెఱుఁగని భార్యాభర్తలు ఇద్దఱు పిల్లలుగల కుటుంబమునకు సాలుకు ౧౨ పౌనులు (౧౮౦ రూకలు) పన్ను వేయుట ఏ దేశమునను, ఎవ్వరును కనని వినని అత్యాచారము.

ఈ పన్నును ప్రతిఘటించుటకై మేము ఘోరయుద్ధ మారంభించితిమి. ఈ విషయమున నేటాలు ఇండియన్ కాంగ్రెసువారు ఊరకుండినచో ఇండియా వైస్రాయి ౨౪ పౌనుల పన్నును మంజూరు చేసియుండును. ఇది ౨౪ పౌనులనుండి 3 పౌనులకు తగ్గుటకు 'బహుశా' నేటాలు కాంగ్రెసువారి ఆందోళనమే కారణము కావచ్చును. లేక నా తలఁపే పొరపాటు కావచ్చును. కాంగ్రెసువారు ఆందోళనము జరిపినను జరుపకున్నను ఇండియా సర్కారువారు తమంతట తామే మూఁడు పౌనుల పన్నును మంజూరుచేసి యుందురనినను అనవచ్చును. ఎటులేని యగుఁగాక ఈపని భారతీయుల హితమునకు భంగకరము. భారతదేశ యోగక్షేమముల రక్షింపవలసిన వైస్రాయి అమానుషముగ నిట్టి పన్నును మంజూరుచేసియుండఁగూడదు.

ఈ పన్ను ౨౫ పౌనులనుండి అనఁగా ౩౭౫ రూకలనుండి ౩ పౌనులకు అనఁగా ౪౫ రూకలకు తగ్గుట మాత్రము కాంగ్రెసువారి కేమంత శ్రేయస్సు? గిరిమిటియాలకు సంపూర్ణముగా మేలు కలుగ లేదను వంత అచట నుండనే యుండెను. ఈ పన్ను రద్దుపఱపించి ముదరా యిప్పింపవలయు నను నిశ్చయమును కాంగ్రెసువా రెన్నఁడును విడనాడ లేదు. కాని యీ నిశ్చయము ఇరువది సంవత్సరములకు నెఱవేఱెను. అదియు నేటాలు భారతీయులే కాక దక్షిణ-ఆఫ్రికా లోని భారతీయులెల్లరును ఏకీభవించి ప్రయత్నించినఁగాని కాలేదు. గోఖలేగారికి మాటయిచ్చి కడకు చెల్లింపకపోవుట తుదిపోరునకు నిమిత్తమాయెను. ఆపోరునకు గిరిమిటియాలు పూర్తిగా పూనుకొనిరి. సర్కారువారు తుపాకులు కాల్చుటచే కొందఱు చచ్చిరి. పదివేలమందికి పైఁగా బందీలయిరి.

కాని తుదకు సత్యమే జయించెను. భారతీయుల బాధల రూపమున సత్యము ప్రత్యక్షముగా ప్రకటమాయెను. కాని అచలమగు నమ్మిక, గొప్ప ఓర్పు, విసువు విరామము లేని పూనిక, యివి లేకున్నచో ఆ యుద్యమము జయము పొందియుండదు. వారు ఆ పోరాటమునే మానివైచి, కాంగ్రెసువారును ఆ లడాయిని మఱచి పోయినచో తలపన్ను తప్పక తలపైఁ బడుచు అని వార్య మయ్యెడిది. అది యీనాఁటివఱకును గిరిమిటియాల తలపై అట్లే యుండెడిని. మఱియు దీని అపయశస్సు దక్షిణ-ఆఫ్రికా భారతీయులకును అఖిల భారతీయులకును చుట్టుకొని సనాతనమయ్యెడిని.

# ౨౨

## ధర్మనిరీక్షణము

ఈరీతిగా నేను ప్రజాసేవలో తన్మయుఁడ నయిపోవుటకు కారణము ఆత్మసాక్షాత్కారాభిలాషయే. ప్రజాసేవ వలననే ఈశ్వర సాక్షాత్కారము కలుగునని నేను సేవాధర్మమును స్వీకరించితిని. భారత సేవ నాకు సహజముగా లభించెను. నాకిది ప్రియము. కోరుకొనకయే యిది నాకు సంప్రాప్తమాయెను. నేను పర్యటనకును, కాఠియావాడు కుట్రలను తప్పించుకొనుటకును, జీవికకొఱకును దక్షిణ-ఆఫ్రికా పట్టితిని. కాని నేనీశ్వరాన్వేషణమున ఆత్మదర్శనమున మునిఁగిపోయితిని.

ఏసు మిత్రులు నా ధర్మజిజ్ఞాసను తీవ్రము చేసిరి. అది యే ప్రకారమునను శాంతము కాలేదు. నేను దానిని శాంతము చేయఁజూచినను ఏసు మిత్రులు పడనీయలేదు. ఎటులనఁగా: దర్బానులో దక్షిణ-ఆఫ్రికా జనరల్ మిషనునకు అధ్యక్షులు స్పెన్సర్ వాల్టనుగారు నన్ను పసిపట్టిరి. దాదాపు నేను వారి కుటుంబములో నొకఁడనై పోతిని. ఈ సంబంధమునకు కారణము ప్రిటోరియా పరిచయము. వాల్టనుగారి స్వభావము విచిత్రమైనది. ఆయన నన్నెన్నఁడును ఏసు మతమున కలియుమని చెప్పినటులు గుర్తులేదు. కాని అతఁడు తన జీవితమును సమస్తము విప్పి నా ముందిడియెను. తన మంచి చెడుగులెల్ల నిరీక్షింప నాకవకాశ మిచ్చెను. ఇతని ధర్మపత్ని కడు వినయవతి; వివేకవతి.

ఆ దంపతుల ప్రవర్తనము నాకు సంతోషము కలిగించెను. మా యిరువుర అభిప్రాయభేదములను మేమెఱుఁగుదుము. ఎటువంటి తీవ్రచర్చయు వాని నేకము చేయుట అసంభవము. అయినను ఎచట ఉదారత, సహిష్ణుత, సత్యమును ఉండునో అచట భేదములును, లాభదాయకములు. ఆదంపతుల నమ్రత, ఉద్యమశీలము, కార్యపరాయణతయు నాకు మోదము కలిగించెను. ఇందుల మేము తఱుచు ఒకచో కూడుచుంటిమి.

ఈసంబంధము మతమునెడల నన్ను జాగరూకునిగా నుంచెను. మత చింతనమునకు ప్రిటోరియాలో నాకట్టి యవకాశ ముండెనో అది యిచట లేకపోయెను. అయినను సమకూరిన స్వల్పకాలమును చదువునకు వినియోగించుచుంటిని. ఈవిషయమున మరల ఉత్తరప్రత్యుత్తరములు మొదలాయెను. రాయచందుభాయి నాకు త్రోవచూపుచుండెను. నర్మదాశంకరుని* ధర్మవిచార మను గ్రంథ మొకమిత్రుఁడంపెను. దాని పీఠిక నాకు చాల నుపకరించెను. నర్మదాశంకరుని విశృంఖల జీవితమును నేను వినియుంటిని. ఈపీఠికలో అతఁడు తన శీలమును దిద్దుకొనిన తెఱఁగు కలదు. అది నాకాశ్చర్యము కలిగించెను. దానితో నాకా గ్రంథముపై ఆదరము పెరిఁగెను. దాని నతిశ్రద్ధతో చదివితిని. మాక్సుముల్లరుగారి India, What can it teach us అను గ్రంథమును దివ్యజ్ఞానసమాజము ప్రకటించిన ఉపనిషత్తుల యనువాదమును శ్రద్ధతో చదివితిని. వీని యన్నిటివలన నాకు హిందూమతముపై ఆదర మధికమై నానాఁటికి దాని గొప్పదన మెక్కుడుగా కానిపింపఁ జొచ్చెను. కాని దీనిచే నితరమత

* గుజరాతులో ఒక ప్రసిద్ధ కవి.

ములయెడ వైముఖ్యము కలుగలేదు. వాషింగ్టన్ ఇర్వింగ్ గారి Life of Mahomet and his successors అను గ్రంథమును, కార్లైలుగారి మహమ్మదు స్తుతిని చదివితిని. దీనిచే నాకామత ప్రవక్తపై ఆదరమెక్కెను. 'The sayings of Zarthustra' అను గ్రంథమును గూడ చదివితిని.

ఇటులు వివిధమతములను కొలదిగాను, గొప్పగాను తెలిసికొంటిని. దీన ఆత్మనిరీక్షణము పెరిగెను. చదివినదానిలో ఏది మంచిదని తోచునో దాని ననుభవమున పెట్టజొచ్చితిని. ఈ రీతిగా యోగగ్రంథముల జదివి నాకు దెలిసినంత సాధన నారంభించితిని. కాని అందెంతో దవ్వేగజాలకపోతిని. భారత దేశమునకు పోవుపిదప ఏ గురువునొద్దనేని అభ్యసింపదలచితిని గాని ఆ కోరిక నేటికిని తీఱలేదు.

టాల్‌స్టాయి పుస్తకములు లెస్స చదివితిని. ఇతని The Gospels in Brief, What to do మొదలగు గ్రంథములు నా హృదయమున అంటుకొనిపోయెను. విశ్వప్రేమ మనుష్యుని ఎంతవఱకు తీసికొనిపోవగలదో నేనంతకంత కెక్కువగా తెలిసికొనగలిగితిని.

ఇత్తఱినే నాకు మఱొక ఏసుకుటుంబముతో పరిచితి కలిగెను. వారి మాటచే ప్రతి ఆదివారము వెస్లియన్ చర్చికి పోదొడగితిని. అచటికి బోయినపుడెల్ల వారియింటనే విందని వారొకసారియే చెప్పిరి. ఆచర్చిలో ప్రవచనము నిస్సారముగా నుండెడిది. అచటి మండలి భక్తమండలి కాదు. వారందఱు ఐహిక చింతకులు. లోకాచారమునకును, విశ్రాంతికిని వారు చర్చికి వెళ్లువారు. ఉండి ఉండి నాకు అచట కునికిపాటులు వచ్చెడివి. నాకు చాలా చిన్నతనమాయెను.

కాని నాతోపాటు కొందఱు మిత్రు లుండుటవలన నా చిన్నతనము ఛిన్నమయిపోయెను. ఈ స్థితి నాకు బాగుండలేదు. తుదకు అచటికిఁ బోవ మానుకొంటిని.

నడుచుచు నడుచుచున్న ఈ కుటుంబము తోడి పొత్తు ఇట్టే ఆగిపోయెను. 'ఇఁక రావలదు' అని వారు ముదలకించిరని చెప్పఁజెల్లును. అది యిటులు: ఆ యిల్లాలు చాలమంచిది; ఋజువయినది; కాని సంకుచితస్వభావ. మా పని యెప్పుడును మతచర్చ. నేనపుడు ఆర్నాల్డుగారి Light of Asia ను చదువుచుంటిని. అపుడు బుద్ధునకును, ఏసునకును గల తారతమ్యమును గుఱించి చర్చవచ్చెను. నేనిటు లంటిని:

'అమ్మా, చూడు బుద్ధుని దయ! అది మనుష్యజాతితో ఆఁగక సకల భూతములదాఁక వ్యాపించెను. అతని బుజము మీఁద సంతసముతో కూరుచున్న మేకపిల్ల చిత్తరువు కనులయెదుట పొడఁగట్టినచో ఎవనిహృదయము ప్రేమచే పొంగిపోవదు? ఏసులో సర్వభూతవ్యాప్తమగు నీదయ కానఁబడదు.'

ఆమెకు మనస్సునొచ్చెను. నేను ఇది గ్రహించితిని. ప్రసంగమంతటితో కట్టిపెట్టితిని. భోజనమునకు లేచితిమి. ఆమె కుమారుఁడు అయిదేండ్లవాఁడు హాసన్ముఖుఁ డొకఁడు మాతోఁగలఁడు. పిల్లలున్నచో నాకు మఱొకరితో మాటాడ నేమిపని? మేమిరువురము చిరకాల మిత్రులము. కుఱ్ఱనిపళ్లెరమున మాంసపుముక్క కలదు. చూచి నేను కేలిచేసి నాచేతనున్న శేఁగుఁబండు చూపి 'చూడు మిది దానికన్న నెంతబాగున్నదో' అని యంటిని. అమాయికుఁ డాకుఱ్ఱఁడు నాలోఁ గలిసిపోయెను. నీపండే బాగుండెనని కొండాడఁ దొడఁగెను.

కాని ఆపసివాని తల్లి యోచింపగజెను. నేను కొంచెము హెచ్చరిక పడితిని. వెంటనే ప్రసంగము మార్చివేసితిని. మఱునటి యాదివారము కూడ వారింటికేఁగితిఁగాని జంకుతోడనే. నే నటకు పోవ మానుకొనఁ దలఁపలేదు; అది మంచిదనియు ననుకొనలేదు. కాని యామె నా పని చులుకనచేసెను. ఆమె యిట్లు లనెను—'గాంధీ! నే నొకటి చెప్పెదను. మఱొక విధముగా తలఁపకుము. నీ చెలిమి మా పిల్లవానికి దగదు. ఇపుడు వీఁడు ప్రతిదినము మాంసము తినుటకు మారాము చేయుచున్నాఁడు. నీ వాదమును స్మరణకు తెచ్చి పండ్లు తెమ్మనుచున్నాఁడు. దీనిని నేను సైఁపఁజాలను. మాంసముమానినచో మఱేమి జబ్బుచేయదుకాని వీఁడు చిక్కి సల్లెమయిపోవును. నా కిది చూడ శక్యమా? నీ విఁక నిట్టి చర్చలు పెద్దవారమైన మాతోడనే చేయవలయుఁగాని పిల్లలకడఁ గాదు. వీనితో పిల్లలు పాడయి పోదురు.'

'అమ్మా, నేను చాల వగచుచున్నాను. నాకును పిల్లలు కలరు. తలిదండ్రుల భావములు నే నెఱుఁగుదును. ఇఁక నిట్టి కష్టము కలుగ కుండఁ జేయుట కడు సులభము. నేను చెప్పుటకంటె నేను తినునవియు, పరిత్యజించునవియు సాక్షాత్తు పిల్లవాని మనస్సునకు ఎక్కువగా పట్టిపోవును. ఆకారణమున నేఁటినుండి నే నిచటికి వచ్చుట మానుకొనుటయే దీనికి దగు చికిత్స; కాని దాన మన మైత్రి కేమాత్రమును భంగము రాదు.'

'తమ మాట బాగుగా నున్న'దని ఆయిల్లాలు సంతోషముగా ప్రత్యుత్తర మిచ్చెను.

# ౨౩

## గృహవ్యవస్థ

గృహభారము వహించుట నాకు క్రొత్త గాదు. కాని బొంబాయి, లండనులలోని నా కాపురమునకును, నేటాలులోని కాపురమునకును వారకలదు. ఇచట గృహవ్యయమునందలి కొంత భాగము ప్రతిష్ఠకొఱకు. ఇండియన్ బారిస్టరు ప్రతిష్ఠకు తగినటులను, మఱియు భారతీయుల ప్రతినిధియొక్క ప్రతిష్ఠకు తగినటులును నేను నేటాలులో గృహవ్యయము చేయఁదలఁచితిని. అందులకు పట్టణములో మంచిచోట ఒక సొగసైన చిన్నయింటిని అద్దెకుఁ గొంటిని. కావలయు ఉపకరణము లన్నియు అందుగలవు. భోజనవ్యయము మితము. అయినను అప్పుడప్పు డాంగ్లేయమిత్రులను, నాతో పనిచేయు భారతీయులను, విందులకు పిలుచుచుండుటవలన కొంచెమధికముగనే యగుచుండెను.

ప్రతిసంసారము నందును ఒక మంచిసేవకుని ఉంచుకొనక తప్పదు. కాని యెవనినైనను సేవకునివలె నెటులుంచుకొనవలయునో నాకు నేటికిని తెలియదు.

నాతో నొకమిత్రుఁ డుండువాడు. మఱియొక వంటవాడును ఇంటివానివలె నుండెడువాఁడు. ఆఫీసులోని గుమాస్తాలును మాయింటనే భుజించి నివసించుచుండెడివారు.

ఈ సంసార మిటులు సఫలముగా సాగినదనియే నా తలఁపు. కాని యీ సంసారమున కొన్ని కటువులగు అనుభవములు తగులక పోలేదు.

# ౨౩ గృహవ్యవస్థ

నా మిత్రుఁడు మంచి తెలివిగలవాఁడు. నాయెడ విశ్వాసియని నమ్మితిని. కాని నే నే మోసపోతిని. ఆఫీసుగుమాస్తా యొకఁడు మా యింట నుండెను. నా మిత్రున కితనిపై అసూయపుట్టెను. నాకా గుమాస్తామీఁద అనుమానము కలుగునటులు నామిత్రుఁ డొక పన్నాగము పన్నెను. ఆ గుమాస్తా స్వభావము విచిత్రమైనది. తనను నేనను మానించు చుంటినని వెంటనే పసిగొనెను. వెంటనే పని మానుటయు కాక మా యింటిని గూడ పరిత్యజించెను. నేను చాల వగచితిని. నేన తని కన్యాయము తలఁచితినేమో యని లోలోపల మిగుల దుఃఖించితిని.

ఈ నడుమ మా వంటవాఁడు ఏకారణముననో సెలవు పుచ్చుకొనెను. మిత్రుల సేవాశుశ్రూషలకు నేను పాచకు నుంచితిని. కావున ఇతనికి బదులు మఱొకని నుంచవలసివచ్చెను. ఈ క్రొత్తవాఁడు తుంటరియని తుదకు తెలిసెను. కాని నాకు మాత్ర మతఁ డీశ్వరుఁడు పంపిన దూత.

నా యింట నా యెఱుక లేక జరుగుచున్న కొన్ని దుష్కార్యములను వచ్చిన రెండుమూఁడునాళ్ల లోనే కనిపట్టి ఇతఁడు నన్ను మదలకింప నిర్ధారించుకొనెను. 'మంచివాఁడ'నియు, 'ఎవరేమి చెప్పినను దాని నమ్మువాఁడ'ననియు నాకు పేరు. నా యింటనే లోకవ్యాప్త మగు దుర్గంధము బయలుదేఱుట ఈ వంటవాని కాశ్చర్య మాయెను. ప్రతి దినము మధ్యాహ్నము ఒంటిగంట నా భోజనవేళ. ఆఫీసునుండి ఆ సమయమున కింటికిఁ బోవుట మామూలు. ఒకనాఁడు పండ్రెండుగంటల వేళ ఆ వంటవాఁడు ఆఫీసుకు రోఁజుకొనుచు వచ్చి—'ఒక తొందర పని యున్నది. మీరు వెంటనే యింటికి రావలయును' అనెను.

'ఇప్పు డెట్లు? ఆ పని యేమో చెప్పు! ఆఫీసువదలి యింటికి రాఁదగినంత పని యేమి? అచట నేమి పని?'

'మీ రిపుడు రానియెడల నిటుపిదప 'ఏల వెళ్ల కపోతి'వని విచారింతురు. నా చెప్పఁదగిన దింతియు.'

ఇతఁ డింత దృఢముగా చెప్పుటవలన వెళ్లవలసి వచ్చెను. నే నొక గుమాస్తాను వెంటఁబెట్టుకొని యింటికి బయలుదేఱితిని. వంట వాఁడు ముందు నడిచెను. నన్ను మేడమీఁదికిఁ దీసికొనిపోయెను. నా మిత్రుని గదివంక జూపి 'యీతలుపు తీసి మీరే చూడుఁడు.' అనెను.

నాకు అంతయు తెలిసిపోయెను. తలుపు తట్టితిని. ప్రత్యుత్తరము వచ్చునా? నా బలముకొలఁది తలుపు తట్టితిని. గోడలు గజగజలాడి పోయెను. తలుపు తెఱువఁబడెను. లోపల నొక వేశ్య. 'పో పొమ్ము మరల నీ గుమ్మము తొక్కవలదు' అని దానిఁ బంపివైచితిని.

'ఈ క్షణమునుండి నీతో నాకే సంబంధమును లేదు. నేను బుద్ధిమాంద్యముచే నిలువెల్ల మోసపోతిని. నా విశ్వాస మింతకుఁ దెచ్చితివి.'

ఈ నా మాటలతో తెలివి తెచ్చుకొనుటకు బదులు అతఁడు 'చూడు! నీ రహస్యము లన్నియును బయటఁ బెట్టెదను' అని బెదిరించెను.

'నాకు రహస్యమని లేదు. నాసంగతి యంతయు చాటి చెప్పుము. కాని నీ విపుడే యిచటినుండి లేచిపోవలయును.'

అతఁడు మఱి కొంచెము బెదిరించెను. ఇఁక నతని సంబాళింప వీలు లేకపోయెను. అంతట క్రిందనున్న గుమాస్తాను బిలిచితిని. 'మీరు వెంటనే సూపరింటెండెంటుగారి కడకుఁబోయి నా నమస్కారమును

చెప్పిన పిదప నా యింట నివసించుచున్న ఒకతఁడు విశ్వాసఘాతము చేసెను. అతఁడు నా యింటనుండుట నాకిష్టముకాదు. కాని అతఁడు ఇచటినుండి కదలుటలేదు. తమ మద్దతు కోరుచున్నాను అని నా విన్నపములు చెప్పుడు.'

అపరాధి ఇంతవఱకు లొంగలేదు. నే నిఁక పోలీసుల కప్పగింతు ననుకొనెను. తప్పు అతనిని భయపెట్టెను. పిదప నతఁడు శరణుచొచ్చెను. పోలీసులకు తెలుపవలదని బతిమాలెను. వెంటనే యింటిని వదలెదననెను; వదిలెను.

ఈ ఘటన యథాసమయమున నన్ను మేలుకొలిపెను. ఈ దుష్టోపజ్ఞముచే నేను పూర్తిగా మోసగింపఁబడినటు లప్పటికిఁగాని తెలియలేదు. ఈ మిత్రుని దగ్గఱకు చేర్చుట మంచి చేయఁబోయి చెట్టచేయుటయైనది. తుమ్మకొమ్మన గులాబిపూలు కోయఁదలఁచితిని. అతని నడవడి మంచిదికాదని నాకుఁ దెలియును. అయినను నా యెడ తప్పుఁదలఁపఁడని నమ్మితిని. అతని నడవడిని బాగుచేయఁదలఁచి నేనే చెడుగునఁబడితిని. ఇయ్యెడ నాహితైషులమాట చెవిఁ బెట్టనైతిని. మోహమునఁబడి అంధుఁడనైతిని.

ఈ దుర్ఘటనచే నాకనులు తెఱపింపఁబడని యెడల నాకు సత్యమిసుమంతయు తెలియదయ్యెడిని. నేనతనివలలోఁ బడి యిపుడు నే నుద్యమించిన యీయేకాంత జీవనము తలపెట్టియుండను. నాసమయమంతయు వానికి వమ్ముచేసెడి వాఁడను. నన్ను అంధకారమున నుంచి కుమార్గము బట్టింపఁగల శక్తి అతనికున్నది.

కాని ఈశ్వరరక్షితుని ఎవఁ డేమి చేయఁగలఁడు? నామనస్సు శుద్ధము. కాన తప్పు దొడరినను రక్షితుఁడ నయితిని. మొట్టమొదటనే

సంభవించిన యీ యనుభూతి భవిష్యద్విషయములలో నన్ను జాగరూకునిగాఁ జేసెను.

ఈశ్వరుఁ డీవంటవాని ప్రేరింపలేదని యెవ రెఱుఁగుదురు? అతఁడు వంట చేయలేఁడు. ఆ పనిమీఁద అతఁడు నాయింట నెంతో కాలము ఉండలేఁడు. ఇతఁడు తక్క నొండొకరు నా కనులు విప్పలేరు. ఆమె యిటకు వచ్చుటిదే మొదలు కాదు. ఇంత ధైర్య మీవంటవానికి దక్క మఱొకరికి లేదు. ఏలన: ఆ మిత్రునిపై నాకుఁ గల విశ్వాసము హద్దు దాఁటిపోయినదని అందఱకుఁ దెలియును. వంటవాఁడు ఈవిషయము నాకు తెలుపుటకే వచ్చెఁ గాఁబోలు—'అయ్యా, నేను మీ యింట నుండలేను. మీరు సులభముగా మోసపోవుదురు. ఇది నాకుఁ దగిన చోటు గాదు' అని యాక్షణమే నా సెలవడిగెను.

నేనును ఉండుమని పట్టు పట్టలేదు.

వెనుక వెళ్లిపోయిన గుమాస్తాపై నామతి విఱిచినవాఁ డీమిత్రుఁడే యని నా కపుడు తెలిసెను. ఆగుమాస్తాకు నా కావించిన అన్యాయమును పోఁగొట్టుటకు నే నెంతయో ప్రయత్నించితిని. నా కీవార్త గుఱించి యెన్నఁటికిని విచారమే. ఏలన: అతని నెన్నటికిని సంతృప్తి చేయఁజాలకపోతిని. ఎంత బాగు చేసినను అతుకతుకే.

## ఇంటికి

నేటికి నేను దక్షిణ-ఆఫ్రికా ప్రవేశించి మూఁడేండ్లు. నా కచటి లోకుల సంగతి తెలిసెను; వారికిని నా సంగతి తెలిసెను. ౧౮౯౬ వ సంవత్సరమున ఆఱునెలలు సెల వీయమని అడిగితిని. ఏలన నేనచట యింకను చాలకాల ముండవలసినవాడను. నా కచట మంచి ప్రాక్టీసు ఏర్పడెను. అచటివారికి నాతో చాల పనియుండు నని తెలిసెను. అందుల నే నింటికిఁబోయి ఆలుబిడ్డలతో మరల దక్షిణ ఆఫ్రికా నివాసమునకు రా నిశ్చయించితిని. ఇంతియ కాక నే నిండియాకుఁ బోవుచో అచట ప్రచారము చేసి దక్షిణ ఆఫ్రికా భారతీయులయెడల ఎక్కువ అభిమానము కలిగింప వీ లుండును. మూఁడు పౌనుల పన్ను మహావ్రణము. అది మానువఱకు శాంతి యెట్లు? కాని ఇచట నేను లేనికాలమున కాంగ్రెసుపనియు విద్యా సంఘము పనియు నెవరు చూతురు? నా చూపులో నిరువురే కలరు. ఆదంజీ మియాఖాన్ ఒకఁడు; పార్శీ రుస్తుంజీ మఱి యొకఁడు. అప్పటికి వర్తకులలో పలువురు ప్రచారకులుగా తయారయిరి. కాని కార్యదర్శిభారము నియమపూర్వకముగా వహించువారును దక్షిణ-ఆఫ్రికా భారతీయుల అభిమానమునకు పాత్రము లయినవారును వీరిరువురే. కార్యదర్శికి ఆంగ్ల భాషాజ్ఞాన మావశ్యకము గదా! నేను ఆదంజీ మియాఖానుగారి పేరు కాంగ్రెసువారికి సూచించితిని. వా రతని కార్యదర్శిగ నామోదించిరి. అతని నెన్నుకొనుట అత్యుత్తమ మని

అనుభవము వలన దెలిసెను. అదంజీ మియాఖానుగారి ఉద్యోగ శీలము, వారి యుదారత, వారి మంచితనము, వారి వివేకము కార్యదర్శిత్వమునకు యుక్తునిగా జేసెను. మఱియు ఆ పదవికి ఏబారిస్టరో, ఇంగ్లీషు వచ్చిన ఏగొప్పవాఁడో. కాని పనికిరాఁడను ఊహను పొలిఁదోలెను.

౧౮౯౬ వ సంవత్సరము నడుమ నేను కలకత్తాకు బయలుదేఱి 'పాంగోలా' స్టీమరెక్కి ఇండియాకు బయలుదేఱితిని.

ఆ స్టీమరులో పలువురు యాత్రికులు లేరు. అందు ఇద్దఱు ఇంగ్లీషు ఉద్యోగులు కలరు. వారితో నాకు మైత్రి కలిసెను. ఒకనితో నేను ప్రతిదినము ఒకగంట చదరంగ మాడుచుంటిని. ఆస్టీమరులోని డాక్టరు 'తమిళ భాషాశిక్ష' యిచ్చెను. దానిఁ జదువ దొడఁగితిని.

నేటాలులో నుండఁగా మహమ్మదీయులతో పరిచయము కలుగఁజేసికొన ఉరుదు భాషను, మదరాసువారితో పరిచయము కలుగఁ జేసికొనుటకు అఱవభాషను చదువఁదలఁచితిని.

ఉరుదు నేర్వఁదలఁచిన యాంగ్లమిత్రుని మాటమీఁద డెక్కుమీఁద నున్న యాత్రికులలో 'ఎవరేని మున్షీ దొరుకునా' యని అన్వేషించితిని; దొరకెను. అప్పటినుండియు మా చదువు బాగుగా సాగెను. ఆ తెల్లఉద్యోగి ధారణ దొడ్డది. ఉరుదు అక్షరములు గుర్తింప నాకు చాలఁ గష్టమాయెను. మఱి యతఁడో అక్షరమొకసారి చూచినఁ జాలు నిఁక మఱవఁజాలఁడు. నేను చాల కష్టించితిని గాని అతని నతిక్రమింపఁజాలక పోతిని.

అఱవము నాకు కొంచెము బాగుగనే వచ్చెను. గురువు లేఁడు. అయినను గురువక్కఱ లేనంత చక్కఁగా ఆ తమిళశిక్ష వ్రాయఁబడెను.

ఇండియాకు వచ్చు పిమ్మట అఱవము లెస్స చదువఁదలఁచితిగాని అశక్యమాయెను. ౧౯౧౩ సంవత్సరమున కిటీవలి కాలమున నేనేమి వ్యాసంగముచేసినను చెఱసాలలందే. అఱవము దక్షిణ-ఆఫ్రికా చెఱసాలలోను, ఊరుదు యరవాడ చెఱలోను అభ్యసించితిని. అయినను అఱవము మాటాడుటమాత్రము నా కభ్యాసము కాలేదు. చదువవచ్చిన కొంచెమువాడుక లేమితప్పిపోవుచున్నది. ఇందుకువగచుచున్నాను. దక్షిణ-ఆఫ్రికాయందలి మదరాసుసోదరులకు నేననినచో ప్రాణము. నాకు వీరెల్లపుడు గుర్తువత్తురు. ఎచట నేని అఱవవాడుగాని, తెలుఁగు వాఁడుగాని కానిపించినచో వారి పూనిక, శ్రద్ధ, స్వార్థత్యాగము గుర్తు రాకమానవు. వారందఱు నిరక్షరులు. వారి స్త్రీలును అట్టివారే. దక్షిణ ఆఫ్రికాలో పోరు నిరక్షరులది. అక్షరము తెలుఁగని యోధులే అందు పోరాడిరి. ఆ పోరు బీదలకొఱకు. పోరినదియు పూర్తిగా బీదవారే.

అమాయికులును, యోగ్యులును అగు ఆభారతీయుల చిత్తము చూఱగొన నాకు భాషాభేదము బాధకముకాలేదు. వారికి హిందూస్తానియు, ఇంగ్లీషును తప్పులు తప్పులుగా వచ్చును. కావున మాపని జరుగుటకు అడ్డులేకపోయెను. కాని వారి ప్రేమకు బదులుగా నే నఱవము అభ్యసింపఁ దలఁచితిని. అఱవము కొంత కొంత గ్రహించితిని. ఇండియాలో తెలుఁగు నేర్వఁ బ్రయత్నించితిని. కాని అందు అక్షరాలు దాఁటి పైకిపోలేదు.

ఈరీతిగా అఱవము, ఆంధ్రము చక్కఁగా వచ్చు భాగ్యము లేక పోయెను. 'బహుశా' ఇఁక నేర్వజాలను. కావున ద్రావిడులు హిందూస్తాని అభ్యసింతురని నే నాశ పెట్టుకొనియున్నాను. దక్షిణ-ఆఫ్రికాలోని మదరాసు ద్రావిడులు కొలఁదియో, గొప్పయో, అవశ్యము హిందీ మాటలాడుదురు. దేశభాషాపఠనముచే తమ ఆంగ్లభాషాజ్ఞాన

మునకు బాధకమే కావా యని ఇంగ్లీషు వచ్చినవారు మాత్రమే దేశ భాషల నాదరింపకున్నారు.

శాఖాచంక్రమణము చేసితిని. సింహావలోకనము చేసి ప్రయాణ గాథను పూరింతును. పోంగోలా స్టీమరు కెప్టెనునుగురించి చెప్పుట తర వాయి. మేము నెచ్చెలుల మైతిమి. అతఁడు ప్లీమత్ సోదర సంప్ర దాయములోనివాఁడు. సముద్రయాన ప్రసంగముకంటె ఆధ్యాత్మిక ప్ర సంగమే మా కెక్కువ. అతఁడు నీతికిని, జ్ఞాన (ధర్మ్మమునకును) భేదము కల్పించును. ఇతని దృష్టిలో బైబిలుబోధ శిశుక్రీడ. భాషాసారళ్య మునుబట్టి దానికి గొప్పఁదనము. బాలకులుగాని, స్త్రీలుగాని, పురుషు లుగాని జీససునందును, అతని బలిదానమునందును విశ్వాసముంచుచో వారి పాపము నశించిపోవును. ఇతని పరిచయము ప్రిటోరియాలోని ప్లీమత్ సోదరుని గుర్తు తెచ్చెను. నీతియెడ విధినిషేధములుగల యేమత మైనను అతనికి పనికిమాలినమతము. ఇంత చర్చకును గారణము నాశాకా హారము. మాంసమును విశేషించి గోమాంసమును నే నేల తినరాదు? భగవంతుఁడు శాకములవలెనే పశుపక్షులనుగూడ మనుష్యుని ఆనంద మునకును, ఆహారమునకును సృజింపలేదా? ఇట్టి ప్రశ్నలతో మాకు ఆధ్యాత్మిక ప్రసంగములలోనికి దిగక తప్పకపోయెను.

మే మొకరి నొకరము ఒప్పింపఁజాలక పోతిమి. నీతిజ్ఞాన(ధర్మ) ములు రెండును ఒకటియే యని నా దృఢవాదము. ఇందులకు భిన్న ముగ అతని దృఢవాదము.

ఇటులు ఇరువదినాలుగు నాళ్లకు ఈ ఆనందయాత్ర పూర్తి యాయెను. హుగ్లినదీ సౌందర్య మాలోకించుచు కలకత్తారేవున ఓడ దిగితిని. నాఁడే బొంబాయికి రైలెక్కితిని.

## ౨౫

## హిందూదేశమున

కలకత్తానుండి బొంబాయికిపోవుదారిలో నడుమ ప్రయాగకలదు. అట రైలు ౪౫ నిమిషము లాఁగును. ఇంతలో పట్నము చూచి వత్తు నను కోరిక పొడమెను. మఱియు మం దొకటి కావలసియుండెను. మందులు అమ్ము 'కెమిస్టు' అర్ధనిద్రాముగ్ధుఁడయి యుండెను. మఱియు జాల నాలస్యమాయెను. నేను మరల స్టేషను చేరుకొనువఱకు బండి బయలుదేఱుచుండెను. ఉత్తముఁడగు ఆస్టేషన్‌మాస్టరు నాకై రైలును ఒకనిమిషమాఁపెను. కాని నా రామి చూచి నా సామాను బండినుండి దింపి యుంచెను.

కెల్నరు హొటలులో ఒకగదినిగొని ఆపట్నమున వెంటనే నా పనిని మొదలిడఁ బూనితిని. ప్రయాగలోని 'పయొనీరు' పత్రికా ఖ్యాతి నేను వినియుంటిని. భారతీయుల కోరికలకు వికటముగా నది వ్రాయు చుండుననియు నాకెఱుక. అప్పుడు 'డాక్టర్ చేజనీగారు' దానికి ఉప సంపాదకులని నా గుర్తు. అన్నిపక్షములవారి సాయమును నాకభిప్రేత మగుటచే ఆయన కొక చీటి వ్రాసితిని. అందు రైలు తప్పిపోవుట వివరించి మఱునాటి బండికి నేను పోవలయుననియు, ఇంతలో తమ దర్శనమున కవకాశము చేయవలయుననియు వ్రాసితిని. మంచిదని వెంటనే ప్రత్యుత్తరము వచ్చెను; నాకు సంతసము హెచ్చెను. ఆ యాంగ్లేయుఁడు నామాటలు వినెను; ఇటులనెను: 'మీరు వ్రాయున దెల్లయు గమనించి నేను నాపత్రికలో టిప్పణి వ్రాయుదును. కాని మీవిధాన

మంతయు నే స్వీకరింపఁజాల. ఏలనఁగా నేటాలులోని తెల్లవారి ఉద్దేశములను, భారతీయుల కోరికలను సాంగముగా నే నెఱుఁగవలదా?'

'మీరు సంగతుల నన్నిటిని చక్కగా చదివి మీపత్రికలో చర్చించినఁ జాలును. న్యాయముతక్క నాకు మఱియొకటివలదు.' అని నేనంటిని.

మిగిలిన సమయము త్రివేణీసంగమ సౌందర్యము చూచుటతోడను, కార్యవిచారముతోడను గడచెను.

పయొనీరు పత్రికాధిపతితోడి యీ యాకస్మిక ప్రసంగమే నేటాలురాష్ట్రమున నాపడిన యాతనలకు బీజారోపణ మాయెను.

అటనుండి బొంబాయిలో దిగకయే రాజకోటకు బోయితిని. దక్షిణ-ఆఫ్రికాలోని స్థితిగతులను గుఱించి ఒకచిన్న పుస్తకము వ్రాయఁబూనితిని. వ్రాయను, ప్రచురింపను నెలపట్టెను. దానిపయిని పచ్చఅట్ట ఉండుటచే అది 'పచ్చపుస్తక' మని వాడుక పడెను. అందు దక్షిణ-ఆఫ్రికాలోని స్థితిగతులనెల్ల చిత్రించితిని. ఉద్దేశపూర్వకముగా తగ్గించి వ్రాసితిని. లోఁగడ వ్రాసిన రెండు కరపత్రములభాషకంటె నిందు సరళమగుభాష నుపయోగించితిని. ఏలయనఁగా కష్టము కొలఁదిదైనను దవ్వులనుండి చూచువానికి కొండంతగాఁ గానిపించును.

దీనికి పదివేలప్రతులు తీయించితిని. హిందూదేశములోని అన్ని పత్రికలకును, సకలపక్షముల నాయకులకును బంపితిని. అందఱికంటె మునుముందు పయొనీరు పత్రికాధిపతి సంపాదకవ్యాసములలో దీనిగూర్చి చర్చించెను. ఆవ్యాస సారాంశము 'రూటరు'మారిఫత్తున సీమకు వెళ్లెను. మఱియు అటనుండి ఈసారాంశముయొక్క సారాంశము నేటాలు వెళ్లెను. ఈతంతి అచ్చులో మూఁడుబంతులకన్న నెక్కువకాదు.

నేటాలులోని హైందవుల బాధలగురించి నాఁవ్రాసిన వ్యాసమున కది కొలఁది సంస్కరణము. అందలివి నాశబ్దములు కావు. ఈవార్త నేటాలులో ఎంతపనిచేసెనో తరువాత గ్రహింపఁగలరు. పేరుపడిన పత్రికలలో నెల్ల మెల్ల మెల్లగా దీనిమీఁద టీకలు, టిప్పణులు బయలుదేఱెను.

ఈ పుస్తకముల కన్నిటికి కాకితములు చుట్టి తపాలుకు పంప దుస్సాధ్యము; పైఁగా అమిత ధనవ్యయకరము. దాన నొకటి కనిపట్టితిని; చుట్టుప్రక్కల పిల్లల బిలిచితిని. బడిలేని ప్రొద్దుటిపూఁటలు నాకు సాయము చేయవేఁడితిని. వారు కులాసాగా అంగీకరించిరి. వారిసాయమునకు బదులు ముద్రకొట్టిన పోస్టుబిళ్లలును, ఆశీర్వాదములను నేనిత్తునంటిని. పిల్లలాడుకొనుచు పాడుకొనుచు ఆపని ముగించిరి. చిన్న చిన్న పిల్లలను స్వయంసేవకులుగా చేయుట నాకిది ప్రథమానుభవము. ఈ నా బాలమిత్రులలో ఇరువురు నేఁడు నాతోపాటు పనిచేయుచున్నారు.

ఈరోజులలో బొంబాయిలో విపరీతముగా ప్లేగు వ్యాపించెను. ఎటుచూచినను గగ్గోలు. రాజకోటలోఁగూడ నిది ప్రవేశించునని భయము పుట్టెను. ఆరోగ్యశాఖలో నేను మంచి పనివాఁడనని నా తలఁపు. నేను స్వచ్ఛందసేవ చేయుదునని సర్కారుకు విన్నవించుకొంటిని. వారియ్యకొని నన్ను వ్యాధి పరీక్షాసంఘములో ఒక సభ్యుని జేసిరి. పాకీదొడ్లు పరిశుభ్రముగా నుంపవలయునని నేను నొక్కి చెప్పితిని. సంఘము ప్రతివీథిలోని పాకీదొడ్లను పరీక్షింప నిశ్చయించెను. బీదవారు తమ పాకీదొడ్లు పరీక్షించుటకు ప్రతికూలముగా లేరు. ఇంతియకాక మేము సూచించిన సంస్కరణముల నన్నిటిని జేసిరి. మఱి భాగ్యశాలురమాట! మేము వారిదొడ్లు పరీక్షింప వెళ్లఁగా వారొప్పుకొనలేదు. ఇఁక సంస్కరణము మాట యెట్టులు

సాగును? ధనికుల పాకీదొడ్లు 'పాడుపాడు' అని అనుభూతమైనది. చీకటి కోణము; తేమ యూట; పాడుకంపు; కూర్చుండుచోట లుక లుకలాడు పురుగులు. ఆరోజు జీవిత మంతటిలో నరక మనిపించెను. మేము చెప్పిన సంస్కారణములు కడు తేలిక. మలము నేలపయి పడకుండ బొక్కెన లుంచుటయు, నేలపైబడి తేమ పుట్టింపకుండునట్లు మూత్రమును బొక్కెనలలోనే విసర్జించుటయు పాకీదొడ్లకును బయటిగోడలకును నడుమనుండు కట్టడములను కూల్పించి, గాలి వెలుగులు తగులునట్లు చేసి పాకీవాండ్రు సరిగా శుభ్రపఱచుటకు వీలు కలుగజేయుటయు. భాగ్యవంతు లీచివరి సంస్కారమునకు అనేక బాధకములు చెప్పిరి. పలువురు దీనిని కొనసాగింప లేదు.

సంఘము చండాలవాటికనుగూడ జూడవలయును. కాని ఒక సభ్యుడుమాత్రమే నాతో వచ్చుటకు సిద్ధుడాయెను. మాలవాడకు వెళ్లుటయును, అందును అచటి పాకీదొడ్లు పరీక్షించుటయును వారికి అభూతపూర్వముగను, అత్యాశ్చర్యముగను ఉండెను. మాలవాడకు వెళ్లుట నాకదియ మొదటిసారి. వారియిండ్లు చూచి నే నాశ్చర్యపడితిని. వారు మమ్ముజూచి ఆశ్చర్య చకితులయిరి. 'మీ పాకీదొడ్లు చూడ వచ్చితిమి' అని నేనంటిని.

'మాకేమిటి పాకీదొడ్లేమిటి? మేము బయళ్లకు పోదుము. మీ వంటి గొప్పవారికి పాకీదొడ్లు.'

'మేము మీయిండ్లు చూడవచ్చునా?'

'అయ్యా, అవశ్యము చూడవచ్చును. మీ కేటి యడ్డు? మీ యిచ్చవచ్చిన చో టెల్లయును జూడుడు. అయ్యా, మావియు ఒక యిండ్లేనా? కలుగులు!'

నేను లోనికిఁ జని ఇండ్లు ముంగిళ్లు అంతయుఁ జూచి ఆనందించితిని. ఇండ్లెల్ల గోమయ లిప్తములు; ముంగిళ్లు శుద్ధములు; ఉన్న కుండలు, చట్లు క్షాళితములై నిగనిగలాడుచుండెను.

ఈ ప్రదేశములలో ప్లేగు భయము లేదు.

ఒక పాకీదొడ్డిని వర్ణింపక విడువజాలను. అది యొక భాగ్యశాలిది. ప్రతిగదికిని తూములు ఉన్నవి. నీరద్వారములు, మూత్రద్వారములు నవియే. కావున ఇల్లంతయు చెడుగవులు కంపు. మఱియొక యింట మేడమీఁద పడకగది, దాని కొక తూము. మలమూత్రములకు అదియే ద్వారము. ఆ తూమునుండి నేలకు ఒక గొట్టము. అక్కడ నిల్చిచో ముక్కు పగిలిపోవును. ఆయింటివా రచట నెటులు నిద్రించుచున్నారో పాఠకులే ఊహించుకొందురుగాక!

సంఘము వైష్ణవాలయముగూడఁ జూడఁజనెను. అందలి పెద్ద పూజారికిని, గాంధీకుటుంబమునకును చాల నెయ్యము. అతఁడు కోవెల యెల్లఁ జూపను, సంస్కారములు చేసికొనను అంగీకరించెను. ఆదేవళమున అతఁడుకూడ ఎన్నఁడు జూచి యెఱుఁగని ఒక ప్రదేశము కలదు. పుల్లాకులు ఊడ్చిన పెంట యంతయు నచట నిలువ; కాకులకు, గ్రద్దలకు నది యునికి; పాకీదొడ్లు పాడుగానున్నవని చెప్ప నక్కఱలేదు. రాజకోటలో నే నెంతో కాలము ఉండకపోవుటవలన అతఁ డెంత బాగుచేయించెనో నాకెఱుక లేదు.

దేవళపు దుర్గంధముజూచి దుఃఖితుఁడ నయితిని. మనము దేవళము పవిత్రమని భావింతుము. అచట ఆరోగ్య నియమములను పరిపాలింపవలయు నని ఆశింతుము. స్మృతికర్తలు బాహ్యాభ్యంతరశౌచము అత్యావశ్యకమని రాపాడుట ఆసమయమున నా కెఱుక కావలదా.

## ౨౬

## రాజభక్తి, శుశ్రూష

శుద్ధమయిన రాజభక్తి-అనుభవము నాకెంత కలదో మఱియొకనికి అంత కలదనుకొనను. సత్యమునెడ నాకుఁగల స్వాభావికమగు ప్రేమయే ఈ రాజభక్తికి మూలమని యిపు డనుకొనుచున్నాను. ఇట్టి రాజభక్తిగాని, మఱియే సుగుణము గాని నటించుట ఇంతవరకు నాకు చేతఁగాదు. నేటాలులో నేఁ జను ప్రతిసభయందును 'గాడ్ సేవ్ ది కింగ్' అను పాటపాడుకొని పోవుచుందురు. వారితో కలిసి పాడుట విధియని నాయూహ. బ్రిటిష్ పరిపాలనమునందు దోషములు నాకు తెలియక పోలేదు. అయినను మొత్తముమీఁద ఈపాట పాడుట మంచిదని నాయుహ. ఆరోజులలో బ్రిటిష్ రాజ్యము యొక్కయు, బ్రిటిష్ పరిపాలకుల యొక్కయు నీతి మొత్తముమీఁద సుఖకరమని అనుకొంటిని.

దక్షిణ-ఆఫ్రికాయందలి వర్ణద్వేషము బ్రిటిషువారి అసలు సంప్రదాయము కా దనుకొంటిని. అది కాలికము, స్థానికము అని అనుకొంటిని. దాన రాజభక్తిలో తెల్లవారిని మించితిని. 'గాడ్ సేవ్ ది కింగ్' అనుపాటకు లయ నేర్చితిని. అందఱును లేచి పాడునపుడు నేనును కలిపి పాడుచుండువాఁడను.

రాజభక్తి కావశ్యకమగు ప్రతిసమయమునను నేను నిరాడంబరముగా రాజభక్తిని ప్రకటించుచుంటిని.

## ౨౬. రాజభక్తి, శుశ్రూష

నా జీవితములో రాజభక్తి నెన్నఁడును అమ్ముకొనలేదు. దానిచే నెన్నడును స్వప్రయోజనము సాధింపఁ దలఁపలేదు. రాజభక్తి ఒకవిధి యని నా భావము. దానివలన ప్రతిఫల మెన్నఁడును నే తలపెట్టలేదు.

నే నిండియాకు వచ్చినరోజులలో విక్టోరియారాణి 'డైమండ్ జూబిలీ' మహోత్సవమునకు ఆరంభము. అందులకు రాజకోటలో నియతమైన ఒకసంఘమునఁ జేర నాకు పిలుపు వచ్చెను. నేనియ్యకొంటిని. ఆయుత్సవము చూడ పై బొటాగను; చాల మోసము. దీనితో వ్యథ కలిగెను. 'ఈ సంఘములో ఉండవలెనా మానవలెనా?' అని శంక కలిగెను. తుదకు ఇటులు తోఁచెను: 'నీపని నీవుచేసికొని తృప్తి సనుము.'

ఆవేడుకలో చెట్లునాటుట యొకపని. పలువురు డంబమునకును, ఉద్యోగుల మెప్పునకును నాటుచుండిరని తెలిసికొంటిని. 'చెట్లు నాటు టొకవిధికాదు. ఆపనికిబదులు మఱొండేదేని చేయనగును' అని వారికి నచ్చఁజెప్పఁ బోయితిని. 'మనస్సునాటి చెట్లు నాటవలయు; లేదా నాటనే వలదు.' నా యీమాటలకు వారునవ్వుకొనిరనుకొంటిని. నా పాలఁబడిన మొక్కను మనస్సుతో నాటి నీరుపోసి మెలకువతో పెంచినటులు గుర్తు.

మాయింటి పిల్లలకుఁగూడ 'గాడ్ సేవ్ ది కింగ్' అను పాట చెప్పితిని. రాజకోటలోని ట్రెయినింగు కళాశాలా విద్యార్థులకుఁ గూడ ఈపాటను జెప్పినటులు గుర్తుకలదుకాని అది జూబిలీలోనో, ఎడ్వర్డు పట్టాభిషేక సమయముననో సరిగా చెప్పఁజాలను. పిదప పిదప నీపాట నాకు విరోధమాయెను. నామనస్సున అహింసావిమర్శ మధికమయినకొలఁది నేను నావాఙ్మనసములపై కడుజాగరూకతవహించితిని.

'రాజశత్రువులఁ జంపుము; ఆ మోసగాండ్ర మోసములఁ ద్రుంపుము' (ఆపాటలో ముఖ్యము)అను ఈవాక్యములు నాకు గిట్టలేదు. నామిత్రుఁడు డాక్టరు బూథ్‌గారికి నా యీ సంశయమును మనవి చేసితిని. ఆయనయు ఇయ్యాకొని అహింసావాదియైన యెవ్వనికిని, ఈపాట పాడుట కష్టమనెను. ఈపాటలో శత్రువులని ఊహింపఁబడినవారు మోసగాండ్రని యెటు లనఁగలుగుదుము? శత్రువులయినంత మాత్ర తప్పంతయు వారిదేనా? పరమేశ్వరునికడ న్యాయమును మనకు భిక్షింపనొప్పు. డాక్టరు బూథుగారు నాపూర్వపక్షము సిద్ధాంతించిరి. వారి సమాజమున దీనికి బదులు మఱియొకపాట నల్లిరి. వారిని గుఱించి ముందు వివరింతును

రాజభక్తితోపాటు రోగుల కుపచారము చేయుట నాకల వాటైపోయెను. నెయ్యురైనను, క్రొత్తలైనను వారి కుపచరించుట నాకెంతయో ప్రీతి.

రాజకోటలో దక్షిణ-ఆఫ్రికాను గుఱించి కరపత్రము వ్రాయుచుండుకాలమున ఒకసారి బొంబాయికి పోవలసివచ్చెను. పెద్ద పెద్ద నగరములలో సభ లేర్పాటుచేసి యీవిషయమున ప్రజాభిప్రాయమును పెంపొందింపవలయునని నా యభీప్సితము. అందులకు ముందు బొంబాయి నిర్ణీతము. ముని ముందు జస్టి రేనడేగారిని సందర్శించితిని. వారు నాచెప్పినదెల్ల వినిరి. విని ఫిరోజిషా మెహతా గారిని జూడుమనిరి. పిదప జస్టి బదురుద్దీన్ త్యైయబ్జిగారిని జూచితిని. వారు అట్లే చెప్పి మఱియు నిటులనిరి: 'రేనడేగారును, నేనును ఏమియు చేయఁజాలము. మాస్థితి నీకు తెలియును. ప్రజావ్యవహారములలో మేము చొరరాదు. కాని నీపనికి మే మనుకూలురము. ఇందు నీకు సాయము చేయఁగలవారు ఫిరోజిషా మెహతాగారు ఒక్కరే.'

## ౨౬. రాజభక్తి, శుశ్రూష

నేను తప్పక ఫిరోజిషా మెహతాగారి దర్శనముచేయఁ దలఁచి యుంటిని. ఈ పెద్దలు ఆయన సాయము పొందుమనుటవలన మెహతాగారికి ప్రజలలో ఎట్టిపలుకుబడి యున్నదియో నాకు లెస్స తెలియ నాయెను.

పిదప నేను వారికడ కేఁగితిని. నేనాయనను గాంచి మిఱుమిట్లుగొన సంసిద్ధుఁడ నయితిని. ఆయన పేరునకు అంటింపఁబడిన పెద్దపెద్ద విశేషణములను వినియుంటిని. 'బొంబాయి సింగమును', 'కిరీటములేని బొంబాయి ఫామనాను' చూడవలయునని తెలియును. కాని ఆఫామసా నాకు భయంకరుఁడుగా లేఁడు; వత్సలుడగు తండ్రి ఎదిగిన కుమారుని ఆదరించునటులు నన్నాదరించెను. మేమిరువురము వారిగదిలో కూర్చుంటిమి. మిత్రులును, అనుయాయులును ఆయన చుట్టును బలిసియుండిరి. వారిలో డి. ఇ. వాఛాగారొకరు; కామాగారొకరు. అయ్యిరువురకు నే నాలిఁగింపఁబడితిని. లోఁగడ నాకు వాఛాగారినిగూర్చి తెలియును. అతఁడు మెహతాగారికి కుడిభుజము. అతఁడు మంచి లెక్కగాఁడని వీరచందు గాంధి నాకుఁ జెప్పియుండెను. 'మన మిద్దఱము కలిసికొని మాటలాడవలయును' అని వాఛాగారనిరి.

ఇదియంతయు రెండు నిమిషములు. మెహతాగారు నామాటలన్నియు శ్రద్ధగా వినిరి. నేను రేనడే త్యైయబ్జీలను చూచితినని చెప్పితిని. మెహతాగారు: 'గాంధీ! నీపనికి ముం దొకసభ జరుగవలయును. నీపనికి నేను తప్పక మద్దతు చేయఁగలను.' అని తనకార్యదర్శి మున్షీగారినిఁజూచి సభాదినమునిర్ణయింపుమనెను. సభాదినము నిర్ణీతమాయెను. 'సభ రేపుజరుగుననఁగా నా కొకసారి కానిపింపుము' మని మెహతాగారు నన్ను వీడుకొలిపిరి. ఈసంభాషణముతో నాభయము పోయెను. సంతసముతో ఇంటి కేఁగితిని.

మాబావ బొంబాయిలో నుండెను. అతని జూడఁబోతిని. అతఁడు మంచము పట్టియుండెను. అతఁడు కలవాఁడు కాఁడు. నాసోదరివలన ఉపచారము జరుగుట కష్టముగా నుండెను. నాతో రాజకోటకు రమ్మంటిని. అతఁడియ్యకొనెను. మాసోదరిని, అతనిని దీసికొని రాజకోట కేఁగితిని. వ్యాధి ఎక్కువాయెను. అతని నాగదిలో నుంచికొంటిని. రేయుంబవలు ఉపచరించుచుంటిని. రేలు మేలుకొనియుండనాయెను. నేనిటు లతనికుపచరించుచునే దక్షిణ-ఆఫ్రికాను గుఱించి వ్రాసికొనుచుంటిని. తుదకు మాబావ స్వర్గస్థుఁడాయెను. అయినను అంత్యకాలమున అతనికి ఉపచారముచేయు నవకాశము దొరుకుటవలన నాకు మనస్తాపము కొంచెము తగ్గెను.

ఈవిధముగా రోగుల కుపచరించు కోరిక పోను పోను ఎక్కువాయెను. దానిచే నొకొక్కతఱి నాపనికిఁగూడ ప్రాలుమాలెడివాఁడను. మఱియు ఒకొక్కపుడు నాభార్యనే కాక యింటివారందఱను అందులకు ఏర్పాటు చేయుచుంటిని.

ఈవృత్తిని నేను కోరికయని యందును. ఏలనఁగా: ఏమంచిపనియైనను సమకాలమున ఉపయోగకరమగునేని తత్క్షణము ఆనందదాయకమని నాయనుభవము. డంభముచేఁగాని, పరభీతిచేఁ గాని చేయఁబో అది వాని నడఁచును. అట్టివారు మాసిపోవుదురు. ఏసేవ చిత్తానందము కలుగఁజేయదో అది సేవకునకు ప్రయోజనకారి గాదు; సేవ్యునిఁగూడ సుఖపెట్టదు. ఏ సేవచే చిత్తమానందితమగునో దాని ముందు ఈ భోగములు, ధనోపార్జనములు మొదలగు నవన్నియు తుచ్ఛములని తోఁచును.

# ౨౭

## బొంబాయి సభ

మా బావ శరీరము విడిచిన మఱునాఁడే నేను బొంబాయి సభకు పోవలసివచ్చెను. ఉపన్యాసవిషయమును సిద్ధము చేయఁదగినంత వ్యవధి లేదు. రేయుంబవలు నిదుర లేమి నాకు క్లేశ మధికముగ నుండెను; గొంతు బొంగురుపోయెను. ఎటులో ఒకటులు ఈశ్వరుఁడే నిర్వహించుకొని పోవునని నేను బొంబాయి కరిగితిని. ఉపన్యాసము వ్రాసికొని పోవలయునని కలలో నేని తలపోయ లేదు.

సర్ ఫిరోజిషా మెహతాగారి యాజ్ఞానుసారము సభాపూర్వ దివసమున సాయంకాల మైదుగంటలకు ఆఫీసులో వారి దర్శనము చేసితిని.

'గాంధీ! నీ యుపన్యాసము వ్రాసి సిద్ధముచేసితివా?'

'లేదు. ఆశువుగా ఉపన్యసింపఁ దలఁచితి'నని బెదురుచు బెదురుచు బదులు పలికితిని.

'బొంబాయిలో ఇది చెల్లదు. పత్రికలకును, దేశాంతరములకును ఉపన్యాస విషయములు పంపువారు వారి యిష్టానుసారము మార్చి, మార్చి పంపుచుండుదురు. మన సభ కేమేని ప్రయోజనము సిద్ధింపవలయుననిన ఉపన్యాసము 'లిఖితపూర్వకముగా' ఉండవలయును. మఱియు దానిని తెలవాఱులోపల అచ్చొత్తింపవలయును. అయితే ఉపన్యాస మీరాత్రికి రాత్రి సిద్ధముకాదా!'

నేను కంగారు పడితిని. పిదప 'చిత్త' మంటిని.

'వ్రాఁతప్రతికొఱకు మున్షీగారిని మీకడ కెన్నిగంటలకుఁ బంప మందురు?' అని బొంబాయిసింహ మనెను.

'రాత్రి పదికొండు గంటల' కని నేనంటిని.

మెహతాగారు మున్షీగారితో ఆవేళకు నావద్దకువచ్చి వ్రాఁతప్రతిని పుచ్చుకొని రాత్రియే ముద్రింపుమని చెప్పి నాకు అనుజ్ఞనిచ్చిరి.

మఱునాఁటి సభకేఁగితిని. సర్ ఫిరోజిషాగారు 'ఉపన్యాసము వ్రాసి చదువు' మని సలహా ఇచ్చుటలో ఎంత దూరాలోచనము కలదో అపుడు తెలిసికొంటిని. ఫ్రాంజీ కావస్‌జీ ఇన్‌స్టిట్యూట్ హాలులో సభ. ఫిరోజిషా మెహతాగారి ఉపన్యాస మయినచో నిలుచుటకేని తావుదొరకదని వినియుంటిని. వీరి యుపన్యాసమునినచో విద్యార్థులు చెవులు కోసికొందురు.

అంత నిండోలగము చూచుట నాకదియే తొలిమాటు. నాధ్వని యేరికిని వినిపించుట లేదు. వడఁకుచు ఎడఁకుచు గాత్రము పెద్దచేసితిని. ఫిరోజిషాగారు మాటిమాటికి 'బిగ్గఱగా', 'ఇంకను బిగ్గఱగా' అని ప్రోత్సహించుచుండిరి. వారు నన్నెంతెంత ప్రోత్సహించుచుండిరో నాధ్వని యంతంత క్రుంగి జూలారుచుండెను.

ఇంతలో నా ప్రాఁత చెలికాడు కేశవరావు దేశపాండేగారు వచ్చి అడ్డుపడిరి. నా యుపన్యాసము వారిచేతఁ బెట్టితిని. అతని కంఠ మంతఁ సభకుఁ దగినది కాని, సభ్యులెవరు విందురు? 'వాఛా, వాఛా' యను కేకలు సభలో గింగురుమనెను. పిదప వాఛాగారు లేచిరి. దేశపాండ్యునిచేతినుండి కాకితము లందుకొని వారు నాపని పూరించిరి.

సభ నిశ్శబ్దమాయెను. సభ్యు లతిశ్రద్ధవహించి వినిరి. ప్రకరణము నను సరించి 'సిగ్గుసిగ్గ'ను మాటలును, కరతాళధ్వనులును ఉప్పతిల్లెను. నాకు సంతస మెసఁగెను.

సర్ ఫిరోజిషాగారు నాయుపన్యాసమును ప్రశంసించిరి. నాకు గంగాస్నానము చేసినటు లుండెను.

దీనిచే దేశపాండేగారును మఱియొక పారసీక గృహస్థును నాకు నిండుసాయముచేయఁ బూనిరి. ఆపారసీకమిత్రుడు నేఁడు సర్కారువారి పెద్ద ఉద్యోగి. కావున వారి పేరునుడువఁ గొంకుచు న్నాను. ఈయిరువురును 'దక్షిణ-ఆఫ్రికాకు వత్తు'మని మాట యిచ్చిరి. కాని అపుడు స్మాల్ కాజ్ కోర్టు జడ్జియగు సి. యం. ఖర సేట్జీగారు వీరిమాటను బూటకముచేసిరి. దీనికి కారణ మొకపార సీకసతి. అతఁడామెను పెండ్లాడునా దక్షిణ-ఆఫ్రికాకే బయలు దే లునా? తుదకు పెండ్లాడుటయే మంచిదని అతనికిఁ దోఁచెను. ఈ మిత్రుని వాగ్దానభంగమునకు సేటాలులోని పారసీరుస్తుంజీ గారు ప్రాయశ్చిత్తము కావించుకొనిరి. నేఁడు పలువురు పారసీకసతులు ఖద్దరు ప్రచారమున పాలుగొని నాటి వాగ్దానభంగమునకు తోడయిన ఆయమ దోసఁగునకు ప్రాయశ్చిత్తము చేసికొనుచున్నారు. కనుక నే నాదంపతుల సంతోషపూర్వకముగా మన్నించితిని. ఇఁక దేశ పాండేగారికి పెండ్లియాశ లేదు. కాని యతఁడును రాజాలకపోయెను. నేఁ డతఁడును అందులకు ప్రాయశ్చిత్తి చేసికొనుచున్నాఁడు. నేను దక్షిణ-ఆఫ్రికాకు మరలు తఱి జాంజిబారులో ఒక తైయబ్జీ సంబంధుఁడు కానిపించెను. అతఁడును నాకు సాయపడెద ననెను. కాని అటులు చేయలేదు. అందులకు నేఁడు అబ్బాస్ తైయబ్జీగారు ప్రాయశ్చిత్తము నందుచున్నారు. ఈ రీతిగా బారిష్టరు మిత్రులను దక్షిణ-ఆఫ్రికాకు

తీసికొని పోవలయునని నా యొనరించిన మూఁడు యత్నములును ముక్కచెక్కలాయెను.

ఈ సందర్భమున పేస్తనజీ పాదుషాగారు నాకు బాగుగ గుర్తు తగులుచున్నారు. నేను సీమలోనున్నది మొదలు మా కిరువురకు మంచి మైత్రి. మొదట మేము లండనులో ఒక శాకాహారాగారమున కలిసికొంటిమి. ఇతని తమ్ముఁడు బరజోరజీ పాదుషాగారిని నే నెఱుఁగుదును. పిచ్చివాఁడని అతనికి పేరు పడిపోయెను. మే మెన్నఁడు నొకచో కూడలేదు. మిత్రమండలి ఇతనికి *చక్రమని పేరొసఁగెను.

గుర్రముల మొగ మెవరు చూతురని జాలిగొని ఇతఁడు ట్రాము బండి నెక్కమానెను. శతావధానికుండు ధారణాపటిమ యున్నను ఏడిగ్రీకిని చదువలేదు. అతఁడు స్వయంకృషిచే బుద్ధిలో ఒకవిధమైన స్వాతంత్ర్యము కలుగఁజేసికొనెను. పుట్టినది పారసీకకుల మయ్యును తినునది శాకాహారము. పేస్తనజీకి పెద్దపెద్ద డిగ్రీలున్నను ఇట్టి పేరు లేదు. కాని ఇతని బుద్ధివైభవము ప్రఖ్యాతము. సీమలోఁగూడ పెద్ద ప్రఖ్యాతి. మా యిరువురి మైత్రికి మూలము శాకాహారము. బుద్ధివైభవమున వంతు పెట్టుకొనుట నాతరముగాదు.

ఈతని క్రమ్మఱ బొంబాయిలో వెదకి కనుఁగొంటిని. పేస్తనజీగారు హైకోర్టులో ప్రోథోనోటరీయుద్యోగమున నుండెను. అప్పుడితఁడు ఒకగొప్ప గుజరాతీ నిఘంటువు పని చేయుచుండెను. దక్షిణ–ఆఫ్రికాలోని ఉద్యమమునకు సాయపడుటకు నేను వేఁడని మిత్రుఁడు లేఁడు. పేస్తనజీపాదుషా తానెట్టిసాయమును చేయఁజాలనని చెప్పుటయేకాక నీవైనను మరల దక్షిణ–ఆఫ్రికాకు వెళ్లవలదని సలహా ఇచ్చెను. అతఁడు

* చక్రము రివ్వున తిరుగును. ఏది తలపెట్టినను ఇతఁడును అంతియ కాఁగా ఇతఁడొక వింత మానిసి. ఇతని ఉద్దేశము లన్నియు వింత కలిగించునవే. —అనువాదకుఁడు.

మఱియు నిట్లనెను “నేను నీకు సాయము చేయఁజాలను. నీ వైనను మరల దక్షిణ-ఆఫ్రికాకు పోవుట మంచిది కాదందును. మన దేశమున మనము చేయఁదగిన పని యేమంత కఱవై పోయెనా? మనము మాతృభాషకు చేయవలసినపని కొంచెమా? నే నిపుడు విజ్ఞానశాస్త్రమునకు పరిభాషలను వెదకుచున్నాను. మనము చేయవలసిన క్షేత్రమున నిది యెంత? లాడి తేఁడు. దేశదారిద్ర్యము చూడుము! దక్షిణ-ఆఫ్రికాలో భారతీయులు చిక్కులపాలై యున్నారనుట నిక్కువమే. కాని నీవంటి వాఁ డట్టిదానికి బలియగుట నేనొల్ల. మనము ముందుస్వరాజ్యము సంపాదింతముగాక; పిదప దక్షిణ-ఆఫ్రికాసోదరులకు అలవోకగా మేలు కలుగును. నేను నిన్ను మరలింపఁజాలనని నాకు తెలియును కాని నీవంటివారి నెవ్వరిని నీతోపాటు తీసికొనిపోవుట నాకు సమ్మతము కాదు.”

నా కీయుపదేశము రుచింపలేదు. అయినను ఈ సంభాషణమున అతనిపై నా కాదర మినుమడించెను. అతని దేశప్రేమను, భాషాప్రేమను చూచి ముగ్ధుఁడనయితిని. ఈ ప్రసంగమువలన మా మైత్రి మఱింత దృఢపడెను. ఆయన ఉద్దేశ్యమును నేను తెలిసికొంటిని. కాని నేను దక్షిణ-ఆఫ్రికాలోని ఉద్యమమును మానుకొనుటకు బదులు మఱికొంచె మెక్కువగా పూనుకొంటిని. ఏ దేశభక్తుఁడును దేశసేవలో ఏ యేకదేశమును మఱవఁజాలఁడు. కనుక నే నాముం దీగీతాశ్లోకము కానిపించెడిని.

*శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

పరధర్మమును అనుష్ఠించుటకంటె గుణములేనిదైనను స్వధర్మమునే అనుష్ఠింప లగ్గు. స్వధర్మమున చచ్చినను మేలు. పరధర్మము భయావహము.

* గీత 3 అధ్యా—35

# ౨౫

## పూనాలో

సర్ ఫిరోజిషాగారు నా పనిని తేలిక చేసిరి. నేను బొంబాయి నుండి పూనా వెళ్లితిని. పూనాలో రెండుపక్షము లున్నవని నే నెఱుఁగుదును. నాకు అన్నిపక్షములవారి సాయమును ఆవశ్యకము. లోకమాన్యుని సందర్శించితిని. వా రిట్లనిరి:

'అన్నిపక్షముల సాయము వలయు నను నీ తలఁపు మేలైనది. ప్రకృతవిషయమున ఎవరికిని మతభేద ముండదు. కాని ఇందులకు సభాపతి తటస్థుఁడు కావలయును. తాము ప్రొఫెసర్ భండార్కరుగారి దర్శనము చేయుఁడు. వా రిప్పుడేసభలలోనికిని వచ్చుట మానుకొనిరి. కాని ఇందులకు సమ్మతింతు రనుకొందును. వీరి దర్శనానంతరము పర్యవసాన మే మైనదో నాకు తెలుపుఁడు. నేను తమకు సంపూర్ణముగా సాయముచేయఁ గోరుచున్నాను. తాము ప్రొఫెసర్ గోఖలేగారి దర్శనము చేయుఁడు. నన్నుఁ జూడఁ బని పట్లు నేని తమకు వీలయినపుడెల్ల తప్పక నన్నుఁ జూడవగును.'

లోకమాన్యుని జూచుట నా కదియె మొదలు. వీరు లోకప్రియు లెట్లైరో వెంటనే తెలిసెను.

అటనుండి గోఖలేగారికడకు వెళ్లితిని. వారు ఫెర్గుసన్ కాలేజిలో నుండిరి. నన్ను కడుఁ బ్రేమతోఁ జూచి ఆత్మీయునిగాఁ జేసికొనిరి. వీరితోడను నాకు ప్రథమపరిచయమే. కాని నాకది ప్రథమ పరి

చయము కాని యట్లే యుండెను. ఫిరోజషాగారు హిమాలయము. లోకమాన్యుఁడు సముద్రము. గోఖలే గంగ. ఇందు స్నానము శక్యము, హిమాలయముపై నెక్కుట చిక్కు. సముద్రమున దిగుటభయము, కాని గంగయొడిని ఆడుకొన నగును. దీనిలో నావవేసికొని పోవచ్చును. బడిలో చేర్చుకొనునపుడు పిల్లవానిని పరీక్షించునటులు గోఖలేగారు నన్ను పట్టిపట్టి పరీక్షించిరి. ఎవరెవరి దర్శనము చేయవలయునో, ఎటులు చేయవలయునో ఆవైనమంతయు తెలిపిరి. నాయుపన్యాస మొకసారి చూడఁగోరిరి; కాలేజీనంతయు చూపిరి. 'తమ యిచ్చ వచ్చినపుడు నన్ను చూడవచ్చును. డాక్టర్ భండార్కర్ గారి ప్రత్యుత్తరము నాకు తెలుపుఁ'డని సెలవొసఁగిరి. గోఖలేగారు బ్రతికియున్నంత వట్టు రాజనీతి విషయములలో నా హృదయక్షేత్రము నెంత యాక్రమించిరో దేహపాతముతరువాతఁగూడ అంత ఆక్రమించి యుండిరి. మఱియెవరును అటు లాక్రమింపలేదు.

కొడుకును దండ్రివోలె రామకృష్ణభండార్కరుగారు న న్నాదరించిరి. రెండుజాములవేళ నేను వారికడ కేఁగితిని. శాస్త్రములలో పరిశ్రమచేసిన ఆపండితునకు నే నట్టివేళఁగూడ పనిచేయుట ప్రియమాయెను. తటస్థుఁడైన సభాధ్యక్షుఁడు కావలయునను నా పట్టుదలను విని 'That's it, That's it.' 'అది మంచిది అది మంచి' దనుమాటలు ఆయననోట సహజముగా ప్రవహించెను.

మాటయు, మంతియు అయిన పిదప ఆయన యిటు లనెను: 'నేను రాజకీయములలో అడుగిడుట లేదని యెవరినడిగినను జెప్పుదురు. కాని మిమ్ము విముఖులఁ జేయలేను. మీ వాదము న్యాయ్యము; మీ ఉద్యమము స్తుత్యము. మీసభకు నేను రా నవఁజాలను. శ్రీయు

తులు తిలకుగారిని, గోఖలేగారిని, దర్శించితి రది మంచిపని. ఈ యిరు వాగులవారును నన్ను ఆహ్వానించుచో రాఁగలను. సమయనిర్ణయమునకు నన్నడుగఁ బని లేదు. వారి కెప్పు డనుకూలమో నాకును అప్పు డనుకూలమే.' అని నాకు ధన్యవాదములును ఆశీర్వాదములును బలికి సెల విచ్చిరి.

పడిసప్పుడు గాకుండ, ఆడంబరము లేకుండ ఈ విద్వాంసులు, ఈ త్యాగులు సభచేయించి నాకు ప్రోత్సాహ మిచ్చి సెల విచ్చిరి.

నే నటనుండి మదరా సేఁగితిని. మదరాసు సంతోషమత్త మాయెను. బాలసుందరముకథ సభ నాకట్టెను. నా ఉపన్యాసము దీర్ఘము; అంతయు ముద్రితము. సభ ఒక్కొక్క శబ్దమునే మనస్సునకు పట్టించుకొని వినెను. సభాంతమున జనులు పచ్చపుస్తకముకొఱకు విఱుచుకొని పడిరి. మదరాసులో కాఁబట్టునని 'పచ్చపుస్తకము' సంస్కరించి రెండవతూరి పదివేలప్రతులు తీయించితిని. ఇందు చాలవట్టు వేఁడి వేఁడి రొట్టెలవలె ఖర్చు పడెను. కాని పదివేల ప్రతు లక్కఱలేదు. లోకుల ఉత్సాహముమీఁదనే నే నెక్కువ కన్నించితిని. నాయుపన్యాస మింగ్లీషు వచ్చినవారికిఁగదా! వారి కిన్ని ప్రతు లక్కఱలేదు.

మదరాసు స్టాండర్డు పత్రికా సంపాదకులును, స్వర్గీయులు నగు పరమేశ్వరన్ పిళ్లగారు నా కిచట కడు సాయము చేసిరి. వా రీవిషయమును చక్కఁగ చదివిరి. వారు పలుమాఱులు నన్ను తమ ఆఫీసునకు తీసికొని చనిరి; సలహాలు చెప్పిరి. హిందూ పత్రికాధిపతులు జి. సుబ్రహ్మణ్యముగారి దర్శనము చేసితిని. మఱియు డాక్టర్ సుబ్రహ్మణ్యముగారి దర్శనమును చేసితిని. వారి సానుభూతి బడసితిని. మఱి పరమేశ్వరన్‌పిళ్లగారు తమ పత్రికలో నీవిషయమునుగూర్చి నా యిష్టము

చొప్పున వ్రాయుట కంగీకరించిరి. నేనును వారుచేసిన వీలును ఉపయోగించుకొంటిని. సభ పచ్చయప్ప హాలులో జరిగినటులును, డాక్టర్ సుబ్రహ్మణ్యముగారు అధ్యక్షు లయినటులును గుర్తు.

నాసంభావణ మెక్కువ పా లింగ్లీషులోనైనను ఇంటిలోనున్నంతప్రేమ, అంత ఉత్సాహము మదరాసులో కానరాయెను. ప్రేమభేదింపని బంధన మేది?

# ౩౮

## వెంటనే మరలి రమ్ము

మదరాసునుండి కలకత్తాకు వెళ్లితిని. కలకత్తాలో నాకష్టములకు మేరలేకుండెను. అచట గ్రేట్ ఈస్టరన్ హోటలులో దిగితిని. నేనచట నెవరిని యెఱుఁగను. హోటలులో డెయిలీ టెలిగ్రాఫ్ పత్రికాప్రతినిధి మిస్టర్ ఎల్లర్ థార్పుతో పరిచితి కలిగెను. వారి బస బెంగాల్ క్లబ్బులో. వారు నన్నచటికి రమ్మనిరి. అచటి డ్రాయింగ్ రూములో భారతీయులకు ప్రవేశము లేదను సంగతి అప్పుడు వారెఱుఁగరు. అప్పుడే వారికా ప్రతినిషేధస్థితి తెలిసెను. నన్ను వారు తమ గదిలోనికి తీసికొని చనిరి. అచటి తెల్లవారికి నల్లవారిపైఁ గల యీసునకు వారు వగచిరి. నన్నులోనికిఁ గొంపోవఁజాలనందులకు క్షమాపణ వేఁడిరి.

వంగదైవము సురేంద్రనాథ బెనర్జీగారిని దర్శింపవలయును. వారి దర్శనమునకు వెళ్లితిని. అప్పుడు వారిని పలువురు పరివేష్టించియుండిరి. వారిట్లనిరి: 'మీ మాట ఇచట నెవరును వినరని నాభయము. మా పాట్లన్నియు మీరు చూచుచునే యున్నారు. అయినను శక్తికొలఁది అలఁతియో వలఁతియో ప్రయత్నించి చూడవలయును. ఇందులకు మీకు మహారాజుల మద్దతు జరూరు. బ్రిటిష్ ఇండియా అసోసియేషన్ ప్రతినిధిని చూడుఁడు. రాజా సర్ ప్యారీమోహన్ ముకర్జీగారిని, మహారాజా టాగోరుగారిని చూడుఁడు. వీరిరువురును ఉదారులు. సార్వజనికకార్యములలో ఎక్కువ పాలు గొందురు.

నే నీ సజ్జన సందర్శన మొనరించితిని. కాని అచటను నాపప్పుడుక లేదు. ఇరువురు నిటు లనిరి. కలకత్తాలో సభచేయుట సులభసాధ్యము కాదనియు ఏదైనా చేయగలిగితే సురేంద్రనాథబెనర్జీగారే చేయనల యము ననియు చెప్పిరి.'

నాపని కష్టతర మగుచుండెను. అమృతబాజార్ పత్రిక ఆఫీసుకు వెళ్లితిని. అచట నా మాదిన సజ్జనులందఱును నన్నొక దేశ దిమ్మరినిగా తలపోసిరి. వంగవాసి పత్రికాధిపతి ఇంకొక మెట్టెక్కెను. ఒక గంటవఱకు వేచియుండవలసి వచ్చెను. ఆయనతో మాటలాడ వచ్చినవారు పలువురు. వారిని పంపినపిదపఁగూడ కన్నెత్తి యేని నన్ను జూడలేదు. ఒక గంట అటులు వేచివేచి తుదకు నామాట వెళ్లఁబోసికొన నెంచితిని. అపుడు వా రిటు లనిరి: నా కెన్ని పను లున్నవో మీకు కానిపించుటలేదా? మీవంటివా రిచట వేనవేలు. తామిటనుండి వెళ్లిపోవుచో చాల మంచిది. మీ మాట నే వినఁగోరను.' నాకు కొంచెము కినుక వొడమెను గాని సంపాదకుని యవస్థ అర్థము చేసికొంటిని. వంగవాసి ఖ్యాతినిగూడ వినియుంటిని. అక్కడికి వచ్చి పోవు జనప్రవాహమును చూడనే చూచితిని. ఆ వచ్చిపోవు వారం దఱు వీరికి పరిచితులు. వారి పత్రికలకు విషయమును తక్కువ కాదు. ఆదినములలో దక్షిణా ఆఫ్రికాపేరు తెలిసీ తెలియని స్థితిగా నుండెను. ప్రతిరోజు అందఱు వచ్చి తమతమ కష్టములను వీరికి వినిపింతురు. ఎవరికష్టము వారి కెక్కువ కదా! ఆపన్ను లందఱు సంపాదకున కడ్డ ముగా కూరుచుందురు. ఈ యాపన్నుల నందఱను ఎటు లూఱడించుట? మఱియు ఈ యాపన్నులు పత్రికాసంపాదకుని మాటలో నేమో శక్తి కల దనుకొందురు. అయితే ఆఫీసు—గడప దాఁటుచో తనమాట చలామణి కాదని పత్రికాసంపాదకునకే తెలియును.

నేను అధైర్యమును చెందలేదు. ఇతర పత్రికాసంపాదకుల గాంచితిని. నా యలవాటు చొప్పున ఆంగ్లోఇండియన్ పత్రికాసంపాదకులఁ గూడఁ జూచితిని. స్టేట్సుమన్, ఇంగ్లీషుమన్ పత్రికలు రెండును దక్షిణ-ఆఫ్రికా సమాచారము గొప్పదని తెలిసికొనినవి. నేను వారితో చాల ముచ్చటించితిని. నా ముచ్చటించిన విషయమునంతయు వారు ప్రకటించుచుండిరి. ఇంగ్లీషుమన్ పత్రికా సంపాదకుఁడగు సాండర్సుగారు నన్ను తనవానిగా జూచుకొనెను. తన ఆఫీసును, పత్రికను నా వశ మొనరించెను. దక్షిణ-ఆఫ్రికానుగూర్చి ప్రధానవ్యాసములలో నాయిష్టము చొప్పున మార్పుటకును అంగీకరించిరి. వీరికిని నాకును గట్టి స్నేహముకలిసిన దనినచో అత్యుక్తికాదు. వీరు తమ శక్తికొలఁది నాకు సాయపడెదమని మాటయిచ్చిరి. దక్షిణ-ఆఫ్రికా వెళ్లినపిదపఁగూడ ఉత్తరము వ్రాయుమనిరి. నాకు చేతనయిన దంతయు చేయుదుమనిరి. వీరు తమ మాటను తూచాలు తప్పకుండ పరిపాలించిరి. ఆరోగ్యము చెడిపోవునంతవఱకును నాతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచుండిరి. నా జీవితమునఅనుకొనకుండ చేకూఱిన యిట్టి తియ్యనినెయ్యము లనేకములు. నాలో అత్యుక్తి లేకపోవుటయు, సత్యపరాయణతయుండుటయు సాండర్సుగారి ప్రేమకు హేతువు. వీరు నన్ను శల్యపరీక్ష చేసిరి. దక్షిణ-ఆఫ్రికాలోని తెల్లవారిదోషములు ఖండించుటలోను, గుణములు చెప్పుటలోగూడ నేను వెనుకాడలేదని వారి కనుభవ మాయెను.

ప్రతిపక్షికి న్యాయముచేయుటవలన మనము వడిగా న్యాయము పొందగలమని నా యనుభవము చెప్పుచున్నది.

ఇటులు తలఁపని తలంపుగా సాయముచేకూఱఁగా కలకత్తాయందును సభకావింప నాళిపెట్టుకొని యున్నంతలో దర్బానునుండి తంతి

వచ్చెను: 'జనవరిలో పార్లమెంటు సమావేశము; వెంటనే మరలి రమ్ము.'

ఈ కారణమున దక్షిణ-ఆఫ్రికాకు వడిగా వెళ్లవలసియున్నదని పత్రికలలో ప్రకటించి కలకత్తా విడిచితిని. మఱియు 'మొదటి స్టీమరులో నాకు ప్రయాణసౌకర్యము చేయుమని దాదాఅబ్దుల్లాగారి యేజెంటుకు బొంబాయికి తంతి నిచ్చితిని. దాదాఅబ్దుల్లాగారు 'కుర్ లేండ్' అను స్టీమరును కొనిరి. దీనిలో కిరాయి లేకుండ నన్నును, నాసంసారమును దీసికొనిపోవ పట్టుపట్టిరి. నేను ధన్యవాదములతో అంగీకరించి డిసెంబరు మొదట కుర్ లేండులో నాధర్మపత్నిని, నా యిరువురు పిల్లలను స్వర్గీయుఁడగు మా బావగారియొక్క కుమారునిని తీసికొని రెండవ తూరి దక్షిణ-ఆఫ్రికాకు బయలుదేఱితిని. ఈ స్టీమరుతో పాటు 'నాదరీ' యను మఱియొక స్టీమరును దక్షిణ-ఆఫ్రికాకు బయలుదేరెను. దీనికి యేజెంటు దాదాఅబ్దుల్లాగారు. ఈరెండు స్టీమరులలో మొత్తము ఎనమన్నూఱుగురు యాత్రికులుండిరి. అందు సాఁబాలు పైగా ట్రాన్సువాలు పోవువారు.

## రెండవ భాగము

౧

# తుపాను చిహ్నములు

కుటుంబముతో జలయాత్ర చేయుట నా కిదే మొదలు. నడుమ రకపు హిందూకుటుంబములలో బాల్యవివాహములు జరుగుకతన భర్తచదివికొన్న వాఁడుగను, భార్యనిరక్షరకుక్షిగను ఉండునని ఈకథలో పలుమాఱులు చెప్పియుంటిని. భార్యాభర్తల జీవనమున సముద్రమంత అంతర ముండును. భర్త భార్యకు ఉపాధ్యాయుఁడు కావలసి వచ్చును. నేను నాభార్యాపుత్రుల వేషభాషలమీఁద, భోజన భాజనములమీఁద ధ్యాన ముంపవలసినవాఁడ నైతిని. నేను వీరి కునికిని మనికిని, రీతిని నీతిని బోధింపవలసినవాఁడ నైతిని. నాఁటి సంగతులు కొన్ని గుర్తు తెచ్చుకొన్నచో నా కిపుడు నవ్వువచ్చుచున్నది. హిందూపత్ని పతిభక్తియే తన ధర్మమునకు పరాకాష్ఠ యనుకొనును. హిందూపతి పత్నికీశ్వరుఁడ ననుకొనును. ఈ కారణమున భర్త యెటు లాడించిన భార్య అటు లాడవలసి వచ్చును.

మనము నాగరకుల మనిపించుకొనవలయు ననినచో తెల్లవారి ననుకరింపవలసి యుండుననియు, అటు లనుకరించిన యెడలనే మనకు పలుకుబడి యుండుననియు, అది లేనిది దేశారాధనమునకు వీలుండ దనియు నే ననుకొనుచుండెడు వాఁడను.

ఈ కారణమున నాభార్యకును, పిల్లలకును వేషభాషలు నేనే నిర్ణయించితిని. పిల్లలు మొదలగువారిని చూచి లోకులు కాఠియా

వాడు కోటులనిచ్చో ఓర్వనగునా? పారసీకు లందఱికంటె నాగరకులని వాడుక. ఈ కారణమున తెల్లవారివేష మనుకరించుట బాగు కాదని తోఁచఁగనే పారసీవేషము వేసితిమి. నా భార్యకు పారసీపద్ధతి చీర, పిల్లలకు పారసీలకోటు పంట్లము. అందఱకును బూటులు మేజోళ్లు తప్పవు. నా భార్య పిల్లలకును ఈ రెంటిలో నేదియు కొంత కాలమువఱకు ఇష్టము కాలేదు. బూటులు కాళ్లు కఱచును. మేజోళ్ల వలన చెమట; బొటనవ్రేళ్లు బిగదీసికొనిపోవును. ఈ యడ్డంకులకు నాకడ కావలసినన్ని జవాబులు. నా ప్రత్యుత్తరముల ఔచిత్యము కంటె అధికారబల మధికమాయెను. కావున చేయునది లేక నా భార్యయు, పిల్లలును ఈ క్రొత్తవేషములు వేసిరి. అట్టి భావము తోడనే, అట్టి అనిష్టముతోడనే వారు భోజనసమయమున కత్తులను, ఫోర్కులను వాడఁ దొడఁగిరి. నా కీవ్యామోహము పోయినవెంటనే వారు బూటులు, మేజోళ్లు, కత్తులు, ఫోర్కులు విడనాడిరి. మొదట నీ క్రొత్తపద్ధతి నవలంబించు టెంత కష్టమాయెనో అది అలవాటయిన పిదప దానిని విడనాడుటయు అంత కష్టమాయెను. ఈ నాగరకతయను కుబుసమును విడిచివైచిన పిదప 'ఎంత తేలికయైనదిరా' యని అనిపించుచున్నది.

ఈ యోడలో బంధుగులును, పరిచితులును గలరు. నాకు వీరితోడను, డెక్కుమీఁద పయనించు యాత్రికులతోడను బాగుగా పరిచితి కలిగెను. ఈ యోడ కామందు నాకు ఒకవంక క్లయంటు; ఒకవంక మిత్రుఁడు. కావున ఆ యోడలో స్వగృహములో నున్నచందముగనే యుండెను. ఆ యోడలో ఎక్కడికి వెళ్లుటకు నాకిచ్చ వొడమునో అక్కడికి వెళ్లుటకే యిబ్బందియు లేదు.

## ౧ తుపాను చిహ్నములు

ఓడ యేరేవునను ఆఁగక సరాసరి నేటాలు పోవును. కావున ౧౨ దినములే పయనము. మే మింక మూఁడు నాలుగు రోజులకు రేవు పట్టనుండఁగా మఱియొక గొప్పతుపానును సూచించుచు సముద్రమున ఒక గొప్పతుపాను వీవఁ దొడఁగెను. ఈ దక్షిణప్రదేశమున డిసెంబరు వేసఁగి; మఱియు వానలకును తఱి. ఈకారణమున దక్షిణసముద్రమునందు ఈరోజులలో చిన్న పెద్ద తుపానులును, వానలును సాధమును. ఈ తుపాను ఇంత ఎక్కువగను ఇన్ని నాళ్లును ఉండుటవలన యాత్రికులు బెగ్గడిల్లిరి.

అదృశ్యము భవ్యము. ఆపసలో నందఱును ఐక్యమయిరి. భేదబుద్ధి నశించెను. ఒక్క సర్వేశ్వరునే హృదయపూర్వకముగా స్మరింపఁగడఁగిరి. హిందువులు, ముసల్మానులు అందఱునుకలిసి ఈశ్వరుని గుర్తుతెచ్చుకొనఁ దొడఁగిరి. కొందఱు ముడుపులు కట్టుకొనిరి. కెప్టను యాత్రికుల నడుమకు వచ్చి—'ఈ తుపాను పెద్దదైనను ఫరవాలేదు. నేను ఇంతకంటె పెద్దపెద్ద తుపానులు చూచితిని. ఓడగనుక గట్టిదాయెనా బుడింగిమని మునిఁగిపోదు' అని యీరీతిగా ఊఱడించెనుగాని దీనివలన ఎవరికిని ఊఱటకలుగలేదు. ఇప్పుడో ఇఁక కొంచెముసేపటికో యెక్కడి కక్కడికి ఓడ విడివడిపోవు నన్నంతయు, ఇపుడే ఎక్కడోపడియలయి పోవుచున్నదని యనిపించునంతయు విపరీతధ్వనులు వినఁబట్టుచుండెను. ఓడ బోరగిలఁబడి పోవునంతగా అల లూఁగుచుండెను. డెక్కుమీఁద ఉండుమాట చెప్ప నక్కఱలేదు. అందఱి నాలుకలపైని 'ఈశ్వరాధీనము' అనుమాట తక్క మఱొకమాట లేదు.

ఇట్టిస్థితి ఇరువదినాలుఁగు గంట లున్నదనిగుర్తు. తుదకు మబ్బులు విడెను. సూర్యదర్శన మాయెను. 'ఇపుడు తుపాను తొలఁగిపోయె' నని కెప్టెను చెప్పెను.

అందఱి మోములు వికసించెను. అపాయముతోపాటు ఈశ్వర స్మరణమును దూరమైపోయెను. మృత్యుభయము తొలగెను. దానితోపాటు మరల మాయ ఆవరించెను. నమాజులు జరుగుచుండెను. భజనలు చేయఁబడుచుండెను. కాని తుపానుతఱి నున్న ఏకాగ్రత యేది ?

ఈ తుపానుయొక్క భాగ్యమున యాత్రికు లందఱితో నాకు చెలిమి యాయెను. నాకు తుపాను భయము లేదు. ఉన్నను తక్కువలో తక్కువ. నే నిట్టి తుపానులు లోఁగడ చూచియుంటిని. నాకు సముద్ర రోగమును రాదు. కావున నేను యాత్రికులలో నిర్భయముగా తిరుగుచు వారి నోదార్పఁ గలిగితిని. మఱియు కెప్టైను చెప్పు సందేశముల వారి కందించుచుంటిని. ఈ స్నేహబంధము నాకు చాల నుపయోగించె నని తెలియఁగలదు.

ఓడ డిసెంబరు పదునెనిమిదవ తారీఖుననో, పందొమ్మిదవ తారీఖుననో డర్బనురేవున లంగరు వైచెను. నాదరీ యోడయు నాఁడే చేరుకొనెను. కాని నిజముగు తుపానులో చిక్కుకొనుట ముందున్నది.

## ౨

## తుపాను

పదునెనిమిదవ డిసెంబరు కొకనాఁడటో యిటో రెండోడలును లంగరువేసెను. దక్షిణ-ఆఫ్రికా రేవులలో డాక్టరువచ్చి ప్రతి యాత్రికుని పట్టిపట్టి పరీక్షచేయును. దారిలో నెవరికేని ఏదేని అంటు రోగమంటుకొనినచో కొంతకాలము ఓడక్వారంటీను (సంసర్గనిషేధము) లో ఉంపఁబడును. మేము బొంబాయినుండి బయలుదేఱునాఁడు అచట ప్లేగుండెను. దీన మాకును క్వారంటీనుబాధ కలుగునని కొంచెముభయపడితిమి. రేవున లంగరు వయిచినతరువాత ఓడ ప్రప్రథమమున పచ్చజెండా ఎత్తవలెను. డాక్టరుపరీక్షించి చీటి యిచ్చువఱకు పచ్చజెండా ఎగురుచునే యుండవలయును. మఱియు పచ్చజెండాను దింపిన పిదపనే యాత్రికులను గలిసికొనుట కోడమీఁదికి ఇతరులను రానిత్తురు.

ఈనియమముల ననుసరించి మా యోడపయిఁగూడ పచ్చజెండా ఆడుచుండెను డాక్టరు వచ్చెను. పరీక్షించి అయిదు దినములు క్వారంటీను అని ఆజ్ఞయిచ్చెను. ఏలనఁగా ప్లేగు క్రిములు ఇరువది మూఁడు దినములవఱకు ఉండునని వారి యుద్దేశము. మేము బొంబాయినుండి బయలుదేరి పదునెనిమిది దినములాయెఁగాన ఈ యయిదురోజులున్నచో నిరువదిమూఁడు దినములును ముగియును.

కాని మమ్ము క్వారంటీనులో నుంచుటకు హేతువు కేవల మారోగ్యము కాదు. దర్బనులోని తెల్లవారు మమ్ము త్రిప్పి పంపి

వేయుటకు కొన్నాళ్లనుండి పాతాళహోమము చేయుచున్నారు. ఈ యాజ్ఞకు నదియును నొకకారణము.

దాదాఅబ్దుల్లా కంపెనీవారు పట్టణములోని సంగతులను మాకు ఏనాఁటికి ఆనాఁడెఱిఁగించుచుండిరి. తెల్లవారొకనాఁటికంటె మఱియొకనాఁడు పెద్దపెద్దసభలు జరుపుచుండిరి. దాదాఅబ్దుల్లాగారి కొకవంక భయమును, ఒకవంక లాలనమును చూపుచుండిరి. ఈ రెండోడలను మరల త్రిప్పిపంపివేయుచో దాదా అబ్దుల్లాగారికి నష్టపరిహార మిచ్చుటకు సిద్ధముగ నుండిరి. దాదా అబ్దుల్లాగారీ జడుపులకు బెదురువారు కారు. అపుడు భాగస్వాములయిన సేట్ అబ్దుల్ కరీంహాజీఆదంగారు కంపెనీతరఫున వ్యవహర్తలు. ఎంతనష్టము సంభవించినను ఓడలను రేవు పట్టించి యాత్రికులను దింపి తీఱుదునని ఆయన ప్రతిన. ఏనాఁటి వార్త లానాఁడు పూసగ్రుచ్చినటు లాయన నాకెఱిఁగించుచుండెను. స్వర్గీయులగు మనసుఖలాల్ హీరాలాల్ నాజరుగారు నాఁడు నన్ను జూచుటకు భాగ్యవశమున డర్బను వచ్చియుండిరి. వారు చాల చతురులు, వీరులును. లోకులు వీరిసలహాను గైకొనుచుందురు. వీరి వకీలు మిస్టర్ లాటన్. వీరును అంతటివారు. వీరు తెల్లవారి చేఁతలు దూఱిరి. నడచుకొనవలసిన రీతి లోకులకు తెలిపిరి. కేవలము డబ్బు పుచ్చుకొను వకీలువలెఁగాక నిక్కమైన మిత్రునివలె వీరికి సాయపడుచుండిరి.

ఈ రీతిగా డర్బనులో ద్వంద్వయుద్ధ మారంభ మాయెను. ఒకవంక కూటికిలేని నల్లవారును, వీరికి మిత్రులయిన కొలఁదిమంది తెల్లవారును; మఱియొకవంక ధనబలము, బాహుబలము, అక్షరబలము, సంఖ్యాబలమునుకల తెల్లవారును. మఱియు ఇట్టిబలశాలురైన తెల్లవారికి రాజ

బలముమూడలేదు. ఎట్లనగా నేటాలు సర్కారువారు బహిరంగముగా వీరికి తోడుపడిరి. మంత్రివర్గమున ప్రధానులును, కర్తలును, హర్తలును అగు హారీ ఎస్కాంబీగారు సభలో బహిరంగముగా భాగస్వాము లయిరి.

కావున మా క్వారంటీను కేవలము ఆరోగ్యనియమానుసారము కాదు. యాత్రికులనుగాని, ఏజెంటునుగాని ఏదోరీతిని భయపెట్టి మమ్ము వెనుకకు త్రిప్పివేయుటయే ముఖ్యోద్దేశము. ఏజెంటును బెదిరించుట ఆయెను. ఇంక మమ్ము? 'మీరు తిరిగి వెళ్ళని యెడల సముద్రమున ముంచివేయుదుము. తిరిగి వెళ్ళినయెడల మీ ఖర్చులన్నియు ఇచ్చి వైచెదము' అని.

నేను యాత్రికులలో తిరిగి వారికి ధైర్యము చెప్పుచుంటిని. నాదరీలోని యాత్రికులకు గూడ 'ధీరులై యుండుడు' డని వార్తపంపితిని. యాత్రికులు శాంతులయి యుండి ధైర్యము చూపిరి.

యాత్రికుల మనోవినోదమునకు ఓడలో రకరకములయిన ఆటల నేర్పఱిచితిమి. క్రిసిమిసి పండుగ వచ్చెను. నాడు కాప్టెను సెలూను యాత్రికులకు విందు చేసెను. అందు నేనును, నాపిల్లలును ముఖ్యులు. భోజనమైన పిదప ఉపన్యాసావసరము వచ్చెను. నేను పాశ్చాత్య నాగరకతనుగుఱించి ముచ్చటించితిని. అది గంభీరభాషణమున కనుకూల సమయము కాదని నాకు తెలియును. కాని నాకు వేఱువిధముగా మాటాడుట శక్యము కాదు. నేను వినోదముగను, ప్రమోదముగను మాటలాడుచుంటిని గాని నా మనస్సంతయు డర్బనులో జరుగు సంగ్రామమునందుండెను.

ఏలనగా: నేనే ఈ పోరాటమునకు మధ్యబిందువను. నాపై రెండు నేరములు ఉండెను:

౧. నేను భారతదేశములో నేటాలు తెల్లవారి ననుచితముగా నిందించితిని.

మఱియు,

౨. నేను నేటాలును భారతీయులతో నింపఁజూచుచున్నాను. ఇందులకు కురలేండ్, నాదరీ యోడలనిండ ఇంతమందిని తీసికొని వచ్చుచున్నాను.

నాకు నాపూచీ తెలియును. నావలన దాదాఅబ్దుల్లాగారికి గొప్ప అపాయమున్నది. యాత్రికుల ప్రాణము లపాయమున నున్నవి. మఱియు నేను నాపిల్లలను జెల్లలను దెచ్చి అపాయమున నుంచితిని.

నేను నిక్కముగా నిర్దోషిని. నే నెవరిని నేటాలు రమ్మని బులిపింపలేదు. నాదరీలోని యాత్రికుల సంతివఱ కెఱుఁగనే యెఱుఁగను. కురలేండులో ఇద్దఱు ముగ్గురు తక్క మిగిలినవారిలో నూటికొకని పేరును, ఊరును ఎఱుఁగను. లోగడ నేను నేటాలులో చెప్పియుండని అక్షర మొకటేని భారతదేశములో నేటాలు తెల్లవారిని గురించి చెప్పియుండలేదు. మఱియు నేను చెప్పిన ప్రతివిషయమునకు నాకడ వలసినంత సాక్ష్యము కలదు.

ఏసంస్కారమువలన నేటాలు తెల్లవారు పరిణమించిరో, యేసంస్కారమునకు వారు ప్రతినిధులును, పూఁటకాఁపులయిరో ఆ సంస్కారమునుఁగురించి నామనస్సున ఖేదము కలిగెను. నేను దానిని విచారించుచు కూరుచుంటిని. ఈకారణమున దీనినిగుఱించి ఈచిన్నిసభలో మాటాడితిని; శ్రోతలును సహించిరి. నే నే యుద్దేశముతో చెప్పితినో కాప్టెన్ మొదలగువా రాయుద్దేశమును సరిగా గ్రహించిరి. దీనివల్ల వారి జీవితమున నేదేని పరివర్తనము కలిగెనో లేదో నే నెఱుఁగ.

ఈసంభాషణానంతరమున కెప్టెను మొదలగు అధికారులతో పాశ్చాత్య సంస్కారమునుగుఱించి నాకు చాల ప్రసంగము జరిగెను. నేను పాశ్చాత్య సంస్కారము ప్రధానముగా హింసకమంటిని. ప్రాచ్యసంస్కారమహింసక మంటిని. పృచ్ఛకులు నాసిద్ధాంతములపైనిని నాపైనిని కవిసికొనిరి. కెప్టెన్ కాబోలు అడిగెను:

'తెల్లవారు బెదరింపులు కార్యరూపమున సాగించేయెడల మీరు మీ అహింసాసిద్ధాంతము నెటులు పరిపాలింతురు?'

నే నిటు లుత్తర మిచ్చితిని—

'వీరిని క్షమింపను, వీరిపై చర్య జరపకుండను ఉండఁగలధైర్యమును బుద్ధిని ఈశ్వరుఁడు ప్రసాదించునని నా కాశ గలదు. ఇప్పటికిని వీరిపై నాకు కోపము లేదు. వీరి యజ్ఞానము చూచినను, వీరి సంకుచితదృష్టి చూచినను నాకు విచారము కలుగుచున్నది. వారు చేయునదంతయు శుద్ధమనియే వా రెంచుచున్నారని నా తలఁపు. కావున కోపమునకు కారణము లేదు.'

పృచ్ఛకులు నగిరి. వారికి నామాటలపై నమ్మిక లేకుండెఁ బోలు!

ఈ తెఱఁగున దినములు కష్టముగఁ గడచెను. క్వారంటీను యెపుడు తీసివేయుదురో చెప్పినదాఁక తెలియదు. ఆఫీసరు నడుగఁగా నిటు లనెను—'ఈ విషయము నాచేతులనుండి జాఱినది. సరకారు హుకుమీయఁగనే మిమ్ము దింపనగును.'

'మీరు ప్రాణములు దక్కించుకొనఁ దలఁతురేని మాకు లొంగుడు' అని తుట్టతుదకు యాత్రికులకును, నాకును కడపటిమాటగా చెప్పి

పంపిరి. యాత్రికులును, నేనును ఇటులు వ్రాసితిమి: 'నేటాలు రేవులో దిగుటకు మాకు హక్కు ఉన్నది. ఎన్ని అపాయములు వచ్చినను మా హక్కు కాపాడుకొని తీఱుదుము.'

తుదకు ఇరువదిమూఁడుదినములు గడచినపిదప ౧౩ జనవరి నాఁడు ఓడలు రేవులోనికి వచ్చుటకు అనుజ్ఞ యీయబడెను. మఱియు యాత్రికులు దిగవచ్చునని ఆజ్ఞ ప్రకటింపఁబడెను.

# 3

## ఒరగల్లు

ఓడలు రేవులోనికి వచ్చెను. యాత్రికులు దిగిరి. కాని 'గాంధియు వారి సంసారమును చీకటిపడినతరువాత దిగవలసినది' అని ఎస్కాంబిగారు క్యాప్టెనుకు కబురుచేసిరి. 'తెల్లవారు గాంధి యనిన మండిపడుచున్నారు; వారికి ప్రాణభయము సమీపించియున్నది. రేవు సూపరింటెండెంటు టేటమ్‌గారు వారిని రాత్రి యింటికి భద్రముగా తీసికొని వెళ్ళఁగలరు.'

క్యాప్టెను నాకీసందేశమును వినిపించెను. నేనందుల కంగీకరించితిని. కాని యీ సందేశమందిన యరగంట యైనదో లేదో లాటను గారు వచ్చి క్యాప్టెనుతో నిటులనిరి: 'గాంధిగారు నాతో రాఁదలచుకొనునెడల నా జవాబుదారిమీఁద వారిని తీసికొని వెళ్ళఁగలను. గాంధిగారినిగూర్చి ఎస్కాంబిగారు పంపిన సందేశమును నిర్వర్తింప మీకుఁ బనిలేదని నేను ఈ యోడల ఏజెంటుగారి వకీలు-ధర్మములో చెప్పుచున్నాను.' ఇటు లాయన క్యాప్టెనుతో మాటలాడి నాకడకు వచ్చి "మీకు ప్రాణము లనిన భీతి లేనిచో మీ భార్యను పిల్లలను బండిమీఁద రుస్తుంజీగారి యింటికిఁ బంపుదము; మనము వెనువెంట నడచిపోదము. చీకటిపడిన పయిచాటుమాటుగా ఊరఁజొచ్చుట నాకిష్టముకానిపని. మీమీఁద ఈఁగయేని వాలదని నా యూహ. ఇపుడు నలుప్రక్కలను శాంతికలదు. తెల్లవారందరెవరిదారిని వారేఁగిరి. తాము దొంగలవలె చాటుగా పోవుట నాకింపితముకాదు" అని చెప్పెను.

# ఆత్మకథ

నేను సమ్మతించితిని. నా భార్యయు పిల్లలును ఒడుదొడుకు లేకుండ రుస్తుంజీసేటుగారి యిల్లుచేరిరి. నేను క్యాప్టెనుకడ సెలవునంది లాటనుగారితో ఓడదిగితిని. రుస్తుంజీసేటుగారియి ల్లించుమించు రెండుమైళ్లు.

మేము మోడనుండి దిగఁగనే కొందఱు దొరపిల్లలు 'గాంధి గాంధి' యని కేక లిడుచు చప్పటులు చఱవఁదొడఁగిరి. అయిదాఱుగురు మూఁగి 'గాంధి గాంధి' యని బిగ్గఱగా అర్వఁ దొడఁగిరి. లాటనుగారు గుంపె క్కువ అగునేమో యని అనుకొని ఒక రిక్షావానిని ఎలుగెత్తి పిలిచిరి. రిక్షా యెక్కుట నా కిష్టముకాదు. రిక్షా నెక్కుచో ఇదియె మొదలు. కాని పిల్ల లెక్కనిత్తురా? వారు చంపుదుమని రిక్షావానిని బెదరింపఁగా వాఁడు పాఱిపోయెను.

మేము ముందుకు నడుచుచుండ గుంపు పెరుఁగుచుండెను. మఱి నడన సందు లేదు. మునిముందు నన్నును, లాటనుగారిని విడఁదీసిరి. పిదప నాపైని రాలను, క్రుళ్లిన గ్రుడ్లను వర్షింపఁదొడఁగిరి. ఎవఁడో నాతల పాగ నెగురఁగొట్టెను. నన్ను ఎడపెడఁగొట్టిరి. క్రిందఁ బడఁద్రోసిరి.

నాకు స్మృతి తప్పెను. దాపుననున్న యింటిచువ్వలఁ బట్టు కొని అనుకొని నిలువబడితిని. అటులు నిలునఁబడుటకును అసంభవ మాయెను. ఇంకను దెబ్బలు తగులుచునే యుండెను.

ఇంతలో అచటికి పోలీసు సూపరింటెండెంటుగారి భార్య హఠాత్తుగా వచ్చెను. ఆమె నన్నెఱుఁగును. ఆధైర్యవతి నన్నుఁ జూచి ఆమె నా కడ నిలువఁబడెను. అపు డెండ లేకున్నను గొడుగు విప్పి నా పయిఁబట్టెను. తీన గుంపు కొంచె మాఁగెను. ఇటుమీఁద నన్ను గొట్టఁ దలఁచిన యెడల ఆ మిసెస్ అలెగ్జాండరుకు తగులక వీలు లేదు.

# 3 ఒరగల్లు

ఈ నడుమ ఎవఁడో యొక భారతీయుఁడు పోలీసు ఠాణాకు పరుగెత్తెను. పోలీసు సూపరింటెండెంటు నా సంరక్షణమునకు కొందరు పోలీసులను బంపెను. వారు తఱిలో దిగిరి. మా దారిలోనే పోలీసు ఠాణా కలదు. నన్ను ఠాణాలో ఆశ్రయముపొందుమని సూపరింటెండెంటనెను. నేనియ్యకొనక 'వారి తప్పు వారికి తెలిసినంతనే వారే యూరకుండుదురు. వారికి న్యాయబుద్ధి కలుగఁగలదని నాకు విశ్వాసమున్న' దని కృతజ్ఞతతో బదులాడితిని.

పోలీసువారి కాపుదారివలన మఱి హానికలుగక రుస్తుంజీగారి యింట క్షేమముగా విడిసితిని. నాకు పృష్ఠమున పెద్ద దెబ్బలు తగిలెను. ఒకచోట మాత్రమే పెద్దగాయమాయెను. ఓడవైద్యులు దాదీ బర్జోరుగారు అచట నుండిరి. వారు నాకు ఓపికతో లెస్సగా పరిచర్య చేసిరి.

లోపల శాంతిగనే యుండెను. కాని యింటి వెలుపల తెల్లవారు గిఱివైచిరి. చీఁకటులతో రాత్రి వచ్చెను. 'గాంధిని మా కప్పగింపుఁ'డని గోల బయలుదేరెను. పోలీసు సూపరింటెండెంటు అలెగ్జాండరుగారు సమయము కనిపట్టి అచటికి వచ్చి గుంపులో నెవ్వరిని భయపెట్టక వారి నందఱను తలా యొకమాటతో చక్కిలిగిలి పెట్టుచు ఆఁపుచుండెను.

అయినను అతఁడు చింతాముక్తుఁడుకాలేదు. అతఁడు ఇటులు కబురంపెను: 'నీవు నీ మిత్రుని ధనప్రాణములను, గృహమును, మఱి నీ పెండ్లాము పిల్లలను దక్కించుకొనఁ దలఁతువేని మాఱువేసముతో ఈ యిల్లు విడిచి పోఁగోరెదను'. ఒకనాఁడే పరస్పర విరుద్ధములయిన రెండు స్థితులు నాకు తటస్థించెను. ప్రాణభయము కేవల కల్పిత మను

కొని లాటనుగారు నన్ను బహిరంగముగా రమ్మనిరి; దానికి నేనియ్యకొంటిని. ఇటు ప్రాణభయము కనుల యెదుట కానిపించుచుండఁగా మఱియొక మిత్రుఁడు దానికి వ్యతిరేకముగ సలహా యిచ్చెను; దీనికిని నేనియ్యకొంటిని. నా ప్రాణము లపాయమున నున్నవను భయముచేఁగాని, మిత్రుని కపాయమను భయమునఁగాని, నా యాలు బిడ్డలకు హాని యను భయమునఁగాని నే నిటు లొనర్చితినని ఎవరు చెప్పఁగలరు? మొదట నేను గుంపు నెదుర్కొనుటయు, ధైర్యముతో ఓడదిగి పిదప మాఱు వేషముతో దాఁటుటయు నీ రెంటను ఒప్పిదము లేయని యెవరు నిశ్చయింపఁగలరు? అయితే గత విషయముల యోగ్యతలు నిర్ణయించుట పనిలేనిపని. ఈ విషయము లవగతము చేసికొని వీనిలో నేర్చికొనవలసిన దేమేని నున్న నేర్చుకొనుటమాత్రమే వీని ప్రయోజనము. ఒకా నొకఁడు ఒకా నొక సమయమున ఎట్లు ప్రవర్తించునో చెప్ప దుశ్శకము. ఈ రీతిగా మనుష్యుని బాహ్యాచారమువలన మాత్రము గుణమును నిగమనముచేయుట అసమగ్రమును, అవ్యాప్తికమును అగు నని మనము తెలియఁగలము.

అది యటుండె. పలాయన త్వరలో బాధ మఱచితిని. నల్లపోలీసు వేషము వేసితిని. తలపై నెచటను దెబ్బలు తగులకుండునని యూహించి ఇత్తడి సిబ్బినిడుకొని దానిపై మదరాసు-ఉత్తరీయమును పాగగాచుట్టి బయలుదేఱితిని. నాతోఁగూడ నిరువురు గూఢచారులు కలరు. అందొకఁడు భారతీయ వర్తకుని వేషము వేసెను. లేక భారతీయునివలె నుండుటకు మోమున రంగు పూసికొనె నందము. రెండవ యతఁడే వేసము వేసెనో గుర్తుచాలదు. ప్రక్కసందునబడి ఒక దుకాణము చేరుకొంటిమి. అందలి గిడ్డంగిలో పేర్వఁబడిన బస్తాలనుండి దారిచేసికొని వెళ్లి దుకాణపు ద్వారము దాఁటి గుంపులకు బయటఁ

బడిపోతిమి. వీధితుద నా కొఱకు బండి వేచియుండెను. అందెక్కి అలెగ్జాండరుగారు కొంచెము కాలము వెనుక నా కాశ్రయముచూపిన పోలీసు స్టేషనుకే బండిని పట్టించితిమి. నేను సూపరింటెండెంటుకును గూఢచారులకును వందనము లర్పించితిని.

ఒకవంక నేనిట్లులు తప్పించుకొని పోవుచుండఁగా మఱియొక వంక అలెగ్జాండరుగారు

'పదపద గాంధీని పట్టూక వద్దాం
పెద చింత కొమ్మాకు వేలాడ దీద్దాం'

అని పాటపాడుచు మూఁక నంతయు నవ్వులచే నిలువఁబెట్టియుంచిరి.

నేను పోలీసు స్టేషనుకు సురక్షితముగ చేరితినని విన్నంతనే సూపరింటెండెంటు గుంపులో ఈ సంగతి బయటబెట్టి 'మీ లేడి ప్రక్కదుకాణమునుండి దూసినది. మీ రంద ఱిఁక నిండ్లకుఁబోవుట మంచిది' అనెను. గుంపునఁ గొందఱు కోపించిరి; కొందఱు నవ్విరి చాలమంది యీ మాట నమ్మలేదు.

'అటులనుచో మీలో కొందఱు లోనికివెళ్లి చూచికొనుఁడు. లోపల గాంధి ఉన్నయెడల మీ కప్పగింతును. లేనిచో మీ రంద ఱెవరిదారిని వారు మీ మీ యిండ్లకుఁ బొండు! రుస్తుంజీగారి యిల్లు పాడుచేయవలయు ననిగాని గాంధిగారి పెండ్లాము బిడ్డలకు హాని చేయవలయు ననిగాని మీ కుద్దేశము లేదని నాకు నమ్మక'మని సూప రింటెండెం టనెను.

మూఁక తమ ప్రతినిధులను లోనికిఁ బంపెను. ప్రతినిధులు మూఁకకు ఆశ లుడుగు సమాచారము వినిపించిరి. చాలమంది సూపరిం

టెంటెంటు అలెగ్జాండరుగారి సమయజ్ఞతకును చాతుర్యమునకును మెచ్చుకొనిరి. మతికొందఱు లోలోపల కోపించుచు కుందుచుఁ జనిరి.

స్వర్గీయులగు చేంబర్లేనుగారు గాంధిని కొట్టినవారిని శిక్షింప వలసినదని నేటాలు గవర్నమెంటువారికి తంతినిచ్చిరి. ఎస్కాంబిగారు నన్ను పిలువఁబంచిరి; నాకు తగిలిన దెబ్బలకు వగచిరి. 'నా మాట నమ్ముఁడు! మీ వెంట్రుక కేని హాని కలుగుచో నేను సహింపఁజాలను. లాటనుగారు చెప్పిన చొప్పునఁ జేయుటకు మీకు స్వాతంత్ర్యము కలదు కాని నా సందేశము ననుసరించినచో ఈ దుఃఖఘటన పొసగెడిది కాదు. ఘాతకులను మీరు గుర్తించునెడల వారిని ముందు పట్టుకొని శిక్షించు నేర్పాటు చేయుదును. చేంబర్లేనుగారు గూడ ఇటులే తంతినిచ్చిరి' అని పలికిరి.

'ఎవరిమీఁదను కేసుపెట్టుట నాకు గిట్టదు. ఆ గుంపులో ఒకరి నిద్దఱును గుర్తు పట్టఁగలనుకాని వారిని శిక్షించినచో నాకేమి మేలు? ఇంతియకాక వారిని నేను దోషులనను. నేటాలు తెల్లవారినిగుఱించి హిందూదేశమున నేను గోరంతలు కొండంతలుచేసి నోటికి వచ్చినటుల్ల తెగడితినని వారి కెవరో నమ్మఁజెప్పిరి. ఆ నమ్మికచే వారు కినుక బూనుటలో తప్పేమి? మీ నాయకులును,- కోపింపకుఁడు! - మీరును నింద్యులు. లోకులను యథాన్యాయము ప్రవర్తింపఁజేయ వలయువారు మీరు. అట్టి మీరుకో రూటరు మాట పాటించితిరి. నేను కల్పించియుందునని మీ రనుకొంటిరి. నే నెవరిని శిక్షింపజేయ నెంచను. సత్యము లోకమున కెపుడు ప్రకట మగునో అపుడే వారు తమ దుష్కృతికి వగతురు.' అని నేనంటిని.

'అటులే ఆ మాటలే వ్రాసి యీగలరా?' యని నిష్కాంటిగా నడిగిరి. 'ఆమాటలే నేను చేంబర్ లేనుగారికి తంతినీయవలసియున్నాను. తొందరపడి యేమాటయు వ్రాసి యీఁగోరను. లాటనుగారి తోడను, తదితర మిత్రులతోడను సంప్రతించి యేది యుచితమో దానిని చేయుఁడు. మీరు ఘాతకులపై కేసు పెట్టకున్నచో అందఱను ఉపశాంతులఁ జేయుటలో నాకు బలము చేకూఱుటయేకాక మీ ప్రతిష్ఠయు సుప్రతిష్ఠితమగునని నే నంగీకరింతును.'

'ఈ సంబంధమున నే నన్నమాటయే నిశ్చ్రపచము. మీ కడకు రాకముందే ఇది సునిశ్చితము. నన్ను గొట్టినవారిపై కేసు పెట్టుట నా మతముకాదు. ఈ క్షణము నేను వ్రాసి యిత్తును.' అని నేను ఆవశ్యకమైన పత్రమును వ్రాసి యిచ్చితిని.

# ౪

## శాంతి

ఈ ముట్టడి జరిగిన రెణ్ణాళ్ళ పిదప నేను ఎస్కాంబిగారిని కలియువఱకు పోలీసు స్టేషనులోనే ఉంటిని. నా రక్షణమునకుఁగాను నాతో ఇద్దఱు పోలీసు లుండిరి. కాని నేను ఎస్కాంబిగారి కడకుఁ బోవునాఁటికి పోలీసు కాఁపలాతో పని లేకుండఁ బోయెను.

నే నోడ దిగిననాఁడు అనఁగా పచ్చజెండా దింపిననాఁడు నేటాల్ అడ్వర్టైజరు పత్రికా ప్రతినిధి వడివడిగా నన్ను గలిసికొనెను. ఇతఁడు నన్ననేక ప్రశ్నలడిగెను. అడిగిన ప్రతిప్రశ్నకు సంపూర్ణముగా నేను సమాధానములు చెప్పితిని. సర్ ఫిరోజషాహాగారి మేలి సలహావలన హిందూదేశమున అచ్చొత్తింపక యేయుపన్యాసమును నేను చదువలేదు. ఈ యుపన్యాసములును, ఇతరసంభాషణముల సంగ్రహమును నా కడఁ గలవు. వానినన్నిఁటిని నే నితని కొసఁగి 'దక్షిణ-ఆఫ్రికాలో ఇదివఱకు తేజము కల మాటలలో నా చెప్పియుండని మాట యొక్కటియు హిందూదేశమున చెప్పియుండలేదని ఋజువు చేసితిని. కురలేండ్ నాదరీ యోడలలో యాత్రికులను రావించుటలో నా చేయి యేమియు లేదనియు స్పష్టపఱిచితిని. ఇందు పలువురు నేటాలుకు క్రొత్తకాఁపులు. మిగిలినవారు నేటాలులో ఆఁగరు, మఱి ట్రాన్సువాలు పోవుదురు. ఆసమయమున నేటాలున పని తక్కువ. ట్రాన్సువాలులో పనిపాటలెక్కువగా సాగుచుండెను. ఆయము బాగుగా దొరకుచుం

చుండెను. ఈ కారణమున భారతీయులలో పలువురు అచటికి వెళ్లుటకే ఇచ్ఛపడుచుండిరి.

పత్రికాప్రతినిధితో నా కావించిన ప్రసంగము యొక్కయు, నన్ను కొట్టినవారిపై నేను కేసు పెట్టకుండుటయొక్కయు ప్రభావము వలన తెల్లవా రందఱు తలలు వంచికొనిరి. పత్రికలు నన్ను నిర్దోషినిగా సమర్థించి గుంపుల అల్లరిని నిందించెను. తుద కీరీతిగా ఈ ఘటన వలన నాకు లాభమే కలిగెను. నాకు లాభమనఁగా ప్రకృతకార్యమునకు లాభము. దీనివలన భారతీయుల ప్రతిష్ఠ హెచ్చెను. నా మార్గము సుగమ మాయెను.

మూఁడునాలుగు నాళ్లకు నే నింటికిఁ జనితిని. కొలఁది నాళ్లలోనే నా పనిపాటలు చూచుకొనఁ దొడఁగితిని. ఈ ఘటనవలన నా వకాలతు పనియు పెరిఁగెను.

కాని ఒకదెస భారతీయులప్రతిష్ఠ పెరిఁగినటులే ఒకదెస వీరిని గుఱించి ద్వేషమును పెరిఁగెను. భారతీయుఁడు పౌరుషశాలి అని తెల్లవారికి తెలిసివచ్చెను కావున భారతీయుఁడనిన భయమును ప్రబలెను. నేటాలు లెజిస్లెటివ్ కౌన్సిలులో రెండు చట్టములు ప్యాసు ఆయెను. ఇవి భారతీయులకు కష్టముకలిగించునవి. ఒకటి వర్తకుల వ్యాపారములకు హానికలిగించును. రెండవది వలస వచ్చువారికి హానికలిగించును. వోట్లకొఱకు మే మొనర్చిన ఆందోళనము దైవవశమున ఇటులు ఫలించెను: 'భారతీయులకు వ్యతిరేకముగా, అనఁగా భారతీయుఁ డయినంతమాత్రమున వానిపై ఏ లాయును సృజింప వలనుపడదు!' అని. దీని అర్థమేమనఁగా 'లాలో జాతిభేదమని, వర్ణభేదమని యుండరాదు' అని. ఈ కారణములచే పూర్వోక్తములగు

రెండు చట్టములలోను ఉపయోగింపఁబడిన భాష పైకిమాత్రము అంద ముగను చెందునటులుగా కూర్పఁబడెను; కాని దాని లోపలి ఉద్దేశము భారతీయుల హక్కును కుంచించుటయే.

ఈచట్టములు నా పనిని పెంచెను. మఱియు భారతీయులను వారి విధిపై నెక్కువ మెలకువగా ఉంచెను. ఏ భారతీయుఁడును ఈ చట్టముల యర్థ మెఱుఁగకుండ నుండరాదని వానిని అన్నిభాషల లోనికిని అనువదించితిమి. సీమకుఅకు అర్జీ లిచ్చుకొంటిమి. కాని చట్ట ములు మంజూరయిపోయెను.

సార్వజనిక కార్యములతోనే నా పని సరి. మనసుఖలాలు నాజరుగారు నేటాలులో నుండిరని చెప్పియుంటిని. వారు మా యింట నుండవచ్చిరి. వా రా పనుల నెక్కువగా చూచుచుండుటవలన నా భా రము కొంత తగ్గెను.

నే నచట లేని తఱిలో ఆదంజీ మియాఖానుగారు తమ విధిని చక్కగా నిర్వర్తించిరి. వీ రున్న తఱిలో సభ్యులసంఖ్య యినుమడిం చెను. కాంగ్రెసు మూలధనము ఇంచుమించు వేయిపౌనులు హెచ్చెను. యాత్రికుల అవరోధమును, ఈ చట్టములను, పురస్కరించుకొని ఎక్కువ ధనము సమకూర్ప నిశ్చయించితిని. దానికి ఫల ముగా ఇంచుమించు ౫౦౧౧ పౌనులు సమకూరెను. కాంగ్రెసు కోశమునకు స్థాయిత్వము చేకూఱుచో దానితో కొంత ఆస్తిని కొని దాని ఆయముతో కాంగ్రెసును ఆర్థికదృష్టిలో చింతయు చీకును లేకుండ నుంపవచ్చునని నాకు లోభము కలిగెను. సార్వజనికమగు సంస్థను నడపుట నా కిదియ మొదటి అనుభవము. నా యీ యుద్దేశ మును నా తోడిసభ్యుల యెదుట నుంచితిని. వారు ఇయ్యకొనిరి.

కొంత ఆస్తి కొంటిమి. అద్దెకిచ్చితిమి. దానితో కాంగ్రెసు వ్యయము సరిపోవుచుండెను. ఇందులకు తగిన ధర్మకర్తల నేర్పఱచితిమి. ఆయాస్తి నేటికిని గలదు. కాని అది అంతఃకలహములకు మూలమయిపోయెను. దాని యద్దె కోర్టులో జమకట్టఁబడుచున్నది.

నేను దక్షిణ-ఆఫ్రికాను విడిచిపెట్టిన తరువాత ఈ దుఃఖస్థితి బయలుదేఱెను. కాని సార్వజనికసంస్థలకు మూలధన ముంచుటను గుఱించిన అభిప్రాయములు మార్పునొందినవి. నేనచట నుండఁగనే చాల సార్వజనిక సంస్థలను స్థాపించుట, వీనిని నడుపుట, వీనికి పూఁటగా ఉండుట, ఈయనుభవములవలన ఏ సార్వజనికసంస్థకును మూలధనము చేకూర్పు ప్రయత్నము కూడదని నా దృఢ నిర్ణయము. ఏలనఁగా దీనియందు నైతికమగు అధోగతికి బీజములున్నవి.

సార్వజనికసంస్థ యనఁగా సర్వజనుల యనుమతితోడను, సర్వజనుల ధనముతోడను నడుపఁబడు సంస్థ. దానికి లోకుల సాయ మెప్పుడు లేకుండఁబోవునో అది జీవించియుండుట కధికారము లేనిదన్నమాట. మూలధనముచే నడపఁబడు సంస్థలు లోకుల అభిప్రాయములకంటె స్వతంత్రముగను, మఱియు పలుమాఱులు లోకాభిప్రాయములకు విపరీతముగఁగూడను నడుచును. మన దేశమున నిట్టివి ప్రతిపదమునను మనము చూచుచున్నాము. ధార్మికసంస్థలపేర బరగుచున్న పలు సంస్థలకు లెక్కయు డొక్కయు లేదు. ధర్మకర్తలే వాని కధికారులగుచున్నారు. వారెవరికిని ఉత్తరవాదులు కానంత అధికారమును చలాయించుచున్నారు. ఈసంస్థలు ప్రకృతివలె వానియంతట నవి పెరుఁగవలయునని నామతము. ఏ సంస్థలకు లోకులు సాయముచేయ సంసిద్ధులు కారో వానికి సార్వజనికసంస్థలను పేరితో నిలిచియుండ నధికారము

లేదు. ఏదేని సంస్థయొక్క లోకప్రియత్వమునకును, దాని ధర్మకర్తల యోగ్యతకును దాని వార్షికచందాపట్టికయే ఒరగల్లు. ప్రతి సంస్థయు తన నీయొఱపిడిరాత గీచి చూచికొనుఁగాక!

దీని కెనరును దుర్థము చెప్పకుందురుగాక! శాశ్వత భవనములు లేనిచో నడుపుటకు వీలు లేని సంస్థలఁగూర్చి నేఁ జెప్పుట లేదు. నేఁ జెప్పఁదలచిన దేమనఁగా: ప్రతివత్సరము ఇచ్ఛాపూర్వకముగావచ్చు చందాలతో వార్షిక వ్యయమును గడఁపవలయును.

దక్షిణ-ఆఫ్రికాలోని సత్యాగ్రహసమయమున ఈ నా పయి ఉద్దేశములు దృఢపడినవి. లక్షల తరబడి వ్యయ మవసరమైయుండినను మూలధనమును మాట లేకయే ఆరుసంవత్సరములు ఆ మహాసమరము జరిగెను. చందాలు రానిచో రేపటి గతి యేమగునో అనుకొనిన రోజులు నాకు గుర్తున్నవి. కాని భవిష్యద్విషయములను ఇచటఁ జెప్పను. ఈ పై అభిప్రాయము ప్రసక్తానుప్రసక్తముగా ముందు విశదము కాఁగలదు.

౫

## పిల్లల చదువు

౧౮౯౭ సంవత్సరము జనవరిలో డర్బనులో దిగునపుడు నాతో మూవురు పిల్లలుండిరి. ఒకఁడు నా మేనల్లుఁడు, పదేండ్లవాఁడు. మిగిలిన యిరువురు నా కుమారులు. పెద్దవానికి తొమ్మిదేండ్లు; చిన్నవాని కైదేండ్లు. వీరికి చదువెట్లు?

నా పిల్లలను తెల్లవారి బడికి పంపఁగలనుగాని అది కేవలము మెహానతు. నా పిల్లలకు మాత్రమే ఆ వీలు దొరకును. ఇతర భారతీయ బాలకుల కందు అవకాశము లేదు. భారతీయబాలురకు మిషనువారు పెట్టిన బడులున్నవి కాని అందలి శిక్షాదీక్షలు బాగుండమి నేనటకుఁ బంపఁదలఁచుకొనలేదు. మఱియు గుజరాతీభాషలో బోధన యెట్టులు వీలగును? ఇంగ్లీషుభాషలో వీలగును. బహు ప్రయాసమున వచ్చియు రాని అఱవమునఁగాని హిందీనిగాని, వీలగును. నేను దీనిని, మఱి యితరాంతరాయములను అతిక్రమింప లేకపోతిని.

పిల్లలకు విద్య చెప్ప కొంచెమో గొప్పయో నేనే ప్రయత్నించుచుంటిని. కాని అదియు నియమముగా సాగలేదు. నా కనుకూలుఁడైన గుజరాతీ శిక్షకుఁ డెవఁడును దొరకలేదు.

నా కేమియు తోఁపలేదు. 'నా ఉద్దేశముల ననుసరించి పిల్లలకు విద్యగఱప నాంగ్లేయభాషా శిక్షకుఁ డొకఁడు కావలయు'నని పత్రికలలో ఒక ప్రకటన చేసితిని. ఈ యుపాధ్యాయుఁడు నియమముగా చెప్పుననియు, తీఱిక యయినపుడు నేను కొంత చెప్పుదుననియు,

ఇటులు కాలము గడపుదమనియు నే ననుకొంటిని. నెలకు ఏఁడు పౌనుల జీతముమీఁద ఒక తెల్లయామె కుదిరెను. ఈ రీతిగా ఎటులో ఒకటులు పని జరుగుచుండెను.

నేను బాలురతో గుజరాతీనే వ్యవహరించుచుంటిని. దీన వారికి కొంచెము గుజరాతీ జ్ఞాన మలవడెను. వారిని క్రమ్మఱ నిండియాకు పంపుట నా కిష్టములేదు. ఏలన చిన్నపిల్లలను తలిదండ్రులకు దూరముగా నుంచరాదని నాఁటికే నేను తెలిసికొంటిని.

మంచి యేర్పాటుగల విద్యావంతుల యిండ్లలో పిల్లలకు విద్య అప్రయత్నముగా అబ్బినటులు ఛాత్రాలయములలో (హాస్టలు) అబ్బదు. కావుననే వారు చాలకాలము నాకడనే యుండిరి. నా మేనల్లుని, పెద్దకుమారుని, కొన్ని నెలలపాటు హిందూదేశమున వసతిగృహములుగల బళ్లకు పంపితినిగాని మరల వారిని వెంటనే తీసికొని వచ్చితిని. పిదప నా జ్యేష్ఠపుత్రుడు వయసు వచ్చినతరువాత తనంతట నన్ను విడనాడి అహమ్మదాబాదు హైస్కూలులో చదువఁదలఁచి దక్షిణ-ఆఫ్రికానుండి నిర్గమించెను. నా మేనల్లుఁడు నా చెప్పఁగల దానితోమాత్రమే తృప్తిపడి యున్నటులు గుఱుతు. దౌర్భాగ్యవశమున, అతఁడు కొన్నాళ్లు జబ్బుపడి నవయౌవనమునే ఈ లోకమువిడిచిపెట్టెను. మిగిలిన నా మూవురు పిల్లలును ఎన్నఁడు బడికిపోలేదు. సత్యాగ్రహసమయమున నేను స్థాపించిన పాఠశాలయందు మాత్రమే వారు నియమముగా కొంచెము చదువుకొనిరి.

నా యీ ప్రయోగము లన్నియు అపూర్ణములు. వారికి బోధింపవలసినంత సమయము నా స్వాధీనమున నుండెడిదికాదు. ఈ కారణమువలనను, మఱి అనివార్యమైన యితరాతంకములవలనను నేను వారికి

భాషా జ్ఞానము బాగుగా కలిగింపలేకపోతిని. ఈ విషయమున వారి యవజ్ఞకు నేనుకొంచెమో గొప్పో గుఱియగుచున్నాను. ఎటులనఁగా: ఎప్పుడేని వారికొక బి. యే. గాని, యమ్. యే. గాని, తుదకు ఒక మెట్రిక్యులేటుగాని కానిపించుచో నపుడు వారు 'అయ్యో! మేముకూడ ఇటులు కాకపోతిమే' అని అనుకొనుచున్నట్లుందురు.

ఇటులు వారనుకొనినను తలిదండ్రుల సహవాసబలమున గలుగు అనుభవజ్ఞానము వీరికిఁ గలిగెను. స్వతంత్రతాపదార్థపాఠము వీరి కభ్యస్తమాయెనని నా యభిప్రాయము. వీరి యభిరుచి ననుసరించి స్కూలునకే పంపించియుందునేని ఇది యంతయు వారికి లభించెడిదికాదు. మఱియు నేను వీరిని సీమకుఁ బంపిగాని లేక దక్షిణ-ఆఫ్రికాలో ఉంచిగాని కృత్రిమ శిక్షను బడయఁజేయుదునేని వీరియెడల నేనిప్పుడున్నంత నిశ్చింతుఁడనై యుండి యుండను. మఱియు వారును నేఁటి ఋజా జీవితమును, త్యాగమును నేర్వఁజాలకపోయి యుందురు. ఇంతియ కాక తెచ్చిపెట్టుకొనిన వారి యునికిమనుకులు నా దేశారాధనమునకును బాధకములయ్యెడివి.

ఈ కారణమున నే ననుకొన్నంతయు, వా రనుకొన్నంతయు భాషాజ్ఞానమును నేను వారి కలవఱుపకున్నను గతకాలమును విచారించి చూచినచో నేను వీరియెడల నా ధర్మమును నా శక్తికొలఁది పాలింపలేదని అనుకొనను. మఱియు ఆవిషయమున నాకు పశ్చాత్తాపమును లేదు. ఇంతియ కాక నేఁడు నా జ్యేష్ఠ కుమారునిలో చింత్యములగు ఏ దోషములు నేను చూచుచున్నానో అవి అశిక్షితములును, అమూర్తములును అగు నా ప్రథమజీవితాంశముల ప్రతిధ్వనులని మాటికి మాటికి నేను గ్రహించుచున్నాను. ఆ నా ప్రథమ జీవితకాల మొకమాదిరి మూర్ఛాకాలము, మఱియు వైభవకాలము నయియుండెను. అప్పటి

యతని వయసు ననుసరించి అది అటువంటిది కాదని అతని యూహ. ప్రత్యుత అదియే నా జీవితమున రాజమార్గమనియు, తరువాత నాకు కలిగిన మార్పులన్నియు వివేకమును పేరిటనొప్పు విమోహము వలనఁ గలిగినవనియు నతని విశ్వాసము. నా ప్రథమ జీవితమే రాజమార్గ మనియు అదియే సురక్షితమనియు తరువాత కలిగిన పరివర్తనము నూత్మాభిమానకృతము, అజ్ఞానచిహ్నమనియు అతఁడేల అనుకొన రాదు? 'నీ కుమారులు బారిస్టరు మొదలగు పదవి నందుచో నేమి ప్రమాదము? వారి రెక్కలు విఱుగఁగొట్టుట యేటి అధికారము? వారిని వారి యిష్టానుసారము పోనీయక ఇటులు అడ్డుసేయుట యేటి పని?' అని యిటులు కొందఱు మిత్రులు నాతో వాదించిరి.

కాని యీ ప్రశ్నలలో విశేష మేమియు నా కగపడుట లేదు. నా కనేకవిద్యార్థుల సంగతి తెలియును. ఇతర బాలకుల విషయమునఁ గూడ నాపద్ధతిని ప్రయోగించి మాచితిని, లేక అందులకు సాయ పడితిని. దాని ఫలమును గ్రహించితిని; ఆ బాలురును, నా బాలురును నేఁడొక యీడులోనే యున్నారు. వారు మానవతత్త్వమున నా కొడుకుఁ గుర్రల కెక్కువకారు. ఇంతియకాక వారికడ నా కుమారులు అభ్యసింప వలసిన దేమియు నుండదనుకొందును.

అయితే యీ నా ప్రయోగముల పరమ ప్రయోజనమును గుఱించి భవిష్యత్కాలమున నిర్ణయింప వీలగును. మనుష్యజాతి యభివృద్ధిని పరిశీలించు శోధకుఁడు గృహశిక్షకును స్కూలు-శిక్షకును గల భేదమును, తలిదండ్రుల జీవితముఁ గలుగు పరివర్తనము బాలురపై నెట్టి పని చేయునో ఆ విషయమును కొంచెము కొంచెము గమనించుటకే ఈ సంగతి నిచట చర్చింప నుద్దేశించితిని.

ఇదియుగాక ఈ ప్రకరణమునకు మఱియొక ఉద్దేశము గలదు. సత్యారాధకుడే యెల్లవఱకు సత్యారాధనము చేయఁగలుగునో అనున దొకటి. స్వతంత్రతాదేవి నుపాసించువానికి ఆ దేవి యెంత బలి కోరునో దాని దెలుపుట యొకటి. నే నాత్మగౌరవమును వీటిఁబుచ్చి యితరబాలుర కలభ్యమయిన విద్యను నా బాలురకు చెప్పించి తృప్తిపడి యుండునేని వారికి వాఙ్మయ జ్ఞానము తప్పక కలుగఁజేసి యుందునుగాని దానికి బదులు స్వాతంత్ర్యమందును, ఆత్మగౌరవమునందును వారికి నేడు కలిగిన యీ ప్రవేశ మపుడు కలిగియుండెడిది కాదు. స్వాతంత్ర్య పాండిత్యములలో నేది గొప్ప? అని ఆరా వచ్చినపుడు పాండిత్యము కన్న స్వాతంత్ర్యము వేయిరెట్లు మిన్నయని యెవరనరు?

౧౯౨౧ సంవత్సరమున నేను స్వతంత్రతా ఘాతకములగు స్కూళ్లను కాలేజిలను విడిచిపెట్టుఁడని బాలుర నుద్బోధించితిని. మఱియు అక్షరజ్ఞానముకొఱకు బంధములతో గులాములై పడియుండుటకన్న స్వాతంత్ర్యముకొఱకు నిరక్షరులై యుండి దారిలోని రాలను బగులఁగొట్టి బ్రతుకుటయే మేలని చెప్పియుంటిని. వారి కిపుడు నా యుద్దేశ మించుమించు తెలియనగును.

## ౬

## సేవా భావము

నా ఉద్యోగము బాగుగనే గిట్టుచున్నది. కాని దాన నాకు సంతసము లేదు. జీవిక నింకను ఋజువు చేయవలయు ననియు నా తోడివారలకు కొంచెమైనను శారీరక సేవ చేయవలయు ననియు నా మానసమున మథన జరుగుచుండెను.

ఆ సమయమున మాయింటికొక కుష్ఠరోగి వచ్చెను. అన్నము పెట్టి పంపివేయ నిష్టము కాలేదు. ఆతని నొకగదిలో నుంచి పుండ్లు కడిగి కట్టుకట్టి శుశ్రూషించితిని.

కాని యిటు లెన్నో దినములు సాగ వీలు కాలేదు. ఎల్లపుడితని నింటనుంచుకొను శక్తిలేదు; ఇచ్ఛాబలమును లేదు. కావున గిరిమిటియాలకు సర్కారువారు పెట్టిన ఆసుపత్రికి ఇతనిని పంపితిని.

కాని దీనిచే నాకు తృప్తి కలుగలేదు. ఎల్లపుడును చేయదగిన శుశ్రూషాకార్య మేదయిన దొరకుచో నెంత బాగుండు నని ఆశపడుచుండువాడను. డాక్టరు బూత్ గారు సెయింటు ఏయిడాన్స్ మిషన్కు అధికారులు. ఎవరు వచ్చినను ఎల్లపుడును వీరు ఊరక మందు లిచ్చుచుందురు. వీరు కడు మంచివారు. వీరి హృదయము స్నేహపూర్ణము. డాక్టరు బూత్ గారి యాధిపత్యమున పారసీ రుస్తుంజీగారి ధర్మమున ఒక ఆసుపత్రి పెట్టబడెను. ఇందు 'నర్సు' పని చేయుటకు నాకు ప్రబలమగు నిచ్ఛకలిగెను. ఇందు ఒకగంట మొదలు రెండుగంటల వఱకు మందు లిచ్చు పని కలదు. ఇందులకు డబ్బు పుచ్చుకొనకుండ

పనిచేయఁగల స్వచ్ఛందసేవకుఁడు కావలసి వచ్చెను. నే నీపని చేయుటకును, ఇంత సమయము నా పనిలోనుండి ఎటులో అవకాశము కలుఁగఁ జేసికొనుటకును నిశ్చయించితిని. ఆఫీసులో కూరుచుండి సలహాలిచ్చుట, దస్తావేజులకు ముసాయిదా చెప్పుట, జగడములు పరిష్కరించుట ఇవి నాఁటి నావకాలతు పనులు. నాకు మేస్ట్రీటుకోర్టులోఁ గూడ పనులుండెడివి కాని అవి యంత వివాదాస్పదములు కావు. ఈ కేసులలో నాకు ఖానుగారు సాయము చేయుచుండువారు. వీరు నాతో దక్షిణ-ఆఫ్రికాకు వచ్చిరి. మా యింటనే యుండిరి. వీరి యీ సాయమున ఈ చిన్ని ఆసుపత్రిలో నేను పనిచేయ సమయము చిక్కెను.

అచట దైనందినము ప్రొద్దుటిపూఁటలందు పని. రాక పోకలకును, అచట పని చేయుటకును ఇంచు మించు రెండు గంటలు పట్టెడిది. ఈ పనివలన నా మనస్సునకు కొంచెము శాంతి కలిగెను. రోగుల రోగములను బాధలను అడిగి డాక్టరుకు తెలుపుట, డాక్టరు చెప్పిన మందును తయారు చేసి రోగుల కిచ్చుట ఇది నా పని. దీని వలన రోగపీడితులయిన హిందూస్థానీయులతో మంచి పరిచయము కలిగెను. వీరిలో నెక్కువమంది అరవవారు, తెలుఁగువారు, ఔత్తరాహులును అగు గిరిమిటియాలు.

ఈ వైద్య ప్రవేశము నాకు తరువాత చాల నుపయోగించెను. బోయరు యుద్ధ సమయమున దెబ్బలు తినినవారికిని రోగులకును ఉపచరింప నీసేవ చాల నుపకరించెను.

పిల్లలను పెంచి పెద్దచేయు టెట్లను సమస్య యెల్లపుడు నా నెదుట నుండెడిది. దక్షిణ-ఆఫ్రికాలో నా కిరువురు కుమారులు కలిగిరి. వారిని సాకుటకు నా కాసుపత్రిలో కలిగిన అనుభవ ముపయోగించెను. నా స్వతంత్ర స్వభావము నా కెపుడును కష్టముకలిగించెడిది; ఇప్పటికిని

కలిగించుచున్నది. నా భార్య ప్రసవము శాస్త్రీయముగా జరుగవలయు నని మా దంపతుల మనుకొంటిమి. ఇందులకు డాక్టరుగాని, నర్సుగాని యుండవలయును. కాని డాక్టరుగాని, దాయిగాని సరియగు వేళకు వచ్చుట పడనిచో మా పని యేమి కావలయును? దాయి మన దేశముది కావలయును. చదువుకొనిన మంత్రసాని హిందూదేశమునందే దొరకనపు డిక దక్షిణ-ఆఫ్రికా మాట చెప్పవలెనా? ఇందులకని నేను సుఖప్రస వమును గురించి చదువుకొంటిని. డాక్టరు త్రిభువన దాసుగారు రచించిన 'మానే శిఖామణ*' అను పుస్తకము పఠించితిని. దీని ననుసరించియు నా కితరత్ర కలిగిన అనుభవము తోడను యిరువురు పిల్లలకు లాలన పాలనములు నేనే చేసితిని. రెండుమారులును మంత్రసానుల సాయము పడసితిని గాని యొక్కొకపరి రెండుమాసములకన్న నెక్కువ కాదు. వారి సాయమును కేవలము నా భార్యకే. పిల్లలకు తలంటునుండి సమస్తము నేనే చూచుకొంటిని.

మా చివరవాని పుట్టుక నన్ను తికతినపరీక్షలో పెట్టెను. ప్రసవ వేదన హఠాత్తుగా వచ్చెను. డాక్టరు సమయమునకు దొరకలేదు. మంత్రసానిని పిలువవలెను. మంత్రసాని అపుడు దాపున నున్నను ప్రసూతి సౌలభ్యము చేయఁజాలక పోయెడిదే. కావున నేనే పురుడు పోయవలసి వచ్చెను. భాగ్యవశమున త్రిభువన దాస గ్రంథము పఠించితిని గాన నిందులకు భయమంద నయితిని. అది నా కత్యంతముగ నుప యోగించెను.

తమ పిల్లలను చక్కగ సాకుటకు తలిదండ్రులకు శిశుపోషణము గురించి సామాన్యజ్ఞానమేని ఉండవలయును. ఈ విషయమున నే నెం తెంత గ్రహించితినో అంతంత లాభము కానిపించెను.

* తల్లులకు ఉపదేశము.

## ౬. సేవాభావము

పిల్లలను సాకు విషయమున ఆవశ్యక జ్ఞానమును నేను సంపాదింపకయు, దాని నుపయోగింపకయు నున్నయెడల నా పిల్లలు నేఁటి యారోగ్యము పొందియుండువారు కారు. మొదటి అయిదేండ్ల వఱకు పిల్లలు నేర్చుకొనున దేమియు నుండదని జనులు వెఱ్ఱిగా నమ్మెదరు. కాని సత్యమేమనఁగా బిడ్డ మొదటి అయిదేండ్లలో గ్రహించునది పిమ్మట నెన్నఁడును గ్రహింపలేదు. శిశువునకు విద్యారంభము తల్లి గర్భముతోనే ఆరంభమగును. గర్భధారణ సమయమున తలిదండ్రుల శారీరక మానసిక ప్రవృత్తుల ప్రభావము శిశువున ప్రసరించును. తల్లి గర్భము మోయుతఱి నుండు ప్రకృతియు, ఆహారవిహారములును, గుణదోషములను, స్వీకరించి శిశువు జనించును. జనించిన పిదప తలిదండ్రుల ననుకరింపఁ దొడఁగును. పదఁపడి కొన్ని యేండ్లవఱకు తనవికాసమునకు సంపూర్ణముగా తలిదండ్రుల నపేక్షించును.

ఈసంగతుల నెఱిఁగిన దంపతులు కేవలము కామతృప్తి నొనర్పరు. సంతానము కైయే వారు గృహమేధు లగుదురు. సంయోగము నిద్రవలె, ఆహారమువలె ఆవశ్యకమైన యొక పని యని యనుకొను టొక ఘోరమగు అజ్ఞానముగా నాకు కానిపించెడిని. లోకాస్తిత్వము జనన క్రియను అవలంబించి యున్నది. లోక మీశ్వరునకు లీలాభూమి; అతని మహిమకు ప్రతిబింబము. స్త్రీపుంస సంయోగము ప్రజాతంతువుయొక్క సక్రమాభివృద్ధి కొఱకు నిర్మితమని యెఱుఁగునో అతఁడు భగీరథప్రయత్నము చేసియైనను తన లాలసతను పోఁగొట్టుకొనుఁగాక! మఱియు సంయోగ ఫలస్వరూపముగ నేసంతతిని పడయఁగలఁడో ఆ సంతతియొక్క శారీరక మానసి కాధ్యాత్మిక రక్షణము చేయుట కావశ్యకమగు జ్ఞానము పొందుఁగాక! మఱియు దానివలన దన సంతతిని లాభాన్వితముఁ జేయుఁగాక!

## ౭

## బ్రహ్మచర్యము—౧

ఇది నా బ్రహ్మచర్యవ్రతమునుగూర్చి వక్కాణింపదగినతఱి; పెండ్లి నాఁడే ఏకపత్నీవ్రత మనునది నా హృదయమున తావుకొనెను. అది నా సత్యవ్రతమునకొక యంగము. గార్హస్థ్యమునందును బ్రహ్మచర్యముయొక్క ఆవశ్యకత నాకు దక్షిణ-ఆఫ్రికాలో కానిపించెను. ఏ ప్రసంగప్రభావమున, మఱియేపుస్తక ప్రభావమున ఈ బ్రహ్మచర్యావశ్యకత కానిపించెనో అది నేఁడు సరిగా గుర్తు చాలదు. రాయచందుభాయి ప్రధానకారణ మయియుండునని మాత్రము గుర్తు.

మా యిరువుర సంభాషణ మొకటి యింకనుగుర్తు కలదు. ఒకతూరి నేను గ్లాడ్‌స్టన్‌గారియెడ వారి భార్యకుఁ గల ప్రేమను ప్రస్తావించుచుంటిని. హౌస్ ఆఫ్ కామన్సులో నుండునపుడుకూడ నామె భర్తకు తేనీరు కాచి యిచ్చుచుండెడిదని యెచటనో చదివియుంటిని. నియమనిష్ఠులయిన ఆ దంపతుల జీవితమున కిది నియమమైపోయెను. ఈ విషయమును ఆ కవికిఁ జెప్పి ప్రసక్తి ననుసరించి దంపతిప్రేమను స్తుతించితిని. రాయచందు భాయి యిటు లనెను—“గ్లాడ్‌స్టన్‌గారి భార్య గాడ్‌స్టన్‌గారికి పరిచర్య చేసె నను విషయము దొడ్డదని కదా మీ రనుచున్నారు. ఆమె గ్లాడ్‌స్టన్‌గారి సోదరి యగు ననుకొనుఁడు. లేక విశ్వాసముకల ఒక బంటనుకొనుఁడు! వీ రిరువురును అట్టి ప్రేమతోడనే తేనీరు కాచి యిత్తు రనుకొనుఁడు! ఈ విషయమున భార్యా పరిచర్య దొడ్డదా? లేక సోదరియొక్కగాని, బంటుయొక్కగాని పరి

చర్య దొడ్డదా? ఇట్టి సోదరియొక్కగాని, బంటుయొక్కగాని ఉదాహరణములు మనకు లేవా? ఈ ప్రేమ స్త్రీజాతిలోఁ గాక పురుషజాతిలో కానిపించినచో అపుడు మీ కానందాశ్చర్యములు కలుగునా? ఈ విషయము కొంచె మాలోచించి చూడుఁడు.”

రాయచందుభాయి పెండ్లి అయినవాఁడే. ఆ సమయమున వీరి మాటలు నాకు కఠోరముగా నుండెను. కాని యీ మాటలు నూదంటు రాతివలె నన్నాకర్షించెను. భార్యకుఁగల స్వామిభక్తియొక్క విలువకంటె పరిచారకుని స్వామి భక్తియొక్క విలువ వేయిమడుఁగు లెక్కుడు కాదా? భార్యాభర్తలకు ప్రేమ యుండుటలో ఆశ్చర్యమే మున్నది? స్వామి సేవకులకు ఇట్టి ప్రేమ అభిప్రేయము. రాయచందుగారి వచనబలము క్రమముగా నన్ను వశపఱచికొనఁజొచ్చెను.

‘నేను నా భార్యతో ఎట్టి సంబంధ ముంచుకొనవలయును’? అని నాలో నాకు తోఁపఁదొడఁగెను. భార్యను భోగసాధనముగా జేసికొనుట ఏకపత్నీవ్రత మనఁజెల్లునా? ఎంతవఱకు నేను లంపటతకు అధీనుఁడనయి యుండునో అంతవఱకు ఏకపత్నీవ్రతమునకు విలువ లేదు. ఈ విషయము చెప్పఁదగియున్నది. నా భార్య నన్నెన్నఁడును మోహావశుని జేసి లోఁగొనలేదు. ఈ దృష్టితో నే నీదినములలో బ్రహ్మచర్యమును సులభముగా పాలింపఁగల ననుకొంటిని. ఆశక్తియే లేక కామాసక్తియే నకు అడ్డు.

జాగ్రత్తగా నున్నపిదపఁగూడ రెండుతూరులు పొరపడితిని. ప్రయత్నము చేయుచుంటినిగాని పడుచుంటిని. ఈ ప్రయత్నమునకు ముఖ్యమగు హేతువు దొడ్డదికాదు. కేవలము సంతానము కలుగకుండుటకు, సంతానము కలుగకుండఁ జేసికొనుటకు బాహ్యోపకరణములను

గురించి కొలఁది గొప్ప సీమలో చదివితిని. ఆహారప్రకరణమందు డాక్టరు అలిన్సను గారి ఈ యుపాయములగురించి తెలిపియుంటిని. కొంత కాల మది మంచి దనుకొంటిని. కాని డాక్టరు హిల్సుగారు దీనిని ఖండించి సంయమమే యుక్తమనిరి. ఆ విషయము నా మనస్సులో పడి అనుభవముచే నిలిచిపోయెను. దీనిచే ఇఁక నాకు సంతు వలదనుకొంటిని. దానితో ఈ యింద్రియ నిగ్రహోద్యమ మారంభమాయెను.

ఇందులకు నా పడిన పాటులకు హద్దు లేదు. మా శయ్యలు దూరమాయెను. లెస్సగా అలసిన తరువాత నిదురింపఁ బూనితిని. ఇంత ప్రయత్నమునకును విశేషఫల మీసమయమున కానరాలేదు. కాని భూతకాలముదెస నొకసారి తేఱిపాఱఁ జూచినచో ఇన్ని విఫలప్రయత్నములే కడసారి బల మొసఁగెనని నాకు తెలియుచున్నది.

చివరనిశ్చయము సరిగా ౧౯౦౬ వ సంత్సరమునఁగాని చేయఁబోసఁగలేదు. ఈ సమయమున నింకను సత్యాగ్రహమునకు గణేశపూజ కాలేదు. ఇంతవట్టు దానిని కలలోనైన ననుకొనలేదు. బోయరుయుద్ధ మయిన పిదప నేటాలులో జూలూ తిరుగుబాటాయెను. అపుడు నేను జోహాన్సుబర్గులో వకాలతు చేయుచుంటిని. ఆ తిరుగుబాటున నేటాలు సర్కారువారికి సేవ చేయవలెనని నాకు తోఁచెను. నే నటులు విన్నవించుకొనఁగా వా రంగీకరించిరి. ఆవిషయము ముందు రాఁగలదు. అయితే ఈ సేవకు ఫలముగా నా మనస్సులో తీవ్రాలోచన కలిగెను. నా స్వభావమునసుసరించి నా సైయ్యరతో ఆలోచించితిని. బిడ్డలను గనుట, వారిని పోషించుకొనుట ఈరెంటికిని,లోకసేవకును పొత్తు లేదని నా తలఁపు. ఈ తిరుగుబాటులో పని చేయుటకు జోహాన్సుబర్గునుండి మకాము ఎత్తివేయవలసివచ్చెను. అలంకరించికొనిన యింటిని, అమర్చికొనిన వివిధసామగ్రిని ఒకనెల కాకమునుపే విడిచివేయవలసి వచ్చెను.

ఆలుబిడ్డలను ఫీనిక్సులో నుంచితిని. పిదప నేను దెబ్బలు తినినవారికి శుశ్రూష చేయు సైన్యమును నడపింపఁ గడఁగితిని. ఆ యుద్ధమునందు అసిధారా సంచారములు చేయుచున్న తఱి లోకసేవాపరాయణుఁడనే యగుదునేని పుత్త్రైషణను, ధనైషణను ఒక నమస్కారము చేసి వానప్రస్థాశ్రమము తీసికొనవలయు ననుకొంటిని.

తిరుగుబాటులో రెండుమాసములకంటె నెక్కువ పని పట్ట లేదు. ఆయాఱు వారములు నాజీవితమున అమూల్యకాలము. అది వఱకుకంటె నపుడు శపథముయొక్క గొప్పదనము నాకు గోచరించెను. శపథము తీసికొనుట స్వాతంత్ర్యమునకు ద్వారము కాదనుకొంటిని. ఇంతవఱకు నా చేసిన ప్రయత్నములకు కలుగవలసిన ఫలము కలుగ లేదు. ఏలన నాకు నిశ్చలత కుదుర లేదు. ఇందులకు నిలువఁబడఁగలనను విశ్వాసము లేదు. ఈశ్వరుఁడు కరుణించునను విశ్వాసము లేదు. కావున నా మనస్సు అనేకతరంగములకు, అనేకవికారములకు లోనగుచుండెను. శపథముచే తనను బంధించుకొనక విడిగా నుండు మనుష్యుఁడు మోహమునఁ బడునని నే నెఱిఁగితిని. శపథముచేఁ దనను బంధించుకొనినచో నది వ్యభిచారమునుండి తొలఁగించి ఏకపత్నీవ్రతమున నిలిపియుంచును. 'ప్రయత్నమునందు నాకు విశ్వాసము; కాని శపథబంధనము మంచిది కాదు' అను నభిప్రాయము దౌర్బల్యసూచకము. ఇందు కొలఁది కొలఁదిగా భోగేచ్ఛ కలదు. ఏపని చేయరానిదో దానిని విడనాడుచో నేమి చేటు సొసఁగును? పాము కాటందుకొను నని తెలియుచో నిశ్చయపూర్వకముగా పరుగెత్తుదుము; పరుగెత్తుటకు యత్నముమాత్రమే చేయము. ఏలనఁగా కేవలము యత్నమే చేయుచు కూరుచుంటిమేని చావు సిద్ధమని మన మెఱుఁగుదుము. కేవలము ప్రయత్నముచేయుచు కూరుచుండుట యనఁగా సర్పమువలన మృత్యువు కలుగునని స్పష్ట

ముగా తెలియదన్నమాట. కాఁగా దేనిని మనము విడనాడుటకు ప్రయత్నముమాత్రము చేయుదుమో దాని విడనాడు నావశ్యకతను విస్పష్టముగా మనము గ్రహింపలేదని తేలుచున్నది. 'ముందీయూహాలు మాఱిపోవునో?' అను శంకచే పలుమాఱులు మనము శపథము తీసికొనుటకు భయపడుదుము. ఇది యంతయూ స్పష్టదృష్టి లేకుండుట వలన కలుగును. దీనిగుఱించి నిష్కుళానందుఁ డిటు లనెను: "త్యాగ నటకే రే వైరాగవినా*"

ఎపుడు దేనిసొంమెడల పూర్ణముగా వైరాగ్యము కలుగునో అపుడే శపథము పూనుట తనంతఁ దా ననివార్య మయిపోవును.

* ౧ భాగ-౩ ప్రక. ౧౩. పుట. చూ.

## ౮

## బ్రహ్మచర్యము—౨

విఎగుల చర్చించి కడు నాలోచించి ౧౯౦౬ వ సంవత్సరమున నేను బ్రహ్మచర్య వ్రత ధారణ మొనరించితిని. వ్రతము పూను వఱకు ఈ విషయమున నాభార్య యుద్దేశము కైకొనలేదు. వ్రత సమయమున ననుమతిం గైకొంటిని. ఇందులకు ఆమె యెట్టి ఆతంకమును పెట్టలేదు.

ఈ వ్రతము తీసికొనుటకు నాకు కడు కష్టమయిపోయెను. నాకు శక్తి కొలఁది. వికారముల నడఁప నెటులు? భార్యయెడఁ గూడ వికారముల కంటక యుండుట అర్థము లేని మాటగా కానిపించెను. అయినను అది నా కవశ్యకర్తవ్య మని తెలియుచుంటిని. నా లక్ష్యము శుద్ధము. కరుణించి ఈశ్వరుఁడు నాకు శక్తిని, సాయమును ప్రసాదించు గాక యని ఇందు దుమికితిని.

నేఁడు ఇరువదియేండ్ల పిదప ఈ వ్రతమును తలపోయుచుండఁగా నాకు ఆనందాశ్చర్యములు కలుగుచున్నవి. నిగ్రహమును గుఱించిన తలఁపును, తత్పరిపాలనమును ౧౯౧౧ వ సంవత్సరము వఱకును ప్రబలముగా ఉండెను. కాని యిపుడు నాకుఁ గల స్వతంత్రతయు, ఆనందమును ౧౯౦౬ వ సంవత్సరమునకు వెనుక నున్నటులు గుర్తులేదు. ఏలన, ఆ సమయమున వాసన లింకను నా కింక లేదు. ఏసమయమునసైనను చ్యుతి కలుగునని భయముండెను. ఇపుడు ఆ వాసన నామీఁద సవారి చేయఁ జాలదు.

మఱియు బ్రహ్మచర్యమహిమ ఒకనాఁటికన్న మఱియొకనాఁ డెక్కువగా అనుభవము కాఁదొడఁగెను. ఫీనిక్సునందు బ్రహ్మచర్యము నే కైకొంటిని. సేననుండి సెలవుగొని ఫీనిక్సు వెళ్లితిని అటనుండి వెంటనే జొహాన్సుబర్గు వెళ్లవలసియుండెను. అటకు వెళ్లితిని. పిదప నెల లోపుగా సత్యాగ్రహ సంగ్రామమునకు ప్రతిష్ఠ జరిగెను ఈ బ్రహ్మచర్యధారణము నన్ను సత్యాగ్రహ ప్రతిష్ఠాపనకు సిద్ధపఱిచెను గాఁబోలు. ముందు ఆలోచించుకొని నేను సత్యాగ్రహమును కల్పింపలేదు. అది అనాయాసముగ కోరకుండ తనంతట ప్రభవించెను. కాని దీనిముందు నే నేయే పనులు చేసియుంటినో అనఁగా ఫీనిక్సువెళ్లుట, జొహాన్సుబర్గులో గృహవ్యయమును తగ్గించియుండుట, తుదకు బ్రహ్మచర్యవ్రతమును పూనుట యివన్నియూ దీనికి సూచకములవలె నుండెను.

బ్రహ్మచర్యమును సరిగా పాలించుట యనఁగా బ్రహ్మదర్శన మొనరించుట. ఈ జ్ఞానము నాకు శాస్త్రములవలనఁ గలుగలేదు. నాకీయర్థము మెల్ల మెల్లగా అనుభవసిద్ధ మగుచువచ్చెను. శాస్త్రవచనములు పిదపఁ జదివితిని. బ్రహ్మచర్యమువలన శరీరరక్షణము, బుద్ధిరక్షణము, ఆత్మరక్షణము సమస్తము కలుగునను సంగతి బ్రహ్మచర్యము దాల్చిన పిదప దినదిన మధికాధికముగా అనుభవము కాఁదొడఁగెను. ఏలయనఁగా బ్రహ్మచర్య మనిన ఘోరమగు తపశ్చర్య యనిపించుటకు బదులు నాకిపుడు రసమయ మనిపించుచున్నది; దీని బలమువలననే పనులు జరుగుచున్నవి. దీని సౌందర్యము దైనందిన మెక్కువగా కానిపించుచున్నది.

అయితే నేనిటులీరస నిష్యందములను గ్రోలుచున్నను దీని కాఁకగూడ నాకు దగులుట లేదని యెవ్వరును అనుకొనకుందురుగాక!

నేటితో నాకేఁబదియాఱేండ్లు నిండినవి; అయినను దీని కాఠిన్యము నాకు గోచర మగుచునేయుండెను. ఇది యసిధారావ్రత మని నానాఁటి కెక్కువగా తోఁచుచున్నది. ఎల్లప్పుడును దీనియెడ మెలకువగా నుండు టావశ్యకమని గ్రహించుచున్నాను.

బ్రహ్మచర్య వ్రతపాలనమునకు నాలుకను కట్టుకొనవలయునని నా తలఁపు. నాలుకను జయించినచో బ్రహ్మచర్యము మిగుల తేలికయయిపోవునని నేను కేవల మనుభవమువలన కనిపెట్టితిని. ఈ కారణమున నిటుపిమ్మట నాభోజన ప్రయోగము శాకాహారదృష్టితోఁగాక బ్రహ్మచర్యదృష్టితో కాఁదొడఁగెను. మిత్రమును, కేవలమును కారము, పోపులు లేనిదియు వీలయినంతవఱకు వండకయున్నదియు, అనఁగా స్వాభావికమగు నాహారము మంచిదని అనుభవమువలన కనుఁగొంటిని. బ్రహ్మచారికి వనపక్వములగు పండ్లు సరియగు నాహారమని ఆఱేండ్లు తఱచి తఱచి కనిపెట్టితిని. కేవలము పండ్లు తిని యుండునపుడే సుఖమును ఏ నిర్వికారతయు నాకు కలదో ఆసుఖమును, ఆ నిర్వికారతయు పండ్లను మార్చి మఱియొక యాహారమును కైకొనునపుడు లేకపోయెను. పండ్లదిను దినములలో బ్రహ్మచర్యము సులభమాయెను. పాలు పుచ్చుకొను దినములలో కష్టసాధ్యమాయెను. పండ్లు విడిచి పాలేల పుచ్చుకొనవలసి వచ్చెనో యది యథాసమయమున తెలుపఁగలను. బ్రహ్మచారికి పాలు విఘ్నకారకములనుటలో నాకు తిలమాత్రమును సందియము లేదని మాత్రము చెప్పినచో నిటఁ జాలును. కాని బ్రహ్మచారికి పాలు నిషేధమని యెవరును అర్థముచేసికొన కుందురుగాక! బ్రహ్మచర్యమున కాహార ప్రాముఖ్యమెట్టిది? ఎంత? అను విషయ మింకను తఱచి తఱచి చూడవలసియున్నది. పాలంత స్నాయువర్ధకమును, జీర్ణకరమును నగు ఫలాహారము నాకింతవఱకును తెలియలేదు. ఏ వైద్యుఁడును, ఏ హకీమును

ఏ డాక్టరును తెలుపఁజాలకపోయిరి. పాలు వికారము కలిగించునని తెలిసినను ఈ పయికారణమున పాలు త్యాజ్యమని చెప్పఁజాలను.

ఆహారప్రకారము ఆహారనియమముల వలె నుపవాసముగూడ నొక బాహ్యాచారము. ఇంద్రియగ్రామమునకు రాక్షసబలము కలదు. నలుప్రక్కలు పదిదిక్కులు క్రింద మీఁదులు కాఁపలా యుంతువుగాక! అది దూసికొని పోవును. కడుపు మాడ్చినయెడల నింద్రియములు దుర్బలము లగువని అందఱకుఁ దెలియును. ఇచ్ఛాపూర్వకముగా చేయఁబడు నుపవాసము ఇంద్రియదమమునకు తప్పక తోడుపడఁ గలదనుటలో నా కించుకయు సందియము లేదు. అయితే ఉపవసించువారిలో పలువురు సఫలురగుట లేదు. కేవల ముపవాసమువలననే సమస్తమును సిద్ధించునని వారనుకొందురు. బాహ్యోపవాసము మాత్రము చేయుదురు కాని మనస్సులో భోగముల నన్నిఁటిని భోగించుచునే యుందురు. ఉపవాసానంతర మేమేమి తిందము? అని ఆలోచించుచు ఆ తినఁబోవువాని రుచు లుపవాసదినములలోనే మనస్సునం దాస్వాదించుచుందురు. మరల రసనేంద్రియసంయమము లేకపోయెను. జననేంద్రియసంయమము లేకపోయెనని నిరసించుచుందురు. మనస్సుకూడ నెపుడు ఇంద్రియనిగ్రహమునకు బాసట యగునో అప్పుడే ఉపవాసమునకు ఫలము కలుగును. అనఁగా మనస్సునందు విషయభోగముల యెడల వైరాగ్యము పుట్టవలయును. విషయములకు మూలము మనస్సు. మనస్సు వశమగునెడల నుపవాసాది సాధనములు ఎక్కువ ఉపకరించును. కానినాఁడు అంతగా నుపకరింపవు. అయితే ఉపవసించినను మనుష్యుఁడు విషయాసక్తుఁడు కాకపోఁడనవచ్చును గాని ఉపవాసము వినా విషయాసక్తి సమూలము నశింప దనవచ్చును. కావున ఉపవాసము బ్రహ్మచర్యమున కనివార్యమగు నుపకరణము.

బ్రహ్మచర్యము చరించువా రనేకవిధముల విఫలత్వము పొందుచున్నారు. ఏలనఁగా వా రాహార విహారములందు అబ్రహ్మచారులవలె వర్తించుచున్నారు. ఇటులు వర్తించియు బ్రహ్మచర్యమును రక్షించుకొనఁ దలఁచుచున్నారు. ఇది గ్రీష్మమున హేమంతమును గోరుట. స్వచ్ఛందవర్తనుని జీవనముకంటె సంయమము కలవాని జీవనమునందు భేద ముండవలయును. భోగిజీవనముకంటె త్యాగిజీవనమునందు భేద ముండవలయును. ఇరువురికిని పైపైని సామ్యమే కాని లోలోపల భేదమే. ఇరువురును చూచుచుందురు గాని బ్రహ్మచారి పరమేశ్వరుని జూచును. భోగి నాటకములను, సినీమాలను జూచును. ఇరువురును విందురు. బ్రహ్మచారి యీశ్వరభజన వినును. భోగి విలాస గీతములు వినును. ఇరువురును జాగరణము చేయుదురు. ఒకఁడు హృదయ మందిరమున రాముని ఆరాధించును. మఱియొకఁడు నాట్యరంగములలో మైమఱచును. ఇరువురును భుజింతురు. ఒకఁడు శరీరరూపమయిన తీర్థక్షేత్రముల రక్షామాత్రమునకు ఆరగించును. మఱియొకఁడు రుచులకు అనేకపదార్థములతో పొట్టనింపి దుర్గంధము చేసివైచెను. ఇటు లిరువురును ఆచారవిచారములలో భేద ముంచుకొనుచునే యుందురు. ఇది ప్రతిదిన మెక్కునే కాని తగ్గదు.

బ్రహ్మచర్య మనఁగా మనోవాక్కాయములచే సర్వేంద్రియములను నిగ్రహించుట. ఇందులకు పూర్వోక్తముల నన్నిటిని విసర్జింపవలయునని దైనందినము నాకు విశదమగుచున్నది. నేఁటికిని అటులే విశదమగుచున్నది. త్యాగక్షేత్రమున కెల్ల లేనటులే బ్రహ్మచర్యమహిమకును ఎల్ల లేదు. ఇట్టి బ్రహ్మచర్య మల్పప్రయత్నసాధ్యము కాదు. పలువురి కిది యెల్లపుడును ప్రాప్యముగనే యుండును. దానఁజేసి ప్రయత్నశీలుఁడగు బ్రహ్మచారి యెల్లపుడును తన లోటులను కని

పట్టుకొను చుండవలయును. తన హృదయకుహరమున గూఢముగా దాఁగియున్న వికారములను పోఁగొట్టుకొనుచుండవలయును. ఎంత వఱకు వృత్తులను నిరోధింపలేడో అంతవఱకును అది సంపూర్ణ బ్రహ్మచర్యము కాదు. వృత్తు లెన్నివిధములేని యగుఁగాక అవన్నియు వికారమే. వీనిని వశపఱచికొనవలయు ననినచో మనస్సును వశపఱచికొనవలయును. ఇఁక మనోనిగ్రహము వాయునిగ్రహమువలె సుదుష్కరము. ఇటు లయినను మనస్సునం దీశ్వరుఁ డున్నచో నదియు సులభము కాఁగలదు. దారిలో కడుఁ జిక్కులు కలుగును కావున నది యసాధ్యమని యెవ్వరు ననుకొన కుందురు గాక! అది పరమార్థము. అట్టి పరమార్థమునకు పరమప్రయత్న మావశ్య మగుటలో ఆశ్చర్యమేమి?

అయితే ఇట్టి బ్రహ్మచర్యము కేవలప్రయత్నసాధ్యము కాదని దేశమునకు తిరిగివచ్చిన తరువాత తెలిసికొంటిని. అంతవఱకు ఫలాహారమువలన వికారములు సమూలము నశించిపోవు ననియు తావన్మాత్రమున మఱియేమియు చేయఁబనిలేదను మోహమునఁ బడియుంటి ననియు చెప్పనగును.

అయితే ఇందులకు నా చేసిన ప్రయత్నములను దెలుపుటకు విలంబము వలయును. ఈ నడుమ ఈ విషయము తెలుపుటావశ్యకము. ఈశ్వరసాక్షాత్కారముకొఱకు నేను చెప్పియున్న బ్రహ్మచర్యమును చరింపఁగోరు వారు తమ ప్రయత్నముతో పాటు ఈశ్వరునిపై శ్రద్ధ వహింపఁగలవా రగుదురేని యీ విషయమున నిరాశు లగుట కిసుమంతయు కారణము లేదు.

* విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః, రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. గీత-౨ అధ్యా-౫౯.

కావున ఆత్మదర్శనము కావలసినవానికి రామనామము, రామకృపయును అంతిమసాధనములు. నేను భారతదేశమునకు వచ్చిన తరువాతనే యీ విషయ మనుభవము చేసికొంటిని.

* ఆహారము మానివేసినవానికి విషయములు శాంతించును, కాని రసము శాంతించదు ఈశ్వరదర్శనమువలన రసమును శమించును.

## ౬

# మితవ్యయము

నేను భోగముల ననుభవింపసాగితిని గాని అది యెంతో కాలము సాగలేదు. గృహాలంకారమునకు వలయు సాధనసామగ్రిని నింపితిని. కాని యీ వ్యామోహము నిలువలేదు. కావున వ్యయము తగ్గించుకొనిరా మొదలిడితిని. చాకలిఖర్చుకూడ ఎక్కు వనిపించెను. ఇంతియ కాక వాడు బట్టలు సరిగా తీసికొనిరాఁడు. ఇందువలన రెండు మూఁడు డజనుల కమీజులును అన్నికాలర్లును ఉన్నను చాలెడివి కావు. ఒకొక్క కాలరు ఒకొక్కనాఁటితో సరి. రోజూ కాకపోయినను కమీజు మూణ్ణాళ్ల కొకతూరి మార్పవలసి యుండెడిది. ఈ రీతిగా వ్యయ మమిత మాయెను. ఇది వ్యర్థమని తోఁచెను. ఇందువలన నేనే ఇంట ఉతుకుకొనఁ దలఁచితిని. బట్టలుతుకుటను గూర్చి వ్రాయఁబడిన పుస్తకములు చదివి ఆ విద్య గ్రహించితిని. నా భార్యకును నేర్పితిని. ఇందువలన పని బరువాయెను గాని యిది యొక క్రొత్తపని యగుట వలన మనోవినోదముగాను ఉండెను.

నేను మునెమ్మొదట బాగుచేసిన కాల రెన్నటికిని మఱపువచ్చుటకు వీలు లేదు. పిండి యెక్కు డాయెను. ఇస్త్రీపెట్టె సరియగు వేఁడికి రాలేదు. మఱియు కాలరు కాలిపోవునను భయమున ఇస్త్రీ పెట్టెను అడిచి తోమ లేదు. ఇందువల్ల కాలరు గట్టిపడెను గాని దీనినుండి పిండి వర్షించుచుండెను.

## ౯ మితవ్యయము

ఇట్టి కాలరుతో కోర్టుకు పోయి తోడి బారిస్టరుల హాస్యమునకు సాధనమును కల్పించితిని. అయితే ఈ హాస్యమును సహింపఁగల పాండిత్యము నా కాసమయమున గూడ కొఱఁతకాదు.

'కాలరు నాయంత నే నిస్త్రీచేసికొనుట కిది ప్రప్రథమము. కావున దీనినుండి పిండి రాలుచున్నది. రాలిన రాలుగాక. మఱియు మీయందఱకు నిది వినోదకారణమగుట చాల గొప్పమాట' అని నా సంగతి యంతయు స్పష్టముగా చెప్పితిని. 'ఇచట చాకళ్లకు కఱవు కాదుగద?' అని యొక మిత్రుఁ డడిగెను.

'చాకలిఖర్చు రెట్టికి రెట్టిగా నున్నది. కాలరు వెల యెంతో దాని నతుకు ఖర్చును అంత. ఇంతియకాక, చాకలవానికొఱకు పడ గాఁపులు కాయవలయును. ఈ కష్టములచే నాయంత నేనే యుతుకుకొనుట మంచిదనుకొంటిని.'

ఎవరిపని వారు చేసికొనుటలోఁగల యందము వారికి నచ్చఁ జాపజాలక పోతిని.

తుదకు చెప్పవలసిన దిది—నా పని నాకు వెళ్లఁబాఱిపోవునటు లీవిద్యలో కౌశల్యము గడించితిని. మఱియు నా యిస్త్రీ చాకలి యిస్త్రీ కెంతమాత్రమును తీసిపోలేదు. చాకలి యిస్త్రీచేసిన కాలరు కంటె నా చేసిన కాలరులో జిగితనమును, నిగనిగయు ఇసుమంతయు కొఱలేదు. స్వర్గీయులగు మహాదేవ గోవింద రానడే గారు గోఖలే గారి కొక సేలువను ప్రసాదించిరి. గోఖలేగారు దానిని ప్రాణపణముగా చూచుకొనుచు సమయవిశేషములందే దానిని దాల్చుచుండిరి. జోహన్సుబర్గులో గోఖలేగారికి చేసిన విందు చాల దొడ్డది. ఆ సమయము మిగుల గొప్పది. అపుడు వా రిచ్చిన యుపన్యాసము దక్షిణ-

ఆఫ్రికాలో వారిచ్చిన ఉపన్యాసము లన్నింటికంటె గొప్పది. కాఁబట్టి వారి కాసమయమున ఆ నేలువ తాల్ప మనసాయెను. ఆ నేలువ ముడ తలు పడియుండెను. దాని నిస్త్రీ చేయింపవలయును. అంతలో దానిని చాకలికి వేసి యుతికించి తెప్పించు టసంభవము. 'నా విద్య నుగూడ కొంచె మిపుడు పరీక్షింపుఁ' డంటిని.

'నీ లాయరు విద్యను విశ్వసింప జెల్లును గాని మఱి చాకల విద్యనా? నీవు దీనిమీఁద మఱకలు పడవైచుచో? దీనివల యెం తయో నీకు తెలియునా?' ఇట్లులని గోఖలేగారు అది తమ కెట్లులు ప్రసన్న మైనదో ఆ సంగతి అతిసంతోషముతో తెలిపిరి.

మఱకలు పడవేయకుండుటకు పూఁచీపడెదనని గోఖలేగారిని ప్రార్థించితిని. దీనికి ఫలముగా ఇస్త్రీచేయు గౌరవము నాకు దక్కెను. వారు నాకు 'మంచి చాకలి' యని బిరుదు నిచ్చిరి. చాలు. ఇఁక లోక మంతయు నీయకున్న నేమి?

చాకలి దాస్యమునుండి విడిపించికొనిన చందముగనే మంగలి దాస్యము కూడ విడిపించుకొనవలసిన అక్కఱ కలిగెను. సీమకు వెళ్లువా రందఱును తుదకు గడ్డము మాత్రమైనను క్షౌరము చేసికొన నేర్తురు కాని తలవెంట్రుకలు కత్తిరించుకొనుట యెవరును నేర్చికొని యుండ రనుకొందును. ప్రిటోరియాలో నే నొకతూరి మంగలిదుకా ణమున కేఁగితిని. అచట నా మంగలి 'నీకు క్షౌరము చేయను పొ'మ్మ నెను. ఇంతియకాక తిరస్కారము చేయు టొకటి అధికము. నాకు చాల కష్టము కలిగెను. నేను నూటిగా బజారుకు పోతిని. కత్తెర యొకటి కొంటిని. అద్దము నెదుట నిలువఁబడి కత్తిరించుకొంటిని. ముందఱి వెం ట్రుక లెట్లో ఒకట్లు కత్తెరపడినవి. కాని వెనుక వెంట్రుకలు కత్తి

రించుకొనుట చాల కష్టమాయెను. మఱియు నా కోరినరీతి కత్తెర పడలేదు. కోర్టులో దీనినిగుఱించి కోలాహల మాయెను.

'నీ తలమీఁద ఎలుక లేమేని తిరుగుచున్నవా?'

'లేదు. నా నల్లతలను తెల్ల మంగలి యెట్లు లంటుకొనును? అందులకని నేనే యెట్లో ఒకట్లు కత్తిరించుకొంటిని. ఇదియు నా కధిక ప్రియము.'

ఈ ప్రత్యుత్తరమువలన వారి కాశ్చర్యము కలుగలేదు. సత్యమునకు ఇందు మంగలి యపరాధ మేమియును లేదు. నల్లవారికి క్షౌరము చేయుచో వీని కూడు పడిపోవును. మనము మాత్రము మన మంగళ్ళచే మాలలకు క్షౌరము చేయనిత్తుమా? దక్షిణ-ఆఫ్రికాలో దీనికి ప్రతిఫల మొకమాఱు కాదు పలుమాఱులు నాకు కానిపించెను. ఇది మన పాపఫలమే యను నుద్దేశము ధ్రువ మాయెను. దానివలన నెన్నడును నాకు రోషము కలుగలేదు.

నా పను లన్నియు నేనే చేసికొనుట,వ్యయము తగ్గించుట,అను నీ కోరికలు జనించి యెటులు తీవ్రరూపములు ధరించెనో దానిని యథాప్రసంగమున వక్కాణింతును; కాని దీనికి మూలము బహు పురాతనమైనది. ఇది పూచుటకును కాచుటకును, నీరు చల్లుటయే యావశ్యకము. మఱియు ఆ కాలము అనాయాసముగా సంభవించెను.

# ౧౦

## బోయరు యుద్ధము

౧౮౯౭ మొదలు ౯౯ వఱకును నా జీవితమునందలి యితరానుభవముల వదలివైచి బోయరు యుద్ధమును గూర్చి చెప్పెదను. యుద్ధము సాఁగినపుడు నా మనోభావములు సంపూర్ణముగా బోయరులపక్షమున నుండెను. ఇటువంటి విషయములలో వ్యక్తిగతమైన అభిప్రాయముల ననుసరించి పనిచేయుట కధికార మింకను నాకు కలుగలేదని అపుడు నే ననుకొంటిని. దీనిగుఱించి నా హృదయమున నెంత మథన జరిగెనో దాని సూక్ష్మవిచారణము 'దక్షిణ-ఆఫ్రికా సత్యాగ్రహ' ఇతిహాసమందు వివరించితిని గాన దాని నిటఁ దడవను. వలయువారట నరయుదురు గాక! ఇచట నీవిషయము వ్రాసినఁ జాలును—తెల్లదొరతనమునందలి విశ్వాసము ఈ యుద్ధమున సాయపడుమని నన్ను ముందులకు త్రోసెను. మేము తెల్లదొరతనమువారి ప్రజలమను యోగ్యతచే మన కుండవలసిన హక్కులను మనము నిర్బంధించి పుచ్చుకొనుచో తెల్లదొరతనమువారి ప్రజలమను యోగ్యతచేతనే బ్రిటిష్ రాజ్యమును రక్షింప సాయపడుట మనకు ధర్మమయి యున్నదని నేనెంచితిని. భారతీయుల కన్నివిధముల నున్నతి రావలయుచో బ్రిటిష్ సామ్రాజ్యమువలననే రావలయునని నాఁడు నే ననుకొనుచుండెడివాఁడను.

ఈ కారణమున చేరినంతమంది మిత్రులను కూడఁదీసికొని యుద్ధమున దెబ్బలు తినినవారి రక్షణకు మిగుల కష్టించి ఒకదళమును పోగు

చేసితిని. అప్పటికి ఆంగ్లేయులు నల్లవారనఁగా పిఱికివారనియు, అపాయముల నెదురుకొనఁజాలనివారనియు, వారికిఁ గావలసిన పని వారు చూచుకొనుట తక్క నితర మక్కఱలేని స్వార్థపరులనియు, ననుకొనుచుండువారు. ఇందువలన నా ఆంగ్ల మిత్రులు పలువురు నా ప్రయత్నమును చప్పరించిరి. ఒక్క డాక్టరు బూత్ గారు లెస్సగా ప్రోత్సహించిరి. రణాభిహతులకు ఏమేమి చేయవలయునో దాని నంతయు నేర్పిరి. మే మీపనికి తగినవారమని డాక్టరుకడనుండి సర్టిఫికెట్టులు పుట్టెను. లాటనుగారును, స్వ. మి. ఎస్కాంబిగారును ఈ మా యుద్దేశమును మెచ్చుకొనిరి. యుద్ధమున మా సేవ ననుమతింపవలసినదని తుదకు సరకారును వేఁడితిమి. సరకారువారు మమ్మభినందించిరి. కాని ఇపుడు మీ పనితో జరూరు లేదనిరి.

అయితే నే నీ 'జరూరులేదు'తో నూరకుండలేదు. డాక్టరు బూత్ గారి మద్దతుతో నేటాలు బిషప్పుగారిని దర్శించితిని. మా దళమున చాలమంది భారతీయక్రైస్తవులు కలరు. బిషప్పునకు మా యుద్యమ మానందము కలిగించెను. 'నేను మీకు సాయము చేయఁ' గలననెను.

ఇంతలో ఘటనాచక్రము తన పని చేసికొనుచుఁ బోవుచుండెను. బోయరుల సన్నాహము దార్ఢ్యము పరాక్రమము మొదలగునవి అనుకొనినంతకంటె చాల నెక్కువగా కానిపింపఁదొడఁగెను. సరకారువారికి కూటువమూఁకను (రిక్రూటు) పోఁగుచేసికొనవలసివచ్చెను. తుదకు మా ప్రార్థనయు నంగీకరింపఁబడెను.

మా దళమున సుమారు ౧౧౨౦ మంది కలరు. ఇందు నాయకులు సుమారు నలుబండ్రు. సుమారు మున్నూటుగురు స్వతంత్రులగు భార

తీయులు, మిగిలినవారు గిరిమిటియాలు. డాక్టరు బూత్ గారును మాతో నుండిరి. దళము చక్కగా పనిచేసెను. దీని పని సేన కీవల. మఱియు దీనికి రెడ్‌క్రాస్* గుర్తు రక్షణమునకుఁగాను అంటింపఁబడెను. మఱియు నొక సమయమున యుద్ధక్షేత్రములోనికిఁగూడ నీ దళము పోవలసివచ్చెను. లోగడ సర్కారువారు వారి యిష్టము చొప్పుననే అపాయస్థలము లోనికి మమ్ము ప్రవేశింపఁ జెప్పలేదు. కాని స్పియాంకోపు జాఱిపోయినపిదప స్థితిగతులు మాఱెను. అపుడు జనరల్ బులరుగారు— ‘సాక్షాద్యుద్ధక్షేత్రమునందు పనిచేయవలయునను నిర్బంధము మీకు లేదు. అయినను అపాయమునకు సిద్ధపడి పడిపోయిన సిపాయీలను గాని, ఆఫీసర్లనుగాని రణక్షేత్రమునుండి ఎత్తి డోలీలలో తీసికొని వచ్చుటకు ఇయ్యకొందురేని సర్కారువారు మీ యుపకారమును మన్నింతురని’ వార్త నంపిరి. మే మందుఱకు సిద్ధముగ నుంటిమంటిమి. కావుననే స్పియాంకోప్ యుద్ధ మయినపిమ్మట మేము ఫిరంగి గుండ్లు, తుపాకిగుండ్లు పడుచోట్ల పనిచేయఁ గడఁగితిమి.

ఈదినములలో అందఱకు నొకొక్కమాఱు ౨౦, ౨౫ మైళ్ల వఱకు తిరిగి పనిచేయవలసి యుండెడిది. ఒకొక్కతూరి దెబ్బలు తిని పడిపోయినవారిని డోలీలలో నింతదూరమును మోసికొని రావలసి యుండెడిది. ఇట్టివారలలో జనరల్ వుడ్‌గేటువంటి యోధులను జేరవైచు భాగ్యమును మాకు కలిగెను.

* రెడ్‌క్రాస్ అనఁగా లోహితస్వస్తికము. యుద్ధమున పడిపోయినవారి ఉపచారము చేయువారు ఎడమచేతిమీద పెట్టుకొను ఎఱ్ఱగుర్తు. ఈ గుర్తు గలవారిని శత్రువులు కొట్టరు. అధికము తెలియఁగోరువారు ద - ఆఫ్రికా-సత్యా-౧-౯. అరయుదురుగాక!

## ౧౦ బోయరుయుద్ధము

ఆఱువారముల పిదప మాదళమునకు విడుదల యాయెను. స్పియాంకోపును, వాల్ క్రాంజును చేతులనుండి జారిపోయినపిమ్మట లేడీస్మిత్ మొదలగు తావులను బోయరుల ముట్టడినుండి వడిగా విడిపించు నుద్దేశమును మానుకొని బ్రిటిషు సేనాపతి ఇంగ్లండునుండియు ఇండియానుండియు సేనలను రావించుటకును అంతవట్టు మెల్ల మెల్లగా పనిచేయుచుండుటకును నిశ్చయించుకొనెను.

మా యొనర్చిన యీస్వల్పకార్యమున కాసమయమున చాల మెచ్చోదవెను. దీనివలన భారతీయుల ప్రతిష్ఠ పెరిఁగెను. 'ఊ.... ఇంతకు భారతీయులన నెవ్వరు? రాజ్యపువారసుల్ గదా!' అను మకుటముతో పద్యములను పత్రికలు ప్రకటించెను. జనరల్ బులరు మా సేవను ప్రశంసించెను. మాదళపు నాయకులకు మెడల్సుకూడ లభించెను.

దీనివలన భారతీయులలో ఐక్య మెక్కువాయెను. నాకు గిరిమిటియాలతో సంపర్కము వృద్ధియాయెను. వీరిలో మిగుల వివేకముదయించెను. హిందువు, తురక, క్రైస్తవుఁడు, మదరాసి, గుజరాతి, సింధీ అందఱును హైందవులే యను భావన మిగుల దృఢపడెను. ఇఁక భారతీయుల కష్టములు గట్టెక్కు నని అంద ఱనుకొనిరి. ఇటుపిమ్మట తెల్లవారి నడతయందును విస్పష్టముగా భేదము కానవచ్చెను.

యుద్ధసమయమున తెల్లవారికిని మాకును కలిగిన సంబంధము మధురమైనది. వేలకొలది తెల్లసోల్జరుల పొత్తు మాకు కలిగెను. వారు మాతో మైత్రి పాటించిరి. తమకు మే మొనరించిన సేవకు వారు కృతజ్ఞతాబద్ధులైరి.

దుఃఖసమయములందు మనుష్యస్వభావ మెటులు ద్రవించునో యిందులకు అపుడు జరిగిన యొకసంగతిని చెప్పక తప్పదు. మేము

చీవలీశిబిర ప్రాంతమున సంచరించుచుంటిమి. రాబర్ట్సు ప్రభువు పుత్రుఁడు లెఫ్టినెంటు రాబర్ట్సుగారికి మర్మావిధమగు గుండు తగిలెను. వారు ప్రాణములఁ బాసిరి. వారిని మోచికొనిపోవు భాగ్యము మా దళమున కబ్బెను. మరలి వచ్చునపుడు ఎండ ఉడికిపోవుచుండెను. అందఱకును నాలుకలు పెడ లాఁగుచుండెను. దారిలో నొక చిన్న సెలయేఱుండెను. ముం దెవరు త్రాగవలెను?' అను ప్రశ్న. 'తెల్ల సోల్జరులు త్రావుపయి మేము త్రావెద' మంటిమి. ఆ తెల్ల సోల్జర్లు మమ్ముచూచి వెంటనే—'ముందు మీరందఱును త్రావుఁ'డనిరి. 'కాదు. ముందు మీరు త్రావుఁ'డని మేమంటిమి. ఇటులు చాల ప్రొద్దువఱకు 'మీరు త్రావుఁ డనిన మీరు త్రావుఁ'డని ప్రేమగౌరవముతో పోటీలు పడితిమి.

## ౧౧

## నగరసంస్కరణము—క్షామనిధి

సంఘశరీరమునందే యవయవమేని పనికి రాకపోవుట యెప్పుడును నాకిష్టముకాదు. లోకుల దోషముల కప్పిపుచ్చి వానిని చూచీ చూడనట్లు లూరకుండిగాని లేక వానిని పోయఁజేయకుండిగాని మా హక్కులను మాకిమ్మఁడని కోరుట నాకరుచికరము. దక్షిణ-ఆఫ్రికాలోని భారతీయులమీఁద నొక ఆక్షేపముకలదు. అది యేదనఁగా: 'భారతీయులు ఎడ్డెమృగములు; వీరి యిండ్లు, వాకిండ్లు చెత్తచెదారములమైలతో నిండియుండును అని. మాటిమాటికీమాటయే. ఇందు కొంచెము సత్యము లేకపోలేదు. నేనచట నుండఁదొడఁగినదాది దీనిని దూరగింపఁ దలపోయుచుంటిని. ఈదోషమును ఆఁపివేయ సమకట్టినది మొదలుకొని పేరుపడియున్న పెద్దలయిండ్లన్నియూ పరిశుభ్రపడినవికాని దర్బనులో ప్లేగు ప్రవేశించి ప్రకోపించునను భయము పుట్టనంతవఱకు ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయ వలనుపడలేదు. ఇందు మునిసిపాలిటీవారి సమ్మతి కావలయును. అదియు నాయెను. మేము పనిచేయఁబూనుటవలన వారికిని తేలికయాయెను. మఱియు భారతీయుల కష్టములును తగ్గెను. ఎట్లనఁగా ప్లేగు మొదలగునవి ప్రకోపించి యున్నపుడు అధికారులు లోకులమీఁద విఱుచుకొని పడుచుండువారు. ఇందుల కుపాయములు సీమాతిగాము లయ్యెడివి. వీరి కిష్టులుకానివారి కోపలేనంత యొత్తిడి కలుగుచుండెడిది. భారతీయులు

శుచిగా నుండుట మొదలిడినపిదప అట్టి కష్టములుగాని, బాధలుగాని లేకపోయెను.

ఈసంబంధమున నేనును కష్టములు చవి చూచితిని. హక్కుల కొఱకు నేటాలుసరకారుతో పోరుటకు వీరివలన నెంత సాయము పడయఁగలిగితినో వీరి విధిని వీరిచేతఁ జేయించుటలో నంతసాయము పడయజాలకపోతిని. కొందఱు నన్నవమానించిరి. కొందఱు వినయపూర్వకముగా ఫరవా లేదు ఫరవా లే దని రోసరిల్లిరి. తమ మురికి తాము తీసివైచుకొనుట వారికి ఒక ఆపదవలె నుండెను. ఇందులకు డబ్బు ఖర్చుపెట్టుట యనఁగా నింకను కష్టము. దీనివలన నేను ఇదివఱకుకంటె లెస్సగా నేర్చికొనినదేమనఁగా—'లోకులచే నేపనియేని చేయింపఁ బూనుదుమేని మనకు శాశ్వతమైన ఓర్పుండవలయును.' సంస్కర్తకు కావలయునది కేవలము సంస్కరణము. ఏసంఘమున నతఁడు సంస్కారమును చేయఁగోరునో ఆసంఘమువలన విరోధమును, తిరస్కారమును ప్రాణాపాయము గూడ వచ్చునని కనిపెట్టి యుండవలయును. సంస్కర్త దేనిని సంస్కారమని తెలుపునో సంఘము దానిని 'వికార' మని యేల అనుకొనగూడదు? మఱియు వికార మనుకొనకున్న మానె; యీ విషయమున నుదాసీనముగా నేల యుండగూడదు?

ఈయాందోళనమునకు ఫల మిది—భారతీయుల సంఘమునకు ఇండ్లు వాకిండ్లు శుభ్రముగా నుంచుకొనవలసిన యావశ్యకత కొలఁదియో గొప్పయో తెలిసెను. అధికారులలో నాకు కొంచెము గౌరవ మినుమడించెను. నేను ఎల్లప్పుడు మొఱపెట్టుకొను చుండెడువాఁడను లేక హక్కులను వెదకుచుండెడువాఁడను అనియే కాక ఈపైవిషయము

లలో నేనెంత దిట్టరినో నా వారిని సంస్కరించుటలోఁగూడ నంత దిట్టరి నని వారికి బోధపడెను.

కాని సంఘపు మనోవికాసమున కింకను ఒకటి బాకీ కలదు. అది భారతవర్షమునెడ తన ధర్మము నెఱుఁగుట, దానిని పాలించుట. భరతవర్షము నిఱుపేద. అచటివారు ధనమునకు విదేశము లేఁగిరి. భారతవర్షమునకు ఆపత్సమయములందు వారు తమ సంపాదించిన ధనమున కొంచెము కొంచెము మీయ లగ్గు. ౧౮౯౭ సంవత్సరమున క్షామము వచ్చెను. ౧౮౯౯ సంవత్సరమున దానికంటె పెద్దక్షామము. ఈరెండు సమయములలో దక్షిణ-ఆఫ్రికానుండి పెద్దసాయము చేయఁబడెను. మొదటితూరి యెన్నియో మొత్తములు వచ్చెను. రెండవతూరి యింత కెంతయో యెక్కువ సొమ్ము చేయఁబడెను. మేము తెల్లవారిని గూడ చందా లడిగితిమి. వారును కడు సాయపడిరి. గిరిమిటియాలు కూడ చాల నిచ్చిరి.

ఈరీతిగా ఈరెండు క్షామములందును వారికి గలిగిన అలవాటు అటులే నిలిచిపోయెను. హిందూదేశమున నిట్టి సంకటములు కలిగినపుడెల్ల వారు ధనము పంపుచుండుట మన మెఱుఁగుదుము.

అటులు నేను దక్షిణ-ఆఫ్రికా భారతీయులకు సేవచేయుచు నొకటితరువాత నొకటిగా అనేకవిషయములను నేర్చికొనుచుంటిని. సత్య మనునది మహావృక్షము. దానిని మన మెంత యధికముగ పోషింతుమో యంత యధికముగ నది ఫలముల నొసగును. దానికి అంతమనున లేదు. నీవు దీనిగనిలోనికి దిగినకొలఁది సేవారూపములయిన రత్నములు నీచేతికి దొరకుచుండును.

## ౧౨

# స్వదేశాగమనము

యుద్ధకార్యము ముగిసినపిదప ఇఁక దక్షిణ-ఆఫ్రికాలో నాపని తీఱినదనియు, మఱి స్వదేశముననే కలదనియు గ్రహించితిని. దక్షిణ-ఆఫ్రికాలోనే యుండుచో ఏదో కొంచెము సేవకావశ్యకత చిక్కకపోదు కాని అక్కడనే యుండుచో నాకు డబ్బు సంపాదించుటే ముఖ్యకార్యమయిపోవునని శంకించితిని.

దేశమునందలి మిత్రులు దేశములోనికి రమ్మని బలాత్కరించుచుండిరి. దేశమునకు మరలుచో నా కెక్కుడు ఉపయోగ ముండునని నేనును అనుకొంటిని. నేటాలులో మి. ఖానుగారు, మనసుఖలాలు నాజరుగారును ఉండనేయుండిరి.

నా కిఁక సెల వొసఁగుఁడని నామిత్రుల ననురోధించితిని. అతి కష్టముమీఁద ఒకషరతుపెట్టి నా సెలవు మంజూరుచేసిరి. ఆషరతిది—ఒకసంవత్సరములోఁగా ఇక్కడివారికి మీతో పని పట్టునేని దక్షిణ-ఆఫ్రికాకు మరలి రావలయును. నా కాషరతు విషమషరతుగా నుండెనుగాని ప్రేమపాశముచే బద్ధుఁడనయితిని.

కాచేరే తాంతణే మనే హరజీ ఏ బాంధీ
జేమ తాణే తేమ తేమ నీరే
మనే లాగీ కటారీ ప్రేమ నీ. *

* ఆ. నాదు మెడకు నాదినారాయణుఁడు నన్న
ప్రేమతంతు వొండు వేసినాడు
దానిఁ బూని యతఁడు తా లాఁగుకొలఁదిని
నహహ, యతనిదాన నగుచునుంటి.

# ౧౨ స్వదేశాగమనము

మీరాబాయి చెప్పిన యీయుపమ యించుమించుగా నాయెడను సరిపడెను. పదుగురిలో పరమేశ్వరుఁ డున్నాఁడుకదా! మిత్రుల మాటను తీసివేయలేకపోతిని. మాట యిచ్చి సెలవుగొంటిని.

నా కీతటి నెక్కుడు సంబంధము నేటాలుతోనే. నేటాలులోని భారతీయులు నామీఁద ప్రేమామృతము కురిపించిరి. ఊరూర అభినందన పత్రములు. ఊరూర వెలగల కానుకలు.

నేను ౧౮౯౬ సంవత్సరమున దేశమునకు వచ్చునపుడును కానుకలు దొరకెను. ఈతూరి ఆకానుకలు, ఆసభలు చూచి బెదరిపోయితిని. బంగారు వెండియేగాక వజ్రములుకూడ.

నే నీకానుకల నన్నిఁటిని స్వీకరింపఁ జెల్లునా? నేను వీనిని దీసికొనుచో డబ్బుతీసికొని లోకసేవచేయలేదని అనుకొనఁదగునా? నాక్లయంట్లిచ్చినవి కొన్నిమాత్రముకాక కడమవన్నియు లోకసేవకొఱకేఁబడినవే అయినను నాచిత్తమున అవి క్లయంట్లిచ్చిన పనియు, ఇవి యితరు లిచ్చిన పనియు భేదము లేదు. పెద్దపెద్ద క్లయంట్లందఱును ఈసార్వజనికకార్యములకు సాయపడినవారే.

ఈకానుకలలో ఏఁబదిగినీల బంగారుహార మొకటి కస్తురిబాయికి ఉద్దేశింపఁబడినది. అయినను అది నాచేసిన సేవకు ప్రతిఫలముగనే యీయఁబడియుండును. దాన దీనిని విడిపెట్టరాదు.

ఒక నాఁడు రెండు గొప్పకానుకలు వచ్చెను. నాఁటి రేయి నేను పిచ్చివానివలె జాగరము చేసితిని. గదిలో నటునిటు ఊరక తిరుగుచుంటిని. ఏమిచేయను పాలుపోదు. వేలకొలఁది రూపాయలు తీసికొనకుండుటా కష్టముగ నుండెను; పోనీ, తీసికొనుటా అది యంత కన్న కష్టముగనే యుండెను.

ఈకానుకలను నేను జీర్ణముచేసుకొనవచ్చునుగాని నా యాలు బిడ్డలు? వీరు ప్రజాసేవ కలవాటుపడిరి. సేవకు వెలయుండదని వీరికి ఎల్లపుడును నూఱిపోయుచుంటిని. నే నింటిలో వెలగలనగలు మొదలగు వాని నుంచుట మానుకొంటిని. ఇంటిలో మితజీవిక నావాఁటి కేర్పా టగుచుండెను. ఇట్టి స్థితిలో బంగారు గడియారములు, బంగారుగొలు సులు పెట్టుకొను టెటులు? వజ్రాలయుంగరములు తాల్చు టెటులు? అప్పటికే నగల వ్యామోహముకూడదని నేను చాటి చెప్పుచుంటిని. కావున ఈనగలు, ఈజవాహిరీ తీసికొని నే నేమిచేయుదును?

ఇంట వీని నుంచుకొనరాదని తుదకు నిశ్చయించితిని. పారసీ రుస్తుంజీ మొదలగువారిని ధర్మకర్తలగా నేర్పఱిచి పత్రమువ్రాసిపెట్టు కొని ప్రొద్దుననే ఆలుబిడ్డలతో సంప్రతించి యీబరువు దింపుకొన నిశ్చయించితిని.

నాభార్య నొప్పించుట కష్టమని తెలియును. మఱి పిల్లల నొప్పించుటలో నేమియు కష్టముకలుగఁబోదని నాకు నమ్మకమే. కావుననే నాపక్షమున వాదింప వీరిని వకీళ్లగా నేర్పఱుచుకొంటిని.

పిల్లలు వెంటనే ఒప్పుకొనిరి. ‘మాకీనగలతో నేమియు ఉప యోగము లేదు. ఎవరివి వారి కిచ్చివేయవలయునని మాయుద్దేశము. మఱి మనకు కావలసియున్నచో మనము చేయించుకొనలేమా?’ అనివారనిరి

నాకు సంతోషము కలిగెను. ‘అటులగుచో మీరు మీ అమ్మను ఒప్పింపఁగల రనుకొందు’ నంటిని.

తప్పక, తప్పక. అది మాపని. ఈనగల అవసరము ఆమె కెందుకు? ఆమెకు కావలయునన్నచో మాకొఱకేకదా! మాకక్కఱ లేదని మేమే యన్నచో నిఁక నామె యెటులు పట్టుపట్టఁగలదు?

కాని యీపని మొత్తము మీఁద మిగుల కష్టమని తెలియనాయెను.

"ఇవి మీకును అక్కఱలేకపోవచ్చును మీపిల్లలకును అక్కఱలేకపోవచ్చును. పిల్లలా? ఎటు లాడించిన నటు లాడుదురు. అయితే నాకు పెట్టుకొనవలయునని యున్నదనుకొందురేమో! లేదు. కాని రేపు నాకోడండ్ర కక్కఱలేదా? మఱియు రేపటిమాట ఎవరి కెఱుక? లోకు లింత ప్రేమతో నిచ్చిన వస్తువులను తిరిగి వారికిచ్చివేయుట అప్రశస్తము." ఈరీతిగా వాగ్ధారఆరంభమయి దీనితో అశ్రుధారయు వచ్చికలిసెను. పిల్లలే చలింపకుండిరి. ఇక నేనా చలించువాడను?

మెల్లమెల్లగా నేనిటు లంటించితిని : "మొదట కుఱ్ఱలకు పెండ్లియే తరవాయి. పసితనమున వీరికి పెండ్లిండ్లు చేయముకదా! ఇఁక పెద్దవారయిన పిదప వారి పెండ్లిండ్లు వారే చేసికొందురు. అయినను నగనుట్ర కావలయునను కోడండ్రను మనము వెతుకవలయునా? ఒకవేళ కావలసియేవచ్చు నందము! నే నెక్కడికి పాఱిపోవుదును?"

"ఆ, మీసంగతి తెలియదా? నానగలఁగూడ ఒలిచి తీసికొన్నవారు కాదా మీరు! నన్నే పెట్టుకొననీయనిచో నిఁక కోడఁడ్రకు తప్పక పెట్టెదరు! కుఱ్ఱవాండ్ర నిప్పటినుండియే బైరాగులనుచేసిపెట్టుచున్నారుకదా! ఈనగలను నేను మరల నీయను. ఇంతియకాక నాహారమున మీకేమి హక్కు?"

"ఆ హారము నీవు చేసిన పనిజూచి యిచ్చిరా? నాచేసిన పని జూచియిచ్చిరా? ఒకమాట చెప్పు!"

"పోనిండు! అటులే. మీరు చేయుచో నేను చేసినటులు కాదా? మిమ్ము రాత్రిందివములు నేను సేవించుటలేదా? అది సేవకాదోటు?

ఇంటికి తీసికొనివచ్చిన అర్ధాంగి మైనవారికిని ఎముకలు విఱుగపనిచేయుట- ఏమి యిది? ఇది యేమియు కాదా?"

ఆ బాణములన్నియు వాడియైనవి. ఎన్నియో గ్రుచ్చుకొనుచునే యుండెను. కాని నగలు తిరుగ ఇప్పించుటకు నిశ్చితుఁడనై యుంటిని. తుదకు పెక్కుమాటలు జరిగిన తరువాత నెటులో ఒకటులు సమ్మతి పడసితిని. ౧౮౯౬ మఱియు ౧౯౦౧ సంవత్సరములందు వచ్చిన కానుకల నన్నిటిని త్రిప్పి యిచ్చి వయిచితిమి. దీనికి దానపత్రము వ్రాసితిని. నా అనుమతితోఁ గాని, ధర్మకర్తల అనుమతితోఁ గాని, ప్రజాసేవ కిది యుపయోగింపఁబడ వలయునను షరతుతో నీసొమ్మంతయు బాంకులో వేయఁబడెను.

ప్రజాకార్యములకు ధనము వలసినపుడు తఱుచు ఈ ధర్మమునుండి ధనము తీయవలయు ననుకొంటినిగాని దీనిని ముట్టక యే వలయు ధనమును సమకూర్పఁ గలిగితిని. నేఁటికిని అది ఆపత్కాలరూపముగా నున్నది. అది యిటులు క్రమముగా వృద్ధియగుచున్నది.

ఈ చేఁతకు నాకెన్నఁడును పశ్చాత్తాపము కలుగలేదు. కాలము గడఁచిన కొలఁది కస్తూరిబాయియు దీని యౌచిత్యము నెఱిఁగికొనఁ దొడఁగెను. ఈ రీతిగా నేను పలు తెగల ప్రలోభనములనుండి తప్పుకొని పోయితిని.

లోకసేవకున కెట్టి కానుక లేని వచ్చు గాఁక! అవి యతని నిజ వస్తువులు కాఁజాలవని నా నిశ్చితాభిప్రాయము.

## ౧౩

## మరల భారతదేశములో

ఈరీతిగా నేను దేశమునకు మరలితిని. దారిలో మారిషస్ రేవు తగిలెను. అచట నోడ చాలకాల మాఁగును. నే నచట దిగి చుట్టు ప్రక్కలవారి స్థితిగతులు తెలిసికొంటిని. అచట నొకరేయి గవర్నరుగా రయిన చార్లెసు బ్రూసుగారికి అతిథి నయితిని.

దేశమునకు క్రమ్మఱిన పిదప కొంచెముకాల మటునిటు తిరిగి గడపితిని. ఇది ౧౯౦౧ సంవత్సరమునాఁటి ముచ్చట. కలకత్తాలో ఆయేడు కాంగ్రెసు అధ్యక్షులు దిన్షా ఎడల్జి వాచా గారు. నేనును దానికి పోవలయు ననుకొనుచుంటిని, కాంగ్రెసు చూచుట నాకదే తొలిసారి.

బొంబాయినుండి సర్ ఫిరోజిషా గారెక్కి వెడలిన రైలులో నే నేనును వెళ్లితిని. దక్షిణ-ఆఫ్రికా విషయములు వీరితో ముచ్చటింప వలసియుండెను. వీరి పెట్టెలో ఒకస్టేషనుదాఁక అనుగమించుటకు నాకు సెలవాయెను. వారు ఒక పెట్టెను పుచ్చుకొనిరి. వారి రాజవైభవము ఖర్చు కరామతు నాకు వాకపే. ఏర్పాటయిన స్టేషనులో వీరిపెట్టెలోనికి పోతిని. అపుడా పెట్టెలో దిన్షావాచాగారును, చిమన్ లాల్ సెతల్వాడుగారును ఉండిరి. వీ రందఱు రాజనీతినిగూర్చి ముచ్చటించుకొనుచుండిరి. నన్నుఁజూచి ఫిరోజిషాగారు—"గాంధీ! నీపని అనుకూలముగా లేదు. నీతీర్మానము మా మోదింపఁబడునసుకొనుము! అయితే మొదట మనకు మనదేశములో నేమి హక్కు లున్నవి గనుక!

మన దేశమున మనకు సత్తా లేనంతవఱకు ఉపనివేశములలో మనస్థితి బాగుపడవలె నన్న నెటులు బాగుపడును ?"

నేను స్తంభితుఁడ నయిపోతిని. చిమన్‌లాల్ గారు గూడ వారితో నేకీభవించిరి. కాని దిన్షాగారు నాకేసి దయాదృష్టి బఱపిరి.

ఫిరోజిషాగారిచే నొప్పింపఁ బ్రయత్నించితిని. వారు బొంబాయి కిరీటము లేని పాదుషా. అట్టివారిని నాబోటివాఁడా ఒప్పించుట! అంతటితో కాంగ్రెసులో ఈతీర్మాన మామోదింపఁబడును గదా యని సంతసించితిని.

నా కుత్సాహము కలిగించుటకు వాచాగారు 'తీర్మానము తయారుచేసి నాకు చూపుట మంచిది' అనిరి.

నేను ధన్యవాదములు చెప్పితిని. రెండవస్టేషనుకడ బండి యాఁగఁగఁనే దిగి నాపెట్టెలోనికి వచ్చి కూరుచుంటిని.

కలకత్తా చేరితిమి. నగరవాసులు అధ్యక్షుఁడు మొదలగు నాయకులను మహావైభవముతో తీసికొని పోయిరి. నేనొక స్వచ్ఛంద సేవకుని బిలిచి—'బస లెక్కడ?' అని అడిగితిని.

అతఁడు నన్ను రిప్పన్ కాలేజికి తీసికొనిపోయెను. అచట పలు తెఱఁగుల ప్రతినిధులు కలరు. భాగ్యవశమున నేనున్న విభాగమునకే లోకమాన్యులును వేంచేసిరి. వా రొకదిన మాలస్యముగా దయ చేసిరని నాకు గుర్తు. లోకమాన్యులెచట నుందురో అచట నొక చిన్న దర్బారు జరుగుచునే యుండును. నేను చిత్రకారుఁడనైతినేని శయ్యపై కూర్చున్నవారిని కూర్చున్నటులు లోకమాన్యుని చిత్రించియుందును. ఆచోటు, వారి యునికి మొదలగున వన్నియు నంతస్పష్టముగా గుర్తు

న్నవి. వీరి దర్శనమునకు వచ్చు కోట్లకొలది జనులలో ఒకరిపేరు గుర్తు కలదు. అమృతబజారు పత్రికాధిపతి — మోతీబాబు. వీరి యిరువుర పెద్ద నవ్వును, పరిపాలకుల అన్యాయముల గురించి వారనుకొనిన మాటలును మఱపు రాఁజాలవు.

ఇఁక నచటి కాంగ్రెసువారి నివాసములలో దృష్టిపాత మొనరింతము.

స్వచ్ఛంద సేవకులలో ఒకరి కొకరికి పడదు. ఎవరికేని ఒకపని అప్పగింతుమా అది అతనివలనఁ గాదు. అతఁడు వెంటనే మఱియొకనితో జెప్పును. అల్లతఁ డింకొకనితోఁ జెప్పును. ఇఁక అభాగ్యులగు ప్రతినిధుల పని రెంటికిఁ జెడిన రేవడ.

కొంతమంది స్వచ్ఛంద సేవకులతో నేను మాటమంతి కలిపితిని. వీరికి కొంచెము దక్షిణ-ఆఫ్రికా భోగట్టా చెప్పఁగా విని కొంచెము సిగ్గిలిరి. వీరికి నేను సేవాధర్మము దెలుప యత్నించితిని. వారికి కొంచెము కొంచెము బోధపడెను. కాని సేవాప్రేమ ఎక్కడఁ బట్టిన నక్కడ పుట్టకొక్కులవలె పుట్టుకొని వచ్చునది కాదు. ఇది లోపలనుండి పుట్టుకొని రావలయును. అటుపిమ్మట అభ్యాస ముండవలయును. అమాయికులును, సరళులును అగు ఈ స్వచ్ఛంద సేవకులకు మనస్సులో ఇచ్ఛ మాత్రము కావలసినంత; కాని నేరిమి, పిదప అలవాటు ఎటులబ్బును? ఏమందురా? కాంగ్రెసు సంవత్సరమునకు మూఁడునాళ్ళముచ్చటగదా! అయిన పిమ్మటనే అది నిద్రకుఁ బోవును. ఏఁడాదికి మూఁడునాళ్ళ సేవవలన వీరికందు యోగ్యత యెటులు కలుగును?

మఱియు ప్రతినిధులును స్వచ్ఛంద సేవకులవంటివారే. వీరికిని మూఁడునాళ్ళ అభ్యాసమే. వీరు తమపనిని తాము చేసికొనరు. హుకుము

లిచ్చి పనులు చేయించుకొందురు 'ఓయ్! వలంటీర్! అది తే ఇది తే' అని ఊరక హుకుములు జారీచేయుదురు.

అంటరానితన మిచట మిక్కుటముగా కానిపించెను. అరవల వంటయిల్లు విడిగా ఏర్పాటు చేయఁబడెను. భుజించుచుండఁగా నెవరును చూడరాదు. అందులఁ జేసి కాలేజీ-ఆవరణమున వారికి విడిగా వంటయిల్లు ఏర్పాటయినది. దృష్టిదోషము తగులకుండ చుట్టును దడులు, దానినిండ ఊఁపిరి సలుపనంత పొగ. పాకశాల అదే; పానశాల అదే; భోజనశాలయు నదే. అది వంటిల్లుకాదు చందుకాపెట్టె. అన్నివైపు లను మూఁత!

ఇది వర్ణధర్మమునకు విరుద్ధముగా గానిపించును. కాంగ్రెసు-ప్రతినిధులలోనే యింత అంటరానితన మున్నచో నిఁక నిట్టివారిని ప్రతినిధులనుగాఁ బంపు లోకులలో ఎంతయుండును? ఇంతకు మూఁడింతలు. ఈప్రత్యుత్తరముతో నాముఖమునుండి ఉహ్హాని నిట్టూరువు వెలువడెను.

ఇఁక నచటి కంపునకు మితిలేదు. నలుదిక్కుల నీరు నీరు నీరు. మఱి మఱుఁగు దొడ్లు తక్కువ. ఆ కంపు తలఁచుకొన్నచో డోఁకు వచ్చుచున్నది. ఒక స్వచ్ఛందసేవకుని దృష్టి దాని వైపు మరల్చితిని. 'అది పాకీవాని పని' యని అతఁడు నిర్భయముగా ననెను. 'నా కొక చీఁపురుకట్ట తెచ్చి పెట్టు' మంటిని. అతఁడు తెల్లబోయి నామోము చూడ మొదలిడెను. తుదకు వెతికి చీఁపురుకట్ట నేనే తెచ్చికొంటిని. మఱుఁగు దొడ్డి బాగుచేసితిని. కాని అది నా యుపయోగమునకే. ఎక్కడి లోకము? ఎక్కడి మఱుఁగు దొడ్లు? ఎన్ని మాఱులు బాగుచేసినను చాలదు. కాని అంత పని నాకు మించినది. కావున నా

పనిసే సేను చేసికొని సంతోషపడ నారంభించితిని. నలుగురికిని ఈ కంపు కొట్టినట్లు లేదు.

ఇవి యింతటితో నాగలేదు. కొందఱు రాత్రిపూట తమగది వసారాదిలోనే మలవిసర్జనము, మూత్రవిసర్జనము చేయఁగడఁగిరి. స్వచ్ఛందసేవకులకు ప్రార్థననే చూపితిని. ఎవరును బాగుచేయ నొల్లరైరి. తుదకా గౌరవము నాకే దక్కెను.

ఈకాలమున వెనుకటికంటె కొంచెము మాఱెను గాని నేఁటికిని ఈమాట మనసునకు పట్టని ప్రతినిధులు నివాసములలోనే మలవిసర్జనమునకు వెనుదీయరును; స్వచ్ఛంద సేవకులు బాగు చేఁతకు సిద్ధపడరును.

కాంగ్రెసు మఱికొన్ని దినములు జరుగుచో అంటు రోగములును బసచేయా ననుకొంటిని.

## ౧౪

## గుమాస్తా-బేరా*

కాంగ్రెసు-ప్రారంభమున కింకను రెణ్డేళ్లు వ్యవధి యున్నది. కాంగ్రెసు-ఆఫీసులో నా కేమేని పని దొరకుచో కొంచె మనుభవము సంపాదింపవచ్చునని తోఁచెను.

కలకత్తాలో దిగిననాఁడే కాల్యకృత్యములు నిర్వర్తించుకొని కాంగ్రెసు-ఆఫీసుకు వెళ్లితిని. శ్రీ భూపేంద్రనాథ బసు గారును, శ్రీఘోషాలు గారును కార్యదర్శులు. భూపేంద్రబాపు కడకుఁ బోయి యేదేని పనిచెప్పుఁ డంటిని. వారు నన్నుఁజూచి యిటులనిరి.

'నాకడ నేమియు పని లేదు. కాని బహుశా ఘోషాలు గారేమేనియు చెప్పఁగలరు. వారిని చూడు!'

ఘోషాల్ బాబుగారికడ కేఁగితిని. వారు నన్ను క్రిందినుండి మీఁదిదాఁకఁ జూచిరి. కొంచెము చిఱు నవ్వి యిటులనిరి:

'నాకడ గుమాస్తాపని కలదు. చేయుదువా?'

'తప్పక చేయుదును. నాకు చేతనయినంతపని చేయుటకే తమ సన్నిధికి వచ్చితిని.' అని నే నంటిని.

'కుర్రఁడా! నిక్కముగు సేవాభావ మిదియే.'

వీరికి దాపున కొందఱు స్వచ్ఛంద సేవకు లుండిరి. వారికేసి తిరిగి వీ రిటు లనిరి.

'చూచితిరా! ఈకుర్రవాఁ డే మనెనో!'

*'బేరర్' అను ఇంగ్లీషుమాట కిది యపభ్రంశము. ఇంటిపనిబాగులవాడని అర్థము. కలకత్తాలో ఇంటినౌకరును 'బేరా' అనుట రివాజయిపోయినది.

# ౧౮ గుమాస్తా-బేరా

మరల నాకేసి తిరిగి యిట్టు లనిరి. 'అదిగో! ఆయుత్తరముల గుట్ట! ఒకొక్కటే తీసికో! ఇదిగో! ఈ కురిచీమీఁద కూర్చుండి మొదలు పెట్టు! చూడు! నాకొఱకు వందలకొలఁది వచ్చుచుందురు. వీరితోడనే మాటలాడనా, మఱి యీయుత్తరములకు బదులు వ్రాయుచునే కూరుచుండనా? ఈపని చూచుటకు నాకు గుమాస్తా లేఁడు. ఈయుత్తరములలో చాలవఱకు పనికిమాలినవి. కాని నీవన్నిటిని చదివి చూడు. ఆవశ్యకములకు వానికి ప్రత్యుత్తరము లిమ్ము. నాతో సంప్రతింపవలసి యున్న సంప్రతింపుము.'

న న్నింతగా నమ్మినందులకు సంతసించితిని.

ఘోషాలుగారు న న్నెఱుఁగరు. పిదప నా నామధామము లెఱిఁగెను. నా కొసఁగిన యీపని కడు తేలిక. ఈ పని నంతయు వడిగా ముగించితిని. ఘోషాల్ బాబుగారు సంతసించిరి. ఆయన మాటల ప్రోవు. మాటలతో చాలకాలము గడపఁగలరు. నా సంగతి తెలిసికొన్న తరువాత నా కీగుమాస్తాపని నిచ్చినందులకు నొచ్చుకొనిరి. నేను వారి నిట్టుల నిశ్చింతులఁ గావించితిని.

'అయ్యా, నే నెక్కడ? మీ రెక్కడ? కాంగ్రెసు సేవలో మీ తలవెంట్రుకలు నరసినవి. నాకంటె తాము వృద్ధులు. నే ననుభవములేని కుఱ్ఱఁడను. మీ రీపని నిచ్చినందులకు కృతజ్ఞుఁడ. ఏలనఁగా ముందు ముందు నాకు కాంగ్రెసులో పని చేయవలయునని యున్నది. ఆపని తెలిసికొనుటకు దుర్లభమైన యవకాశము మీ రొసఁగితిరి.'

'నిజముగా నీచందము మంచిది. కాని ఈకాలపు కుఱ్ఱవాండ్రు ఇట్లు లుండరు. కాంగ్రెసు పుట్టినకడ నుండియు నే నెఱుఁగుదును. దీనిని స్థాపించుటలో హ్యూముగారి తోపాటు నాకును పాలు కల'దని ఘోషాలుబాబుగా రనిరి.

మా కిటులు బాగుగా పరిచయము కలిగెను. మధ్యాహ్న భోజనము మే మిరువురము కలిసి. ఘోషాల్ బాబు గారి చొక్కాకు గుండీ 'బేరా' తగిలించెడి వాఁడు. అది చూచి 'నేనే ఆపని చేయుదు' నంటిని. నా కది మంచి దని తోఁచెను. పెద్ద లన్న నాకు కడు నాదరము. వారికి నామనస్సు లెస్సగా తెలిసిపోయిన తరువాత తమ నిజ కార్యముల నన్నిఁటిని నాచేఁ జేయించుకొను చుండెడివారు. గుండీలు పెట్టించుకొనుచు మూతి బిగించి నాతో నిటు లనెడివారు—'చూచితివా? కాంగ్రెసు సెక్రటరీకి బొత్తములు పెట్టుకొనుటకుఁ గూడ తీరిక లేదు. ఏలనఁగా అప్పుడును అతనికి చేయవలసిన పను లున్నవి?' ఈ యమాయికతకు నాకు లోలో నవ్వు వచ్చెను గాని వారికిఁ జేయు శుశ్రూషను గురించి అప్రీతి యిసుమంతయు కలుగ లేదు. దీని వలన నాకుఁ గలిగిన లాభ మమూల్యము.

కొలఁదినాళ్లలో నే కాంగ్రెసు తంతు అంతయు తెలిసికొంటిని. పెద్దల పరిచయము లభించెను. గోఖలే, సురేంద్రనాథ బెనర్జీ మొదలగు యోధులు వచ్చుచు పోవుచు నుండిరి. వీరి వైఖరి తెలిసికొననాయెను. కాంగ్రెసులో కాల మెంత వృథాయగునో తెలిసెను. ఇంగ్లీషు భాషయొక్క యధికారము చూచితిని. దానిని చూడఁగా నాకపుడే దుఃఖము వచ్చెను. ఒకని పని పదిమంది చేయుటయు, ఆవశ్యకమైనపని కెవరును రాకుండుటయు చూచితిని.

వీని యన్నింటి యెడలను నామనస్సు పని చేయు చుండెను. కాని చిత్తము ఇటులు ఉత్తర మిచ్చెను. 'ఇంతకన్న నెక్కువ సంస్కరణము జరుగుట అసంభవమేమో!' కావున దేనిని గురించియు మనస్సులో దుర్భావము పొడమ లేదు.

## ౧౫

## కాంగ్రెసులో

మహాసభ మొదలాయెను. ఆమంటపముయొక్క భవ్యత ఆస్వచ్ఛందసేవకుల పరంపర, మంచాసీనులయిన ఆపెద్దపెద్దల సముదాయము చూచి నివ్వెఱపోతిని. ఈసభలో నాకు తావెచట నని తికమకపడితిని.

అధ్యక్షుని ఉపన్యాస మొక గ్రంథము! దీని నంతయు చదువుట అసంభవము. కొన్నికొన్ని అంశములే చదువఁబడెను.

పిదప విషయనిర్ణయసభ ఎన్నికలు. గోఖలేగారు నన్నటకుఁ గొంపోయిరి.

సర్ ఫిరోజిషాగారు నా ప్రస్తావము నిదివరకే అంగీకరింతుననిరి. కాని అందలివా రెవ రెప్పుడు దీనిని ప్రతిపాదింతురో యని (ఈమొదలగు విషయముల) అరయుచుంటిని. ప్రతి తీర్మానమునకు దీర్ఘ దీర్ఘములగు నుపన్యాసములు జరుగుచుండెను. అవన్నియు ఇంగ్లీషులోనే. తీర్మానమును సమర్థించువారలందఱు అతిసమర్థులే. ఈనగారాఖానాలో నాతూతూ వినువా రెవ్వరు? రాత్రి ప్రొద్దుపోయినకొలఁది నాగుండియలు దడదడలాడఁ దొడఁగెను. చివరచివరకు మిగిలియున్న తీర్మానములు వాయుయానముల పరుగున బోవుచుండెను. అందఱును ఇంటికిఁ బోవ నుఱుకులమీఁద, పరుగులమీఁద నుండిరి. రాత్రి పదికొండు దాఁటెను. నాకు మాటలాడఁగల సాహసము లేదు. గోఖలేగారికి లోఁగడనే తీర్మానము చూపియుంటిని. వారి కుర్చీకడకు వెళ్ళి మెల్లగా నిటులంటిని.

'నా మాట మఱవకుఁడు !'

వా రిట్లు లనిరి—'నాకు గుర్తులోనే ఉన్నది. వారివేగమును మీరు చూచుచునే యుంటిరిగదా! కాని దానిని తప్పిపోనీయను.

'ఏమి? అంతయు ముగిసినట్లేకదా!' అని సర్ ఫిరోజషా గారనిరి.

'ఇంకను దక్షిణ-ఆఫ్రికాను గుఱించిన ప్రస్తావము మిగిలిలేదా? గాంధిగారు చాలసేపటినుండి వేచియున్నారు' అని గోఖలేగారు ఎలుఁగెత్తి చెప్పిరి.

'మీ రా తీర్మానమును జూచియుంటిరా?' అని సర్ ఫిరోజషాగా రడిగిరి.

'చూచితిని.'

'మీకు బాగుగా నున్నదా?'

'ఆ. అంతయు బాగుగా నున్నది.'

'అయితే గాంధీ! చదువు!'

నేను వడఁకుచు దానిని జదివి వినిపించితిని.

గోఖలేగారు దానిని సమర్థించిరి.

'ఏకగ్రీవముగా తీర్మానింపఁబడిన దని అంద ఱఁచిరి.'

'గాంధీ!నీవయిదు నిమిషములు మాటాడు'మని వాచాగా రనిరి.

'నా కా తెఱఁ గేమియు బాగుండలేదు. ఆప్రస్తావము నర్థము చేసికొను కష్ట మెవరును పూనుకొనలేదు. అందఱును ఎపుడు పోవుదమా అని కనిపట్టుకొనియుండిరి. గోఖలేగారు లోఁగడ చూచియున్నందులజేసి మఱియెవరికిని చూడను వినను అవశ్యకత తోఁపలేదు.

ఉదయమయినది.

ఉపన్యాస మెటులో యని ఆలోచింప సాగితిని. అయిదు నిమిషములలో నేమి చెప్పను? నేను లెస్సగ నే విషయమును సిద్ధము చేసికొంటిని. కాని ఆవశ్యకములగు శబ్దములు గోచరింపవు. ఏమేని యగుఁగాక! ఇంటికడ వ్రాసికొనిన ఉపన్యాసమును చదువరా దని నిశ్చయించుకొంటిని. దక్షిణ-ఆఫ్రికాలో ఉపన్యాసము లిచ్చుటలోఁ గల నిస్సంకోచత యిపుడు మాయ మయిపోయి నట్టు లుండెను.

నా ప్రస్తావనసమయము రాఁగనే సర్ దిన్‌షాగారు నా పే రెలుఁగెత్తిరి. నేను నిలువఁబడితిని. తల తిరుగఁ దొడఁగెను. తీర్మాన మెట్లో చదివితిని. ఎవరో ఒకకవి తన కవిత్వమును ప్రతినిధు లందఱకు పంచి పెట్టుచుండెను. అందు విదేశగమనమును గుఱించి, సముద్రయాత్రను గురించి ప్రశంస కలదు. నేను వాని జదివి వినిపించి దక్షిణ-ఆఫ్రికాలోని కష్టములు కొంచె మెఱుక చేసితిని. ఇంతలో దిన్షాగారు గంట బజాయించిరి. అప్పటి కయిదు నిమిషము లయి యుండదని నాకు తెలియును. అయితే ఇఁక రెండు నిమిషముల అవకాశమున్న దని సూచింప నాగంట గొట్టుదు రని నాకు తెలియదు. అనేకు లఱగంటవఱకు మాటలాడుచుండుట నేను వింటినికాని అపు డిటులు గంట మ్రోఁగలేదు. దానఁజేసి నాకు కష్ట మనిపించెను. గంట మ్రోఁగఁగనే కూరుచుంటిని. కాని నే జదివిన ఆపద్యములు సర్ ఫిరోజషాగారికి సరియగు ప్రత్యుత్తరమగు నని బాల్యచాపలముచే అపు డనుకొంటిని.

తీర్మాన మామోదింపఁబడెనా లేదా యని అడుగ నక్కఱ లేదు. ఆరోజులలో ప్రతినిధులకును ప్రేక్షకులకును భేదము లేదు. ఏప్రస్తావమునకును విరోధ మనుమాట లేదు. అందఱు చేతు లెత్తుదురు.

ఏతీర్మానమయినను ఏకగ్రీవముగా నామోదింపఁబడుచుండెను. నా తీర్మానమునకును అదియే స్థితి. ఇందువలన నాతీర్మానముయెడల నాకు అంతగా ప్రయోజనము కానిపింపలేదు. కాని కాంగ్రెసులో దీని ప్రస్తావము జరిగెను; చాలు, నా కానందము. దీని మీఁద కాంగ్రెసు మొహరు పడెను. ఇదియే సమస్త భారతవర్షము యొక్కయీ మొహరు—ఈజ్ఞానము ఈసంతోషము, ఎవరికైనను తృప్తికరము కాదా?

## ౧౬

# లార్డు కర్జన్ — దర్బారు

కాంగ్రెసు ముగిసెను కాని దక్షిణ-ఆఫ్రికా పనులను గుఱించి చేంబర్ ఆఫ్ కామర్స్ మొదలగువానితో పని యుండుటవలన కలకత్తాలోనే యుంటిని. ఇందుల కొకనెల పట్టెను. ఈతూరి హోటలులో నుండుటకు బదులు పరిచయము సంపాదించి ఇండియన్ క్లబ్బులో నుండు నేర్పాటు చేసికొంటిని. అచట గొప్పగొప్ప భారతీయులు బసచేయుదురు. కావున వారి పరిచయము లభించును. అపుడు దక్షిణ-ఆఫ్రికా విషయములలో వారికి కుతూహలము కలిగింపవచ్చునని నాయాశ. ఎల్లపుడు కాకున్నను అపుడపుడు గోఖలేగారీక్లబ్బునకు బిలియర్డ్స్ ఆడుటకు వచ్చెడివారు. నేను కలకత్తాలోనే యుండుచున్నభోగట్టా ఆయనకు తెలిసి తనకడనే నన్నుండఁగోరెను. నేనును సాదరముగా ఇయ్యకొంటిని. కాని నాయంతట నేనే యచటికేఁగుట యుక్తమని పింపలేదు. ఇటులు రెండుమూఁడునాళ్ళు చూచి గోఖలేగారు స్వయముగా నన్ను తీసికొనిపోయిరి. వారు నా ముఖభావమును చూచి యిటు లనిరి—

'గాంధీ! నీ వీ దేశముననే యుండవలయును గాన ఈ బిడియముచే పనులు సాగవు. నీ వెంతమందితో పరిచితి చేసికొన్న నంత మేలు. మఱి నీచేత కాంగ్రెసు పనులు చేయింపవలయును.'

గోఖలేగారికడకు వెళ్ళకముందు ఇండియన్ క్లబ్బులో నే నుండఁగా జరిగిన ముచ్చటలను గొన్ని చెప్పవలయును.

ఈ దినములలో లార్డ్ కర్జను దర్బారు తీర్చెను. అచటికి ఆహూతులయిన రాజులును, మహారాజులును కొంద ఱచటనే యుండిరి. వారిచట నెప్పుడును బంగాళీదోవతులను గట్టి కురతా తొడిగి ఉత్తరీయములు వేసికొనుచుండువారు. నాఁడు కాసాలకు తగు పంట్లములు తొడిగిరి, గౌనులు వేసిరి. తళతళలాడు బూట్లు తొడిగిరి. నా కిది చింతాజనకమాయెను. ఈ క్రొత్తవేషమునకు కారణ మే మని యడిగితిని.

'మా దుఃఖములు మా కే తెలియును, మా ధనసంపత్తి, మా బిరుదములు ఖాయముగా నుంచుకొనుటకు నేయే యవమానములు భరింపవలసి వచ్చునో మీ కెటులు తెలియఁ గలదు?' అని ప్రత్యుత్తరము వచ్చెను.

'పోనిండు! అయితే ఈ కాసాతలపాగ లేమి? ఈ కాసా బూట్సు లేమి?'

'మా లోను కాసాలలోను మీ కేమి భేదము కానిపించుచున్నది? వాండ్రు మాకాసా లగుచో మేము కర్జనుకు కాసాలము కామా? మేమీ దర్బారుకు గైరుహాజ రగుచో దాని ఫల మనుభవింపవలసివచ్చును. మా సహజవేషముతో దర్బారుకు పోవుదుమా అది యపరాధముగా పరిగణింపఁ బడును. అది యటుండె. అచటికి వెళ్లుదుము! కర్జనుతో మాటలాడఁ దరమా? రామరామ! ఒక్కమాట!'

ఈ శుద్ధహృదయునిపై నాకు జాలి కలిగెను.

ఇటువంటి దర్బారు మఱియొకటి నాకు గుర్తువచ్చుచున్నది. లార్డు హార్డింజి హిందూ విశ్వవిద్యాలయమునకు శంకుస్థాపనము కావించిననాఁట నొక దర్బా రాయెను. ఇందు రాజులును మహారా

జాలును గలరు. భారత భూషణము మాలవ్యాగారు నన్నందులకు రావలసినదని పట్టు పట్టిరి.* నే నట కేఁగితిని. కేవలము స్త్రీలకే శోభ తేఁదగిన వారి వస్త్రభూషణములను జూచి మిగుల సంతాపము చెందితిని. పట్టు పాజామాలు, పట్టు అంగరఖాలు, మెడలలో వజ్రములయు ముత్తెములయు మాలలు, బాహుల బాజుబందులు, తలపాగలపై వజ్రములు, ముత్తెములు పొదిగిన తురాయులు! వీని యన్నిఁటితో పాటు నడుములందు బంగారు పిడిగల కరవాలములు! ఇవి రాజ చిహ్నములా, దాస్యచిహ్నములా? ఈ నామర్దా నగలను తమ యిష్టము చొప్పున నే వీరు ధరించుచుండిరని నే ననుకొంటిని. కాని యిట్టి దర్బారులకు ఇట్టి వస్త్రభూషణములతో వచ్చుట వీరికి విధి యని తెలిసెను. కొందఱు రాజుల కిట్టి వస్త్రభూషణము లింపితము కావనియు ఇట్టి దర్బారులందుతక్క మఱియెన్నఁడును వీనిని తాఁక రనియు తెలిసెను. ఈమాట యెంతవట్టు సత్యమో నే నెఱుఁగ. ఇతరావసరముల యందు వారు ధరింతురో ధరింపరో, వైసురాయి దర్బారునం దగుఁగాక, ఇతరస్థలమునందగుఁగాక, ఆఁడు వారికిఁ దగు నగలను వీరు తాల్తురని తెలియుట మిగుల దుఃఖదాయకము. ధనము, బలము, మానము, ఇవి మనుష్యులచే నెట్టి యెట్టి పాపములను, అనర్థకములను చేయింపవు!

## ౧౭

## గోఖలేగారితో నొకనెల—౧

మొదటి నాఁటనే గోఖలేగారు నాక్రొత్త బాపిరి. నన్ను తమ్ముని చందమునఁ జూచుకొనిరి. నా యావశ్యకముల నన్నిఁటి నెఱిఁగి కొని వాని నేర్పాటుచేసిరి. అదృష్టవశమున నాకుఁ గావలసినవి కడుఁ గొలఁది. నా పనులన్నియు నేనే చేసికొనుట నా కలవాటు గాన నాకుఁ జేయఁదగినవి కడుఁ గొలఁది యాయెను. నా పనులు నేనే చేసికొనుట, మడివేషము, పూనిక, నియమము-ఇవన్నియు వీరి మనస్సున ముద్రితములగుటఁజేసి నేను నివ్వెఱపడు నంతగా నన్ను నుతించెడువారు.

వారు నాకడ నేమియు దాఁచినటులు నాకు గుఱుతు చాలదు. తమను జూడవచ్చిన గొప్పవారందఱితో నాకు పరిచయము గలిగించెడు వారు. ఈపరిచితులందఱిలో డాక్టరు ప్రఫుల్లచంద్రరాయలు ప్రధానులు. వారు పొరుగుననే ఉండెడువారు. మఱి యెల్లపుడును వచ్చుచుండెడివారు.

'ఈ ప్రొఫెసరు రాయిగారికి నెల కెనిమిది వందల రూకలు జీతము. అందు నలుబది రూకలు మాత్రము తమ కుంచుకొని మిగిలిన దంతయు ప్రజాసేవ కిచ్చివేయుదురు. వీరింతవట్టు పెండ్లాడలేదు. ఇఁక ముందు పెండ్లాడను దలఁపలేదు.' అని చెప్పి గోఖలేగారు నాకు వీరితో పరిచయము కలిగించిరి.

నేఁటి రాయి గారికిని, నాఁటి రాయి గారికిని నాకు అట్టే భేదము కానరాదు. ఇపు డెట్టి వస్త్రములు తాల్చుచుండిరో అపుడును ఇంచు

మించట్టివే. ఇపుడు ఖాద్దీ వచ్చిపడెను. అప్పటి కింకను అది లేదు. స్వదేశపు మిల్లుబట్ట లుండెడివి. వీరి యిరువురి సంభాషణము వినుచుండఁగా నాకు వినుకన్న మాట ఉండెడిదికాదు. వీరి సంభాషణమంతయు దేశ హితచర్చ, లేక జ్ఞానచర్చ. వీరుమాటలాడు కొన్ని మాటలవలన కష్టము కూడఁ గలిగెడిది; ఏలనఁగా వీరు కొందఱ నాయకులను గూడ విమర్శించుచుండెడివారు. నేను పర్వతము లనుకొన్న వా రందఱును పరమాణువు లైరి.

గోఖలేగారు పనిచేయు రీతి ఎంతయానందజనకమో అంత జ్ఞానజనకము. వా రొక నిమిషము వితగా పోనిచ్చెడువారు కారు. వీరి ప్రతికార్యమును దేశముకొఱకే; మాటలాడుటయు దేశముకొఱకే; వారి మాటలలో మాలిన్యముకాని, దంభముకాని, అసత్యముకాని లేదు. భారత దేశ దారిద్ర్యము, పారతంత్ర్యము—ఈరెండును వీరిమనస్సును వేధించుచుండెడివి. పలుఁవురు వీరిని పలువిధములుగా ఆకర్షించుటకు వచ్చుచుండెడువారు. వీ రందఱకును ఒకటే జవాబు—'మీరు మీపని చేయుఁడు, నన్ను నా పని చేసికొననిండు. నాకుఁ గావలసినది దేశ స్వాతంత్ర్యము. అది కలిగిన పిమ్మటనే మఱియొకటి. ఇప్పటికి నాకీ పనితో ఒకక్షణమును తీరిక లేదు'

వీరి ప్రతిమాటలోను రానడే గారి యెడ గౌరవము ముద్రితమైయుండెడిది. 'రానడేగా రిటులు చెప్పెడువారు' అనుమాట వీరికి 'సూత ఉవాచ' వంటిది. నే నటనుండఁగా రానడేగారి (జయంత్యుత్సవమో, వార్షికోత్సవమో సరిగా నేఁడు గుఱుతులేదు) వచ్చెను. గోఖలేగారు ప్రతియేఁడును జరుపుచువచ్చుచున్నటులు తెలిసెను. అపుడు నేను గాక వీరిమిత్రులు ప్రొఫెసర్ కాథవటేగారు, *మఱియొక సజ్జనుఁడు

* ఇంగ్లీషు ప్రతిలో నబ్‌జడ్జి యని కలదు.

మండిరి. అందులకు వీరిని గూడ నాహ్వానించిరి. అప్పుడు వీరు మాకు రానడేగారిని గురించి తమకు గుఱుతు గల విషయములు కొన్ని వినిపించిరి. రానడే, తెలంగ, మాండలికులను పోల్చిరి. తెలంగుగారు భాషా పండితులు; మాండలికుగారు గొప్ప సంస్కర్తలు. మాండలికుగారికి క్లయంట్లు పని యెడ కడు శ్రద్ధ. ఒకతూరి వారిక్లైంటు రైలు తప్పిపోవఁగా స్పెషల్ రైలు చేయించుకొని వెళ్లిరి. ఇఁక రానడేగారి శక్తి సర్వాంగీణము. నాఁటికాలమున నున్న గొప్ప వారందఱిలో ఆయన గొప్పవారు. ఆయన కేవలము న్యాయమూర్తి కాదు; చరిత్రకారుఁడు; అర్థశాస్త్రవేత్త; గొప్ప సంస్కర్త. సరకారువారి జడ్జి యయ్యును నిర్భయముగా కాంగ్రెసుకు ప్రేక్షకుఁడుగా వచ్చెడివాఁడు. లోకులకు వీరి నిర్ణయము ప్రమాణము. ఇటులు రేనడేగారిని వర్ణించు నెడ వారికిఁగల ఆనందము నకు మేర లేకుండెడిది.

గోఖలేగారొక గుఱ్ఱపుబండి పెట్టుకొనిరి. నేను దీని గుఱించి ప్రశ్నించితిని దానియావశ్యకము నాకు తెలియరాదాయెను. 'మీరు ట్రాముబండిమీఁద వెళ్లుచో సరిపోవదా? అది నాయకుల ప్రతిష్ఠకు భంగమా?'

కొంచెము నగచి ఆయన యిటు లనియెను—'ఏమి? నీవును నాసంగతి యెఱుఁగఁజాలక పోయితివా? నాకు కౌన్సిలులో వచ్చు సొమ్మును నాసొంతమున కుపయోగించుకొనను, మీరందఱు ట్రాము బండ్లలో పోవుట నాకీసుగానుండును. కాని నే నటులు చేయఁజాలను. ఎంతమంది నాకు పరిచయము కలదో అంతమందితో నీకును పరిచయము కలుగునేని అపుడు ట్రాములో పోవుట అసంభవము కాకున్నను తప్పక దుష్కర మగును. నాయకులు చేయున దంతయు సౌఖ్యము

కొఱకే యని యనుకొనుట కేమియు కారణము లేదు. నిమితజీవిక నాకు ప్రీతికరము. వీలుకలంతవట్టు నేనును అట్టివాఁడనే. కాని నావంటి వారికి కొంచెము వ్యయ మనివార్య మగుట నిశ్చయము.'

నాఆక్షేప మొకటి పూర్తిగా రద్దయిపోయెను. కాని మఱొకటి కలదు. దానికి మాత్రము వారు సంతుష్టి చేయఁగల ప్రత్యుత్తర మీయలేక పోయిరి.

అయితే మీరు షికారుకైన పోవరుకదా! ఇక ఎప్పుడు అస్వస్థులైయుండుట వింత అగునా? దేశకార్యములలో వ్యాయామమున కవకాశము దొరకదా?' అని నే నంటిని.

'షికారుపోవుట కవకాశ మెన్నడేని కనిపట్టితివా?' అని ప్రత్యుత్తరము వచ్చెను.

వారియందలి ఆదరమువలన ఇందులకు నేను సమాధాన మొసఁగ లేదు. ఈప్రత్యుత్తరమువలన నాకు సంతోష మొదవలేదు. కాని మాఱు పలుక కూరకుంటిని. భోజనమునకు మనకు సమయము దొరకుట లేదా? ఆరీతిగనే వ్యాయామమునకును దొరకునని నాఁటికిని నేఁటికిని నాయాశయము. దీనివలన దేశసేవ తక్కువకాదు? మఱి యెక్కువ అగునని నా సవినయాభిప్రాయము.

౧౮

## గోఖలేగారితో నొకనెల—౨

గోఖలేగారి గొడుగు నీడలలో గూర్చుండి నేను కాల మతివా హితము చేయ లేదు.

హిందూదేశమునందలి దేశ్యక్రైస్తవులపరిచయము బడసి వారి స్థితిగతులఁ దెలిసికొని వత్తునని నేను దక్షిణ-ఆఫ్రికాలోని క్రైస్తవ మిత్రులకుఁ జెప్పియుంటిని. కాళీచరణ బెనర్జిగారి పేరు వినియుంటిని. వారు కాంగ్రెసునందు లెస్స పనిచేసియుండిరి. దీన నాకు వారియెడ ఆదరము కలిగిపోయెను. ఏలనఁగా — సాధారణముగా దేశ్యక్రైస్తవులు కాంగ్రెసుసభలో, హిందువులలో, ముసల్మానులలోను కలియరు. కావున ఈక్రైస్తవులయెడఁ గలిగిన అవిశ్వాసము కాళీచరణ బెనర్జి గారియెడ కలుగలేదు. 'నేను వీరి దర్శన మాసింతు'నని గోఖలేగారితో ననఁగా 'వారినిజూచి నీవేమి చేయఁగలవు? వారు చాల యోగ్యులే; కాని వీరిని దర్శించినందుల నీకు సంతుష్టి కలుగఁబో దని నే నను కొందును. నేను వారిని బాగుగా నెఱుఁగుదును. నీవు చూడఁదలఁ తువేని తప్పక చూడవలసినదే.'

నేను కాళీబాబును దర్శనమున కర్థించితిని. వారు వెంటనే అనుమతి నిచ్చిరి. దర్శన మొనర్చితిని. ఇంటిలో వారి ధర్మపత్ని మృత్యుశయ్యమీఁద నుండెను. ఇల్లంతయు నిరాడంబరము. కాంగ్రెసునందు వారు కోటు పంట్లములలోనే యుండిరి గాని యింట బంగాళీ దోవతి కట్టుకొని కుడితిని తొడుగుకొని యుండిరి. నే నపుడు పారసీ

కోటు పంట్లమును ధరించియుంటిని గాని వారి యీ నిరాడంబర వేషమునకు ప్రీతుఁడ నయితిని. వారి సమయము వ్యయ మొనరింపక నాగొడవ నేను చెప్పుకొంటిని.

వీ రిటు లనిరి—'పాపములతోపాటు మనకు పునర్జన్మము కల దను సిద్ధాంతమును మీరు విశ్వసింతురా, విశ్వసింపరా?'

'తప్పక విశ్వసింతును.'

'అయితే ఈ మూలపాప నివారణోపాయము హిందూధర్మ ములో నెచటను లేదు. కాని క్రైస్తవధర్మమందు కలదు.'

అని యీమాట చెప్పి వీరు మరల నిటు లనిరి—'పాపమునకు ఫలము మృత్యువు. ఈమృత్యువును తప్పించుకొనుటకు ఏసే శరణము.

నేను వీరికి గీతోపదిష్టమగు భక్తియోగమును ఉపస్థితికిఁ దెచ్చి తినిగాని నాయీప్రయత్నము వృథాయయ్యెను. నేను వీరి సౌజన్యము నకు ధన్యవాదము లర్పించితిని. ఈసంభాషణమువలన నాకు తృప్తి కలుగలేదు. కాని లాభము కలిగెను.

ఈసమయమున నేను కలకత్తాలో వీథి వీథి వితగా తిరిగితిని. తఱుచు నడచి ఇపుడే న్యాయమూర్తి మిత్రగారిని, సర్ గురుదాస బెనర్జీగారిని దర్శించితిని. దక్షిణ-ఆఫ్రికా కార్యముల కీసజ్జనుల సాయ మావశ్యకము. ఇపుడే రాజా సర్ ప్యారీ మోహనముకర్జీ గారి దర్శన మును పొసఁగెను.

కాళీచరణ బెనర్జీగారు కాళీకాలయమునుగూర్చి నాకుఁ జెప్పిరి. ఒక పుస్తకమున దాని వర్ణన చదివియుంటిని. న్యాయమూర్తి మిత్ర గారి గృహ మాప్రాంతముననే. వారి దర్శన మొనరించి యాదారినే

కాళికాలయము చేఁగితిని. కాళికి బలిగాఁ బోవుచున్న గొఱియలమందను దారిలోఁ జూచితిని. ఆలయప్రసందులో విష్ణగాంధ్ర దండు. బైరాగిబాబులు సరేసరి. సంతలు, బజాఱులు మొదలగుచోటుల భిక్షుకుల కేమియు నీయరాదని నాఁటికే నాకు నియమ ముండెను; పలువురు భిక్షుకులు నావెంటఁ బడిరి.

బాబాజీ యొకఁడు ఎత్తగు నలుచదరపు రాతికట్టడముపై కూర్చుండియుండెను. అతఁడు నన్నుఁ బిలిచి—'నాయనా! ఎక్కడికిఁ బోవుచున్నావు?' అనెను. నేను యథోచితముగ బదులాడితిని. అతఁడు నన్నును, నామిత్రుని గూర్చుండు మనెను. మేము కూర్చుంటిమి.

నే నిటు లడిగితిని—'అయ్యా! ఇన్ని గొఱియలను బలియిడుట ధర్మమని మీరు తలఁతురా?'

ఆయన ఇటు లనెను—'జీవహత్య ధర్మమని యెవఁ డనును?'

'మీ రిచటఁ గూర్చుండి లోకుల కేల యుపదేశింపరు?'

'అది నాపని గాదు. భగవత్సేవయే నాపని.'

'తమ కందుల కీచోటే దొరకనా? వేఱొచోటులు లేవా?'

'ఎక్కడఁబట్టిన నక్కడనే కూర్చుందును. నా కన్ని తావులు నొక్కటియే. లోకుల గోల యేల? నా రొక గొఱ్ఱెలమంద. ఎక్కడికి పిలిచిన అక్కడికి పోవుదురు. మాకు వారితో నేమి పని?'

నే నిఁక సంవాదమును పెరుగనీయ లేదు. పిమ్మట నేనాలయములోనికిఁ జనితిని. ఎదురుగా రక్తనది చూచినపిదప నిలువ బుద్ధి పుట్టలేదు. నామదిలో పెద్ద క్షోభ కలిగెను తల్లడింపు లైపోతిని. అది నేఁటికిని మఱపురాదు.

## ౧౮ గోఖలేగారితో నొకనెల-౨

ఆసమయమున ఒక వంగసంఘమువారు నన్నువిందునకుఁ బిలిచిరి. అచట నే నొక సజ్జనునితో ఘాతకమగు నీపూజనుగూర్చి ముచ్చటించితిని. వారిట్లనిరి—'అచట బలిదానవేళలో చెవులు రింగుమన నవుబతులుమ్రోగును. ఈగందరగోళములో గొఱియలు మృత్యుబాధ నెఱుఁగవు.'

ఈమాట నాకు రుచింపలేదు. నేనిట్లంటిని—'ఆగొఱియలకు నోరుండుచో నిట్లనవు. ఈఘోరాచారమును ఆఁపవలెను.' నాకు బుద్ధదేవుని కథ గుఱుతువచ్చెను. కాని ఆపని మాత్రము నాశక్తికి మించినదని గోచరించెను.

ఈవిషయమున నాకు నాఁటికే యభిప్రాయమో నేఁటికిని అదియే యభిప్రాయము. గొఱియప్రాణము వెల మనుష్యప్రాణము వెలకంటె తగ్గదు. మనుష్యశరీరమును పోషించుటకు గొఱియను ఖూనీచేయ నేనెన్నఁటికి సంసిద్ధుఁడఁగాను. జంతు వెంత నిస్సహాయమో మనుష్యహింసనుండి తప్పించుకొన మనుష్యుని సాయము బడయుటకు అది అంత అధికారి. కాని యెంతో యోగ్యత, యెంతో యధికారము లేక మనుజుడిట్టి యాశ్రయదానము చేయఁజాలఁడు. గొఱియల నీక్రూరహోమమునుండి తప్పింప ఇంకను నాకు చాల నాత్మశుద్ధియు, త్యాగమును ఆవశ్యకము. ఇంకను ఈశుద్ధిని, త్యాగమునుగూర్చి ఘోషించుచు ఘోషించుచునే ఈ దేహమును విడువనయ్యెడి నేమో యని తోఁచెడిని. మనుష్యుల నీమహాపాతకమునుండి తొలఁగించుటకు, నిర్దోషములగు నీజీవముల రక్షించుటకు, మఱి యీయాలయమును పవిత్రము చేయుటకెన్నఁడు పరమేశ్వరుఁ డేమహాపురుషుని, లేక యేమహాసతిని సృష్టించునో! నేను సదా అందులకు ప్రార్థించుచున్నాను. జ్ఞానవంతులు, బుద్ధిమంతులు, త్యాగులు మఱి భావనాప్రధానులు నగు వంగవాసులుఎట్లీవధను సహించి యూరకుండుచున్నారు?

## ౧౬

## గోఖలేగారితో నొకనెల—3

శ్రీమాత నుద్దేశించి చేయఁబడుచున్న భయంకర మగు నీ యజ్ఞమును గాంచిన తరువాత నాకు బంగాళీ జీవితమును తెలిసికొను నిచ్ఛ యినుమడించెను. ఇందులకు బ్రహ్మసమాజ మతగ్రంథములు బాగుగా చదివితిని. ప్రతాపచంద్ర మజుమదారుగారి జీవితమును కొలఁది గొప్ప చదివితిని. వారి యుపన్యాసములు వింటిని. వీరు వ్రాసిన కేశవచంద్ర సేనుగారి చరిత్రమును కడు నాసక్తితోఁ జదివితిని. మఱియు సాధారణ బ్రహ్మసమాజమునకును, ఆదిబ్రహ్మసమాజమునకును భేదము తెలిసికొంటిని. పండిత శివనాథశాస్త్రిగారిని దర్శించితిని. ప్రొఫెసర్ కాధవలేగారితో, మహర్షి దేవేంద్రనాథ టాగూరుగారిని దర్శింపఁ జనితిని. కాని ఆసమయమున వా రెవరికిని దర్శన మిచ్చుటలేదు. కాన వారి దర్శన మబ్బలేదు. కాని వారి యింట బ్రహ్మసమాజోత్సవమునకు మే మాహూతుల మైతిమి. అపు డచట శ్రేష్ఠమగు వంగగానము వింటిని. నాఁటనుండి వంగగాన మనిన చెవులు కోసికొందురు.

బ్రహ్మసమాజమునుగూర్చి యింత తెలిసికొనిన తరువాత శ్రీ వివేకానందస్వామివారి దర్శన మొనరింపకుండ నుండు టెట్టులు? అత్యుత్సాహముతో బేలూరుమఠమువఱకు చాలవట్టు నడచియే వెళ్లితిని. ఎంతవట్టు నడిచితినో నేఁడు సరిగ గుర్తు లేదు! అట్టి యేకాంతస్థలమున ఉండుటవలన ఆమఠమును నేను చాలఁ గొండాడితిని. అచటికి వెళ్లఁగా స్వాములవారు జబ్బుపడి కలకత్తాగృహమునం దుండి రని తెలియ

వచ్చెను. ఈసమాచారము వినఁగా నా కాళ్ళలుడిగెను. పిదప సోదరి నివేదిత నివాస మెటేఁగికొంటిని. ఆమె యొక్క చౌరంగీమహాలునం దుండెను. అచట నామెను దర్శించితిని. ఆమె వైభవమును జూచి నిలువున నీరయితిని. మాటయందును పలుకునందుగూడ మాయిరువురికి పలుక కుదుర లేదు. నేనీవిషయమును గోఖలేగారికిఁ జెప్పితిని. 'ఆమె మిగుల తేజుగలది. మీకిరువురికి ఏకవాక్యత కలుగుట కష్ట'మని గోఖలే గారనిరి.

మఱియొకతూరి పేస్తన్‌జీ పాదుషాగారి యింట మాయిరువురకు సమావేశము కలిగెను. ఆమె యచట నుండఁగా నే నేఁగితిని; ఆమె పేస్తన్‌జీగారి వృద్ధమాత కుపదేశ మిచ్చుచుండెను. ఇందు నే నవాయా సముగా దుబాసి నయితిని. సోదరి నివేదితకును, నాకును భావైక్యము లేకున్నను నే నామెకుఁగల హిందూమతమునందలి అగాధప్రేమను గమనించితిని. ఈమె రచించిన గ్రంథములను నేను పిదపఁ జదివితిని.

అర్ధదినము దక్షిణ-ఆఫ్రికా కార్యములకు కలకత్తాలోని నాయకులను దర్శించుటకును మిగిలిన అర్ధదినము కలకత్తాలోని ధార్మిక సంస్థలను, ఇతరసార్వజనిక సంస్థలను దర్శించుటకును నేను నా దైనిక కార్యక్రమమును ద్వేధా విభజించుకొంటిని. నే నొకనాఁడు డాక్టరు మల్లికుగారి అధ్యక్షతక్రింద బోయరు యుద్ధమునందు భారతీయపరిచారకసమూహము చేసిన పనినిగుఱించి యుపన్యసించితిని. 'ఇంగ్లీష్‌మన్' పత్రికాధిపతి పరిచితి యిపుడును నా కుపయుక్త మాయెను. సాండర్సుగారి కిన్నాళ్లును సుస్తీగానే యుండెను గాని ౧౮౯౬ సంవత్సరమునందు ఎటులు నాకు సాయము చేసిరో యిపుడును అటులే సాయము చేసిరి. నా యీ యుపన్యాసమునకు గోఖలేగారు సంతసిం

చిరి. మఱియు నది డాక్టరు రాయిగారి మెప్పుపడయుఁగా మిగుల సంతసించిరి.

నేనిటులు గోఖలేగారి ఛత్రచ్ఛాయమునం దుండుటవలన బంగాళమునందు నాపని చాల తేలికయాయెను. బంగాళమునందలి గొప్పగొప్ప కుటుంబములతోడి పరిచితి సులభముగా కలిగెను. మఱియు నాకు బంగాళముతో సన్నిహిత సంబంధ మేర్పడెను. చిరస్మరణీయమగు ఈకాలమునందలి విషయములు పెక్కులున్నవి గాని వానిని విడనాడవలసి వచ్చుచున్నది. ఈసమయమున నే బ్రహ్మదేశ (బర్మా) మరిగితిని. అచటి ఫూంగీలఁ (సన్యాసులు) గనుఁగొంటిని. వారి సోమరితనమునకు వగపు కలిగెను. బంగారు పెగోడాలు గోపురములు) చూచితిని. దేవళమునందు లెక్కపెట్టలేనన్ని చిన్నచిన్న క్రొవ్వొత్తులు వెలుగుచుండెను. అవి నా కింపితము కాలేదు. గర్భాలయమున పరువులెత్తు సెలుకలను జూడఁగా మోర్బిలో దయానంద స్వామివారి యనుభవము గుఱుతువచ్చెను. బ్రహ్మదేశమునందలి స్త్రీల స్వాతంత్ర్యమును, ఉత్సాహమును జూచి సంతసించితిని గాని పురుషుల మాంద్యమును గాంచి దుఃఖించితిని. బొంబాయి ఎటులు హిందూదేశముకాదో రంగూను కూడ అటులే బ్రహ్మదేశము కాదని చూచి తెలిసికొంటిని. మఱియు హిందూదేశమునందు మనము ఇంగ్లీషువర్తకులకు కమిషన్ ఏజెంట్లమయినట్లే ఇంగ్లీషువర్తకులతో కలిసి బ్రహ్మదేశము వారిని మనకు కమిషన్ ఏజెంట్లుగాఁ జేసికొంటి మనియు దెలిసికొంటిని.

బ్రహ్మదేశమునుండి మరలివచ్చిన పిదప గోఖలేగారికడ సెలవు గొంటిని. వీరిని విడిచిపెట్టుట దుస్సహ మాయెను. అయితే నాకు వంగదేశముతో లేక కలకత్తాతో పని అయిపోయెను.

అన్ని పనులకంటె ముందు, హిందూదేశమున మూఁడవ తరగతి రైలుబండ్లలో ప్రయాణము చేసి ఆతరగతిలో పయనించువారి కష్టములను తెలిసికొనవలయు నని తలఁచితిని. ఇట్లు గోఖలే గారికి విన్నవించితిని. విసే వినుటతోడనే వీరపహసించిరి. కాని నాయభిప్రాయములను నేను తెలుపుకొనఁగా సంతసించిరి. ముమ్మొదట కాశికి వెళ్లి ఆనిబిసెంటుగారి దర్శన మొనరించుకొనవలయునని స్థిరీకరించితిని. ఆమె యపుడు మంచ మెక్కియుండెను.

మూఁడవ తరగతి రైలుబండి ప్రయాణమునకు తగిన సరంజామా సిద్ధపఱిచికొనవలసి వచ్చెను. లడ్డువులు, పూరీలు నించిన టిఫిన్ బాక్సు ఒకటి గోఖలేగారు బహుమతి చేసిరి. పండ్రెండు డణాలకు ఒక రైలు సంచి కొంటిని. ఒకచాయ ఉన్ని (పోరు బందరు ప్రాంతము వారు నేయుదురు) కోటు, ఒకతువ్వాలు, ఒకదోవతి, ఒకకుడితినీ వీని నందుంచితిని. కప్పుకొన నొక కంబళి నుంచికొంటిని; ఇవిగాక ఒక లోటా, ఈ సామానును తీసికొని రవాణా అయితిని.

గోఖలేగారును డాక్టరు రాయిగారును నను సాగనంప స్టేషనుకు వచ్చిరి. రావలదని వీరిని నేను కడు వేడుకొంటిని గాని వీరు నామాట విన్నారు కారు—'నీవు ఒకటవ తరగతి బండిలో పయనించుచో నేనురాను గాని యిపుడు రాకతక్కదు' అని గోఖలేగారనిరి.

ప్లాటుఫారమ్ మీఁదికి వెళ్లుచుండఁగా గోఖలేగారి నెవరును అవరోధింప లేదు. వీరు పట్టుపాగ చుట్టుకొనిరి, ధోవతి కట్టుకొనిరి, కోటు తొడుగుకొనిరి. డాక్టరు రాయిగారు బంగాళీ వేసములో నుండిరి. ఈకారణమున టిక్కట్ కలెక్టరుబాబు మొదట వీరినాఁపెను గాని గోఖలేగారు 'నామిత్రులు'ని చెప్పిన పిదప రానిచ్చెను. ఈరీతిగా వా రిరువురును నాకు సెలవొసఁగిరి.

# ౨౦

## కాశిలో

ఈపయనము కలకత్తానుండి రాజకోటకు. నడుమ కాశి, ఆగ్రా జయపురము, పాలనపురములు చూచుకొని రాజకోట పోదలంచితిని. వీనిని చూచుటకుమాత్ర మవకాశ ముండెను. అన్ని స్థలములందును ఒకొక్కనాడే ఉంటిని. పాలనపురమునందక్క మిగిలిన స్థలములందు సత్రములందును, పండాల యిండ్లయందును ఉంటిని. ఈప్రయాణమున కయిన వ్యయ మంతయు రైలు ఖర్చులతో కలిసి ముప్పదియొక్క రూపాయ్యలని గుఱుతు. మూడవ తరగతి బండ్లలో వెళ్ళుచున్నను మెయిలులో నెక్కలేదు. ఏలన, అందు జనము క్రిక్కిఱిసియుండు నని తెలియును. మిగిలిన బండ్లకంటె మెయిలుబండిలో మూడవతరగతి టికెట్టు కున్న వెల యెక్కువ. నా కిది కష్ట మనిపించెను.

మూడవ తరగతి బండ్లలో చెత్తయు, మఱుగుదొడ్ల కంపును నేఁ డెటు లుండెనో నాఁడును అట్లేయుండెను. ఇన్నాళ్లకుకొంచెము సంస్కరణము జరిగియుండునుగాని మూడవ తరగతికిని మొదటి తరగతికిని గల కిరాయిలోనుండు అంతరముకంటె ఆ రెండు తరగతులకును గల సౌకర్యములో నుండు అంతర మెక్కువ. మూడవ తరగతి బాటసారులకును, గొఱియలకును భేదము లేదు. ఈబండ్లుగూడ గొఱియలకే తగినవి. యూరపులో మూడవ తరగతిలో పయనించుటయే నా కలవాటు; ఎటులుండునో చూతమని ఒకసారి మొదటి తరగతి పెట్టె యెక్కితిని. మూడవ తరగతికిని, మొదటి తరగతికిని అంతర

మంతగా నాకుఁ గానరాలేదు. దక్షిణ-ఆఫ్రికాలో మూఁడవతరగతి బాటసారులు తెలుచు నీగ్రోలు. అక్కడ మూఁడవతరగతి బాటసారులకు సౌకర్యము చక్కగా నుండును. కొన్నికొన్ని చోటుల మూఁడవ తరగతి బండ్లలో పడుకొనుటకును ఏర్పాటులుండును. కూరుచుండుటకు దిండు లుండును. పెట్టెలలో నియతి నతిక్రమించి యెక్కువమంది యెక్కరు. ఈమర్యాదాపాలనము మన దేశములో నెక్కడను గానరాదు.

రైల్వేవారి చెడు ఏర్పాటు లటుండ బాటసారుల అనుచిత్యమును జూచినచో శుచిగానుండువా రం దెక్క సంకోచింతురు. సంకోచించి యేమిఫలము? ఆ పయనము వారికొక శిక్షగ గాన్పించును. పలువు రక్కడక్కడనే ఉమియుదురు. ముఱికి చేయుదురు. బీడీల పొగ పెట్టుదురు. తమలపుటాకులుఁ, పొగాకును నమిలి పిచకారి కొట్టుదురు. బిగ్గఱగా మాటలాడుదురు. ప్రక్కవారి బాధ నరయక దుర్భాషలాడుదురు. ఇట్టి మూఁడవతరగతి రైలు పయనపు పాట్లు అంతట ననుభవించితిని.

నేను ౧౯౦౨ సంవత్సరము మూఁడవతరగతి బండిలో పయనించితిని. ౧౯౧౫ నుండి ౧౯౧౯ సంవత్సరమువఱకును ఎడతెగక మూఁడవతరగతిలోనే పయనించితిని. అప్పటికిని ఇప్పటికిని ఎక్కువ భేద మేమియు కానిపింపలేదు. ఈమహావ్యాధికొకటే మందు. చదువుకొనినవా రందఱును మూఁడవ తరగతిలోనే పయనించి బాటసారుల దురభ్యాసములను మార్పఁ జూడవలయును. ఇంతియకాక అక్కఱకల వానిగుఱించి అర్జీలు పంపి రైలు-అధికారులను నిదుర పోనీయఁగూడదు. తమతమ సౌఖ్యమునకు లంచములీయరాదు; మఱి యేయితరములగు నన్యాయమార్గములను బట్టరాదు. మఱియు రైలు నియమముల నతిక్రమింపరాదు. ఇటు లొనరించినచో కొలఁది గొప్ప సంస్కారము

జరుగునని అనుభవమువలనఁ జెప్పుచున్నాను. నేను జబ్బుగానుండక పోవుటవలన ౧౯౨౦ సంవత్సరమునుండి మూఁడవతరగతి పయనమునకు స్వస్తి చెప్పవలసివచ్చెను. ఇందులకు నాకు సిగ్గును వగపును గలిగెడిని. మూఁడవతరగతి బాటసారుల కష్టములను దూరముచేయు ప్రయత్నము కొంచెము దారికి వచ్చుచున్న కాలముననే నాకిట్టి యదృష్టము తప్పిపోయెను. రైలునందును, పొగయోడలందును పయనించు పేదవారల చిక్కులను, అసౌకర్యములను, దురభ్యాసములను తొలఁగించుటయు విదేశవర్తకులకు సర్కారువారు చేయు అనుచితసౌకర్యములను దొలఁగించుటయు ఇది అందఱకును సంబంధించిన ఒక స్వతంత్రవిషయము. ఇందులకు సమర్థులొకరిద్దరు పూనుకొనినచో మేలు కలుగును.

ఇఁక నీమాట కట్టిపెట్టి కాశీకథ వినిపింతును. ప్రాతఃకాలమున కాశిలో కాలుపెట్టితిని. పండాయింట దిగఁ దలఁచితిని. పలువురు బాపనయ్యలు నాచుట్టు ముట్టిరి. వీరి అందఱిలో శుచిగానున్న పండాయింటికి వెళ్లుద మనుకొంటిని నేను వెళ్లినట్లే ఆయిల్లు శుచిగానుండెను. ముంగిలిలో గోవు కట్టఁబడియుండెను. ఇల్లు శుద్ధముగానుండెను. మేడమీఁద నాబస. యథావిధిగా గంగాస్నానము చేయఁ దలఁచితిని. అంతవట్టు అన్నము తినకుండ నుండ నెంచితిని. చేయవలసిన ప్రయత్న మంతయు పండా చేసెను. ౧-౪-౦ కంటె నెక్కువ దక్షిణ యీయఁజాలనని మొదటనే పండాకుఁ జెప్పితిని. దానికిఁ దగినట్టులే చేయుమంటిని. అతఁ డించుకయు జగడమాడక— ఫకీరులకైనను పాదుషాలకైనను పూజ ఒకరీతిగనే చేయింతుము. యాత్రికులు వారి శక్తిని, ఇచ్ఛను అనుసరించి యిత్తురు, దానికేమి అనెను. పూజాసమయమున మంత్రము లేమియు మ్రింగినటులు తోఁపలేదు. పండ్రెండు గంటలకు పూజాస్నానాదుల నెఱవేర్చికొని కాశీ

విశ్వనాథుని దర్శింపఁ జనితిని. అచట నాచూచిన విషయములు దుఃఖ జనకము లాయెను.

౧౯౯౧ సంవత్సరమున నేను బొంబాయిలో బారిస్టరీ చేయు చుండఁగా ప్రార్థనాసమాజమందిరమునందు కాశీయాత్రనుగూర్చి ఒక యుపన్యాసమును వింటిని. దానఁజేసి నిరాశుఁడనయియే వెళ్లితిని గాని ప్రత్యక్షదర్శనమున అనుకొనినంతకన్న నెక్కువ నిరాశుఁడ నైతిని.

జాఱుదలగానున్న ఒక యిఱుకు సందులోనుండి ఆలయమును లోని కేఁగవలయును. అచట శాంతి యను మాటయేని లేదు. నలు దెసల ఈఁగలు 'మొయి' మనుచుండెను. యాత్రికులయు, దుకాణ మునవారలయు గోల పడరాదు.

ధ్యానమునకు, భగవచ్చింతనమునకు తావైన అచట వాని యూరు పేరులు లేవు. కాని తమ చుట్టుప్రక్కల నేమి జరుగుచున్నదో తెలియక ధ్యానమునందు మునిఁగియున్న స్త్రీలను కొందఱను నేను జూడకపోలేదు. కాని యిందుల కాలయాధికారులను ప్రశంసింపవలసిన పని యేమియు లేదు. ఆలయ ప్రాంతములు శాంతముగ, నిర్మలముగ సుగంధితముగ, వెలుపటి శాంతి లోపల ప్రతిబింబించునట్టులు చేయుట ఆలయాధికారుల విధి. నే నచట మోసపు వర్తకులు రెండవ రకపు మిఠాయి అమ్ముచుండుట జూచితిని.

ఆలయము ప్రవేశింపఁగనే గుమ్మముముందు కుళ్ళిన పూలు కానిపించెను. వీనినుండి దుర్గంధము ప్రసరించుచుండెను. లోపల నేల యంతయు చలువరాలచే పఱుపఁబడియుండెను. ఆ చలువరాలమీఁద అంధభక్తుఁ డొకఁడు రూపాయలు తాపటము చేయించెను. దానిలోనికి మురికి దూరి నివాస మేర్పఱచికొనెను.

'జ్ఞానవాపి' కడ కేగితిని. అచట నీశ్వరు నన్వేషించితిని గాని వృథా. దాన నామనస్సు బాగుండలేదు. జ్ఞానవాపికడఁ గూడ చెడుగవులే. దక్షిణ నర్పింప నాకు ఆట్టే బుద్ధిపుట్టలేదు. కావున నొకదమ్మిడి అచట వయిచితిని. పండా ఎగిరిపడి దమ్మిడిని త్రోసివైచి కొన్ని తిట్లుతిట్టి' నీవిట్టి యవమానము చేయుదువేని నరకమున కూలఁగలవు' అనెను.

'అయ్యా! నా కేకర్మము కానున్నదో యది యగుఁగాక! కాని తమ రీదుర్భాషలను వాకునకుఁ దెచ్చుటుచితము కాదు. ఈదమ్మిడిని తీసికొన్నచో తీసికొనుఁడు లేదా యిదియు మీకు దక్కఁదు' అని నేనంటిని. 'పో! నీదమ్మిడి నాకుఁ గావలయు ననుకొంటివిగాఁబోలు?' అని పండా మఱినాలుగు తిట్లు వడ్డించెను. నేను దమ్మిడిని దీసికొని దారిని బడితిని. 'పండామహాశయునికి దమ్మిడి నష్టము; నాకు దమ్మిడి లాభమ'ని నే ననుకొంటిని. కాని ఆయన దమ్మిడి పోనిచ్చువాఁడు కాఁడు. అతఁడు నన్ను వెనుకకు రాఁబిలిచి 'మంచిది. అక్కడఉంచు! నేను నీవలె జేయరాదు. నేను తీసికొనకున్నచో నీకమంగళము కలుగును' అనెను.

నేను మెదలక ఆదమ్మిడి నట నుంచి ఒక పాడవు నిట్టూర్పు విడిచి నిర్గమించితిని.

ఇటు పిదప ఒకటి రెండు మాఱులు కాశీవిశ్వనాథునికడ కేఁగితినిగాని నాకప్పటికి మహాత్మబిరుదము లభించియుండెను. కావున ౧౯౦౨ సంవత్సరపు అనుభవము లెటులు కలుగును? నేనే దర్శనపాత్రము నయిపోవఁగా నిఁక నాకు దర్శనభాగ్య మెటులు? మహాత్ముల కష్టములు మహాత్ములకే రెఱుక. అది యటుండె. ఆలయమున గవులు కంపులు అల్లరియు మున్నెటులుండెనో అప్పుడును అటులేయుండెను.

ఎవరికేని పరమేశ్వరుని దయ యెడల శంక యుండునేని వారిటు వంటి తీర్థక్షేత్రములను జూతురుగాక! ఆమహాయోగి తనపేరిట జరుగు చెంత మోసమును ఎంత అధర్మమును, ఎంత పాషండతను సహించు చున్నాఁడోకదా! ఆయన యిటులు చెప్పి యుంచినాఁడు— '*యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్'
కర్మనెవఁడు మిథ్య చేయఁగలఁడు? మఱియు నిఁక భగవానుఁడు నడుమ తా నేల చేయి చేసికొనవలయును? ఆయన ధర్మము నిటులు నిర్ణయించి అంతర్హితుఁ డాయెను.

నే నీయనుభవములు వెంబఁబెట్టుకొని మిసెస్ బిసెంటు దర్శన మున కేఁగితిని. ఆమె యపుడే జబ్బుపడి లేచెను. నారాకను లోనికి దెలిపినంతటనే యామె నన్నుఁ జూడవచ్చెను. నేను కేవలము దర్శన కాంక్షినికావున నిటులంటిని.

'తమకు శరీరమున తిన్నగాలే దని వింటిని. అందులకు మిమ్ముఁ జూచిపోవుటయే నాకోరిక. తమకు జబ్బుగా నున్నను దర్శనమిచ్చితిరి. చాలును; సంతుష్టుఁడను. ఇఁక నింతకంటె నెక్కువ కష్టము మీ కీయఁ గోరను.'

ఇటు లామెకడ సెలవు గొంటిని.

*'ఎవ రెటులు నన్నుఁ గొలిచిన వారి కట్టి ఫల మొసఁగుదును'.

## ౨౧

### బొంబాయిలో

నేను బొంబాయిలో ఉండి బారిష్టరీ చేయుచు దానితోపాటు లోకసేవలో పాలుగొన గోఖలేగారి కోరిక. ఆకాలమున లోకసేవ యనఁగా కాంగ్రెసుసేవ. అపుడు గోఖలేగారొక సంస్థను స్థాపించియుండిరి. దానిపని కేవలము కాంగ్రెసు పనులను నడపుట.

నాకును అదియే కోరికగాని బారిష్టరీలో ఆత్మవిశ్వాసము తక్కువ. పూర్వానుభవములు మఱపుతగులలేదు. మఱి కేసులకొఱకు వారిని వీరిని కొనియాడుట నాకు విషప్రాయము.

ఈ కారణమున మొదట నేను రాజకోటయందే మకాముపెట్టితిని. అచట నాపురాణహితైషులును, నన్ను సీమ కంపినవారును అగు 'కేవలరాం మావజీదవే'గారు మూఁడుకేసులు తెచ్చియిచ్చిరి. అందు రెండు అప్పీళ్లు. కాఠియావాడు జూడిషల్ అసిస్టంటుకడ వానివిచారణ. మిగిలినది అసలుదావా. అది జామనగరమునందు. ఇది పెద్దదావా. ఈదావా గెలిపింప నేను పూచీ యీయలే నంటిని. ఓడిపోవుచో మేముమాత్ర మోడిపోమా? కాని నీవు నీశక్తికొలఁది పనిచేయుము! నేనును నీతో నుందునుగాదా.

ప్రతిపక్షుల వకీలు స్వర్గీయులగు 'సమర్థుగారు'. నేను కేసు బాగుగా చదివి సంసిద్ధుఁడ నైతిని. నాకు ఇండియన్ లా బాగుగా వచ్చుననికాదు. మఱి కేవలరామ దవేగారు నాకు నూఱిపోసిరి. 'ఎవిడెన్స్-ఆక్టు—సాక్షివిధాన మంతయు ఫిరోజిషాగారికి జిహ్వా

గ్రమున నుండును. 'ఆయన గొప్పవాఁడగుటకు హేతు వది' యని నామిత్రులు నేను దక్షిణ-ఆఫ్రికాకు పోవకముందు చెప్పుచుండెడి వారు. ఈసంగతి నేను గుర్తుంచుకొని దక్షిణ-ఆఫ్రికాకు వెళ్లునపుడు టీకలతోఁగూడ వీని జదివి పెట్టుకొంటిని. ఇంతియకాక నాకు దక్షిణ-ఆఫ్రికా యనుభవమును గలదు.

నేనీ దావా గెలిచితిని. దీనివలన నావిశ్వాసము దృఢపడెను. అప్పీళ్ల యెడ నాకు భయములేదు. అవియు గెలిచెను. ఇఁక బొంబాయి వెళ్లినను భయములేదని ధైర్యము కలిగెను.

ఈవిషయ మెక్కువ చెప్పక ముందు తెల్లయధికారుల యవిచారమును, అజ్ఞానమును గుఱించి కలిగిన అనుభవము చెప్పెదను. ఈ జూడిషల్ అసిస్టంటు ఎప్పుడును ఒకచోట నుండఁడు. ఈయన త్రిపాదివలె ఎక్కడెక్కడ తిరుగుచుండునో వకీళ్లును క్లయింట్లును అక్కడక్కడికి పోవలసియుండుదురు. తమచోటులు వదలివచ్చు వకీళ్లకు ఫీ జెక్కువ కాఁగా క్లయింట్లకు ఇబ్బడి ఖర్చు తగిలెడిది. ఇదియంతయు విచారించుటకు జడ్జి కేమిపని?

వేరావల్ అను గ్రామమున ఈఅప్పీలు శ్రవణము. అపుడు వేరావలఁనందు ప్లేగు ముమ్మరముగా నుండెను. రోజుకు ౫౦ మందికి తాఁకుచున్నటులు గుర్తు. జనాభా ఇంచుమించు ౫౫౦౦. దాదాపు గ్రామమంతయుశూన్యము. నేనొకశూన్యసత్రమున విడిసితిని. అది గ్రామమునకు కొంచెము దవ్వు. అయితేపార్టీలకు నివాస మెక్కడ? వీరు దరిద్రులయినచో వీరి నీశ్వరుఁడే కాపాడుకొనవలయునా?

'అచట ప్లే గుండుటవలన విచారణ మఱియొకచోటికి మార్పుమని దొరగారిని కోరుము' అని నా కొకవకీలుమిత్రుఁడు తంతినిచ్చెను.

నే నటులు కోరఁగా దొరగా రిటు లనిరి:' ప్లేగుకు భయపడుచు న్నారా?'

'ఇం దదుఁగవలయునది మా భయమునుగుఱించి కాదు. నా సంర క్షణోపాయము నాకు దెలియును. అయితే క్లయింట్లగతి యేమి కావ లయును?'

'ప్లేగు హిందూదేశమున ఇల్లు కట్టుకొన్నది. దీనికి భయ మెం దుకు? వేరావలుగాలి ఎంతమంచిది! (దొరగారు గ్రామమునకు దూర ముగా రాజభవనమువంటి డేరాలో నున్నారు) ఈరీతిగా వెలుపల నుండుట జనులకు నేర్పవలయునని యిటులు చేయుచున్నాను.'

ఈ ఫిలాసఫీ ముందు నామాట యేమి చలామణీ యగును? 'గాంధిగారు చెప్పినది గుర్తుంచుకొని వకీళ్లకును, పార్టీలకును నిక్కముగా కష్టమాయె నేని నాకుఁ జెప్పు'మని దొరగారు శిరస్తాదారుతో ననిరి.

దొరగారొప్పుకొనినదాని నే చేసి రనుట నిక్కమము. కాని నల్ల వారి యిక్కట్టులముం దది యేపాటి? ఆయనకు బీదలగు నల్లవారి యక్కఱలు, అలవాటులు, స్వభావములు, ఆచారములు ఎటులు తెలియఁ గలవు? కాసులమీఁద నడచువారికి కానులయేటుక యెటులు? ఎంత విచారించినను, ఏనుఁగు చీమనుగుఱించి తెలిసికొన నెటు లసమర్థ మగునో ఆరీతిగనే అక్కఱలో ఏనుగులంతటి తెల్లవారు అక్కఱలో చీమలం తటి నల్లవారిని గుఱించి తెలిసికొనను, వారికి తీర్పుదిద్దను అసమర్థులు కాఁగలరు.

ప్రకృతి మనుసరాము. పైని జెప్పిన చందమున నాయందు నాకుఁ గొంత విశ్వాస ముదయించినతరువాత కొంతకాలము రాజకోటయందే ఉండ నిశ్చయించితిని, ఇంతలో నొకనాఁడు కేవలరాముగారు నాకడ

కువచ్చి—'నిన్నిచట నుండనీయము, నీవిఁక బొంబాయిలో ఉండవలసి వచ్చును' అనిరి.

'అయితే అచట నున్నచో నాకు కేసు లేవి? నా ఖర్చులు మీరు గడపుదురా?'

'ఆహా! నీఖర్చులు గడపుదుము. వలసినపుడు పెద్దపెద్ద బారిష్టరులవలె నిన్ను ఇచటికి తీసికొని వత్తుము. వ్రాఁతకోఁతల పనులన్నియు అచటికిఁ బంపుదుము. బారిష్టరును గొప్పవానిని జేయుటగాని, కొలఁది వానిని జేయుటగాని ప్లీడరుల చేతిలోని పనిగాదా? జాంనగరమందును, వేరావలునందును నీవు నీ పనిని తిన్నగా జేసితివి. దీనివలన మాకిఁక పికరులేదు. నీవు లోకారాధన చేయవలసినవాఁడవు! నిన్నిటులఁ గాతియావాడులో మునుఁగనీయము. చెప్పు ప్రయాణమెపుడో?'

'నేటాలునుండి నాకు కొంతపైకము రావలసియున్నది. అది వచ్చుటతోడనే నేను వెళ్లుదును.'

పైకము రెండువారములలో వచ్చెను. నేను బొంబాయి వెళ్లితిని. 'పేయిన్ గిల్‌బర్ట్ అండ్ శాయనీస్' ఆఫీసునందు 'చేంబర్స్' అద్దెకుఁగొని అచట నిలిచిపోతిని.

## ౧౧

## ధర్మసంకటము

నేనాఫీసుతోపాటు గిరిగామునందు ఇల్లును అద్దెకుఁగొంటిని. కాని యీశ్వరుఁడు నన్ను స్థిరముగా నిలువనీయలేదు. ఇల్లుగొని యెన్నో నాళ్లు కాకముందే నా రెండవపిల్లవానికి జబ్బు వచ్చిపడెను. టైఫాయిడ్ జ్వరము. జ్వరము బాఱదు. తడఁబాటుమాటలు, రాత్రి సన్నిపాతలక్షణములు. ఈవ్యాధికి ముం దితనికి ముమ్మరముగాఁ మశూచి పోసెను.

డాక్టరును బిలిచితిని. 'ఇందులకు మం దుపయోగింపదు, కోడి గ్రుడ్లరసము, కోళ్ళరసమును ఈయవలయు'నని యతఁ డనెను.

మణిలాలు వయస్సు పదియేండ్లు. వాని నే మడుగుదును? సంరక్షకుఁడను నేనే యేదో యొకటి నిర్ణయింపవలసినవాఁడను. డాక్టరు సజ్జనుఁడు, పారసీకుఁడు. 'అయ్యా! మేము మాంసాహారులము కాము. మీరు చెప్పిన ఈరెండువస్తువులలో దేనినీ ముట్టము. ఇందులకు బదులు మఱియొకటి చెప్పుఁ' డంటిని.

'మీకుఱ్ఱవానికి జీవితాశలేదు. పాలలో నీరుకలిపి యీనగును గాని ఆయాహారము చాలదు. నేను పలువురు హిందువుల కుటుంబములలో వైద్యము చేయుదు నని మీ రెఱుఁగుదురు. వా రెవరును నే నెటులు చెప్పిన నటులు చేయకమానరు. నే నీపైని జెప్పినవి వారు తీసికొనుచునే యున్నారు. నేను చెప్పినటులే మీరును విని మీకుఱ్ఱని యెడ కాఠిన్యము తాల్పకుందురేని మేలు కలుగును.'

'మీ రన్నది నిక్కమే కాని తమ కిది తెలుప గోరెదను. ఇందు నాపూచీ చాల నెక్కువ. ఇతఁడు పెద్దవాఁడై యుండునేని వాని యిష్టానుసారము ప్రవర్తించియుందును గాని యీవిషయమును నామీఁదనే పడినది. మనుష్యునకు ధర్మసంకట మిట్టి సమయమందేయని నే ననుకొందును. తప్పగునొండొ ఒప్పగునొండొ. మనుష్యుఁడు మాంసము తినరా దని నామతము. జీవనసాధనములకును ఒక యెల్ల కలదు. ప్రాణధారణ మొనరించుటకును ఈవస్తువుల దినరా దని నాయుద్దేశము. నాకుఁ గాని, నావారికిఁగాని ఇట్టి సమయములందును నాధర్మమర్యాద మాంసము మొదలగువానిని నిషేధించుచున్నది. కావున మీ రీ కుఱ్ఱవానిజీవిత మపాయగ్రస్తమయి యున్నదని నిశ్చయించినను, అట్టిది తటస్థించినను నేను వీని ముట్టను. కాని నే నొకటి మిమ్ము యాచింతును. మీమందులు నేను వాడను, నాకు నాడీహృదయపరీక్ష తెలియదు. నాకు కొంచెము జలచికిత్స యెఱుక. నే నాచికిత్స చేయఁదలఁతును. కాని తమరు నియమము ననుసరించి మణిలాలును జూడవచ్చి శరీరమునందు జరుగు మార్పులను నాకు దెలుపుచుందురేని నేను తమ మేలు మఱవను' అని అంటిని. సజ్జనుఁడగు నతనికి నా యిక్కట్టు తెలిసెను. నాయిచ్ఛానుసారము మణిలాలును జూచిపోవ నంగీకరించెను.

మణిలాలు తనయుద్దేశమును నిర్ధారించి చెప్పఁగలవాఁడు కాకపోయినను నాకును డాక్టరునకును జరిగిన సంభాషణమును తెలియఁజెప్పి పిదప 'నీ ఉద్దేశమేమి?' అని అడిగితిని.

'నీవు మామూలుగా జలవైద్యము చేయుము. నాకు కోళ్లూ వద్దు కోడిగ్రుడ్లరసమూ వద్దు.'

'నేను వీనిని తిను మని చెప్పినచో నితఁడు తినునని నాకుఁ దెలిసినను ఈమాటలవలన నాకు సంతసము కలిగెను.'

నాకు కూనీవైద్యము కొంచెము తెలియును. లోఁగడ నీవైద్యము చేయుచుంటిని. రోగమునకు 'లంఘనం పరమౌషధమ్' అని నాకుఁ దెలియును. కూనీపద్ధతి ననుసరించి మణిలాలునకు కటిస్నానము మూఁడు నిమిషములు మాత్రము చేయించుచుంటిని. మూఁడుదినముల వఱకు నీరుకలిపిన నారింజపండ్లరస మిచ్చుచుంటిని.

వేఁడి జాఱలేదు. రాత్రులు కొంచెముకొంచె మెగయుచుండెను. వేఁడి ౧౦౪ డిగ్రీలవఱకు పోవుచుండెను. నాకు తొందరపుట్టెను. 'పిల్లవాని కెక్కువ చేసిన యెడల నన్ను లోకు లేమనుకొందురు? మాయన్న యేమనును? మఱియొక డాక్టరును పిలిపింపరాకపోయెనా? ఆయుర్వేదవైద్యుని పిలిపింపకపోదునా? అపక్వమయిన తమబుద్ధిని పిల్లలపై ప్రయోగింప తలిదండ్రుల కేమి హక్కు?' అని యిట్టియూహలు కలిగెను.

'జీవుఁడా! నీవు నీకొఱకు దేనిని జేయుచున్నావో నీపిల్లవానికిని దానినే చేయుము. దీనికి పరమేశ్వరుఁడు సంతసించును. నీకు జలచికిత్సమీఁద గుఱి. మందుమీఁద లేదు. డాక్టరు ప్రాణముపోయలేఁడు. అతఁ డిచ్చునదెల్ల మందు. ప్రాణతంతువు పరమేశ్వరుని చేతనున్నది. ఈశ్వరనామము గ్రహింపుము. మఱి దీనిని నమ్ముము. నీమార్గమును విడువకుము' అని యీ యూహలును కలిగెను.

మనస్సునం దిటులు మల్లాగుల్లాములు పడుచుంటిని. చీఁకటులు పడెను. రాత్రి మణిలాలును దగ్గఱకుఁ దీసికొని పడుకొంటిని. తడి గుడ్డమీఁద కప్పవచ్చునని నిశ్చయించితిని. లేచి బట్ట తెచ్చి చలినీటఁ దడిపి పిడిచి తలవఱకుఁ గప్పితిని. పైని రెండు కంబళ్లు కప్పితిని. తలకు తడితువాలు చుట్టితిని. ఒడలు పెనమువలె కాలి ఆర్చుకొనిపోయెను. చెమటబొట్టు లేదు.

నాకు అలపు పుట్టెను. మణిలాలును తల్లి కప్పగించితిని. ఒక అఱగంటసేపు మంచిగాలిలో తిరిగి శ్రమ తీర్చుకొని శాంతి నొందఁ గోరి చౌపాటీవంకకుఁ బోయితిని. పదికొట్టెరి. మనుజుల రాకపోకలు తగ్గిపోయెను. కాని నా కదేమియు తెలియుటలేదు. నేను విచార సాగరమున మునిఁగిపోతిని. ఓయీశ్వరా! ఈధర్మసంకటమున నావి నతి నంగీకరింపుము! నానాలుకపైని రామనామ మాడుచునే యుండెను. కొంతసేపటికి ఇంటికి మరలితిని. నాగుండెలు దడదడలాడు చుండెను. ఇంటఁజొరఁగనే మణిలాలు 'నాన్నా వచ్చితివా?' యనెను.

'ఆ నాయనా!'

'నన్నిందుండి తీసివేయుము! ఇందులో చచ్చిపోవుచున్నాను.'

'చెమట పోయుచున్నదా?'

'చెమటతో స్నాన మయిపోనది. వెంటనె తీసివేయుము నాన్నా!'

'నేను మణిలాలు తల చూచితిని, స్వేదబిందుమాల, వేఁడి దిగజారెను. నే నీశ్వరునకు చేతు లెత్తితిని.'

'నాయనా! మణిలాలా! భయములేదు. ఇఁక జ్వరము పోవును కాని ఇంకొంచెము చెమట పోయనిమ్ము!'

'ఇఁక ఆఁగలేను. ఇపుడే నన్ను బయటికి తీయుము, వలయుచో నింకొకతూరి కప్పవచ్చును.'

నాకు ధైర్యము వచ్చెను. మాటలతో కొన్ని నిముసములు గడపితిని. చెమట తలనుండి ధారగా కాఱఁజొచ్చెను. కప్పినబట్టలన్నియు దీసితిని. ఒడలంతయు తుడిచి ఆఱనిచ్చితిని. పిదప తండ్రి

బిడ్డల మా మంచముమీఁదనే నిదిరించితిమి. మా యిరువురకును గాఢ నిద్ర పట్టెను.

ప్రొద్దున జూతునుగదా మణిలాలునకు వేఁడి చాలవఱకు తగ్గిపోయెను. నలుబదినాళ్లు పాలు నీరు పండ్లమీఁద నుంచితిని. నాకు భయము తీఱెను. జ్వరము మొండిదేగాని తుదకు వశమాయెను.

నేఁడు నా బిడ్డలందఱిలో మణిలాలు ఆరోగ్యవంతుఁడు, బలిష్ఠుఁడును.

ఇందులకు కారణము రాములవారి కృపయా? జలచికిత్సయా? అల్పాహారమా? లేక యేదేని యుపాయమా? దీనినిర్ణయ మెవరు చేయగలరు? ఎవరి విశ్వాసము చొప్పున వారికి నిర్ణయించుకొనఁ జెల్లును. కాని ఆసమయమున ఈశ్వరుఁడే నావినతి నంగీకరించెనని నేను నమ్మితిని; నేటికిని నమ్ముచున్నాను.

## ౨౩

## మరల దక్షిణ-ఆఫ్రికా

మణిలాలునకు పూర్తిగా నిమ్మళించెను. గిరిగాము నందలి గృహము వాసయోగ్యముగా లేదని తలఁచితిని. ఇల్లంతయు తేమ. తగిన వెలుఁగు లేదు. కావున నేను రేవాశంకరుగారితో నాలోచించి మంచితావున గాలి వచ్చు నిల్లు తీసికొన నిశ్చయించితి. బాంద్రా, సాంతాక్రూజ్ వగైరా లన్నియు తిరిగితిమి. బాంద్రాయందు కసాయిదుకాణ ముండుటచే నచట నుండ నాకు బుద్ధిపుట్టలేదు. ఘాట్‌కోపరము వగైరాలు సముద్రమునకు దూర మని తోఁచెను. సాంతాక్రూజునం దొక అందమైన బంగాళా దొరకెను. అచటకి కాఁపురమెత్తితిమి. ఆరోగ్యదృష్టిలో నిఁక సురక్షితుల మనుకొంటిని. చర్చిగేటుకు వెళ్లుటకు మొదటితరగతి ప్యాసు తెప్పించుకొంటిని. మొదటి తరగతి బండిలో పలుమాఱులు నే నొకఁడనే యని గుఱుతు. దీనివలన నాకు కొంచెము గర్వముకూడ జనించెను; పలుమాఱులు బాంద్రా నుండి చర్చిగేటుకు సరాసరి పోవు బండి నందుకొనుటకు సాంతాక్రూజా నుండి బాంద్రాకు నడిచి పోవుచుండువాఁడను. నాకు రాఁబడి మొదలిడెను. దక్షిణ-ఆఫ్రికా క్లయింట్లుకూడ కొంచెము పని యిచ్చుచుండిరి; దీనివలననే నాఖర్చులు వెళ్ళఁబారిపోయెడివి.

ఇంతవఱకు నాకు హైకోర్టుతో పని పట్టలేదు; కాని ఆదినములలో నచట 'మూట్' (చర్చ) జరుగుచుండెడిది. దానికి వెళ్లుచుంటిని. అందులో పాలుగొన ధైర్యము చాలదు. అందు జమీయత్‌రామ్

నానాభాయిగారు ప్రధానభాగ మాక్రమించుకొనుచుండె నని గుఱుతు. క్రొత్తబారిస్టరు లందఱి చందమున నేనును హైకోర్టునందు కేసులు వినుటకు వెళ్లుచుంటిని; అచట నేదో యొకింత వినుటకు బదులు సముద్రముమీఁదనుండి మెల్ల మెల్లగా వచ్చు చల్లగాలికి కునికిపాట్లు పడి ఆనంద మనుభవించుట సంభవించెడిది. నావలెనే కునికిపాటులు పడు వారిని జూచి సిగ్గు పోఁగొట్టుకొనుచుంటిని. అటు లచట నిదురించుటయు ఒక ఫ్యాషన్ అని తలపోసితిని.

హైకోర్టునందలి పుస్తకాలయము నుపయోగింప దొరకొంటిని. అచట కొందఱితో పరిచయము చేయను మొదలిడితిని. ఇఁక కొలఁది కాలములోనే హైకోర్టులో పని చేయఁగలుగుదు ననుకొంటిని.

ఈదెస నొకవంక వృత్తినిర్వాహమునెడ కొంచెము కొంచెము చింత లేకుండఁ బోఁ దొడఁగెను. మఱియొకవంక గోఖలేగారికన్నులు నామీఁద. వారమునకు రెండుమూఁడు మాఱులు నాచేంబర్సులోనికి వచ్చి నా సంగతి తెలిసికొని పోవుచుండిరి. మఱియు నపుడపుడు తమ ముఖ్యమిత్రులను దీసికొనియు వచ్చుచుండిరి. వారు తమకార్యము చేయు తెఱఁగు నాకుఁ దెలుపుచుఁ బోవుచుండిరి.

అయితే నాభవిష్యద్విషయములనుగుఱించి యొకటి చెప్పిన బాగుండును. అది యేమనఁగా నేను మొదట నేమి చేయవలయునని యేర్పఱిచికొంటినో అటువంటిదానిని దేనిని ఈశ్వరుఁడు సాగనిచ్చినాఁడు కాఁడు—'తా నొకటి తలఁపఁగా దైవ మొకటి తలఁచె.'

చూడుఁడు! నేను స్థిరముగా నుండ నిశ్చయించుకొంటిని; మఱియు కొంచెము స్వాస్థ్య మనుభవింపఁ గడఁగితిని. ఇంతలో ఏకాఏకి దక్షిణ-ఆఫ్రికానుండి తంతివచ్చెను—చేంబర్లేనుగారు ఇచ

టికి రానున్నాఁడు. నీవు వెంటనే రావలయును. నాచెప్పినమాటలు నాకు గుఱుతున్నవి. నేను మరల తంతి నిచ్చితిని: 'నాఖర్చులు సిద్ధపెట్టుఁడు! నేను వచ్చుటకు సంసిద్ధుఁడను.' వెంటనే ధనము వచ్చెను. నే నాఫీసు కట్టిపెట్టి అచటికి రవానా అయితిని.

అచట నా కొక యేఁడాది పని పట్టు ననుకొంటిని. బంగాళా నాక్రిందనే యుంచుకొని ఆలుబిడ్డల నందుంచిపోవుట మంచి దను కొంటిని.

ఈదేశమున పని దొరకని పిన్నవారు విదేశములకుఁ బోవ సాహసించుట లగ్గని నా కప్పుడు తోఁచుచుండెను. ఇందువలన నాతోఁ గూడ నలువు రైదుగురిని తీసికొనిపోయితిని. వీరిలో మగనలాల్ గాంధియుఁ గలఁడు.

గాంధీ కుటుంబము పెద్దది. ఇంకను వృద్ధియగుచున్నది. వీరిలో స్వాతంత్ర్యము గోరువారిని స్వతంత్రులజేయుట నాకోరిక. మాతండ్రిగారు వీరి నందఱును జమీందారీ నౌకరీలలోఁ బెట్టి యెటులో నిర్వహించుచుండెడివారు. వీ రీనౌకరీ మానుకొనిన బాగుండునని నే నెంచుచుండెడివాఁడను. వారికి వేరే నౌకరీ చూపింపలేకకాదు. శక్తియున్నను అట్టి యిచ్ఛ లేదు. వారు తమంతట తాము సంపాదించుకొనఁగల స్వతంత్రులు కావలయునని నా కోరిక.

తుదకు నా ఆదర్శములు పోనుపోను ఎటులెటులు అభివృద్ధి చెందినవో (నాకిటులు నన్మకము) ఈపిన్నవారి ఆదర్శములనుగూడ నటులటులు నాయాదర్శములతో నైక్యము చేయఁ దొడఁగితిని;వీరిలో మగనలాల్ గాంధీని సంసిద్ధుని జేయుటలో మిగుల సాఫల్య మొందితిను; అయితే యీవిషయము ముందుముందు వ్రాయఁ దగినది.

## ఆత్మకథ

ఆలు బిడ్డల వియోగము; నిలువఁబడిన వకీలుపనిని త్రెంపివై చుట; నిశ్చితవస్తువునుండి అనిశ్చితవస్తువునందు ప్రవేశించుట—ఇది యంతయు ఒక నిమిషము బాధాకరమాయెను. కాని నా కనిశ్చితజీవన మలవాటైపోయెను. ఈప్రపంచమునందు భగవంతుఁడొకఁడే సత్యము; మిగిలిన దంతయు నిశ్చితముకాదు; అది నిశ్చిత మనుకొనుటయు భ్రమ; మనచుట్టుప్రక్కల కానిపించునదియు, జరుగునదియు ఇది యంతయు అనిశ్చితము; మఱియు క్షణికము. దీనియందు నిశ్చితరూపమైన యేపరమతత్త్వము నిలీనమయియున్నదో దాని ప్రదర్శన మెల్లపుడు జరుగుచుండును. ఈవిషయమున నమ్మకముంచి యున్నను మన జీవనము సార్థకము కాఁగలదు. ఈ యన్వేషణమే పరమపురుషార్థము.

నేను డర్బనుకు ఒకదినము ముందుగనైన వెళ్లజాలకపోతిని. నేను చేయవలసిన పనియంతయు తయారుచేసి పెట్టియుంచిరి. చేంబర్లేనుగారిని జూచు డెప్యుటేషనుకు తారీఖు నిర్ణయింపఁబడెను. వారి కీయవలసిన అర్జీ వ్రాసి నేను డెప్యుటేషనుతోఁగూడఁ బోవలసి యుంటిని.

మూఁడవ భాగము—మొదటి ఖండము సమాప్తము

[illegible] 7/2/33

— 28/2/33
[illegible] 24/4/5[illegible]

# ఆత్మకథ

(ద్వితీయ సంపుటము)

రచయిత:

మహాత్మాగాంధి

అనువాదకుడు:

శతావధాని వేలూరి శివరామశాస్త్రి

ప్రకాశకులు:

ఆంధ్ర గ్రంథమాల

నెం. 7, తంబుచెట్టి స్ట్రీటు, మద్రాసు.

# విషయసూచి

## నాలవ భాగము

## అయిదవ భాగము

కాని మఃకడ బడితె యేదీ! బడితెమాట యటుండెః; బడితె దెబ్బలు తినుటకుఁ దగినంత శరీరముగూడ మనకు లేదు.

మి. చేంబర్లేను అచట కొలఁదికాలమే ఉండెను దక్షిణ-ఆఫ్రికా దేశ మొక లోకమే కాదు కాని; ఇంచుమించుగా అదియొక భూఖండము. ఆఫ్రికాలో కొన్ని ఉపఖండము లున్నవి. కన్యాకుమారినుండి శ్రీనగరమునకు ౧౯౦౦ మైళ్లు ఉండుచో డర్బనునుండి కేప్‌టవునకు ౧౧౦౦ మైళ్లకు తక్కువలేదు. ఇంత గొప్ప భూఖండమున నితఁడు వాయువేగమునఁ బరిగిడెను.

అతఁడు నేటాలునుండి ట్రాన్సువాలునకు వెళ్లెను. విషయముల నన్నిటిని సేకరించుకొని భారతీయుల కష్టనిష్ఠురములను నేను వారి యెదుటఁ బెట్టవలసియుండెను. ఇందులకు ప్రిటోరియా చేరు టెట్టులు? అను సమస్య అడ్డువచ్చెను. తటిలో నే నచటకుఁ జేరుటకు అనుజ్ఞా పత్రికను సంపాదింపఁగల వీలు ప్రిటోరియాలో నున్న మనవారికి లేకపోయెను.

బోయరుయుద్ధము జరిగిన తరువాత ట్రాన్సువాలు బావురుమనుచుండెను. అచట తినుటకు గింజలేవు; కట్టుబట్టలేవు; వీధులు శూన్యములు; అంగళ్లు మూయఁబడియుండెను. వస్తువులు రావలెను; దుకాణములు తెరువఁబడవలయును. అదియును వెంటనే జరుగునది కాదు. ఇది జరుగునిదే వెడలిపోయినవారు మరల చేర్చుకొనఁబడరు. కావున ట్రాన్సువాలులోని ప్రతివాఁడును ఒక అనుజ్ఞాపత్రిక తెచ్చుకొనవలసియుండెను తెల్లవారి కిది హస్తామలకము; మఱి నల్లవారికో ఆకాశకుసుమము.

యుద్ధదినములలో దక్షిణ-ఆఫ్రికాకు హిందూదేశమునుండియు, లంకనుండియు పలువురు ఉద్యోగులును సిపాయిలును వచ్చియుండిరి.

## ౧ ప్రేమచేఁ జేసిన శ్రమ వితయాయెనా?

వీరిలో నెవరేని అచట కాపుర ముండఁ దలఁచుకొందురేని వారికి సహాయము చేయుట విధి యని బ్రిటిష అధికారులకు తోఁచెను. వీ రేర్పట్టిననేని క్రొత్త ఉద్యోగములను బనాయింపఁగలరు. దీనికి తగి నటుల అనుభవము కలవారు కావలసినంత మంది తయారుగా నుండిరి. ఈ యుద్యోగుల తీవ్రబుద్ధి ఒక క్రొత్త డిపార్టుమెంటును సృష్టించెను. ఇట్టి పనులలో వారు చాల సమర్థులు. నీగ్రోలకు వేఱే ఒక డిపార్టుమెంటు కలదు. ఇఁక ఆసియా వారికి ఒకటి యేల యుండరాదు? ఈ వాదము న్యాయ్యముగనే కానిపించెడిని. నేను ట్రాన్సువాలు చేరు వఱకే ఈ క్రొత్త డిపార్టుమెంటు ప్రారంభమై మెల్లగా నెల్లెడలను తనవలను పరఁగించుచుండెను.

అనుజ్ఞాపత్రికల నిచ్చు నధికారులు తిరిగివచ్చినవారి కందఱకును అనుజ్ఞాపత్రికలను ఈయవచ్చును; కాని ఆసియావారి విషయమున నిది చెల్లునా? ఈ క్రొత్త డిపార్టుమెంటువారి యనుమతితో అనుజ్ఞాపత్రికల నిచ్చుచో ఈ యధికారుల పూచీయును, బరువును తగ్గిపోవును. కావున ఈ క్రొత్త డిపార్టుమెంటు ఆవశ్యకమని వారి వాదము. అసలుమాట యేమనఁగా ఈ క్రొత్త డిపార్టుమెంటువారికి ఏదో కొంతపని యుండవలయును; వారికి ధనము కావలయును. పని యేమియు లేనిచో వృథాగద! పని లేనిచో ఈ డిపార్టుమెంటు ఎత్తివేయఁబడును. కావున ఈపనిని తమకుఁ దాము సృష్టించుకొనిరి.

హిందువు లీ డిపార్టుమెంటు వారికి అర్జీ పెట్టుకొనవలయును. కొన్నాళ్లకు జవాబు వచ్చును. ట్రాన్సువాలుకు తిరిగివచ్చువారు పలువురు కాఁగా దళారులను మ విలు మందలుగా పోగైరి. వీరును, ఆఫీసరులును గలిసి నిఱుపేదలగు హిందువులకడనుండి వేలకొలఁది రూపాయలను గుంజుకొనిరి. పలుకుబడి లేనిచో చీటి పుట్టదనియు విశే

హించి కొంచెఆవిషయమున నూఱుపౌనులేని న్యాయముచేయుటచో దొరకదనియును వారు తెలియవచ్చెను. ఇట్టిస్థితిలో నటకుపోవుటకు నా కేటి వీలు ?

నా ప్రాంత చెలికాఁడు పరబను పోలీసు సూపరింటెండెంటు కడకు వెళ్లి—చీటుల నిచ్చు ఆఫీసరుకు నన్నెఱిఁగించి నాకొక చీటి పుట్టునటులు చూడవలసినదనియు, నేను ట్రాన్సువాలువాసి నని మీ రెఱుఁగుదురుకదా యని అంటిని. అతఁడు వెటనే తలకు టోపి తగిలించుకొని నాతోవచ్చి చీటి యిప్పించెను. రైలుకు గంటకన్న అవకాశము లేదు. సామాను సర్దుకొంటిని. అలెగ్జాండరుగారిని తలఁచి కొనుచు ప్రిటోరియాకు బయలుదేరితిని.

ముసళ్లపదుకు ముందున్నదని నే నెఱుఁగుదును, ప్రిటోరియా చేరి దరఖాస్తును తయారు చేసితిని. దర్బనులో ముందుగా ప్రతినిధుల పేరు అడిగినటులు నాకు గుఱుతులేదు. కాని యిప్పు డిచట క్రొత్త డిపార్టుమెంటు పనిచేయుచుండుటచే ముందు ప్రతినిధుల పేరులు చెప్ప డని యడిగిరి. ఆఫీసరులు ప్రతినిధులపట్టికనుండి నా పేరును తొలఁగింపఁదలఁచిరని ప్రిటోరియాలో హిందువు లిదివఱకే యెఱిఁగియుండిరి

దుఃఖజనకమయ్యును మనోరంజకమగు నీ విషయము ముందు ప్రకరణమున.

౨

## ఆసియానుండి నిరంకుశాధికారము

నేను ట్రాన్సువాలులో నెటులు కాలిడఁగలిగితినో అది ఈ క్రొత్త డిపార్టుమెంటువారికి తెలియరాలేదు. వారు తమకడకు వచ్చుచుఁ బోవుచుండు హిందూదేశమువారిని కనుఁగొనిరి గాని వీరికి మాత్ర మేమి తెలియును? నేను నా పురాతన పరిచయబలమున చీటి లేకుండఁగనే ప్రవేశించియుందునని వా రనుమానించిరి; అటులగుచో నన్ను చెఱఁబెట్టవచ్చును.

పెద్దయుద్ధ మొకటి ముగిసిన పిదప కొంతకాలమువఱకు ప్రభుత్వమువారు ఒక విశేషాధికారము వహించుట అలవాటు. నాఁటి దక్షిణ-ఆఫ్రికాస్థితి సరిగా అట్టిదే. శాంతిని నెలకొలుపుటకు వారొక శాసనమును నిర్మించిరి. సెలవుచీటి లేక ట్రాన్సువాలు ప్రవేశించువారు చెఱసాలలో నుంపఁబడుదురని ఆ శాసనము. దీని బట్టి నన్ను చెఱఁబెట్ట నూహించిరి కాని 'సెలవుచీటి యేది?' అని నన్నడుగుటకు వీరికి సాహసము చాలకపోయెను.

ఆఫీసరులు డరబనుకు తంతి యంపిరి. చీటితోనే నేను వచ్చినటులు తెలిసికొని, పాపము వారు నిరాశులయిరి. కాని వా రంతటితో ఆశ లుడుగువారు కారు. నేను ట్రాన్సువాలులోఁ జొచ్చితిఁ గాని వారు నన్ను మి. చేంబర్లేనును జూడకుండఁ జేయఁగలరు.

ఇందులకు ముందుగా వారు ప్రతినిధుల పేరు లడిగిరి. దక్షిణ-ఆఫ్రికాలో వెల్లెడలను రంగుతెగులు కానుపించుచునే యుండును; కాని, ఇండియాలో ఎట్టి మకిల, ఎట్టి కుట్ర కలదో అట్టిది అచట లేదు. దక్షిణ-ఆఫ్రికాలో ప్రజలకొఱకు ఉన్న డిపార్టుమెంటులు ప్రజా

క్షేమమునకే పాటుపడుచుండును. అవి ప్రజాభిప్రాయమును అనువర్తించుచుండును. కావున ఈ యుద్యోగులలో సరళతయు వినమ్రతయు చూపట్టుచుండును. కావున వీని యుపయోగము అలంతింతో వలంతియో మిగిలిన జాతులకుంగూడ జూపట్టును. ఈ క్రొత్త ఆఫీసరులకు ఆసియానుండి వచ్చుటతోపాటు అచటి నిరంకుశాధికారమును వచ్చెను. దక్షిణ-ఆఫ్రికాయందు ఒకవిధమగు ప్రజాప్రభుత్వము కలదు. కాని ఇపుడు ఆసియానుండి వచ్చిన ఈ క్రొత్తవానికి సగము నాయకత్వమునను నిరంకుశాధికారప్రాబల్యమే; ఏలయన: ఆసియాలో ప్రజాప్రభుత్వము లేదు; ఉన్నది పరప్రభుత్వము. దక్షిణ-ఆఫ్రికాలో తెల్లవారు ఇండ్లుకట్టుకొని అట ఉండిపోయిరి. ఇట్టులు వారు దక్షిణ-ఆఫ్రికావాసు లయిరి. కావున తమ రాష్ట్రములోని ఆఫీసరులపయి వారికి అంకుశము కలదు. ఇపుడు ఆసియానుండి వచ్చిన నిరంకుశాధికారులు రంగస్థలమునం బ్రవేశించిరి. వీరితో హిందువులపని అడకత్తెరలోని పోకవలె నాయెను.

నేనును దీనిచవిని ప్రత్యక్షముగా ననుభవించితిని. మొట్టమొదట ఆడిపార్టుమెంటు పెద్ద ఉద్యోగిచే 'రమ్మని' నేను ఆజ్ఞాపింపఁబడితిని. అతఁడు లంకనుండి వచ్చినవాఁడు. 'ఆజ్ఞాపింపఁబడితిని' అను నీ మాటలో కొంచెమేని అత్యుక్తి లేదనుటకు నా యనుభవమును విప్పి చెప్పెదను. నాకు వారు చీటి వ్రాసి పంపలేదు. అచట భారతీయ ప్రముఖులు నిరంతర మా యుద్యోగులకడకు పోవలసియుండును. వ్యక్తియులగు సేఠ్ తైయబ్ హాజీ ఖాన్ మొహమ్మద్ గారును అట్టివారిలో నొకరు. వారిని ఆ యాఫీసరు ఇటు లడిగెను—'గాంధీ ఎవరు? అతఁ డిచటి కేల వచ్చెను?'

తైయబ్ సేఠు ఇటుల జవాబిచ్చెను—'వారు మాకు సలహాదారు; మేము కోరఁగా వచ్చినవారు.'

‘అట్లు లగుచో మేము అందఱమును ఇచట నేఁడుండుట? మీ సంరక్షణమునకుఁగాదా మే ముండుట? ఇచటి స్థితిగతులు గాంధీ కేమి తెలియును?’

తైయబ్ సేటు సరిగనే సమాధానము ఇటులు చెప్పెను—‘నిక్కముగా. మీరు కలరు. కాని గాంధీ మా వాఁడు కాఁడా? అతనికి మా భాష తెలియును; మా భావము తెలియును. మీ రెట్టివా రయినను తుదకు ఆఫీసరులు!’

‘గాంధీని నా కడకుఁగొనిరమ్మని ఆయాఫీసరు హుకుమిచ్చెను

నేను తైయబ్ సేఠ్ వగైరాలతో ఆఫీసరుగారికడ కరిగితిని. అచట మాకు కుర్చీ లెటులుండును? మే మందఱమును నిటారుగా నిలువఁబడి చెప్పుకొనవలయును.

నా కేసి కన్నెత్తి ఆయాఫీసరు ‘నీవేల యిచ్చటికి వచ్చితివి?’ అని యడిగెను.

‘మావారంటఱు నన్నుఁగోరఁగా సలహా యిచ్చుటకు వచ్చితి’ నని నేనంటి.

‘ఇచ్చటికి వచ్చుటకు నీకు హక్కు లేదని తెలియదా? పొరపాటున నీకు చీటి పుట్టినది. నీవు ఈ దేశవాసివిగా పరిగణింపఁబడవు. నీవు మరలిపోవలసియుండును. నీకు చేంబర్లేనుగారి దర్శనము దొరకదు. భారతీయుల రక్షణముకొఱకే ప్రత్యేకముగా ఏషియాటిక్ డిపార్టుమెంటు నెలకొల్పఁబడినది. మంచిది. నీవిఁక వెళ్ళవచ్చును.’

ఇంత వక్కాణించి ఆఫీసరుగారు నాకు సెలవొసఁగిరి. జవాబిచ్చుటకు నా కవకాశ మీయలేదు.

పిదప నాతోడివారిని ఆఁపి—‘గాంధీని ట్రాన్సువాలునుండి పంపివేయుఁ’ డని మెల్ల మెల్లగా చివాట్లు పెట్టెను.

వారు నాతి ముఱకటించుకొని వెనుదిరిగిరి. మా యెదుట ఈ క్రొత్తసమస్య! అదియును ఆకస్మికము.

## 3

## అవమానసహనము

ఈ యవమానము నామనస్సులో బాధ కలిగించెను అయినను తొల్లి నేనిట్టివి పెక్కు సహించియుంటిని గాన అవి నాకు అలవాటయిపోయెను. కావున నేనీ క్రొత్త యవమానమును సహించి తటస్థుండనై కర్తవ్యమును నిర్వర్తింప నిశ్చయించితిని.

ఇటుపిమ్మట ఆ యాఫీసరుకడనుండి ఒకచీటి వచ్చెను. అందిటులు కలదు: 'గాంధి డర్బనులో మి. చేంబర్లేనను చూచియుండెను గాన ఇపుడు ప్రతినిధుల పట్టికనుండి ఇతని పేరు తొలఁగించుట ఆవశ్యకమాయెను.'

ఈ యుత్తరము నాతోడివారలకు సహ్యము కాలేదు. ఇపుడు ప్రతినిధుల నసలే పంపవలదనుకొనిరి. అపుడు నే నచటి విషమస్థితిని సరిగా నిటులు తెలిపితిని. 'మీ రందఱును మి. చెంబర్లేనును కలిసికొని చూడనిచో మీ కేమియు కష్టనష్టములు లేవని నేఁ [illegible]. అది యటుండె. మనము వ్రాసికొన్న మనకష్టములఁ జెప్పుకొనవలెను. అర్జీని మనము వ్రాయనే వ్రాసికొంటిమి. దానిని నేఁ జదివిననేమి ఇంకొకరు చదివిన నేమి? మి. చేంబర్లేను ఈ విషయమును గుఱించి మనతో వాదింపఁబోవఁడుకదా! మనకుఁ గలిగిన ఈ యవమానము సహింపనొప్పును.'

నేనిటులు ముగింపకమునుపే తైయబ్ సేటు—'మీ కవమానము కలిగినచో అందఱకును కలిగినటులు కాదా? మీరు మా ప్రతినిధి అను మాట మే మెటులు మఱవఁగలము?' అని బిట్టనెను.

'నిక్కమే, కాని మనసంఘ మంతయు నిట్టి యవమానముల దిగమ్రింగవలయును. దానికంటె వేఱే గతి యున్నదా?' అని నే నంటి.

'ఏ మయినను సరే, మనము మఱియొక క్రొత్తయవమానము నేల నెత్తిపై తెచ్చి పెట్టుకొనవలయును? ఇంక దీని కన్న నెక్కుడు దుస్థితి రాదు. మనకున్న అధికారము లేవి పోయెనేవి?' అని తైయబ్ సేఠు ప్రత్యుత్తరించెను.

తైయబ్ సేఠుగారి యీ వీరత్వము నాకు ఆనందము కలిగించెను; కాని యీ పరాక్రమముచే ప్రయోజనము లేదని నే నెఱుంగుదును. వీరి లోటుపాటు లన్నియు నే నెఱుంగుదును. కావున వీరి నందఱను శాంతింపఁజేసితిని. 'నాకు బాగుగా ఇండియన్ బారిష్టరయిన జార్జి గాడ్ఫ్రేగారిని (ఇపుడు స్వర్గీయులు) నియమించుకొనుఁడని వీరికి సలహా ఇచ్చితిని.

ఈరీతిగా శ్రీ గాడ్ఫ్రేగారి అధ్యక్షతతో వీరు మి. చేంబర్లేనుగారిని జూడఁబోయిరి. నన్ను తొలగించిన విషయమునుఁగూడ మి. చేంబర్లేను కొంచెము మాటలాడెను. 'ఇనుమాఱులు ఒక ప్రతినిధితోడనే మాటలాడుటకన్న మఱొక క్రొత్తప్రతినిధితో మాటలాడుట మేలంతరము కాదా?' అని చెప్పి అయినగాయముమీఁద పట్టీ వేయఁజూచెను.

దీనితో నాయొక్కయు, సంఘముయొక్కయు పని ముగియుటకు బదులు హెచ్చెను. మేము మరల ఓనమాలకడకుఁ బోయితిమి. 'మీ మూలముననే కదా మనవారు యుద్ధములోనికి దిగిరి! దానికి ఫలమిది' అని కొందఱు దూఱిపోసిరి. కాని దీనికి నేఁ జలింపలేదు. నే నిటు లంటి—'నాచేఁతకు నాకు పశ్చాత్తాపము లేదు. అటులు

చేయుట మంచి పనియే నేఁటికిని నేఁ దలఁతును. అటులు చేయుట కర్తవ్యమును పరిపాలించుట. ఫలము వెంటనే కనఁబడకుండుఁగాక; సత్కార్యము సత్ఫలమునే యిచ్చునని నాకు గట్టి నమ్మకము. ఇఁక మనము గతించిన దానిని వర్జించి కర్తవ్యమును గుఱించి విచారించుట లాభకరము.'

ఇతర మిత్రులును నా యీ మాటలను సమర్థించిరి.

మరల నే నిటులంటి—'నిక్కముగ మాడవలయుచో నన్ను పిలిచిన పని ముగిసె ననఁదగును. మీ రెల్లరును 'ఇంటికిఁ బొమ్మని నాకు సెల వొసఁగినను ట్రాన్స్‌వాలునుండి కాలు కదపవలదు' అని నా యంతరాత్మ నాకు తెలుపుచున్నది. నేటాలునకు పోవక ఇచటనే యుండి పనిచేయఁదలఁచితిని. నే నింకొక యేఁడాదిదాఁక భారతదేశమునకు పోవు తలఁపును విడనాడుకొంటిని. ఇచట వకాలతు చేయఁదలఁచితిని. ఈ క్రొత్త డిపార్టుమెంటువారితో మంచిమాట చేసికొనఁగలనని నాకు ధైర్యము కలదు. మన మీ వ్యవహారమును పరిష్కరించుకొననిచో మనవా రందఱు కొల్లగొట్టఁబడుదురు; ఈదేశమునుండి వెళ్ళఁగొట్టఁబడుదురు; క్రొత్తయవమానములు తలఁదాల్పఁ జేయఁబడుదురు. నా కీ విషయమున ఇసుమంతయు సందియము లేదు. మి. చేంబర్లేను నన్ను జూడకుండుటయు, ఆ యాఫీసరు నన్ను తిరస్కరించి నాకు మన్నా చెప్పుటయు ఇవి ఈ ప్రతినిధుల యవమానమునందు భారతీయ సమాజము నవమానమునందు ఇసుమంతయుఁ గావు. మనము కుక్కలవలె కాలముగడపుట తగునా?

నే నీరీతిగా నా యభిప్రాయమును వారియెదుట నిడితిని. ప్రిటోరియా జోహాన్స్‌బర్గులలో నున్న భారతీయమిత్రులతో నాలోచించి జోహాన్స్‌బర్గులో ఆఫీసు నడుప నిశ్చయించితిని.

## 3 అవమాన సహనము

ట్రాన్సువాలులో నాకు వకాలతు-సనదు పుట్టునా పుట్టదా! అని సందియము మే. కాని లా సొసైటీవారు నా దరఖాస్తునకు అడ్డము రాలేదు. కోర్టువారు మంజూరు చేసిరి.

అచట ఆఫీసు పెట్టికొనుటకు భారతీయునకు మంచితావు దొరకదు. లోగడ నాకు రిచ్ గారితో మంచి పరిచయము కలదు. అపుడు అతడు బేహారము చేయుచుండెను. అతడెరిగిన ఇండ్ల ఏజెంటు ఒకడు కలడు. ప్లీడరులు ఉండుచోటున అతడు మంచి గదులు కుదిర్చి పెట్టెను. నేను వకాలతు చేయ మొదలిడితిని.

# త్యాగవృద్ధి

ట్రాన్సువాలులోని భారతీయుల హక్కులు కాపాడుటకు చేసిన ప్రయత్నమును గూర్చియు, ఏషియాటిక్ డిపార్టుమెంటువారితో జరిపిన వ్యవహారములఁగూర్చియు ఎక్కువగా వర్ణించకముందు అప్పటి నా స్థితిగతులనుగూర్చి కొంత ముచ్చటింతును.

ఇంతవఱకును కొలఁదిగానో గొప్పగానో డబ్బు కూడఁబెట్ట వలయునను ఆశ నామనసులో ఉండియేయున్నది. పరమార్థముతో పాటు, ఈ స్వార్థమును కలిసియే యున్నది.

బొంబాయిలో నేను వకాలతు చేయుచుండునపుడు అమెరికా బీమా ఏజెంటొకఁడు నను జూడవచ్చెను అతనిరూపము రమణీయము, పలుకు మధురము. చిరకాలమిత్రునివలె అతఁడు నాకు భవిష్యత్కాలమున మేలుకలుగ నిట్లు ప్రసంగించెను. 'అమెరికాలో మీవంటి స్థితిగతులు కలవారందఱును తమతమ జీవితములను బీమాచేయించుకొందురు. మీరుకూడ వారివలె భవిష్యద్విషయమున చీకు-చింతలు లేకుండ ఉండఁగోరుచున్నాను. జీవితము శాశ్వతమా? మా అమెరికావారు బీమాచేయించుకొనుట ధర్మముగా పరిగణింతురు. తా మొక చిన్నపాలిసీని తీసికొండని నేను బులిపింతును.'

ఇంతవఱకు ఇండియాలోను, దక్షిణ-ఆఫ్రికాలోను ఎందఱో ఏజెంట్లు నాకెదురైరి కాని నేనెవరికిని మాట యీలేదు. ఏల? బీమా చేయించుకొనుట అనఁగా భయము చెందుట, ఈశ్వరునియెడ విశ్వాసము గొనకపోవుట యని నేనెఱుఁగుదును. ఇటులయ్యును నే నీసారి

బులిపింపఁబడితిని. అతఁడు తన వాదమును చెప్పుకొనుచుఁ బోవుచుం డఁగా నా యెదుట నా యాలుబిడ్డల ప్రతిమలు గోచరించెను. 'ఓయీ! నీవు నీయాలినగలు ఇంచుమించుగ నన్నియు అమ్మనే యమ్మితివి నీ శరీరమునకు ఏదేని సంభవించుచో నీయాలుబిడ్డల బరువు? తండ్రి తరువాత తండ్రియై పోషించుచున్న నీయన్నగారిపైఁ బడును. అతఁ డేమో ధనికుఁడా? దరిద్రుఁడు. ఇటు లాచరించుట నీకేటిపాడి?' ఇటులు నా మనసులో నిర్ధారించుకొని పదివేలరూకలకు బీమా చేయించుకొంటిని.

దక్షిణ-ఆఫ్రికాలో నా జీవితపు చూపు మాఱుటచే నా భావములును మాఱెను. దక్షిణ-ఆఫ్రికాలో వచ్చిన ఈ నూతనాపత్సమయమున నే నేది చేసినను ఈశ్వరుని సాక్షిగా నిడికొని చేసితిని. నేను దక్షిణ-ఆఫ్రికాలో ఇంకను ఎంతకాలము ఉండవలయునో అది తెలలేదు. ఇండియాకుఁ దిరిగిపోఁజాలనని యనిపించెను. కావున నా యాలుబిడ్డల రావించుకొనవలె ననుకొంటిని. వీరిని ఇంకను దవ్వుల నుంచుట పాడిగాదు. వీరి భరణపోషణము లన్నియు దక్షిణ-ఆఫ్రికాలోనే జరుగవలె ననుకొంటిని. ఇట్టి చప్పులతో బీమా ఏలచేసితినా యనుకొంటిని. వృథాగా ఆ యేజెంటుకలలో నేలపడితినా యని విచారించితిని. 'మా యన్నగారు నా పితృస్థానమునందే యుండినచో విధవయగుచో తనతమ్ముని యిల్లాలిని పోషింపఁడా?' అని అనుకొంటిని. కాని 'ముందు నీవే మరణింతువని అనుకొను టెట్లు? తుదకు అందఱను పరిపాలించువాఁ డొక ఈశ్వరుఁడే; నీవునుగాదు నీ యన్నయుఁగాదు. బీమాచేసితివిపో నీ యాలుబిడ్డల పరాధీనులఁ జేసితివి. వారేల స్వతంత్రముగా జీవింపఁజాలరు? లోకమున అసంఖ్యాతు లగు నిట్టి పేదలగతి యేమి? నీవు వారిలో నొకఁడవు గావా?

ఈ రీతిగా నామనస్సులో విచారధార ప్రవహించెను. కాని వారి ననుసరించి వెంటనే ఏమియుం జేయలేదు. దక్షిణ-ఆఫ్రికాలోం గూడ కంపెనీకి ఒక కిస్తీ చెల్లించినటులు నున్నది.

మరియు బాహ్యవిషయములుగూడం గొన్ని నా యీ విచారధారకు పోషకమయినవి. దక్షిణ-ఆఫ్రికాకు నేను తొలిసారి వెళ్లినపుడు ఏసుమతమువారితో కలిసికూడియుంటిని. దానికి ఫలముగా నాకు ధర్మమునెడ జాగరూకత యంటిపెట్టుకొని యుండెను. ఈ తూరి థియాసఫీ పరివేషమునం బడితిని. మి. రిచ్ దివ్యజ్ఞానసామాజికుండు. ఇతండు నాకు జొహాన్స్‌బర్గులోని సమాజముతో నెయ్యము కలుగం జేసెను. దివ్యజ్ఞానసమాజమువారి యభిప్రాయములతో నాకు ఐక్యము లేదు. కావున నే నందు చేరలేను. అయినను ఆ సమాజమున వారలతో ప్రత్యేకముగా నాకు గాఢపరిచయము కలదు. దైనందినమును వీరితో ధర్మమునుగూర్చి చర్చించుచుంటిని. ఇంగు పుస్తకపఠనము జరుగుచుండెడిది. అప్పుడప్పుడు నేనును ఉపన్యసించుచుండువాండను. భ్రాతృత్వమును కలిగించుకొనుటయు పెంపొందించుకొనుటయు, దివ్యజ్ఞానసమాజమున ముఖ్యవిషయములు. మాకిరువురకు చాల చర్చ జరుగుచుండెడిది. ఈ యాదర్శముతో వారి సభ్యులకు భేదము వచ్చినపుడు నేను పట్టి చూపుచుండువాండను. ఈ విమర్శప్రభావము నాకు సత్ఫల మొసంగకపోలేదు. అది నా యాత్మపరిశోధనకు కారణమాయెను.

## ౫

### ఆత్మపరిశోధనపరిణామము

నాకు ౧౮౯౩ సంవత్సరమున క్రైస్తవ-మిత్రులతో పరిచయము కలిగెను. నాకపుడు విద్యార్థిదశ. వారు బైబిలుసందేశమును నా మదికెక్కించి నాచేత దానిని స్వీకరింపఁజేయఁ జూచిరి. నేను నమ్రతతో తటస్థుఁడ నయి వారిపలుకులను వినుచును, తెలిసికొనుచును ఉంటిని. ఇంతియ కాక హిందూధర్మమును నా శక్తి కొలఁది పఠించితిని. మఱియు నితరమతములనుగూడ తెలిసికొన యత్నించితిని. పిదప ౧౯౦౩ సంవత్సరమున నా స్థితి మాఱెను. దివ్యజ్ఞానసమాజపు మిత్రులు నన్ను వారి సంస్థలోనికి లాగికొన నెంచిరి. దానికి హేతు వేమి? నేను హిందువుఁడను నా కడనుండి ఏదియో కొంత పుచ్చుకొనవచ్చును. దివ్యజ్ఞానసమాజపుస్తకములలో హిందూధర్మముయొక్క ఛాయయు, దాని ప్రభావమును. కొంత కొంత కలదు. కావున నేను వారికి కొంచెము సాయము చేయఁగల నని వారియూహ. 'నాకు సంస్కృతము రాదు నేను ప్రాచీన సంస్కృతగ్రంథములలో హిందూధర్మమును జదువలేదు. అనువాదములలోఁ జదివికొనినదియు కడుఁ గొలఁది' అని వారికిఁ దెలిపితిని. వారు సంస్కారములను, పునర్జన్మములను విశ్వసించువారు గాన నావలన నేదియో కొంచె ముపకార ముండునని వారు నమ్మిరి. చెట్లు లేనిచోటున ఆముదపుఁజెట్టే మహావృక్షముకదా! కొందఱితో వివేకానందుని 'రాజయోగము'ను, మఱికొందఱితో మణిలాల్ ననుభాయి ద్వివేది 'రాజయోగము'ను జదివితిని. ఒక మిత్రునితో పాతంజలయోగదర్శనము పఠించితిని. పలువురతోఁ గలిసి గీతలఁ జదువ నారంభించితిని. మే మచట నొక చిన్న జిజ్ఞాసుసభను స్థాపించితిమి.

అందు నియమపూర్వకముగా అధ్యయనమును ఆరంభమాయెను. మొదటినుండియు గీత లనిన నాకు భక్తిశ్రద్ధలు కలవు. ఇపుడు దాని రహస్య మెఱుఁగవలె ననిపించెను. నాకడ ఒండు రెండు అనువాదములు కలవు. వానిసాయమున మూలమును దెలిసికొన ప్రయతించితిని. మఱియు ప్రతిదినమును ఒకటి రెండు శ్లోకములు కంఠస్థములు చేయ నిశ్చయించితిని.

ప్రాతఃకాలమున దంతధావనము చేయునపుడును, స్నానము చేయునపుడును గీత వల్లించుచుంటిని. దంతధావనమునకు ౧౫ నిమిషములును, స్నానమునకు ౨౦ నిమిషములును పట్టెడివి. నేను తెల్లవారి వలె నిలువఁబడి పలుదోమెడివాఁడను. గీతాశ్లోకములను చిన్ని కాగితముపై వ్రాసి ఎదుటిగోడ కంటించి చూచుచు వల్లించుచుంటిని. ఈరీతిగా స్నానము చేయుసరికి శ్లోకములు వచ్చెడివి. ఘనపాఠము వల్లింపను, వెనుకటి వానిని గుర్తు చేసికొనను ఈకాలము సరిపోయెడిది. ఇటులు పదుమూఁడధ్యాయములవఱకును వల్లించినటులు గుర్తు. పిదప జంజాటము బలిసెను. సత్యాగ్రహము జనించెను. ఈ పసికూనయను పెంచవలసినభార మొకటి మీఁదఁ బడెను. దాని లాలనపాలనములతో నాసమయ ముత్పన్న మయ్యెడిది. నేఁటికిని అది యాచందముననే యున్న దననగును.

గీతాపఠనమువలన ఎట్టి ఉపలబ్ధి కలిగెనో దానిని పఠించిన నాసహాధ్యాయులే చెప్పఁ దగుదురు; కాని నామాట—నా కది శీలమును దిద్దికొన మార్గదర్శక మాయెను. నా కయ్యది ధర్మనిఘంటువు. తెలియని ఇంగ్లీషుమాటలకు డిక్షనరీని ఎటులు తెఱతునో అటులే ప్రవర్తనకుసంబంధించిన చిక్కులలో గీత తెఱతును. ఇందలి అపరిగ్రహము, సమభావము మొదలగు పదములు నన్ను గిఱిసైచెను. "సమభావము నెటులు సాధింతును? ఎటులు పాలింతును?" అని

మల్లాడితిని. అధికారి యొకఁడు మనల నవమానించును; ఒకఁడు లంచగొండి; దారిని బోవుచుండఁగా నొకఁడు కయ్యమునకు కాలు సాఁచును. ఇట్టివారును గలరు. మనకు చాల నుపకారము చేసిన వారును గలరు. వారికిని వీరికిని భేదము లేదా? ఇట్టియెడ సమత్వ మెటులు? మఱియు అపరిగ్రహము ఆచరణమునఁ బెట్టుకొనుట యెటులు? మన దేహముమాత్రము మనకు పరిగ్రహము కాదా? స్త్రీపుత్రాదులు పరిగ్రహము కాక మఱేమి? గ్రంథపూర్ణమైన ఈయల మారలలో నిప్పు పెట్టనా? నా యింటిని జలాకరమగు క్షేత్రముగాఁ జేసినైవనా? లోపలనుండి వెంటనే ఇటులు జబాబు వచ్చెను—ఇల్లు ముల్లెలు వీడనిచో పరమేశ్వరుని పడయఁ జాలవు. నా చదివిన ఇంగ్లీషు–లా నాకు తోడయినది. స్నెల్ రచించిన లాలోని సిద్ధాంతముల చర్చ గుర్తు దవిలెను. గీతాధ్యయనాదృష్టమున ట్రస్టీ అను పదమున కర్థము తెన్నగా తెలిసెను. లామీఁద ఆదరము పెరిగెను. నాకు లాలోఁ గూడ ధర్మతత్వము కానిపించెను. ట్రస్టీలు లక్షలాది ధనమును నిలువయుంతురు. కాని అందొక చిల్లిగవ్వపయి గేని వారి కధికారము లేదు. ముముక్షువు గూడ ఈరీతిగనే ప్రవర్తింపవలయును—ఈపాఠము నేను గీతలనుండి నేర్చుకొంటిని. అపరిగ్రహమునకు, సమత్వమునకు హృదయపరివర్తనము కావలయు నను విషయము నాకు దివ్వెవలె కానిపింపఁదొడఁగెను. ‘భీమాపట్టాను రద్దుచేయింపుఁ’ డనియు, ‘తిరిగి యిచ్చినంత పుచ్చుకొందును; లేనిచో లే’ దనియు రేవాశంకరుగారికి వెంటనే వ్రాసితిని. భగవానుఁడు నన్ను సృజించినటులే నా యాలుబిడ్డలను సృజించెను. నన్ను రక్షించినటులే వారినిని రక్షించును. నారు పోసినవాఁడె నీరు పోయును గదా యని నే నెఱింగికొంటిని. నాఁటి నా యాశయము ఒకయుత్తరమునఁ గలదు. తండ్రితో సమానుఁడగు మాయన్నగారికి

ఇటులు వ్రాసితిని.—'నేఁటివఱకు నేను సంపాదించుచువచ్చినది నీకు అర్పించుచు వచ్చితిని. ఇఁక నాయాశను విడనాడఁగోరు చున్నాను. ఇఁకమీఁద నా సంపాదింపఁబోవునది ఏ కొంచెమేని సార్వజనికములగు కార్యములకు వినియోగపడఁగలదు.'

దీని యాచితి మాయన్నగారికి వడిగా విశదము కాలేదు. ఆయన పెద్దపెద్ద మాటలతో నావిధినిగూర్చి నాకు వ్రాసిరి—'నీవు నాయనగారికన్న నధికుఁడవు కాఁదలఁపఁ బనిలేదు. నాయనగారు కుటుంబపాలనపోషణముల మానుకొనిరా? నీవును వారివలె ఇల్లువాకిలి జాగ్రత్త పెట్టుకొనవలయును....' నేను దీనికి వినయపూర్వకముగా నిటులు జబా బిచ్చితిని—'నాయనగారు ప్రవర్తించిన చందముగనే నేనును ప్రవర్తించుచున్నాను. కుటుంబమను పదమునకు కొంచెము విశాలముగా వ్యాఖ్యానము చేయుచో నాచేసిన పనియొక్క బా గోగులు తమకు విశద మగును.'

మాయన్నగారు నాపై ఆస లుడిగిరి. నాకు ఉత్తరము వ్రాయుట మానుకొనిరి. దీన నాకు దుఃఖ మొందెను. కాని దేనిని నేను విధి యని తలఁచితినో దానిని విడనాడుకొంటినేని ఇంతకంటె నెక్కుడు దుఃఖపడియుందును. కావుననే నే నీకొలఁది దుఃఖమును సైరించితిని. ఇటులయినను నాకు మాయన్నగారియెడల భక్తి తొంటివలెనే నిర్మలముగను, అధికముగను ఉండెను. మాయన్నకు నాపైఁ గల అధిక వాత్సల్యమే దుఃఖమునకు కారణమని నాకుఁ దెలియును. వీరికి నా రూపాయలమీఁద కంటె నా సౌజన్యముమీఁదనే ఎక్కుడ పేక్ష.

తుదకు చరమదివసములలో ఆయనకు నాపని నచ్చెను. మృత్యుశయ్యపై నున్నపుడు నాపని ఉచితమనియు, ధర్మ్యమనియు అతఁడు సూచించెను. ఆయన అపుడు వ్రాసిన కమ్మ కరుణాజనకము. తండ్రి

కొడుకును క్షమింపుమని కోరినటులు ఆయన నన్ను క్షమింపుమని కోరెను. నాపిల్లలను నీయిచ్చచొప్పున లాలనపోషణశిక్షణములఁ జేయుమని వ్రాసెను. ఆయన నన్నుఁ జూడ కన్నులు వాచుకొనెను. దక్షిణ-ఆఫ్రికాకు వచ్చెదనని నాకు తంతి యిచ్చెను. తొందరగా రమ్మని నేనును తంతి నిచ్చితిని. కాని మాకలయికకు ఈశ్వరుఁడంగీకరింపలేదు.

తనపుత్రులవిషయమున అతఁ డెట్టి యిచ్ఛఁజూపెనో అదియు నెఱవేర్పఁబడలేదు. మాయన్న దేశమునందే మేను దొరఁగెను. ఆయన కుమారులు ప్రాచీనసంస్కారము నే పడసిరి. అందు పరివర్తనము పడయఁగలుగలేదు. నేను వారిని ఆకర్షించుకొనలేక పోయితిని. దీన వారి దోసఁ మేదియు లేదు. స్వభావము నెవరు మార్పుచేసికొనఁ గలరు? బలవత్తరములగు సంస్కారముల నెవఁ డాపఁ గలఁడు? మన భావములలో నెట్టిపరివర్తనము కలుగుచున్నదో, మఱియు మన కెటులు వికాసము కలుగుచున్నదో అటులే మనల నాశ్రయించుకొని యున్నవారికిని, మన తోడివారలకును కలుగవలయు నని మన మనుకొందుము; కాని అది మిథ్య.

తలిదండ్రులగువారి పూఁట* ఎంత భయంకరమో ఈవిషయము వలన కొంచెము తెలియఁగలదు.

* పూఁట = పూచీ, లేక బాధ్యత. responsibility.

౬

## శాకాహారమునకు బలి

జీవనమునందు త్యాగము, నిరాడంబరతయు, ధర్మజాగృతియు వృద్ధి పొందిన కొలఁదిని నాకు నిరామిషాహారమునందును, తత్ప్రచారమునందును ఆసక్తి హెచ్చెను. ప్రచారము చేయుటలో నాకుఁ దెలిసిన దొకటే పద్ధతి: ఆచరించుట, ఎఱుఁగఁగోరువారితో ఆలపించుట.

జోహాన్సుబర్గునందు నిరామిషాహార-గృహము (Vegetarian restaurant) కలదు. దాని నడుపువాఁ డొక జర్మను దేశమువాఁడు. అతనికి కూనీ జల-చికిత్సయందు నమ్మకము. నే నటకు పోఁవుచుఁగితిని; మఱియు ఎంతమంది ఇంగ్లీషుమిత్రులను తీసికొనిపోవఁగలనో అంత మందిని తీసికొనిపోవుచుంటిని. కాని ఆ నిరామిషాహారగృహ మెంతో కాలము మనదని తెలిసెను; ఏలన, ధనలోపము. తగునంత దానికి నే సాయపడితినిగాని తుదకు దానిని మూయక తప్పలేదు. దివ్యజ్ఞాన సమాజమువారిలో పలువురు మాంసము తినరు. కొంద ఱసలే తినరు, కొందఱు కొంచెము కొంచెము. ఆ సమాజమునం దొక సాహసవతి కలదు. ఆమె చాల పెద్దయెత్తున మాంసము లేని భోజనాలయ మొకటి పెట్టెను. ఆమె చాల కళారసిక. ధనవ్యయమునకు జెను దీయదు. జమాఖర్చులు చూచికొనదు. ఆమెకు మిత్రులును పలువురని చెప్పవచ్చును. మొదట నీమె కొద్ది యెత్తుమీఁదనే నడపెను. కాని పిదప పెద్దయెత్తున నడపఁదలఁచెను. దీనికి నా సాయము కోరెను. అపుడు ఆమెకడ నెంత యున్నదో నే నెఱుఁగనుగాని తగినంత ధన ముండకపోదని తలఁచితిని. నాకడ డబ్బునకు వీలు కలదు. పలువురు క్లయంట్లు నాకడ ధనము నిలువయుంతురు. వీరిలో ఒకసజ్జనుని సమ్మతి

గొని ఇంచుమించు వేయిపౌను లీమెకు బదు లిచ్చితిని. ఆ క్లయంటు ఉదారుఁడును, విశ్వాసియు. అతఁడు మొట్టమొదటి గిరిమిటియాం అతఁడు 'భాయీ! మీ యిష్టప్రకారము డబ్బు ఇచ్చివేయుఁడుం నే నేమియు నెఱుఁగను. నేను మిమ్ములనే యెఱుఁగుదును' అని యనెను. అతని పేరు బదరీ. ఇతఁడు సత్యాగ్రహమున చాల పని చేసెను. చెఱకుఁగూడఁ బోయెను. ఇతని యీమాత్రము సమ్మతి చాలు ననుకొని యితని పైకమును ఆమెకొసఁగితిని. రెండు మూఁడు నెలలు గడచెను. కాని పైకము తిరిగి వచ్చునటులు కానిపింపలేదు. అంత నష్టమును భరింపఁదగినశక్తి నాకు లేదు. ఆ పైకము నాకడనే యుండుచో వేఱ యుపయోగించెడిది. తుదకు అప్పు మునిఁగి పోయెను. అటులని నన్ను నమ్మిన బదరీని నష్టపఱుప నగునా? అతఁడు నన్నుమాత్ర మెఱుఁగును. అదంతయుగను నేనే పెట్టుకొంటిని.

ఈ సంగతిని నేనొక క్లయంటుతో ప్రస్తావించితిని. అతఁడు నన్నిటులు తియ్యగ మదలకించి నాకు మెలఁకువ కలిగించెను;

'భాయీ! [దక్షిణ-ఆఫ్రికాలో నేను మహాత్ముఁడను కాలేదు; బాపును (తండ్రి) కాలేదు. మిత్రులగు నాక్లయంట్లు నన్ను భాయి యని సంబోధించెడివారు] ఈపని మీదికాదు. మేము పలుపనులలో మిమ్ము నమ్మి చనుచుందుము. మీకీ డబ్బు తిరిగిరాదు. కాని మీరే సొమ్ము ఇచ్చికొందురు. బదరీని నష్టపఱుపరు. అది యటుండె. మీ రీ రీతిగా మీ క్లయంట్లధనమును సంస్కరణముకొఱకు సాయము చేయుచో వారు పాడగుదురు. కొలఁదిరోజులలో మీకును నిప్పచ్చ రము. ఇటులగుచో మీ సార్వజనికకార్యము లన్నియు ముగియును.'

సౌభాగ్యమున నాయీ మిత్రుఁ డింకను నున్నాఁడు. దక్షిణ ఆఫ్రికాలోఁగాని, మఱియొకతావునఁగాని ఇతనికన్న మంచి మనసు

గలవాఁడు మఱియొకఁడు నాకుఁ గానరాలేదు. ఇతఁ డెవరినేని సందే హించెనేని పిదప నది తప్పిదమని తెలిసికొనెనేని, వెంటనే అతనికడ కరిగి క్షమింపుమని వేఁడికొని మనస్సును శుద్ధము చేసికొనెడివాఁడు. నన్నితఁడు ముదలకించుట చాల మేలయిన దని అనుభవమాయెను. బదరీ యాకలు బదరీకి ఇచ్చివయిచితిని. కాని మరల నిట్టి దెబ్బ తగులుచో దానికి తాళఁగలశక్తి నాకు లేదే! అందులకు అప్పు చేయవల యును. ఇట్టిది నే పుట్టినతరువాత చేయలేదు. అప్పనిన నాకు గోఁత్రం. సంస్కరణాభిలాష యెంత యున్నను తన శక్తికి మించిపోఁగూడదని దీనివలన నేర్చికొంటిని. నే నీపనిలో గీతలలో ముఖ్యమగు నిష్కామ కర్మమును అనాదరించితిననియు తెలిసికొంటిని. ఈ తప్పు నాకు ముందరికి దీపస్తంభమాయెను.

నిరామిషాహార ప్రచారమునకుఁగాను వేదిలో నింత బలి దానము వేయవలసియుండునని నే నెంచలేదు. ఇది నేఁ గోరక చేసి కొనిన పుణ్యము.

## ౭

## మట్టి, నీరు : వీనితో పరీక్ష

నా జీవనము నిరాడంబరమయిన కొలఁదిని వ్యాధులకు మందు పుచ్చుకొనుటలో మొదటినుండియు నాకుఁగల అరుచి ఇపుడు మఱికొంచెము పెరుఁగఁదొడఁగెను. నేను డరబనులో వకాలతు చేయుచుండఁగా డాక్టరు ప్రాణజీవన మెహతాగారు అచటికి ననుఁ జూడవచ్చిరి. అపుడు నాకు దుర్బలత్వమును (**debility**), కీళ్ళవాఁపును (**rheumatic inflammation**) కలుగుచుండెడివి. డాక్టరుగారు మందీయఁగా నిమ్మళించెను. పిదప ఇండియాకు మఱలు వఱకు చెప్పఁదగినంత వ్యాధి యేదియు వచ్చిన గుర్తు నాకు లేదు.

జోహాన్సుబర్గులో నున్నపుడు మలబద్ధకము, తలనొప్పియు వచ్చుచుండెడివి. ఔషధులను పుచ్చికొనియు, పథ్యము చేసియు సరి పుచ్చుకొనుచుంటినిగాని దాన రోగముక్తుఁడను గాలేదు. 'ఈ మందుల జంజాటమునుండి బయటఁ బడితివా బ్రతికిపోదు' వని నా మనస్సు చెప్పుచుండెను.

ఆరోజులలోనే కావచ్చును, మాంచెస్టరులో 'నో బ్రేక్ ఫాస్టు ఎసోసియేషన్*' అనునది స్థాపింపఁబడెనని నే వింటిని. దాని యుద్దేశ మేమనఁగా, ఇంగ్లీషువారు పలుమాఱులు భుజింతురు. పలురకముల వంటకములు కుడుతురు. రేయి పండ్రెండుగంట లగువఱకును తినుచునే యుందురు. దాన డాక్టరుల యిండ్లకు పరుగెత్తుచుందురు. ఈ యాపద తప్పించుకొనవలయుచో ప్రాతర్భోజనము మానవలయును. ఈ యంశములన్నియు నాయెడఁ బట్టకున్నను కొన్ని కొన్ని తప్పక

* ప్రాతరాహారము మానవలెనని పెట్టుకొనిన సమాజము.

పట్టును. నేను ముమ్మాఱు కడుపారఁ గుడుతును. రెండు జాముల వేళ తేనీరు త్రావుదును. నేనెన్నఁడును కొలఁదిగా తిని యెఱుఁగను. నిరామిషాహారి నయ్యు, పొగపులు, మసాలాలు వదలినవాఁడ నయ్యు, వీలున్నంతవఱకు నాతినుటానిలో నే రుచులు గూచుట మానలేను. ఆ ఱేఁడుగంటలు కొట్టకముందెన్నఁడును లేచి యెఱుఁగను. అపుడు ప్రొద్దుటితిండిమానినచో తలనొప్పిపోవచ్చు ననుకొంటిని. ప్రయత్నము చేసితిని. కొన్నాళ్లు కొంచెము కష్టమనిపించెను. కాని తలనొప్పి పూఁటి పోయెను. కావలసినదానికంటె నెక్కువ తినుచుంటినని దానితో తేలిపోయెను.

ఈ పరివర్తనమువలన మలబద్ధకము మాత్రము పోలేదు. కూనే చెప్పిన కటిస్నానము చేసి చూచితిని. అది కొంచెము పనిచేసెను గాని అనుకొన్నంతగా చేయలేదు. ఈనడుమ నిరామిషాహారగృహము పెట్టిన జర్మనుమిత్రుఁడో, మఱియింకొకమిత్రుఁడో కాని, జస్టు వ్రాసిన 'రిటరన్ టు నేచర్' అను గ్రంథమును నాచేత నిడియెను. ఈ గ్రంథమున మట్టి చేయు నుపయోగములు చదివితిని. ఇంతియు కాక సద్యఃఫలములును, పప్పుగల కాయలును మనుజుల స్వభావమున కీసు తగిన ఆహారమని ఆ గ్రంథకర్త సమర్థించెను. నేనప్పటికి కేవలము పండ్లను తిని చూచి యుండలేదు; కాని మట్టివైద్యము చేయ మొదలిడి చూచితిని. అది చక్కగా పనిచేసెను. మట్టివైద్యము నిట వివరింతును. ఎఱ్ఱనిదిగాని, నల్లనిదిగాని, శుభ్రమయిన మట్టిని తగినంత దెచ్చి చలినీళ్ళతో తడుపవలయును. పిండివలె నున్న ఆ మట్టి ముద్దను పరిశుభ్రమగు వస్త్రముపై పూయవలయును. దానిని పొట్టకుఁ గట్టుకొనవలయును. ఈరీతిగా దీనిని పొట్టకుఁగట్టుకొని పడుకొంటిని. మెలఁకువ వచ్చినపుడుగాని, ప్రొద్దునఁగాని తీసివేయుచుంటిని. దాన మలబద్ధకము నిర్మూలమాయెను. నాఁటనుండియు నేను ఈ

వైద్యమును చేసికొనుటయగాక నా మిత్రులచేతను జేయించితిని. దీని వలన లాభము కలుగలేదని చెప్పినవారున్నటులు నాకు గుర్తు చాలదు.

నే నీదేశమునకు వచ్చినపిదప ఈ యుపచారములమీఁద ఆత్మవిశ్వాసమును కోలుపోయితిని. ప్రయోగ మొనరించి చూచుటకు నా కవకాశము లేకపోయెను. ఏల యన, ఎచటను నేను అంటిపట్టుకొనియుండవ వీ లయినదికాదు. అయినను ఈ మట్టివైద్యమునందును, జలచికిత్సయందును మొదట నా కెంత విశ్వాసము కలదో నేఁటికిని అంత విశ్వాసము కలదు. నేఁటికిని నేను కొంత మట్టివైద్యము చేసికొనుచునే యున్నాను. అక్కఱ కలుగుచో నా మిత్రులకుఁగూడ చేయుఁడని సలహా యిచ్చుచున్నాను. నాకు రెండు మాఱులు మహా వ్యాధులు వచ్చెను; కాని మందులతో మనుజులకు అంతగా పనిలేదని నాకు నమ్మకి. పథ్యము, నీరు, మట్టి ఈ మొదలగు గృహవైద్యములతో వేయింటికి తొమ్మిదివందల తొంబదితొమ్మిది కుదుర్పవచ్చును.

చీటికి మాటికి వైద్యులకడకుఁ బరుగిడి రసవిషగంధకములచే శరీరము నింపుకొని మానవుఁడాయువును తగ్గించుకొనుచున్నాఁడు. తనను తన యధీనమున నుంచుకొనఁ జాలఁడు. తాను తన శరీరమునకు ఏలిక యగుటకు బదులు బంటై తుదకు మానవత్వమునుగూడఁ గోలుపోవుచున్నాఁడు.

నే నీ యధ్యాయమును రోగశయ్యపైఁ బరుండి వ్రాయుచున్నాను; కావున నాయీయుద్దేశముల నెవ్వరును గేలిచేయకుందురుగాక ! నా తెగుళ్ళకు కారణము నే నెఱుఁగుదు; నేనే వానికి కారణమనియు నెఱుఁగుదు; కావుననే నాకు ఓర్పు పోలేదు. ఈ రోగములను ఈశ్వరానుగ్రహముగా నమ్మి పలురకము లగు మందుల బారినుండి తప్పుకొనఁ గలిగితిని. ఈ మొండివానివలన డాక్టరు మిత్రులకు కష్టము కలుగుచున్నదని నే నెఱుఁగుదును కాని వారు ఉదారతతో నా మొండిపట్టును సైరించి నన్ను విడువకున్నారు.

ఇచట నా ప్రస్తుతస్థితిని అర్థముగాను, నిలువుగాను చెప్పకొనవలయు నావశ్యకత లేదు. కావున నేను మరల ౧౯౦౮-౨౧ సంవత్సరములకు వత్తును.

ఈ విషయము ముందునకు సాగక ముందు పాఠకుల కొక హెచ్చరిక చేయవలసియున్నది. ఇది పఠించువారు జుస్టు వ్రాసిన ప్రతిమాటయు వేదవాక్యమని నమ్మరాదు. వ్రాయసకాండ్ర దృష్టి ప్రాయికముగా ఏకాంశమునందే లగ్నమయి యుండును. ప్రతివస్తువును తక్కువలోఁదక్కువగా పదిమూలలనుండి చూడవలయునని నా కోరిక. మఱియు ఆ వసు వేమూలనుండి చూచినను సత్యముగా నుండవలయును. కాని ఆ వస్తువు ఏకకాలమున అన్నిస్థితులయందును సత్యముగా నుండఁజాలదనియు మఱవఁదగదు. మఱియు చాల పుస్తకములు ధనమునకును, పేరునకును వ్రాయఁబడుచుండును. కావున ఇట్టి పుస్తకములు చదువఁగోరు సజ్జనులు వివేకముతోఁ జదువుదురుగాక! అందలి విషయములను పరీక్షింపఁ గోరువారు అనుభవము గలవారి సలహాను పుచ్చికొందురుగాక! ఓర్పు గొని చదివి తెలిసికొనిన పిదప పరీక్షచేయ నారంభింతురుగాక!

సాధకుఁడు మాటయందువలె తిండియందును త్యాగమునకుఁ గాని, గ్రహణమునకుఁ గాని ఆవశ్యకత సమానమని తెలియవలయును.

పిదప నేను పొరవడిన విషయములలో నాకు పాపిన దెసనే పొండని యితరులకు సలహా నీయను. ఇంతియ కాక మీ రీ దారిని పోవలదనియు నిరోధింతును. కావున నా ఆరోగ్యదిగ్దర్శనమును జూచి దాని ప్రకారము ప్రయోగము లొనరించి చూచు స్త్రీపురుషులకు ఈ విషయము చెప్పఁగోరుచున్నాను. ఎటుఁ జూచినను పాలను విడనాడుట మేలని తోఁచినచో, లేక అనుభవము కల వైద్యుఁడు పాలను త్రావవలదని చెప్పినచో, అపుడుపాలను విడనాడవలయుఁ గాని నాపుస్తకమునుబట్టి యేసజ్జనుఁడేని పాలను విడనాడరాదు. ఎవని జఠరాగ్ని మందగించెనో, ఎవఁడు దీర్ఘవ్యాధిచే మంచ మెక్కెనో, అట్టివానికి పాలకంటె తేలికగా జీర్ణమగునదియు, పాలకంటె పుష్టి చేయునదియు నగు నింకొక పదార్థము లేదని హిందూదేశములో నా కనుభవము.

ఈపుస్తకమునందు పాలను గుఱించి వ్రాసిన విషయము ఆషాఢము కాదని పాఠకుల కడ నావినతి.

ఈప్రకరణము చదువు వైద్యులు గాని, డాక్టరులు గాని, హకీములు గాని, మఱియు అనుభవముగల యేసజ్జనులేని పాలవంటి పోషకమును, పాచకమును అగు వనస్పతిని—అధ్యయనబలమునఁ గాక అనుభవబలమున—ఎఱిఁగియున్నచో తెలిపి నా కుపకారము చేయఁగోరుచున్నాను.

ఇతరగ్రంథములవలెనే నేనీగ్రంథమును ధర్మబుద్ధిచే ప్రేరితుండనై వ్రాసితిని. ఈ ధర్మభావమే నాప్రతిపనియందును నేంటికిని గలదు. నే నాగ్రంథములో నిర్ణయించిన కొన్ని విషయములను అలవాటులో పెట్టుకొనంజాలక పోవుటచే దుఃఖమును, సిగ్గును కలుగుచున్నవి.

మనుజునకు శైశవమున తల్లిపాలు కావలయును. పిదప మఱియేపాలును అక్కఱలేదని నాకు చాల నమ్మకము. వనమున పండిన పండ్లును, కాయలును దక్క వేఱు మనుజున కక్కఱలేదు. బాదముపప్పు మొదలగు బీజములందును, ద్రాక్ష మొదలగు ఫలములందును శరీరమును, బుద్ధిని పెంపొందించు ద్రవ్యములు కలవు. ఇట్టి యాహారము దినువానికి బ్రహ్మచర్యము, సంయమను చులుకన. 'తిండి యెట్టిదో త్రేంపు పట్టిది,* భోజన మెట్టిదో జీవన మట్టిది' అను నీ మాటలు చాల తథ్యము. ఇది నాకును, నామిత్రులకును మంచి యనుభవము. నా పుస్తకమునం దీవిషయములను విపులముగా చర్చించితిని.

కాని నాదురదృష్టమున ఇండియాలో నాప్రయోగములను సంపూర్ణముగా ననుష్ఠింపంజాలకపోయితిని. ఖేడాజిల్లాలో యుద్ధమునకు కూటువమూంకను పోగుచేయుచున్నతఱి ఒక పొరపాటుచే మృత్యుశయ్య నెక్కితిని. పాలను విడనాడి ప్రాణధారణ మొనరించుటకు నే నింతవట్టు నిష్ఫలప్రయత్నము లనేకము లొనరించితిని. పాలు లేకుండ ప్రాణధారణ మొనరించుటకుంగాను నాయెఱింగిన పలువురు డాక్టరులను, రసాయనశాస్త్రజ్ఞులను అడిగి చూచితిని. కొందఱు పాలకు బదులు మినపకడుగును, కొందఱు మహువాడా నూనెను, కొందఱు బాదముపప్పు పాలను సూచించిరి. శరీరము కృశించువఱకు

* ఆహార్ తేవో ఓడకార్, మాణస జేవుం ఖాయ్ తేవో థాయ్.

నీని నన్నిటిని వాడి మానితిని గాని రోగశయ్యను మాత్రము విడువ లేదు.

రోగనివారణమునకు ఖాద్యాఖాద్యవిచారణము చేయరాదని వైద్యులు చరకాదులు మొదలగు గ్రంథములు ప్రమాణముగాఁ జూపిరి. మఱియు పని పట్టుచో మాంసాదులనుగూడ తినవచ్చు ననిరి. ఇట్టి వారు పాలను ఎటులు విడనాడు మనఁగలరు? బీఫ్ టీని, బ్రాందిని పుచ్చుకొనుమనువారు పాలను విడువు మనఁగలరా? నే నొట్టు పెట్టు కొంటిఁ గాన ఆవుపాలను, గేదెపాలను త్రావను. క్షీరమాత్రమును త్యజించుటయే నాఒట్టునం దుద్దేశము. కాని నే నా శపథము చేసి కొనినపుడు నామనస్సులో ఆవులు, గేదెలు మాత్రమే కలవు. కావునను, జీవితాశచేతను ఎటులో ఒకటులు మనస్సును సరిపెట్టు కొంటిని. ఈరీతిగా శపథముయొక్క ఉద్దేశమును పాలించి మేఁక పాలఁ త్రావ నిశ్చయించితిని. ఈ మేఁకపాలు త్రావునపుడు అది శపథము యొక్క ఆత్మను చంపుటయే యని నామనస్సు చెప్పుచునేయుండెను.

రోలతుచట్టమును ఎదురుకొనవలయు నను మోహము నన్ను విడనాడలేదు. దీనిచే బ్రతుకునందును ఇచ్ఛ పుట్టెను. దానఁజేసి జీవితమునందలి నా యీ మహాపరిశోధన ఆఁగిపోయెను.

కూటితోడను, నీళ్లతోడను ఆత్మ కించుకేనియు సంబంధము లేదు. ఆత్మ తినదు, మఱి త్రావదు. 'పొట్టలోనికి పోవు వస్తువుచే లాభహాని లేదు గాని లోపలి నుండి వచ్చు మాటచే లాభహాని కలదు' అను నీ వచనముల నే నెఱుఁగుదును. ఇవి నిక్కములే. కాని యీ వచనములతో జగడము పెట్టుకొనుటకన్న నా నిశ్చయమును వ్రాయఁ దలఁతును—ఎవఁడు భగవంతునియెడల భయభక్తులతో సంచరింపఁ గోరునో, ఎవఁడు ఈశ్వరుని ప్రత్యక్షముగాఁ జూడఁ గోరునో, ఆ

సాధకుఁడు మాటయందువలె తిండియందును త్యాగమునకుఁ గాని, గ్రహణమునకుఁ గాని ఆవశ్యకత సమానమని తెలియవలయు.

పిదప నేను పొరపడిన విషయములలో నాకు చూపిన దెసనే పొందని యితరులకు సలహా నీయను. ఇంతియ కాక మీ రీ దారిని పోవలదనియు నిరోధింతును. కావున నా ఆరోగ్యదిగ్దర్శనమును జూచి దాని ప్రకారము ప్రయోగము లొనరించి చూచు స్త్రీపురుషులకుం ఈ విషయము చెప్పఁగోరుచున్నాను. ఎటుఁ జూచినను పాలను విడనాడుట మేలని తోఁచినచో, లేక అనుభవము కల వైద్యుఁడు పాలను త్రావవలదని చెప్పినచో, అపుడుపాలను విడనాడవలయుఁ గాని నాపుస్తకమునుబట్టి యేసజ్జనుఁడేని పాలను విడనాడరాదు. ఎవని జఠరాగ్ని మందగించెనో, ఎవఁడు దీర్ఘవ్యాధిచే మంచ మెక్కెనో, అట్టివానికి పాలకంటె తేలికగా జీర్ణమగున దియు, పాలకంటె పుష్టి చేయునదియు నగు నింకొక పదార్థము లేదని హిందూదేశములో నా కనుభవము.

ఈపుస్తకమునందు పాలను గుఱించి వ్రాసిన విషయము ఆహ్య ధము కాదని పాఠకులకడ నావినతి.

ఈప్రకరణము చదువు వైద్యులు గాని, డాక్టరులు గాని, హకీములు గాని, మఱియు అనుభవముగల యేసజ్జనులేని పాలవంటి పోషకమును, పాచకమును అగు వనస్పతిని—అధ్యయనబలమునఁ గాక అనుభవ బలమున—ఎఱిఁగియున్నచో తెలిపి నా కుపకారము చేయఁగోరుచున్నాను.

## బలవంతులతో లడాయి

ఇఁక ఆసియా ఆఫీసరులయొక్క దృష్టిఁ బఱపుదము. వీరి పెద్ద రాణా జోహాన్సుబర్గులో. ఈ రాణాలో హిందూస్థాను వారికిఁ గాని, చీనా వారికిఁ గాని, మఱి యితరులకుఁ గాని రక్షణము లేదు సరికదా, భక్షణమే. 'వచ్చుట కధికారము గలవారిని రానిచ్చుట లేదు, మఱి అధికారము లేనివారికడ నూఱు పౌనులఁ పుచ్చుకొని రానిచ్చుచున్నారు; దీనికి ప్రతికారము మీరు చేయనిచో మఱి యెవరు చేయుదురు?' అని నాకడ ప్రతిదినమును ఫిర్యాదు. నా మనస్సుకూడ లోపల నటులే చెప్పుచున్నది. ఈకష్టము తొలఁగింపనిచో నేను ట్రాన్సువాలునం దున్న ఫల మేమి?

దీనికి సాక్ష్యము సమకూర్పఁ దలపెట్టితిని. తగినంత సాక్ష్యము సమకూరినపిదప పోలీసు కమీషనరు కడ కరిగితిని. అతనియందు దయయు, న్యాయమును గలవని నాకుఁ దోఁచెను. నామాట లొక్క పెట్టున ఉఫ్ఫని ఎగురఁగొట్టుటకు బదు లతఁడు మనస్సునకు పట్టించుకొని వినెను. మఱియు సాక్ష్యము నంతయుఁ దనకుఁ జూపు మనెను. సాక్షులను స్వయము పరీక్షించెను. నామాటపయి నమ్మకము కలిగెను. 'దక్షిణ-ఆఫ్రికాలో తెల్లజూరరులు తెల్ల అపరాధులను దండించుట దుష్కరమని నే ననుకొనినటులే అతఁడును అనుకొనెను. పిదప నతఁ డిటు లనెను—'అయినను మనము ప్రయత్నము చేసి చూతము. జూరరు లపరాధులను విడిచిపెట్టింతురేమో యనుభయమున మన పనిని మనము మానరాదు. వీరిని తప్పక అరెస్టు చేయింతును. నేను నా శక్తికొలఁది పనిచేయుదు నని నమ్ముఁడు.'

నేను నమ్మినే నమ్మితిని. పలువురు ఆఫీసరులపై నా కనుమానము కలదు; కాని వారి అందఱియెడల నాకడ ప్రబలమగు ప్రమాణము లేదు. ఇరువురియెడల మాత్రము నా కొంతయు సందియము లేదు. కావున వా రిరువురికిని వారంటులు జారీ ఆయెను.

నా చేఁతలకు రహస్య మనునది లేదు. నేను ప్రతిదినమును పోలీసుకమీషనరుకడ కరుగుచుంటినని పలువు రెఱుఁగుదురు. ఈ యాఫీసరులకడ పలురకాల వేగులవా రున్నారు. వారు నా ఆఫీసుకడకు రాకపోకలు చేయుచు నా అనుపానులను వారి కెఱిఁగించుచుండిరి. ఆ యాఫీసరులగుఱించి యొకటి చెప్పవలయును. భయముచేత తగినంతమంది వేగులు వారికి దొరకలేదు. భారతీయులును, చీనావారును నాకు సాయపడనిచో ఆ యాఫీసరులను పట్టించుట దుస్తరమయ్యెడిది.

వీరిలో నొకఁడు పాఱిపోయెను. పోలీసుకమీషనరు వారంటు పంపి, పట్టించి తెప్పించెను. విచారణ జరిగెను. సాక్షులు సంపూర్ణముగా విచారింపఁబడిరి. వీరిలో నొకరి సంగతి జ్యూరీకి ఎఱుకయగుటకుఁగూడ ప్రమాణ ముండెను. అయినను వీ రిరువురును విడుదల చేయఁబడిరి.

నేను మిగుల నిరాశుఁడ నయితిని. కమీషనరుగూడ మిగుల వెత చెందెను. వకీలుపనిపై నాకు రోఁత పుట్టెను. నేరములు కప్పిపెట్టుటలో బుద్ధి ఉపయోగపడె నని బుద్ధిపైఁగూడ రోఁత వొడమెను.

వీ రిటులు విడుదల పొందినను సర్కారువారు వీరిని ఉద్యోగమునుండి తొలఁగించి తమస్థానమున ఉండనీయకపోవుటచే వీరి యపరాధము తేటతెల్లమే ఆయెను. వీ రిరువురును తమపదవిని బాపుకొనినపిదప ఈ ఠాణాలో కళంకము కొంచెము తగ్గెను. భారతీయులకు కొంచెము ధైర్యము కలిగెను.

దీన నా ప్రతిష్ఠ హెచ్చెను. నా వకాలతుగూడ హెచ్చెను. లోకులు వెచ్చించు ధనము అంతయుఁ గాకపోయినను, కొంతవట్టు తగ్గెను. లంచగొండు లింకను చేతులు కొట్టుమనే యుండిరి గాని ఆ పనితో యోగ్యులకు తమ యోగ్యతను కాపాడుకొనన కాలానిన దని చెప్పనగును.

ఈ యాఫీసరు లఘములు; అయినను వారియెడల నా కిసుమంతయు దుర్భావము లేదు. ఇదియు వా రెఱుఁగుదురు. వారు చిక్కులో నుండఁగా సాయము చేయవలసిన అక్కఱ కలిగెను; చేసితిని. నే నెదిరింపనిచో జోహాన్సుబర్గు మునిసిపాలిటీలో వీరికి ఉద్యోగము దొరకును. వారి మిత్రుఁ డీ విషయమును నాతోఁ జెప్పెను. నేను వారికి ఉద్యోగ మిప్పింప పాటుపడితిని. వారి కది దొరకెను.

దీనివలన నన్నెఱిఁగిన తెల్లవారు నాయెడల నిశ్శంకముగా ప్రవర్తింపఁగలిగిరి. మఱియు ఈ డిపార్టుమెంటువారితో నేను పలుమాఱులు తలపట్టుకొన్నను, ఎంత గట్టిగా మాటాడినను, వారు నాకు నెయ్యమును, తియ్యమును చూపుచునే యుండిరి. ఇట్టి ప్రవర్తనము నా స్వభావములోఁ గలదని నాఁటికి నే నెఱుఁగను. ఇట్టి ప్రవర్తనము సత్యాగ్రహమునకు కూఁకటివే రనియు, అహింసలో నొక అంగమనియు పిదప తెలిసికొంటిని.

మనుజుఁడు వేఱు, వాని పని వేఱు. మంచిపనియెడ ఆదరము, చెడుపనియెడ తిరస్కారమును కలిగి తీరును. మంచి పని చేసినను, చెడు పని చేసినను, మనుజునియెడల ఆదరము గాని, దయ గాని చూపవలయును. ఈమాట తెలిసికొనుట సులువు. కాని ఆచరించుట మాత్రము బలువు. ఈ జగత్తునం దింత ద్వేషము ప్రబలుట కిదియ కారణము.

# ఆత్మకథ

సత్యమును శోధింప అహింసయే మూలము. అహింస యెంతవట్టు హస్తగతము కాదో సత్యముకూడ నంతవట్టు హస్తగతము కాదని ప్రతిక్షణమును నా కనుభవమగుచున్నది. ఒకపనిని, ఒక ప్రణాళికను విరోధింపఁదగును కాని ఆ పనిని, ఆ ప్రణాళికను నడుపువానితో విరోధము పెట్టుకొనుట యనఁగా తనతో తాను విరోధము పెట్టుకొనుటయే. ఏలయనఁగా—మన మందఱమును ఒక కుంచెచేతనే చేయఁబడితిమి. మన మందఱమును ఒక బ్రహ్మపుత్రులమే. మనుజునిలో అనంతములగు శక్తు లున్నవి; కావున మనము మనుజు నవాదరించుచోఁ గాని, తిరస్కరించుచోఁ గాని వాని శక్తులను, గుణములను తిరస్కరించినట్టు లగును. మఱియు ఇటు లొనరించుట మనుజునకును, ప్రకారాంతరముగా సమస్తజగత్తునకును హాని కలిగించిన దగును.

## పుణ్యస్మరణము, ప్రాయశ్చిత్తము

నా జీవితమున పలుమతములవారితో, పలుజాతులవారితో పరిచయ మొందఁజేయఁగల సంఘటనము లనేకములు జరుగుచు వచ్చెను. ఇట్టి యనుభవము లన్నింటిచే నాకు ఇంటికిని బయటికిని, దేశమునకును పరదేశమునకును, హిందువునకును ముసలమానునకును, కిరస్తానికిని పారసీకునకును యూదునకును భేదబుద్ధి యెన్నఁడును కలుగలేదు. నాహృదయ మిట్టి భేదము నెఱుఁగఁజాల దనియే చెప్పఁగలను. ఇయ్యది నా కొక గుణ మని యనుకొనను. ఏలన, అహింస, బ్రహ్మచర్యము, అపరిగ్రహము లోనగు యమములను, నియమములను అలవాటులోఁ బెట్టుకొంటిని. నేఁటికిని వానియెడ నాప్రయత్నము కలదు. కాని ఆరీతిగా అభేదబుద్ధిని పెంపొందించుకొనుటకు నేను ప్రయత్నము చేసిన గుఱుతు లేదు.

డరబనులో నేను వకాలతు చేయుచుండఁగా నా గుమాస్తాలును నాయింటనే నివసించెడివారు. వారిలో హిందువులును, కిరస్తానులును గలరు. దేశమునుబట్టి చెప్పవలసివచ్చుచో గుజ్జరులును* చెన్నపురివారును అని చెప్పవలసివచ్చును. నే నెన్నఁడును వీరిని వేఱుగాఁ జూచిన యెఱుక లేదు. నాయాదరమునకు నాభార్య యెన్నఁడేని అడ్డువచ్చుచో నే నామెను ముదలకించుచుండెడువాఁడను. నాగుమాస్తాలలో నొకఁడు క్రైస్తవుఁడు. ఇతని తలిదండ్రులు పంచములు. మా యిల్లు తెల్లవారి యిళ్లపద్ధతిని కట్టఁబడినది. ఈ కారణమున గదులలో తూములు లేవు—ఉండవలయుననియు

* గుజరాతువారు. ఇది ఘూర్జరశబ్దభవము. అను.

ననియు నాయుద్దేశము కాదు—ఇది నా మతము. దీనివలన గదులలో తూము లుండవలయు తావుల మూత్రమునకు వేఱుగా కుండలు ఉండెడివి. వీనిని బాగుచేయు పని మా ఆలుమగల యిరువురిదే కాని నౌకరులది కాదు. ఇంటివారితో పాటయిపోయిన గుమాస్తాలు మాత్రము తమంతట దామే శుద్ధిచేసికొనుచుండిరి. కాని యీ క్రైస్తవుఁడు సరి క్రొత్త. ఇతని కుండను మేమే ఎత్తి బాగుపఱపవలయును. కస్తూరిబాయి కుండలనెత్తి బాగుచేసెడిదే కాని ఈ సోదరుని భాండ మెత్తుట ఆమె కసహ్యమనిపించెను. దానితో మాయిరువురకును చెడెను. నేను ఎత్తివేయుటయు ఆమెకు మంచిదనిపింపలేదు. మఱియు తా నెత్తుటకును కష్ట మనిపించెను. అయినను, కన్నులనుండి ముత్తెముల బిందువులురాల ఒకచేత కుండనెత్తికొని కెంపుచూపుతో ముదలకించుచు మెట్లుదిగు కస్తూరిబాయి నేఁటికిని నాకనుల గ్రేలును.

నే నెంత ప్రేముడి గలవాఁడనో అంత ఘాతకుఁడ నగు పతిని. నే నామెకు శిక్షకుఁడ నని నాయూహ. కావున గ్రుడ్డి ప్రేమకు వశుఁడనై ఆమె నిటులు రాచి అంపమునఁ బెట్టుచుంటిని.

ఈ కారణమున ఆమెయే ఆకుండను దీసికొని వెళ్ళినను నాకు తుష్టి కలుగలేదు. నగుమోముతో దానిని దీసికొని పోవలయు నని నా కోరిక. దీనిగుఱించి నే నామెపైకి ఊఱుకులు పరుగులెత్తితిని. తుద కుత్తేజితుఁడనై 'ఇదిగో, ఈ యల్లరి నాయింట సాగదు' అని అంటిని.

ఈ మాట బాణమువలె నాటెను.

'మీయిల్లు మీరే యుంచుకొనుఁడు; ఇదె నే నేఁగితిని' అని యామె గట్టిగా ననెను.

## ౧౦ పుణ్యస్మరణము, ప్రాయశ్చిత్తము

నే నపు డీశ్వరుని మఱచితిని. నాయెదలో దయ యనునది ఎండిపోయెను. నే నామెచేయి పట్టుకొంటిని. మెట్ల కెదురుగనే ద్వారము కలదు. దీనయు, నబలయు నగు నామె చేయి పట్టుకొని ద్వారమువఱకు ఈడ్చుకొని పోయితిని. తలుపు సగము తెఱచితిని.

కన్నులనుండి గంగాయమునలను ప్రవహింపఁ జేయుచు కస్తూరిబాయి యిటు లనెను:

'మీకు సిగ్గు లేకపోవుఁగాక ! నాకుఁ గలదు. కొంచెము సిగ్గు తెచ్చికొనుఁడు! నన్ను బయటికిఁ ద్రోయుచో నే నెక్కడికిఁ బోవుదును? పుట్టింటికిఁ బోద మన్న నా తలిదండ్రు లిచట లేరుగదా! మాది ఓర్పు గల స్త్రీజాతి. కావున మీ రభస సైరింపనే వలయు. ఇఁకనైనను కొంచెము సిగ్గుగొని తలుపు మూయుఁడు! ఎవరేని మనల నిరువురిని జూచినచో నవ్వుకొని పోదురు!'

నేను మొగ మింత చేసికొంటిని గాని లోలోన సిగ్గిలితిని. తలుపు మూసివేసితిని. నన్ను నాభార్య విడువఁజాలనిచో నేను మాత్ర మామెను విడువఁగలనా ? ఈరీతిగా మాలో మా కెన్నియో కయ్యములు వచ్చెను; కాని అన్నియు తుదకు మంగళముగనే పరిణమించెను. పత్నియే అద్భుతమగు తన ఓర్పు బలమున ఎల్లప్పుడును విజయ మందెను.

నే నిపుడు తటస్థుఁడనై ఆ విషయములఁ జెప్పగలను; ఏలన ఆఘటన లన్నియు నా పూర్వయుగమునకు సంబంధించినవి. నేఁడు నే నామోహాంధుఁడ నగు భర్తను గాను; ఆమెకు శిక్షకుఁడను గాను; ఇచ్చ వచ్చుచో కస్తూరిబాయి నన్నిపుడు దండింపవచ్చును. మేము ఒండొండ భుక్తభోగులమగు మిత్రులము. మే మొండొండ నిర్లేపముగానుండి జీవితము గడపుచున్నాము. కస్తూరిబాయి నా జబ్బులలో ప్రతిఫల మపేక్షింపక సేవ చేయునదాయెను.

౧౮౯౩లో ఇది జరిగెను. అపుడు బ్రహ్మచర్యపాలన మనసు నించుకయు తెలియదు. పత్ని కేవలము సహధర్మిణి యనియు, సుఖదుఃఖసఖి యనియు నాటికి నే నెఱుఁగను. పత్ని యన భోగ భాజన మనియు, మగని యాజ్ఞలను తలఁ దాల్చుటకే పుట్టిన దనియు నాటి నా తలఁపు.

కాని ౧౯౦౦ నాఁటికి నాతలఁపులలో గంభీరమగు పరి వర్తనము కలిగెను. ౧౯౦౬ నాఁటికి వాని పరిణామము పూర్తి యాయెను. కాని వానిమాటటుండు నేను నిర్వికారుఁడ నయిన కొలఁదియు నాసంసారము శాంతమును, నిర్మలమును, సుఖయుత మును అగుచు వచ్చెను. నేఁటికిని అగుచుండె నని చెప్పనొప్పును.

ఈ పుణ్యస్మరణమువలన మేము ఆదర్శదంపతుల మనిగాని, లేక నా ధర్మపత్నియందు ఎట్టి దోసఁగును లేదని గాని, లేక నా యాదర్శము ఒకటియే యని గాని ఎవరును అనుకొనకుఁడు! కస్తూరి బాయికి వేఱుగా ఆదర్శము కలదా యనచో, లేదు; పాప మా యిల్లా లేమియు నెఱుఁగదు. నా యాచరణములలో చాలవట్టు ఆమెకు ఇంపుగావు. మే మెన్నఁడు నొండొండ వానిని గుఱించి చర్చింపము. చర్చించినను సారము కానిపింపదు. తల్లిదండ్రులు దండ్రులుగాని, నేనుగాని ఆమెను చదివింపలేదు. కాని హిందూస్త్రీ లందఱిలో కొలఁదిగనో గొప్పగనో యుండు నొక మహాగుణ మామె యందు అతిమాత్రముగా నున్నది. తలఁచియో తలఁపకయో, ఎఱిఁగియో యెఱుఁగకయో నాపాదముల ననుసరించుటలో తన జీవితము సార్థకమని యామె నమ్మిక. మరియు జీవితమును నిర్మల ముగాఁ జేసికొనఁబూను నా పూనికల కామె యెన్నఁడును అడ్డు రాలేదు. మాయిరువురి బుద్ధిశక్తులలో భేద మున్నను మయి కారణము వలన మాజీవనము సంతుష్టమనియు, సుఖవంత మయిన దనియు, ఊర్ధ్వగామి యనియు నా యుద్దేశము.

౧౧

## ఆంగ్లేయులతో గాఢపరిచితి

సత్యశోధనమును సూచించిన యీ కథ యేరీతిని వ్రాయఁబడుచున్నదో పాఠకులకు ఈ ప్రకరణముకడఁ జెప్పఁదగియున్నది. దీని నారంభించినపుడు 'ఈపద్ధతిని వ్రాయుదును' అని ఒక పద్ధతిని నిరూపించుకొనలేదు. పుస్తకములుగాని, డయరీలుగాని, పలు కాగితములుగాని ఉంచుకొని వానినిజూచి వీనిని వ్రాయుట లేదు. వ్రాఁతకుఁ గూర్చున్న నాఁడు నాయంతరాత్మ నన్నుఁ బ్రేరించినరీతి వ్రాయుచు వచ్చుచుంటిని. నాలోపల జరుగుచున్న క్రియాకలాపమంతయు నా యంతరాత్మచే ప్రేరితమని నిశ్చయముగా నొడువఁజాలను. కొలఁదివనిగాని, గొప్పవనిగాని చెప్పఁదగినవియు, ఏఁటేఁట నా చేయునవియు నగు కార్యములను పరిశీలించినచో నవి నాయంతరాత్మను ప్రేరించుటచే జరిగినవె యని చెప్పినచో అనుచితమనుకొనను.

నే నంతరాత్మ నెఱుఁగను లేదు, చూడను లేదు. భగవానునిపై ప్రపంచకమునకు అంతకుఁగల నమ్మకము నాయది యని యనుకొందును. ఆ నమ్మిక ఏరీతి నయినను ఆఁపరానిది. కావున దానిని నేను వట్టి నమ్మిక యనుకొనను; మఱి అనుభవ మనుకొందును. దీనిని అనుభవమని రూపించుట ఒకరీతిగా సత్యమును దండించుటయే. కాక దీని శుద్ధస్వరూపమును దెలుపఁగల శబ్దము నాకడ లేదన్నచో ఇంచుమించు ఉచితతర మని అనుకొందును. అదృష్టమగు నీ యంతరాత్మకు వశవర్తినై ఈ కథను వ్రాయుచున్నానని నా నమ్మకము.

వెనుకటి ప్రకరణము వ్రాయ మొదలిడి 'ఆంగ్లేయులతో పరిచితి' అని శీర్షిక మొదలు వేసితిని. ఇటులు వ్రాయుచుండఁగా ఆ విషయమును వ్రాయుముందు 'పుణ్యస్మరణము'ను గుఱించి వ్రాయుట ఆవశ్యకమని గ్రహించితిని. అపుడు 'పుణ్యస్మరణము' అను ప్రకరణమును వ్రాసితిని. పిదప ముందటి శీర్షికను దీనికి మార్చితిని.

ఈ ప్రకరణము మొదలిడఁగానే మరల నొక ధర్మసంకట మెదురాయె. ఆంగ్లేయుల పరిచితిని వ్రాయునపుడు వేనిని వేనిని వ్రాయను? వేనిని వేనిని వదలను? అనునది గొప్ప సందియము. వ్రాయవలసిన దానిని విడుచుచో సత్యమును కప్పిపుత్తునేమో యని యనుమానము. ఇంతియకాక ఈ కథ వ్రాయుటయు ఆవశ్యకము కాదనియు అనవచ్చును. ఇట్టి దశలో ఆవశ్యకము లేవో అనావశ్యకము లేవో యేఱిమాచుట కడుఁ గఠినము.

ఆత్మకథలు సంపూర్ణముగా ఇతిహాసములు కావనియు, మరియు వీనిని వ్రాయునపుడు చాలఁ జిక్కులు కలుగుననియు ఎపుడో చదివియుంటినిగాని దాని యర్థ మిపుడు చక్కగా బోధపడెను. సత్యశోధనములకు సంబంధించిన నా యీ యాత్మకథయందు నాకు గుర్తున్నదంతయు ఎక్కించుట లేదని నాకుఁ దెలియును. సత్యమును తెలుపవలయునెడ ఎన్ని మాటలు వ్రాయవలయునో, మఱి యే మాటలు వ్రాయఁదగదో యెవరు చెప్పఁగలరు? నా ఒకతరఫున మాత్రమే గల సాక్ష్యమునకు న్యాయమందిరమున ఎంతకిమ్మతు ఉండఁగలదు? తీరికగలవాఁ డెవఁడేని వెనుక వ్రాసిన ప్రకరణములలో క్రాసు పరీక్ష చేయఁదొడఁగినచో వీని కింకను మెఱుఁగు రావచ్చును. లేక-మఱొక వ్యాఖ్యాత ఖండనదృష్టితో దీనినంతయు ఛిన్నభిన్న మొనరించి పొరపాటులను చూపి ఉప్పొంగవచ్చును.

ఇవన్నియు నాలోచించి చూడఁగా ఈ గ్రంథము నిఁక కట్టి పెట్టినచో బాగుండదా? యని అనిపించుచున్నది. కాని 'పూనిన పనిని తప్పని తోఁచినదాఁక విడనాడరాదు' అను న్యాయము నాధారముగాఁ జేసికొని నాఅంతరాత్మ 'వలదు' అని చెప్పువఱకు వ్రాసి కొనుచుఁబోవ నిశ్చయించితిని.

వ్యాఖ్యాతల మెప్పునకు నేను దీని వ్రాయుటలేదు. సత్యశోధనలలో వ్రాయుటయు నొకశోధన యని వ్రాయుచున్నాను. ఇంతియు కాక నాతోడివారలకు దీనివలన కొంత యూఱట కలుగఁగల దనియు నొక యుద్దేశము. దీని యారంభము వారి సంతోషము కొఱకే. ఆనందస్వామియు, జయరామదాసును నన్ను వెంటాడనిచో నిది యారంభింపఁబడునది కాదేమో! ఈకారణమున దీనిని వ్రాయుటలో నేదేని దోసఁగున్నచో వారును ఈ దోసఁగులో భాగస్వాములు.

ఇఁక ప్రకృత మనుసరింతము. హిందూస్థానీ గుమాస్తాలును, తదితరులును మాయింటిలో ఇంటివారితోపాటయిపోయి యున్నటులే ఇంగ్లీషువారును ఉండిపోఁ దొడఁగిరి. నాకడ నున్నవారిలో కొందఱ కిది యిష్టము కాదు. అయినను నేను వారిని పట్టుపట్టి ఉంచుకొంటిని. అందఱ యెడలను ఇట్టి పట్టు పట్టుట తెలివిగల పని యని తలఁపను. ఈ బాంధవ్యముచే కొందఱవలన చిక్కులు కలిగెను. ఈ యెడ నాకు పశ్చాత్తాపము లేదు. చిక్కులు కలుగుచున్నను, చిక్కులు కలుగుచున్నటులు తెలియుచున్నను, ఇతరమిత్రులకు అసౌకర్యము సంభవించుచున్నను, ఈ కష్టములు సైరింపఁబడుచునే యుండెను. నా మతమును నేను మార్చుకొనలేదు, మరియు నా మిత్రులు ఉదారతతో సైరించిరి. ఈ నా క్రొత్తచుట్టఱికములు నా మిత్రులకు కష్ట మనిపించినపుడు నేను వారిని ఖండలింప మానలేదు

ఏలయన, ఆస్తికులు తమలో నున్న ఈశ్వరుని అందఱిలోపలను జూడఁ గోరుదురు. అటు లగుటఁజేసి అందఱియెడలను లోపము లేకుండ సంచరింపఁగల శక్తిని సంపాదించుకొనవలయును. అట్టిశక్తి సంపాదింప నుపాయ మే మున్నచో అప్రయత్నముగా అట్టి యవకాశము లొదవినపుడు వానిని దూరగింపక క్రొత్తక్రొత్త చుట్టఱికములలో పడి రాగద్వేషములు లేకుండఁ జూచుకొనుటయే.

ఈ కారణమున బోయరుయుద్ధము ఆరంభమయిన వెంటనే నా యిల్లంతయు కిటకిట లాడుచున్నను ఇరువు రాంగ్లేయులను తావొసఁగితిని. వా రిరువురును దివ్యజ్ఞానసమాజమువారు. వారిలో నొకరైన కిచను గారినిగూర్చి ముందెఱుఁగఁ గలరు. ఈమిత్రుల సహవాసమున నాభార్యను ఏడిపింపవలసివచ్చెను. నావలన ఆమె పలుమాఱులు దుఃఖింపవలసివచ్చెను. అడ్డమాఁకలు లేక తెరచాటు లేక తెల్లవారు మాలో కూడిమాడి యుండుట కిదియే తొలిసారి. నేనింగ్లాండునందు తెల్లవారియిండ్ల నివసించితిని. నేను వారి యాచారప్రచారములు నేర్చితిని. అయినను పూఁటకూళ్లయింట నున్నటులే అచట నుంటిని. కాని యిపుడు మా యి ల్లట్టిది కాదు. నామిత్రులు నాకుటుంబములో నొకరు. వారును భారతీయాచారములు తెలిసికొనిరి. పోలికకు మాయిల్లు తెల్లవారి యిల్లేకాని లోపల ఆచారవ్యవహారము లన్నియు భారతీయులకు సంబంధించినవియే. వారినుంచుకొనుటవలన మేము చాల ఇబ్బందుల కిర వైతిమని గుఱుతు. కాని ఆ సజ్జను లిరువురును తమ యింట నున్నటులే యుండి రని చెప్పనగును. ఈ మాపరిచయములు డరబనులో కన్న జోహాన్సుబర్గులో ఎక్కువాయెను.

## ఆంగ్లేయులతో పరిచితి

జోహాన్సుబర్గులో ఒకతూరి నాకడ నలుగురు హిందూస్తానీ గుమాస్తాలు ఉండిరి. వీరు నాకు గుమాస్తాలో, కుమారులో చెప్పుట కష్టము. ఈ నలువురితో నాపని తెమలదు. టైపింగు లేక పనికాదు. మాలో నాకే టైపింగు కొలఁదిగా తెలియును. నేను వారిలో నిరువురికి టైపింగు నేర్పితిని; కాని వారి కింగ్లీషులో శక్తి కొలఁదియగుటచే వారి టైపింగు ఎన్నఁటికిని శుద్ధము కాలేదు. కావున వీరిలో నొకనిని లెక్కలపనిలో పెట్టఁదలఁచితిని. నాకిష్టుఁడైనవాని నొకని నేటాలునుండి పిలిపించుకొన వీలు లేదు; ఏలన. సెలవు చీటి లేక భారతీయుఁ డెవఁడును అటనుండి రా వీలులేదు. మరియు నేను నాపనికిగాను ఆఫీసరులను కృపాభిక్ష అడుగుటకు సంసిద్ధుఁడనయి యుండలేదు.

ఈ స్థితిలో నా కేమియు పాలుపోలేదు. ఎంత పని చేయుచున్నను ఇటు వకాలతు, అటు సార్వజనిక కార్యములు; ఈ రెంటి బరువు తఱుగునటులు తోఁపలేదు.

ఆఁడుది యగుఁగాక, మగవాఁ డగుఁగాక తెల్లగుమాస్తా కుదురుచో నాపని జరుగును. కాని నల్లవానికడ తెల్లవాఁడు నౌకరీ చేయునా అని భయము కలిగెను. అయినను ప్రయత్నము చేయఁ దలఁచితిని. టైప్‌రైటింగు ఏజెంటుతో నాకు పరిచయము కలదు. నే నతనిని కలిసికొని 'టైపు చేయఁగల తెల్లవాఁడుగాని, తెల్లదిగాని నల్లవానికడ పనిచేయుటకు ఆతంకము లేనిచో అట్టివానినిఁగాని, అట్టి యామెనుగాని కుదిర్చిపెట్టు'మని అడిగితిని. దక్షిణ-ఆఫ్రికాలో

పార్టు-హాండుకాని, టైపుకాని చేయఁగలవారలో, పలువురు ఆఁడువారిలోనే దొరకుదురు. 'అట్టి యామెను మీకు కుదిర్చి పెట్టుదు'నని ఆ యేజెంటనెను. మిస్ డిక్ అను కన్య యొకతె అతని చేఁజిక్కెను. ఆమెది స్కాట్లాండు. తెల్లవాఁడయిన సరియు, నల్లవాఁడయిన సరియు, ప్రామాణికుఁడగుచో నతనికడఁ బనిచేయుట కామె కేయాపత్తియు లేదు. పనిలోఁ బ్రవేశించుట కామెకు తొందరగాఁగూడ నుండెను. ఆ యేజెంటామెను నాకడ కనిచెను. ఆమెను చూడఁగనే నాకు తృప్తి అయెను.

'మీకు నల్లవానికడ పనిచేయుట కాపత్తి యేమియు లేదా?' అని నే నడిగితిని.

'ఇసుమంతయు లేదు' అని యామె దృఢముగా ననెను.

'జీత మెంత కావలెను?'

'పదియేడునర పౌనులు కావలె ననినచో అది మీ కెక్కువ అని అనిపింపదు కదా?'

'నా కోరిన పనిని నెఱవేర్చుచో ఈ జీత మించుకే~~నియె~~క్కువనిపింపదు. సరియు, పనిలో నెపుడు చేరుదురు?'

'వలయుచో నిపుడే చేరుదును.'

నే నీమెను బడసి చాలఁ బ్రసన్నుఁడ నయితిని. మరియు అపుడే ఎదురుగా కూరుచుండఁబెట్టుకొని ఉత్తరములు వ్రాయింపఁ దొడఁగితిని.

ఈమె కేవలము నాగుమాస్తా కాదు. నాకూఁతురో, సోదరియో అనిపించుకొనెను. ఈమెపనిలో నెచటను వేలుపెట్టి చూపరాదు. ఒకతూరి యీమె చేతిమీఁదుగా వేలకొలఁది పౌనులు ఇచ్చుటయు,

పుచ్చుకొనుటయు జరిగెను. దాని లెక్కడొక్క లామెయే చూచు
చుండెను. ఆమె నా సంపూర్ణవిశ్వాసమును సంపాదించుకొనెను.
అది యటులుండె. ఆమెకు నేనుగూడ తన పరమరహస్యములను
ఎఱింగింపఁగలిగినంత విశ్వాసపాత్రుఁడ నయితి ననునది నా కొక
గొప్పమాట. ఆమె తన జీవనసఖుని వరించుటలో నా సాయము
కోరెను. కన్యాదానము చేయు సౌభాగ్యముగూడ నాకుఁ దక్కెను.
మిస్ డిక్ మిసెస్ మేక్‌డోనల్డు అయినపిదప నన్నెడఁబాయవలసి
వచ్చెను. అయినను వివాహానంతరమునఁగూడ అక్కఱ కలిగినపుడు
నాకు సాయపడుచుండెడిది.

పిదప ఆఫీసులో ఎల్లప్పుడు పనిచేయుటకు ఒక షార్టుహాండ్
రైటరు కావలసివచ్చెను. అందులకును ఒకతె కుదిరెను. ఆమెపేరు
మిస్ ష్లేశిన్. మి. కేలన్ బెక్ ఈమెను నాకడ కనిపిచ్చెను. మి.
కేలన్ బెక్ సంగతి ముందు రాఁగలదు. ఆమె అప్పుడు ట్రాన్సు
వాలులోని ఒక హైస్కూలులో ఆచార్యగా నుండెను. నాకడకు
వచ్చినప్పుడామెకు సుమారు పదియేడేండ్లుండును. ఆమె
కడ కొన్ని విచిత్రచర్య లుండెడివి. మొదట మొదట నేనును, మి.
కేలన్‌బెకును వానిని సైరింప లేకుంటిమి. ఆమె ఉద్యోగము చేయ
రాలేదు. అనుభవము సంపాదింపవచ్చెను. ఆమె రంగుతెగు అను
మాటయే యెఱుఁగదు. ఆమె కే విషయమున నయినను శ్రద్ధ లేదు.
ఆమె యెవరినేని అవమానించుటలోఁగూడ వెనుదీయదు. తన మన
సులో అనుకొనినంతయు పైకి చెప్పుటలో ఆమె కించుకయు సంది
యము లేదు. ఆమె ఇట్టి స్వభావము కలదగుటచే నాకు తఱుచు
చిక్కులు కలుగుచువచ్చెను. కాని ఈమెహృదయము శుద్ధము.
కావున ఈ చిక్కులును విడిపోవుచుండెడివి. నాకంటె ఆమెకు

ఆంగ్లభాషాజ్ఞానము హెచ్చు; మరియు నామెయెడ నాకు నమ్మకము హెచ్చు. ఈ కారణములచే ఆమె టైపు చేసిన పత్రము లన్నిటి పయినిని చూడకయే చేవ్రాలు చేయుచుండువాఁడను.

ఆమె త్యాగమునకు పారము లేదు. చాలఁ గాల మామె నా కడ నెల కాఱు పౌనులే పుచ్చుకొనెను. తుదకు పది పౌనులు ఎక్కువ తీసికొను మని నే ననఁగా 'నేను మీకడ జీతము తీసికొనుటకు రాలేదు. నాకు మీకడ పనిచేయుట మంచి దని వచ్చితిని. నాకు మీ యాదర్శములు ప్రియమయినవి. దీనఁజేసి నేను మీకడ నుంటిని' అని యామె ముదలకించెను.

ఒకసారి అక్కఱ కలిగి ఆమె నాకడ నలుబది పౌనులు పుచ్చికొనెను; అదియును అప్పుగా. నిరుడు ఋణవిముక్తి చేసికొనెను.

ఆమెకు త్యాగ మెంతయో ధైర్యమంత. సౌభాగ్యవశమున నాకు పరిచయముగల స్త్రీలలో స్ఫటికమువలె పవిత్రయు, ధైర్యమున క్షత్రియునిగూడ సిగ్గిలఁజేయఁగలదియు నగు నీ బాలికవంటి యామెను మఱొకతెను జూడను. ఇపు డామె ప్రౌఢకుమారి. ఇప్పటి యామె మనస్స్థితిని నే నెఱుఁగఁ గాని యెపుడేని ఈ బాలిక గుఱుతు పవులుచో నది యొక పుణ్యస్మృతి యని అనుకొందు నను నీ విషయము చెప్పనిచో సత్యద్రోహి నగుదును.

ఆమెకు పనుల పట్టున రేయింబవళ్లు లేవు. నడిరేయి నేపని మీఁదనేని ఒంటరిగాఁ బోవుతఱి వెంట తోడుగొని పొమ్మంటి నేని ఆమె కను లెఱ్ఱజేసెడిది. గడ్డములు మీసములు వచ్చిన పలువురు హిందూస్థానీయు లామె నాదరదృష్టితోఁ జూచుచుండిరి. మరియు ఆమెమాట మన్నించుచుండిరి. మే మందఱమును చెఱసాలలో నున్నపుడు ధైర్యముగలవా రెవరును బయట లేనపుడు ఆమె యొక్కతెయే

పోరాటము నంతయును సంబాళించుకొనెను. లక్షలకొలఁదిగా డబ్బు లెక్క యంతయును, ఉత్తరప్రత్యుత్తరవ్యవహారమంతయును, ఇండియన్ ఒపినియన్ పత్రికావ్యవహారమంతయును ఈమె ఒక్క చేతిమీఁదుగా నడవవలసిన స్థితి వచ్చెను. అయినను ఆమెకు అలపు సొలపు అనుమాట లేదు.

మిస్ శ్లేశినును గుఱించి వ్రాయుటలో నాకు ఆఁగు టనుమాట లేదు. ఇఁక గోకలేగారి ప్రమాణపత్రమును జూపి యీ ప్రకరణమును ముగింతును. నాతో పని చేసినవారి నందఱను గోకలేగా రెఱుఁగుదురు. వారిలో పలువురు ఆయనకు సంతోషపాత్రములు. అప్పుడప్పుడు గోకలేగారు నాకడ పనిచేయువారిని గుఱించి అభిప్రాయప్రదానము చేయుచుండెడివారు. నాకడ నున్న భారతీయులలోను, ఆంగ్లేయుల లోను మిస్ శ్లేశినుకు మొదటి చో టొసఁగిరి. 'ఇంత త్యాగముఁ ఇంత పవిత్రత, ఇంత నిర్భయత, ఇంత కుశలత కడుఁ గొలఁదిమందిలో, గాంచితిని. నాయుద్దేశమున మీసహకారు లందఱిలో మిస్ శ్లేశిన్ చోటు మొట్టమొదట' అని గోకలేగా రనిరి.

## ౧౩

## 'ఇండియన్ ఒపీనియన్'

ఇంకను తెల్లవారిలో మఱికొందఱితోడి నయిన గాఢపరిచయమును 'గూర్చి చెప్పవలసియున్నది. కాని రెండు మూఁడు ముఖ్య విషయములను ముందు తెలుపుట ఆవశ్యకము.

ఒక పరిచితి నిచటఁ దెలుపుచున్నాను. ఒక డిక్కుతో నా పని దక్కలేదు. మి. రిచ్చిని గూర్చి వెనకఁ దెలిపియుంటిని. వారితో నాకు సాక్షాత్తు పరిచయము కలదు. ఆతఁ డొక వాణిజ్యాలయమునకు సంచాలకుఁడు. ఆ పనిని వదలి నాతోఁ బనిచేయ నాతని రమ్మంటిని. ఆతఁ డియ్యకొని నా ఆఫీసున పని చేయఁ దొడఁగెను. దీన నా బరువు తగ్గెను.

ఆ రోజులలో శ్రీ మదనజిత్తుగారు 'ఇండియన్ ఒపీనియన్' అను పత్రికను ప్రకటింపఁ దలఁచిరి. వారు నా సలహాను, సాయమును వేఁడిరి. ఇంతకు మున్నే వీరు ముద్రాయంత్రమును నడుపుచుండిరి. కావున నేనును సమ్మతించితిని. ౧౯౦౪ సంవత్సరమున 'ఇండియన్ ఒపీనియన్' జన్మగ్రహణ మొనరించెను. మనసుఖలాలనాజరుగారు ప్రథమమున సంపాదకుఁడు. సత్యమునకు—మూలభారము నాపైఁ బడెను. నాయదృష్టమున, చాలవఱకు నాకు దవ్వుననే యుండి పత్రసంచాలనము నడుచుచుండెను.

మనసుఖలాలనాజరుగారు సంపాదనకార్యము నిర్వహింపఁ జాలనివారు కారు. వారు దేశమున చాల పత్రికలలో వ్రాయుచుండిరి. కాని దక్షిణ-ఆఫ్రికాలోని కఠినవిషయములను నా కప్పగించెడువారు. స్వతంత్రించి వ్రాయు ధైర్యము వారికి చాలదు. నా

వివేచకత్వమునందు వారికి చాల నమ్మకము. కావున ఆవశ్యకములగు విషయములను వ్రాయు బరువును నాపయి నిడుచుండెడివారు.

ఇండియన్ ఒపినియన్ వారపత్రిక. నేఁటికిని. తొలుదొలుత గుజరాతీ, హిందీ, అఱవము, ఇంగ్లీషు భాషలలో బయలువెడలు చుండెడిది. అఱవము, హిందీ ఈ రెండును నామమాత్రమున కని నాకుఁదోఁచెను. వీనివలన భారతీయులకు ఉపకారము కలుగ దనియు నే నెఱిఁగికొంటిని. ఈ నాలుగు విభాగములను ఉంచుట జూటాగా కానిపించెను. కావున ఆ రెంటిని ముగించి శాంతి నందితిని.

ఈ పత్రిక కొఱకు నేను ధనము గూడ వెచ్చింప వలసి వచ్చునని అనుకొన లేదు. నేను దీనికి ధనము వెచ్చింపనిచో నిఁక నది నడవదని కొలఁదిరోజులలోనే తెలిసిపోయెను. నేను దీనికి సంపా దకుఁడను గాకున్నను దీని వ్రాఁతలకు పూఁటకాపు నేనేయని నల్ల వారికిని, తెల్లవారికిని తెలిసిపోయెను. మొదట పత్రికను ప్రచురింప కుండ నుండుటయే లెస్సపని; ప్రచురింప మొదలిడిన తరువాత కొన్నాళ్ళకు మానివేయుచో భారతీయసమాజమునకు సిగ్గుచేటు. మరియు దీన హానియు కలుఁగఁగల దని చాల భయ మాయెను.

కావున దీనికి వెచ్చింప మొదలిడితిని. తుదకు నాకడ నున్న డొల్లయు వెచ్చింపఁబడెను. నెలనెలకు డెబ్బది యయిదు పౌనులు దీనికిఁగాను వెచ్చించిన సమయమును కలదని గుఱుతు.

కాని ఇంతకాలము దాటినతరువాత ఇపుడు 'ఈపత్రిక భార తీయసమాజమునకు గొప్ప సేవచేసె'నని తలఁచుచున్నాను. దీని వలన సేకరింత మను నూహ కించిత్తును లేదు.

ఇది నాచేతిలో నున్నంతవఱకు దీనిలో ఏ కొంచెము మార్పు కలిగినను అది నా జీవితములోని మార్పునకు సూచకము. నేఁడు

యంగుఇండియా, నవజీవన పత్రికలు నాజీవితాంశములలోని కొన్నింటి కెటులు సారములో అటులే ఇండియన్ ఒపినియన్ కూడ సారమయి యుండెను. నేను ప్రతివారము నాయాత్మను ధారవోసి సత్యాగ్రహమును గుఱించి తెలుపఁ బ్రయత్నము చేసితిని. జైలులో నున్న రోజులు కాక పదియేండ్లవఱకు, అనఁగా ౧౯౧౪ వఱకు నా వ్రాఁతలేని ఇండియన్ ఒపినియన్ పత్రిక ఒకటియైన లేదు. ఆ పత్రికయందు ఆలోచింపక వ్రాసిన మాట గాని, తూఁకము లేని మాట గాని, వట్టి మెఱమెచ్చుమాటగాని, అత్యుక్తిగాని ఉన్నదని గుఱుతు చాలదు. ఆ పత్రిక నాసంయమమునకు తాలింఖానా. నా యుద్దేశము తెలియఁగఁగోరు మిత్రులకు సాధనము. విమర్శకుల కింగు హవిస్సు తక్కువగా దొరకఁగలదు. ఇంపలి వ్రాఁతలవలన విమర్శకులకు తమతమ కలములమీఁద అంకుశ ముంచుకొనవలసివచ్చెడి దని నే నెఱుఁగుదును. ఆ పత్రిక లేనిచో సత్యాగ్రహసమరము సాగెడిది కాదు. సత్యాగ్రహసంగ్రామముయొక్కయు, దక్షిణ-ఆఫ్రికాలోని భారతీయులయొక్కయు సత్యచరిత్రము నెఱుఁగుటకు పాఠకు లీ పత్రికకొఱకు కనిపట్టుకొని యుండెడివారు.

ఈపత్రికవలన నలుపు తెలుపు మొదలగు రంగులుకల మనుజుల స్వభావము నెఱుఁగఁ జాల వీలయినది. దీనివలన సంపాదకునకును, పాఠకులకును నడుమ స్వచ్ఛమగు సంబంధమును కలుపఁగోరితిని గాన లేకరులు తమతమ లోలోపలి విషయములను నాకడ వెల్లడించుచుండెడివారు. ఈ లేఖలలో వాఁడియయినవియు, కటువులయినవియు, మధురములయినవియూ నుండెడివి. వీనిని చదివి, విచారించి, సారము పిండి ప్రత్యుత్తరించుట నా కొక పాఠ మాయెను. దీనివలన వారివారి ప్రసంగములను, ఆలోచనలను చెవులతో వినుచున్నటులు

నా కనుభూత మయ్యెడిది. దీనివలన నాకు సంపాదకుని పూచీ తెలిసినది. మఱియు దీనిమూలమున భారతీయులలో నాకు మంచి పలుకుబడి కలుగ మొదలిడెను. దాన జరుగఁబోవు సంగ్రామము సుశిక్షితమును, సుశోభితమును, ప్రబలమును అయెను.

ఈపత్రికను ప్రారంభించిన మొదటి నెలలోనే సమాచార పత్రికవలన ప్రజాసేవయే కర్తవ్యమని కనుఁగొంటిని. సమాచార పత్రిక ఒక మహాశక్తి. కాని అడ్డులేని జలప్రవాహము గ్రామములను ముంచివయిచి పైరులను పాడుచేసినటులు అడ్డు లేని కలము గూడ సత్యనాశనము చేసివయిచును. కాన కలమునకు అంకుశము కావలయును. ఆ యంకుశముకూడ బాహిర మగుచో నిరంకుశతకన్న పాడు. కావున లాభము కోరుచో నా యంకుశ మాంతరము కావలయును.

ఈ విచారసరణిలో దోసమేమియు లేనిచో ప్రపంచమునం దెన్ని పత్రికలు చిరకాలము నిలువఁగలవు? మఱియు అక్కఱ మాలిన పత్రికలను ఎవరు ప్రకటింప మానఁగలరు? మఱియు ఎవరు ఇవి అక్కఱ మాలిన వని చెప్పఁగలరు? మంచి చెడుగులు రెండును ఈ ప్రపంచమున ఒండొండ కలిసియే నడుచుచుండుట సత్యము. ఈ రెంటిలో మంచిని ఏఱికొనుటయే మనుజుని పని.

# ౧౪

## కూలీ లోకేషనా, లేక మాలగూడెమా ?

హిందూదేశములో నందఱికంటె నెక్కువ సంఘసేవ చేయు మాలలు మొదలగువారిని అంటరానివారినిగా పరిగణించి వారిని ఊరివెలుపల నుంచుచున్నాము. వా రుండు చోటును మాలగూడె మందుము. ఆపే రుచ్చరించుటకు ఈసు గొందుము. ఈరీతిగనే ఏసుమతమువారి యూరోపునందును ఒక కాలమున యూదు లనఁబడువారు అంటరానివారుగా పరిగణింపఁబడిరి. వారి నివాసములు ప్రత్యేకింపఁబడెను. వానికి ఘెట్టో లని పేరు. ఈ తెఱఁగుననే దక్షిణ-ఆఫ్రికాలో మన హిందువులు అంటరానివారుగా నెంచఁబడిరి. ఆండ్రూజుగారి త్యాగమును, శాస్త్రిగారి సమ్మోహనాస్త్రమును చేసిన పని మనల నంటరానివారినిగాఁ జేయింపక సభ్యులనుగాఁ జేయింపదా ? చూడవలయును.

యూదులు తామే ఈశ్వరులకు ఇష్టుల మనుకొని మిగిలినవారిని సృష్టిలో హేయులనుగా నెంచిరి. వారి యీ యపరాధమునకు దండన విచిత్రముగను, అనుచితముగను జరిగెను. ఇంచుమించు ఈ రీతిగనే హిందువులును 'మేము సంస్కృతులము, లేక ఆర్యులము' అని అనుకొనిరి. తమలోనే కొందఱను 'మీరు ప్రాకృతులు, అనార్యులు, అస్పృశ్యులు-పాం'డనిరి. ఈ పాపఫలము దక్షిణ-ఆఫ్రికా మొదలగు తావులందు విచిత్రముగాను, అనుచితముగాను పొడతెంచి, వీరినేగాక వీరిచుట్టుపక్కములైన ముసలమానులను, పారసీకులను, వేరేల— వీరిరంగువారిని, వీరిదేశమువారిని వీరితోపాటు దుఃఖ మనుభవింపఁ జేయుచున్న దనుకొందును.

## ౧౮ కూలీ లొకేషనా, లేక మాలగూడెమా?

జొహాన్సు బర్గులోని కూలీలొకేషనునుగుఱించి ఈ ప్రకరణ మేల వ్రాయవలసియుండెనో పాఠకు లిపు డెఱుఁగ నోపుదురు. దక్షిణ-ఆఫ్రికాలో మన హిందూస్థానీయులకు 'కూలీలు' అని ప్రసిద్ధి. భారత దేశమున కూలివాఁ డనఁగా వెలగొని పనిచేయువాఁడు. కాని దక్షిణ-ఆఫ్రికాలో 'కూలీ' అను పదము మాలఁడు, మాదిగవాఁడు మొదలగు పదములవంటిదయి, ఆ పదము లిచ్చు అర్థమునే బోధచేయున దయినది. దక్షిణ-ఆఫ్రికాలో కూలీలను విడిగానుంచు గూడెముపేరు కూలీలొకేషన్. ఇట్టి లొకేషను నొకటి జొహాన్సుబర్గులో కలదు. పెఱతావులందును ఇట్టి లొకేషనులు కలవు. అచట నుండువారికి ఆ లొకేషనులయెడ అధికారముగాని, స్వామ్యము గాని లేదు. ఇఁక జొహాన్సుబర్గులో లొకేషనులు హిందూస్థానీయులు ౯౯ ఏండ్లకు కౌలుతీసికొనిరి. ఇచట హిందూస్థానీయులకు కడు నిఱుకు. జనాభా పెరుఁగుచున్నది కాని లొకేషనుమాత్రము గొప్పతోఁక. మునిసిపాలిటీవారు మఱుఁగు దొడ్లను అరకొఱగా బాగుచేయించుట దక్క వేఱుపను లేవియు చేయింపలేదు. వీనిపనియే ఇటులుండఁగా నిఁక బాటలమాట, దీపముల మాట చెప్పవలయునా! మఱియు మఱుఁగు దొడ్లనే శుచిగా నుంచనపుడు మిగిలిన విషయముల శుచినిగుఱించి అడుగ నక్కఱలేదు. మఱియు నచట నున్న హిందూస్థానీయులకు నగరసంస్కారము గాని, ఆరోగ్యనియమము గాని తెలియదు. ఇట్టివారిని తిన్నగాఁ జూచు జరూరు ఆ మునిసిపాలిటీకి లేదు. అచట నివసించుచున్న హిందూస్థానీయులు అడవిలో మేడ మొలిపింపఁగలరేని, ధూళినుండి ధాన్యమును పిండఁగలరేని వారి యితిహాసము వేఱుగా నుండెడిది. ఇంత జనము తమ దేశమును విడనాడి పరదేశమునందు తిరుగాడుచుండుట ప్రపంచమునం దెచటను కన్నది కాదు; విన్నది కాదు. సామాన్యముగా జనము ధనమునకుఁగాని, వర్తకము

నకుఁ గాని పరదేశముల కేఁగుదురు. ఇండియానుండి దక్షిణ-ఆఫ్రికాకు వెళ్ళినవారిలో ఎక్కువమంది చదువు రానివారు, నిఱుపేదలు, దీనులు నగు కూలివారు. వీరికి సక్రమమగు రక్షణ మావశ్యకముకదా! వీరికి పిదప వాణిజ్యము చేయువారును, స్వతంత్రముగా జీవనము చేయఁగలవారును గూడ వెళ్ళిరి. కాని వీరు వానికంటె కడుఁ గొలఁది మంది.

మునిసిపాలిటీవారి క్షమింపరాని ఉపేక్షవలనను, భారతీయుల అజ్ఞానమువలనను ఈ లొకేషను అనారోగ్యనిలయ మాయెను. మునిసిపాలిటీవారు సంస్కరణప్రయత్నములు సలుపక, పైఁగా తమ లోపమును లొకేషనువారి నెత్తిపైఁ బెట్టి లొకేషనును ఎత్తివేయఁ దలపెట్టిరి. అందులకు శాసనసభవారి సమ్మతిని సంపాదించిరి. నేను జోహాన్సుబర్గులో నెలకొనిన నాఁటి కున్న స్థితిగతు లివి.

అక్కడివారికి తమతమ నివేశనములపై హక్కు కలదు గాన వారికే కొంచెమో ప్రతిఫలము ముట్టఁజేయవలసియుండును. ప్రతిఫలము లొసఁగుట కొక పంచాయతీని పెట్టిరి. మునిసిపాలిటీ యిచ్చు ప్రతిఫలము చాల దని నివేశనస్థలములు కలవారు అర్జీ పెట్టుకొనుచో దానిని ఈ పంచాయతీవారు విచారించి తీర్పు చెప్పుదురు. దానికి అందఱును సమ్మతింపవలసియుందురు. పంచాయతీవారు అర్జీలు పెట్టుకొనినవారికి ఎక్కువ డబ్బీయవలయునని తీర్మానము చేయుదు రేని ప్లీడరు ఫీజు మునిసిపాలిటీ భరింపవలసియుండును.

చాల దావాలలో కాలుదారులు నన్ను వకీలుగా పెట్టుకొనిరి. వీనివలన నేను డబ్బు కూడఁబెట్టఁ దలఁప లేదు. 'మీరు గెలుచుచో మునిసిపాలిటీవా రిచ్చు ఫీజుతో తృప్తిపడుదును. మీరుమాత్రము పట్టాకు పది పౌను లిచ్చుచో చాలు' నని కాలుదారులకు మొదటనే చెప్పితిని. ఈ వచ్చిన డబ్బులో ఇంచుమించుగా సగము బీదల ఆసుపత్రికిఁ గాని, లేక అందఱ కుపయోగించు మఱియొక పనికిఁ

గాని వినియోగింతునని చెప్పితిని. దీన వారందఱును సహజముగానే సంతుష్టులయిరి.

సుమారు ౭౦ దావాలలో ఒకటి పోయెను. నాకు ఫీజు చాల ముట్టెను. ఆ సమయమున ఇండియన్ ఒపినియన్ 'ఇమ్మ ఇమ్మ'ని నా నెత్తిపైఁ గూరుచుండెను. దీనికిఁగాను ఇంచుమించు ౧౬౦౦ పౌనులు ఈయవలసివచ్చె నని గుఱుతు.

ఈ దావాలలో ఇచ్ఛగించియే చాల శ్రమపడి పనిచేసితిని. క్లయంట్లు ఎప్పుడును మూఁగుచుండెడువారు. వీరిలో చాలమంది ఔత్తరాహులగు బీహారు మొదలగు దేశములవారును, దాక్షిణాత్యులగు అఱవవారును, తెలుఁగువారును. వారు మొదట గిరిమిటియాలుగా వచ్చిరి. ఇపుడు ముక్తిఁబడసి స్వతంత్రముగా నున్నారు.

వీరు తమ కష్టములను బాపుకొనుకొఱకు భారతీయవణిక్సంఘమునకు వేఱుగా తమ కొక సంఘమును నెలకొలుపుకొనిరి. వీరిలో చాలమంది సత్యసంధులు, ఉదారమతులు, సచ్చరిత్రులు నగు భారతీయులు. దీనికి అధ్యక్షులు జేరామిసింహులుగారు. అధ్యక్షులు గాక పోయినను అధ్యక్షుల తరువాత అధ్యక్షులంతవారు బదరీగారు. ఇపుడు వీ రిరువురును స్వర్గము చూఱఁగొనిరి. వీ రిరువురును నాకుఁ గడు సాయపడిరి. బదరీ గారి పరిచితి నా కెక్కుడు. వీరు సత్యాగ్రహమునఁ జాలఁ బనిచేసిరి. నేను వీరి మూలమునను, ఇటువంటివారి మూలమునను ఔత్తరేయులను, దాక్షిణాత్యులు నగు పలువురు భారతీయుల నెయ్యముఁ బడసితిని. నేను వీరికి కేవలము వకీలును గాను, మఱి సోదరునివంటివాఁడ నయియుంటిని; వీరి దుఃఖములలో పాలుఁ గొంటిని. సేర్ అబ్దుల్లా గారు నన్ను గాంధీ యని పిలువ నిరాకరించివయిచిరి. మఱియు 'సాహెబు' అని నన్ను మన్నన గొన్న వాఁ డెవఁడు? కావున ఆయన మంచి పేరు వెదకి వెదకి 'భాయీ' అని సంబోధింపఁ దొడఁగెను. తుదవఱకు దక్షిణ-ఆఫ్రికాలో నా కీ పేరు పోలేదు. మఱియు గిరిమిటు-ముక్తులగు భారతీయులు నన్ను భాయీ యని పిలిచినపుడు వీనులవిందుగా నుండెడిది.

## మహామారి—౧

ఆ లొకేషనును మునిసిపాలిటీవారు స్వాధీనపఱచుకొనినదిగాని వెంటనే భారతీయుల నటనుండి వెడలఁగొట్టలేదు. ముందుగా వారి కనుకూలమగు వేఱొక తావు చూపుట ఆవశ్యకమాయెను. మునిసిపాలిటీ ఇంకను స్థలనిరూపణ మొనరింపలేదు. కావున భారతీయులా 'మురికికొట్టు'లోనే ఉండవలసివచ్చెను. వెనుకటికంటె నిపు డొక భేదము వచ్చెను. భారతీయులు వెనుక హక్కుదారులు; ఇపుడు కౌలుదారులు. వెనుక లొకేషనులో కంపు కొంచెము తక్కువ; ఇపుడు మిగుల నెక్కువ. ఇంతకుముందు భారతీయులు హక్కుదారు లనుకొనుచుండిరి. కావున ఇచ్ఛాపూర్వకముగాఁ గాకున్నను భయముచే నయినను కొంచెము గాకపోయినఁ గొంచెముగా నయినను మునిసిపాలిటీవారు శుచిగా నుంచుచుండిరి. కాని యిపు డింక మునిసిపాలిటీకి భయ మేడది? కౌలుదారుల సంఖ్య పెరిఁగెను. దానితోపాటు అశౌచము, అవ్యవస్థయు పెచ్చుపెరిఁగెను.

ఈస్థితులలో భారతీయులు సంకటపడుచుండఁగా నల్లమారి రోగము డబ్బాటు వచ్చిపడెను. అది వచ్చినచో చావు తప్పదు. అది ఊఁపిరితిత్తులను పట్టుకొనును. బొబ్బరోగముకంటె నది భయంకరము.

అదృష్టవశమున ఈ మారి లొకేషనులో పుట్టలేదు. ఒక బంగారుగనిలో పుట్టెను. జోహాన్సుబర్గు పరిసరములలో బంగారుగను లనేకములు కలవు. వానిలో పనిచేయువారిలో పలువురు నీగ్రోలు. వారి పరిశుభ్రతకు కేవలము వారి యజమానులగు తెల్లవారే పూఁటకాఁపులు. ఈ గనులందు పలువురు హిందూస్థానీయులును పనిచేయుచుండిరి.

వీరిలో ౨౩ రు ఈమారికి దబ్బాటు గురియయిరి. వారీ భయంకరావస్థను వెంటఁ బెట్టుకొని లొకేషనులోని తమతమ యిండ్లలోనికి వచ్చి పడిరి.

ఆనాఁడు ఇండియన్ ఒపినియన్ పత్రికకు చందాదారులఁ జేర్పను, చందాలు వసూలుచేయను మదనజిత్తుగారు అచట తిరుగుచుండుట తటస్థించెను. ఆయన చాల ధీరుఁడు. ఈరోగులఁ జూడఁగనే అతని చిత్తము ద్రవించెను. పెన్సిలుతో నాకొక చీటి వ్రాసెను. దానిభావ మిది: 'ఇచట నల్లమారి హఠాత్తుగా వచ్చిపడెను. మీరు వడిగా వచ్చి కొంచెము సాయపడవలయును. రానిచో చాల ఆపద కలుగును. వెంటనే రావలయును.'

మదనజిత్తుగారు భయపడక ఎవరును లేని ఒకయింటి తాళము పగులఁగొట్టి అందీ రోగులను ప్రవేశపెట్టిరి. నేనును సైకి లెక్కి లొకేషను చొచ్చితిని. ప్రకృత స్థితిగతులు తెలుపుచు ఈ యింటి తాళము తీయవలసివచ్చిన దని టౌనుక్లర్కునకు వార్త నంపితిని.

డాక్టరు విలియమ్ గాడ్ ఫ్రేగారు జోహన్సుబర్గులో వైద్యముచేయుచుండిరి. ఆయనకు కబురు వెళ్లఁగనే పరుగెత్తుకొని వచ్చిరి. డాక్టరొకఁడును, పరిచారకు లిద్దఱును కుదిరిరి. రోగు లిరువదిముగ్గురు. కాని మేమో? ముగ్గురమే. వీరితో పని నెగ్గుట దుర్లభము.

మది మంచిదగుచో సంకటసమయమున సేవకులును, సాధనములును తమంత వచ్చిపడు నని నా కనుభవపూర్వమైన విశ్వాసము కలదు. నా ఆఫీసులో కల్యాణదాసుగారు, మాణికలాలుగారును, మఱి యిద్దఱు హిందూస్థానీయులును గలరు. ఈ యిరువురి పేరులయెడ నా

కిపుడు గుఱుతు * తక్కువ. కల్యాణదాసుగారిని వారి తండ్రియే తీ-కొని వచ్చి నా కప్పగించెను. వీరివంటి పరోపకారులను, ఇతరుల చెప్పిన పనిని చెప్పినటులు చేయు సేవకులను అచట కడుం గొలఁది మందిని జూచితిని. కల్యాణదాసుగా రపుడు బ్రహ్మచారు లయి యుండుట సౌభాగ్యము. కావున వీరి నేపనికైనను బంపుటకు జంకు వాఁడను గాను. రెండవవారగు మాణెకలాలుగారు నాకు జోహాన్సు బర్గులో దొరకిరి. అతఁడును బ్రహ్మచారి యనియే గుర్తు. వీరు నలువురును నాకు గుమాస్తా లనుఁడు, సహచారు లనుఁడు, కుమారు లనుఁడు. వీరి నలుగురిని ఇందు హోమము చేయ నిశ్చయించు కొంటిని. కల్యాణదాసు నడుగఁ బనియే లేదు. ఇఁక మిగిలిన మూవురి నడుగుటయే తడవు, తయారయి యుండిరి. 'మేమును మీతోడివారమే' యని క్లుప్తముగను, మధురముగను వా రిచ్చిన జవాబు.

రిచ్ గారి సంసారము దొడ్డ. అతఁడును మాతోపాటు ఉండుటకు తయారే కాని నే వల దంటి. అతని నీ యాపదలో పెట్టుటకు నేను తయారు కాలేదు. ధైర్యమును చాలలేదు. కావున నతఁడు పై పనులు సంభాళించుకొనుచుండెను.

మేము సేవచేయు ఆరాత్రి చాల భయంకరము. నే నింతకు ముందు పలురోగుల కుపచారము చేసితిని గాని ఎన్నఁడును నల్లమారి రోగులకు ఉపచారము చేయుట పడలేదు. డాక్టరుగారి ధైర్యము మా భయమును బాపెను. ఉపచారము కడుం దక్కువ. మం దిచ్చుట, ఓదార్చుట, మంచినీ ళ్లిచ్చుట, మకిల తుడుచుట—ఇంతకు వినా ఎక్కుడు పని లేదు.

---

* ఈ యిరువురిలో నొకరు గుణవంతరాయి దేశాయిగారు. చూ. ఇంగ్లీషు-ఆత్మకథ. ౨-వ సం. ౮౫-వ పుట. —అనువాదకుఁడు.

ఈ నలుగురును ప్రాణము లొడ్డి సేవ చేసిరి. ఇట్టి వీరి సాహసమును, నిర్భయతను జూడఁగా నా యానందమునకు మేర లేకుండెను.

డాక్టరు గాడ్‌ఫ్రేగారి ధైర్యమును, మదనజిత్తుగారి ధైర్యమును గొప్పవేకాని ఆ నలువురు కుఱ్ఱలయు ధైర్యము చూచినచో ఆశ్చర్యమగును. ఆ రాత్రి యెటులో కడచెను. ఆ రేయి ఒక రోగినేని మేము పోఁగొట్టుకొనిన గుఱుతు లేదు.

ఈ యుదంతమంతయు ఎంత కరుణాజనకమో అంత మనోరంజకము; విశేషించి నా దృష్టిలో ధార్మికము. కావున ఇంకను ఈ విషయమును గుఱించి విడిగా రెండు ప్రకరణములు వ్రాయవలసి వచ్చును.

## మహామారి—౨

ఇటు లింటితాళము పగులఁ గొట్టి రోగుల నందు ప్రవేశపెట్టి వారి కుపచారము చేయుచున్నందులకు టౌన్ క్లర్కు మాకు కృతజ్ఞత తెలుపుచు, 'ఇప్పటిలో వెంటనే సాయము చేయఁగల సాధనములు మాకడ లేవని దాఁచక ఒప్పుకొనుచు, 'మీకు వలయు సాయమును తప్పక తెలుపుఁడు; టవున్-కౌన్సిలు తనశక్తికొలఁది సాయపడును' అని చీటి వ్రాసెను. మునిసిపాలిటీవారు మేలుకొనిరి. పిదప తగిన ఉపాయములను జేయుటకు విలంబ మొనరింపలేదు.

ఆమఱునాఁడు ఖాళీగిడ్డంగులను మాకు స్వాధీనపఱచి అందు రోగుల నందఱను ఉంచవచ్చునని తెలిపిరి. వారు వానిని బాగుచేయించు పూఁచీని తమ నెత్తిపయి నిడుకొనలేదు. ప్రదేశ మంతయు చెత్తచెదారములతో నిండియుండెను. మేమే బాగుచేసికొంటిమి. ఉదారులగు భారతీయులు మంచములు మొదలగువాని నిచ్చిరి. అది యంతయు నొక ఆసుపత్రి యయిపోయెను. మునిసిపాలిటీవా రొక నర్సును, అనఁగా పరిచారికను పంపిరి. ఆమె బ్రాందిసీసాలను, మఱి కొన్ని వస్తువులను దీసికొని వచ్చెను. డాక్తరు గాడ్ఫ్రే గారు తొంటి వలెనే పనిచేయుచుండిరి.

మేము నర్సును రోగులను ముట్టుకొన నిచ్చుట లేదు. ఆమె వారిని తాఁకుటకు వెనుదీయునది కాదు. ఆమె దొడ్డయిల్లాలు. ఆమెకుఁగూడ నీ వ్యాధి యెక్కడ అంటుకొనిపోవునో అని మేమే నివారించితిమి.

రోగులకు మాటిమాటికి బ్రాంది నిమ్మని మా కాదేశము. 'మీరు గూడ బ్రాందిని కొంచెముకొంచెము పుచ్చుకొను చుండినచో వ్యాధి అంట' దని చెప్పుచు నర్సు తాను త్రాగుచుండెడిది. కాని మేము దానిని తాఁక కుంటిమి. రోగుల కయినను బ్రాంది ఉపయోగించునని నాకు నమ్మిక లేదు. బ్రాంది పుచ్చుకొనక యుండుటకు మూవు రంగీకరించిరి. డా. గాడ్‌ఫ్రేగారి అనుమతితో ఈ మూవురిపై నేను మట్టిని ప్రయోగించితిని. తలమీఁదను, బొమ్మమీఁదను, నొప్పిగల చోటులను మట్టిపట్టీలు వేసితిని. వీరిలో నిరువురు బ్రతికిరి, మిగిలిన వారందఱును మేనులు విడిచిరి. ఇరువదిమంది ఆ గిడ్డంగులలోనే మృతి జెందిరి.

మునిసిపాలిటీవా రితరోపాయములుచేయఁదొడఁగిరి. జోహాన్సు బర్గుకు ఏడుమైళ్ళదూరమున ఒక లేజ్ రేట్టో, అనఁగా అంటు రోగుల కాసుపత్రి కలదు. అచట డేరాలు వేసిరి. పోఁగా మిగిలిన మూవురిని అచటకుఁ గొంపోయిరి. క్రొత్తరోగులను అచటికే కొని పోవ నిశ్చయించిరి. మే మా పనినుండి విముక్తుల మయితిమి. పిదప ఆ మేలి యుపచారికకుఁగూడ నల్లమారి తగిలె ననియు, దేహము చాలించె ననియు కొలఁది దినములకే వింటిమి. ఆ రోగు లెట్లు బ్రతికిరో, మా కా మారి యేల తగులలేదో యెవరు చెప్పఁగలరు? దీని వలన మృచ్చికిత్స యెడల నాకు నమ్మిక ప్రబలెను. మరియు బ్రాంది మందునకుఁగూడ గొఱగాదు అని బ్రాందిపై అశ్రద్ధ ప్రబలెను. కాని నా యీ శ్రద్ధాశ్రద్ధలు నిరాధారము లనవచ్చు నని నాకుఁ దెలియును. కాని ఆరోజులలో ఈ రెండు విషయములును నామానసమున హత్తుకొనిపోయి నేఁటివఱకు ఆ రీతిగనే నిలిచియుండెను గాన నిది యుదాహార్తవ్యమాయెను.

ఈ మహామారి బయలు వెడలఁగనే మునిసిపాలిటీవారు ఆ క్షేపమును స్వాధీనము చేసికొనినపిదప దానియొక్క ఔదాసీన్యము వహించుటను గూర్చియు, వచ్చిన మహామారికి మునిసిపాలిటీవారే ప్రాఁటుకాఁపు లనియు పత్రికలలో కటువుగా వ్రాసితిని. ఈ వ్రాఁతవలన మి. హెన్రీ పోలకుగారును, నేఁడు స్వర్గీయులగు మి. జోసెఫ్ డోక్ గారును * మిత్రు లయిపోయిరి.

నే నొక నిరామిషభోజనాలయమున భుజించుటకు వెళ్లుచుంటి నని వెనుకటి ప్రకరణమున చెప్పితిని. అచట నాకు మి. ఆల్బర్టు వెస్టుగారితో కలయిక కలిగెను. మే మిరువురమును గలిసి భోజనాలయమున కరుగుచుంటిమి. భుజించిన పిదప నిరువురమును కలిసియే షికారు వెళ్లుచుంటిమి. మి. వెస్టు ఒక చిన్న అచ్చుకూటమున భాగస్వామి. మారినిగుఱించి నా వ్రాసిన లేఖ నతఁడు చదివెను. నే నిపుడు భోజనాలయమున కానిపింపమిచే అదుర్దాపడెను.

నేనును, నా సహచరులును ప్లేగురోజులలో ఆహారమును తగ్గించితిమి. మరియు నీ యంటు తెగులు ప్రకోపించియున్నంతవఱకు పొట్టను ఎంత తేలికగా నుంచుకొనిన అంత మే లని చాలకాలము వఱకు ఆ నియమము ననుసరించితిమి. దీనివలన నేను రాత్రి తినుట మానితిని. మరియు నితరులకు నావలన భయము కలుగకుండుటకు ఎవ్వరును రాకముందే నా మధ్యాహ్నభోజనమును ముగించుకొని పోవుచుంటిని. ఆ భోజనాలయపు యజమానితో నాకు చాల పరిచయము. 'నే నీ ప్లేగురోజులలో రోగులకు పరిచర్య చేయుచుంటిని గాన ఇతరులకు నా స్పర్శ తగులకుండ చూచుకొందు'నని చెప్పియుంచితిని.

* వీరి విషయమున Partly Responsible అని ఆంగ్లప్రతి—అను.

భోజనాలయమున నన్నుఁ గానక మి. వెస్టు రెండవనాఁటి ప్రొద్దుననో, మూడవనాఁటి ప్రొద్దుననో నాతలుపు తట్టెను. నేనును బయటికి వచ్చుటకు సంసిద్ధుఁడ నయియుంటిని. ఇంతలో నితఁడు వచ్చి నాగదితలుపు కటకట లాడించెను. తలుపు తీయఁగనే 'మీరు నాకు భోజనాలయమున కానిపింపమిచే మీకును ప్లేగు సోఁకెనేమో యని బేజారయితిని. ఈ సమయమున వచ్చుచో తప్పక మీరు దొరకుదు రని ఇపుడు వచ్చితిని. నావలన నేమియేని పని కావలయుచో తప్పక చెప్పుఁడు. నేను రోగులకు పరిచర్య చేయుటకుఁగూడ సంసిద్ధుఁడను. నాపొట్ట నే నిండించుకొనుటదక్క ఇతరుల పొట్టలను నిండింపవలసిన పని నాకు లే దని మీ రెఱుఁగనే యెఱుఁగుదు' రని అతఁ డనెను.

మి. వెస్టు ఇందులకు నాకు మాన్యుఁడు. ఒక నిముసమేని ఆలోచించివటులు గుఱుతు చాలదు. ఇటు లంటిని:

'మిమ్ములను నేను నర్సుగా తీసికొనను. ఇఁక క్రొత్తలు లేనిచో మాపని ఒకటి రెండు రోజులలో తీరిపోవును. కాని మీ వలన ఒకపని కావలసియున్నది.'

'అది యేమి ?'

'తాము దరబను దయచేసి ఇండియన్ ఒపినియనును చేతఁ దీసికొనవలయును. మదనజిత్తుగారి కింకను ఇచట పనిగలదు. మీరచటికి వెళ్ళినచో అచటి పనులయెడల నా చింత తీరిపోవును.

'నా యధీనమున నొక ముద్రాలయము కలదని మీ రెఱుఁగుదురు. పలువిధముల నే నచటికి వెళ్లఁగలనుగాని ఏసంగతియు ఆలోచించి మాపటివేళ చెప్పుదు నన్నచో నీలోపుగా చిక్కేమియు

లేదుకద? మాపటి షికారువేళ దీనిగురించి మాటలాడుకొందము' అని మి. వెస్టు జవాబిచ్చెను.

నేనును వల్లె యంటిని. నాఁటి మాపటింతల మాటరయు, మంత్రియు నాయెను. నెలకు పదిపౌనుల జీతమును, లాభమున కొంత పాలును ఇచ్చునటులు మాటలాడితిని. జీతముకొఱకు వెస్టుగారచటికి పోవఁ గూర్చుండలేదు. జీతముగొను నుద్దేశమే వారికి లేదు. వారికి రావలసిన బాకీలు సాకీలు నా కప్పగించి ఆ మఱునాఁటి రాత్రి మెయిలులో వెస్టుగారు డరబనుకు రవాణా అయిరి. నాఁటిమొదలు నేను దక్షిణ-ఆఫ్రికాను విడనాడువఱకు అతఁడు నా సుఖదుఃఖములకు తోడాయెను. సీమలో లౌత్ అను నొక గ్రామమున మి. వెస్టు జన్మించెను. అతఁ డొక రైతు బిడ్డ. పాఠశాలలో సామాన్యవిద్యను నేర్చెను. తన సొంత పూనికచే అనుభవపాఠశాలలో చదివి విజ్ఞుఁడును, శుద్ధుఁడును, సంయమియు, ఈశ్వరభీరువును, ధీరుఁడును పరోపకారియు ఆయెను. ముందరి ప్రకరణములలో నితనిని, ఇతని కుటుంబమును గుఱించియు వ్రాయుటకు బాకీ యున్నది.

# లొకేషను తగులఁబెట్టుట

ఈ రోగుల యుపచారమునుండి నాకును, నాతోడివారలకును విముక్తి కలిగినను మరెన్నో పనులు కొన్ని మానెత్తిపయిఁ బడెను.

లొకేషను విషయమున మునిసిపాలిటీవారికి కడు నశ్రద్ధయే యయినను తెల్లవారల మనికిపట్లయెడల ఇరువది నాలుగు గంటలును జాగరూకతయే యుండెను. వారి యారోగ్యమును కాపాడుటకు రూపాయలు తక్కువ వెదఁజల్లబడలేదు. వారుండు తావులందు ప్లేగు చొరకుండుటకుఁగాను నీళ్లవలె రూపాయలు ప్రవహింపఁజేయబడెను. భారతీయులయెడల మునిసిపాలిటీ కడు లోటుచేసెను. అయినను తెల్లవారియెడల వారు చూపిన శ్రద్ధయెడల నేనాదరము చూపియుండఁజాలకపోతిని. వీరి యీ శుభప్రయత్నములకు నాచేతనయినంత సాయమును నేనును చేసితిని. నేను సాయమొనరింపకయే యుండినచో మునిసిపాలిటీకి ఇబ్బంది కలిగెడిది. ఇంతియకాక తుపాకులు పేల్చి బలము నుపయోగింపవలసి వచ్చెడిది. తమ యిష్టము నెఱవేరుటకు వారిట్టి పనులలో వెనుకాడెడివారు కారనుకొందును.

కాని అట్టిది తొలఁగెను. నాఁటి భారతీయుల ప్రవర్తనకు మునిసిపాలిటీ అధికారి సంతుష్టుఁడాయెను. ఆ పిదప పనులు తేలిక ఆయెను. మునిసిపాలిటీవారు చెప్పిన చొప్పున హిందూస్థానీయులను నడిపించుటలో నాపలుకుబడి నంతయును ధారపోసితిని. ఇది భారతీయులకు చాల దుష్కర మయినను ఒక్కరైనను నామాట టలాయించినటులు గురుతు లేదు.

లొకేషనుకు నలుదెసలను పహరా పెట్టిరి. ఆజ్ఞ లేకుండ లోపలికి పోవుటకుఁ గాని, బయటికి వచ్చుటకుఁ గాని వీలులేదు. నాకును, నా సహచరులకును మాత్రము సెలవుచీటి కలదు. జోహాన్సు బర్గుకు పదమూడుమైళ్ళదూరమున నున్న మైదానమున వేసిన డేరా లలో ఈ లొకేషనులోనివారి నందఱను ఉంచి ఆ లొకేషనును తగులఁబెట్టవలయు నని మునిసిపాలిటీవారు తలఁచిరి. డేరాలతో నొక క్రొత్తగ్రామము నిర్మించుటకును, అచట తినుబండము లన్నియు సమ కూర్చుటకును కొంతకాలము పట్టుట స్వాభావికము. అంతవట్టును ఇచట పారా పెటిరి.

వీరు చాల గాబరాపడిరి. నేను వారిపట్టున నుండుటచే ఊఱటగొనిరి. వారిలో పలువురు నిఱుపేదలు తాము కూడఁబెట్టు కొనిన ధనమును ఇండ్లలో పాఁతిపెట్టుకొనిరి. దానిని పెల్లగించి ఒక చోటున దాఁచికొనవలయును. వారికి బాంకు లేదు. వారు బాంకు అను మాటయును నెఱుఁగరు. నేనే వారికి బాంకు. నాయిల్లు రూకలతో నిండిపోయెను. అట్టితటి నేను నా చేసిన దొడ్డపనికి వీరికడ ఏమయి నను తీసికొనవచ్చునా? ఎటులో ఆ యాపద గడపితిని. బాంకు మానేజరుకును నాకును గాఢపరిచయము కలదు. ఈ డబ్బం తయు బాంకులో జమ కట్టింపఁ గోరితిని. రాగి నాణెములను వెండి నాణెములను పుచ్చుకొనుటకు బాంకువా రిష్టపడరు. మరియు మారి మసఁగిన చోటులనుండి వచ్చిన నాణెములను గుమాస్తాలు ముట్టుకొన నొల్లక పోవచ్చును. కాని బాంకుమేనేజరు సమస్తసదుపాయము లను జేసెను. పురుగుల జంపు ద్రావకములో ఈ నాణెములను కడి గించి పట్టుకొనిరండు అని చెప్పెను. ఈ రీతిగా ౬౦,౦౦౦ పౌనులు బాంకులో కట్టినటుల గుఱుతు. ఎక్కువ డబ్బు కలవారికి ఫిక్సెడ్ డిపాజిట్లు చేయుఁ డని సలహా ఇచ్చితిని. ఈ రీతిగను పెక్కుడిపా

జట్లు కట్టుకొనఁబడెను. దీనికి ఫలముగా చాలమందికి బొంకులలో ధనము దాఁచికొన నభ్యాసము కలిగెను. ఈ లోకేమనులోనివారి వందలను జొహాన్సుబర్గుకు సమీపమున నున్న క్లిప్‌స్ప్రిట్ ఫారమునకు స్పెషల్ రయిలుమీఁద తీసికొనిపోయిరి. అచట మునిసిపాలిటీ వారు తమ సొంతఖర్చుతో వారికి కావలసిన సదుపాయముల నన్నిఁటిని సమకూర్చిరి. ఈ డేరాల బారు సేనాశిబిరమువలె నుండెను. వీరికి ఆకాశముక్రింద ఆ డేరాలలో నుండు నలవాటు లేమి కొంచెము చిక్కుగనే యుండెను; కొంచెము క్రొత్త చేసెను; కాని వారి కచట నెట్టి యిబ్బందియు కలుగలేదు. నేను నిత్యమును సైకిలుమీఁద వెళ్లి వచ్చుచుంటిని. మున్నేదునాళ్ళవఱకు ఈరీతిగా మంచిగాలిలో నుండుటవలన వారి యారోగ్యము చక్కఁబడెను. మొదటి ఇరువది నాలుగుగంటలు గడఁచుసరికి క్రొత్తయు గిత్తయు ఎగిరిపోయెను. మరల నానందమున నోలలాడఁగడఁగిరి. నే నచటికి వెళ్లినపుడెల్ల వారి భజనకీర్తనలను ఆటపాటలను, జూచుచునే యుంటిని.

లోకేమను ఖాళీ చేయించిననాఁడో, ఆ మఱునాఁడో దానికి నిప్పంటించిరి. మునిసిపాలిటీవారం దొక వస్తువునేని తీసికొన లోభపడలేదు. ఈ దినములలోనే, ఈ కారణముచేతనే మునిసిపాలిటీ వారు మార్కెటులో నున్న కలప నంతయుఁ దగులఁబెట్టించి పదివేల పౌనుల నష్టమును భరించిరి. మార్కెటులో చచ్చిన యెలుకలు కానిపించుటచే మునిసిపాలిటీవారీ సాహసమునకు దిగిరి. మిక్కిలి వ్యయమాయెను గాని దీనికి ఫలముగా మారి వ్యాపింపలేదు. నగరము నిర్భయ మాయెను.

ఒక

ఈ మహామారిమూలమున దిక్కులేని భారతీయులయందు నా పలుకుబడియు, నా వకాల్తును, నా ప్రాప్తియును చాల హెచ్చెను. మరియు తెల్లవారలతో నాకుఁగల పరిచయము మిక్కిలి పెంచెను. గానఁ జేసియు నా నైతికమయిన జవాబుదారి హెచ్చఁదొడఁగెను.

భోజనాలయమున వెస్టుగారు పరిచితు లయినటులే పోలకు గారును నాకు పరిచితు లయిరి. ఒకనాఁడు నా భుజించు మేజా బల్లకు దూరముగా నున్న మఱియొక మేజాబల్లకడ నొక క్రొత్త పిన్న వాఁడు భుజించుచుండెను. అతఁడు నాతో మాటలాడఁగోరి తన పేరు వ్రాసి నా కొక చీటి నంపెను. నేను నా బల్లకడకు రమ్మంటిని; అతఁడు వచ్చెను.

'నేను క్రిటిక్ పత్రికకు ఉపసంపాదకుఁడను. మీరు ప్లేగును గూర్చి వ్రాసిన వ్యాసము చూచితిని. మి మ్మెప్పుడు చూతునా అని అనుకొనుచుంటిని. ఇపుడు చూడఁగలిగితిని' అని అతఁ డనెను.

పోలకుగారి నిష్కాపట్యము నన్నాకర్షించెను. ఆరాత్రియే మా యిరువురికిని పరిచయము కలిగెను. జీవితమునకు సంబంధించిన మా పరస్పర భావములకును పోలిక యున్నటులు కానిపించెను. నిరాడంబరజీవితము అతని కిష్టము. ఏ మాటగాని తనమదికి తెస్సయని తోఁచుచో దానిని వెంటనే అనుష్ఠానమునఁ బెట్టుకొను నతనిశక్తి చాల ఆశ్చర్యకరము. అతఁడు తన జీవితమునందు పెక్కులు మార్పులొక చిటికలోఁ జేసికొనెను.

## ౧౮ ఒక గ్రంథప్రభావము

ఇండియన్ ఒపినియన్ పత్రికకు వ్యయము చాలఁ బెరుఁగుచుండెను. వెస్టుగా రంపిన మొదటి రిపోర్టు చూడఁగా భయమాయెను. 'ఈ పనిలో మీరు చెప్పినంత లాభము కానిపింపదు. పైఁగా నష్టము వచ్చు ననిపించుచున్నది. లెక్కలు డొక్కలు సరిగా లేవు. బాకీలు బోలెఁడు; వానికిని తలయుఁ దోఁకయు లేవు. కడు సవరింప వలసి యున్నది. కాని ఈ రిపోర్టువలన మీరు గాబరా పడకుఁడు. నా శక్తికొలఁది సర్దుబాటు చేసెదను. లాభము రా దని ఈ పనిని విడనాడను' అని వెస్టుగారు వ్రాసిరి.

లాభము రా దని తెలియఁగనే వెస్టుగా రా పనిని మానుకొన వచ్చును. దాన నే నాతనిపై నిసుమంతయు నేరమును మోపలేక పోవుదును. పైఁగా నాతఁడే నాపై నేరము మోపవలసి యుండును. ఏలన, తిన్నగా విచారింపక లాభము రాఁగల దని చెప్పి నేనే దోష భాగి నయితిని. ఇటులయినను ఇతఁ డెన్నఁడును పెదవి నెత్తలేదు. ఎవ రే మాట చెప్పినను ఆమాటను నమ్ము వెఱ్ఱివానిగా నన్ను వెస్టుగారు పరిగణింతు రనుకొంటిని. మదనజిత్తుగారి అంచనాను నమ్మి లాభము రాఁగల దని వెస్టుగారికి మాట యిచ్చితిని. ప్రజాసేవకుఁ డెవఁడేని స్వయముగా చూచుకొనక ఇతరుల మాట నమ్మరాదు. సత్యారాధకునకు చాల మెలకువ ఉండవలయును. తాను తిన్నగా తెలిసికొనక మఱియొకని నమ్మించుట సత్యమునకు డాగు. ఇది యంతయు తెలిసియు వెంటనే నమ్మి పనిచేయు నా ప్రకృతిని తిన్నగా మార్చుకొన జాలక పోవుచున్నా నని చెప్పుచు వగచుచున్నాను. శక్తికి మించిన పనిని నెత్తిని బెట్టుకొను లోభము దీనికి కారణము. ఈ లోభము వలన నేనును, నాకంటె నాతోడివారలును ఎక్కువ వగచిరి.

వెస్టుగారి ఉత్తరము రాఁగనే నేటాలుకు బయలుదేఱితిని. పోలకుగారికీ సంగతి యంతయుఁ దెలిపితిని. అతఁడు నన్ను వీడ్కొ—

ఱ్ఫటకు స్టేషనుకడకు వచ్చి రస్కిన్ రచిత మగు 'అన్ టు ది లాస్ట్' అను గ్రంథమును నాచేతఁ బెట్టి 'ఈ గ్రంథము ప్రయాణ ములో చదువుటకు బాగుండును, మీకుఁ జాల రుచించును' అని చెప్పెను.

పుస్తకము విప్పితిని, మాయఁజాలకపోతిని. అది నా మనస్సును ఆకర్షించెను. జోహాన్సుబర్గునుండి నేటాలుకు ౨౪ గంటల ప్రయాణము. రైలు రాత్రికి డరబను చేరెను. ఆరాత్రి నాకు నిదురపట్టలేదు. ఆ గ్రంథములోని పద్ధతుల ప్రకారము నా జీవితమును ద్రిప్పికొను ఏర్పాటు చేసికొంటిని.

ఇంతకుముందు నేను రస్కిను వ్రాసిన పుస్తక మొక్కఁడేని చదువలేదు. విద్యార్థిదశలో బడిపుస్తకములు తక్క వేఱు పుస్తకముల నే నెఱుఁగను. కర్మభూమిలో కాలుపెట్టిన పిదప నాకు తీరికయే లేదు. కావున నేటివఱకు నాకుఁగల పుస్తకజ్ఞాన మత్యల్పము. అనా యాసముగాఁ గాని, బలపూర్వకముగాఁ గాని జరిగిన యీ సంయ మమువలన నా కెట్టి లోటును కలిగిన దనుకొనను. నా చదివిన కొలఁది పుస్తకములను నేను చక్కగా జీర్ణము చేసికొంటి ననఁగలను. నా చదివిన కొలఁది గ్రంథములలో నా జీవితమును క్రియాపూర్వక ముగా మార్పు చేయించిన దీ గ్రంథమే. పిదప దీనిని నేను గుజరాతీ లోనికి అనువదించి 'సర్వోదయ' మనుపేరున ప్రకటించితిని.

నా లోపల నే వస్తువు లుండెనో వాని ప్రతిబింబములు ఈ రస్కిను గ్రంథరత్నములోఁ గానఁబడుటచే నది నన్ను వశపఱచికొని తనప్రకారము నన్ను నడిపించె నని నా నమ్మకము. మనలోపల నున్న భావనలను మేలుకొలుపఁ గల శక్తి కలవాఁడే కవి. కవు లందఱు

ప్రభావము అందఱిపైనిని ఒకరీతిగా నుండదు. ఏలయనఁగా అందఱి భావనలును ఒకరీతిగా నుండవు.

సర్వోదయసిద్ధాంతములు నాకు ఇటు లర్థమాయెను:

౧. అందఱిమేలులో తనమేలు.

౨. వకీలుపనికిని, మంగలవానిపనికిని వెల సమానమే. ఏలనఁగా బ్రతుకు తెఱఁగిరువురకు నొకటియే.

3. కూలివాని జీవనమును, కర్షకుని జీవనమును సత్య జీవనములు.

మొదటి సిద్ధాంతము నే నెఱుఁగుదును. రెండవదానిని కొంచెముగా నెఱుఁగుదును. మూడవది ఇంతవట్టు నాకచుంబితము. రెండవ మూడవ సిద్ధాంతములలోని విషయములు మొదటి సిద్ధాంతములో అంతర్గతము లని సర్వోదయమువలననే తేటపడును. తెల్లవారఁగట తోడనే వీని ననుసరించి నా జీవితమును మలచుకొనఁ బ్రయత్నము చేసితిని.

## ఫినిక్సు-స్థాపన

తెలవారుటతోడనే ముమ్మొదట వెస్టుగారి కీ సంగతి చెప్పితిని. సర్వోదయప్రభావము నన్నెట్టులు మార్చినదియు తెలిపితిని. ఇండియన్ ఒపినియన్ పత్రిక నొక పొలమునకు మార్చి అచట మన సహచరుల మందఱమును నివసించి జీవికకు మాత్రము ధనము గొని సేద్యము చేసికొనుచు తీరికలో ఇండియన్ ఒపినియన్ పని చేయుద మని నా యభిప్రాయ మెఱింగించితిని. వెస్టుగారి కిది బాగుండెను. ప్రతిమనుష్యునకును భోజనవ్యయమునకుఁగాను తక్కువలో తక్కువగా మూడుపౌను లని నిర్ణయించితిమి. ఇందు నలుపు తెలుపు భేదము లేదు.

కాని అచ్చుపనివారు పది పదియేవురు కలరు. కాని అడవిలో నుండుట వీ రందఱకును సమ్మత మగునా యని ఒక సంశయము. భోజనవ్యయముమాత్రమే పుచ్చుకొని నివసింతురా యని మఱియొక సంశయము. కాని, ఎవ రిట్లుండఁజాలరో వారు మామూలు జీతములనే గొనుచు నివసింపవచ్చు ననియు, వీరును పిదప పిదప నీ యాదర్శమునకు వచ్చి ఆశ్రమమునందు ఉండిపోవలయు ననియు మే మిరువురమును ఆలోచించి తేల్చితిమి.

పనివాండ్రందఱతో ఈసంగతి ముచ్చటించితిని. మదనజిత్తుగా రిష్టపడరైరి. 'ఇది వట్టి తెలివిమాలిన పని. సర్వస్వమును ధార పోసిన యీకార్యము మట్టిలో కలిసిపోవును. మఱియు ఇండియన్-ఒపినియన్ పడిపోవును. ప్రెస్సుకూడ మూలఁబడును. పనివా రందఱు పాఱిపోదురు' అని వారికి భయ మెత్తెను.

మా యన్నకుమారుఁడు ఛగన్‌లాల్ గాంధి ఈ ప్రెస్సులో పని చేయుచుండెను. వెస్టుగారికిఁ జెప్పినపు డితనికిని జెప్పితిని. ఇతనికి సంసారభారము కలదు. చిన్ననాఁటనుండియు నితనికి నాకడఁ బనిచేయుచుండుటయే ఇష్టము. నాపై నతనికి దొడ్డ విశ్వాసము. కావున నితఁడు మాఱుమాట లేక వల్లె యని నాఁటనుండియు నాతోడనే యుండిపోయెను.

మూఁడవవాఁడు గోవిందస్వామి. ఇతఁడు ముద్రాయంత్రమును నడుపువాఁడు. ఇతఁడును ఇయ్యకొనెను. తక్కినవా రొప్పుకొనలేదు గాని ముద్రాయంత్రముతోపాటు వత్తు మనిరి.

ఇటులు పనివారలతో మాటలాడుటకు రెణ్ణాళ్లకంటె నెక్కుడు పట్టినటులు లేదు. 'డర్బను సమీపమున స్టేషనుకు దగ్గఱగా నొక స్థలము కావలసియున్నది' అను నొక ప్రకటనను వెంటనే పత్రికలో ప్రకటించితిని. ఫినిక్సులో స్థలము కలదని తెలియవచ్చెను. వెస్టుగారును, నేనును చూడఁబోయి యేడురోజులలో ఇరువది యెకరములు కొంటిమి. అందొక చిన్న నీటిబుగ్గ కలదు. కొన్ని మావులును, నారింజలును గలవు. దానికి అంటుకొని మఱియొక అరువది ఎకరముల భూఖండ మున్నది. అందు ఫలవృక్షము లెక్కుడు. ఒక ప్రాఁత యిల్లుకూడ నందున్నది. కొంతకాల మయిన పిదప దానినిఁగూడఁ గొంటిమి. ఈ రెండు తునకలును గలిసి వేయి పౌనులు.

ఇట్టి సాహసకార్యములలో సేఠ్ పారసీ రుస్తుంజీగారు నాకు తోడు. నా యీ పని యతనికి నచ్చెను. ఇతఁడు తన గిడ్డంగులమీఁది టిన్ రేకులు మొదలగువానిని ఇచ్చెను. బోయరుయుద్ధమున నాతోఁ బనిచేసినకొందఱు వడ్రంగులును, తాపీపనివారును నాకు సహాయులై కార్ఖానా పెట్టిరి. ఒకనెలలో ముద్రాలయము తయారాయెను. దానిపొడవు ౭౫ అడుగులు; వెడల్పు ౫౦ అడుగులు. వెస్టు మొదలగువారు తామును కష్టించి వడ్రంగులతోపాటు ఉండిరి.

ఫినిక్సులో గడ్డి ఎక్కువ. ఆబాతు తిన్నగా లేదు. ఇంకను పాములు మొదలగువాని ఉపద్రవము కలదు; భయమును కలదు. మొదట మేము డేరాలు వేసికొని ఉండసాగితిమి.

ముఖ్యకార్యాలయము పూర్తి కాంగనే ఒక యేడురోజులలో సామానులను గాడీలమీద వేసి ఫినిక్సుకు పోయితిమి. అది డరబనుకు ౧౩ మైళ్లు; స్టేషనుకు ౨¼ మైళ్లు. ఇటులు స్థలమును మార్చుట వలన ఇండియన్ ఒపినియన్ పత్రిక ఒకతూరి మెర్క్యురీ ప్రెస్సులో ముద్రణ చేయింపవలసివచ్చెను.

ధనార్జనమునకు నాతోంగూడ ఇండియానుండి వచ్చి యాయా యీ వ్యాపారములోనున్న నా బంధుమిత్రులను ఫినిక్సులో చేర్పించుటకు ప్రయత్నింప దొరకొంటిని. వారందఱును ధనము నార్జింపంగోరి దక్షిణ-ఆఫ్రికాకు వచ్చిరి. వీరికి నచ్చంజెప్పి తీసికొనివచ్చుట కడుం గష్టపుం బని; కాని కొందఱకు నామాట ఇష్టమాయెను. ఇట్టి వారిలో మగనలాల గాంధీ పేరు ఏఱి తీసికొందును. ఏలన: మిగిలిన వారు కొలందిమాత్రమే ఫినిక్సునుండి మరల ద్రవ్యసంచయమునకు లేచిపోయిరి. మగనలాలగాంధీమాత్రము తన పనులు విడిచి నాకడకు వచ్చెను. నేంటివఱకు నాకడనే యుండెను. మరియు తనబుద్ధిబలమున, త్యాగశక్తివలన, అనన్యభక్తివలన నా ఆంతరిక పరీక్షలలో నాకు సహచరుండై యుండెను. నామూలసహచరులలో అందఱికన్న నితని స్థానము మొదటి. స్వయంశిక్షితులగు శిల్పులలోంగూడ నా యుద్దేశమున నితం డద్వితీయుండు.

ఈరీతిగా ౧౯౦౪ సంవత్సరమున ఫినిక్సు నెలకొల్పంబడెను. మరియు విఘ్నములు కష్టములు వచ్చుచున్నను ఫినిక్సు-సంస్థయు, ఇండియన్ ఒపినియన్ పత్రికయు నేంటికిని నడుచుచున్నవి. కాని ఈసంస్థ నారంభించిననాంటి కష్టములు, అప్పటి ఆశలు, ఆశాభంగములును వినందగినవి. పయి ప్రకరణమున ఆ విషయమునుగూర్చి ముచ్చటింతును.

# ౨౦

## తొలిరేయి

ఫినిక్సునందు ఇండియన్ ఒపీనియన్ యొక్క మొదటి అంకమును ముద్రించి పంపుట సులభము కాలేదు. రెండు విషయములలో నేను జాగ్రత్త వహింపనిచో ప్రథమసంచిక ఒకవారమాఁపవలసివచ్చెడిదో, లేక కొంచె మాలస్యమయ్యెడిదో. ఈ సంస్థయందు ఎంజినుతో నడుపఁదగు యంత్రములు మొదలగువాని నుంచుట నాకు అంతగా ఇష్టముకాదు. మనము హాలికులమై చేతిపనినే కోరుకొనినపుడు చేతితో నడపఁదగిన పనిముట్లులనే పెట్టుకొనవలయు నని నాయూహ. కాని అపుడది సాగునటులఁ దోఁపలేదు. కాఁగా ఆయిల్ ఎంజినును పెట్టితిమి. కాని ఎపుడేని ఈ నూనెమర ఆడకుండినచో అపుడు పని జరుగుట కాక చేతిమరనుగూడ పెట్టుట మేలని వెస్టుగారికి చెప్పితిని. వెస్టుగారు నామాట విని చేతితో త్రిప్పఁదగు చక్రము నొకటిగూడ నేర్పాటు చేసిరి. ఇండియన్ ఒపీనియన్ పత్రికయొక్క ఆకారము దైనికపత్రికవలె పొడవును వెడల్పును. పెద్దమర ఆఁగిపోవుచో ఇంత పెద్ద ఆకారముగల పత్రికను వెంటనే అచ్చొత్తింప వీలుండదు. కావున పత్రిక అపుడపు డాఁగిపోవచ్చును. ఈ చిక్కును తొలఁగించుటకు, చిన్నపన్నాతో చిన్నమరమీఁద నడపుటకు వీలుగా పత్రికఆకారమును తగ్గించితిమి.

ఆరంభకాలమునందు ఇండియన్ ఒపీనియను పత్రికను ప్రకటించునాఁటి ముందురాత్రి మాకందఱకును జాగరణము చేయవలసివచ్చెడిది. పత్రికలు మడఁచుటకు చిన్నలనక, పెద్దలనక అందఱమును పదిగంటలనక, పండ్రెండుగంటలనక పనియగువఱకు కూర్చుండు

వారము; కాని తొలిరేయి మఱపురాదు. చట్టము మరపై బిగింపఁబడెను; కాని ఎంజిను బిగిసెను. నడవనని మొరాయించెను. ఎంజినును సరిచేసి సాగించుటకు ఎంజనీయరును పిలిపించితిమి. అతఁడును వెస్టుగారును పనిచేసిరిగాని వృథా. అందఱును చింతాయుక్తులై కూరుచుండిరి. తుదకు వెస్టుగారు ఆసలుడిగి నాకడకు వచ్చి కనులు తుడుచుకొనుచు 'నేఁడిక ఎంజిను నడచు నాస లేదు. ఈ వారములో పత్రికను సకాలమునకుఁ బంపఁజాలము' అని పలికెను.

'సరియే. అందులకు మనము కనులు తడుప నక్కఱలేదు. ఇంకే మేని యుపాయ మున్నచోఁ జేసి చూతము. ఆఁ; ఆ చేతిచక్ర మే మయినది?' అనుచు నే నతని నూఱడించితిని.

'ఆ చక్రము త్రిప్పుటకు మనకడ మనుష్యు లేరీ? మన మందఱ మేకమయినను దానిని త్రిప్పలేము. దానిఁ ద్రిప్పుటకు తడవకు నలుగురితో జరూరు. పోనీ మన వాండ్రో అనినచో వా రందఱు నలసి యున్నారు.' అని వెస్టుగా రనిరి.

ఇఁకను వడ్రంగ మంతయూ కాలేదు. కాన వడ్రంగు లందఱు ముద్రాలయముననే నిద్రించుచుండిరి. నేను వారిదెసఁ జూపి—'వీరుగో వడ్రంగులు! మనము వీరి సాయము గొనరాదా? మన మీ రాత్రి యంతయూ మేలుకని ముద్రణోపాయము చూతము. ఈ కర్తవ్య మింకను బాకీయున్న దనిపించుచున్నది'.

'వడ్రంగులను లేపి వీరి సాయము వేఁడుటకు నాకు ధైర్యము చాలదు. మరియూ మనవారుకూడ నలసి యున్నారు, వారినిమాత్ర మెటులు లేపను?' అని వెస్టుగా రనిరి. 'అది నా పని' యని నే నంటిని. 'అటులగుచో మనము ఒడ్డెక్కవచ్చును.' అని వెస్టుగా రనిరి.

నేను వడ్రంగులను లేపితిని. వారి సాయము వేఁడితిని. వారిని బతిమాలవలసిన పని లేకపోయెను. వారిటు లనిరి: 'మీ మిట్టి చిక్కున నక్కుటకు గాసిచో మనుష్యులగా! పిరాగ పడుకొనుఁడు. మేము సుత్రములవలె పనిచేసెదము. మా కిది యొక లెక్క కాదు'

వారితోఁ అచటి యచ్చుపనివాండ్రు గూడ సిద్ధులయియే యుండిరి.

అపుడు నెస్టుగారికి సంతోషము మాఁగలేదు. అతఁడు పని చేయుచుఁ జేయుచు భజనకీర్తన లారంభించెను. నేనును వడ్రంగులలో కలిసితిని. మిగిలినవారును ఒక్కొక్క వరుసగా తిప్పఁ దొడఁగిరి. ప్రొద్దున వీడు కొట్టిరి. ఇంకను చాల పని మిగిలి యుండెను. 'ఇపు డింజనీయరును లేపుచో! ఈ పగటివెలుఁగున చూచిన బాగుండును. మీఁదట ఎంజిను నడచుచో మన పని సమయమునకు నెఱవేఱఁగలదు' అని నేను నెస్టుగారితో నంటిని.

నెస్టుగారు ఎంజినీయరును లేపిరి. అతఁడు లేచి నిలువఁబడి ఎంజినుగదిలోని కేఁగెను. కదపఁగనే ఎంజిను నడవఁదొడఁగెను. ప్రెస్సు హర్షనాదముతో మాఱుమ్రోఁగెను. 'ఈ తెలివి రాత్రి ఎక్కడికి పోయెను! రాత్రి ఎంతమంది కొట్టుకొన్నను మొద్దువలె కదలలేదు. ఇపుడు చేయి వేయఁగనే ఏమియు ఎఱుఁగనటులం పరుగెత్తఁదొడఁగెను' అని అంద ఱనఁ దొడఁగిరి.

అపుడు నెస్టుగారో, ఎంజినీయరో ఇటులు జవాబు చెప్పిరి: 'దీనికి ఉత్తరము చెప్పుట కఠినము. యంత్రములుగూడ మనవలె విశ్రాంతి గోరును. అపుడపుడు వీని స్థితి యిటులు కనుపట్టును.'

ఎంజిను నడవకపోవుట మాయందఱకును పరీక్షయనియు, మఱి సమయమున నది నడచుట పరిశుద్ధమగు మాపనికి శుభఫలమనియు నాకుఁ దోఁచెను.

పత్రిక నియతవేళకు స్టేషనుకు వెళ్లెను; మే మందఱము నిశ్చింతుల మయితిమి.

మా పట్టుదలకు ఫలముగా పత్రికకు నియమ మేర్పడెను. ఫినిక్సునందు స్వయంసహాయతావాతావరణ మారంభమాయెను. తరువాత బుద్ధిపూర్వకముగా ఎంజినును విడనాడి దృఢతాపూర్వకముగా చేతిచక్రముతో పని నడపిన యుగ మొకటి ఈ సంస్థాజీవనములో ప్రవేశించెను. అది ఫినిక్సుజీవనమునందు కడు గొప్పదగు నైతిక కాల మని నా యుద్దేశము.

## పోలాకుగూడ దిగెను

ఫీనిక్సులో ఆ సంస్థను స్థాపించిన పిదప కొలఁది కాలమే నేనం దుండఁగలుగుట యొక విచారకారణము. దాని స్థాపించు సమయమున అచట నుండవలయు ననియు, అచటనే నా పొట్ట గడపు కొనవలయు ననియు, వకాలతు విడనాడవలయు ననియు, అచటనే యుండి నాచేతనయిన సేవ చేయవలయు ననియు, నాసేవయంతయు ఫినిక్సు-సాఫల్యమునందే పర్యవసింపవలయు ననియు నాకోరిక. కాని, ఈ కోరికలు గొంతెమ్మకోరిక లాయెను. నే ననుకొనున దొకటి, జరుగున దొకటి. ఇది మొదటినుండియు నా కనుభవము. తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచుఁగాక! సత్యసాధనముగాని, సత్యోపాసనముగాని ఉద్దిష్టముగ నెడల మనుజుని ప్రయత్నములు భగ్నము లయినను అవి అకుశలముగా పరిణమింపవు. మరియుఁ కొన్ని వేళల మనము తలపోయునంతకన్న నెక్కువ మే లొడఁగూర్చుటయును నా కనుభవము. ఫినిక్సునందు తలఁపని తలంపుగా కలిగిన పరిణామములును, తలఁపని తలంపుగా ఫినిక్సునకుఁ గలిగిన స్వరూపమును మే మనుకొనినంత మేలుతరములు కావు కాని అకుశలములుఁ మాత్రము కా వని నిక్కముగాఁ జెప్పఁగలను.

ఎవరికి వారు పనిపాట లొనరించి పొట్ట జరుపుకొనవలయు నని నాయుద్దేశము కావున అచ్చుకూటమునకు దాపుగా సన్న పొలముకొక్కనికి మూఁడేసి యెకరములవంతున పంచిపెట్టఁబడెను. అం దొక చీలిక నావంతునకు వచ్చెను. ఇష్టము లేకున్నను టిన్ రేకుల యిండ్లను వేసికొంటిమి. రైతులవలె పూరియిండ్లలోఁగాని, ఇటుక

యిండ్లలోఁగాని ఉండుటయే మా కిష్టముగాని అది నెఱవేఱలేదు. దానికి దీనికన్న వ్యయము హెచ్చు; కట్టుటకు కాలమును హెచ్చు. 'ఎపు డిండ్లు తయారగునా? ఎపుడు పనిపాటలు చేసికొందమా?' అని అందఱును తొందరపడిరి.

మనసుఖలాల్ నాజరుగారే నాఁటికిని ఇండియన్ ఒపినియన్ పత్రికకు సంపాదకులుగా నున్నను వారు మాలో కలియలేదు. వీరికి డరబనులో నిల్లు కలదు. డరబనులో ఇండియన్ ఒపినియన్ పత్రికకొక చిన్న శాఖ కలదు.

అచ్చుకూటమునందు జీతము గొని పనిచేయు కంపోజిటరులు ఉన్నను ఈ సంస్థలో నున్నవా రందఱును అక్షరములు కూర్చుట మొదలగున వన్నియు నేర్చుకొనవలసియుండు రని సంకల్పింపఁ బడెను. ఏలనఁగా ఈ పని చాల తేలికయేగాని ఇది కాలమును చాల గ్రహించును. కావున లోఁగడ నీ పని నెఱుఁగనివా రందఱు నిపుడు నేర్చిరి. నే నీ పనిలో నందఱికన్న కనిష్ఠుఁడనేగాని మగనలాల్ గాంధీ మాత్ర మందఱికన్న జ్యేష్ఠుఁడు. తన శక్తి తనకుఁ దెలియ దని మగన లాల్ గాంధీ విషయమున నాయుద్దేశము. ఇతఁ డిదివఱ కెన్నఁ డును అచ్చుపని యిసుమంతయు నెఱుఁగకున్నను చిటికలో నొక గొప్ప కంపోజిట రయిపోయెను; వడిలోఁగూడ దాఁటిపోయెను. ఇతఁ డింత కొలఁదికాలములో అచ్చుపను లన్నిటిలో ప్రావీణ్యము సంపాదించి నన్ను ఆశ్చర్యచకితుని జేసెను.

మే మింకను కాలు నిలఁద్రొక్కు కొనలేదు. గృహనిర్మాణ మింకను పూర్తికాలేదు. ఇట్టి స్థితిలో నాకీ నూతన కుటుంబమును విడిచి జోహాన్సుబర్గు వెళ్లవలసివచ్చెను. అక్కడి పను లన్నియు పలు కాలము పాడువెట్టి యుంచుటకు నా కవకాశము లేకపోయెను.

# ౨౧ పోలాకుగూడ దిగెను

జోహాన్సుబర్గుకు వచ్చి పోలాకుగారితో ఈ గొప్ప మార్పు నంతయుఁ జెప్పితిని. తా నొసఁగిన పుస్తకమువలనఁ గలిగిన యీ పరిణామము వినఁగా నతని యానందమున కొక యెల్ల లేకపోయెను. ‘అందు ప్రవేశించుటకు నాకును వీ లుండునా?’ అని అతఁ డాసక్తితో నడిగెను.

‘లేకేమి? తప్పక వీలుండును’ అని నే నంటిని.

‘మీరు ఊఁ యనుచో నే నిపుడే తయారు’ అని పోలాకుగా రనిరి.

ఇతని దార్ఢ్యము నన్ను ముగ్ధుని గావించెను. తనను తనపనిలో నుండి ఒక నెలలో విడుదల చేయుఁడని క్రిటిక్ పత్రికా సంపాదకునకు నోటీ సిచ్చి నెల వయినపిమ్మట నతఁడు ఫినిక్సు చేరెను. తన కలుపుగోలుతనముచే నందఱకును మంచివాఁడై యతఁడు మాకుటుంబములో నొకఁ డయిపోయెను. నిరాడంబర జీవనము చాలఁ బ్రియమగుటచే ఫినిక్సులో నుండుట ఇతనికి ఇసుమంతయుఁ గష్టమనిపింపక స్వాభావికమును, ఇష్టతరమును ఆయెను.

కాని నే నతని నెంతో కాల మచట నుండనీయలేదు. రిచ్‌గారు సీమకు వెళ్లి లాను ముగించుకొని రాఁదలఁచెను. ఆఫీసుపని యంతయు నాయొక్కనివలన తేలదు. కావున ఆఫీసులో నుండుమనియు, వకీలుగా తయారగుమనియు పోలాకుతోఁ జెప్పితిని. అతఁడు వకీలుగా తయారయిన పిదప తుదకు మే మిరువురమును ఫినిక్సులో నుండిపోవచ్చు నని నాయభిప్రాయము.

నాయభిప్రాయము లన్నియు తుదకు తలక్రిందు లయిపోవుట నిక్కము. తన నమ్మినవారితో నిసుమంతయు వాదింపక వారితో

ననుకూలముగఁ బోవు మంచితనము పోలాకుగారిలోఁ గలదు 'మీకే జీవనము మేలి దని తోఁచునో నాకును దాననే సుఖము. నే నీయాశ్రమమును వికసింపఁ జేయఁగల ననుకొందును. అయినను నే నచటికి వచ్చుచో మన యాదర్శములు త్వరగా ఫలించు నని మీ యభిప్రాయ మగునెడల నే నిదె వచ్చితిని' అని నాకు పోలాకుగారు వ్రాసిరి. నే నీయుత్తరమునకు సంతసించితిని. పోలాకుగారు ఫినిక్సును వీడి నాయాఫీసులో పని చూడఁ దొడఁగెను.

ఆసమయముననే స్కాచ్ థియాసఫీ స్టోకఁడు నాకడ లాపరీక్షకు తయారగుచుండెను. అతనినిగూడ పోలాకుగారి ననుకరింపు మంటిని. అతనిపేరు మేకిన్ టాయర్.

నే నిటులు ఫినిక్సుయొక్క ఆదర్శములను వడిగా సిద్ధింపఁ జేయు శుభచింతలో నుంటిని. కాని దీనికి భిన్నముగ జీవనమునందు తగులుకొని ఒకనాఁటికంటె మఱియొకనాఁడు లోఁతు లోఁతులకుఁ బోవుచుంటిని. దైవసంకల్ప మింకొకవిధముగా నుండనిచో నిరాడంబరజీవన మను నీ మోహజాలములోనే చిక్కుపడియుందును.

నేమన, నా యాదర్శములను కల్పన కందని రీతిగా నెట్లు సంరక్షింపఁబడెనో తెలుపుటకు కొన్ని ప్రకరణములు పట్టును.

# ౨౨

## రాముఁడే రక్షకుఁడు

దేశమునకు వడిగా వెళ్ళఁగల నని కాని, వెళ్ళి దేశమున స్థిరపడఁగల నని కాని ఆశ పెట్టుకొనలేదు. ఒకయేఁడాదిలో తిరిగి వత్తునని నాభార్యకు బాస యిచ్చితిని; ఏఁడాది గడచెను గాని మరలుమాట కానరాలేదు. కావున ఆలుబిడ్డలను రావించుకొన నిశ్చయించితిని.

బిడ్డలు వచ్చిరి. వారిలో రామదాసును ఉన్నాఁడు. ఓడలో నితనికి కప్టెనుతో మిగుల చనవాయెను. ఇతఁడు కప్టెనుతో నాడుకొనుచు చేయి విఱుగఁగొట్టుకొనెను. కప్టెను కడు జాగ్రత్తతో ఓడ వైద్యునిచే కట్లుగిట్లు కట్టించెను. జోహాన్సుబర్గునకు వచ్చువఱకు నితనిచేయి బద్దలతో కట్టఁబడి రుమాలులో పొట్లముగా వ్రేలాడుచుండెను. స్టీమరులోని డాక్టరు చాల మంచివాఁడు. ఇంటికి వెళ్ళఁగనే మంచివైద్యునిచే కట్టు కట్టింపుమని అతఁడు చెప్పియుండెను.

అపుడు నాకు మృచ్చికిత్సపై చాల మురిపు. నా అనార్య వైద్యమునందు నమ్మకము గలవారిచే నేను మృజ్జలవైద్యమును చేయించుచునే యుంటిని. ఇఁక రామదాసునకు వేఱువైద్య మెటులు? అతనికి ఇంచుమించు ఎనిమిదేండ్లు. 'నేను నీ గాయమునకు కట్టు కట్టెదను; నీకు భయములేదు కదా' అని నే నతని నడిగితిని. అతఁడు నగుచు కట్టు మని నా కనుజ్ఞ యిడెను. అతనికి మంచిచెడుల తేర్పఱించుకొను శక్తిలేదు కాని కూరగాయల వైద్య మేదో, మంచివైద్య మేదో తెలియును. ఇంతియకాక అతనికి మాయింటి వైద్యము తెలి

యును. నాయెడల నతనికి నమ్మకము కావున దీనివలన నితనికి కొంచె మేనియు బెదురు పుట్టలేదు.

నేను కట్టు విప్పితిని. అపుడు నాచేయి వడకుచుండెను. గుండెలు కొట్టుకొనుచుండెను. గాయము కడిగి మట్టి పట్టీ వయిచి వెనుకటివలె కట్టు కట్టితిని. ఈరీతిగా నెల గడచువఱకు గాయము మానిపోయెను. డాక్టరు కట్టుకట్టినను నెలకుఁగాని మానుపట్టదని స్టీమరు- వైద్యుఁడు చెప్పెను.

దీనిచే గృహవైద్యమునెడల నా నమ్మకమును, దానిని చేసి చూడవలయుననెడు సాహసమును వృద్ధిపొందెను. ఈపిదప నావైద్య శోధనకు విషయము లెక్కుడాయెను. గాయములు, జ్వరములు, అజీర్ణము, కామిల యీ మొదలగు రోగములు కలస్త్రీపురుషులచే చేయించితిని. చాలవఱకు మేలు కలిగెను. కాని నాకు నేఁడానాఁటి నమ్మకము లేదు. ఇంతియకాక ఈప్రయోగములలో ఆపద గలదని అనుభవమయినది.

ఈప్రయోగముల నిచటఁ దెలుపుట అవి తప్పక పనిచేయు ననుటకుఁ గాదు. ఇట్టి దేదియు తప్పక పనిచేయు నని నామతము కాదు. డాక్టరులును తమప్రయోగములకుఁజెంచి అటులు తెలుపఁజాలరు. కావున వీనిని గూర్చి చెప్ప నాయుద్దేశ మిది: ఎవరైన క్రొత్త ప్రయోగములను చేయఁగోరుదురో వానిని తమమీఁదనే ప్రయోగించుకొని చూడవలయును. ఇటు లొనరించినయెడలనే సత్యము వడిగా ప్రకాశమొందును. మరియు ఇట్టి ప్రయోగములను చేయు వారికి ఈశ్వరుఁడే వైద్యుఁడై కాపాడును.

మృచ్చికిత్సలో నెట్టి చిక్కులు కలవో తెల్లవారి సాంగత్యము లోను అట్టి చిక్కులు కలవు. ఈ రెంటను ఒకటియే భేదము. ఈ తుదిచిక్కులను నేను లెక్కగొనలేదు.

పోలాకు గారిని నాకడకు రమ్మంటిని. అతఁడు వచ్చి నాయనుఁగుఁదమ్మునివలె నుండఁజొచ్చెను. పోలాకుగారికి చాల దినములక్రిందనే ప్రధానము జరిగెను గాని వివాహ మింకను గాలేదు. ఉచితసమయమున వివాహము చేసికొందుమని వా రిరువు రనుకొనిరి. కాని డబ్బు కూడఁబెట్టుకొనినపిదప పోలాకుగారు పెండ్లి చేసికొన నెంచిరని నే ననుకొంటిని. నాకంటె వీరికి రస్కిను గ్రంథపఠనమనన మెక్కువ. కాని పాశ్చాత్యవాతావరణమునందు రస్కిను చెప్పిన చొప్పున జీవనమును సరిగా మార్చుకొనుట మిగుల కష్టపడినఁగాని సమకూరదు. ఒక నాఁడు పోలాకుగారితో నే నిటు లంటిని: 'హృదయమున ప్రేమ నాటుకొనిన పిదప కేవలము ద్రవ్యాభావముచే వియోగమును సహించుటుచితము కాదు. ఇటులగుచో నిఱుపేద లెన్నఁటికిని పెండ్లాడఁజాలరు. మరియు ఇపుడు మీరు నాకడనే యుంటిరికదా! కావున ఇంటిరొక్కమునకు వెతుకుకొన నక్కఱలేదు. మీ రుచితమని తోఁచుచో పెండ్లాడుఁడు.'

పోలాకుగారి కెన్నఁడును ఒకమాటను రెండుమాటలు చెప్పఁబని కలుగలేదు. వడిగా నామాట వీరికెక్కెను. పోలాకుగారికి కాఁబోవు నిల్లాలు సీమలో నుండెను. ఆమెకు ఉత్తరము పోయెను. ఆమె యియ్యకొనెను. ఒకనెలలోఁగా పెండ్లిఁజేసికొన జోహాన్సుబర్గు వచ్చెను.

పెండ్లికిఁ గొంచెమైనను ఖర్చు లేదు. మామూలు వస్త్రములే గాన వస్త్రములకును వ్యయము లేదు. మంత్రతంత్రములకును ఆవశ్యకత లేదు. పోలాకుగారి యిల్లాలు క్రైస్తవి. పోలాకుగారు యూదులు. వా రిరువురికిని సామాన్యమయినది నీతిధర్మము.

ఈ వివాహసమయమున మనోరంజకమగు నొక ప్రసంగము జరిగెను. ట్రాన్సువాలులోని పెండ్లిండ్ల రిజిస్ట్రారు నల్లవారల పెండ్లిండ్లను రిజిస్టరు చేయఁడు. నేను పెండ్లిపెద్దను. మేము కోరగాఁ పెండ్లిపెత్తనమున కొక తెల్లవాఁడు దొరకకపోఁడు గాని పోలాకు గారి కిష్టము లేదు. కావున మేము మూవురమే రిజిస్ట్రారుకడకు వెళ్లితిమి. ఈ పెండ్లికి మధ్యస్థుఁ డొక నల్లవాఁడఁట! పెండ్లి చేసికొను వారు తెల్లవారఁట! వారు తెల్లవారే యని రిజిస్ట్రారు ఎట్లు నమ్మును? కావున 'నేను విచారించిన పిదపఁగాని రిజిస్టరుచేయ'నని అతఁ డనెను. మఱునాఁ డాదివారము నాఁడు కిసిమిసి పండుగ. పెండ్లి పనులన్నియు అయెను. పెండ్లి రిజిస్టరు చేయుట కీ రీతిగా వాయిదా పడుట సహింప నశక్యమాయెను. నేను పెద్ద మేజస్ట్రీటు నెఱుఁగుదును. అతఁ డీ రిజిస్ట్రేషను డిపార్టుమెంటున కధికారి. నే నీ దంపతులను వెంట నిడికొని అతనిముందర హాజరయితిని. అతఁడు నవ్వి చీటి వ్రాసి యిచ్చెను. పెండ్లి రిజిస్టరులో పడెను.

నేఁటివఱకు మాయింట నున్నవా రెల్లరును తెల్ల మగవారే. ఇపు డొక యపరిచితయగు నొక తెల్లయామె మాయింట విడిసెను. నాకును వీరికిని ఏఱుపులు కలిగిన గుఱుతు లేదు. పలుజాతులవారును, పలుప్రకృతులు గలవారును వచ్చిపోవుచుండునట్టిది మాయిల్లు. నా భార్యకింకను ఇట్టివాని ననుభవము తక్కువ. అట్టియెడ వీరి కించుక కలియకపోవుచో నది యంత ఆశ్చర్యము కాదు. సజాతీయులచేతను, విజాతీయులచేతను కలగూరగంప యగు మాయింట నేదేని మాట పుట్టుచో నది సజాతీయకుటుంబములో పుట్టుదానికన్న నెక్కుడయినది కాదని చెప్పవచ్చును. అదియును అతి సాధారణము. ఈ సజాతీయ విజాతీయ భేదము మన మనోభ్రాంతి. వాస్తవమునకు మే మందఱము ఏకకుటుంబములోని వారము.

ఇఁక వెస్టుగారి వివాహముహూర్త మిచట నేల చెప్పరాదు! ఈసమయమున బ్రహ్మచర్యమును గుఱించి నా మనస్సు పరిపక్వము కాలేదు. కావున బ్రహ్మచారులగు మిత్రుల కందఱకును పెండ్లిండ్లు చేయించుట నాపని. వెస్టుగారు తలిదండ్రులఁ జూడఁబోవ సమకట్టిరి. "పెండ్లి చేసికొని మఱీ రండ" ని వీరికి నే సలహా ఇచ్చితిని. ఏలనఁగా, ఘనికస్సన మే మందఱ మిండ్లు కట్టుకొంటిమి. మరియు మే మందఱ మును కర్షకుల మయితిమి. కావున పెండ్లి యనినఁ గాని, వంశవృద్ధి యనినఁ గాని మాకు భయంకరము కాదు.

వెస్టుగారు లెస్టరులో నొక సుందరిని పెండ్లాడి వెంటఁదీసి కొని వచ్చెను. ఈమె తలిదండ్రులు మొదలగువారు లెస్టరులో చెప్పులు కుట్టు నొక పెద్ద ఫాక్టరీలో పనివారు. ఆమెకును అందు కొంత అనుభవము కలదు. ఈమెను నేను సుందరి యంటిని. ఏలయన నేను సుణారాధకుఁడను. మనుజులకు సత్యమయిన సౌందర్య మేది? గుణము. వెస్టుగారు తన యత్తగారిని గూడఁ దీసికొనివచ్చిరి. ఈవృద్ధు నేఁటికిని జీవించియున్నది. ఈమె తన పూనికచేతను, ఎప్పుడును నవ్వుచుండు స్వభావముచేతను మాకు సిగ్గు కలిగించెడిది.

ఇటు నేల్ల మిత్రుల పెండ్లిండ్లు చేయించుచు, అటు నల్ల మిత్రులను మీమీగొలుబిడ్డలను దీసికొని రండని ప్రోత్సహించుచుంటిని. అచట నయిదాఱు హిందూస్తాని కుటుంబములు కాఁపుర ముండి పెంపొందఁదొడఁగెను.

## ౨౩

### ఇంటి దెస

డర్బనులో నన్న యింటిలో కొంత మార్పు చేయవలసి యున్నది. కాని అచట ఖర్చు ఎక్కువ. ఇపుడిపుడే మితవ్యయము మొదలాయెను. ఇఁక జోహాన్సుబర్గులో సర్వోదయగ్రంథము ననుసరించి పరివర్తనము చేయవలసినది బోలెఁడు.

ఒక బారిస్టరు ఇంటిలో ఎంత ఖర్చు తగ్గింపవచ్చునో అంత ఖర్చును తగ్గించితిని. అయినను కుర్చీలు, బెంచీలు మొదలగు కొంత సామగ్రి లేనిచో పనులు సాగవు. సత్యమగు నిరాడంబరజీవనము మనసునందు పెరిఁగెను. కొన్ని పనులు స్వయముగా చేసికొన పట్టుదలకలిగెను. పిల్లలనుగూడ ఆరీతిగనే తయారుచేయ దొరకొంటిని.

బజారు రొట్టెను కొనుట మానితిని. కూనీ చెప్పిన రీతిగా పులియఁబెట్టని గోదుమ పిండితో చేతి రొట్టెలు చేసికొనఁ దొడఁగితిమి. ఈరొట్టెలకు మిల్లులలోపిండి పనికి రాదు. చేతితో విసరిన పిండి ఆరోగ్యకరము. వెలయు తక్కువ. కావున ఏడు పౌను లిచ్చి ఒక చేతిమరను కొంటిని. దీనిచక్రము కడు బలువు. త్రిప్పుట కొకనికి బలువు; ఇద్దరికి సులువు. నేనును, పోలాకుగారును, బాలురును ముఖ్యముగా ఈ చక్రమును త్రిప్పుచుందుము. అపుడపుడు కస్తూరబాయియు. తఱుచుగా ఆమెకు ఈసమయము వంటవేళ. మిసెస్ పోలాకుగారు ఇపుడు చక్రము త్రిప్పుటకు వచ్చుచుండిరి. ఈకసరతు పిల్లలకుఁ జాల మేలు. ఈపనినిగాని, మఱియొక పనినిగాని నేనెపుడును పిల్లల నెత్తిపైఁ బెట్టను. కాని వారది యొక ఆటగా చక్రమును ద్రిప్ప వచ్చుచుండిరి. అలసట కలుగఁగనే వారికి సెలవు. పిల్లలున్ను,

ముందు చెప్పఁబోవు నింకకొందఱును నాతోపాటు పని చేయకుండ లేదు. నాకడ పెద్దబ్రాయులు లేకపోలేదుగాని, వారిలో పలువురు కడు నుల్లాసముతో పనిచేసిరి. 'అబ్బో, అలసట అయినది' అని చెప్పువారు కొలఁదిమంది అని గుర్తు.

ఇంటి బాగుచేఁత కొక నౌకరు కలఁడు. అతఁడును మాకుటుంబములో నొకఁడుగా నుండెను. పిల్లలెల్లరు నతనికి సాయము చేయుచుందురు. పాకీవాఁడు వచ్చి మలమును ఎత్తుకొనిపోవుచుండును. మఱుఁగు దొడ్డి కడుగుట, ముంగిలి మొదలగువానిని కడుగుట ఈపనులను నౌకరునెత్తిపై నిడక, అతఁడు చేయునని ఆశపెట్టుకొనక మేమే చేయుదుము. ఇట్టిపనులు మేమే చేసికొనుటవలన పిల్లలకు అలవాటును, పరిశ్రమయు కలిగెను. దీనికి ఫలముగా నాపిల్లలకు మలము నెత్తుటలో రోఁత పోయెను. మరియు ఆరోగ్యమును గుఱించిన సామాన్య నియమములను సులభముగ గ్రహింపఁగలిగిరి. జొహాన్సుబర్గులో సామాన్యముగా జబ్బనుమాటలేదు. ఎపుడేని వచ్చుచో పిల్లలు సేవచేయుచుండువారు. వారికీపని యన్న నుత్సాహముగూడ నెండు

వీరికి నే నక్షరజ్ఞానము కలిగింపఁ బ్రయత్నము చేయలేదనఁజాలను గాని దానిని త్యాగము చేయించుటలో సంకోచింప లేదు. కావున నా కొమరులు నాపై నేరము మోపిరి; కొన్నిమాఱులు తమ అసంతుష్టినిగూడ కనఁబఱచిరి. ఈయెడ కొలఁదిగా నా దోషము నొప్పుకొందును. వీరి కక్షరజ్ఞానము కలిగింపవలయు నని నాకు చాల కోరికయుండెను. ప్రయత్నముగూడఁ జేసితిని. కాని యిందుల కెప్పుడు నేదో యొక విఘ్నము తగులుచునే వచ్చెను. ఇంతియకాక, యింటికడ వీరి కెవరిచేతనేని చదువు చెప్పించు ప్రయత్నము జరుగలేదు. వీరిని నాతో నడిపించి ఆఫీసుకు తీసికొని పోవుచుంటిని. ఆఫీసు ౫ మైళ్లదూరము. ఇది వారికిని నాకును ఖురళీకేళి* యయ్యెడిది. నడచుచు నడచుచు వీరికి చెప్పుచుంటిని. అదియును నాతోఁ

* కసరతు.

గూడ మఱియొక మిత్రుఁడు వచ్చి రాకున్నపుడే. వారిని ఆఫీసులో క్లయంట్లతోడను, పుస్తకాలతోడను చనవుగా నుండెడివారు. నేను ఏదేని చెప్పుచో చదువుకొనెడివారు, ఇటు అటు తిరుగాడువారు. బజారునుండి యేదేని కావలయుచోఁ దెచ్చిపెట్టుచుండెడు వారు. సర్వజ్యేష్ఠుఁడగు హరిలాలుగాక మిగిలినవా రెల్లరును ఈరీతిగనే పెంచఁబడిరి. హరిలాలు దేశమునందే యుండెను. నేను ప్రతిదినమును నియమముగా నొక గంటసేపైన వీరికిఁ జదువు చెప్పుచు వచ్చినచో కావలసినవిద్య వీరికి వచ్చెడిది. నేనిటులు చేయఁజాలక పోయినందులకు నాకును, నాకుమారులకుఁగూడ నీవిషయమయిన చింత ఉండనే యుండెను. హరిలాలు తన యసంతుష్టిని పలుమాఱులు నాకడనే చెప్పెను. పలువుర యెదుటఁగూడఁ బ్రకటించెను. మిగిలినవారు ఉదారతతోఁ జేకొని ఈ దోష మనివార్య మని తలపోసి దీనిని సైరించిరి. దీనికిఁగాను నాహృదయమున పశ్చాత్తాపము లేదు; కాని యేమేని యున్నచో నది నే నాదర్శమగు తండ్రిని కానని యే. కాని లోకసేవ కొఱకు వీరియక్షరజ్ఞానము నాహుతి చేసితి నని నాయభిప్రాయము. దీనికి మూలము అజ్ఞానమైన నగుఁగాక అది సద్భావపూర్ణమయిన దని నే ననఁగలను. నేను వారిచరిత్రమును తిన్నగాఁ జూచుటలో సోమరిని కాలేదు. ఇది తలిదండ్రులకు అవశ్యకర్తవ్యమని నాతలఁపు. నే నింత ప్రయత్న మొనరించియున్నను నాకుమారుల జీవనమునం దేదేని దోసఁగు కలదేని అది నాప్రయత్నలోపమువలన జరిగినది కాక మాదంపతుల దోషములకు ప్రతిబింబ మని నాయుద్దేశము.

బాలకులు తలిదండ్రుల రూపములకు మాత్రము కాక వారి గుణదోషములకుఁగూడ వారసు లగుదురు. చుట్టుప్రక్కల వాతావరణమువలన ననేకప్రకారములగు మంచి గుణములుగాని, చెడుగుణములుగాని వారి కలవడుట నిక్కమే కాని ప్రధానగుణములుమాత్రము తండ్రి తాతలనుండి సంక్రమించును. ఇట్టి సంక్రామకదోషమునుండి తప్పి కొనఁగలిగిన బాలకుల నే నెఱుఁగుదును. ఇది ఆత్మయొక్క మూల స్వభావము. అది యీ దోషముల బలిగొనును.

నా కుమారుల కింగ్లీషు చెప్పించు విషయమున నాకును, పోలాకు గారికిని పలుమాఱులు తీవ్రముగా సంవాదము జరుగుచు వచ్చెను. భారతీయులగు తలిదండ్రులు తమ బాలురకు బాల్యమునుండియు ఇంగ్లీషు చెప్పించి ఇంగ్లీషు మాటలాడుట యలవఱుతురేని వారు దేశమునకును, తమబిడ్డలకును ద్రోహము చేయువా రని మొదటినుండియు నాయభిప్రాయము. ఇట్టి బాలురు తమ జాతియొక్క ఆధ్యాత్మిక సాంఘిక జ్ఞానమునకు వారసులు కాలేకపోవుటయే కాక తమ దేశమునకును, జగత్తునకుఁగూడ సేవ చేయుటకు సరియగు నర్హతను కోలుపోవుచున్నారనియు నా యభిప్రాయము. కావున ఎఱిఁగియెఱిఁగియే నేను నా కుమారులతో మాగుజరాతియే మాటలాడుచుంటిని. పోలాకు గారి కిది యిష్టము కాదు. 'మీరు వారి భవిష్యమును పాడుచేయు చున్నారు. బాలురను చిన్ననాఁటనుండియు ఇంగ్లీషువంటి వ్యాప్తి చెందినభాషలో తరిఫీదు చేసినచో ఇప్పటి జీవనసంఘర్షమునందు మిగిలినవారికంటె నగ్రేసరులు కాఁగలరు' అని పట్టుదలతోను, ప్రేమతోడను పోలాకుగారు వాదించిరి. నా కీవాదము గొంతుక దిగలేదు. తుదకు, నావాదమే వారికి నచ్చెనో, లేక నాబంధపట్టును జూచి వారే వాదింప మానిరో నా కిపుడు గుర్తుచాలదు. ఇది ౨౦ ఏండ్ల క్రింది ముచ్చట. అప్పటి నా యుద్దేశము లనుభవములతోపాటు వృద్ధి జెందెను. నాబాలుర కక్షరజ్ఞానము సంపూర్ణముగా లేకున్నను మాతృభాషలో సామాన్యజ్ఞానము సహజముగానే సంప్రాప్త మాయెను. దీనివలన వీరికిని లాభము కలిగెను, దేశమునకును గలిగెను. వా రిపుడు పరదేశులవలె నుండరు. వారికి సహజముగా రెండు భాషలు వచ్చెను. ఎక్కువమంది ఇంగ్లీషు మిత్రులతో సహవాసము నుండుటచేతను, ఇంగ్లీషు ప్రధానభాషగా నున్న దేశమున నుండుట చేతను వారు సులభముగా ఇంగ్లీషు చదువను వ్రాయను నేర్చుకొనిరి.

# ౨౪

## జులూ 'తిరుగుబాటు'

ఇల్లు కట్టుకొనిన పిదపఁగూడ స్థిరముగా నొకచోటున నుండఁగలుగుట నాయదృష్టములోఁ వ్రాయఁబడియుండలేదు. జోహాన్సుబర్గులో మే మందఱము ప్రోఁగయి నివసింప మొదలిడితిమి. ఇంతలోఁ దలవని తలంపుగా నొక ఘటన జరిగెను. నేటాలులో జులూలు తిరుగుబాటు చేసిరని సమాచారము వచ్చెను. జులూలయెడల నాకు ద్వేషము లేదు. వారేభారతీయునకేని అపకారము చేసియుండలేదు. తిరుగుబాటునెడఁగూడ నాకు సందియమే. కాని ఆసమయమున ఇంగ్లీషుపరిపాలనము లోకకల్యాణమున కని నేను భావించుచుంటిని. నాకు దానియెడ దొడ్డభక్తి. దాని క్షయము నా కిష్టము కాదు. కావున బలమును ఉపయోగించుటలో నీతి యనియు, అనీతి యనియు విచారించుటలు నన్నడ్డగింపలేదు. నేటాలుకు ఏదేని ఆపద వచ్చినచోఁ దన్ను రక్షించుకొనుటకు స్వయంసేవక సేన కలదు. ఆపత్సమయములయందు ఇందు భారతీయులనుగూడఁ జేర్చికొందురు.

నాకు నేటాలుతోఁ జాల సంబంధ ముండుటచే నేనును నొక నేటాలువాసి నని యనుకొనుచుంటిని. కావున 'అక్కఱ పట్టుచో గాయపడినవారికి పరిచర్య చేయుట కొక హిందూస్తానీ సేవకసేనను తీసికొనివచ్చుటకు తయారుగా నున్నా' నని గవర్నరుకు ఉత్తరము వ్రాసితిని. గవర్నరు వెంటనే యంగీకరించెను. ఇంత యనుకూలముగా, మరియు నింతవడిగా నుత్తరము వచ్చునని నే ననుకొనలేదు. నే నతనికి ఉత్తరము వ్రాయకముందే నా పనిని నేను చేసికొనియే యుంటిని. గవర్నరు నాప్రస్తావమును అంగీకరించినచోఁ జోహాన్సుబర్గులోని సంసార మెత్తివేయఁ దలఁచితిని. పోలాకుగారు వేఱే యొక చిన్న యింటిని మాటాడుకొని యుం దుందురు. కస్తురబాయి

ఫినిక్సులో నుండును. కస్తురబాయియు నిందులకు సంపూర్ణముగా నంగీకరించెను. ఇట్టి పనులలో నామె నామాట కెన్నఁడు నెదురాడి యున్న గుర్తు లేదు. గవర్నరుకడనుండి జాబు రాఁగనే ఇంటివాని కొక నెల నోటీ సిచ్చితిని. కొంతసామాను ఫినిక్సు వెళ్లెను; కొంత పోలాకుగారికడ నుండెను.

డర్బను వెళ్ళి నేను మనుష్యులను పోగుచేయ మొదలిడితిని. అందులకు పలువురతో పని లేదు. మే మిరువది నలుగురము తయారయితిమి. అందు నేను గాక నలుగురు ఘూర్జరులు. మిగిలినవారు గిరిమిట్-ముక్తులగు దాక్షిణాత్యులు. ఒకడు పఠాను.

ఛీఫ్ మెడికల్ ఆఫీసరు నన్ను టెంపొరరీ సార్జంటు మేజరును జేసెను. నాయిచ్ఛగించిన మఱి ముగ్గురను సార్జంటులఁ జేసెను. మఱియొకనిని కార్పొరల్ చేసెను. సరకారువారే మాకు దుస్తు లిచ్చిరి. పనిచేయువారి గౌరవము రక్షింపఁబడు టొకటి, పనులు తేలికగా జరుగుట రెండు, ఇట్టి పదవు లొసంగుట రివాజగుట మూడు, దీనికి ప్రయోజనములు.

ఈ దళము ఆఱువారముల దాఁక సంతతము పనిచేసెను. 'తిరుగుబాటు' చేసిన తావున కే నరిగి చూచితిని. అచట తిరుగుబాటను మాటయే కానరాదు. ఎదురుగా వచ్చువాఁడే లేఁడు. దీనిని తిరుగుబా టనుటకుఁ గల కారణ మిది: క్రొత్తగా తమపై విధింపఁబడిన పన్ను ఈయవల దని ఒక జులూసరదారు జులూలకుఁ జెప్పెను. ఆ పన్ను వసూలుచేయుట కొక సార్జం టచటికి వెళ్లెను. వానిని పట్టుకొని కొట్టిరి. ఇది జులూ తిరుగుబాటు. అయిన దాయెను; నా హృదయము జులూల దెస నుండెను. మేము ప్రధానకార్యాలయము కడ కరిగితిమి. జులూవారిని సేవింప మమ్ము నియమించిరి. దీన నాకు మఱికొంచె మానందము కలిగెను. 'గాయపడిన ఈ జులూలకు తెల్లవారు సేవచేయుట కిష్టపడుటలేదు. నే నేకాకి నేమి చేయఁగలను? వీరి గాయములు క్రుళ్ళినవి. మీరు వచ్చితిరి, మేలాయె. నిరపరాధు

లకు వీరి మొదల నీశ్వరునకుఁ గృప గలిగెఁ గావలయునని వైద్యాధికారి మాకు స్వాగత మొసఁగెను. ఇటుపై నతఁడు మాకు పట్టెలును, పురుగులను జంపు నీరును ఇచ్చి గాయపడినవారికడకు మమ్ముఁ గొంపోయెను. మమ్ముఁ జూడఁగనె వారికి ప్రాణములు లేచివచ్చెను. తెల్ల సోల్జరులు వారికిని మాకును నడుమ నున్న కటకటాలనుండి తొంగిచూచుచు, కట్టు కట్టవలదని మమ్ము నిషేధించుచు జులూలను బూతులు తిట్టెడివారు. ఆ తిట్లకు మేము చెవులలో వేళ్లు దోపుకొనెడివారము.

క్రమక్రమముగా నాకీ తెల్లసిపాయిలతో పరిచయమాయెను. పిదప వారు మమ్ము నివారింప మానుకొనిరి. ఆ సేవలో గర్నాట సంవత్సరమున నాతో ఘోరముగా విరోధించిన కర్నల్ స్పార్క్స్ అను వారును, కర్నల్ వాయలీగారును గలరు. నే నీ పనిలో నుండుటఁ జూచి వారు చకితు లయిరి. వారు నన్ను ప్రత్యేకముగా పిలిచి ధన్యవాదములు సలిపి జనరల్ మెకెంజీగారికడకుఁ గొంపోయి వారితో నాకుఁ బరిచయము కలిగించిరి.

వీ రందఱును అసలు సైనికు లని పాఠకులు తలఁపకుందురు గాక! కర్నల్ వాయలీగారు ప్లీడరు. కర్నల్ స్పార్క్స్ గారు ఒక కసాయిదుకాణమున కధిపతి. జనరల్ మెకెంజీ గారు నేటాలునం దొక ప్రసిద్ధభూస్వామి, కర్షకుఁడును. వీ రెల్లరును స్వయంసేవకులే. స్వయంసేవకు లగుటకుఁ గాను సైనికశిక్షను, అనుభవమును వీరు సంపాదించిరి.

మే ముపచరించు రోగులు యుద్ధమున గాయపడినవారు కారు. అనుమానముచే వీరిలో నొక జట్టు చెఱసాలలోఁ బెట్టఁబడెను. జనరలుగారి యాజ్ఞవలన వీరు కొరడాలచేఁ గొట్టఁబడిరి. ఆ దెబ్బలవలన వీరికి గాయములాయెను. చూచువారు లేకపోవుటచే నవి కుళ్ళి నీరు గాఱఁదొడఁగెను. ఇఁక రెండవ జట్టు. వీరు జులూ లయినను తెల్ల వారికి మిత్రులు. మిత్రులని తెలియుటకు వీరికి చిహ్నము లున్నవి. ఉన్నను పొరపాటుచే తెల్ల సిపాయిలు వీరిని కాల్చిరి.

ఇంతియ కాక తెల్లసిపాయీలకు మందు తెచ్చుటయు, ఇచ్చుటయు నాపని. డాక్టర్ బూత్ గారి చిన్న ఆసుపత్రిలో నొక సంవత్సరము నేను పని చేసియుండుట పాఠకులకు గుర్తుండియుండును కావున నాకీ పని తేలిక యయ్యెను. దీన నాకు పలువురు తెల్ల వారితో పరిచయ మాయెను.

కాని యుద్ధస్థలమున కరిగిన సేన యొకచో నిలువదు. అక్కడ గల చోటుల కెల్ల నది పరుగిడుచుండును. వీరిలో పలువురు ఆశ్వికులు.

మా ఫౌజుగూడ వారి వెనుక డోలీలతో బయలుదేరెను. ఒక్క నాఁడు రెండు మూఁడు మాఱులు నలుబది మైళ్ళవఱకు పోవలసి వచ్చెను. మే మెచటికేఁగినను భగవత్కార్యము. జులూమిత్రులు పొరపాటునఁ గాల్వఁబడిరి. వారిని డోలీలలో నెక్కించుకొని మోసికొని పోయి ఉపచారము చేయవలసియుండెను.

## హృ ద య మ థ న ము

జూలూ తిరుగుబాటువలన నాకుఁ జాల ననుభవములు కలిగెను. ఆలోచించుటకును జాల సామగ్రి దొరకెను. బోయరు యుద్ధమును జూచినప్పుడును నా కింత చేటు భయ మనిపింపలేదు. ఇది యుద్ధము కాదు. మనుష్యుల వేట. ఇది కేవలము నాయూహయే కాదు. పలువురు తెల్లవారల యూహయు నిదియే. ప్రొద్దుటినుండియు గుండ్లమ్రోత టపాకాయల మ్రోతవలె వినఁబడుచుండును. సైనికులు పల్లెమీఁదికిఁ బోయి గుండ్లు విడుతురు. ఈ శబ్దములు వినుచు నచట నుండుట నాకుఁ జాలఁ గష్ట మనిపించెను. ఈశ్వరకృపచే మాకీ పని దొరకెను. విశేషించి జులూల పరిచర్య. కావున మే మీ విషము నెటులో మ్రింగితిమి. మే మీ పనికిఁ బూనుకొననిచో మఱియెవ్వరును నీ పని చేయ రని నాకు నమ్మకమే. కావున నాయంతరాత్మను శాంతపఱచికొంటిని.

ఆ దేశమున ఆబాదు కడుఁ దక్కువ. కొండలందును, లోయలందును అచటనచట మంచివారును, అమాయకులును అగు అనార్యులని చెప్పఁబడు నీ జులూల గుడిసెలు తక్క నచట మఱి యేమియు లేవు. అది యంతయుఁ జూడ నింపయిన ప్రదేశము. ఇట్టి శూన్య ప్రదేశమున గాయపడినవారి నెక్కించుకొనిన డోలీతోఁ గాని, వట్టి డోలీతోఁ గాని పలుమైళ్ళు పయనించునప్పుడు నామనస్సు అనేకవిధములగు దీర్ఘాలోచనలలో మునిఁగిపోవుచుండెడిది.

అచట బ్రహ్మచర్యమును గుఱించిన నా యాలోచన పరిపక్వ మాయెను. నాసహచరులతో దీనిగుఱించి చర్చించితిని. కాని యీశ్వర దర్శనమునకు బ్రహ్మచర్య మనివార్య మని నా కప్పటికి తోఁచినటులు

స్పష్టముగా నుండుట లేదు. లోకసేవ కిది యనివార్యమే యని యెఱిఁగికొనినట్టులు నాకు విస్పష్టముగా గుర్తే. ఇట్టి సేవ దినదినమును ఇతోఽధికముగాఁ జేయవలసివచ్చుననియు, నేను భోగవిలాసములందు, బిడ్డల గనుటయందు, కన్నవారిని పెంచుటయందు తగులుకొనియుండు జేని సంపూర్ణముగా సేవ చేయఁజాల ననియు నాకుఁ దెలియును. నేను రెండు గుఱ్ఱములమీఁద దౌడు తీయలేను. ఈ సమయమున నా భార్య చూలాలయి యున్న యెడల నేను ఇంత నిశ్చింతమగు మనస్సుతో నీ సేవాకార్యములోని కుఱికియుండను. బ్రహ్మచర్యము లేక కుటుంబవృద్ధి కోరుచు సమాజసేవ చేయు టనునది పొసఁగని మాట; పెండ్లిచేసికొనియు బ్రహ్మచర్య మవలంబించినచో కుటుంబసేవకును, సమాజసేవకును విరోధము కాఁజాలదు. నే నీ విచారమున మునిఁగి తేలి తుదకు బ్రహ్మచర్యవ్రతముఁ బూనుటకు తొందరపడితిని. ఈ యాలోచనలచే నా కొక యానందము కలిగెను. ఉత్సాహమును అమితమాయెను. ఈ సమయమునందు భావన సేవాక్షేత్రమును చాల విశాల మొనరించెను.

ఈ యాలోచన యింకను నామనస్సునందు వృద్ధి చెందుచుండెను. శరీరమునకు పనియు నుండెను. ఇంతలో 'తిరుగుబాటు అడఁగిపోయెను' అని వార్త వచ్చెను. ఇఁక మాకు సెలవు. ఆ మఱునాఁడే 'మీ రిండ్లకు పోవచ్చు' నని హుకుము వచ్చెను. కొలఁది రోజులలోనే మే మందఱమును మామా యిండ్లకు అరిగితిమి. తరువాతఁ గొలఁది నాళ్ళలోనే మాసేవకు ధన్యవాదము లర్పించుచు గవర్నరుగారొక యుత్తర మంపిరి.

ఫినిక్సు వచ్చిన తరువాత బ్రహ్మచర్యమునుగూర్చిన నా యాలోచనమును చగనలాలు, మగనలాలు, వెస్టు మొదలగువారికిఁ జాల నుత్సాహముతోఁ జెప్పితిని. అది యందఱకును నచ్చెను. అందఱకును

బ్రహ్మచర్యముయొక్క ఆవశ్యకత తెలిసెను. కాని దీని నవలంబించుట అందఱకును కష్టమని తోఁచెను. కొందఱు ప్రయత్నము చేయ సాహసించిరి. ఇందు కొందఱు సఫలతఁ జెందిరనికూడ నేనెఱుఁగుదును.

ఆ సమయమున జీవనపర్యంతమును బ్రహ్మచర్యమును పరిపాలింతునని నేనును శపథముచేసితిని. ఈవ్రతమహాత్మ్యమును, దీని కాఠిన్యమును ఆనాఁడు నాకు చక్కగా గోచరింపలేదు. దాని కాఠిన్యమును నేను నేఁటికిని అనుభవించుచునే యుంటిని. దానితోపాటు దానిమహాత్మ్యమును ప్రతిదినమును ఒకనాఁటికంటె నొకనాఁ డెక్కువగా గోచరించుచునే యుండెను. బ్రహ్మచర్యము లేని జీవనము శుష్కము, మఱి పశుజీవనము. పశువు సహజముగా నిరంకుశము. తన యిచ్ఛచే తనమీఁద నంకుశ ముంచుకొనుటయందే మనుష్యుని మనుష్యత్వ మున్నది. ధర్మగ్రంథములలో బ్రహ్మచర్యస్తుతిని జూచి నేనతిశయోక్తి యనుకొంటిని. కాని అది యుచితమనియు, ననుభవసిద్ధమనియు నేఁడు ప్రతిదినమును స్పష్టముగా తెలియవచ్చుచున్నది.

ఇంత మహాఫలముగల బ్రహ్మచర్యము సులభసాధ్యము గాదు; కేవలము శారీరకమును గాదు. శారీరకనిగ్రహముతోడనే బ్రహ్మచర్య మారంభమగుచున్నది. శుద్ధబ్రహ్మచర్యమునందు తలఁపుకూడ తప్పు. పూర్ణబ్రహ్మచారి కలలో నైన తలఁపఁడు. ఎంతవఱకు కలలు వచ్చుచుండునో, కలలయందును వికారము ప్రబలుచుండునో అంతవఱకును బ్రహ్మచర్యము కొఱఁతయే యని తెలియవలయును.

బాహ్యేంద్రియ నిగ్రహముకూడ చాలఁ గష్టమే యని నా యభిప్రాయము. బ్రహ్మచర్యవిషయమున నిర్భయుఁడ నని నేఁడు నేను చెప్పుకొనవచ్చును. కాని తలఁపునెడ నింకను చాల జయము కలుగవలసి యున్నది. నా ప్రయత్నములలో లోపము లేదు. కాని

యెచటినుండి యూరుచుండునో నాయెఱుక లేకయే ఆ తలఁపులు నా మీఁద సవారు చేయుచుండును. తలఁపులనుగూడ మూసివైచు తాళపుఁజెవి మనుజునికడ నున్నదని నే నెఱుఁగుదును. కాని ఆ తాళపుఁజెవిని ఎవరికి వారే వెతుకుకొనవలయును, తమ యనుభవములను తమ వెనుకవారి కిచ్చిపోయిన మహాపురుషులు మనకు మార్గదర్శకులు. వారు పరిపూర్ణులు కారు. పరిపూర్ణత పరమేశ్వరునిది. కావున భక్తులు తమ తపశ్చర్యచే పవిత్ర మొనరించి రామనామాది మంత్రములను మన కిచ్చిపోయిరి. మనము మనలను సంపూర్ణముగా ఈశ్వరున కర్పించుకొననిచో ఎన్నఁటికిని తలఁపుల దాఁటఁ జాలమని నాకు నమ్మకము. సమస్తధర్మగ్రంథములందును నే నిట్టి వచనములను చదివియుంటిని. బ్రహ్మచర్యమును మిగుల జాగ్రత్తతో కాపాడుకొను సందర్భములందు దీని సత్యమును చవి చూచితిని.

రాఁబోవు ప్రకరణములలో బ్రహ్మచర్యమునకు నా పడ్డపాట్లు కొన్ని తెలిపెదను. కావున ఈ ప్రకరణాంతమున 'ఆ మొదటి బులుపాటములో ఈ వ్రతపాలనము సులభముగాఁ గానిపించె' నని యింతమాత్రమే తెలుపుదును. వ్రతము తీసికొనఁగనే భార్యతో ఏక శయ్యయు, ఏకాంతసేవయు వదలిపెట్టితిని. ఇదియే నాచేసిన మార్పు. ఈవిధముగా ౧౯౦౦ సంవత్సరమునుండియు ఇచ్ఛతోడను, అనిచ్ఛతోడను నడచుచుండిన ఈ బ్రహ్మచర్యము ౧౯౦౬ సంవత్సరము మధ్యమున వ్రత మాయెను.

# సత్యాగ్రహోత్పత్తి

ఈ నా యాత్మశుద్ధి సత్యాగ్రహమునకు నిమిత్తమగునటులఁ గొన్ని కొన్ని విషయములు జొహాన్సుబర్గునందు సంభవించుచుండెను. నేను బ్రహ్మచర్యవ్రతమును గైకొనువఱకు నాజీవితమునందలి ముఖ్యఘటనలన్నియు మెల్ల మెల్లగా సత్యాగ్రహమునే సృజించినటులు నే నిపుడు గ్రహింపఁగలుగుచున్నాను. సత్యాగ్రహమను శబ్దము పుట్టుటకు ముందు సత్యాగ్రహ మను పదమున కర్థమగు వస్తువు పుట్టియుండెను. అది పుట్టినపుడు 'ఈ వస్తు విట్టిది' అని నేను నెఱుఁగను. దీనిని జెప్పవలసినపుడు గుజరాతీలో 'పేసివ్ రిజిస్టెన్స్' అను ఇంగ్లీషుపదమునే వాడుచుంటిమి. ఒక తెల్లవారి సభలో ఈ 'పేసివ్ రిజిస్టెన్స్' అనునది సంకుచితార్థబోధకముగా వాడఁబడుచున్నదనియు, ఈ వస్తువు బలము లేనివారి కేడుగడయనియు, ఇందు ద్వేషమునకుఁ గూడ తా వున్నటులు కానిపించుననియు, తుద కిది హింసలో పరిణమించు ననియు తెలిసికొని ఈ శబ్దము భారతీయుల సంగ్రామముయొక్క సత్యరూపమును గోచరింపఁ జేయ లేదని చెప్పవలసివచ్చెను. కావున నొక క్రొత్తశబ్దమును కూర్పవలసివచ్చెను.

నా కొక స్వతంత్రశబ్దము తట్టలేదు. ఈ యర్థమును దెల్పు శబ్దమును వ్రాయఁగలవారికి బహుమతి యీయఁబడు నని ఇండియన్ ఒపీనియనులో ప్రకటించితిని. మగన్‌లాల్ గాంధీ* 'సత్ + ఆగ్రహ' అను నీ రెండు పదములను మేళవించి 'సదాగ్రహము' అను నీ సమస్త

* సత్=సత్యమునందు, ఆగ్రహము=పట్టుదల.

పదమును బనాయించి బహుమతి పొందెను. తరువాత ఈ సదాగ్రహ శబ్దమును మిగుల స్పష్టము చేయనెంచి 'య' అను నక్షరమును జోడించి నేను దీనిని 'సత్యాగ్రహము' అని మార్చితిని. నాఁటి నుండియు గుజరాతుభాషలో నీపదము నేఁటిపోరాటమందు రూఢ మాయెను.

ఈ పోరాటముయొక్క ఇతిహాసమే దక్షిణ-ఆఫ్రికాలోని నా జీవితముయొక్కయు, విశేషించి సత్యశోధనము యొక్కయు ఇతిహాసము. ఈ యితిహాసములో చాలభాగము యెరవడ చెఱయందు వ్రాసితిని. మిగిలినది విముక్తుఁడ నయినపిదప వ్రాసితిని. అదియంతయు నవజీవన పత్రికయందు క్రమక్రమముగా ప్రకటింపఁబడి తుదకు దక్షిణ-ఆఫ్రికా సత్యాగ్రహేతిహాస మను పేరున పుస్తకముగా ప్రకటింపఁబడెను. దీనిని కరంట్ థాట్ పత్రికకు శ్రీ వాలజీ గోవిందజీ దేసాయిగారు ఇంగ్లీషులో తర్జుమా చేయుచున్నారు. ఇదిగూడఁ గొన్నాళ్లలో పుస్తకముగా ప్రకటింప నేర్పాటు జరిగెడిని. * దానిఁ జదివినచో దక్షిణ-ఆఫ్రికాలోని నా సత్యశోధనలు తెలియును. అచటి నా సత్యాగ్రహ మెఱుఁగని ఘూర్జరులా గ్రంథమును తిలకింతురు గాక! దాన వ్రాయఁబడిన యంశములను వదలి దానఁజేరని కొన్ని క్రొత్త సంగతులను ముందరి ప్రకరణములలో పూర్తిచేసి పిదప భారత దేశమునందలి నాశోధనలను పాఠకులకు పరిచయము గావింప నిచ్ఛగించుచున్నాను.

ఈ పరిశోధనల వరుస తెగకుండఁ జదువఁ దలఁచుకొనువారు దక్షిణ-ఆఫ్రికా-ఇతిహాసమునుగూడ తమ ముందు ఉంచుకొందురు గాక!

* దీని ఆంగ్లానువాదము యస్. గణేశన్‌కంపెనీవారిచే (ట్రిప్లికేన్, మదరాసు) పుస్తకముగా ప్రకటింపఁబడెను.

## ఆహార పరిశోధనములు

మనోవాక్కాయములచే బ్రహ్మచర్యపాలనమును గురించిన యాలోచనయు, ఆత్మశుద్ధిచే సత్యాగ్రహసమరమునకు ఎక్కువ కాలమును వినియోగించుటను గురించిన యాలోచనయు, ఈ రెండే నాపనులు. ఈ రెండాలోచనలును నా భోజనమున మిగుల సంయమమును, మిగుల మార్పును ప్రేరించెను. వెనుకటి మార్పు ఆరోగ్యమునకు, ఇప్పటి మార్పు ధర్మమునకు.

ఇందు ఉపవాసమును, అల్పాహారమును ఎక్కువ తావు నాక్రమించెను. లోపల విషయవాసన లున్నవారికి జిహ్వాచాపల్యమెక్కుడు. నాకును జిహ్వాచాపల్యము కలదు. జననేంద్రియమును, స్వాదేంద్రియమును నిగ్రహించుటకుఁ జాలఁ బ్రయాసపడితిని గాని వానిని పరిపూర్ణముగా నిగ్రహింపఁగలిగితి నని నేఁటికిని చెప్పుకొనఁ జాలను. నేను తిండిపోత ననియే తలఁతును. నామిత్రులు నాతిండిని జూచి సంయత మనుకొనెడివారు గాని అది యటులు కాదు. నేను చేయఁగలిగినంత నిగ్రహమును చేయకున్నచో నేను పశువుకన్న పాడై యీవఱకే నాశము నొందియుందును. నాలోపములు నాకుఁ జక్కగాఁ దెలియును. వానిని పోఁగొట్టుకొనుటకు మిగులఁ బ్రయత్నించితి ననియుఁ జెప్పఁగలను. ఈ కారణముననే నేను నేఁటిదాఁక ఈ శరీరము నీడ్చుకొనివచ్చుచు నాచేతనయిన పనిని చేయఁగలుగుచున్నాను.

నాలోపములు నాకుఁ దెలియుటవలనను, అనాయాసముగా అనుకూలమగు సాంగత్యము దొరకుటవలనను ఏకాదశిని ఉపవాసము

గాని, ఫలాహారమును గాని చేయ మొదలిడితిని. జన్మాష్టమి మొదలగు నితరతిథులందును వీనిని జేయఁబూనితిని. సంయమదృష్టితో ఫలాహారమునకును, అన్నాహారమునకును అట్టే భేదము లేదు. ధాన్యము లను పేరఁ బరఁగు ద్రవ్యము లన్నిటియందే రుచి కలదో ఫలాహారమునందును ఆరుచి కలదు. అలవాటు పడినతరువాత ధాన్యముల రుచికన్న పండ్ల రుచియే యెక్కుఁడనిపించును. కావున పర్వములందు ఉపవాసముగాని, ఏకభోజనము గాని మంచి దనుకొంటిని. మరియు ప్రాయశ్చిత్తాదుల కేదేని నిమిత్తములు సంఘటించుచో ఆనాఁ డేకభోజనము పెట్టుకొంటిని. దీన శరీరము స్వచ్ఛముగుటచే రసజ్ఞానమును అధికమాయెను. ఆఁకలియుఁ బెరిఁగెను. ఇది నా కనుభూత మాయెను. ఇట్టు లుపవాసాదు లొకవంక సంయమమునకును, ఇంకొకవంక భోగమునకును సాధనము లని కనుఁగొంటిని. ఇటీవలి నా యనుభవములు కొన్నియు, ఇతరుల యనుభవములు కొన్నియు పైవిషయమును సమర్థించెను. నాశరీరము పెరిఁగి బలిష్ఠముగా నుండవలయు నని నాకు కోరిక గలదు కాని నా ముఖ్యోద్దేశము సంయమము—నాలుకను కట్టివేయుట. కావున భోజ్యవస్తువుల మార్పఁగడఁగితిని. ముద్ద తగ్గింపఁ దొడఁగితిని. కాని రుచి—చాపల్యము—నాతోఁక పట్టికొనియే వచ్చుచుండెను. ఒకవస్తువును విడిచి మఱియొక వస్తువును తినుచుంటిని. ఆక్రొత్తవస్తువుగూడ ప్రాఁతవస్తువుకంటె రుచిగా నున్నట్లు కనఁబడఁ దొడఁగెను.

ఈ పరిశోధనలలో నాకుఁ గొందఱు బాసట గలరు. వీరిలో హారమాన్ కేలన్ బెక్ గారు ముఖ్యులు. వీరినిగూర్చి దక్షిణ-ఆఫ్రికా-సత్యాగ్రహ చరిత్రమున సంపూర్ణముగా వ్రాసియుంటిని గాన మరల నిచట వ్రాయ దొరఁకొనను. ఉపవాసములందును, ఏకాహారములందును పెక్కుమార్పులందును వీరు నాకు సబ్రహ్మచారులు

సత్యాగ్రహసమరము ముక్కుపట్టులో నున్నపుడు నేను వీరియించు నుంటిని. మే మిరువురమును మార్పులను చర్చించుచు క్రొత్త మార్పులలో నెక్కువ చవి ననుభవించుచుంటిమి. నాఁడు వానిని గూర్చిన మాటలుగూడ చవిగా నుండెడివి. వానిలో నేమాటయుఁ జేఁదని పించెడిది కాదు. కాని రుచులలోఁబడి యిటులు మునిఁగిపోవుట తగని పని యని యిటీవల ననుభవమునకు వచ్చెను. ఏలన మనుజుఁడు తినుట రుచికొఱకుఁ గాదు, శరీరమును నిలుపుకొనుటకొఱకు. అన్ని యింద్రియములును శరీరమును, శరీరద్వారమున ఆత్మను సేవింపఁ దలఁచి పనిపాటలు చేయుచో అపుడు వానివానిపయి చవులు చప్పఁబడును. అప్పటినుండియు అవి తమ స్వాభావికమగు రూపమును బొంది తమ తమ పనులను నిర్వహించు నని వ్రాయవలసి యున్నది.

ఇట్టి స్వాభావికతను మేళవించుట కెన్ని లక్షల పరిశోధనలను చేసినను ఎక్కువ అనిపించుకొనవు. మరియు నిందులకు పెక్కు శరీరము లాహుతి నొసఁగవలసియున్నను అందులకు లెక్క చేయరాదు. కాని దీనికి ప్రవాహ మెదురునడచుచున్నది. నశ్వరమగు నీ శరీరమును సుశోభిత మొనరింపను, ఆయువును వృద్ధిఁబొందింపను మన మనేకప్రాణులను బలిగోరుచున్నాము. కాని మన మిటు లొనరించి శరీరాత్మలను రెంటిని చంపుకొనుచున్నాము. మన మొక రోగము నిర్మూలింపఁజేసికొనఁబోవుచు క్రొత్తక్రొత్త రోగములఁ దెచ్చుకొనుచున్నాము. ఇంద్రియభోగముల భుజించుట కుద్యమించుచు భుజించు శక్తినే కోలుపోవుచున్నాము. ఇది యంతయు మన కనులయెదుటనే జరుగుచున్నను మనము దానిని చూచుట లేదు. దీనికన్న నాశ్చర్యమేమున్నది!

ఈ భోజనపరిశోధనలను గుఱించి యింకను వ్రాయఁ దలఁతును. కావున వాని యుద్దేశమును, వాని గుఱించి నా విచారసరణిని పాఠకుల యెదుటికిఁ దెచ్చుటావశ్యక మాయెను.

౨౨

# కస్తూరబాయి ధైర్యము

కస్తూరబాయికి ముమ్మారులు ప్రాణముమీఁదికి వచ్చెను. ముమ్మారులును గృహవైద్యముచేతనే బ్రతికి బయటఁబడెను. మొదటిమారు ప్రాణముమీఁదికి వచ్చినపుడు సత్యాగ్రహము జరుగుచుండెను. ఆమెకు మాటిమాటికి రక్తస్రావము కలుగుచుండెను. డాక్టరు మిత్రుఁడొకఁడాపరేషను చేయింపుమని సలహా యిచ్చెను. కొంత గ్రంథము జరిగిన పిదప ఆమె ఆపరేషనుకు సమ్మతించెను. ఆమె శరీరము మిగుల క్షీణించి యుండెను. కావున డాక్టరు మత్తుమందీయక యాపరేషను గావించెను. దాననామెకపుడు కడుబాధ కలిగెను గాని యామె పలుధైర్యముతో నోర్చుకొనెను. ఆ యోరిమి చూడఁగా నాకాశ్చర్యము కలిగెను. ఆపరేషను నిర్విఘ్నముగా నెఱవేఱెను. డాక్టరును, వారి ధర్మపత్నియు కస్తూరబాయికి మిగుల నుపచారము చేసిరి.

ఇది డర్బనులో. రెండు మూఁడు దినములు గడచిన పిదప డాక్టరు 'ఇఁక భయము లేదు, మీరు జోహాన్సుబర్గు వెళ్లవచ్చును' అని మాకు సెలవొసఁగెను. మేము వెళ్లితిమి. కాని కొలఁదినాళ్లకే 'కస్తూరబాయి యారోగ్యము సరిగా లేదు, మంచముమీఁదనుండి లేవలేదు, ఒకతూరి సోఁకుగూడ లేదు' అని వార్త వచ్చెను. నా యనుజ్ఞ లేక ఆమెకు సారా గాని, మాంసము గాని మందులోఁ గాని, ఆహారములోఁ గాని కలిపి యీయఁగూడదని డాక్టరెఱుఁగు. అతఁడు నాకిటులు టెలిఫోనిచ్చెను—'తమభార్యకు మాంసరసముగాని, మద్యముగాని యిచ్చితీరవలయును. నాకనుజ్ఞ యీవలయును.' నేనిటులు సమాధానమిచ్చితిని—'నే ననుజ్ఞ యీఁజాలను. కస్తూరబాయి

స్వతంత్ర. ఆమె యిపు డడుగఁదగిన స్థితిలో నున్నచో నడిగి ఆమె తీసికొనఁగోరుచో ఇవ్వునది.'

'రోగుల నే నిట్టిమాట లడుగను. మీరు స్వయముగా రండు! నా చెప్పిన వస్తువుల నామె కిచ్చుటకు మీ రంగీకరింపనియెడల మీ భార్యప్రాణములకు నేను పూచీపడను' అని మరల డాక్టరు తెలిపెను.

ఇది విని నేను వెంటనే డర్బను చేరితిని. డాక్టరును కలిసికొనఁగా నతఁ డిటు లనెను—'నేను మాంసరస మిచ్చియే మీకు టెలిఫోను చేసితిని.'

'అయ్యా! మీరు దగాకోరులు!' అని నే నంటిని.

'వైద్యమునందు దగాలు గిగాలు లేవు. ఇట్టి సమయములలో రోగులను, వారి బంధువులనుగూడ దగాచేయుట పుణ్యమని మేమను కొందుము. ఎటులయినను రోగుల బ్రతికించుటయే మా ధర్మము.' అని డాక్టరు దిట్టముగా బదులాడెను.

దీనఁ గడు వగచితిని. కాని శాంతుఁడ నయియే యుంటిని. డాక్టరు నాకు నెచ్చెలి, సజ్జనుఁడు. ఇతఁడును, ఇతని భార్యయు మాకుఁ గడు నుపకరించిరి. ఇతని వర్తన సైరింప నెంచనైతిని.

'అయ్యా! ఇఁక దాఁచవలదు. ఇపు డేమి చేయవలయును? ఆమెయిచ్ఛ లేక ఆమెకు మాంస మీయ నొల్లను. మాంసము గొనకున్నఁ జచ్చిపోయినను మా కిష్టమే.'

'మీ వేదాంతము మాయింట సాగదు. మీభార్య మాయింట నున్నంతవట్టు మాంసముగాని, మఱి యేదిగాని యీవలసియున్న యెడల తప్పక యిత్తును. ఇటులు మీ కిష్టము గానిచో మీ భార్యను

మీరు తీసికొని పోవచ్చును. నాయింట నామె యీరీతిగా చచ్చుచుండఁగా నేఁ జూడఁజాలను.'

'నాభార్య నిపుడు తీసికొనిపోవలయు నని యామీ యాజ్ఞ ?'

'తీసికొని లేచిపొం డని నే నెన్నఁటికి ననఁజాలను. నాకు మఱొకటి అడ్డము పెట్టకుఁడు! మా దంపతుల మిరువురము మా శక్తి కొలఁది పరిచర్య చేయుదుము. మీరు వెనుక చింత యేమియు లేక వెళ్లవచ్చును. ఈ చిన్న విషయమే మీ మతి కెక్కనిచో మీరు మీభార్యను మాయింటినుండి తీసికొని వెళ్లుఁడని చెప్పక తప్పని పని యగుచున్నది.'

అపుడు నాకుమారుఁడుఁగూడ నున్నాఁ డనుకొందును. అతఁడును ఇందులకు సమ్మతింపలేదు.

పిదప నేను కస్తూరబాయికడ కరిగితిని. ఆమె కపుడించుకయు శక్తి లేదు. అపుడామె నేవిషయమునకుఁ గాని కదలించుటయు దుఃఖదాయకమే. అయినను ఆ విషయము చెప్పుట ధర్మమని తలఁచి చెప్పితిని. ఆమె దిట్టతనముతో నిట్లనెను—'నేను మాంసరసము పుచ్చుకొనను. మానవజన్మము దుర్లభము. మీ చేతులలో ప్రాణములు విడుతునేని పరవా లేదు; కాని ఈ శరీరమును అపవిత్రము చేసికొనను.'

నేను బోధింపవలసిన దంతయు బోధించితిని. మరియు, 'నీవు నా మతము ననుసరించి యుండవలసిన అక్కఱ లేదు. మన మెఱిఁగి యున్న పలువురు హిందువులు మద్యమాంసములు మందుగాఁ గైకొందురు.' అని చెప్పితిని. కాని ఆమె నామాటలకు లొఁగక—'నన్నచటికిఁ గొనిపొండు' అని పలికెను.

నేను వల్లె యంటిని. తీసికొని వెళ్లుట యనఁగనే మనస్సు కలుక్కుమనెను. అయినను పోవుటకే నిశ్చయించుకొంటిని. డాక్టరు గారికిని, వారి భార్యకును తీసికొని వెళ్లుదు నని చెప్పివైచితిని.

డాక్టరు అగ్గిరాముఁగారిట్లనెను

'ఎంత ఘాతుకుఁడవయ్యా! ఇట్టి దుస్థితిలో విషమించి యుండఁగని యామెతో ఇట్టి మాటలు చెప్పుటకు నీకు సిగ్గు వేయలేదటయ్యా? నీ భార్య యిపుడు తీసికొనిపోవఁ దగిన స్థితిలో లేదు. ఆమె నాఁటిరాత్రి మొత్తిశివి సైరింపలేదు. రస్తాలో ఆమె ప్రాణములు పోయినను పోవచ్చును; అదియు వింత కాదు. మొండిపట్టుపట్టిన నా మాట విననిచో మీకే తెలియవచ్చును. మందు మీయ నొల్లనిచో ఒక రాత్రి యేని మాయింట నుంచుటకు నాకు ధైర్యము చాలదు.'

చిటపట చిటపట వాన పడుచుండెను. స్టేషను దవ్వు. దరబనునుండి ఫినిక్సువఱకు రైలురస్తా. పిమ్మట ౨౪ మైళ్లు కాలి నడక. వెళ్ళఁగలమని ధైర్యము కావలసినంత యుండెను. ఈశ్వరుఁడన్ని విధముల కాపాడు నని నేను తలఁచితిని. ముందొకనిని ఫినిక్సు పంపితిని. ఫినిక్సులో నా కొక హేమక్ కలదు. హేమక్ అనఁగా గట్టిదారములతోఁ జేసిన డోలి. దీనిని వెదురువాసములకుఁ గట్టి రోగుల నందు కూరుచుండఁబెట్టి సుఖముగా మోసికొని పోవచ్చును. ఇట్టి హేమక్ ఒకటి, వేఁడిపాలసీసా ఒకటి, వేఁడినీళ్ళ సీసా యొకటి, మనుష్యు లాఱుగురు.—వీరిని దీసికొని ఫినిక్సుస్టేషనుకు రమ్మని వెస్టుగారికి కబురంపితిని.

రైలు వేళ యాయెను. రిక్షాను మాటాడితిని. అట్టి భయంకర స్థితిలో నందామె నెక్కించి బయలుదేఱఁదీసితిని.

నా కామెకు ధైర్యము కలిగింపఁ బని లేకపోఁగా ఆమెయే నాకు ధైర్యము కలిగించి, 'నా కేమియు భయము లేదు. మీ రూరక తొందరపడకుఁ' డనెను.

ఎముకలు, చర్మము తక్క మఱియేమియు లేదు. ఒక మెతుకేని లోపలికి పోదు. స్టేషను-ప్లాటుఫారము కడు పొడవు. బండి

యెక్కుటకు కడు దవ్వరుగవలయు. రిక్షా అంతవఱ్ఱు పోవదు. నేను బండిదనుక చేతులపై మోసికొనిపోతిని. ఫినిక్సుస్టేషనుకు అడ్డోలీ వచ్చెను. దానిలో ఆమెను సుఖముగా ఇంటివఱకు గొంపోయితిమి. అచట కేవలము జలచికిత్సచే నామెకు మెల్ల మెల్లగా జీవకలుగ నారంభించెను.

ఫినిక్సు వెళ్ళిన రెండుమూఁడు దినముల తరువాత ఒక స్వాముల వారు విజయంచేసిరి. నాబంధపట్టు విని నాపయి దయ పుట్టి మాకుఁ గొంచెము బోధచేయవచ్చిరి. అపుడు మణిలాలును, రామదాసును ఉన్నయటులు గుఱుతు. స్వాములవారు మాంసాహారము నిర్దోషమని బోధింపఁగడఁగిరి. మనుస్మృతిలోని శ్లోకములఁ జదివిరి. నాభార్య యెదుట ఈసంవాదము నడచుట నా కిష్టము లేదు. కాని వినయ బలమునఁ జెప్పనిచ్చితిని. మాంసాహారము చేయవచ్చునని చెప్పుటకు నాకు మనుస్మృతితో ఆవశ్యకత లేదు. నాకును ఆ శ్లోకములు తెలియును. అవి ప్రక్షిప్తము లనెడు పక్షముగూడ కలదని నే నెఱుఁగుదును. అవి ప్రక్షిప్తములు కాకున్నను ఆహారమునకు సంబంధించిన నామతము స్వతంత్రము. కస్తురబాయివిశ్వాసముచలము. ఆయమ యికురాలి శాస్త్రప్రమాణము లేమెఱుఁగును? ఆమెకు తండ్రితాతలకడ నుండి వచ్చు నాచారమే ధర్మము. ఇఁక కుర్రలకు తమతండ్రి విశ్వాసమే ధర్మము. కావున నా రా స్వాములవారితో వినోదించుచుఁ గూరుచుండిరి. తుదకు కస్తురబాయి యీ మాటలు పలికి యీ సంవాదమును ముగింపఁజేసెను:

'స్వామీ! మీరు వేయి చెప్పుఁడు, నేను మద్యమాంసములతో ఆరోగ్యవతిని కానొల్లను. ఇఁక నాకు తలనొప్పి వచ్చునటు లొనరింపకుఁడు. ఇం కేమేని కొఱఁత యున్నచో తమ రీ బిడ్డలను, తండ్రిని వెంట వేసికొని వెళ్ళి వాదింపుఁడు! నేను నా నిశ్చయమును మీ కెఱిఁగించియే యుంటినిగదా!'

## ఇంటిలో సత్యాగ్రహము

మొదటి జైలు-అనుభవము నాకు ౧౯౦౮ లో. అచట ఖైదీలు పాటింపవలసిన నియమములు చూచితిని. అవి సంయమముకలవాఁడు, లేక బ్రహ్మచారి స్వేచ్ఛాపూర్వకముగా పాలింపవలసిన నియమములవంటివని తెలిసికొంటిని. సూర్యుఁ డస్తమింపక ముందు అయిదుగంటలు కొట్టుసరికి ఖైదీలు భుజింపవలయును. ఖైదీలలో—భారతీయులకుఁ గాని, నీగ్రోలకుఁ గాని— కాఫీ తేనీరు లొసఁగఁబడవు. కూరలు మొదలగువానిలో ఉప్పు కలిపి వండరు. వలయుచో విడిగా నిత్తురు. రుచిగల వస్తువు నీయరు. 'ఖైదీలకు కూరలలో వేసికొను సంబారు కార మిప్పింపుఁ' డనియు, 'వండుచుండఁగనే ఉప్పు వేయింపుఁ' డనియు నేను జైలువైద్యుని వేఁడుకొనఁగా నతఁడు 'ఇష్టము వచ్చిన పదార్థముల నారగించుటకు మీ రిచటికి దయచేయలేదు. కూరలో సంబారు కారము లేనిచో ఆరోగ్యము చెడదు. మరియు ఉప్పు వంటక మగుచుండఁగా వేసినను, వంటక మయినపిదప కలుపుకొనినను, ఆరోగ్యమున తేడా లేదు' అని సమాధానము చెప్పెను.

తుదకెంతో కొట్టుకొనిన పిదప భోజనమున కొంత మార్పు చేయించుకొనఁగలిగితిమి. కేవలము సంయమదృష్టితోఁ జూచునెడల నీ నిషేధములు రెండును మంచివి. ఒకరియాజ్ఞచే నియమమును పాలింపవలసి వచ్చునేని దాన ఫలము కలుగదు. కాని స్వేచ్ఛచే నియమమును పాలించుచో దానఁ జాల మేలు కలుగును. కావుననే నేను జైలునుండి రాఁగానే ఈ రెండు నియమములను పెట్టుకొంటిని. చాల

పట్టు నేనీరు త్రావ మానితిని. ప్రొద్దు గ్రుంకకముందే భుజింప నెంచ లిడితిని. ఈరెండును నేఁడు స్వాభావికము లయిపోయెను.

ఉప్పునుగూడ పరిత్యజింపవలసిన ప్రసక్తి యొకటి సంభవించెను. ఈ నియమ మించుమించు పదియేండ్లపాటుండెను. 'మనుజునకు లవణ మావశ్యకము కాదు. మరియు ఆరోగ్యమును గుఱించియు ఉప్పు తిన కుండుట మేలు' అని నేను కొన్ని ఆహారగ్రంథములలోఁ జదివి యుంటిని. దీనివలన బ్రహ్మచారికిఁ గూడ మేలు కలుగు నని నా కల్పన పరుగులెత్తెను. బలము లేనివాఁడు పప్పు తినరా దని చదివితిని. అను భవమువలనఁ దెలిసికొంటిని. కాని అపుడు ఈ రెంటిని విడువలేక పోయితిని. ఏల యందురా, ఆ రెండును నా కిష్టదేవతలు.

ఆపరేషను జరిగిన పిదప కస్తూరబాయికి రక్తస్రావము కొంచె మాఁగినను, కొన్నాళ్లకు మరల కాఁబొడఁగెను. ఏమి చేసినను ఆఁగ లేదు. జలచికిత్స వ్యర్థ మాయెను. నా యీ వైద్యమునం దామెకు నమ్మిక లేదు గాని దానితోపాటు తిరస్కారము మాత్రము లేదు. కాని, ఇంకొక మందు పుచ్చుకొమ్మందునా, మందు పుచ్చుకొన వలెనను పట్టుదల లేదు. నా చేయఁగల వైద్యములవలన ప్రయోజనము కలుగని పిదప ఉప్పుఁబప్పుల మానివేయు మని చెప్పితిని. నే నెంత చెప్పినను, ఎన్ని ప్రమాణములు చూపినను ఆమె యియ్యకొనలేదు. తుద కొకనాఁడు 'ఉప్పుఁ బప్పుల మాను మని మీ కెవరేని చెప్పుచో మీరును మానలేరు' అని యామె నాతో పంతమాడెను. ఈ పలుకువలన కష్టము కలిగెను గాని వెంటనే హర్షమును గలిగెను. హర్ష మేల యందురా? నా ప్రేమ నామెకుఁ జూపించుట కది పట్టు. ఈ హర్షముతో నే నామె కిటు లంటి— 'నీ పొరెదవు! నాకు జబ్బు వచ్చి, వైద్యుఁడు ఉప్పుఁబప్పుల మాను

మని చెప్పవేని వెంటనే మానఁగలను. కాని వైద్యుఁడు చెప్పనేల? నీ మాట చొప్పున ఉప్పుఁబప్పుల నేఁటినుండి ఒకయేఁడాది వఱకు విడిచి వయిచితిని. నీవు విడువుము! లేక విడువకుము! నే నిదే విడిచి వయిచితిని.'

ఆమెకు పశ్చాత్తాపము కలిగెను. ఆమె యిటులు గోల పెట్టెను—'నన్ను క్షమింపుఁడు! మీస్వభావము నెఱిఁగియుండియు మాట జాఱితిని. నే నిఁక నుప్పుఁబప్పుల మానెదను. మీరెట్టి ప్రతిజ్ఞ సైచికొనకుఁడు! నాపై నింత కష్టము వలదు.'

నే నిటు లంటి—'నీ కీ యుప్పుఁబప్పుల మానితివేని చాల మేలు కలుగుటకు సందియము లేదు. నే నొకతూరి ఒట్టు పెట్టుకొంటినా మఱి మానుట లేదుకదా! నాకును దీన మే లొదవఁగలదు. మనుజుఁ డేకారణముననేని సంయమ మొనరించినచో దాన మేలే కలుగును. కావున నామాట కిఁక పట్టు పట్టకుము. ఏలన నాకిది పరీక్షగ నుండును. నీనిశ్చయమునకును తోడుగ నుండును.' నే నింత చెప్పిన యంత నన్నిఁక మాటాడించు నంత పని లేకపోయెను. 'మీరు పెంకెలలో పెంకెలు. ఒకరి మాట వినుట మీచదువులో లేదు' అని అంగలార్చి యూరకుండెను.

ఈ విషయమును నేను సత్యాగ్రహమున నొక యంశముగా పరిగణింతును. మరియు నాజీవితమున జరిగిన చక్కని ఘటనలలో నిదియు నొకటిగా దీనిని గుఱుతుదెచ్చికొందును.

పిదప కస్తూరిబాయికి ఆరోగ్యము కలుగఁ దొడఁగెను. ఉప్పుఁబప్పుల మానుటవలననో, దీన భోజనములోఁ గలిగిన కొలఁది గొప్ప మార్పులవలననో, ఇతరనియమములఁ బరిపాలింపఁజేయుటకు నా తీసి

కొనిన జాగ్రత్తవలననో, ఈ శపథముచేఁ గలిగిన మానసోల్లాసము వలననో ఆరోగ్యము కలిగెను,—గాని వీనిలో నేది కారణమో, ఎంతవఱకు కారణమో నేఁ జెప్పఁజాలను. మెల్ల మెల్లగా కస్తూరబాయి ఒడలుచేయఁదొడఁగెను. రక్తస్రావ మాఁగిపోయెను. నాకు 'వైద్యనాగాజు' అను బిరుదు వచ్చెను.

ఈ రెంటిని నిగ్రహించుటవలన నాకుఁగూడ మేలు కలిగెను. విడిచినపిదప నుప్పుఁబప్పుల కోరికయు నాకడకు రాలేదు. ఒక సంవత్సరము పరుగెత్తుకొనిపోయెను. దీన నింద్రియముల కెక్కుడు శాంతి కలిగినటులుఁ గోచరించెను. మరియు సంయమముదెస మనసు మరులుకొనెను. ఏఁడాది దాఁటు పిదప దేశమునకు తిరిగివచ్చినను చాల నాళ్ళవఱకును ఈ నియమ మాచందముననే యుండెను. ౧౯౧౪ సంవత్సరము నేను సీమలో నొకతూరియే ఉప్పుఁ బప్పులఁ దింటిని. తినికని, పిమ్మట దేశమునకు వచ్చినపిదప నీ రెండు ద్రవ్యములను తినుట మొదలిడుటకును గల కారణములను ముందు తెలిపెదను.

నేను దక్షిణ-ఆఫ్రికాలో నామిత్రులు కొందఱచే నీ యుప్పుఁ బప్పులఁ దినుట మానిపించి చూచితిని. దానఁ జాల మేలు చేకూరెను. ఈ ద్రవ్యములయెడ వైద్యమున రెండు మతములు కలవు. కాని సంయమమునకు ఈ రెంటిని విడనాడినచో చాల మేలు కలుగునని చెప్పుటలో సందియ మేమియు లేదు. భోగికిని, సంయమికిని తినుబండము వేఱు, వారి త్రోవలు వేఱు. బ్రహ్మచర్యమును పరిపాలింపఁ దలఁచుకొను వారు భోగుల జీవనము నలవాటు చేసికొనినచో కడుఁజిక్కులపా లగుదురు. ఇంతియ కాక బ్రహ్మచర్య మశక్యమనియు ననిపించును,

# 30

## సంయమము

భోజనమునందలి కొన్ని మార్పులకు కస్తూరిబాయి జబ్బు కారణ మని క్రిందటి ప్రకరణమునఁ జెప్పఁబడెను. కాని యిపుడు ప్రతిదినమును మార్పులకుఁ గారణము బ్రహ్మచర్యము.

మొదటి మార్పు పాలను మానివైచుట. పాలు ఇంద్రియ వికారముల నెక్కువచేయునని తొలుదొలుత నేను రాయచంద్‌భాయి గారివలన వింటిని. ఆహారమునకు సంబంధించిన కొన్ని ఇంగ్లీషు గ్రంథములు చదువుటవలన నీయభిప్రాయము దృఢమాయెను. కాని బ్రహ్మచర్యవ్రత మవలంబింపనంతవఱకు పాలను పరిత్యజించు నిశ్చయమునకు రాఁజాల నయితిని. శరీరరక్షణకు పాలుండి తీర నక్కఱ లేదని నేను లోఁగడనే యెఱిఁగికొనియుంటినిగాని పాలు వడిగా విడనాడ వీలయిన వస్తువా! ఇంద్రియదమనమునకు పాలు విడనాడుట మే లను సంగతి ఒక నాఁటికంటె మఱియొక నాఁడు నాకు తెలిసి వచ్చుచుండఁగా, ఆవులు కలవారును, గేదెలు కలవారును ఆవులకును, గేదెలకును జేయు హింసను దెలుపు కొన్ని గ్రంథములు కలకత్తానుండి దిగెను. ఆ గ్రంథములు చేసిన పని కడుఁ జమత్కారము. నే నా విషయమును కేలన్‌బేక్ గారితోఁ జర్చించితిని.

సత్యాగ్రహేతిహాసమున కేలన్‌బెకుగారిని గూర్చి వ్రాసియుంటిని. వెనుక నొక ప్రకరణమున వీరిని దడవియు నుంటిని. అయినను వీరినిగుఱించి మఱి రెండు మాటలు చెప్పవలయును. నాకు వీరిచెలిమి అనాయాసముగ లభించెను. వీరు ఖానుగారికి మిత్రులు. వీరి లోలోపల వైరాగ్యము కలదని ఖానుగారు పసిపట్టిరి. కావున నే

వీరికిని, నాకును ఖానుగారు పరిచయము కలుగఁజేసియుండురు. నాకు వీరితో పరిచితి యొదవిన రోజులలో వీరిచేయు రాజవ్యయమును గాంచి నేను కను లెగురవేయుచుండు వాఁడను. అయినను మాయొదటి సమావేశమున వీరు నన్ను ధర్మమును (తత్త్వమును) గురించి ప్రశ్నించిరి. ఆ సంభాషణలో బుద్ధభగవానుని త్యాగమునుగూర్చి రాఁదగిన ప్రశ్న వచ్చెను. నాఁటినుండి మాచెలిమి చిలవలు పలవలు పెట్టెను. మదిలో నిక్కము చేసికొని నే నేపని చేయఁ దొడఁగుదునో ఆపనిని తానుగూడ జేయునంతవఱకు అతఁడు నాలో నేకీభవించెను. అతఁ డప్పుడేకాకి. ఇంటియద్దె యటుండ నెలకు ౧,౨౦౦ రూపాయలు అతనికి ఖర్చగుచుండెను. తుదకు తుదకు ౧౨౦ రూకలతో సరిపెట్టుకొని పొదుపు నేర్చికొనెను. సంసారమును ఎత్తివైచి జైలులోఁబడి నేను తిరిగివచ్చిన తరువాత మే మిరువురమును కలిసి ఒకయింట నుంటిమి. మే మపుడు కావలసినదానికంటె కడు తక్కువ ఖర్చుతో జీవనము వెళ్ళఁదీసితిమి.

ఆరోజులలో నే పాలనుగూర్చి మాకు చర్చ జరిగెను. మి. కేలన్ బేక్ : 'మనము పాలు ఇంత పాడైన వనుకొనుచు ఏల వదలివేయరాదు ? పాలు లేకున్న ఏమి మునిఁగిపోవును ?' అని యనెను. వీరి యభిప్రాయమునకు నాకానందాశ్చర్యములు కలిగెను. నే నీమాటకు స్వాగత మొసఁగితిని. మే మిరువురమును టాల్‌స్టాయ్-ఫారమునందు క్షణమున నే క్షీరత్యాగము కావించితిమి. ఇది ౧౯౧౨వ సాలునఁ.

కాని నే నీ త్యాగముతో శాంతింప నయితిని. పాలు వదలిన కొన్నాళ్ళకే కేవలము పండ్లు దిని యుండ నిశ్చయించుకొంటిని. అవియు చవుకపాటివి. నిఱు పేదలలో నిఱుపేదలమై వారితోపాటు జీవనము చేయుట మాకోరిక.

ఫలాహారము చాల సులువని తెలిసెను. పొయి వేయఁ బని లేదు. పచ్చి వేఱుసెనగలు, అరఁటులు, ఖర్జూరము, ఆలివునూనె—ఇవి మాకు మామూలు ఆహారద్రవ్యములు.

బ్రహ్మచర్యమును పరిపాలింపఁ దలఁచుకొనువారి కొకటి చెప్ప వలయును. ఆహారోపవాసములతో బ్రహ్మచర్యమునకు దగ్గఱి చుట్టఱిక మున్న దని చెప్పుచువచ్చుచున్నాను. అయినను దీనికి ముఖ్యాధారము మనస్సు అని యరయునది. మలినమగు మనస్సు ఉపవాసముచే శుద్ధి నొందఁజాలదు. దీని శుద్ధికి ఆహారమును ఉపకరింపదు. మనోమాలిన్యము విచారముచేత, ఈశ్వరధ్యానముచేత, తుద కీశ్వరానుగ్రహముచేతనే క్షాళిత మగును. మనస్సునకును, శరీరమునకును కడుఁ జుట్టఱికము కలదు. మకిల యగు మనస్సు మకిలతిండ్లకే మఱులుకొనును. మకిలమనస్సు పలుతెగల చవులకును, భోగములకును మారాముచేయును. తిరిగి యీ తినుబండములయు, భోగములయు గుణము మనసుపయిం బని చేయును. కావున ఆహార నియమమునకును, ఉపవాసమునకును ఆవశ్యకత కానిపించుచున్నది. వికారయుక్తమగు మనస్సు శరీరమును, ఇంద్రియములను తన వశమున నుంచుకొనుటకు బదులు శరీరేంద్రియములకు వశమై నడచుచుండును. ఈ కారణముచేఁ గూడ శరీరమున కొక యాహారమర్యాద యుండవలయును. ఆ యాహారము శుద్ధముగ నుండవలయును. ఇంచుకయుం వికారము * కలిగించునదిగా నుండరాదు. మఱియు పైఁ జెప్పిన యుపవాసము గూడ నావశ్యకము. సంయమికి ఆహారనియమములతోఁగాని ఉపవాసములతోఁగాని ఇసుమంతయు ప్రయోజనము లే దనువారు, ఆహారనియమములతోడనే, ఉపవాసములతోడనే ప్రయోజనము కల దని వాదించువారితోపాటు తప్పుత్రోవ నడచువారే యగుచున్నారు. సంయమికి ఈరెండును చాల సాయము చేయఁగల వని నా కనుభవము. వీని సాయము లేక మనసులోని వికారము లడఁగుట అసంభవము.

* వికారము కలిగింపనిది=రజస్సును, తమస్సును ప్రకోపింపఁజేయనిది : Non-Stimulating—అను.

# ౩౧

## ఉపవాసము

పాలు, ధాన్యములు విడనాడి ఫలాహారము చేసి చూచు రోజు లలో, సంయమముకొఱకు ఉపవాసమునుగూడ నారంభించితిని. దీనికి కెలన్బెకుగారు నాతోఁ జోడు. తొలుత నా యుపవాసము ఆరోగ్యముకొఱకు. దేహదమనమున కుపవాస మావశ్యక మనునది యొక మిత్రునివలనఁ దెలిసికొంటిని. వైష్ణవ కుటుంబమున జన్మమెత్తి నందువలనను, మాయమ్మ కఠినవ్రతముల నొనరించువ దగుటవలనను ఏకాదశీవ్రతము మొదలగువానిని నేను ఇండియాలో ననుష్ఠించి యుంటిని గాని యవి మాయమ్మను జూచి నేర్చికొనినవో, లేక మా తలి దండ్రుల సంతుష్టికొఱకు అనుష్ఠింపఁబడినవో. ఇట్టి వ్రతానుష్ఠానముల వలన లాభ ముండు నని నే ననుకొనను లేదు, విశ్వసింపను లేదు. కాని నే నామిత్రుని జూచి బ్రహ్మచర్యవ్రతమున కుపయోగముగా నతని ననుకరింపఁ దొడఁగి ఏకాదశుల నుపవసింప నిశ్చయించుకొంటిని. ఏకాదశినాఁడు పాలు పండ్లు తిని వ్రతము పాలించితి మనుకొనుట సామాన్యరీతి. నే నిట్టివ్రతమును ప్రతిదినమును పరిపాలించుచునే యుంటిని. కావున నీరు త్రావు హక్కు మిగిల్చికొని పూర్ణోపవాస మొనరింప నారంభించితిని.

ఆ యారంభమునందే శ్రావణమాస మారంభించెను. ఆ సంవత్సర మున రంజానుపండువును, శ్రావణమాసమును కలిసెను. గాంధీకుటుంబ మిటు వైష్ణవవ్రతములను, అటు శైవవ్రతములను గూడఁ జేయుచుం డును. ఇటు విష్ణ్వాలయములకు వెళ్లుచుండును, అటు శివాలయముల కును వెళ్లుచుండును. శ్రావణమాసమున కుటుంబములో నెవరో

రొకయు ప్రదోష ముండుచునే* యుందురు. అటులే నేనును ఈ శ్రావణమున ప్రదోషవ్రతము చేయ నిశ్చయించితిని.

ఈ గొప్ప ప్రయోగముల యారంభము టాల్‌స్టాయి-ఆశ్రమములో. సత్యాగ్రహపుఁ గయ్యము పొడిచి జెయిలుసాలలోఁ బడినవారి కుటుంబములతో నేనును, కేలన్‌బేకుగారును అచట నుంటిమి. అచట బాలకులును, నవయువకులును గలరు. వారలకుఁ గాను బడి యొకటి పెట్టితిమి. ఈ నవయువకులలో నలుగు రైదుగురు ముసలమానులు గలరు. ఇస్లాము ధర్మపరిపాలనమున తోడుపడుచు నేను వారి కుత్తేజనము కలిగించుచుంటిని. నమాజువగైరాలు సరిగా చేయించుచుంటిని. ఆశ్రమమున పారసీకులును, క్రైస్తవులుఁ గూడఁ గలరు. ‘ఎవరి ధర్మమును వా రనుష్ఠింపవలెను. ఇతరు లది జరుగునటులు చూడవలెను’ అని యందఱకును నియమ ముండెను. కావున రోజా జరుపుఁ డని ముసలమానులకు ఉత్తేజనము కలిగించితిని. నేను ప్రదోష ముండుచునేయుంటిని. మరియు ముసలమానులకు సాయము చేయవలసినదని హిందువులకును, పారసీకులకును, క్రైస్తవులకును సలహా యిచ్చితిని. సంయమపాలనమునం దందఱకును సాయము చేయుట మంచి పని యని తెలిపితిని. ఆశ్రమవాసులలో పలువురు నామాట నియ్యకొనిరి. హిందువులును, పారసీకులును ముసలమానులను సంపూర్ణముగా ననుకరింపలేదు. అట్టి యావశ్యకతయు లేదు. ముసలమానులు సూర్యాస్తమయముదాఁకఁ దిండికి కనిపెట్టుకొని యుండవలసి వచ్చెడిది. మధ్యాహ్నముననే భోజనమును ముగించుకొనినవారు ముసలమానులకు వంటక మొనరించి యీయఁగలిగిరి. ఇంతియ కాక ముసలమానులు సరగహీ చేయుదురు. అనఁగా ప్రతిదినములలో

---

* నక్తములని యిచటి వాడుక.—అను.

సూర్యోదయింపక ముందు చీకటితో భుజింతురు. ఇతరు లీ విషయమున వీరికి తోడుపడరు. మరియు ముసలమానులు పగటఁగూడ నీరు గ్రోలరు. దప్పి యగుచో నితరులు గ్రోలుదురు.

ఈ యనుష్ఠానమువలన ఉపవాసమహాత్త్వమును, ఏకభోజనమహాత్త్వమును అందఱును దెలియనాయెను. ఒకరిపై నొకరికి సౌదార్యమును, ప్రేమయు వర్ధిల్లెను. ఆశ్రమమునం దాహారనియమము కలదు. కావున నాయాజ్ఞను శిరసావహించి నా మిత్రు లందఱును మాంసము వర్జించినందులకు నేను కృతజ్ఞుఁడను. రోజాదినములందు ముసలమానులకు మాంసత్యాగము కష్టమయినను దానిని లెక్కఁగొనక కష్ట మను మాటగూడ నాచెవిఁ బడకుండఁ జేసిరి. ఆశ్రమజీవనమునకు ప్రాతికూల్యము లేకుండ హిందూబాలకులు వీరికి రకరకముల వంటకములు చేసి పెట్టిరి.

నాయుపవాసమును గూర్చి వ్రాయుచు ఇచ్ఛాపూర్వకముగా విషయాంతరములోనికి దిగితిని. ఏలన ఈ చక్కని ప్రసంగమును మఱియొకచోట నుదాహరింపఁజాలను. మరియు ఈవిషయాంతరద్వారమున నాస్వభావ మొకటిగూడఁ జూపించితిని. మంచివని తోఁచు ప్రతి పనులయందును నాకుఁ గొందఱు సహచరుల మంచుకొనుచుందును. ఈ యేకభోజనము, ఈ యుపవాసమును వారికిఁ గ్రొత్త. కావున ప్రదోష మనియు, రంజాన్ అనియు వారిని లాఁగుకొని వచ్చితిని.

ఈరీతిగా సంయమవాతావరణ మనాయాసముగా నాశ్రమమునందు నెలకొనెను. మాతోపాటు ఆశ్రమవాసులును ఉపవాసములు, ఏకభోజనములును చేయఁజొచ్చిరి. దాన మేలు కలుగు ననియే నామతము. ఈ సంయమము వారి హృదయముల నెంత పని చేసెనో, ఉపవాసా

దులు విషయముల నవరోధించుట కెంత పని చేసెనో నేను నిశ్చయముగాఁ జెప్పఁజాలను. నాకుమాత్రము వానివలన ఆరోగ్యమును, ఇంద్రియదమనమును కలిగెను. 'ఉపవాసాదులవలన నెంతయును ప్రయోజనము కలిగితీరును' అని నా యుద్దేశము కాదు. ఇంద్రియదమనము నుద్దేశించి యుపవసించుచో విషయములు వినివర్తించును. మరియు, ఉపవాసాంతమునందు విషయేచ్ఛయు, స్వాదేచ్ఛయు తీవ్రమయినటులు నా మిత్రుల పలువుర యనుభవము. అనఁగా దీని కర్థమిది: ఉపవాసదినములలో విషయములను నరికట్టుటకును, స్వాదమును జయించుటకును సంతతోద్దేశము లేకున్నచో శుభఫల మింతఁ గూడదు. ఇట్టియుద్దేశము లేక, మనస్సును లగింపక, కట్టి కాదేరలో ఉపవాసమువలన విషయవేగ మాఁగు ననుకొనుట కల్ల. గీతలలోని రెండవ యధ్యాయమునందలి యీ శ్లోక మిప్పట్టున మిగుల వివరణయోగ్యము.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.

---

* 'యద్యపి విషయా విషయోపలక్షితాని విషయశబ్దవాచ్యాని ఇంద్రియాణి [అథవా విషయా ఏవ-పాఠా.] నిరాహారస్య అనాహ్రియమాణవిషయస్య, కాష్ఠతపసి స్థితస్య [కష్టే తపసి స్థితస్య-పాఠా.] మూర్ఖస్యాపి వినివర్తన్తే దేహినో దేహవతః.—భాష్య.

'విషయనిగ్రహము లేక [తాఁబేటివలె అవయవములను ముడుచుకొని] తపస్సులో కష్టైవలె నుండు మూర్ఖునకు ఇంద్రియములు [లేక విషయములు] ఉడుగును' అని శంకరులవారి యభిప్రాయము.

నిరాహారస్య అనఁగా అన్నము తినుట మానుకొనినవానికి అని వారి అభిప్రాయము కాదు. ఉపవసించినను కన్ను, మేను మొదలగు నింద్రియములకురూపు, సోఁకు మొదలగు విషయముల తాఁకు సంభవింపవచ్చును గాన

అనఁగా నుపవసించువానికి విషయములు (ఉపవాసమువలన) శమించును; కాని రసము పోదు. రసము ఈశ్వరదర్శనమున— ఈశ్వరప్రసాదమున—శమించును.

సంయమికి నుపవాసాదులు మార్గమునందు సాధనరూపముగా నావశ్యకములు. ఇంతియ కాదు. ఈ శారీరకోపవాసమునకు మానసికోపవాసముగూడఁ దోడుపడనిచో నది దంభముగా పరిణమించి హాని చేయు నని చెప్పవలసివచ్చును.

"నిరాహారస్య' అనఁగా లంఘనములు చేయువాని కని అర్థము చెప్పరాదు అని బెల్లంకొండ రామరాయలు—'న చాత్ర నిరాహారస్య త్యక్తభోజనస్య కృతలఙ్ఘనస్యేతి యావ దిత్యర్థ ఇతి శఙ్క్యమ్. ఆహారాభావేఽపి చక్షుస్త్వగాదిభీ రూపస్పర్శాదివిషయగ్రహణసంభవాన్న సర్వేన్ద్రియప్రతినివృత్తిః' భాష్యార్క ప్రకాశః.

వెనుక పుటలోని 'విషయా వినివర్తంతే' అను శ్లోకమునకు పైనున్న పంక్తులకును ఈ శాంకరాభిప్రాయమునకును చెలిమి యున్నది. అయినను నిరాహారపదమునకు అర్థవిశేష ముండుటచేతనే యీ భాష్యాదు లుదాహరింపఁబడినవి. —అనువాదకుఁడు.

# ౩౨

## పంతులుగారు

సత్యాగ్రహేతిహాసమునందు వ్రాయ వీ లొదవనివియు.
కొలఁదిగనే వ్రాయఁబడినవియు నగు విషయముల నీ ప్రకరణములలో వ్రాయుచున్నాను. పాఠకుల కీ మాట గుర్తున్నచో పూర్వాపరసంబంధము బోధపడఁగలదు.

టాల్ స్టాయి-ఆశ్రమమునందు బాలురకును, బాలికలకును విద్యావిషయమైన ఏర్పాటు చేయవలసి వచ్చెను. అందు హిందూ ముసలమాన క్రైస్తవ పారసీక బాలకులును, కొలఁదిమంది హిందూ బాలికలును ఉండిరి. వీరికి ప్రత్యేకించి ఒక పంతులుగారిని పెట్టుట అసంభవము. నా కది యనావశ్యక మనియు తోఁచెను. అసంభవ మేలనిన, తగిన హిందూస్తానీ-పంతులుగా రచట దొరకరు. ఒకవేళ దొరకినను ఈ కొలఁది జీతమునకు డరబనునుండి ౨౧ మైళ్లదూర మెవఁడు రాఁగలఁడు? మఱి మేము ధనములో మునిఁగి తేలుచుండుట లేదు. మరియు బయటనుండి ఆశ్రమములోనికి పంతులుగారిని రప్పించుట యనావశ్యక మనిపించెను. ఏలన నేఁటి చదువులరీతి [విద్యాప్రణాళి] నాకు బాగుండలేదు. కాని వాస్తవమగు రీతి నాకనుభవమున లేదు. తల్లిదండ్రు లర్హులగుదురేని వారి యనుపాజ్ఞలవలననే సరియగు చదువు వచ్చును. ఇది యాదర్శము. ఇట్టి యాదర్శస్థితిలో వెలుపటిసాయము తక్కువలోఁ దక్కువగా నుండఁదగును. టాల్‌స్టాయి-ఆశ్రమ మొక కుటుంబము. అందు నాది జనకస్థానము. కావున ఇందలి బాలకులకు మంచి జీవనమును నిర్మింపవలసిన భారమును యథాశక్తి శిరసావహింపవలయు ననుకొంటిని.

ఈ నా భావనలో చాల దోషములు కలవు. ఈబాలు రందఱును పుట్టిననాఁటనుండి నాకడ లేరు. అందఱును వేఱువేఱు వాతావరణములఁ బెరిఁగినవారు. పైఁగా వారివారి మతము లొక్కటి కావు. ఈబాలురయు, బాలికలయు స్థితిగతు లిట్టివి. నే నీ వీరికి పితృస్థానమున నుండి యెట్టులు న్యాయ మొనరింపఁగలను?

చదువులో మనశ్శిక్షకు, అనఁగా చరిత్రవికాసమునకు నే నగ్ర స్థాన మిత్తును. అట్టిచదువు ఎట్టి ప్రాయమువారికిఁగాని, యెట్టి వాతావరణమునఁ బెరిఁగినవారికిఁగాని చెప్పవచ్చును. కావున రేయుం బవళ్లు నే నీ బాలురలో బాలికలలో తండ్రివలె మెలఁగఁ జొచ్చితిని. అట్టి చదువునకు సచ్చరిత్రము పునాది. పునాది గట్టిదగుచో మిగులు విషయములు యథాసమయమునఁ దమంత తమకే తెలియును. లేదా, పరులసాయమునఁ దెలియఁగలవు.

మరియు భాషాజ్ఞానముగూడ కొలఁదియో గొప్పయో ఆవశ్యకమగుటచే కేలన్‌బేక్, ప్రాగజీ దేశాయీగారల సాయమున వీరిని చదువ వేసితిని.

నాకు శరీరశిక్ష ఆవశ్యకమని తెలియును గాని, అది వీరి కనాయాసముగనే లభించుచుండెను.

ఆశ్రమమున నౌకరులు లేరు. పాకీపని మొదలుకొని వంటవఱకును గల పనులన్నియు ఆశ్రమవాసులే చేసికొనుచుండిరి. ఆశ్రమమున ఫలవృక్షము లెక్కుడు. త్రవ్వటము పెట్టవలసియుండెను. ఆశ్రమమున కేలన్‌బేకుగారికి త్రవ్వట మనిన కులాసా. వారు స్వయముగా సరకారువారి ఆదర్శక్షేత్రములలో కొంతకాల ముండి క్షేత్రపాలన మంతయు నేర్చికొనియుండిరి. వంటపని లేనివా రెల్లరును చిన్నలనక

పెద్దలనక తోటపని చూచి తీరవలెను. వీరిలో పిల్లలవా లెక్కువ. గోతులు త్రవ్వుట, చెట్లునఱకుట, నఱికిన చెట్ల నీడ్చుట యీ మొదలగు పనులచే వీరి శరీరము గట్టిపడి బిగియుచు వచ్చెను. వీరి కీ పని యున్న నమితానందము. వీరి కీ పనివలన వేఱుగా కసరతుతోఁగాని, ఆటలతోఁగాని ఆవశ్యకత లేకపోయెడిది. వీరిలో కొందఱు విద్యార్థులు, ఒక్కొక్కప్పుడు అందఱునుగూడ, నీ పనికి రాక తప్పించుకొనిపోవుచుండెడివారు. ఒక్కొక్కప్పుడు ఆలస్యముగా వచ్చుచుండెడివారు. నేను వీరి కొంటెతనములను పలుమాఱులు ఉపేక్షించితిని. పలుమాఱులు నేను వీరి మెడలమీఁద కూర్చుండియే పని చేయించితిని. నా యీ కాఠిన్యమునకు వీ రియ్యకొని యనుకొననుగాని వీరు నాకెన్నఁడు నెదురాడి యున్నట్లు గుర్తు లేదు. పని యుండఁగా ఆటపాటలకు తిరుగాడుట మేలు కాదని నే నపుడు వారికి తెలియఁజెప్పుచుంటిని. అప్పుడది వారి మది కెక్కెడిదిగాని మఱుక్షణమునవే మఱపు తగిలెడిది. ఈరీతిగా పనిమాత్రము జరిగిపోవుచుండెడిది. దాన వారి శరీరమును బాగుపడెను.

ఆశ్రమమున జబ్బనుమాట లేదు. దీనికి అచటి మంచిగాలియు, మంచినీరును, ఆహారనియతియుఁగూడ కారణము లనఁదగును.

వీరికి ఈపాటుతోపాటు చేతిపనుల పాటుఁగూడ కలుప నెంచితిని. వీ రందఱును ఏదో యొక చేతిపని వచ్చియుండవలయు నని నాయభీష్టము. దీనికి కేలన్‌బేకుగారు ట్రేపిస్టు మొనాస్టరీకిఁ బోయి చెప్పులు కుట్టుపని నేర్చి వచ్చిరి. వారికడ నేను నేర్చితిని. నేర్చుకొనఁ గోరిన బాలకులకు నేను నేర్పితిని. కేలన్‌బేకుగారికి వడ్రము కొంచెము తెలియును. ఆశ్రమమున వడ్రంగ మెఱిఁగిన సహచరుఁ డొకఁడు గలఁడు. దాన వడ్రము నేర్పుటయు జరిగెను. మఱియు నించుమించుగా బాలకు లందఱును వంటచేయ నేర్చుకొనిరి.

ఈ పను లన్నియు నీ బాలకులకు సరిక్రొత్తలు. ఇవి నేర్చికొనవలసిన వని వీరు కలలోనయిన ననుకొనలేదు. దక్షిణ-ఆఫ్రికాలో హిందూస్థానీ బాలకులకు కేవలము అక్షరములు దిద్దుట దక్క వేఱు చదువు దొరకదు. ఉపాధ్యాయులు చేయక యే పనినేని బాలురచేఁ జేయింపరాదనియు, బాలురతోపాటు ఉపాధ్యాయుఁడుగూడఁ బనిచేయుచుండవలయు ననియు టాల్‌స్టాయి-ఆశ్రమమున నొక నియమము కలదు. దీన బాలురు సంతోషముతో నేర్చుకొనుట పొడఁగాను.

చరిత్రమును, భాషాజ్ఞానమునుగుఱించి ముందు ప్రకరణమున.

# 33

## అక్షరజ్ఞానము

గత ప్రకరణమున టాల్‌స్టాయి-ఆశ్రమమునందు శారీరకశిక్షణము, దాని కంగములుగా కొన్ని చేతిపనులను నేర్ప మొదలిడుటయు చూచియున్నాము. దీన నాకు సంపూర్ణముగా సంతుష్టి కలుగకున్నను కొలఁదియో గొప్పయో సాఫల్యము కలిగె ననవచ్చును. భాషాజ్ఞానము కలిగించుట కష్ట మనిపించెను. దానికిఁ దగు సామగ్రి నాకడ లేదు. కోరిక యెంతకలదో తీరిక యంత లేదు. అంతటి భాషాజ్ఞానమును నాకు లేదు. దిన మంతయు పని చేసిచేసి యలసిపోవుచుంటిని. కొంచెము డగ దీర్చుకొందు ననుకొను వేళ నీ చదువు వచ్చి పడుచుండెడిది. బోధించుటకు నేను కలకలలాడుచు నుండుటకు బదులు బలాత్కారముగా నిదుర నాఁపుకొనవలసి వచ్చెడిది. తోఁటపనుల తోడను, గృహకృత్యములతోడను ప్రాతఃకాలము తీరిపోవఁగా పండ్రెండు గంటల భోజన మయిన తరువాత పాఠశాలారంభము. దీని కంటె ననుకూలమగు వేళ లేదు. సాహిత్యపాఠములకు మూడు గంట లుపయోగించుచో నక్కడి కెక్కువలో నెక్కువ. హిందీ, అఱవము, గుజరాతీ, ఉర్దూ: ఈ భాషలలో పాఠములు. బాలకులకు మాతృభాషలోనే పాఠములు చెప్పవలయు నని నియమము పెట్టుకొంటిమి. అందఱకును ఇంగ్లీషు సామాన్యభాషగా నిర్ణయ మొనరించితిమి. గుజరాతీవారికిని, హిందీవారికిని సంస్కృతము నెఱపు. అందఱకును హిందీ ఆవశ్యకము. వీనిలో ఇతిహాసము, భూగోళము, గణితము అందఱకును నేర్పఁబడుచుండెను. అఱవము, ఉర్దూలు నేర్పుట నావంతు.

## ౩౩ అక్షరజ్ఞానము

నాకు వచ్చిన అఱవము ఓడలోను, జైళ్లలోను. 'పోపు' వ్రాసిన తమిళ-వాచకమును మించి నా కెక్కుడు జ్ఞానము లేదు. నా ఉర్దూలిపిజ్ఞానము ఓడలో నేర్చుకొనినది. మరియు నాకుం గల అరబ్బీ ఫారసీ పదజ్ఞానము ముసలమానుమిత్రుల పరిచితివలన నాకు లభ్యమయినది. నాకుంగల సంస్కృతజ్ఞానము, గుజరాతీజ్ఞానమును హైస్కూలులో కలిగినవే.

నేను నిర్వహింపవలసిన పనికి నా శక్తిసామర్థ్యము లిట్టివి. ఇఁక నాతోడివారుఁగూడ నాకు తమ్ములే. దేశభాషలయెడల నాకుం గల ప్రేమ, నాశిక్షాశక్తియెడ నాకుం గల విశ్వాసము, విద్యార్థుల తెలివితక్కువతనము, దీనికన్న నెక్కుడయిన వీరి యౌదార్యము ఇవన్నియుం గలిసి నాపనికి సాయము చేసెను.

ఈ యఱవ విద్యార్థులు దక్షిణ-ఆఫ్రికాయందే జన్మించినవారు. వారికి వచ్చిన అఱవము కడుం గొలంది. లిపి యసలే రాదు. వారికి అక్షరములు దిద్దంబెట్టుటయూ, వ్యాకరణమున సామాన్యజ్ఞానము కలిగించుటయుం జేయవలసి యుండెను. ఇది కడుం దేలిక. అఱవము మాటలాడుటలో వారు నన్ననాయాసముగా జయింపఁగలరు. ఇఁక వారికిఁ దెలియును. ఇంగ్లీషు రాని అఱవవారెవరేని నాతో మాటలాడ వచ్చినపుడు నాయీ శిష్యులు మాకు దుబాసు లగుచుండిరి. నేనిట్టులు సంతోషముగా నిర్వహింపఁ గలుగుచుంటిని; ఏలనఁగా, నేను విద్యార్థులముందు నా యజ్ఞానము నెన్నఁడును దాఁచుటకుఁ బ్రయత్నింపలేదు. నా కెంత తెలియునో నే నంతలోనే యుంటిని. కావునఁ నాకు ఓ యనిన ఢం రాకున్నను వారి ప్రేమకును, ఆదరమునకును పాత్రము గాకుండలేదు.

ఇంక ముసలమానులకు ఉర్దూ చెప్పుట ఇంతకన్న తేలిక యాయెను; ఏలయనఁగా వారికి లిపి తెలియును. కావున వారికి చదువునం దాదరము కలిగించుటయు, దస్తూరి చక్కఁజేయుటయు ను రెండే నా పనులు.

వీరందఱును లోఁగడ నిరక్షరులు. ఏ బడియందును జదివి యెఱిఁగినవారు గారు. వీరికిఁ జెప్పవలసినది కడుఁ దక్కువ యగు కాలములోనే నేఁ గనుఁగొంటిని. సోమరితనమును పోఁగొట్టుటయు, తమంతఁ దాము చదివికొనునటులు చూచుటయు, అభ్యాసమును పైనుండి కనిపట్టుచుండుటయు నను నీ పనులు నొప్పెవి. ఇటులు నే నింతటితో సంతృప్తిఁ జెందుటచే వేఱు వేఱు వయసు గల యీ బాలురలో, వేఱు వేఱు పాఠములు చదువు నీ బాలురలో నొక్క గదిలోఁ గూరుచుండి చదివించుకొనుచు వచ్చితిని.

పాఠ్యగ్రంథములనుగుఱించిన హడావుడి నలుదసలను వినఁబడుచుండును. నాకు వాని గరజు కనిపింపలేదు. అప్పటి కున్న పుస్తకములతో నేని మా కంతగా పని పట్టినట్లులేదు. బాలురమీఁద పెక్కు పుస్తకములు రుద్దుట యావశ్యకము గాదు. విద్యార్థులకు పాఠ్యగ్రంథ మేదని యన్నడిగినచో నుపాధ్యాయుఁడే యని యందును. నాగురువులు పుస్తకములలో నాచేతఁ జదివించిన విషయములు కడుఁ గొలఁదిగా నాకు గుఱుతున్నవి కాని వారు పుస్తకములలోఁగాక విడిగాఁ జెప్పిన చదువున్నదే అది నేఁటికిని గుఱుతున్నది. బాలురు కనులతో కన్న చెవులతో నెక్కువ గ్రహింతురు; అదియు అనాయాసముగా. నేను నా శిష్యులచే నే పుస్తకమేని తుట్టతుదిదాఁకఁ జదివించిన చందము లేదు. పలుతెఱఁగుల గ్రంథములఁ గొలదిగాఁ జదివి నేను జీర్ణము చేసికొనిన విషయములను నాభాషలో వారికిఁ జెప్పుచు వచ్చితిని.

అది నేఁటికిని వారి మెదడులకు పట్టియున్నది. పుస్తకములలోఁ జదివినది గుఱుతుంచుకొనుట వారికిఁ గష్టమాయెడిది. మరియు నేను ప్రత్యేకముగా వినిపించినది గుర్తుంచుకొని, విన్నది విన్న చందమున మరల నాకు వినిపించెడివారు. పుస్తకమునందు వీరి మనస్సు లగ్నమయ్యెడిది కాదు. అలయికచేఁ గాని, కొండొక కారణమునఁగాని నేను కనులు మలుపుకొనకుండ నుంటినేని, నా చెప్పునది నీరసముగా నుండకుండునేని, నా చెప్పిన, లేక వినిపించిన మాటలు వారు చెవులు నోరపెట్టుకొని వినెడివారు. మరియు రసమును గ్రహించెడివారు. అపుడు వారు చేయు శంకలవలన వారి గ్రహణశక్తి యించుమించుగా నాకుఁ దెలియవచ్చెడిది.

## ఆత్మశిక్ష

విద్యార్థుల శరీరమునకును, మనస్సునకును సాము నేర్పుటకంటె ఆత్మకు సంస్కారము కలిగించుటలో నేను మిగుల శ్రమ పడ వలసివచ్చెను. నే నిందుల కెక్కువ తత్త్వగ్రంథముల సాయము తీసి కొనలేదు. విద్యార్థులకు తమతమ మతముల మూలతత్త్వములను, తమ తమ మతముల సాధారణజ్ఞానమును ఉండితీరవలయునని నాయుద్దేశము. గాన ఇట్టి జ్ఞానము కలుగఁజేయుటకు నాశక్తికొలఁది పాటు పడితిని. కాని యిదియును మనశ్శిక్షకు నొక యంగ మని నాతలఁపు. ఒక ఆత్మశిక్షణ మొక ప్రత్యేకవిషయము. టాల్‌స్టాయి-ఆశ్రమమున బాలురకుఁ జదువు చెప్పమొదలిడక పూర్వమే నే నీ సంగతి గ్రహించితిని. ఆత్మకు వికాసము కలిగించుట యనఁగా చరిత్రనిర్మాణము కలిగించుట, ఈశ్వరజ్ఞానము కలిగించుట, ఆత్మజ్ఞాన మొదవఁ గలిగించుట. ఈ జ్ఞానము కలిగించుటకు బాలురకు కడు సాయము చేయ వలసియుండును. ఇట్టి జ్ఞానము గాక మిగిలిన జ్ఞానము లన్నియు వ్యర్థములు; ఇంతియ కాక హానికరములు—అని నామతము.

మనుష్యున కాత్మజ్ఞానము నాలవ యాశ్రమముననే కలుగు నని వాడుక. ఎవ రీ నాలవ యాశ్రమము వఱకును ఈ యమూల్యవస్తువును కడఁబెట్టుదురో వా రీయాత్మజ్ఞానమును పొందకపోఁగా, ముదిమిని, మరియు దీనికంటెను దయనీయమగు రెండవ బాల్యమును బొంది భూమికి భారమై పోవుచున్నారు. ఇది యెల్లెడల ననుభూతచరము. ౧౯౧౧-౧౨ సంవత్సరములలో ఈ నా యుద్దేశములను ఈ భాషలోఁ దెలుపఁ బొసఁగలేదు కాని నాఁటి కీయుద్దేశములు కలవని చెప్ప గలను.

ఆత్మకు సాము గఱపు టెట్లు? బాలురచే భజన చేయించితిని. వీరికి నీతిపుస్తకములను వినిపించితిని కాని దీన సంతుష్టి కలుగలేదు. బాలురతో నాకు సంబంధ మెక్కుడయినకొలఁదిని పుస్తకములవలన వీరికి ఈ జ్ఞానము కలిగింప వీలు లేదని తెలిసికొంటిని. సాము చేసి చూపియే సాము నేర్ప వీలగును. తనమనస్సుచే సాము చేయించియే ఇతరుల మనస్సుచే సాము చేయింప వీలగును. ఆ రీతిగనే తన యాత్మను సాము చేయించియే ఇతరుల ఆత్మచే సాము చేయింప వీలగును. గురుప్రవర్తనవలననే బాలకు లాత్మశిక్షణము నేర్చుకొందురు. కావుననే యుపాధ్యాయుఁ డెల్లప్పుడును—విద్యార్థులు తన కడ నుండుదురుగాక, లేకుండుదురుగాక—తాను జాగరూకుఁడయి యుండవలయును. ఉపాధ్యాయుఁడు లంకలో నుండుఁగాక, తన ప్రవర్తనమువలన తన శిష్యుల యాత్మలను మేలుకొలుపఁగలఁడు. నేను కల్లరినై నా శిష్యులను సత్యసంధులఁ జేయఁగలుగుట వట్టి బూటకము. పిఱికిపంద యగు గురువు తన శిష్యులకు పరాక్రమము నేర్పఁజాలఁడు. తప్పి చరించు గురువు శిష్యులకు సంయమ మెట్లు నేర్పఁగలఁడు? కావున నాకడ నుండు యువకులయు, యువతులయు ముందు నేనే యొక పదార్థపాఠ మయిపోవలయునని తెలిసికొంటిని. దీన నా శిష్యులే నాకు గురువు లయిరి. నేను నాకొఱకుఁ గాకున్నను నాకడ నుండు వీరికొఱకయినను మంచివాఁడనయి మంచితనమును కాపాడుకొనుచు నుండవలయునని తెలిసికొంటిని. టాల్‌స్టాయి-ఆశ్రమమునందలి పలువిధములగు నా సంయమములు ఈ యువకులకును, ఈ యువతులకును కృతజ్ఞములు.

ఆశ్రమమునం దొక కుర్రఁడు కలఁడు. అతఁడు కడు నల్లరివాఁడు. కల్లలమారి. ఎవరిని లెక్కగొనఁడు. మిగిలిన కుర్రలతో

కయ్యములకుఁ గాలు సాఁపును. ఒకనాఁ డతఁడు పట్టరాని యాగడము జేసెను. నా కేమియు తోఁచలేదు. ఏలయనిన నేను విద్యార్థులను దండించి యెఱుఁగను. కాని యపుడు నా కోపము మించిపోయెను. నే నతనికడ కరిగితిని. చెప్పితిని. అతఁడు వినలేదు. మరియు నన్నే తన వలలో వైచికొనఁ జూచెను. నాముందు రూలుకర్ర యొకటి పడి యుండెను. దాని నెత్తి యతని చేతిపైఁ గొట్టితిని. కొట్టుచుండఁగనే నాకు కంపమెత్తుకొనుచువచ్చెను. అతఁడును నాకంపమును దప్పక చూచియుండును. విద్యార్థుల కందఱకును ఇది యంతయు నిదివఱ కెన్నఁడు నెఱుఁగని క్రొత్తవింత. ఆ విద్యార్థి యేడ్చెను. క్షమింప మని వేఁడుకొనెను. అతఁడు తనకు దెబ్బలు తగిలినందుల కేడ్వలేదు; —ఇతఁ డించుమించు పదునేడేండ్ల ప్రాయము వాఁడు, చియ్యా పట్టిన మేనివాఁడు; తలఁచుకొనినచో నతఁడు బదులు తీర్చికొనఁ గలఁడు—కాని కొట్టుచుండఁగా నాకుఁ గలిగిన దుఃఖము నితఁడు తెలిసికొనెను. ఇటుపిమ్మట నతఁ డెన్నఁడును నా కవిధేయుఁడు కాలేదు. కానినే నటులు రూలుకర్రతోఁ గొట్టినందులకు నేఁటి వఱకు నేను పశ్చాత్తప్తుఁడ నగుచున్నాను. అతనిని కొట్టి నేను నా యాత్మను ప్రకటింపలేదు. మఱి? పశుత్వమును.

బాలకులను పట్టుకొని కొట్టి చదువు చెప్పుట యనిన నాకుఁ గిట్టదు. నాజీవిత మంతటిలో ఒకతూరిమాత్రమే నా కుమారు నొకని కొట్టినటులు గుర్తు. నేను రూళ్లకర్రతోఁ గొట్టుట యోగ్య మయిన పని యింతవఱకును నిశ్చయించుకొనఁ గలిగియుండలేదు. ఇది యూచిత మని చెప్పుటకు నా కింతవట్టును సందియమే. ఏలనఁగా దీనికి మూలము క్రోధము. మరియు దండనమే ఉద్దేశము. ఇందు తెలుప వలసినది కేవలము నాసంతాపము. ఆ సంతాపమునే నేను వెలిఁ బుచ్చి

యుంటి నేని ఈ దండ ముచిత మనుకొందును. కాని ఇందు రెండును గలిసియున్నవి. ఈ పని జరిగిన తరువాత విద్యార్థులకు మంచి సంస్కారము కలుగఁజేయుటకు నా కొక యుపాయము దొరకెను. ఆ యుపాయము నపుడుపయోగించినచో నెట్టి ఫల మొదఁగూడిదో యిప్పుడు చెప్పఁజాలను. ఆ కుఱ్ఱఁ డపుడే యా విషయమును మఱచి పోయెను. అతఁ డెంతగా బాగుపడినటులును నేఁ జెప్పఁజాలను. కాని ఈ ప్రసంగమువలన విద్యార్థులయెడ నుపాధ్యాయుని ధర్మమును గుఱించి విచారింపఁ జాల సామగ్రి దొరకెను. ఇది జరిగిన పిదపఁ గూడ బాలురలో నిట్టి దోషములు కానిపించెను గాని నే నెపుడును దండనీతిని ప్రయోగించి చూడలేదు. నే నిటు లాత్మజ్ఞానము కలుగఁ జేయఁ బ్రయత్నము చేయుచు నేనే యాత్మగుణముల నధికముగాఁ దెలిసికొనఁ గలిగితిని.

## ౩౮

## విష్యములో వద్దు

నా కెన్నఁడును తట్టని విషయ మొకటి కేలెన్‌బేకు గారు టాల్‌స్టాయి-ఆశ్రమమున నామనోపీథి కెక్కించిరి. ఆశ్రమము నందలి బాలురలోఁ గొంద ఱాకతాయలు, మందెగీండ్రును, తిరుగుఁబోతులును గలరు. నా మూవురు కుమారులును వీరితోఁ గూడియే యుండురు. మరియు నాకుర్రలతోపాటు మఱికొందఱు కుర్రలును వారితోఁ గలిసి తిరుగుచుండిరి. ఇటులు తిరుగుఁబోతులగు ఆ కుర్రలతో నా కుర్రలు కలిసిమెలసి యుండుట కేలెన్‌బేకు గారికి కష్టమనిపించె నొక నాఁడు 'మీకుర్రలను వారితోఁ గలియనిచ్చుట అంత మంచిదని నాకు తోఁచదు. ఆ కుర్రలతో మీకుర్రలను గలిపినందుల నేమి ఫలము? ఆతిరుగుఁబోతుల సావాసమువలన వీరికిమాత్రము [illegible] కాక వేఱేమి?' అనిరి.

ఈ విషయము విని నేను తికమక పడితినో లేదో జ్ఞప్తిలేదు కాని అపుడు నా చెప్పిన ఉత్తరము జ్ఞప్తియున్నది. నా ప్రత్యుత్తర మిది: 'నాకుమారులకును ఆ తిరుగుఁబోతులకును నాకు భేద మెటులు చేయఁ జెల్లును? వారికిని వీరికిని నేనే పూఁటకాఁపను. నేను రమ్మంటిని. ఆ కుర్రలు వచ్చియుండిరి. నేను కొన్ని రూక లిచ్చుచో వా రిపుడే జోహాన్సుబర్గుకు పోయి వెనుకటివలెనే సంచరించు చుందురు. ఈ బాలు రిచటికి వచ్చి యుండుట నాకు మెహరబానీ యని వారి తలిదండ్రు లెంచినచో నే నాశ్చర్యము పొందను. వా రిచటికి వచ్చి కష్టములు పడుచున్నారు. ఈ విషయమును మన మిరువురమును ఎఱుఁగుదుము. ఈయెడ నాచేయవలసిన పని నాకు

చక్కఁగాఁ గానవచ్చుచున్నది. వీరి నిచటనే యుంపవలయును. నాకుర్రలును వీరితో కలిసియే యుండవలయును. మరియు "మీ రా కుర్రలకంటె దొడ్డవారురా!" యని యిప్పటినుండియే నా కుమారులకు భేదబుద్ధిని గఱపుదురి మీ రందురా? ఇది వారి కుర్ర కెక్కుచో తప్పుదారిని బడఁగలరు. ఈ స్థితిలో నున్నచో వారికి మంచి శిక్షయు, మంచి చెడుగుల తెలివియు అనాయాసముగాఁ గలుగును. మరియు "వీరిలో నిజముగా నేదేని గుణ మున్నచో దాని ప్రభావము వారిపై ప్రసరింపఁగల"దని మన మేల యనుకొనరాదు? ఇంక నేమయిన నగుఁగాక! వారి నిటనుండి పంపివైవఁజాలను. నాకు నేదేని చెఱుపు గలుగుచో ననుభవింప సంసిద్ధుఁడను.'

కేలన్ జేకుగారు తల యూఁచిరి.

ఈ ప్రయోగమువలన చెడ్డ ఫలము కలిగె ననఁ జెల్లదు. దీన నా కుర్రల కెట్టి లోటును కలిగె నని నే ననుకొనను. మరియు మేలే పొందిరని నే నెఱిఁగితిని. 'మేము గొప్పవారము' అని యేమేని గర్వ మున్నచో నది వీరిని వదలిపెట్టెను. వీ రందఱితోడను గలసియుండుట నేర్చిరి. వీ రిందు పరీక్ష నిచ్చిరి.

తలిదండ్రులు పైనుండి కడు మెలకువతో కనిపట్టి సాఁకు చుండురేని మంచి పిల్లలును, చెడ్డ పిల్లలును ఒకచోటనే యుండుట వలనను, చదువుకొనుటవలనను మంచి పిల్లల కేమియు హాని కలుగదని దీనివలనను, ఇటువంటి మఱికొన్ని యనుభవములవలనను తెలిసికొంటిని. మనము పిల్లలను పెట్టెలోఁ బెట్టి తాళము వేసినచో మంచివా రగుదు రనియు, బయటికిఁ దీసినంతనే పాడయిపోవుదు రనియు నెట్టి నియమము నెచటను లేదు. పలు తెఱఁగుల బాలికలను, బాలురను ఒకచో నుంచి చదివించుట తలిదండ్రులయు, ఉపాధ్యాయులయు జాగ్రత్తకు నికషోపలము. వారు కంట వత్తి నిడికొని యుండవలయును.

# ౩౯

## ప్రాయశ్చిత్తరూపమగు ఉపవాసము

బాలురను, బాలికలను మంచి త్రోవలో నుంచి వారికి విద్య గఱపుట యెంత కష్టమయిన విషయమో దీని యనుభవము దినందినము వృద్ధి పొందెను. నేను వారి కుపాధ్యాయుఁడను, పాలకుఁడను అగుదునేని వారి మనస్సులోఁ బ్రవేశింపవలయును. వారి సుఖదుఃఖములలో పాలుగొనవలయును. వారి జీవనరహస్యములను విడఁబఱచి చెప్పవలయును. ఉబుకుచున్న వారి జీవనతరంగములను సరిగా పాలింపవలెను.

చెఱసాలనుండి కొందఱు సత్యాగ్రహులు విడువఁబడినతరువాత టాల్‌స్టాయి-ఆశ్రమమున కొలఁది జనులే యుండిరి. వారును ముఖ్యముగా ఫినిక్సువారే కావున నేను వారి నచటికిఁ బనిచితిని. నా కచట అగ్నిపరీక్ష జరిగెను. టాల్‌స్టాయి-ఆశ్రమమునుండి వారిని ఫినిక్సులో దిగఁబెట్టి నేను మరల జోహాన్సుబర్గునకు వెళ్లితిని. జోహాన్సుబర్గునందు కొలఁది రోజు లుంటిని. అపుడు ఆశ్రమమునం దిరువురికి భయంకరమగు పతనము కలిగె నని వింటిని. సత్యాగ్రహము వంటి మహాసంగ్రామ మెటనేని సఫలము కాలే దని వినినచో నా కంత యాఘాతము కలిగెడిది కాదుగాని యీ వార్త నాకు వజ్రప్రహార మాయెను. నాగుండియ లదిరెను. నాఁడే ఫినిక్సు రైలెక్కితిని. నేనును వత్తునని కేలన్‌బెకుగారు పట్టుపట్టిరి. దయనీయమగు నా స్థితి యతనికి గోచరించెను. నే నొంటిగా వెళ్లుట కతఁ డించుకయు నొప్పుకొనలేదు. ఈ పతనవార్త యతఁడు తెచ్చినదే.

దారిలో నాధర్మమును నే నెఱిఁగికొంటిని. పోనిండు, ఎఱిఁగికొంటినని యనుకొంటి ననుకొండు! తన రక్షణమున నున్న

## ౩౬ ప్రాయశ్చిత్తరూపమగు ఉపవాసము

వారి పతనమునం గొలందిరో గొప్పరో యంశమునకు రక్షకుండు గాని, శిక్షకుండు గాని పూంటకాపు లని నే ననుకొంటిని. ఈ ఘటనలో వాజవాబుదారి స్పష్టముగా అర్థమాయెను. నా భార్యయు వెంటనే నను మందలించెను. కాని విశ్వసించుట నా స్వభావము. కావున నే నీ మందలింపు నంతగా పాటింపలేదు. నే నా పతనమునకు సంపూర్ణమగు ప్రాయశ్చిత్తము చేయుదునేని ఆ పతితులు నా వ్యథను గ్రహింపం గలుగుదు రనియు, తమ దోషమును తా మెఱుంగంగలుగుదు రనియు, దీని లోంతు కొంచెము తెలియంగల దనియు నాకు తోంచెను. కావున ఏడునాళ్లు ఉపవాసమును, నాలుగునెలల పదియేనునాళ్ల పాటు ఏకభోజనమును చేయుదు నని వ్రతము గొంటిని. కేలెన్‌బేకు గారు నన్ను వారింపం బూనిరి గాని యది నిష్ఫలమాయెను. తుద కతం డీ ప్రాయశ్చిత్తము తగినదే యని యొప్పుకొని తానుగూడ నుపవసింతు నని పట్టుపట్టెను. అతని నిర్మలమగు ప్రేమను నేను నిరసింపం జాలకపోయితిని. ఇటులు నిశ్చయించినతరువాత నా గుండెల బరువు తగ్గెను. శాంతి కలిగెను. దోషులపైం గ్రోధము పోయి దయ గలిగెను.

ఇటులు గుండెలో బరువు తగ్గించుకొని ఫినిక్సు చేరితిని. బోగట్టాచేసి తెలిసికొనవలసిన సంగతులను దెలిసికొంటిని. నా యుపవాసమువలన నందఱకును కష్టము కలిగెను గాని దాన వాతావరణము శుద్ధమాయెను. పాపము చేయు టెంత భయంకరమో అది యెల్లరకును దెలిసెను. విద్యార్థులయు, విద్యార్థినులయుం దోడ నాకుం గల నెయ్యము మఱింత దృఢమును, సరళమును ఆయెను.

ఈ ఘటన జరిగిన కొలంది కాలమునకు దీనికి సంబంధించియే మరలం బదునాలుగునాళ్లుపవసింపవలసిన ప్రసంగము తటస్థించెను. దాని పరిణామము నే ననుకొన్నదానికన్న మిన్నగా జరిగెను.

శిష్యుల దోషము లన్నింటికిని గురువుగా రెల్లపుడును ఉపవాసములు చేయుచుం గూరుచుండవలసినదని నా యభిప్రాయము గాదు. కాని యిటువంటి కొన్ని విషయములలో ప్రాయశ్చిత్తరూపమయిన ఉపవాసములకు తప్పక స్థానము కలదని నా నమ్మిక. దీని

సరియయిన వివేకమును, అధికారమును వలయును. గురుశిష్యులకు పరస్ప రమగు ప్రేమబంధనము లేనిచో, శిష్యునిదోషము గురువునకు సరియగు వాఘాతము కలిగింపనిచో, గురువుపై శిష్యున కాదరము లేనిచో, నట్టియెడఁ జేయు నుపవాసము నిరర్థకము. మరియు నొకానొక పుడు హానికిఁగూడఁ బట్టు. ఈ యుపవాసములయెడలను, ఏకభోజన ములయెడలను శంక లుండుఁగాక! శిష్యుని దోషములలో కొంత యంశమునకు గురువు జవాబుదారీ కల దనుటలో లేశమును శంక లేదు.

ఈ రెండునాళ్ల ఉపవాసమును, ఈయేకభోజనమును మాకుఁ గష్ట మనిపింపలేదు. నే నాదినములలో నే పనిని మానలేదు. మంచమునను జేయలేదు. నే నీకాలమున కేవలము ఫలాహారము గొనియుంటిని. పదునాలుగునాళ్ల యుపవాసమున తుది భాగములో కఠిన మనిపించెను. ఆనాళ్లలో రామనామమునకుఁ గల చమత్కారము నే నెఱుఁగను. కష్టము సహించు సామర్థ్యమును నాకుఁ దక్కువ. ఉపవసించు దినములలో నే చందమున నేని నీరు కడుపారఁ గ్రోలవలయును. నా బాహ్యకళ నే నెఱుఁగను. ఈకారణమువలనను ఉపవాసము నాకుఁ గష్టమాయెను. మరియు మొందటి యుపవాసమును సుఖముగా, శాంతముగాఁ జేసితిని గాన నీ పదునాలుగునాళ్ల యుపవాసమున పైమఱచి యుంటిని. మొదటి యుపవాసమున నెల్లపుడును కూనీగారి కటిస్నానము లొనరించితిని. పద్నాల్గునాళ్ల యుపవాసమున మూఁడు నాలుగు నాళ్లు మాత్రము చేసి మానివయిచితిని. నీటిరుచి అసహ్యమాయెను. నీరు త్రావఁగనే ఓకర కలుగునటు లుండెను. దాన నీరు కడుఁ గొలఁదిగా త్రావితిని. దీన గొంతు ఎండెను. శరీరము క్షీణించెను. చివర చివరకు మెలమెల్లగనే మాటలాడఁ గలిగితిని. ఇటులయ్యు వ్రాఁతకు అక్కఱ కలిగినపుడు తుదినాఁటివఱకును వ్రాయింపఁ గలుగుచునే యుంటిని. రామాయణాదులను తుది వఱకును వినుచునే యుంటిని. కొన్ని ప్రశ్నలకు సమాధానము చెప్పుటకును, అవశ్యకములగు కొన్ని పనులు చేయుటకును సమర్థుఁడ నయియే యుంటిని.

# ౩౮
## గోఖలేగారిని కలియఁబోవుట

దక్షిణ-ఆఫ్రికాకు సంబంధించిన చాల విషయముల నిచట దిగఁబెట్టవలసి వచ్చుచున్నది. ౧౯౧౪వ సాలున సత్యాగ్రహసంగ్రామము ఆఁగిపోయెను. అపుడు గోఖలేగారు లండనుమీఁదుగా ఇండియాకు రమ్మని వార్తనంపిరి. జూలై నెలలో కస్తురబాయియు, కేలన్‌బేకుగారును, నేనును సీమకు పయనమయితిమి. సత్యాగ్రహసంగ్రామదినములలో నేను మూఁడవతరగతి బండ్లలోనే కూర్చుండి పయనము సేయ నారంభించితిని. కావున ఓడలో మూఁడవతరగతి టిక్కెట్టే కొంటిని. అచటి మూఁడవతరగతికిని, మన మూఁడవతరగతికిని చాల భేదము కలదు. మన మూఁడవతరగతి పెట్టెలలో కూర్చుండుటకును, పరుండుటకును తగిన సౌకర్య ముండ దనిన నిఁక పరిశుభ్రత మాట వేఱ చెప్పవలయునా? కాని మాయోడలో దీనికి విపరీతము. వలసినంత చోటు, వలసినంత స్వచ్ఛత. ఓడవారు మాకుఁ జాల సౌకర్యములు కలుగఁజేసిరి. ఇతరుల సంపర్కము లేకుండ మా కొక మఱుఁగుదొడ్డిని ప్రత్యేకించి తాళము వేసి తాళపుఁజెవులు మా కిచ్చిరి. మేము ఫలాహారుల మగుటచే మాకువలసిన పండ్ల నిమ్మని ఖజాంజీకి ఉత్తరు విచ్చిరి. మూఁడవతరగతి బాటసారులకు పండ్లు తక్కువగా నిత్తురు. ఆఱుఁబండ్లు* అసలే యీయరు. ఇది మామూలు. దీనికి విపరీతముగా మంచి సౌకర్యములతో సముద్రముపై మిగుల శాంతముగా ౧౮ దినములు గడిపితిమి.

ఈ యాత్రలోని కొన్ని విషయము లుదాహార్యములు. కేలన్‌బేకుగారికి దుర్భిణులమీఁద చాల షోకు. వారు వెలగల జో డొకటి

* ముగ్గి ఆఱినపండ్లు : అంగూరము మొ; Nuts-అను.

తమకడ నుంచుకొనిరి. దాని విషయమున మా కిరువురికిని కసాట్యాటము జరుగుచుండెను. 'మన ఆదర్శమా ప్రమితజీవితము; మన వస్తువులా మిగుల వెల గలవి: ఈ రెంటికి పొందిక యేపడు?' అని నే నను చుంటిని. క్రమక్రమముగా నొకనాఁ డిది రగడలోనికి దిగెను. మే మిరువురమును కేబిను కిటికీకడ నిలుచుంటిమి.

'ఈ జగడగొండిదానిని సముద్రములో పాఱవయిచి నేమి?' అని నే నంటి.

'తప్పక ఈ జగడాలమారిని పాఱవేయుఁడు!' అని వెంటనే కేలన్ బేకుగా రనిరి.

'చూడుఁ డిదిగోఁ బాఱవైచితిని' అని నే నంటిని.

'ఊఁ; నాకును సమ్మతమే' అని వడివడిగా కేలన్ బేకుగా రనిరి.

సరి, నేను దుర్బిణులను విసరి వయిచితిని. దాని వెల ఏ యేడు పౌనులో. కేలన్ బేకుగారికి దానఁగల మోహముకంటె దాని విలువ లొచ్చు. దీనికి కేలన్ బేకుగా రెన్నఁడును విచారింపలేదు. కేలన్ బేకుగారికిని, నాకును నడుమ పెక్కు అనుభవములు కలవు. వానిలో నమోనా కిది యొకటి.

మా కొండొంటఁ గల సంబంధములవలన ప్రతినాఁడును క్రొత్త విషయములు నేర్చికొనుచుంటిమి. ఏలన, మే మిరువురమును సత్యము ననుసరించి సంచరింపఁ బ్రయత్నము లొనరించుచు వచ్చుచుంటిమి. సత్యము ననుసరించుటవలనఁ గ్రోధము, స్వార్థము, ద్వేషము మొదలగు నవి సహజముగ తొలఁగి చనును; తొలఁగి పోవనిచో సత్యప్రాప్తి కలుగదు. రాగద్వేషాదులచే నిండిన మానవుఁడు సరళుఁడు కావచ్చును. వాక్సత్యమును పరిపాలింపవచ్చును. కాని వానికి శుద్ధసత్యప్రాప్తి

కలుగదు. శుద్ధసత్యమును శోధింప దొరఁకొనువాఁడు రాగము, ద్వేషము మొదలగు ద్వంద్వములనుండి ముక్తిఁ బడయవలయును.

ఉపవాస మయిన కొలఁదిదినములకే ఈపయనము చేసితిని. నాకు మరల వెనుకటి బలము రాలేదు. డెక్కుమీఁద అటు ఇటు నడచి తిన్నదాని నఱిగించుకొనఁ గడఁగుచుంటిని. నడచినకొలఁదిని పిక్కలలో నొప్పు లెక్కుడాయెను. సీమఁ జేరువఱకు నొప్పి తగ్గక పోఁగా మఱి కొంచె మెక్కుడాయెను. అచట డాక్టరు జీవరాజ మెహతాగారికడ కరిగితిని. ఉపవాసములను, ఈ నొప్పులను విని 'కొన్నాళ్లు విశ్రాంతి లేనిచో మీ కాళ్లు పడు నను భయము కలదు' అనియతఁడనెను. దీర్ఘోపవాసములు చేసినవారు వడిగా బలము పొందఁగలుగుటకు ఎక్కువగా తినెడి లోభమును మానుకొనవలయు నని యెఱిఁగితిని, ఉపవాసము లొనరించునాఁటికంటె మానుకొను నాఁడు ఎక్కువ మెలఁకువ గొనవలయును. మఱియు నొకానొకపు డెక్కువ నిగ్రహమును వలయును.

మదిరాసు వచ్చుసరికి 'మహాయుద్ధము నేఁడో రేపో మొగియు' నని తెలియవచ్చెను. ఇంగ్లీషుచానలులో ప్రవేశించుచుఁ బ్రవేశించుచు నుండఁగా యుద్ధము మొగియనే మొగిసె నని వింటిమి. మాకచట నాఁగిపోవలసివచ్చెను. నీటిలో ప్రతిచోటను రహస్యమార్గము లేర్పాటుచేయఁబడెను. దాన మేము సౌతాంప్టన్ చేరుసరికి ఒకటి రెణ్ణాళ్లాలస్యమాయెను. ౪వ ఆగస్టున యుద్ధారంభము. ౬వ ఆగస్టున మేము సీమలో దిగితిమి.

## ౩౮

## యుద్ధములో నా పాలు

సీమకు పోవఁగనే గోఖలేగారు పారిసులో దిగఁబడిపోయిరనియు, పారిసునకు రాకపోకలు నిలుపుచేయఁబడినవనియు, వారెపుడు వచ్చునదియుఁ జెప్ప వీలు లేదనియు తెలిసెను. గోఖలేగారు ఆరోగ్యముకొఱకు ఫ్రాన్సు వెళ్లియుండిరి. పోరు మొగియఁగనే వారి రాక కష్టము కలిగెను. వారెపుడు రాఁగలరో యదియు నేరికిని జెప్పఁ దరము కాదు.

ఈలోపుగా నా చేయవలసిన పని యేమి? ఈ యుద్ధమునెడ నా ధర్మ మేమి? జైలసాలలో నాకు సహచరుఁడును, సత్యాగ్రహియు నగు సోరాబజీ అడాజణియాగారు సీమలో బారిష్టరు చదువుచుండిరి. సత్యాగ్రహులలో నతఁ డెంచి వైచిన చేయి. కావున దక్షిణ—ఆఫ్రికాలో నా స్థాన మాక్రమించుటకుఁగాను ముందు ఇంగ్లండులో బారిష్టరు పరీక్ష యిచ్చుటకితఁడు పంపఁబడెను. డాక్టరు ప్రాణజీవన మెహతాగా రితనిని భరించుచుండిరి. నేను వీరితోడను, వీరినిబట్టి డాక్టరు ప్రాణజీవన మెహతాగారితోడను, మరియు నచటఁ జదువుచున్న వారితోడను ఆలోచించితిని. అపుడు సీమలో నున్న భారతీయుల నందఱను సమావేశపఱచి నా యుద్దేశములను వారికిఁ దెలిపితిని. సీమలో నున్న భారతీయు లీ సంగ్రామమున తమచేత నయిన సాయము తాము చేయవలయు నని నా యభిప్రాయము. ఆంగ్లేయవిద్యార్థులు తాము యుద్ధములోఁ బని చేయుదు మని ప్రకటించిరి. భారతీయులును వీరికిఁ దీసిపోఁగూడదని నా కోరిక. నా యీ యభిప్రాయములకు విరుద్ధముగా పలువు రీ సభలో వాదించిరి. 'ఆంగ్లేయులకును, మనకును ఏనుఁగునకును గుఱ్ఱమునకును గలంత యంతరము. ఒకఁడు దొర, ఒకఁడు

బంటు. అట్టిచో దొరకు అగద వచ్చినప్పుడు బంటు స్వేచ్ఛాపూర్వకముగా దొర కెటులు సాయము చేయ వలనుపడును! మరియు ఆ బంటు తన బంటుతనమునుండి తప్పించుకొనఁ దలఁచునేని తన దొర యాపదను తన మేలుగాఁ జేకొని తప్పించుకొనిపోవుటకు ప్రయత్నించుట పాడి గాదా? అప్పుడీ వాదము నాకు గుటకపడునా? తెల్లవారికిని నల్లవారికిని పెల్లంతరము కలదని నాకుఁ దెలియును గాని మన గతి యింత యధోగతిగా నున్నదని నమ్మిక లేదు. అప్పుడు నానమ్మిక యేమనియా,—తెల్లవారి యేలుబడి కొంచెము మంచిదే కాని కొంద అధికారుల దోషమిం పెక్కువనియు, ఈ దోషమును గూడఁ బ్రేమచే మనము పోకార్పఁగల మనియును. మరియు తెల్లవారి సాయమున మనము మన స్థితిని బాగుపఱచుకొనఁ గోరుదుమేని వారి యాపద గడచఁబెట్టి మన స్థితిని చక్కఁబెట్టుకొనునది యని నామతము. రాజ్యపద్ధతి దోషభూయిష్ఠమని అప్పుడనే ననుకొనినను ఇప్పు డనుకొను నంత గాదు. నేఁడు నాకు రాజ్యపద్ధతిపై నమ్మిక యెగిరిపోయెను. తెల్లదొరతనమునకు నేను సాయము చేయఁజాలను. ఈరీతిగా వారికి రాజ్యపద్ధతిపై నమ్మిక మానాఁటికే పోయెను. ఇంతియు కాక తెల్ల యధికారులయెడలను నమ్మకము పోయెను. ఇట్టి స్థితియందు వారెటులు సాయము చేయఁగలరు?

ప్రజల హక్కులను నిర్భయముగాఁ బ్రకటించి పరిపాలనమునందు సంస్కరణములను బడయుటకు అదియే అదను అని వారి యభిప్రాయము. ఇంగ్లీషువారికి వచ్చిన యాపత్కాలమునందు మనహక్కులను బ్రకటించుట ఉచితమని నాకు తోఁపలేదు. మరియు యుద్ధము జరుగుచున్నంతవరకు మన హక్కులను బ్రకటించుట నాఁపియుంచుకొను సంయమనమే మన సభ్యతయు, దీర్ఘదృష్టియుఁ గలదని నేను నమ్మితిని. కావున నేను నామాటమీఁదనే నిలువఁబడి స్వయంసేవ

సులుగా సేవలు వ్రాసి యిచ్చునట్లు వ్రాసి పంపితి నన్నియు. చాల సేవలు వచ్చెను. వీనిలోఁ జాలవఱకు అప్పుడు గూర్చబడెను, మఱియులయొ నాకి సేవ లుండెను.

ఈ చిన్నదళ మంగీకరించు లార్డ్ క్రూకుఁ దలఁచితిమి—'భారతీయులకు మేము గాయములు తిను సిపాయిలకు సేవ చేయుటకు నేర్పరి సాయము చేసికొనవలసియున్నచో దానికి సంసిద్ధుల మయి యుంటిమి.' అని యించు హెచ్చరించిన పిదప లార్డ్ క్రూ గారు ప్రకృత మన్నించి సామ్రాజ్యమునకు వచ్చిన యీ గాఢాపత్సమయమున తోడ్పడ వచ్చినందులకు మమ్మభినందించి మాసేవ నంగీకరించెను.

ప్రసిద్ధ వైద్యులగు కేంటలీగారికడ నేర్చిన వారందఱును ప్రథమాభ్యాస మారంభించిరి. నేర్పిన దాఱు వారములు. అయినను ప్రథమచికిత్స యంతయు ముగిసెను. ఇందు మే మందఱమును ఎనుబది మందిమి. ఆఱువారముల పిదప జరిగిన పరీక్షలో ఒకరు తక్క మే మందఱమును ప్యాసయితిమి. ప్యాసయినవా రందఱకును సరకారు వారు కవాతు నేర్పించిరి. దీనిని నేర్పు భారము కర్నల్ బేకరుగారిది. వారే యీ సేనకు సరదా రయిరి.

ఆరోజులలో సీమను చూచి తీరవలయును. యుద్ధమునిన నెవరికిని భయము లేదు. ఇంతియ కాక అందఱును యథాశక్తి సాయము చేయుటకు మూఁగుచుండిరి. శక్తిగలవారు యుద్ధపుసాము నేర్చుకొనఁ దొడఁగిరి. మఱి అశక్తులగు వృద్ధులు, స్త్రీలు! చేయుచో వీరికిని వలసినంత పని కలదు. గాయములు తగిలినవారికి గుడ్డలు కట్టుట, కత్తిరించుట మొదలగు పనులకు వారు దొరఁకొనిరి.

అచట ఆఁడువారికి లా ఇసియమ్ అను క్లబ్బు కలదు. అందలి వా రందఱును సైనికులకుఁ గావలసిన దస్తులను తమశక్తికొలఁది

# ౩౯

## ధర్మసందేహము

యుద్ధములో పని చేయుటకు మే మొక సంఘము చేసికొని మా పేరులు సర్కారువారికి పంపినట్లు దక్షిణ-ఆఫ్రికాకుఁ దెలియఁగనే నాకు రెండు టెలిగ్రాములు వచ్చెను. అం దొకటి పోలాకుగారి కడనుండి— 'మీ పని అహింసాసిద్ధాంతమునకు విరుద్ధము కాదా?'

నే నిట్టు లాశంకించుచునే యుంటిని. ఏలన 'హింద్ స్వరాజ్' లో నే నీ విషయమును జర్చించియుంటిని. మరియు దక్షిణ-ఆఫ్రికాలో నా మిత్రులతో నెపుడు నిరంతరము దీనిని గూర్చి చర్చించుచునే యుంటిని. 'యుద్ధము చేయుట నీతి కాదు' అని మేమందఱ మంగీకరించియుంటిమి. 'నాపైఁ బడి కొట్టినవానిపై అమలు జరుపఁగూడ' దనుకొను నేను రెండు రాజ్యములవారు కయ్యమునకు దిగఁగా అందు సత్పక్షమెవరిదో, అసత్పక్ష మెవరిదో నాకుఁ దెలియనపుడు, సాయము చేయవచ్చునా?' అని ప్రశ్న. బోయరుయుద్ధమున నేను పాలుగొంటి నని నా మిత్రు లెఱుఁగుదురు. పిదప నా యుద్దేశములు మాఱియుండు నని వారి తలఁపు.

నే నే వాదసరణికి వశుఁడనై 'యీయుద్ధమునఁ బడితినో ఆ వాదసరణియే నన్నిపుడుఁ బ్రేరేపించెను. 'సమరమున పాలుగొనుట అహింసాసిద్ధాంతమున కనుకూలము కా' దని నాకు తెల్లఁగాఁ దెలియును. కాని మానవున కెల్లపుడును తన కర్తవ్యము దివ్వెవలె భానము కాదు. సత్యారాధకుఁడు పలుమాఱులు ఈ రీతిగా గోఁతఁ గూలవలసి వచ్చుచుండును.

## ౩౦- ధర్మసందేహము

అహింస యొక్క వ్యాపకమగు వస్తువు. మనము హింసావనాగలమునం జిక్కుబడిన ప్రాణులము. జీవుండు జీవుని దిని బ్రదుకు నను మాట * కల్ల గాదు. బాహ్యాహింస చేయక జీవుం డొక క్షణమేని బ్రదుకంజాలండు. తినుట, త్రాగుట, కూర్చుండుట, లేచుట మొదలగు సకల క్రియలయందును ఇచ్ఛచేం గాని, అనిచ్ఛచేం గాని మనుజుండే కొంచెము హింసనొనర్చుచునే యున్నాండు. ఎవం డీ హింస చేయకుండుటకు చాలం బ్రయాసపడునో, ఎవం డట్టి దయాహాచే జాలి గొనునో, ఎవండు చీమకేని కీడు దలంపండో మరియు దాని బ్రతికించుటకు శక్తి గలంది పాటుపడునో వాండహింసారాధకుండు. అట్టి వాని ప్రవృత్తిలో నిరంతరము నిగ్రహము పెంపొందుచుండును. ఇతనిలో నిరంతరమును కరుణ వృద్ధిం బొందుచువచ్చును. కాని దేహధారి యెవండును బాహ్యాహింసనుండి తప్పుకొనం జాలండు.

మరియు అహింసలో అద్వైతభావన గర్భితమయి యున్నది. ప్రాణులన్నియు నొకటియే యగుచో నొకదాని పాపప్రభావము మిగిలినవానిపైని బ్రసరించును గావునను మానవునకు హింసాస్పర్శ తప్పదు. సంఘమునందుండు మానవుండు తన కిచ్ఛ లేకున్నను సంఘపు హింసలో భాగస్వామి యగుచున్నాండు. ఇట్టియెడ రెండు రాష్ట్రములు యుద్ధమునకు దిగినపుడు అహింసావలంబి యగు వాని ధర్మమేమి? యుద్ధము నాంపుటయే ధర్మము. ఎవం డీ ధర్మమును పరిపాలింపం జాలండో, ఎవండు నిరోధింపంజాలండో, ఎవండు నిరోధింపంగల అధికారముం బడయనేరండో అట్టివాండు ఏమి చేయవలయును? యుద్ధములో దిగంజెలును. దిగి తనను, తన దేశమును, ప్రపంచమును ఉద్ధరించుటకు సంపూర్ణముగ ప్రయత్నము చేయంజెల్లును.

---

జీవో జీవస్య జీవనమ్.

తెల్లవారి యేలుబడివలన నా స్థితిని, అనఁగా నా ప్రజలస్థితిని, చక్కఁబఱుప వలయునని నా కోరిక. నే నప్పు డింగ్లండులో నుంటిని. మరియు ఇంగ్లండు నౌకాబలమున కాపాడఁబడు చుంటిని. ఈరీతిగా నీ బలము నుపయోగించుకొనుచు దీని హింసలో నేనును భాగస్వామి నయితిని. కావున నే నీరాజ్యముతోడ నెట్టి సంబంధమునేని పెట్టు కొనవలయుచో, ఈ రాజ్యపు బావుటాక్రింద నిలువఁబడ వలయుచో 'యుద్ధము కూడదు' అని వావిడిచి చెప్పి ఈ రాజ్యపు యుద్ధనీతి మాఱునంతవఱకును సత్యాగ్రహశాస్త్రము ననుసరించి బహిష్కరింప వలయును; లేక భంగింపఁదగిన శాసనములను భంగించి చెఱసాల లెక్కడ నున్నవా యని వెదకుకొనుచుఁ బోవలయును; లేక యుద్ధ ములో పాలుగొని దాని నడపఁగల సామర్థ్యమును సంపాదింపవల యును. 'నిరోధించుశక్తి మనకు లేదు, మన కొకటే దారి, అది యుద్ధములో పాలుగొనుట' యని నేను నిశ్చయించుకొంటిని.

తుపాకి పేల్చువానియెడలను, వానికి సాయము చేయువాని యెడలను అహింసకు దృష్టిభేదము లేదు. బందిపోటుగాండ్రలో నుండి వారి మూటలు మోసి, వారికి పైకాఁ వుండి, వారికి గాయ ములు తగిలినపుడు కట్టు కట్టి సేవించువాండ్రును బందిపోటు వాండ్రతోపాటే. ఈ రీతిగానే యుద్ధమున గాయములు తిని వారికి సేవచేయువారుగూడ యుద్ధదోషమునుండి తప్పుకొనఁజాలరు.

పోలాకుగారికడనుండి తంతి రాకమునుపే నే నిట్టులు విచా రించుకొనుచుంటిని. వీరి తంతి వచ్చిన పిదప వెంటనే మరల కొందఱు మిత్రులతో చర్చించితిని. యుద్ధమున పాలుగొనుట నా ధర్మ మని అనుకొంటిని. నేఁటికిఁగూడ నీ విచారసరణి దోషగ్రస్తము కాదని నా నమ్మిక. ఆ సమయమున బ్రిటిషుసామ్రాజ్యసంబంధమునఁ గల

నా యుద్దేశముల ననుసరించియే నేను యుద్ధమున పాల్గొంటిని కావున దానిమీఁద నా కించుకయును పశ్చాత్తాపము లేదు.

నా మాట బాగుగా నున్నదని ఆనాఁడును నేఁడును అందఱి చేతను ఒప్పింపఁజేయుట శక్యము కాదు అని నాకుఁ దెలియును. ఇది కడు సూక్ష్మ మగు విషయము. ఇందు మతభేదముల కవకాశము కలదు. కావున అహింసాధర్మమును విశ్వసించి దానిని జాగరూకతతో పరిపాలించువారికడ నేటతెల్లముగా నా యభిప్రాయమును విన్నవించుకొంటిని. సత్యాగ్రహ మొనరించువాఁడు రూఢిబలమున, అనఁగా పరంపరాగతమగు ఆచారబలమున, నే పనియుఁ జేయ నక్కఱలేదు. అతఁడు తన యభిప్రాయములందే ఆరూఢుఁడయి యుండవలయును. దాన దోష ముండునేమో యని కను గలిగి యుండవలయును. తప్పు కలదని తెలిసినపిమ్మట దాని నెత్తిని దాఁచి ప్రాయశ్చిత్తమునుగూడఁ జేసికొనవలసి యుండును.

## ౪౦

## సత్యాగ్రహాస్త్ర పిపటు

నేనిట్లు నా ధర్మ మెఱిఁగి యుద్ధమునందు ప్రవేశించినను సాక్షాత్ ప్రవేశము నాయదృష్టమున వ్రాసిపెట్టఁబడియుండలేక పోవుటయేగాక అట్టి మహాపత్సమయమునందుఁగూడ నేను సత్యాగ్రహము నడిపింపవలసిన స్థితి యేర్పడఁ గలిగెను.

మా పేరులు మంజూరు చేయఁబడి నమోదు చేసికొనఁబడిన వెంటనే మాకు కవాతు నేర్పుట కొక యధికారి నియమింపఁబడెనని వ్రాసియుంటిని. ఈ యధికారి యుద్ధపు కవాతు నేర్పుటలో నే మాకు నాయకుఁడనియు, మిగిలిన అన్ని విషయములందును మా టుకిడీకి నేను నాయకుఁడ ననియు మా యందఱి యభిప్రాయము. నా సహచరుల జవాబుదారీ నాది, అతనికి నేను జవాబుదారీ; అనఁగా ఈ యధికారి అన్ని పనులను నాద్వారమున నడుపవలయును అని మాయందఱి యుద్దేశము. కాని ఆ యధికారికన్నులు వేఱు రీతిగా ఉన్నవని మాకు మొదటినాఁడే తెలిసెను. సోరాబ్జీ కడు జాగరూకుఁడు. అతఁడు నన్నిట్లు హెచ్చరించెను: 'ఏమండోయ్! ఈయన తాను చక్రవర్తి అనుకొని తన అధికారమునంతయు మనమీఁద చలాయించువాఁడుగా ఉన్నాఁడు. మనకు ఈ హుకుముతో జరూరు లేదు. ఇతఁడు మన కొక పంతులు. ఈయన పంపిన ఆ క్రొత్త కుఱ్ఱలుఁగూడ మనమీఁద హుకుములు నడుపఁదలఁచుచున్నారు.' ఈ క్రొత్తకుఱ్ఱవాండ్రు ఆక్స్‌ఫర్డులోని విద్యార్థులు. వీరు మాకు నేర్పవచ్చిరి. పెద్ద ఆఫీసరుగారు వీరిని మాలో కొన్ని భాగములకు నాయకులనుగా నియమించిరి. సోరాబ్జీగారు చెప్పిన విషయము నేను సోరాబ్జీకి చల్లమాటలు చెప్పి

'ఈ విషయమున అంతగా వగవవలదంటిని. కాని సోరాబజీ వెంటనే 'సరే' అనునట్టివాఁడు కాఁడు.

'మీరు చెట్టి బోతావారు. మీరు తియ్యతియ్య మాటలు చెప్పి మాకు నొయ్యి చూపింతురు. మీరు కసలు తెలిసికొని పోయి జూచి అపుడు 'లెం డిఁక సత్యాగ్రహము చేయుం' డని అందురు. ఆపైని మీకును మాకును శిక్షింపక తప్పదు' అని సోరాబజీ నవ్వుచు పలికెను

'నా సాహసము వలన దుఃఖము గాక మఱి యేది మీకుఁ జేకూరు ననుకొందురు? సత్యాగ్రహి మోసగింపఁబడుటకే జన్మ మెత్తెను. కావున నతఁడు నన్ను మోసగింపనీ! మోసగించువాడే తుదకు మోసగింపఁబడు నని వేయిమారులయినను మీకుఁ జెప్పియుదునే' అని నే నంటిని.

సోరాబజీ పకపక నవ్వి 'మంచిది, ఇఁక మోసములోఁ బొరుఁడు! మీ గెఘడో యొకనాఁడు సత్యాగ్రహములోఁ జత్తురు; మమ్ములఁగూడ మీ వెనుకఁ దీసికొని పోయి చంపుదురు'.

ఈ మాటలను వ్రాయుచుండఁగా మిస్ హాబ్హౌస్‌గారి మాటలు గుర్తు వచ్చుచున్నవి. నాన్‌కో ఆపరేషన్ రోజులలో ఆమె నా కిటులు వ్రాసెను—'సత్యమునకుఁగాను ఎపుడో ఒకపుడు మీరు ఉరిశిక్షపడుట గాక వింత కాదు ఈశ్వరుఁడు మీకు సత్పథమును జూపుఁగాక! ఈశ్వరుఁడు మిమ్ము రక్షించుఁగాక!'

ఆ యధికారి యధికార మారంభించిన మొదటిదినములందే సోరాబజీకిని నాకును పయి సంభాషణ జరిగెను. కాని ఆ ఆరంభమునకును అంతమునకును నడుమ నెన్నో దినములు పట్టలేదు. ఇంతలో నా యాఁపిరితిత్తులలో వాఁపు ఎక్కువాయెను. పదునాల్గునాళ్ల

ఉపవాస మయిన పిదప నింతవఱకును నాకెరిగిను బాగుపడలేదు, ఏలనను నేను కఱకును మానలేదు. కనుకను మైకాలును నాకు రెండును మెళ్లెవిప్పవు. అక్కడికి నడుచుచు నడిచియే పోవుచుంటిని. ఇందు కను గాను మంచము నెక్కవలసి వచ్చెను.

నాకు అట్టి స్థితిలో కాంపునకు పోవలసి వచ్చెడిది. అ దళమును కాంపులోనే ఉండుమంటిని. నేనుమాత్రము రాత్రికి ఇంటికి వచ్చుచుంటిని. అపుడు సత్యాగ్రహమునకు కక్కఱ కలిగెను.

ఆ యాఫీసరు ఇష్టము వచ్చినటుల హుకుములు జారీచేయఁ దొడఁగెను. అన్ని విషయములయందును 'నేనే మీకు అధికారి' అని అతఁడు తేటతెల్లముగా చెప్పెను. చెప్పుటయే కాక దాని రుచిగూడఁ గొంచెము చూపెను. సోరాబజీ నాకడకు పరుగెత్తుకొని వచ్చెను. అతఁడా దురధికారమును సహింపఁబూనుకొనలేదు. అతఁడిటులనెను: 'ఏ హుకుమును వచ్చినను అది మీ ద్వారమున రావలయును. నేఁటికిని మనము కవాతు నేర్చుకొను కాంపులలోనే యున్నాము; అప్పుడే మనపై పాడు హుకుములు! ఆ క్రొత్తకుర్రవారలకును మాకును చాల తేడా చూపఁబడుచున్నది. అది దుస్సహము. అది వెంటనే తొలఁగ వలయును. కానిచో మన పని యంతయు భగ్నమగును. మన విద్యార్థు లలోఁగాని, మనతోపాటు దీనిలోనికి దిగిన మనవారలలోఁగాని యెవఁడును పాడు హుకుమును సహింపరాదు. ఆత్మగౌరవమునకుఁ గాను ఇందుదిగి దీనిలో అవమానమును వహించుట కాని పని'.

నేనా యాఫీసరు కడకు వెళ్లి నాకడకు వచ్చిన ఫిర్యాదుల నన్నిటిని వినిపించితిని. అతఁడిటులు నాకు వ్రాసెను—'మీ ఫిర్యాదు లన్నియు వ్రాసి నాకుఁ బంపుఁడు.' దీనితోఁ దన యధికారమునుగూడ జతపఱచి—'ఫిర్యాదులు మీద్వారమున రాఁగూ

పడు. ఆ యీ భాగములకు నాయకు లయినవారి ద్వారముననే రావల యును' దీనికి నే నిటులు ప్రత్యుత్తరించితిని— 'నా కధికారముతోఁ బని లేదు, యుద్ధన్యాయమును బట్టి చూచినచో నే నొక మామూలు సిపాయిని. నేను మా తుకిడీకి ముఖ్యుఁడనే. నన్ను ఈ తుకిడీకి ప్రతినిధినిగా మంజూరు చేయుఁడు.' అని మరియు నాకడ నున్న ప్రియాదుల కిటులు తెలిపితిని: 'మాతో సంప్రతింపకుండ కుర్ర అఫీసరులను మా మీఁదఁ బెట్టినందువలన మాకుఁ జాల నసంతుష్టి కలిగినది, కావున వీరిని దీసివేయునది. అట్టి నాయకుల నేర్పాటు చేసికొను వీలు తుకిడీకే కలిగింపవలసినది.'

ఈమాట లాయనకు గుటక పడలేదు. 'తుకిడీయే ఆఫీసరుల నెన్నుకొనుట యుద్ధన్యాయమునకు విరుద్ధము. ఇఁక ఆఫీసరులను తీసి వేయుచో తుకిడీకి అదుపాజ్ఞలు అక్కఱ లేదన్న మాట' అని ఆయన నాతో ననెను.

పిదప మే మొక సభ చేసికొంటిమి. సత్యాగ్రహమువలనఁ గలుగు గంభీరమగు పరిణామమును వారి కెఱుకపఱచితిని. ఇంచుమించుగా అందఱును సత్యాగ్రహ శపథముఁ బూనిరి. లోఁగడ నియమించిన క్రొత్తకుర్ర ఆఫీసరులను తానే యెన్నుకొను నధికారము తుకిడీ కీయనిచో తుకిడీలోనివా రందఱును ఇఁకమీఁద కవాతుకుఁ గాని, క్యాంపుకుఁ గాని వెళ్లఁగూడదు అను తీర్మానము పలువురచే నంగీకరింపఁబడెను.

పిదప నే నా యాఫీసరు కొక యుత్తరము వ్రాసితిని. అందు మా అసంతుష్టిని ప్రకటించితిని. నా కధికారకాంక్ష లే దనియు, మా పని సేవామాత్రమే యనియు, సాంగోపాంగముగా మేము మా పనిని చేయఁగోరుచున్నా మనియు వ్రాసితిని. మరియు బోయరు యుద్ధ

మానఁగూడదనే నే యధికారులకు జవాబు నియ్యవలె దనియు, కర్నల్ గాలవేనును మాకును అప్పు డెట్టి వివాదమును తటస్థింపదే దనియు, అతనికి నా ద్వారమున మా కంపెనీ యొక్క ఉద్దేశములను గనుఁగొని అన్నిపనులను చేసెదివాఁ డనియు వ్రాసితిని. ఈ యుత్తరముతో మా తీర్మానపు నకలొకటి పంపితిని.

ఈ యుత్తర మాయనను ఇసుమంతయు కదలింపఁ జాలక పోయెను. మే మిట్టుల సభ చేసి యీ తీర్మానము గావించుటయుఁ గూడ యుద్ధనియమోల్లంఘన మని యతఁడు తలఁచెను.

ఇటు పిమ్మట ఈ విషయము లన్నియుఁ గ్రుచ్చి యెత్తి నా భారతమంత్రి కొక యుత్తరము వ్రాసితిని. దానితో మా తీర్మానమును గూడఁ బంపితిని.

భారతమంత్రి యిటులు ప్రత్యుత్తర మొసఁగెను: 'దక్షిణ-ఆఫ్రికాలో స్థితి వేఱు; ఇక్కడి స్థితి వేఱు. ఇచట పెద్ద ఆఫీసరుకు చిన్న ఆఫీసరులను నియమించు హోదా కలదు. అయినను ఇఁకముందు ఆ యాఫీసరు మీమాటల నాలకింపఁగలఁడు.'

పిమ్మట మా యిరువురినడుమను ఉత్తరప్రత్యుత్తరములు చాల జరిగెను. కాని ఆ గోడు నంతయు నిచటఁ జెప్పుకొని యీ ప్రకరణమును బెంచఁగోరను.

కాని ఆ గో డెట్టి దనఁగా, మనము ప్రతిదినమును హిందూదేశములో ననుభవించు గోడువంటిదే యను మాటమాత్రము చెప్పక తప్పదు. ఆ యాఫీసరు నయాన, భయాన మాలోఁ గొందఱను చీలఁ దీసెను. శపథము తీసికొనినను మాలోఁ గొందఱు ఛలమునకును, బలమునకును బలియైరి. ఇంతలో గాయములు తినిన సోల్జరులు అనుకొన

నంతయుంది నెటలీ ఆసుపత్రిలో వచ్చిపడిరి. వీరికి శుశ్రూష చేయుటకు మా తుఁడీ తుకిడీతో అక్కఱ యొదవెను. ఎవనిని ఈ యాఫీసరు తనవైపునకుఁ ద్రిప్పుకొనెనో వారు నెటలీకి వెళ్ళియుండిరి కాని యితరులు పోలేదు. ఇది ఇండియాఆఫీసుకు బాగుండలేదు. నేను మంచము పట్టితిని గాని మా తుకిడీవారితో సంబంధ ముంచుకొనియే యుంటిని. మి. రాబర్ట్సుతో నాకు గాఢపరిచయము కలిగెను. అతఁడు నన్నుఁ గలిసికొని మిగిలినవారి నందఱినుగూడఁ బంపుమని వేధించెను. “ఈ మిగిలినవా రందఱును వేఱే ఒక తుకిడీగా ఏర్పాటయి నెటలీ ఆసుపత్రికి వెళ్లవలసిన దనియు, వారి కచటికి పెద్ద ఆఫీసరుతోనే గాని చిన్న ఆఫీసరులతో సంబంధ ముండ దనియు, దాన ఆత్మగౌరవమునకు హాని కలుగదనియు, ఇటులు చేయుచో సరకారువారు సంతసింతురనియు, ఇపుడు గాయపడినవారు పలువురు వచ్చిపడిరి గాన వారికి ఉపచార మొదవఁగల దనియు అతఁడు చెప్పెను. ఈ మాట మాయందఱకును నచ్చెను. ఉండిపోయిన విద్యార్థులందఱును నెటలీకి వెళ్ళిరి. నే నొక్కఁడనే పండ్లుకొఱుకొనుచు మంచమునఁ బడి మూలుగుచుంటిని.

# ౪౨

## గోఖలేగారి ఔదార్యము

సీమలో నాకుఁ గలిగిన ఊపిరితిత్తుల వాఁపునుగూర్చి వ్రాసియుంటిని. నేనిట్లు జబ్బుపడి యుండఁగనే గోఖలేగారు సీమకు వచ్చిరి. నేనును, కేలన్‌బేకుగారును ప్రతిదినము వారికడ కరుగుచుంటిమి. మా ప్రసంగములో నెక్కువభాగము యుద్ధమును గురించి. కేలన్‌బేకుగారికి జర్మనీ భూగోళమెల్లను జిహ్వాగ్రమున తాండవించుచుండును. మరియు కేలన్‌బేకుగారు యూరోపునందు యాత్ర లొనరించి వచ్చిరి. కావున వారు యుద్ధమునకు సంబంధించిన ప్రదేశముల నన్నిటిని గోఖలేగారికిఁ జూపుచుండిరి.

మా ప్రసంగములలో నాజబ్బుగూడ నొకటి. నాఁటికిని నేను తినుబండములను పరీక్షించుచునే యుంటిని. వేరుసెనగలు, పచ్చి యరఁటులు, పండిన యరఁటులు, నిమ్మలు, ఆలివునూనె, కస్తూర వంగలు, ద్రాక్షలు మొదలగునవి నా తినుబండము. పాలు పప్పులు ధాన్యములను ముట్టుటలేదు. జీవరాజ మెహతాగారు నన్నుజూచి పోవుచుండిరి. పాలు ధాన్యములు తీసికొనుమని వీరు నాకు నొక్కి చెప్పిరి. ఈమాట గోఖలేగారి చెవులకుఁగూడఁ బ్రాఁకెను. ఫలాహారమునకు సంబంధించిన నా యభిప్రాయములు వారికి చాలవట్టు రుచింపవు. ఆరోగ్యరక్షణమునకు డాక్టరుగారి మాటలు వినవలయునని వారి యుద్దేశము.

గోఖలేగారి మాట వినకుండుట నాకు చేతఁగాని పని. వారు పట్టు పట్టిరి. ఆలోచించుకొనుటకు ఇరువదినాలుగుగంటలు నా కవకాశ మొసఁగుఁడని వారినిఁ గోరితిని. కేలన్‌బేకుగారును, నేనును ఇంటికి వచ్చితిమి. 'ఇపుడు నా చేయవలసిన దేమి?' అని నేను కేలన్

జేకుగారితో నాలోచించితిని. ఈ ప్రయోగమున వీరు నాకు సహాయకులు. ఈ ప్రయోగము వీరికి సమ్మతముగా నుండెను. కాని ఆరోగ్యమును పణించి యీ ప్రయోగము విడనాడుటయే వారి కిష్టము. ఇంక మిగిలినది నే నొక్కడనే. నేను నాయంతర్వాణి నాలకింపవలయును.

రాత్రియంతయు ఆలోచనలో మునిగితిని. నే నిపు డీ ప్రయోగములను విడనాడుదునేని నా యుద్దేశము లన్నియు మట్టిగలియును. పోనీ, నా యాలోచనలలో పొరపాటు కలదని యెంచుదమా, అది యేమియు గానిపించదు. కావున నిపుడు చేయవలసిన దేమి? గోఖలేగారి ప్రేమను ఎంతవరకు పాటించుట ధర్మము? ఆ శరీరరక్షణమునకుగాను ఈ ప్రయోగము నెంతవరకు తగ్గించుట యుక్తము? అని యాలోచించి, ఈ ప్రయోగమున 'ధర్మమునకు చేటు రాకుండునంతవరకు కాపాడుకొనవలయునని నా యధీనమున నుంచుకొనవలయుననియు, మిగిలిన విషయము లన్నియు డాక్టరుకు వశపరుపవలయుననియు నిశ్చయించితిని. నా క్షీరత్యాగమునకు బీజము ధర్మము. పాలొక చుక్కయేని లేకుండ పిండుటకుగాను కలకత్తాలో ఆవులకును గేదెలకును కలిగించు హింసలు నా కనులకు గట్టినటులుండెను. మరియు మాంసమువలెనే పాలును మనుష్యునకాహారము కాదను విషయము గూడ నా బుర్రలో నుండెను. కావున క్షీరత్యాగము నిశ్చయించుకొని, తలబరువు తగ్గించుకొని చీకటితో లేచితిని. కాని గోఖలేగారి భయము పోలేదు. కాని నా నిశ్చయమును అనుమతింతురని నమ్మకమును లేకపోలేదు.

సాయంకాలమున మే మిరువురమును గోఖలేగారి దర్శనమునకు నేషనల్ లిబరల్ క్లబ్బులోనికి బోయితిమి. వారు మమ్ము జూచుచునే— 'డాక్టరుగారి మాట విన నిశ్చయించితిరా?' అని యడిగిరి.

నేను చల్లగా నిటు లంటిని— 'మీ నన్నిమాటలు వింటినుగాని మీ రొకదానికొఱకుమాత్రము పట్టు పట్టకుఁడు! పాలు, పాలతోఁ జేసిన వస్తువులు, మాంసము వీనిని నేఁ గొనను. వీనిని గొనకున్నచో మృత్యువు వచ్చు నంచురా, రానిండు! దానిని కౌఁగిలించుకొనుటయే మనుకొందును.'

'ఇది మీ చివరమాటయా?' అని గోఖలేగా రనిరి.

'చివరమాట మఱి యొకటి యుండదు సని అనుకొనను. దీన మీకు కష్టము కలుగు ననుకొందును గాని నన్ను క్షమింపుఁడు.' అని నే నంటిని.

గోఖలేగారు కష్టపడినను మిగుల ప్రేమతో నిటు లనిరి: 'మీ మాట నాకు రుచింపలేదు. ఇందు ధర్మ మను మాటయే నాకుఁ గానరాదు. కాని ఇఁక మి మ్మొప్పింపఁ బ్రయత్నింపను.' అని యిటులు పలుకుచు జీవరాజ మెహతాగారివైపు దిరిగి, 'ఇఁక గాంధీని రొష్టపెట్టవద్దు. అతఁడు పెట్టుకొనిన హద్దులో పుచ్చుకొనఁదగిన వస్తువులనే పుచ్చుకొను మనుఁడు' అనిరి.

డాక్టరుగారి కనిష్టముగనే యుండెనుగాని, పాపము, వా రేమి చేయగలరు? 'ఇంగువ పోగిచిన మినప కట్టు పుచ్చుకొ'మ్మనిరి. 'చిత్త' మంటిని. రెండు మూఁడ్నాళ్లు త్రాగియుఁ జూచితిని. అది ఉపయోగింపక పోఁగా నాఁ వెక్కుడాయెను. అది నాకు పడలేదు. మరల పక్కలో పడితిని. డాక్టరుగారు పై యుపచారములు చేయుచునే యుండిరి. దానఁ గొంచెము శాంతి చిక్కెను. కాని నా నియమములు వారికి ముకుఁద్రాడులు. ఈనడుమ గోఖలేగారు అక్టోబరు నవంబరు నెలలలో లండనులో పట్టు మాడమంచులకు ఆఁగలేక దేశమునకు పయనించిరి.

## ౪౨

# వాఁపులకు వైద్యము

ఊపిరి తిత్తులవాఁపు నిమ్మళింపలేదు. దానఁ గొంచెము భయ పడితిని. మందు దీనికిఁ గొఱగాదనియు, ఆహారపరివర్తనము చేతను, బాహ్యోపచారములచేతను జబ్బు తప్పక ఝూఁడా యగు ననియు నాకుఁ దెలియును.

ఆన ౧౯౧౪ సంవత్సరమున నేను డాక్టరు ఏలిన్సన్ గారి నెఱుఁగుదును. ఆయన తినుబండములు మార్చి వ్యాధులు కుదుర్చును. నేను వారి నాహ్వానించితిని. నా శరీరము చూపించితిని. నాకును, పాలకును విరోధమని వారికిఁ జెప్పితిని. వెంటనే యతఁడు హెచ్చరికతో—'పాలతో ఎంతమాత్రమును పని లేదు. ఇపుడు కొన్నాళ్ళు మీకు క్రొవ్వుకలిగించు పదార్థములు లేకుండఁ జూతును' అని రొట్టె,* పచ్చికూరలు, పండ్లు మాత్రమే తిను మని చెప్పెను. పచ్చికూరలలో ముల్లంగి, ఉల్లి వంటివి. పండ్లలో ముఖ్యముగా నారింజలు. పచ్చి కూరలను కసకస నమలి తినవలయును. ఇటులు రెండు మూఁడు నాళ్లు తిని చూచితిని. పచ్చికూర లఱుగలేదు. అపుడా ప్రయోగ మును విధిప్రకారము చేసి చూడఁగల శక్తి నాకు లేదు. మరియు నమ్మ కమును లేదు. డాక్టరుగారు కిటికీతలుపు లిరువదినాలుగు గంటలును తెఱచియుంచవలసిన దనియు, నులివెచ్చ నీరు పోసికొమ్మనియు, వాఁపు మీఁద నూనె రాయుమనియు, పావుగంటయో అరగంటయో గాలిలో నడువు మనియుఁ జెప్పిరి. నాకీ యుపచారములు బాగుండెను. అక్కడివి ఫ్రెంచి కిటికీలు. వీని నిండారఁ దెఱచి యుంచినచో వర్షోదకము లోనికి వచ్చును. పైనున్న వెలుఁగుకంతలు తెఱవఁ దగినవి

* Brown bread

11

కావు. కావున అద్దము బ్రద్దలు గొట్టి ఇరువది నాలుగు గంటలును గాలి వచ్చుటకు దారి యేర్పఱచితిని. వాన రానిచో పరాసు కిటికీలను తెఱచి యుంచుచు వచ్చితిని.

ఇంత చేసినతరువాత కొంత శాంతి కలిగెను గాని సంపూర్ణారోగ్యము కలుగలేదు. సిసిలియా రాబర్ట్సు దొరసాని వచ్చి నన్నప్పుడపుడు చూచి పోవుచుండెను. మాకు మైత్రి కలిగెను. నాచేత పాలు త్రావింపవలయు నని గంపెఁడాశ. కాని నేను త్రాగను. కాఁబట్టి పాలవలె పనిచేయు పదార్థములను ఆమె యాలోచింప సాగెను. ఎవరో మిత్రుఁడొకఁడామెకు మాల్టెడ్ మిల్కును సూచించెను. అతఁ డందొక పాలచుక్కయేని లేదని చెప్పెను. పాప, మతఁ డెఱుఁగఁడు. మరియు పాలలోఁ గల గుణము లన్నియును అందుఁ గలవనియు, అది రసాయనశాస్త్రప్రకారము చేయఁబడిన ఒక ద్రవ్యమనియు నతఁ డామెకుఁ జెప్పెను. సిసిలియా రాబర్ట్సు దొరసానికి నా ధర్మదృష్టియెడఁ గడు నాదరము కలదని నే నెఱుఁగుదును. కావున నే నామాల్టెడ్ మిల్కును కొంత తీసి నీళ్లలోఁ గలిపి పుచ్చుకొంటిని. సరిగా పాల రుచి. నీరు తాగి 'ఇల్లెవరిది ?' అని అడిగినటుల త్రాగినపిదప సీసామీఁది చీటి చూచితిని. అది పాలతోఁ జేయఁబడిన ద్రవ్యమని తెలిసెను. అంతటితో దానిఁ బాఱవయిచితిని. ఈసంగతిని దెలుపుచు 'ఇందులకు మీ రిసుమంతయు విచారింపవల'దని సిసిలియా రాబర్ట్సు దొరసానికి వ్రాసితిని. చూచుచునే ఆమె మా యింటికి ఒక్క పరుగున వచ్చి తన పొరపాటునకు కడు వగచెను. ఈమెమిత్రుఁడు పాప మా చీటి చూడలేదు. నే నామె నూఱడించితిని. 'మీ రింతగా కష్టపడి నాకు సమకూర్చిన యీ ద్రవ్యములు పుచ్చుకొనఁ జాలనందులకు నన్ను క్షమింపుఁ'డని కోరితిని. తెలియక పుచ్చికొన్నందులకు పశ్చాత్తాపముతోఁగాని, ప్రాయశ్చిత్తముతోఁగాని యిసుమంతయుఁ బని లే దంటిని.

## రతి వాఁపులకు వైద్యము

ఈ మెనగుఱించి చాల విషయములు నాకు గుఱుతున్నవి గాని వానిని వర్ణింతును. పలు విపత్తులలో, పలు విరోధములలో ఆశ్రయ మొసఁగిన మిత్రులు నాకు పలువురు గలరని గుర్తు తెచ్చుకొందును. ఈశ్వరుఁడు దుఃఖములు అను చేఁదు మందులతోపాటు మైత్రి యను తియ్యని అనుపానమునుగూడఁ బెట్టునని శ్రద్ధాళువగువాఁడా గుర్తులలోఁ గాంచఁగలఁడు.

డాక్టరు ఏలిక్సనుగారు రెండవతూరి చూడవచ్చి మఱి కొన్ని వస్తువులకు సెలవొసఁగిరి. శరీరమున క్రొవ్వు పట్టుటకు వేఱుసెనగ, వెన్న లేక ఆలివ్ నూనె పుచ్చుకొను మనిరి. పచ్చికూరలు పడనిచో వండి అన్నములోఁ దిను మనెను. ఈ పదార్థములు నా కనుకూలములు.

కాని రోగము నిర్మూలము కాలేదు. చాల జాగ్రత్తగా ఉండ వలసియే యున్నది. నే నింకను మంచమునుండి లేచుట లేదు. డాక్టరు మెహతాగారు నడుమనడుమ వచ్చి చూచి పోవుచుండిరి. 'నామాట ప్రకారము నడచుకొనినచో మీకు నిమ్మళింపఁజేయుదు' నని వచ్చినపుడెల్ల అని పోవుచుండిరి.

సంగతు లీరీతిగా జరిగిపోవుచుండఁగా నొకనాఁడు రాబర్ట్సుగారు మాయింటికి ననుఁ జూడవచ్చి, 'మీ రిఁక దేశమునకు వెళ్లి పొండు! మీ రీ స్థితిలో నెటలీకి పోఁజాలరు. ముం దున్నది ముసళ్ల పండుగ! మంచు! మీకు దేశమునందే గాని యిచట నిమ్మళింపదు. కావున మీరు తిప్పక దేశమునకు వెళ్లుఁడు! అంతవఱకును యుద్ధము జరుగుచునే యుండునేని మీకు ఆరోగ్యము కలుగుచో అచటనే యుండి సాయము చేయుటకు వలసినంత యవకాశము కలదు. ఇప్పటికే మీరు చేసిన సాయ మేమాత్రమును తక్కువైనది కాదు' అని పలికిరి.

వీ రిచ్చిన సలహా బాగున్న దనిపించెను. నేను దేశమున కేఁగుటకుఁ బ్రయత్నము చేయఁదొడఁగితిని.

## దేశమునకు ప్రయాణము

కేలన్‌బెకుగారు ఇండియాకు రావెంచి నాతోఁగూడ సీమకు వచ్చిరి. మే మిరువురమును ఒక చోటుననే యుండెడివారము. యుద్ధ మారంభము కాఁగనే సర్కారువారు జర్మనుదేశమువారిని వేయి కనులతోఁ గనిపట్టుచుండిరి గాన కేలన్‌బెకుగారిని నాతో తీసికొని పోఁగలమా, లేమా అని మాకు సందేహము కలిగెను. వారికి రహదారిచీటి సంపాదించుటకు విశ్వప్రయత్నములు చేసితిమి. రాబర్ట్సను గారికి చీటి యిప్పింపవలయు నని యుండెను. అతఁడు దీనికిఁగాను వైస్రాయికి తంతి యిచ్చెను. సూటిగా లార్డ్ హార్డింగుగారికడ నుండి వెంటనే యిటులు జవాబు వచ్చెను: 'మేము వగచుచున్నాము, మే మీ సమయమున ఎట్టి చిక్కును నెత్తిపయిఁ బెట్టుకొనఁజాలము'. దీనియోగ్యత మా కందఱకును బోధపడెను. కేలన్ బెకుగారిని విడచి పెట్టుట నాకు దుఃఖజనక మాయెను గాని నన్ను విడచిపెట్టుట నా కంటె ఆయనకు ఎక్కువ దుఃఖజనక మాయెను. ఆయన ఇండియాకు వచ్చియుండినయెడల నీపాటికి భూమి దున్నుకొనుచు, బట్టలు నేసికొనుచు నుండెడివాఁడు. వారిపుడు వెనుకటి వలెనే జీవితముగడపుచు వడ్రంగమునం దెడతెఱపి లేక దక్షిణ-ఆఫ్రికాలో నివసించుచున్నారు.

నేను మూఁడవ తరగతి టికెట్టుకు ప్రయత్నించితిని. కాని పి. అండ్ ఓ. ఓడలలో ఆ టికెట్లు లేకపోవుటచే రెండవ తరగతి టికెట్టు పుచ్చుకొనవలసి వచ్చెను. దక్షిణ-ఆఫ్రికానుండి తెచ్చికొనిన ఆఱినపండ్లను నాకడ నుంచుకొంటిని. ఈ యోడలలో ఆఱిన పండ్లు దొరకవు. ముగ్గినపండ్లు వగైరాలు దొరకును.

# ౪౩ దేశమునకు ప్రయాణము

డాక్టరు మెహతాగారు 'మీడ్ జ్ ప్లాస్టరు' తో నాపార్శ్వము లను బిగించిరి. ఆ కట్టు నటులే యుంచుకొనుమనిరి.* రెణ్ణాళ్లకంటె నేను దాని నుంచుకొనఁజాలక పోతిని. తుద కెటులో దానిని తీసివేసి కొనఁ గలిగితిని. పిదప ఒడలు తోముకొని స్నానము చేయఁగల సౌ భాగ్యము నాకు చేకూరెను. ఆఱినపండ్లును, పచ్చని పండ్లును, ముగ్గిన పండ్లును మాత్రమే నా కాహారము. వీనితో నొకనాఁటికంటె నొక నాఁడు ఆరోగ్యము కలుగఁజొచ్చెను. సూయెజ్ కెనాల్ చేరువఱకు చాల తేలిక యిచ్చెను. నాశరీరము దుర్బలముగా నున్నను వ్యాధి భయము సంపూర్ణముగా పోయెను. ప్రతిదినము కొంచె కొంచెము సాము చేయుచుంటిని. ఈ యారోగ్యమునకుఁ గారణము సమశీతోష్ణ ప్రదేశమునందలి గాలి యని నా యుద్దేశము.

తొల్లిటి యనుభవములవలననో, మఱే యేకారణములవలననో గాని, ఈ యోడలో తెల్లబాటసారులకును, నల్లబాటసారులకును నడుమ నొక భేదము కానిపించెను. దక్షిణ-ఆఫ్రికాయోడలలో నట్టి భేదము నాకుఁ గానఁబడలేదు. వానిలోను లోలోపల లేకపోలేదు గాని యిది వేఱు, అది వేఱు. చాలమంది తెల్లవారితో మాటలాడితిని గాని, 'సాయబయ్యా సలామయ్యా!' అను మాటలకంటె నెక్కువ మాటలు కావు. అవి హృదయములుకలిసిన మాటలు కావు. కాని దక్షిణ-ఆఫ్రికా యోడలలోను, దక్షిణ–ఆఫ్రికాలోఁగూడ హృదయ మేళనము కలదు. కాని యీ యోడలలో నిటు లుండుటకు కారణము నా కిటులు తోఁచుచున్నది: 'మేము రాచవార మను నుద్దేశము తెల్ల వారలకును, మేము బానిసల మను నుద్దేశము నల్లవారలకును వెనుక వెనుక నున్నది.

* "రెడ్‌సీకి చేరునంతవఱకు విప్పవలదనిరి" అని ఆంగ్లపాఠము. -అనువాదకుఁడు.

ఈ గాలి సోఁకకుండ దేశమునఁ బడుటకు తొందర యొత్తెను. ఏడెనుకు చేరువఁకు ఇలు చేరినటులే యుండెను. దక్షిణ-ఆఫ్రికాలో నాకు ఏడెన్ వారితో పరిచితి గలదు. భాయి కేకోబాద్ కావసజీ దిన్షాగారు డరబను వచ్చియుండిరి. నాకు వారితోను, వారి భార్యతోను ఎక్కువ నేస్తము కలిసెను. కొలఁది నాళ్లలో బొంబాయి చేరుకొంటిమి. దేశమునకు ౧౯౦౫ సంవత్సరములో రాఁగలనని యాశ యుండెడిది. కాని పదియేండ్లు దాఁటిన తరువాత వచ్చుటచే చాల నానంద మాయెను. గోఖలేగారు బొంబాయిలో నాకు స్వాగత మొసఁగుటకు సకలసన్నాహములను జేసిరి. వారి కారోగ్యము లేదు. లేకున్నను బొంబాయి వచ్చిరి. వారి దర్శనము చేసికొని వారిలోఁ గలిసిపోయి తలబరువు తగ్గించుకొనవలయు నను నాశతో బొంబాయి వచ్చితిని. కాని బ్రహ్మగారు దానికి మాఱు వ్ర వ్రాసి యుంచుకొనిరి.

# ప్లీడరీలో కొన్ని గుర్తులు

ఇండియాకు వచ్చినపిదప నా జీవన మెట్లు నడచెనో దానిని గూర్చి చెప్పకముందు, ఇచ్ఛాపూర్వకముగా విడనాడిన కొన్ని విషయముల నుల్లేఖించుట తప్పనిసరి యని తోఁచుచున్నది. వకాలతు విషయములు కొన్ని వ్రాయుమని నామిత్రులు కోరుచున్నారు. వాని నన్నిటిని వ్రాయుచో నది యొక గ్రంథ మగును. మరియు నవి యన్నియు నీగ్రంథ పుటెల్ల కావలివి. కొన్ని సత్యమునకు సంబంధించినవి కలవు. వాని నుదాహరించుట యనుచిత మనిపించుకొనఁబడదు.

నాకు గుర్తు గలంతవఱకు నా వృత్తిలో నే నెన్నఁడును అసత్యమునకుఁ బూనుకొని యుండలేదని లోఁగడనే చెప్పియుంటిని. మరియు నావృత్తిని కేవలము లోకసేవ కర్పణ మొనర్చితిని. కడుపు కూటికే ఫీజు గొంటిని. ఒక్కొక్కపు డదియు లేదు. ఈ మాటలతో నావకాలతు పనిని గుఱించి యంతయుఁ జెప్పినట్లే. కాని నా మిత్రు లింకను జెప్పుమనుచున్నారు. నే నీ విషయమును కొంచెదిగనో, గొప్పగనో వ్రాయుచో, దాన సత్యమును నే నెటుల పాలింపఁగలిగితినో తెలియనగు ననియు, దాన వకీళ్లు తెలిసికొనఁ గల విశేషము లుండఁగల వనియు వారి యభిప్రాయము.

"ప్లీడరులకు కల్లలాడక తెల్లవాఱదని నా విద్యార్థివశనుండియు నేను వినుచునే యుంటిని. నాకు పే రక్కఱలేదు. ముల్లె యక్కఱ లేదు; ఇఁక కల్లతో నేమిపని?

దక్షిణ-ఆఫ్రికాలో ఈ నా నియమమునకు పలుమాఱు లొఱపిడి కలుగుచు వచ్చెను. మా ప్రతివాదులు తమ సాక్షులకు బసి పెట్టి,

వ్రాయించి, చదివించి, ఆర్చి తేర్తురని విందును కావున నేనును నాక్లయంటును గాని, సాక్షులను గాని కల్లలాడుమని 'కిసుక్కగొల్పు'చో మా కేసు గెలుచునని నాకుఁ దెలియును. కాని నే నెప్పుడును అట్టి ప్రలోభనమునకు లొంగలేదు. ఒక కేసు గెలిచిన తరువాత నాక్లయంటు నన్ను మోసగించునటులు కనుఁగొనిన విషయ మొకటి మాత్రము గుర్తుకలదు. 'నా క్లయంటు చెప్పునది సత్యమైనయెడలనే గెలుచుఁగాక! అసత్యమైనచో ఓడిపోవుఁగాక!' అను నుద్దేశ మొకటియే నాహృదయమున నెల్లపుడు నుండెడిది. ఓటమిని బట్టి, గెలుపును బట్టి ఫీజు నిర్ణయించుకొనిన గుఱుతు నా కన్నఁడును లేదు. కేసు గెలుచుఁ గాక, ఓడుఁ గాక! నాపనికి ఫీ జెంతయో అంతయే. గెలిచెనని యెక్కువ లేదు; ఓడెనని తక్కువ లేదు. 'మీ కేసు కల్లయగుచో నాకడకు రావలదు. సాక్ష్యము బనాయింపఁ దలఁచికొనుచో నాయాశ పెట్టుకొన వల' దని మొదటనే నేను క్లయంట్లకు చెప్పుచుంటిని. దీనితో జూటా కే సొకటియు నాకడకు వచ్చెడిది కాదు. కల్లయును, కపటమును లేని కేసులనే నాకిచ్చి కల్ల యొక పిస రున్నను అట్టి కేసులను మఱొక వకీలుకడకుఁ దీసికొని పోవు క్లయంట్లను నే నెఱుఁగుదును.

నన్ను కఠినముగా పరీక్షింపవచ్చిన కే సొకటి కలదు. అది నా క్లయం ట్లందఱిలో పెద్ద క్లయంటుది. అది యంతయు జమా ఖర్చు లెక్కల చిక్కుముడి. అది యెన్నాళ్లనుండియో విచారింపఁబడుచు వచ్చుచున్నది. అం దనేక భాగము లనేక న్యాయస్థానములలో కొంత కొంత విచారింపఁబడెను. అందలి లెక్కలచిక్కు లెక్కలు బాగుగా వచ్చిన పంచాయతీకి అప్పగింపఁబడెను. పంచాయతీతీర్పు పరిపూర్ణముగా మా కనుకూలము. కాని వీరి లెక్కలో ఒక చిన్న తప్పుండెను. అగుట కది చిన్నదే కాని పాడుచేయుటకు పెద్దది. పంచాయతీవారి పొరపాటుచే ఖర్చులో పడవలసిన పద్దు జములో పడ్డది. ప్రతివాదు లీ

పంచాయతీవారి తీర్మానమును రద్దుపఱుపవలసిన దని దరఖాస్తు* పెట్టిరి. నేను మాక్లయంటుకు చిన్నవకీలును. పెద్దవకీలుగారి కీ పొరపాటు తెలియునుగాని పంచాయతీవారు చేసినపొరపాటును క్లయంటు ఒప్పుకొనవలసిన పని లే దని వారి యభిప్రాయము. వాదికి నష్టము కలిగించు ప్రతివాదిమాట యే వకీలును ఒప్పుకొనఁగూడదని స్పష్టముగా ఆయన చెప్పివైచెను. కాని నే నిటు లంటిని: 'ఈ కేసులో నున్నపొరపాటును మన మంగీకరింపవలయును.'

పెద్ద వకీలు గా రిటు లనిరి: 'మన మంగీకరించుచో కోర్టువా రీ తీర్పు నంతయును రద్దుపఱతు రని భయపడుచున్నాను. తెలివిగల వకీ లెవఁడును తన క్లయంటు నిట్టి యాపదకు పాలుచేయఁడు. ఈ యాపదను నెత్తిని బెట్టుకొను సాహస మిసుమంతయు నాకు లేదు. ఈ కేసు పునర్విచారణకు వచ్చుచో మన క్లయం టెంత వ్యయము భరింపవలసి యుండునో, తుద కీ కేసు ఎటులు పరిణమించునో యెవరు చెప్పఁ గలరు?'

మా కీ సంవాదము జరుగునపుడు క్లయంటుగూడ నచట నుండెను.

'మన క్లయంటును, మనముఁగూడ నీ సాహసమునకు దిగవలయును. మన మొప్పుకొనకపోయినప్పటికిని కోర్టువా రా తప్పు తీర్పు నంగీకరింతు రని నమ్మక మేమిటి? ఈ తప్పును దిద్దుబాటు గావించినందు వలన క్లయంటు కేమేని నష్టము అనుభవింపవలసివచ్చుచో అడ్డమే మి?'

'మన మస లొప్పుకొనక పోయిన నేమి?' అని పెద్దవకీలుగా రనిరి.

* "ప్రతిపక్షులీ తీర్పును వేఱుకారణములచే నెదిరించిరి" అని ఆంగ్లానువాదము—అను.

'మనము జయటఁ బెట్టినచో కోర్టువారికిఁ గాని, ప్రతివాదులకుఁగాని ఇది పట్టుపడ దని నిశ్చయ మెక్కడది?' అని నే నంటిని.

'అటు లగునేని ఈ కేసులో మీ రిఁక వాదించెదరా? తప్పు నొప్పుకొను షరతు పెట్టుకొని నే నీ కేసులో వాదింపఁజాలను' అని పెద్దవకీలుగారు దృఢముగాఁ బల్కిరి.

నేను వినయముతో నిటు లంటిని: 'మీరు రానిచో క్లయంటంగీకరించునేని నేను వాదించుటకు సంసిద్ధుఁడను. తప్పు నొప్పుకొనక నే నీ కేసులో పనిచేయుట అసంభవము.'

నే నిటు లని క్లయంటుమోము మాచితిని. అతఁడు కొంచెము వికలుఁడాయెను. నే నీకేసులో మొదటినుండియూ పని చేయుచుంటిని. నాపై నితనికిఁ జాల నమ్మకము. నా స్వభావముగూడ సంపూర్ణముగా నతనికి వాకపే. కావున నతఁ డిటు లనెను: 'మంచి మాట, తమరే వాదింపుఁడు, తప్పొప్పుకొనుఁడు. ఓటమి వ్రాసియున్నచో ఓడుదుముగాక! సత్యమును కాపాడు నీశ్వరుఁడు లేఁడా?'

నే నానందించితిని. అతఁడు వేఱుగా పలుకు నని నే ననుకొనలేదు. పెద్దవకీలు నన్ను ముదలకించెను. నా హఠమునకు జాలిపడెను. దానితోపాటు నాకు ధన్యవాదములను సమర్పించెను.

కోర్టులోముచ్చట ముందు.

## చాతుర్యమా?

నేనొసంగిన సలహా మంచి దనుటలో శంకయే లేదు కాని ఈ కేసునకు పరిపూర్ణమైన న్యాయము కలిగింపఁగలనా, లేనా యని నాయెడల నాకే కావలసినంత శంక. ఇంత ఒడుదొడుకుగా నున్న యీ కేసులో, అందును సుప్రీముకోర్టులో వాదింపఁబోవుట పెద్ద సాహస మనిపించెను. గుండెదడతో నేను జడ్జీలయెడల నిలువఁబడితిని. నే నీ పొరపాటును బయటఁబెట్టఁగనే జడ్జి యిటు లనెను: 'ఇది చాతుర్య మనిపించికొనదా?' నామొగము జేగురుగడ్డ యాయెను. ఇందు మోస మేమాత్రము లేకపోవుటవలన ఆ యారోపణము నాకు దుస్సహ మాయెను. 'జడ్జీగారు మొదటనే అసూయాగ్రస్తుఁడాయెను. కఠినమగు నీ కేసెటులు గెలుచునా?' యని నేను గుంజాటన పడితిని.

నా రోషము నాఁపుకొంటిని. శాంతుఁడ నయితిని. ఇటు లంటిని: 'అయ్యా, మీ రిటు లనుట నా కాశ్చర్యముగా నున్నది. నామాటలు తుదకంట వినకుండ మొదటనే 'చాతుర్య' మని నింద నారోపింపఁ దొడఁగితిరి.'

'నేను నింద నారోపింపలేదు, కేవలము నా శంకను ప్రకటించితిని' అని జడ్జిగా రనిరి.

'తమ శంకయే నిందయంతగా నున్నది. నావాదము నంతయు నాలకించి శంకకు తా వున్నచో తమరు తప్పక శంకింపవచ్చును' అని నే నంటిని.

'మీకు నే నడ్డు దగిలినందులకు వగచుచున్నాను. మఱి మీరు చెప్పవలసిన దంతయుఁ జెప్పుఁడు.' అని జడ్జిగారు శాంతులయి పలికిరి.

నా విషయమును నేను స్పష్టముగాఁ దెలుపుటకు నాకు కావలసినంత ఆదరు వున్నది. జడ్జిపున్యామా యని మొదటనే శంక నెత్తి వందులఁజేసి నా వాదము జడ్జిగారి మనస్సునకు చక్కగా పట్టునటులు చేయఁగలిగితిని. దీనితో నాకు ధైర్యము కలిగెను. నా చెప్పవలయు మాటల నన్నిటిని వివరించితిని. కోర్టువారు నా మాటల శాంతముగా నాలకించి ఆ పొరపాటు కేవలము కన్ను చెదరుటవలనఁ గలిగె నని తెలిసికొనిరి. మరియు చాల పరిశ్రమించి తయారుచేసిన లెక్కను రద్దుపఱచుట వారికి రుచింపలేదు.

మేము తప్పు నొప్పుకొనుటవలన తమ కింక నంతగా వాదింప వలసెన పని పట్టదని ఎదిరి వకీలుగా రనుకొనిరి. కాని ఈ తప్పెట్టిదో తెలిసిపోవుటవలనను, దిద్దుబాటు చేయుటకు వీలయిన దగుటవలనను పంచాయతీవారు చేసిన తీర్పును రద్దుపఱచుట కోర్టువారి కిష్టము లేక పోయెను. ఎదిరి వకీలు తల బాఁదుకొనెనుగాని మొదట నాపై నను మానము నొందిన జడ్జీ ఇపుడు సంపూర్ణముగా నాపై పునకు మ్రొగ్గెను.

'గాంధీగా రా తప్పు నొప్పుకొననిచో మీ రేమి చేయుదురు ?' అని జడ్జి ప్రశ్నించెను.

'మేము తీసికొని వచ్చిన లెక్కగాఁడు చిత్రగుప్తునంతటివాఁడు. ఆతనికన్న తెలివిగలవాఁడును, ప్రామాణికుఁడును మఱియొకఁడు దొరకఁ గలఁడా ?'

'మీ కేసు మీకు బాగుగా తెలియు నని కోర్టువారి యుద్దేశము. ఇటువంటి తప్పు ఎంతటి చిత్రగుప్తునకైనను వచ్చును. ఈ తప్పును తేలికగా దిద్దవచ్చును. ఈ తప్పుకంటె క్రొత్త దేమియు మీరు చెప్పుకొనఁగలది లేకపోయినయెడల నిఁక పునర్విచారణ మెందులకు ?

# ౪— క్లయింట్లు సహచరులగుట

సత్యప్రాజవలన వకీలుమిత్రులలో నా ప్రతిష్ఠ వర్ధిల్లెను. నేను నల్లవాఁడయినను కొన్ని కేసులలో తెల్లవారి ప్రేమను చూరఁగొనగలవాఁడ నయితిని.

నాకు తెలియని సంగతిని నా క్లయింట్లకడఁగాని, ఎదుటి వకీళ్ల కడఁగాని దాఁచుట యనునది నా స్వభావము కాదు. నాకు తెలియని విషయములలో నా క్లయింట్లను మఱియొక వకీలుకడకుఁ బొమ్మనువాఁడను. నన్నే పట్టుకొని ప్రాఁకులాడినచో అనుభవము కల వకీలు సలహాను తీసికొని పని చేయించుకొను మనువాఁడను. ఈ నిష్కాపట్యము నా క్లయింట్ల నుండి అగాధప్రేమవిశ్వాసములను నాకుసంపాదించి పెట్టెను. నా క్లయింట్లు పెద్దవకీలు-ఫీజుగూడ సంతోషముతో నిచ్చుకొనుచుండిరి.

ఈ ప్రేమవిశ్వాసములు నా ధర్మకార్యములకు సంపూర్ణముగా నుపయోగించెను.

దక్షిణ-ఆఫ్రికాలో నేను వకాలతు చేయుటకుఁ గల కారణము కేవలము లోకసేవ కని పూర్వప్రకరణమునఁ జెప్పియుంటిని. ఆధర్మకార్యములకొఱకేని ప్రజల ప్రేమవిశ్వాసములు నాకు సంపాదింపవలసి యుండెను. అచట ఉదారహృదయులగు భారతీయులు ధనము పుచ్చుకొని నా చేసిన పనిని ప్రజాసేవ యని గారవించిరి. తమ హక్కులకుఁగాను చెఱసాలలకుఁ బోయి కష్టపడవలసిన దని నేను సలహా యిచ్చినపుడెల్ల చెరసాలలకు వెళ్లిరి. అందలి యోగ్యతను తెలిసికొని చెఱసాలకు వెళ్లిరా, లేక నాయందలి ప్రేమవిశ్వాసములచే వెళ్లిరా యనినచో నాయంవలి ప్రేమవిశ్వాసములచేతనే వెళ్లి రన వలయును.

ఇది నేను వ్రాయుచుండఁగా వకాలతునాఁటి చాల సంగతులతో నా కలమంతయు నిండిపోవుచున్నది. వందలకొలఁది క్లయింట్లు ప్రాణమిత్రులై, ధర్మకార్యములందు సహచరులై కఠినమగు నా జీవనమును రసమయముగఁ జేసివైచిరి.

## క్లయింట్లు సహచరులగుట

నేటాలు ట్రాన్సువాలులలో వకాలతునుగురించి భేదము గలదు. నేటాలులో అడ్వొకేటనియు, ఎటర్నీయనియు రెండు భేదములు కలవు. అడ్వొకేటుగాఁ జేర్చుకొనఁబడిన బారిస్టరు ఎటర్నీగాఁగూడ అన్నికోర్టులలోను పనిచేయవచ్చును. ట్రాన్సువాలులో బొంబాయిలోవలె భేదము కలదు. అడ్వొకేటు తన క్లయింట్ల పనుల నన్నిఁటిని ఎటర్నీలచేత చేయించుకొనవలయును. బారిస్టరయినవానికి అడ్వొకేటు ఎటర్నీలలో ఏదో ఒక పని చేయుటకు మాత్రమే సనదుండును. నేను నేటాలులో అడ్వొకేటుసనదును, ట్రాన్సువాలులో ఎటర్నీ సనదును పుచ్చుకొంటిని. అచట అడ్వొకేటు సనదును పుచ్చుకొంటినేని నాకు భారతీయులతోడ సాక్షాత్సంబంధము కలుగదు. మరియు తెల్ల ఎటర్నీలు నాకు కేసుల నిప్పింపఁగల మంచితనముకూడ దక్షిణ-ఆఫ్రికాలో లేదు.

ట్రాన్సువాలు మేజిస్ట్రీటు కోర్టులో నాకుఁ జాల పనియుండెడిది. నే నొక కేసులో వాదించుచుండఁగా నా క్లయంటు నన్ను మోసగించె నని తెలిసికొంటిని. అతని దావా వట్టి కల్ల. బోనులో నిలువఁబడియుండినవాఁడు నిలువున కూలిపోవునటు లాయెను. మా క్లయంటుకు వ్యతిరేకముగ తీర్పు జెప్పఁడని నేను కూర్చుంటిని. నా యెదుటి వకీ లాశ్చర్యపడెను. మేజిస్ట్రీటు సంతసించెను. నేను నా క్లయంటును చీకొట్టితిని. నేను దొంగకేసు పట్ట నని నా క్లయంటెఱుఁగు. నేను తప్పొప్పుకొనినందులకును, వ్యతిరేకముగా తీర్పు జెప్పఁడనినందులకును అతనికి కోపము కలుగలే దనుకొందును. అయిన దాయెఁ గాని నా యీ ప్రవర్తనవలన నా కించుకయు చెడు పేరు రాలేదు. ఇంతియకాక కోర్టులలో నా పని సరళ మాయెను. మరియు

సత్యప్రాజవలన వకీలుమిత్రులలో నా ప్రతిష్ఠ వర్ధిల్లెను. నేను నల్లవాఁ డయినను కొన్ని కేసులలో తెల్లవారి ప్రేమను చూరఁగొనగలవాఁడ నయితిని.

నాకు తెలియని సంగతిని నా క్లయంట్లకుఁగాని, ఎదుటి వకీళ్ల కడఁగాని దాఁచుట యనునది నా స్వభావము కాదు. నాకు తెలియని విషయములలో నా క్లయంట్లను మఱియొక వకీలుకడకుఁ బొమ్మనువాఁడను. నన్నే పట్టుకొని ప్రాఁకులాడినచో అనుభవము కల వకీలు సలహాను తీసికొని పని చేయించుకొను మనువాఁడను. ఈ నిష్కాపట్యము నా క్లయంట్ల నుండి అగాధప్రేమవిశ్వాసములను నాకుసంపాదించి పెట్టెను. నా క్లయంట్లు పెద్దవకీలు-ఫీజుగూడ సంతోషముతో నిచ్చుకొనుచుండిరి.

ఈ ప్రేమవిశ్వాసములు నా ధర్మకార్యములకు సంపూర్ణముగా నుపయోగించెను.

దక్షిణ-ఆఫ్రికాలో నేను వకాలతు చేయుటకుఁ గల కారణము కేవలము లోకసేవ కని పూర్వప్రకరణమునఁ జెప్పియుంటిని. ఆధర్మకార్యములకొఱకేని ప్రజల ప్రేమవిశ్వాసములు నాకు సంపాదింపవలసి యుండెను. అచట ఉదారహృదయులగు భారతీయులు ధనము పుచ్చికొని నా చేసిన పనిని ప్రజాసేవ యని గౌరవించిరి. తమ హక్కులకుఁగాను చెఱసాలలకుఁ బోయి కష్టపడవలసిన దని నేను సలహా యిచ్చినపుడెల్ల చెరసాలలకు వెళ్లిరి. అందఱి యోగ్యతను తెలిసికొని చెఱసాలకు వెళ్లిరా, లేక నాయందలి ప్రేమవిశ్వాసములచే వెళ్లిరా యనినచో నాయందలి ప్రేమవిశ్వాసములచేతనే వెళ్లి రన వలయును.

ఇది నేను వ్రాయుచుండఁగా వకాలతునాఁటి చాల సంగతులతో నా కల మంతయు నిండిపోవుచున్నది. వందలకొలఁది క్లయంట్లు ప్రాణమిత్రులై, ధర్మకార్యములందు సహచరులై కఠినమగు నా జీవనమును రసమయముగఁ జేసివైచిరి.

## ౪౨

## క్లయంటుకు చెఱ తప్పుట

పారసీ రుస్తుంజీగారి పేరు పాఠకులకు తెలిసినదే. అతఁడు నాకడకు వచ్చుచునే క్లయంటును, సహచరుఁడు నాయెను. ముందర సహచరుఁడై పిదప క్లయంటాయె ననుటయే యుక్తమని తోఁచుచున్నది. నాయెడల నాతనికి దొడ్డ నమ్మకము. అతఁడు గృహకృత్యములలోఁగూడ నా సలహాను పుచ్చుకొని దానిప్రకార మాచరించెడివాఁడు. మాకు మతభేద మించుక యున్నను అతనికి జబ్బు చేసినచో నా కూరఁగాయవైద్యముతోడనే పని పట్టెడిది.

ఈ నా సహచరున కొకతూరి గొప్ప ఆపద తటస్థించెను. ఇతఁడు తన వ్యాపారమునకు సంబంధించిన మాటలన్నియు నాకుఁ జెప్పెనుగాని ఒక మాటమాత్రము దాఁచెను. పారసీ రుస్తుంజీ దొంగ సరకులు తెప్పించుచుండెను. అతఁడు బొంబాయి కలకత్తాలనుండి సరకు దిగుమతి చేయించుకొనుచుండెడివాఁడు. దానిచాటున దొంగ సరకుగూడ వచ్చెడిది. ఆఫీసరులకును, రుస్తుంజీకిని మంచి దోస్తీ కలదు. కావున నతనియెడ నెవరికిని నిసుమంతయు శంక లేదు. వా రతనియెడఁ గల నమ్మకముచే పట్టీప్రకారము సుంకము వసూలుచేసికొని పోవుచుండెడివారు. తమకు తెలిసినను కనులు మూసికొని పోవువారును కొంద ఱుండవచ్చును.

కాని ఆఖోకవి పలుకెన్నఁడేని అసత్యమగునా?—

క. అద్దమువలె మఱి యన్నపు
ముద్దవలెం బాదరసపు ముద్దవలెన్ మేల్

సుద్దవలె దొంగసొత్తది
వద్దన్నను వచ్చి కొనఁబడుచునె యుండున్.*

పారసీ రుస్తుంజీగారి దొంగతన మొకతూరి పట్టుబడెను. ఆయన నాకడకుఁ బరుగులెత్తుకొనుచు వచ్చెను. ఆయన కనులవెంట నీరు సంతతధారగాఁ బ్రవహించుచుండెను. అతఁ డిటు లనెను: ‘భాయీ! నేను నిన్ను మోసమున ముంచితిని. నా పాపము నేఁడు పండి బ్రద్దలయినది. నేను దొంగసరకులను తెప్పించితిని. నా నెత్తిమీఁద జైలుకు పోవలయు నని వ్రాసిపెట్టియున్నది. నే నింక చచ్చినట్లే. ఈ యాపదలో నీ వొక్కఁడవే నన్ను బ్రతికింపఁగలవు. నేను నీ కేమియు దాఁచలేదు. కాని యిది వర్తకపుజిత్తు. దీనిని నీకెట్లు చెప్పఁగలను? కాన దాఁచితిని. ఇందులకు పశ్చాత్తాపపడుచున్నాను.’

నే నతని నోదార్చి యిట్లంటిని: ‘నారీతి నీకుఁ దెలియును. రక్షించుటయు, రక్షింపకుండుటయు పరమేశ్వరాధీనము. కాని మీ పాపమును మీ రొప్పుకొందురేని నే నీ యాపదనుండి తప్పింపఁగలను.’

ఆ పారసీకుని తల పడిపోయినటు లాయెను.

‘నేను మీముందు ఒప్పుకొంటిని. ఇది చాలదా?’ అని రుస్తుంజీసే ఠనెను.

‘సర్కారుకు తప్పుచేయుటా? నాకడ తప్పొప్పుకొనుటా?’ అని మెల్లమెల్లగా జవాబు చెప్పితిని.

‘తుదకు, మీరు చెప్పినటులే చేయుదునుగాని నా ప్రాఁతవకీలుతో సలహాచేయరాదా? అతఁడు నాకు వకీలేగాక మిత్రుఁడు’ అని పారసీరుస్తుంజీ యనెను.

* కాచో పారో ఖావో అన్న
తేవుం ఛే చోరీ నుం ధన. (అఖో)

నాకట్లు తెలియఁజేయఁగా ఈ దొంగవర్తకము పలుమారు జరుగుచు వచ్చుచున్నటులు తెలిసెను. ఇప్పుడు ప్రభుత్వమునకీ దొంగతనము కనుఁగొనఁబడెను. నేను ప్రాంతవకీలునకు తెలిపితిని. అతఁడు కేసంతయు ఆలోచించెను. 'ఈకేసు జూరీకి వెళ్లును. అక్కడి జూరరులు భారతీయులను విడిచిపెట్టుదురా? అయినను నా కాశయున్నది' అని వకీలనెను.

నాకీ వకీలుతో గాఢపరిచయము లేదు. పారశీ రుస్తుంజీసేఠ్ యిటులు జవాబు చెప్పెను:

'తమ కిందులకు కృతజ్ఞుఁడను. కాని నేనీ కేసులో గాంధీగారు చెప్పిన చొప్పుననే నడచుకొందును. వారికి నా సంగతి బాగుగ తెలియును. వలయుచో మీరాతనికి సలహా నీయుఁడని చెప్పెను.'

ఇటులనుట వెంటనే ముగించుకొని రుస్తుంజీగారి దుకాణమున కరిగితిమి.

నే నిటు లంటిని: 'బహుశా ఈ కేసు కోర్టునకు పోదు. కేసు పెట్టుటయు మానుటయు సుంకముల యధికారి* చేతిలో నున్నది. సరకారువారికి సలహా యిచ్చు పెద్దవకీలు ఎటర్నీ జనరలు చెప్పిన చొప్పున ఈ సుంకముల యధికారి నడచుకొనవలసి యుండును. నేను వారిరువురిని తప్పక కలిసికొందును. కాని వారికి సంగతి యింతవఱకును తెలియనియెడల నిపుడు చెప్పవలసివచ్చును. వారు వేసిన జరిమానాను చెల్లింపవలయును. తొంబదితొమ్మిదిపాళ్లు వా రంగీకరింతురు. వారొకవేళ అంగీకరింపరేని మీరు జైలుకెక్కవలయును. జైలుకు పోవుటలో లజ్జ లేదు; కాని దొంగతనముచేయుట సిగ్గుచేటని నా యభి

* సుంకములు వసూలుచేయువానికి సుంకరి, సుంకీఁడు, సుంకరేఁడు ఈ మొదలగునవి తెలుఁగుపేరులు. ఇంగ్లీషుపేరు Customs Officer—అను

ప్రాయము. అది జరుగనే జరిగెను. జైలులో పడవలసినచో దానిని ప్రాయశ్చిత్తముగా తలపోయుము. 'ఇఁక ముందెన్నఁడును ఇట్టి దొంగ పని చేయను' అని శపథము చేయుటయే నిక్కమయిన ప్రాయశ్చిత్తము'.

పారసీ రుస్తుంజీగారీ మాటలను సరిగా గ్రహించిరో లేదో నేను చెప్పఁజాలను. అతఁడు కడు ధీరుఁడు; కాని యీ సమయమున ధైర్యమును కోలుపోయెను. అతని ప్రతిష్ఠ పోవు సమయము తటస్థించెను. ఇంత కష్టపడి కట్టుకొనిన యీ కోటను కూల్చుకొనుట కష్టము కాదా?

అతఁ డిట్లనెను: 'నా ప్రాణములు మీచేతిలో నున్నవి. మీ సెలవు ప్రకారము చేసెదను.'

ఈ కేసులో నా వినయశక్తి నంతయు ధారపోసితిని. నేను సుంకరిని గలిసికొంటిని; దొంగతికము నంతయు నిర్భయముగాఁ జెప్పివైచితిని. వలయుచో తమకు లెక్కల నన్నిఁటిని జూపుదు నంటిని. మరియు పారసీ రుస్తుంజీగారికి ఇందులకు మిగుల పశ్చాత్తాపము కలిగెనని చెప్పితిని.

ఆ సుంకరి ఇటు లనెను: 'పాప మా పారసీవృద్ధు మంచివాఁడు. చాల మూర్ఖత చేసినాఁడు. కాని నా విధి మీ రెఱుఁగుదురు. పెద్ద వకీలుగారి యిష్టప్రకారము నేను నడచుకొనవలసి యుండును. మీరు వారితో మాటలాడినచో ప్రయోజన ముండును.'

'మీరు పారసీరుస్తుంజీని కోర్టుకీడ్వకుండినచోఁ జాలు. నాకు సంతోషము.' అని యంటిని.

ఈసుంకరినికడ నభయదానము బొంది సరకారువకీలుగారితో ఉత్తరప్రత్యుత్తరములు నెఱపితిని. వారిని దర్శించితిని.

నా సత్యప్రియత్వ మాయనకుఁ దెలిసెను. నే నేమియు దాఁచలేదని యాయన కవగతమాయెను.

ఈ కేసులోనో, మరియొక కేసులోనో గాని వారు నా కిటులు ప్రమాణపత్రిక నిచ్చిరి: 'మీ కిఁక నాకడనుండి 'లేదు' అని జవాబు రాదు.'

రుస్తుంజీగారిపయిని కేసు పెట్టలేదు. దొంగసొమ్మునకు రెట్టింపు వెల పుచ్చుకొని వదలివేయవలసినదిగా హుకుమాయెను.

రుస్తుంజీగారు తన దొంగతనపు కథనంతయు వ్రాయించి దాని నద్దపుఁ జట్టములో బిగింపించి తన వారసులకును, తోడివర్తకులకును 'ఖబర్దార్' అని చెప్పినటులు తమ ఆఫీసులోఁ గట్టించిరి.

రుస్తుంజీగారికి మిత్రులయిన వర్తకులు 'ఇది సత్యవైరాగ్యము కాదు శ్మశానవైరాగ్యము' అని నాకుఁ దెలిపిరి.

కాని యీ మాట యెంతవఱకు నిక్కమో నేను చెప్పఁజాలను.

నే నీ మాటను రుస్తుంజీగారి చెవిని బడవయిచితిని. ఆతఁడు విని 'మిమ్ము మోసగించి నే నెక్కడికి వెళ్లఁగలను?' అని యనెను.

నాలుగవ భాగము-సమాప్తము

## మొదటి అనుభవము

ఫినిక్సునుండి బయలుదేఱినవారు నేను రాకముందే దేశమునకు వచ్చియుండిరి. నేను ముందు వెళ్లియుండవలయు నని మేము అనుకొంటిమి. యుద్ధమువలన నేను లండనులో చిక్కుపడితిని. ఫినిక్సు పరివారమును దేశములో నెక్కడ నుంచుటా యని యాలోచించితిని. అందఱును ఒక తావుననే యుండి ఫినిక్సునందువలెనే ఆశ్రమము నేర్పాటుచేసికొనవలయు నని నా యభిప్రాయము. దేశమున నాశ్రమము నడపువారి పరిచితియు నాకు లేదు. కావున ఆండ్రూసు గారి దర్శనము చేసికొని వారి సలహాను పాలింపుమని వ్రాసితిని.

వారు మొదట కాంగ్రీ గురుకులమున కరిగిరి. అచట స్వా. శ్రద్ధానందులు వారిని తమ పుత్రులవలె నాదరించిరి. తరువాత వారు శాంతినికేతనమునకుఁ జనిరి. అచట మహాకవియు, వారి యనుయాయులును వీరిమీఁద ప్రేమవృష్టి కురిపించిరి. ఈ రెండు తావులను వారికిఁ గలిగిన యనుభవములు వారికిని, నాకును చాల ఉపయోగించెను.

రవీంద్రులు, శ్రద్ధానందులు, సుశీల రుద్రులు—ఈ మూవురును ఆండ్రూసుగారి ముమ్మూర్తులు. దక్షిణ-ఆఫ్రికాలో వీరినిగూర్చి ఆండ్రూసుగారు వినుకు విరామము లేకుండ జెప్పుచుండెడువారు. దక్షిణ-ఆఫ్రికాయందు మా మిత్రగోష్ఠిలో ఆండ్రూసుగారి హృదయము మీఁదను, నాలుకమీఁదను ఈ మూవుర పేరులు నిరంతరము తాండవించుచుండెడివి. కావున ఆండ్రూసుగారు మావారిని సుశీల రుద్రగారికడకుఁ గొంపోయిరి. రుద్రుల కాశ్రమము లేదు గాని

ఉన్నది యిల్లే. ఆయింటిని వీరికి విడిచిచేసిరి. వారి బాలురను, వీరిని ఒకనాఁటిలోఁ గలిసి పోయిరి. వీరు ఫినిక్సు మఱచిపోయిరి.

బొంబాయిరేవులో దిగిన తరువాత ఏండ్రూసు శాంతినికేతనమున నున్నటులు నాకుఁ దెలియవచ్చెను. కాని గోఖలేగారిని జూచినవెంటనే వారిని గలిసికొనుటకు తొందరపడితిని.

బొంబాయిలో నాకు స్వాగతసత్కారము లొసఁగువేళ చిన్న సత్యాగ్రహ మొకటి చేయవలసివచ్చెను.

పిటిటిగారి భవనమున స్వాగతసభ జరిగెను. వారి స్వాగతమునకు గుజరాతిభాషలో ప్రత్యుత్తర మొసఁగుటకు నాకు ధైర్యము చాల లేదు. కనులకు మిఱుమిట్లు గొలుపు నాభవనపు మిసమిసలలో గిరమిటు కూలివారికి సహచరుఁడ నగు నేను గజిబిజి పడసాగితిని. నేఁటి నా వేసముకన్న నాఁటివేసమునే నాగరక మనవచ్చును. ఏలన, నాఁడు అంగరకా, పాగ మొదలగునవి ఉండెడివి. కాని అలంకృతమగు ఆసమాజములో నేను వేలుపెట్టి చూపించుకొనఁబడినచందముగనే యుంటిని. కాని ఫిరోజిషాగారి చాటున నెటులో యొకటులు నాపని నెఱవేర్చి కొంటిని.

పిదప గుజరాతువారి యోలగము. స్వ. ఉత్తమలాల్ త్రివేదులు దాని సమకూర్చిరి. దీని ముచ్చట ముందే కొంత నాకుఁ దెలిసెను. జిన్నాగారును గుజరాతువారగుటచే సభకు వచ్చిరి. వారు సభాపతులో, లేక ప్రధానవక్తలో యిపుడు గుర్తులేదు. వీరు క్లుప్తముగ, మధురముగ నాంగ్లమున నుపన్యసించిరి. మిగిలిన ఉపన్యాసములుగూడ నాంగ్లముననే జరిగినటులు కొండగుర్తు. పిదప నావంతు వచ్చెను. నేను గుజరాతీలోనే మాటలాడితిని. గుజరాతీ హిందూస్తానీ భాషలయెడ నాకుఁగల పక్షపాతమును కొలఁది మాటలలోఁ జెప్పితిని.

## ౧ మొదటి అనుభవము

గుజరాతువారిసభలో ఆంగ్లభాష నుపయోగించుట కూడ దని వినయ యుక్తముగ నా యసమ్మతిని ప్రకటించితిని. నే నిటులు చెప్పు నపుడు లోపిఱికిగనే యుంటిని. నేను చాలకాలము దేశములో గైరు హాజరు. ఇపుడు స్వదేశమునకు క్రొత్తవాఁడను. అనుభవము లేని వాఁడను. ఇపు డేటి కెదురీఁదుచున్నాను. 'ఇది యవివేకము కాదు గదా?' అని అనుకొంటిని. కాని గుజరాతీలో మాటలాడు నా సాహసమున కెవరును అపార్థము చెప్పలేదు. నా యసమ్మతితో నందఱును నేకీభవించిరి. నా కానందము కలిగెను. మఱియు నా క్రొత్త యుద్దేశములు ప్రజలో ప్రచారము చేయుటయు అంత కష్టము కాదని తెలిసికొంటిని.

నే నీ రీతిగా బొంబాయిలో రెండుమూఁణ్ణాళ్లుండి దేశమును క్రొత్తగా అనుభవములోనికిఁ దెచ్చికొనుచు గోఖలేగారి యాజ్ఞ చొప్పున పూనా చేరితిని.

## ౨

## పూనాలో గోఖలేగారితో

గవర్నరుగారు మిమ్ముఁ జూడఁగోరుచున్నారు గాన మీరు పూనా రాకముందు వారిని గలిసికొనుట మంచి పని నేను బొంబాయి చేరే చేరఁగనే గోఖలేగారు నాకు కబురు పెట్టిరి. నేను గవర్నరుగారి దర్శనమున కరిగితిని. మామూలు మాటలు అయినపిదప గవర్నరుగారు ఇటు లనిరి:

'మీరు నా కొక మాట యీయవలయును. సర్కారునకు సంబంధించి మీ రేమయినను ఆందోళనము చేయఁదలఁచితిరేని ముందు నాతో మాటలాడి మఱి చేయుఁడు.'

నే నిటులు జవా బిచ్చితిని:

'నే నీ మాట కడుసులభముగా నీయఁగలను. ఏ లందురా? నేను సత్యాగ్రహిని. కావున నే నెవరితో సంబంధము పెట్టుకొందునో వారి యుద్దేశ మంతయూ మున్ముందు గనుఁగొందును. పిదప వీలయినంత వఱకు వారి కనుకూలముగ నుండుటకు ప్రయత్నింతును. నేను దక్షిణ-ఆఫ్రికాలో ఎప్పుడును ఈ నియమమునే పాలించియుంటిని. ఇచటఁ గూడ నటులే చేయఁగలను.'

పిదప లార్డ్ విలింగ్డను నాకు ధన్యవాదములు చెప్పి మరియు నిటు లనిరి:

'అక్కఱ కలిగినపు డెల్ల మీరు నన్ను గలిసికొనవచ్చును. సరకారువారు ఇచ్ఛాపూర్వకముగా ఏ పొరపాటును చేయరని మీకు తెలిసివచ్చును.'

నే నిటు లంటిని:

'నే నట్టి విశ్వాసముతోడనే యున్నాను.'

పిమ్మట నేను పూనా కరిగితిని. అచటి విషయము లన్నియుం వ్రాయుటకు నే నసమర్థుఁడను. గోఖలేగారును, వారి సొసయిటీ

సభ్యులును నామీఁద ప్రేమవర్షించిరి. గోఖలేగారు సొసయిటీ సభ్యుల నందఱను పిలిపించినట్లు గుర్తు. మే మందఱమును హృదయములు విప్పి మాటలాడుకొంటిమి. నన్నుఁగూడ వారి సొసయిటీలో నొకసభ్యునిగాఁ జేయవలయు నని గోఖలేగారి తలఁపు. నాకును అట్టి తలఁపే కలదు. కాని సొసయిటీలోని మిగిలిన సభ్యుల తలఁపు వేఱు. సొసయిటీ ఆదర్శములు, దాని కార్యప్రణాళియు వేఱు; నా ఆదర్శములు, నా కార్యప్రణాళియు వేఱు. కావున నాసభ్యత సాధువు కాదు. నాకు నా యాదర్శములను గాపాడుకొనుటలో నెంత పూనిక గలదో యితరుల యాదర్శములను గాపాడుటకుఁగూడ నంత పూనిక కల దని గోఖలేగారికి తెలియును. గోఖలేగా రిటు లనిరి: మీ రాజీ—స్వభావము మావారి కింకను తెలియలేదు. వారికి వారి యాదర్శములయెడఁ గడు పట్టుదల. మరియు వారు కడు స్వతంత్రులు. వారు మిమ్ము సభ్యులనుగాఁ జేర్చికొందురుగాక యని యాసించుచున్నాను. ఒకవేళ వారు చేర్చికొనలేని వారికిఁ దమయెడల ప్రేమగాని, యాదరముగాని యిసుమంతయు తక్కువ కాదని నే ననఁగలను. మీయందలి ప్రేమ యఖండితముగ నుండఁగలందులకే వా రిట్టి సాహసమునకు వెనుకాడుచున్నారు. మీ రిందు సాక్షాత్తు సభ్యు లయినను, గాకున్నను నేను సభ్యు లని పరిగణించుకొందును.

నేను నా సంకల్పముల నన్నిటిని గోఖలేగారికిఁ దెలియఁ జెప్పితిని. ‘సొసయిటీలో నేను సభ్యుఁడనయినను గాకున్నను ఆశ్రమము నొకటి యేర్పఱచి ఫినిక్సు-సహచరుల నం దుంపఁగోరుచున్నాను. నేను గుజరాతువాఁడ నగుటవలన గుజరాతునం దుండియే దేశసేవ చేయుట మిగుల నుచితము. కావున గుజరాతునం దునికి యేర్పఱచుకొనుటకే నిశ్చయించితిని.’

గోఖలేగారికి నా యీ యుద్దేశము రుచించెను. వా రిటు లనిరి:

'తాము తప్ప కటులు చేయుఁడు. సభ్యులతోడనైన మీ సంభాషణఫల మెటులయినను మీ సాశ్రమమునకు ధనము నాకడఁ గొనుఁడు. దాని నా యాశ్రమమే యనుకొందును.'

నా హృదయ ముప్పొంగెను. చందాలు పోగు చేయవలసిన జంజాటము తప్పిపోయెఁగదా యని కడు సంతసించితిని. మరియు భారము నాయొక్క నిమీఁదనుండియు తప్పుచున్నది. 'కష్టకాలము నందు నా కొక మార్గదర్శకుఁడు దొరకె' నను విశ్వాసముచే నా శిరో భారము దిగిపోయినటు లాయెను.

గోఖలేగారు స్వ. డాక్టరు దేవుగారిని పిలిచి 'సొసయిటీ కాతాలో గాంధీగారి పేరొకటి పెట్టుఁడు. వారి యాశ్రమమునకుఁ గాని, వారి ప్రజాసేవకుఁగాని కావలసిన ఖర్చు లన్నియు నొసఁ గుఁడు.' అని యాజ్ఞాపించిరి.

పిదప నేను పూనానుండి శాంతినికేతనమున కేఁగ నుద్యోగించితిని. నేను వెళ్లుటకు ముందు గోఖలేగారు నాకు రుచికరమగు విందొకటి యేర్పాటు గావించిరి. అందు నేను తిను పచ్చిపండ్లు, ఆటీన పండ్లు మొదలగువానిని దెచ్చిరి. విందుచోటు గోఖలేగా రున్న గదికి కొంత దవ్వు. వారి కారోగ్యము సరిలేదు. అంతమాత్రము దూరము గూడ వారు నడచుస్థితిలో లేరు. కాని వాత్సల్యము వారి నాఁపునా! నేనును వచ్చితీరవలె ననిరి. పదియడుగులు నడచిరి, పడిపోయిరి; వారిని వెనుకకుఁ దీసికొని పోవలసివచ్చెను. గోఖలేగారి కిట్టి మూర్ఛలు తఱుచు వచ్చుటచేసి యెవరును గడబిడపడలేదు. పిదప మేము ఆశ్రమములోని అతిథిశాలముందటి మైదానమున పఱచిన తివాచీలమీఁదఁ గూర్చుండి వేఱుసెనగలు, కజ్జము మొదలగువానిని దినుచు ప్రేమాలాపములు చేసికొనుచు నొకళ్ల హృదయ మింకొకళ్ల మెక్కువగాఁ దెలిసికొంటిమి.

నా జీవితములో వారి మూర్ఛయాత్ర యొక సామాన్యవిషయము కాదు.

# 3

## బెదరింపా?

మా యన్నగారు గతించిరి. మా వదినగారిని, తక్కుంగల బంధుగులను జూడవలసియున్నది. కావున బొంబాయినుండి నేను రాజకోటకును, పోరుబందరుకును ప్రయాణ మయితిని. దక్షిణ-ఆఫ్రికాలో సత్యాగ్రహసంగరమున కొక యంగముగా నా వేషమును మార్చికొంటిని. అది గిరిమిటియాల వేషము. సీమలో నింటియం దా దుస్తులనే తాల్చుచుంటిని. దేశములోనికి దిగినతరువాత కాఠియావాడు దుస్తుఁ దాల్పఁగోరితిని. వానిని దక్షిణ-ఆఫ్రికాలో నాకడ నుంచుకొంటిని. బొంబాయిలో వానిని బైకిఁదీసితిని-అంగరకా, ధోతి, తెల్లని తలపాగ ఇవి యన్నియు ఇండియామిల్లునందు తయారయిన వే. బొంబాయినుండి కాఠియావాడునకు మూఁడవతరగతి బండిలో వెళ్ల నిశ్చయించితిని. పాగయు, అంగరకాయు అక్కఱమాలిన బరు వని పించెను. కావున కుడితినీ, ధోతీ, ఎనిమిదిపదణాలు చేయు కాశ్మీరపు టోపి-వీనినిమాత్ర ముంచుకొంటిని. ఇట్టి వస్త్రములు తాల్చినవాఁడు పేదలలో జమ కట్టఁబడును. ఆనాళ్లలో ప్లేగు ఉండుటవలన వీరమగాములోనో, వఢవాణులోనో మూఁడవతరగతి బాటసారులను దింపి పరీక్షించుచుండిరి. నాకు కొంచెము జ్వరము తగిలెను. ఇన్స్పెక్టరు నా చే యంటుకొనెను. వెచ్చగా తగిలెను. 'రాజకోటలో డాక్టరుకు కనఁ బడుము' అని హుకు మిచ్చెను. నా పేరు వ్రాసికొనెను.

వఢవాణులో దర్జీ మోతీలా లనువాఁడు ప్రసిద్ధుఁడగు ప్రజాసేవకుఁడు. బొంబాయినుండి అతనికి వార్త వెళ్లెనుగాఁబోలు! వఢవాణుస్టేషనులో నన్నుఁ గలిసికొనెను. అతఁడు వీరమగామునందలి సాయరీని గుఱించియు, దాన బాటసారులకుఁ గల బాధలగురించియుఁ

చెప్పెను. నాకు కొంత తగిలియుండుటచే ఆస్టేషను బాధాములు స్పష్టము గాలేదు. టూకీగా తేల్పవించి యిటు లంటిని:

'మీరు జైలుకుఁ బోవ తయారుగా నున్నారా?'

ముందువెనుక లాలోచింపకుండ మాట అనివేయు మనుష్యు వారిలో నితఁడును నొకఁడై యుండు నని నే ననుకొంటిని. కాని మోతీలాలు దిట్టముగా—

'మేము జైలుకు తప్పక వెళ్లెదము. కాని మీరు మమ్ము నడిపింపవలయును. కాఠియావాడువారమగుటచే మీ మొదలి హక్కు ముందుగా స్వాతంత్ర్య మున్నది ఇప్పుడు మీ నాశ్రయించెదము. కాని తిరిగి వచ్చునపుడు మీ రిచట దిగవలయును. ఇచట పిల్లలు చేయు పనిని, వారి యుత్సాహమును జూచి తాము సంతసింపఁగలరు. తా మెపుడు రమ్మని సెలవిచ్చిన నే నపుడు నాసేనతో వచ్చెదను' అనెను.

మోతీలాలు న న్నాకర్షించెను. అతనితో నున్న సహచరు లతని నిటుల నుతించిరి:

'అగుటకు మావాఁడు దర్జీవాఁడే కాని తనపనిలో నేర్పరి. రోజు కొక గంట పనిచేసి ౧౫ రూకలు సంపాదించును. వానితో పొట్ట గడచును. మిగిలిన సమయ మంతయు ప్రజాసేవకు వినియోగించును. అతనిముందు మా చదు వంతయు సిగ్గుచేటు!'

పిదప నాకు మోతీలాలుసంగతి తెన్నగా తెలిసెను. ఈ పై స్తుతి అతనియెడ నతిశయోక్తి కాదు. సత్యాగ్రహాశ్రమమును స్థాపించిన పిదప నతఁడు నెలలో కొన్ని దినము లచట నుండెడివాఁడు. పిల్లలకు కుట్టుపని నేర్పెడివాఁడు. ఆశ్రమములో కుట్టుపనినిగూడఁ జేసెడివాఁడు. వీరమగామ ముచ్చటలు ప్రతిదినమును చెప్పుచుండెడివాఁడు. అచట బాటసారులకుఁ గలుగుచుండు కష్టము లితనికి దుస్సహ

సులుగా నుండెను. నిండు ప్రాయమున నతని రోగ మెత్తుకొని పోయెను. అతఁడు చనిపోవుటచే వఢవాను అరణ్యమాయెను.

నేను రాజకోటకుఁ జేరిన మఱుసటినాఁటి ప్రొద్దున హుకుము ప్రకారము ఆసుపత్రికి వెళ్లితిని. నన్నెఱుఁగునవారు చేరి. డాక్టరు నన్నుఁ గని సిగ్గిలెను. ఆఫీసరుపైఁ గినిసెను. ఇందు నసలు కోపకారణము లేదు. ఆఫీసరు తన ధర్మమును తాను చేసికొనెను. అతఁడు నన్నెఱుఁగఁడు. ఎఱిఁగినను తన ధర్మమును తాను జేసికొనక తప్పదు. డాక్టరు నన్ను మరలఁ దనకడకు రానీక నాకడకు ఇన్స్పెక్టరును బంపఁదొడఁగెను.

అట్టి సమయములందు మూఁడవతరగతి బాటసారులను బరీక్షించు టావశ్యకము. గొప్పవార మనుకొనువారు మూఁడవతరగతి బండ్లలో పయనము చేయఁదలఁచుకొనినచో పేదలు పాటింపవలసిన నియమములకు వశవర్తులు కావలయును. అధికారులును పక్షపాతము చూపఁగూడదు. అధికారులు మూఁడవతరగతిబాటసారులను జంతువుల వలెఁ జూచుట నేఁ జూచితిని. ‘నీవు ఓ’యనుట తక్క మఱుమాట లేదు. మూఁడవతరగతివారికి ప్రత్యుత్తరము దొరకదు. విన్నపము వినువాఁడు లేఁడు. అధికారులు వీరిని తమ నవుకరు లనుకొందురు. రైలునవుకరులు వీరిని తన్ని డబ్బు కాఁజేయుదురు; రైలు తప్పింతురు; టికెట్లెగఁబెట్టుదురు. ఇది యంతయు నేననుభవించితిని. ఉన్నదున్నటులు చెప్పితిని. దీనినంతయు మార్పింపవలయును. [illegible] వారు బీదల యుపకారముకొఱకు కష్టములు నెత్తిని వైచుకొని మూఁడవతరగతిలో ప్రయాణము చేయవలయును. వారికి లేని సౌకర్యములను తమకును వలదని చెప్పవలెను. వారి అసౌకర్యము, అవివేకము, అన్యాయము, బీభత్స వీనిని పోఁగొట్టవలయును.

కాఠియావాడులో నాతిరిగిన యెల్లెడల వీరమగాము శాయరీని గూర్చియు, దానికిఁగాను బాటసారుల నాఁపివేయుటను గూర్చియు ఫిర్యాదులను వినుచునే యుంటిని.

లార్డు విలింగ్డనుగారు నాకొసఁగిన వాగ్దానమును నెంటనే ఉపయోగించుకొనఁదలఁచితిని. శాయరీకి సంబంధించిన కాకితముల నన్నిఁటిని జదివితిని. ఫిర్యాదు లన్నియు తథ్యములని గ్రహించితిని. బొంబాయి సరకారువారితో పత్రికావ్యవహారము సాగించితిని. సెక్రటరీని గలిసితిని. లార్డ్ విలింగ్డనుగారినికూడఁ గలిసికొంటిని. వారు సౌహార్దము కనఁబఱచిరి కాని తప్పును ఢిల్లీమీఁద త్రోసిరి.

'ఇది నాచేతులలో నున్నచో ఈ శాయ రిదివఱకే యూఁగి పోయెడిది. మీరు ఇండియాసర్కారును విన్నవించుకొనుఁడు.' అని సెక్రటరీగా రనిరి.

నే నిండియాసర్కారుతో మొర మొదలిడితిని. రసీదు తక్క ప్రత్యుత్తర మేమియు రాలేదు. ఇట్టులు ఇంచుమించు రెండేండ్లు పత్రవ్యవహారము జరిగిన పిదప నేనొ సందర్భమున నేను చెమ్సుఫర్డుగారిని కలిసికొనినపుడీ ముచ్చట నేఁగా వా రాశ్చర్యపడిరి. వారికీ వీరమగాము విషయ మేమియు తెలియనే తెలియదు. నా మాటలను చక్కగా వినిరి. అపుడే వీరమగాముతాలూకు కాకితములను పంపుఁడని టెలిఫో నిచ్చిరి. అధికారు లీ విషయమున చెప్పఁదగిన దేదియు లేనిచో శాయరు రద్దుపఱతు నను మాటను గొంటిని. కొలఁది నాళ్లకే వీరమగాము శాయరీ తీసివేయఁబడినదని పత్రికలలోఁ జూచితిని.

నే నీ విజయమును సత్యాగ్రహమునకు పునాదిగా నెన్నుదును. ఏలన, వీరమగామునుగుఱించి బొంబాయి సర్కారుతో నేను మాటలాడునపుడు సెక్రటరీగారు—'బగస్రాలో మీ రొసఁగిన యుప

వ్యాసపు నకలు నాకడ నున్నది. మీరు దీనిని సత్యాగ్రహ మంటిరి. అది సరికాదు.' అనిరి. మరియు—

'ఇది బెదరించుట కాదా? ఇంత శక్తి గల ప్రభుత్వము బెదరింపులకు లోఁబడునా?' అనిరి.

నే నిటు లంటిని:

'ఇది బెదరింపు కాదు. ఇది ప్రజకు ప్రబోధము కలిగించు నుపాయము. లోకుల దుఃఖములు దూరముచేయుటకు తగిన ఉపాయముల నన్నిఁటిని జెప్పుట నాధర్మము. స్వాతంత్ర్యము గోరువారు తమతము యుపాయముల నన్నిఁటిని ఎఱిఁగియుండవలెను. సామాన్యముగా ఉపాయము లన్నియు హింసాత్మకములు. సత్యాగ్రహమే అహింసాత్మకమగు శస్త్రము. దాని యుపయోగము, దాని మేరలను జెప్పుట, అనఁగా దాని ప్రయోగోపసంహారములు చెప్పుట నాధర్మము. ఇంగ్లీషు సామ్రాజ్యవాదు మహాశక్తిగలవా రనుటలో సందియ మేమియు లేదు. కాని సత్యాగ్రహముకూడ అస్త్రము లన్నిఁటిలో దొడ్డదగు బ్రహ్మాస్త్ర మనుటలో సందియమేమియు లేదు.'

తెలివిగల ఆ సెక్రటరీ తల నూఁపుచు నిటు లనెను:

'చూతముగాక!'

౪

## శాంతినికేతనము

రాజకోటనుండి నేను శాంతినికేతన మరిగితిని. అచట నధ్యాపకులును, విద్యార్థులును నాపైఁ బ్రేమ గురిపించిరి. నిరాడంబరతను, శిల్పమును, ప్రేమను మేళవించి నాకు స్వాగత మొసఁగిరి. కాకాసాహెబ్ కాలేల్కరుగారితో నాకచట ప్రథమపరిచయము.

కాలేల్కరుగారికి కాకాసాహె బను పే రేల వచ్చెనో నాకపుడు తెలియదు. తరువాత దానిసంగతి తెలిసెను. కేశవరావు దేశపాండేగారు సీమలో నాకు సహకాలికులు. నాకును, వారికిని గాఢ మైత్రి యేర్పడెను. వారు బరోడా రాజ్యమున గంగానాథవిద్యాలయమును నడపిరి. విద్యాలయమునందు కుటుంబభావన కలిగింపవలెనని వారి తలఁపు. కావున నుపాధ్యాయులకు నామకరణ మేర్పాటు చేయఁబడెను. కాలేల్కరుగారికి కాకా (కక్క) యను పేరొసఁగఁబడెను. ఫడకేగారు మామ అయిరి. హరిహర శర్మగారు అన్నగా రయిరి. ఇతరులును తగిన పేరుల బడసిరి. కొంతకాలము జరిగినతరువాత కక్కకు మిత్రుఁ డను నర్థము గల స్వామియను పేర ఆనందానందులును, మామకు మిత్రుఁడను నర్థముగల అప్పా యను పేర పటవర్ధనులును ఈ కుటుంబమునందు చేరిరి. ఈ కుటుంబమునందలి యీ యయిదుగురును ఒకరితరువాత నొకరుగా నాకు మిత్రు లయిరి. దేశపాండేగారికి సాహెబ్ అను పేరు విశ్రుతము. విద్యాలయము మూసివేయఁబడినపిదప నీ కుటుంబము చిటిలిపోయెను. కాని యీ కుటుంబము తన యాధ్యాత్మికసంబంధమును విడనాడలేదు. కాకాసాహెబు భిన్నభిన్నస్థలములలో భిన్నభిన్నానుభవములు సంపాదింపఁబోయెను. నేను శాంతినికేతనమున కరిగినతఱి వా రచట నుండిరి.

ఈ కుటుంబములోనివారే యగు చింతామణిశాస్త్రిగారును అప్పు డచట నుండిరి. వీ రిరువురు నచట సంస్కృతము చెప్పుచుండిరి.

ఫినిక్సు-కుటుంబమునకు శాంతినికేతనమున విడిగా బస యేర్పాటు చేయఁబడెను. మగనలాలగాంధీ కుటుంబ-పెద్ద. ఆశ్రమ నియమము లన్నియు సరిగా జరుగునట్లు లతఁడు చూచుచుండెను. అతఁడు తన ప్రేమచే, జ్ఞానముచే, పూనికచే శాంతినికేతనమునం దెల్లెడఁ దన తావిని విరఁజిమ్మెను. అప్పు డచట ఆండ్రూసు పియర్సనుగారు లుండిరి. జగదానందబాబు, నేపాలబాబు, సంతోషబాబు, క్షితిమోహనబాబు, నగీనబాబు, శరదబాబు, కాళీబాబు గా రిందఱితో నాకు లెస్స పరిచయ మాయెను.

నేను నా స్వభావముచొప్పున విద్యార్థులలోను, ఉపాధ్యాయులలోను కలిసిపోయితిని. వారితో శరీరపరిశ్రమమును సహించియు, తన పనిని తాను చేసికొనుట సుఖించియు చర్చింపఁ దొడఁగితిని. జీతము లిచ్చి వంటవారి నేర్పఱచుటకంటె ఉపాధ్యాయులును, విద్యార్థులును తమ పాకము తాము చేసికొనుట మంచి దనియు, ఉపాధ్యాయులు వంటయింటిని పరిశీలించుచుండవలెనని విద్యార్థుల యారోగ్యము, నీతియు చక్కగా నుండుననియు, విద్యార్థులు తమ వంట తాము చేసికొనుచో కొంతపని తీరుదల మీఁదఁ బెట్టుకొందు రొక పదార్థపాఠము చదివికొనినట్లు లగుననియు సూచించితిని. ఒక రిరువు రుపాధ్యాయులు పెదవులు విఱిచిరి గాని పలువురు తలలూఁపిరి. బాలకులకు—వారి స్వభావము నూతన ప్రియము కావున—ఇది రుచించెను. ఇఁక న డ్డేమి? ప్రయత్నము ప్రారంభ మాయెను. నే నీ మాట మహాకవి చెవిని బడవైచితిని. 'ఉపాధ్యాయుల కిది యనుకూలమగుచో నాకును అనుకూలమే' యని వా రనిరి. ఇఁక విద్యార్థుల విషయమున నిది స్వరాజ్యమునకు తాళపుఁజెవి యని వా రభిప్రాయపడిరి.

ఈ క్రొత్తపని నెలకొల్పుటకు పియర్సనుగారు చెమట ఓడ్చిరి. ఇది వారికిం గడు నింపుగా నుండెను. ఒకదెసం గొందఱు కూరలు తఱుగుటకుం గూర్చుండిరి. మఱియొకదెస బియ్యము బాగుచేయుటకుం గొందఱు కూర్చుండిరి. వంటయింటిని చక్కగా శుద్ధి చేయుటకు నగీన బాబు వద్ద్రాలు పూనుకొనిరి. ఇటులు వారందఱు నడుముకట్టుకొని పనిచేయుట చూడంగా నాకు కనులపండువాయెను.

కాని నూటపాతికమంది విద్యార్థులకును, వారి గురువులకును ఒక్కతూరి ఇది సహింపందగినదిగా లేదు. కాన ప్రతిదినము చర్చ జరుగుచుండెడిది. ఇందు కొందఱలసిపోవుచుండిరి. కాని పియర్సను గారలయువారా? వారు చిఱునగవుతో నేదో యొక పని చూచుచుండువారు. పెద్ద పెద్దగుండిగలు మొదలగు పాత్రలు తోముచుట వీరి వంతు. శ్రమ మఱపించుటకుం గాను పాత్రలు తోముచున్నవారిముందు కూర్చుండి కొందఱు సితారు వాయించుచుండిరి. మఱి కొందఱు విద్యార్థులు మఱికొన్ని పను లత్యుత్సాహముతోం జేయందొడంగిరి. ఈ రీతిగా శాంతినికేతనమంతయు తేనెపెరవలె ఝుమ్మనుచుండెను.

ఒకతూరి మొదలు పెట్టంబడిన క్రొత్తపద్ధతు లింక నాంగవు. ఫీనిక్సు వంటయిల్లు స్వాశ్రయమే కాక యందలి పాకముగూడ కడు ఋజువు. దాన పోపు లేదు. బియ్యము, పప్పు, కూరలు, గోధుమ పిండి ఇవి యన్నియు నొకతూరిగనే మరపాయిలో తయారయ్యెడివి. దీనిని జూచి బంగాళీవారి పాకశాలగూడ మార్పుచెందెను. ఒక రిరువు రుపాధ్యాయులు, కొందఱు విద్యార్థులును దీనిని నిర్వహించిరి. దీనికి ఫలితముగా భోజనశాల యంతయు స్వాశ్రయముగా నుండ వీలాయెను.

కాని యేవో కొన్ని కారణములచే నీ పద్ధతి యాంగిపోయెను. జగద్విఖ్యాత మగు నీసంస్థ కొలందికాల మయినను ఈ ప్రయోగము నడపినందువలన దీనికి లోటేమియు రాలేదనియు, దీనివలనం జేకూరిన

కొలఁది యనుభవములచేఁన దీనికి పేరే కలిగెననియు నా యభి ప్రాయము.

కొంతకాలము నేను శాంతినికేతనమునం దుండఁదలఁచితిని గాని విధి నన్ను బలాత్కారముగా గెంటివై చెను. నేనచట నేఁడా ల్గుం టినో లేదో గోఖలేగారు దేహము చాలించిరని తంతివచ్చెను. శాంతి నికేతనమంతయు శోకమున మునిఁగిపోయెను. అందఱును నన్నూఱ డింపవచ్చిరి. అచటి దేవాలయమున సభ గూడెను. అది గంభీరమగు దృశ్యము. నే నానాఁడే నాభార్యతోడను, మగనలాలుతోడను పూనాకు బయలుదేరితిని. మిగిలినవా రెల్లరును శాంతినికేతనమందే యుండిరి.

ఆండ్రూసుగారు బర్ద్వానువఱకు నాతో వచ్చిరి. 'ఇండి యాలో సత్యాగ్రహము సాగింప నెప్పుడేని సమయము వచ్చునా? అగుచో నెప్పుడు? దీనిగుఱించి మీ రాలోచించితిరా?' అని వారడిగిరి.

నే నిటులు సమాధానము చెప్పితిని: 'దీనికి జవాబు చెప్పుట దుష్కరము. ఒకసంవత్సరమువఱకు నే నేమియు చేయనెంచను. 'నీ వొక సంవత్సరము దేశమంతయు తిరుగుచు, గడువు దాఁటునంత వఱకు దేశమునకు సంబంధించిన ఏ ప్రశ్నకును నీ యభిప్రాయమును తెలుపకుము' అని గోఖలేగారు నాకు ఆదేశించిరి. నే నటులు వారికి మాట యిచ్చితిని. నే నిందు ప్రతి-అక్షరమును పరిపాలింపవలయును. గడువుదాఁటిన పిదపఁగూడ నావశ్యకత లేనిచో నే నే ప్రశ్నకును సమాధానము చెప్పఁదలఁపను. కావున మఱియయిదేండ్లదాఁక సత్యా గ్రహముతో పని పట్టునని తోఁపదు.'

ఇక్కడ ఈమాట చెప్పుట మంచిది. హింద్ స్వరాజ్ లోని నా యుద్దేశములను జూచి, 'ఒక సంవత్సరము నీవు హిందూదేశములో నుండుము, నీ యుద్దేశము లన్నియు తమకుఁ దామే సరిపుచ్చు కొనును' అని గోఖలేగారు నవ్వుచుండెడివారు.

౫

## మూఁడవతరగతి బాటసారుల కడగండ్లు

బర్ద్వానులో మూఁడవతరగతి టిక్కెట్టు తీసికొనుటకు మాకుఁ గడుఁ గష్టమయిపోయెను. మూఁడవతరగతి బాటసారులకు ముందుగా టిక్కెట్లు ఈయరని తెలిసెను. నేనపుడు స్టేషను-మాస్టరు కడకు వెళ్ళితిని. ఆయనకడకు వెళ్ళఁగలుగుట మాత్రము సామాన్యమా? స్టేషను-మాస్టరుగారు ఫలానాచోట నున్నారని యెవరో మామీఁద దయఁదలఁచి చెప్పిరి. తుదకు వారికడకు వెళ్ళఁగా వారు నను మూఁడవతరగతివారికి ముందుగా టిక్కెట్లీయఁబడవని చెప్పిరి. కిటికీతలుపు తీయఁగనే టిక్కెట్లు కొనుటకు వెళ్ళితిని. కాని టిక్కెట్లు సులువుగా దొరకు వీలు కానిపింపలేదు. బలముకలవారొకరివెనుక నొకరు త్రోసికొనుచు చనుచుండిరి. నే నా త్రోపులలో నలిగిపోతిని. తుద కెట్టెటులో టిక్కెట్టు దొరకెను.

రైలు వచ్చెను. ఇచటఁగూడ బలము గలవారే త్రోసికొని పోయిరి. ఎక్కినవారును, ఎక్కఁబోవువారును పరస్పరము దూషించుకొనుచుండిరి. వారి తలలును వీరి తలలును డీడిక్కొలుఁ కొట్టుకొనుచుండెను. దీనిలో నేను పాలుగొనలేకపోతిని. కావున మే మిచటనుండి అచటికిని, అచటినుండి యిచటికిని పరుగెత్తితిమి. ఎచటికి వెళ్ళినను ఒకటియే మాట—'ఇచట చోటు లేదు. ఇచట చోటు లేదు.' నేను గార్డువద్దకు వెళ్ళితిని. 'చోటున్నచో కూర్చుండుము! లేనిచో మఱియొక రైలులో వెళ్ళుము!' అని యతఁడనెను.

'నాకు చాల తొందరపని యున్నది' అని నేను వినయముతో పలికితిని. ఈమాట వినుటకు గార్డుకవకాశము లేదు. ఇంతటితో నా పని అయినది. 'ఎచటనో యొకచోట ఇఱుకు'మని మగనలాలుకుఁ

చెప్పితిని. నేను నాభార్యతో ఇంటర్‌క్లాసుబండి యెక్కితిని. ఆ బండిలో నెక్కుచుండఁగా నన్ను గార్డు చూచెను.

అసనసోల్ స్టేషనులో ఇంటర్‌క్లాసు చార్జి వసూలుచేయుటకు గార్డు నాకడకు వచ్చెను. నే నిటు లంటిని: 'మాకు చోటు చూపవలసి నధర్మము మీది. చోటు లేకపోవుటచే నే నిచటఁ గూరుచుంటిని. మూఁడవతరగతిబండిలో చోటు చూపఁగలిగిన నే నచటికి వచ్చుటకు సంసిద్ధుఁడను.'

గార్డుగా రిట్లనిరి: 'నాతో వాదము చేయకుఁడు. చోటు లేదు. బండిబాడుగ యీయనిచో దిగిపోవలసియుండును.'

నాకు పూనాలో తొందరపని. గార్డుతో దెబ్బలాడుటకు నాకు ఉత్సాహము లేదు. గార్డు పూనావఱకును కట్టి నాకడ సొమ్ము వసూలు చేసెను. నా కిది అన్యాయ్య మనిపించెను.

ప్రొద్దుటికి మొగల్‌సరాయి చేరితిమి. మగనలాలునకు మూఁడవతరగతి బండిలో చోటు చిక్కెను. ముగల్‌సరాయిలో నేనును అచటికి మాఱితిని. నేను టికెట్ కలెక్టరుకు జరిగిన సంగతి యంతయుఁ దెలిపితిని. ముగల్‌సరాయిలో నేను మూఁడవతరగతి బండిలోనికి మాఱినట్టులు సాక్ష్యముగా నొక చీటి వ్రాసి యిమ్మంటిని. అతఁ డీయ ననెను. పిదప నేను 'వసూలుచేసిన సొమ్మును ముదరా యి'మ్మని రైల్వే అధికారికి వ్రాసితిని.

'సాక్ష్యపుఁ జీటి లేక డబ్బు వాపసుచేయుట మాకు రివాజు కాదు గాని మీవిషయముమాత్రము వేఱుగా భావించి వాపసు చేయుచున్నాము. మఱియు బర్ద్వానునుండి ముగల్‌సరాయివఱకు వాపసుచేయఁబడదు' అని జవాబు వచ్చెను.

నాఁటినుండియు మూఁడవతరగతిలో నే ననుభవించుచు వచ్చుచున్న యిక్కట్టు లన్నియు వ్రాసినచో నొక మహాగ్రంథ మగును.

కాన ప్రసక్తి కలిగినప్పుడు ముందరి ప్రకరణములలో సందర్భానుసారముగా కొంచెము కొంచెము తెలుపుదును. శరీరము తాళజాలకుండుటవలన మూడవతరగతి బండ్లలో ప్రయాణమును నేను మానివేయవలసి వచ్చెను. ఇందులకు నేను కడు వగచితిని, వగచుచున్నాను. మూడవతరగతి బాటసారుల కడగండ్లకు రైల్వే అధికారుల ఔద్ధత్యమే పరమకారణము. మరియు ఆ బాటసారుల మొరటుదనము, మలినత్వము, స్వార్థపరత్వము, అజ్ఞానము—ఇవియు వారి కడగండ్లకు కారణములు కాకపోవు. ఇంతియకాక ఈ బాటసారులు తమ ఔద్ధత్యమును తాము ఎఱుంగకుండుట, తమ మలినత్వమును తాము ఎఱుంగకుండుట, తమ స్వార్థపరత్వము తాము ఎఱుంగకుండుట—ఇదియంతయుం జాల విచారకరము. వారు చేయునదంతయు వారికి స్వాభావికముగా నుండును. వారు తమ లోపములను దిద్దుకొనం దలపెట్టరు.

వచ్చి చెడి కల్యాణ-జంక్షనుకు చేరితిమి. మగసలాలును, నేనును స్టేషనులోని పంపుకడ నీరుగొని స్నానము చేసితిమి. నా భార్య స్నానము చేయుటకు నేను సన్నాహము చేయుచుండగా సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసయిటీకి సంబంధించిన 'కౌలు' గారు మమ్ము గుర్తించి మాకడకు వచ్చిరి. వారును పూనాకు వెళ్లుచుండిరి. స్నానము చేయుటకు నా భార్యను రెండవక్లాసు స్నానశాలలోనికి తీసికొని వెళ్లుదునని వారనిరి. వారి సౌజన్యము నుపయోగించుకొనుటకు మనసులో సంకోచించితిని. రెండవక్లాసు అవుతుఖానాను ఉపయోగించుకొను నధికారము నా భార్యకు లేదని నేనెఱుంగుదును. కాని అప్పటికి అయోగ్యతను పాటింపనైతిని. సత్యపాలకున కిది తగదు. మరియు రెండవ క్లాసు అవుతుఖానాలో నేను స్నానము చేయవలయునను పట్టుదల నా భార్యకు లేదు. కాని భర్తమోహము సత్యమును మూసెను—'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్.'

## ౬

## నా ప్రయత్నములు

పూనా చేరితిని. ఉత్తరక్రియలు జరిగెను. పిదప సొసయిటీ చేయవలసిన పనులను గుఱించియు, నే నందు సభ్యత్వమును వహించుట గుఱించియు మే మందఱమును విచారించితిమి. ఇది నాకు చాల బరువాయెను. గోఖలేగా రుండఁగా సొసయిటీలో చేరవలసిన యక్కఱ నాకు లేదు. గోఖలేగారి యాజ్ఞను వినుటయే, వారి యిచ్ఛననువర్తించుటయే నా పని. ఆ స్థితియే నా కోరుకొనునది. హిందూ దేశము తుపానులో నున్నపు డొక కర్ణధారుఁడు కావలయును. అట్టి కర్ణధారుఁడు గోఖలే. 'ఆయన కాపాడుచుండఁగా నాకేమిభయము!' అని నే ననుకొంటిని.

ఇప్పుడు వారు గతించిరి. కాన సభ్యత్వమునకు నేను తప్పక ప్రయత్నము చేయవలయును. మఱియు గోఖలేగారి యాత్మకును ఇది యిష్టము అని తలఁచి యిసుమంతయు సందియము లేకుండ పట్టుదలతో ప్రయత్నము చేయఁదొడఁగితిని. అప్పుడచట చాలమంది సభ్యులుండిరి. నాయెడల వారికిఁ జాల భయ ముండెను. దాని బాఱఁద్రోలఁ గడుఁ బ్రయత్నించితిని. దీనఁజేసి వారిలో మతభేదము కలిగెను. కొందఱకు నన్నుఁ జేర్చుకొనుట యిష్టము; మఱి కొందఱకుఁ జాల ననిష్టము. ఇరువాగులవారికిని నే ననిన ప్రేమయే. కాని నామీఁది ప్రేమకంటె వారికి సొసయిటీజవాబుదారీ యెక్కువ కాదా? ఒకవేళ ఎక్కువ కాకున్నను నామీఁది ప్రేమకన్న తక్కువమాత్రము కాదు.

కావున మా వాదములు కటువులు గాక మధురములుగా నుండెను. మఱియు సిద్ధాంతములనే అనుసరించి యుండెను. తను యభిప్రాయములకును, నా యభిప్రాయములకును ఉత్తరమునకును, దక్షిణమునకును ఉన్నంత తేడా యున్నదనియును, ఏ ముఖ్యవిషయముల మీఁద ఈ సొసయిటీని గోఖలేగారు నిలువఁబెట్టిరో వానికే కొలఁది కాలములో హాని కలుగఁగలదనియు ప్రతిపక్షుల వాదము. ఇది సహజమే.

చాల చర్చించి చర్చించి ఇండ్లకు మరలితిమి. నిర్ధారణ మొనరించుటకు వాయిదా వేయఁబడెను.

నాకు సుడిగుండమునఁ బడి కొట్టుకొనినటు లుండెను. అధికులగు మిత్రుల బలముచే సొసయిటీలో దూరుట యుచితమా? నా పని గోఖలేగారి జవాబుదారీని వహించునా? నే నుండుట మూలమున కక్షలుగ చో సొసయిటీ-విషమస్థితికి నేను కారణము కానా? నన్నుఁ జేర్చుకొనుటలో సభ్యులకు మతభేద ముండునంతవఱకు నే నందు ఇటుల సంకించుట పాడి గాదనియు, విరోధికోటిలోనివారి నిట్టి సంకటమునుండి తప్పించుట మేలనియు నాకుఁ దోఁచెను. ఇటులు చేసినయెడల నే సొసయిటీకిని, గోఖలేగారికిని నా జవాబుదారీ యుండునని గ్రహించితిని. నా యంతరాత్మలో నిట్టి నిర్ణయము కలిగినంతనే—'నన్ను సభ్యునిగాఁ జేర్చుకొనుటకు సభ్యులను కూడఁబెట్టి సభ జరుపవలదు' అని శ్రీ శ్రీనివాసశాస్త్రిగారికి ఉత్తరము వ్రాసితిని. నా విరోధికోటిలోనివారికి నా నిశ్చయము బాగుగా నుండెను. వారికి ధర్మసందేహము తొలఁగెను. పైఁగా మాకు చెలిమి బలిసెను. సొసయిటీనుండి నా దరఖాస్తు వాపసు కాఁగనే నే నందు నిక్కముగ సభ్యుఁడ నయిపోతిని.

నే నందు సభ్యుఁడనుగాఁ జేరకుండుట మంచి దాయె ననియు, నన్ను జేర్చుకొనుట కిష్టపడనివారి వాదము సరి యయిన దనియు నా కిపు డనుభూత మాయెను. వారి సిద్ధాంతములును, నా సిద్ధాంతములును చాల భిన్నము లనియు నా కిపు డనుభవ మాయెను. మాకు మతభేద మున్నటులు తెలిసినపిదపఁగూడ మా యాత్మలలో ఎడము లేదు. మా మనస్సులలో భేదము లేదు. మాకు మతభేదమున్నను మేము బంధుగులమే, మిత్రులమే. పూనాలోని సొసయిటీస్థలము నా కొక క్షేత్రము. లౌకికదృష్టిలో నేను సభ్యుఁడను గాకున్నను ఆధ్యాత్మిక దృష్టిలో సభ్యుఁడనే. లౌకిక సంబంధముకంటె నాధ్యాత్మిక సంబంధ మనర్ఘము. ఆధ్యాత్మికసంబంధము లేని లౌకికసంబంధము ప్రాణము లేని దేహముతో సమానము కదా!

౭

## కుంభోత్సవము

డాక్టరు ప్రాణజీవనదాస్ మెహతాగారితో మాటలాడుటకు రంగూను పోఁదలఁచితిని. దారిలో కలకత్తా కలదు. అచట భూపేంద్రనాథవసుగారు నన్ను రమ్మని కోరిరి. వంగీయు లతిథుల నెంత పూజింతురో అంత పూజయు సమగ్రముగా నచటఁ గానవచ్చెను. నే నా దినములలో పండులనే భుజించుచుంటిని. నా కుమారుఁడు రామదాసు అపుడు నావెంట నుండెను. కలకత్తాలోఁ గల పండ్లన్నియు నాకొఱకు తీసికొనిరాఁబడెను. స్త్రీలు రాత్రియంతయు మేలుకని బాదము, పిస్తా మొదలగు పండ్ల బరడు లొలుచుచుఁ గూర్చుండిరి. రకరకముల పండ్లు చక్కగను, నేర్పుగను సిద్ధము చేయఁబడెను. నాతో వచ్చినవారికి రకరకముల పక్వాన్నము లొనర్పఁబడెను. దీనఁగల ప్రేమమును, వివేకమును నే నెఱుఁగుదునుగాని యొక రిరువు రతిథులకు ఇంటిల్లిపాది రే యెల్లయు మేలుకని యుపచరించుట దుస్సహము. కాని యీగండము దాఁటుటకు నా కుపాయ మేమియు లేకపోయెను.

రంగూను పోవు స్టీమరులో నేను డెక్కుమీఁద కూర్చుండఁ దలఁచితిని. వసుగారి యింట నెంత సత్కార మందితిమో స్టీమరులో నంత యసత్కార మందితిమి. డెక్కుమీఁద పయనించువారి కష్టము లన్నియు ననుభవించితిమి. స్నాన మొనరించు చోట నిలువలేనంత కంపు! మఱుఁగు దొడ్డి నరకము! మలమూత్రములు తొక్కుకొనుచు దూఁకి పోవలయును. నా కిది దుర్భరమాయెను. నే నిది యంతయు కెప్టెనుకు విన్నవించితిని. కాని వినువా రెవరు? బాటసారులు తమ మురికిచే డెక్కంతయు ఖరాబుచేసివైచిరి. కూరుచుండుచోటనే

ఉమియుదురు. పొగాకు కలిసిన తమ్మరసము ఘూత్కరింతురు. తినఁగా మిగిలిన మెతుకుల నచటనే దిగవాడుదురు. వారు మాట్లాడునవి మాటలు కావు; అఱపులు. ప్రతివాఁడును వీలయినంత చోటు నాక్రమించుకొనఁ బ్రయత్నించును. తా నాక్రమించుకొనిన చోటుకంటె తన సామానుకు కావలసిన చోటెక్కువ. ఆ రెండు రోజులును ముక్కుమూసికొని వెళ్లఁబుచ్చితిని.

రంగూనులో దిగఁగనే ఏజెంటు కీసంగతి యంతయు వ్రాసితిని. నేను మరల డెక్కుమీఁదనే తిరిగి వచ్చితిని. నా వ్రాసిన చీటి వలనను, డాక్తరు మెహతాగారి ప్రయత్నమువలనను అప్పుడంత కష్ట మనుభవింప లేదు.

రంగూనునందును నా కక్కఱ కలవాని కన్న నెక్కుడు పండ్లనే సమకూర్చిరి. డాక్తరు మెహతాగారి యిల్లు నాకు స్వగృహమే. కావున నేనచట తినుబండముల సంఖ్య తగ్గించితినిగాని తినెడి పరిమాణమును తగ్గింపనయితిని. కావున రకరకముల పండ్లు తీసికొనివచ్చెడివారు. నేనును వానిని నిషేధింపనయితిని. ఆ కాలములో క్రొత్తక్రొత్తవస్తువులు నాకనుల నాకర్షించెడివి. వానిఁ జూడఁగా నాలుక యూరెడిది. మరియు తినుట కొక వేళ పాళ లేదు. నాకు గూఁటదీపము, నోట మెతుకైనను మేము భుజించి లేచువఱకు ఎనిమిది, తొమ్మిది గంట లయ్యెడిది.

౧౯౧౫ సాలున హరిద్వారమున కుంభోత్సవము. నే నచటికి వెళ్లక తప్ప దనుకొంటిని. మరియు మహాత్ములగు మున్షీరాముగారి దర్శనము చేసికొనవలయు ననుకొంటిని. గోఖలేగారి సోసయిటీవారు కుంభోత్సవమునకు స్వయంసేవకులను పంపిరి. వారికి హృదయనాథ కుంజ్రూగారు అధిపతులు. స్వర్గీయులగు డాక్తరు దేవుగారును ఆ

స్వయంసేవక సేనలో నొకరుగా నుండిరి. మా జట్టుతో రమ్మని నాకు వార్త వచ్చెను. మగనలాల్ గాంధీ శాంతినికేతనమునం దున్న మా తుకడీని తీసికొని నాకన్న ముందే హరద్వారమున కరిగెను. నేనును రంగూనునుండి వచ్చి వీరిని గలిసికొంటిని.

కలకత్తానుండి హరద్వారమునకు రైలులో పోవుచు మా పడ్డ పాట్లు భగవంతున కెఱుక. రైలుబండ్లలో కొన్నివేళల దీపములయినను ఉండెడివి కావు. శహరాన్‌పురమునుండి మేము సామానులవలె, జంతువులవలె క్రిక్కిరిసిపోయితిమి. పైకప్పు లేని రైలుపెట్టెలు, పైని మధ్యాహ్నసూర్యుడు, క్రింద కాలుచున్న యినుపరేకులు: ఇక మాపని యెటు లుండెనో చెప్పవలయునా? దప్పిచే నాలుక యెండిపోయినను ఆ యెండలో ఛాందసులగు హిందువులు చత్తురు కాని, తురకలు నీరు తెచ్చుచో ముట్టరు. 'హిందూనీళ్లు' వచ్చిననే త్రాగుదురు. ఈ హిందువులే వ్యాధిగ్రస్తులగుచో నపుడు తనకు డాక్టరులు బ్రాంది నిచ్చినను, తురకకాంపౌండరులు, కిరస్తాని కాంపౌండరులు నీరు తెచ్చినను, మాంసరస మిచ్చినను త్రాగుటకు సంకోచింపరు.

హిందూదేశమునందు మనకు పాకీపని చేయుటయే విశేషమయిన పని యని శాంతినికేతనమున నేను గ్రహించితిని. ఒక సత్రమునం దీ స్వయంసేవకులకు డేరాలు వేయఁబడెను. డాక్టరు దేవుగారు మఱుఁగుదొడ్లుగా నుపయోగించుటకు కొన్ని గోతులు త్రవ్విరి. వీనిని బాగుచేయుటకు డబ్బిచ్చి పాకీవాండ్ర నేర్పాటు చేయఁ జూచుచుండిరి. ఈ దశలో 'ఈ పని యంతయు మా ఫినిక్సువారిది' అని నే నంటిని. డాక్టరు దేవుగా రంగీకరించిరి. ఇక మాలో మాట యిచ్చువాఁడను నేను; పని చేయువాఁడు మగనలాల్ గాంధీ.

డేరాలో కూర్చుండి యాత్రికులకు దర్శన మిచ్చుట, ధర్మ ప్రసంగము చేయుట, తదితరప్రసంగము చేయుటయూ నా పని. ఈ దర్శనము లిచ్చుటతో నాపని చెల్లు. ఒక్క నిముసమేని తీరుబాటు లేదు. స్నానమునకు వెళ్లినపుడును నన్ను విడిచిపెట్టెడివారు కారు. ఇంక నన్ను ఫలాహారము మాత్రము చేయనిత్తురా? దక్షిణ-ఆఫ్రికాలో నా చేసిన యల్పసేవ హిందూదేశమునం దంతటను తెలియఁబడియె నని హరద్వారమున కనుఁగొంటిని.

నేను తిరుగలిలో నలిగిపోతిని. మూఁడవతరగతిలో ప్రయాణించు నపుడు నేనందఱితోపాటు కష్టము లనుభవించితిని. అపుడు నన్నెఱుఁగినవారు లేరు. ఎఱిగినంతటనే దర్శనము గోరు జనులచే పరివేష్టింపఁబడిపోతిని. ఈ రెండు స్థితులలో నేది దయాజనకమో నిర్ణయించుకొనుటకుఁ జాలఁ గష్టపడితిని. దర్శనమునకు వచ్చు మూఁకను జూచి కోపము వచ్చుచుండెడిది. తలఁచి సంతాపముకూడ కలుగుచుండెడిది. మూఁడవతరగతి ప్రయాణములవలన కష్టము మాత్రమే కలిగెడిది; కోపము కలిగెడిది కాదు. కలిగిన కష్టముకూడ మేలునకే యుపయోగించెడిది.

నా కొన్నాళ్లలో ఇష్టము వచ్చినటులు తిరుగుటకు శక్తియుండెడిది. ఆ కాలములో నాకు రస్తాలో కొల్లబడుటకుఁగూడ వీలు లేనంత ప్రసిద్ధి లేదు. అచటఁ గూడిన జనులకు ధర్మచింత తక్కువ. అజాగరూకత, చంచలత, పాషండత యెక్కువ. సాధువులు ఈఁగల యవిసినటులు పుట్టుకొని వచ్చిరి. పాలు, పంచదార తినుటకు వారు పుట్టినటు లుండిరి. ఇచట నే నయిదు కాళ్లు గల యావును జూచితిని. నాకాశ్చర్యము కలిగెను గాని యెఱిఁగినవారు నా యజ్ఞానమును పాఱఁద్రోలిరి. ఈ యావు దుష్టుల లోభమునకు బలి యాయెను. తెగ

కాలు తెగఁగొట్టి ఆవుమూఁపురపు తోలుచీల్చి అచట నీ కాలు కుట్టి యయిదుకాళ్ళ యావును జేసిరి. ఈ రెండు పాతకములకును ఫల మేమనఁగా నమాయికుల కడనుండి ధనము దోచుకొనుటయే. అచట ఈ యయిదుకాళ్ళ యావును జూడని హిందు వెవఁడును లేఁడు. దానిని చూచినందులకుఁగాను తప్పక డబ్బిచ్చిన హిందు వెవఁడును లేఁడు.

కుంభోత్సవదినము వచ్చెను. నాకా దినము ధన్యము. తీర్థయాత్ర యనుకొని నేను హరద్వార మేఁగలేదు. తీర్థక్షేత్రములవలన పవిత్రతాగుల సంపాదింపవలయు ననుమోహము నా కెన్నఁడును లేదు. అప్పు డచటికి పదియేడు లక్షల జనులు వచ్చి రనుకొనిరి. ఆ వచ్చిన పదియేడు లక్షల జనులును పాషండులా? వీరిలో పలువురు పుణ్యము కొఱకును, ఆత్మశుద్ధికొఱకును వచ్చియుందు రని చెప్పుటలో నాకిసుమంతయు సందియము లేదు. ఇట్టి విశ్వాస మాత్మోన్నత్యము కలిగించుట అసంభవము కాదుగాని కొంచెము కష్టమని మాత్రము చెప్పవలయును.

ప్రక్కపయిఁ బరుండి నేను విచారసాగరమున మునిఁగి పోయితిని. ఈ పాషండులనడుమ పవిత్రులును గలరు. నా కీశ్వరునిముందు నిర్దోషులని చెప్పవచ్చును. ఇట్టి సమయమున హరద్వారమునకే వచ్చుట తప్పగునేని నే నా విషయమును వెల్లడించి కుంభోత్సవము నాఁడు హరద్వారమును విడనాడియుందును. హరద్వారమునకు వచ్చుటయు, కుంభోత్సవమునాఁ డచట నుండిపోవుటయు పాపము కానిచో నే నేదో యొక కఠినవ్రతమును బూని యచట జరుగుచున్న పాపమునకుఁ బ్రాయశ్చిత్తమును, ఆత్మశుద్ధిని చేసికొనవలయునని తలఁచితిని. నేను వ్రతము లొనరించుటకే పుట్టితిని గావున నేదో యొక

కఠినవ్రత మాచరింపఁదలపెట్టితిని. కలకత్తాయందును, రంగూనునందును నాకొఱకు నా మిత్రు లనావశ్యకముగ శ్రమను బొందుటయు ఆ సమయమున నాకు గుర్తు వచ్చెను. ఈ కారణమున తినెడు వస్తువుల కొక హద్దేర్పఱుపను, సూర్యాస్తమయమునకు ముందే భుజింపను నిశ్చయించికొంటిని. నేను భోజనమున కొక హద్దు నేర్పఱచికొననిచో నా కాతిథ్య మిచ్చువారలకు కష్టము కలిగింతు ననియు, నేనే యొకరికి సేవ చేయవలసియుండఁగా నొరులచే నేనే సేవింపఁబడుచుందు ననియు గ్రహించితిని. కావున ఇరువదినాలుగు గం॥ల పరిమితి గల కాలములో నయిదు వస్తువులకన్న నెక్కువ ముట్ట ననియు, చీకటిపడినతరువాత భుజింప ననియు వ్రతము గొంటిని. ఈ రెంటి కష్టములఁ జెప్పగా విచారించితిని. ఈ రెంటిని ఇంచుకేనియు జవదాఁటకుండుటకు నిశ్చయించితిని. రోగము వచ్చినప్పుడు ఔషధరూపముగా నెక్కువ వస్తువులను తినుటయా, తినకుండుటయా? మందును గూడ నీ యైదు వస్తువులలో చేర్తునా, చేర్చనా? అను నీ విషయము లన్నిఁటిని చర్చించి 'తినఁదగిన వయినచో సరి; అయిదింటి కంటె నెక్కువ వస్తువులను దినను' అని నిశ్చయించితిని. నే నీవ్రతములు పూని పదమూఁడేండ్లాయెను. ఇవి నన్ను లెస్సగా పట్టి చూచెను. ఇవి నన్నిట్టులు పట్టి చూచుటయే నాపాల రామకవచమాయెను. ఈవ్రతముల వలన నా యాయువు పెరిఁగెననియు, వీనివలన పలుమాఱులు రోగముక్తుఁడనయితి ననియు నా యభిప్రాయము.

## ౮

## లక్ష్మణ-ఝూలా (వంతెన)

కాంగడితవారు మున్షీరామ మహాత్ములు. వారిని, వారి గురుకులమును దర్శించిన తరువాత నాకు చాల శాంతి కలిగెను. హరద్వార కోలాహలమునకును, గురుకులశాంతికిని గల భేదము నాకు వెంటనే స్పష్టముగా కానిపించెను. మహాత్ములు తమ ప్రేమతో నన్నోలలాడించిరి. బ్రహ్మచారు లందఱు నన్ను భక్తిశ్రద్ధలతో గారవించిరి. రామదేవుగారిని నేను మొదట నిచటనే చూచితిని. వారి కార్యశక్తిని వెంటనే నేను కనుఁగొనఁ గలిగితిని. మాకు కొన్ని విషయములలో మతభేదము లున్నను కొలఁదిరోజులలోనే మా పరిచయము స్నేహముగా పరిణమించెను. నేనచట రామదేవాచార్యులతోడను, తదితరాచార్యులతోడను పనిపాటలు నేర్పుటను* గూర్చి చాల సంభాషించితిని. వెంటనే గురుకులమునుండి సెలవు తీసికొనవలసి వచ్చుట నాకు సంతాపకర మాయెను.

‘లక్ష్మణఝూలా’ తప్పక చూడఁదగినదని యెక్కువగా వింటిని. ఇంతదూరము వచ్చి హృషీకేశము చూడకుండ పోవుట మంచిది కాదని పలువురు మిత్రులు నొక్కి చెప్పిరి. లక్ష్మణ-ఝూలా హృషీకేశమునకు దగ్గఱ. నేను నడచి పోనెంచితిని. హృషీకేశ మొక మజిలీ; రెండవ మజిలీ లక్ష్మణ-ఝూలా.

హృషీకేశమున పలువురు సన్న్యాసులు నన్నుఁ జూడ వచ్చిరి. వారిలో నొకరికి నాజీవన వృత్తాంతము రమణీయముగా కానిపించెను. ఫినిక్సు-జట్టంతయు నావెంట నుండెను. ఆయన మమ్ముల నందఱను జూచి చాల ప్రశ్న లడిగెను. మాతో ధర్మమును గుఱించియు ప్రసం

* Industrial Training

గించెను. నాలో ధర్మము నెడల తీవ్రాభిలాషము కల దని యతఁడు గ్రహించెను. నేను గంగలో స్నానముచేసి వచ్చుచుంటిని. నా శరీరముమీఁద చొక్కాలు, గిక్కాలు లేవు. నాకు శిఖాయజ్ఞోపవీతములు లేవు. ఇట్టి నన్నుఁ జూచి దుఃఖితుఁడై యా సన్యాసి 'నీవాస్తికుఁడవు. నీకు శిఖాయజ్ఞోపవీతములు లేకుండుట నాకు విచారముగా నున్నది. ఈ రెండును హిందూధర్మమునకు బాహ్యచిహ్నములు. హిందువయినవాఁ డీ రెంటిని తప్పక తాల్పవలయు' నని పలికెను.

పోరుబందరులో బ్రాహ్మణబాలకులు జందెములకు తాళపుచెవులు కట్టుకొనుచుండుట చూచితిని. ఆ తాళపుచెవుల ఝుంకారము నేను వినుచుంటిని. నా కపుడు పదియేండ్లు. వారివలెనే జందెము వేసికొని దానికి తాళపుచెవులు కట్టుకొని గిరున త్రిప్పుచు వాని ఝుంకార మాలకించుచుండవలెనని నాకును అభిలాష కలిగెను. ఆ కాలమున కాఠియావాడు కోమటులకు జందెము వయిచుకొను నాచారము లేదు. కాని ద్విజమాత్రులు జందెము తాల్చితీరవలయు నను నొక ప్రచారము అపుడే యారంభ మాయెను. గాంధీకుటుంబమువారందఱు జందెములఁ దాల్పఁగడఁగిరి. మావారి కిరువురకును, నాకును అపు డొక బ్రాహ్మణుఁడు రామరక్ష చెప్పుచుండెను. ఆయన మాకు జందెములు వయిచెను. అపుడు నాకు తాళపు చెవులతో పని లేకున్నను రెండుమూఁడు దానికి తగిలించి త్రిప్పఁదొడఁగితిని. పిదప జందెమెపుడో తెగెను గాని మరల జందెము వేసికొనవలయు నను వ్యామోహము నాకు కలిగినటులు గుఱుతు చాలదు. పిదప నేను క్రొత్త జన్నిదమును తగిలించుకొనలేదు.

పెద్దవాఁడ నయిన పిదప నాచేత జందెము తాల్పఁజేయుటకు పలువురు ప్రయత్నించిరి. కాని వారి ప్రయత్నము నామీఁద ప్రస

రింపలేదు. శూద్రులకు జందెములు తాల్చు నధికారము లేకున్నచో తదితరుల కేల యుండవలయును? ఈ బాహ్యచిహ్నమును ధరించు నలవాటు మాకుటుంబములో లేదు. మరియు దీనిని ధరించితీరవలయు ననుటకు ప్రబలమగు కారణము నాకుఁ గానరాలేదు. 'నాకు జందెము మీఁద గోఁత లేదుకాని దానిని దాల్చుటకుఁ దగినంత హేతువు కానరాలేదు. నేను వైష్ణవుఁడను గాన తావళము దాల్చితిని. పెద్దలు మాయన్నదమ్ములకు పిలక నుంచుటలో జాగ్రత్తగనే యుండిరి. కాని నాకు సీమలో పిలక తీసివేయవలసివచ్చెను. తెల్లవారు చూచి నవ్వుదురనియు, న న్ననాగరకుఁ డని యందురనియు సిగ్గుపడి నేనచట పిలకను తీసివేసితిని. మాయన్నగారి కుమారుఁడు ఛగన్‌లాల్ గాంధీ దక్షిణ-ఆఫ్రికాలో నాకడ నుండెడివాఁడు. అతఁడు పట్టుదలతో శిఖ నుంచుకొనెను. ప్రజాకార్యముల కతని శిఖ యడ్డు వచ్చునని యతని మనస్సునకు బాధ కలిగినను గూడ లెక్కగొనక నేనతని పిలక తీసివేయించితిని. ఈరీతిగా పిలకనుగురించి నాకింత సిగ్గుండెడిది.

నే నా స్వాములవారి కీకథనంతయు వినిపించి పిదప నిటు లంటిని :

'జందెము నేను వేసికొనను; ఏలయనిన చాలమంది హిందువులకు జందెము లేదు. అయినను వారు హిందువులే. మరియు దాని యక్కఱ నాకుఁ గానిపించుటలేదు. మరియు యజ్ఞోపవీతధారణ మనఁగా జన్మాంతరధారణము. జన్మాంతర మనఁగా శుద్ధజీవనము, ఉన్నతజీవనము. ఈకాలమున హిందూసమాజమును, హిందూస్థానమును ఈరెండుగూడ వెనుకఁబడి యున్నవి. ఇట్టి స్థితిలో మనకు జందెము దాల్చు నధికార మేడ? హిందూసమాజ మస్పృశ్యతను విసర్జించిన నాఁడు, ఉచ్చనీచభేదములను మఱచిననాఁడు, ఇతరదోష

ముల నీసడించిన నాఁడు, నాలుగుదిక్కులను పిక్కటిల్లిన యుఘర్మమును, పాషండతను పాఱఁద్రోలిన నాఁడు మనకు యజ్ఞోపవీతమును ధరించు నధికారము రాఁగలదు. కావున ఉపవీతమును గుఱించి మీరు చెప్పిన మాట నాకు గిట్టదు. ఇఁక పిలకనుగుఱించి కొంచెము విచారింపవలసి యున్నది. నా కీవఱకు పిలక యుండెడిది. కాని సిగ్గుచేతను, భయము చేతను దానిని దీసివయిచితిని. ఇపుడు దానిని మరలఁ బెంచఁ దలఁచు చున్నాను. నా సహచరులతోఁగూడ నీ విషయమును విచారించెదను.'

జందెమునుగుఱించి నాచెప్పిన మాటలు స్వాములవారికి నచ్చ లేదు. జందెము తాల్పకుండుటకు నే నే కారణములను జెప్పితినో వా రా కారణములనే జందెము తాల్చుటకు ప్రమాణముగాఁ జెప్పిరి. అది యటుండె. జందెమునుగుఱించి యీయభిప్రాయములు నేఁటికిని మాఱ లేదు. పలు మతము లున్నంతవఱకును ఒకొక్కమతమున కేదో యొక బాహ్యసంకేత ముండుచునేయుండును గాని, యీ బాహ్యసంకేతము డంబమున కగునేని, ఇతరమతములకన్న తనగొప్పను ప్రకటించుకొను నేని యది త్యాజ్యమగును. ఈకాలమున జందెము హిందూమతమున కభివర్ధకమగు సాధనముగా నాకుఁ గానిపించదు. కావున నే నీ విషయమున తటస్థుఁడ నయి యుంటిని.

పిలకను సిగ్గుచేతను, భయముచేతను దీసివేసితినిగాన నా సహచరులతో సంప్రతించి మరల పిలకను బెంచఁ దలఁచితిని. ఇఁక నీ విషయ మటు లుంచి లక్ష్మణ-ఝూలా దెస కేఁగుదము.

హృషీకేశము, లక్ష్మణ-ఝూలా యీ రెండును జూచి తీరవలసినవి. మన ప్రాచీనుల ప్రకృతిసౌందర్యజ్ఞానమునకును, శిల్పమునకు ధర్మస్వరూపమొసఁగువారి దూరదర్శిత్వమునకును నా కత్యాదరము జనించెను

కాని యట్టిచోటుల మనుష్యు లొనరించు పనులు చూచి నాకు శాంతి నిలువలేదు. హరద్వారమునందువలెనే హృషీకేశము నందును బాటల ప్రక్కల సుందరమగు గంగాతీరములయందు మనుష్యులు గోఁతచేసివయితురు. అది పావనమగు గంగాజల మని యయినను వారికి తోఁచదు. కొంచెము దవ్వేఁగినయెడలఁ గావలసినంత చోటు దొరకుచుండఁగా బాటలను, నదులయొడ్డులను పాడుచేయుట చూచి కడు సంతసించితిని.

లక్ష్మణ-ఝూలా యనునది ప్రేలాడుచుండు నొక యినుప వంతెన. లోఁగడ నచట త్రాటితోఁ జేయఁబడిన యొక చక్కని వంతెన యుండెడిదఁట. ఉదారహృదయుఁ డగు నొక మారువాడీ సజ్జనుఁడు దానిని దీయించి చాల సొక్కము వెచ్చించి యీ యినుప వంతెన వేయించి దాని తాళపుచెవులు గవర్నమెంటువారికి వశపఱిచెనఁట! నేను చూచియుండ లేదు గాన లోఁగడనున్న త్రాటివంతెనను గుఱించి యేమియుఁ జెప్పఁజాలను గాని, యీ యినుపవంతెన యచటి ప్రకృతిసౌందర్యమునకు కళంక మనియు, నస్థానపతిత మనియుఁ జెప్పఁ గలను. నిక్కమున కిది యాత్రికుల వంతెన. దాని తాళముచెవులు సర్కారువారి కీఁబడియెను. రాజభక్తి గల నా కొనాఁటికే యీ విషయము కటువుగా నుండెను.

దీనికంటె దుఃఖజనకమగు దృశ్యము స్వర్గాశ్రమము. టిన్ రేకుల పాకలకు స్వర్గాశ్రమ మని పేరిడిరి కాని వేఱేమియు లేదు. ఈ పాకలు సాధకులకుఁగాను వేయఁబడియె నని వింటిని. కాని యచట నప్పుడు సాధకుఁ డెవఁడును నున్నటులు లేదు. అచటి ముఖ్యస్థలమునం దున్నవారిని చూచితిని గాని వారు గొప్పవారని నాకుఁదోఁపలేదు.

హరద్వారమునందు నాకుఁ గలిగిన యనుభవము లమూల్యము లనుటలో సందియ మిసుమంతయు లేదు. అవి నా యునికిని గుఱించియు, నా పనిని గుఱించియు నిశ్చయించుటకు చాల సాయ మొనరించెను.

## ఆశ్రమస్థాపనము

నేనీ కుంభయాత్ర చేయుటకు ముం దొకతూరి హరిద్వార మరిగియుంటిని. ౨౫-౫-౧౯౧౫లో సత్యాగ్రహాశ్రమము స్థాపింపఁబడెను. శ్రద్ధానందులవారు నన్ను హరద్వారమునం దుండఁగోరిరి. కలకత్తా మిత్రులు కొందఱు వైద్యనాథమునం దుండుమనిరి. రాజకోటలో నుండుమని మఱికొందఱు మిత్రులు పట్టుపట్టిరి.

నే నమదాబాదుమీఁదుగా వెళ్లుచుండునప్పుడు పలువురు మిత్రులు నన్నమదాబాదునం దుండుమనిరి. ఆశ్రమమునకగు వ్యయమును తాము భరింతుమనిరి. మాకు నివసించుటకు నిండ్లు చూచెదమనిరి. ఈ కారణములచే నా కమదాబాదుమీఁదనే మాపువడెను. నేను గుజరాతువాఁడ నగుటచే గుజరాతుభాషవలన దేశమునకు నా చేయఁగలిగినంత సేవయును చేయఁగలుగుదు నని తలఁచితిని. మఱియు అమదాబాదు చాలఁగాలమునుండియు చేతిమగ్గములకు కూడలి. కావున నిచట రాటముల పని బాగుగా సాగఁగలదనియు, నిది గుజరాతుదేశమునకు ప్రధాననగర మగుటఁజేసి యచటఁ గల ధనవంతులు ధన మొసఁగి చాల సాయము చేయఁగల రనియు తలఁచితిని.

అమదాబాదు మిత్రులతో ఆశ్రమమును గుఱించి మాటలాడు సందర్భమున అస్పృశ్యులను గుఱించియు లెస్సగా చర్చించితిని. యోగ్యుఁడగు నంత్యజసోదరుఁ డెవఁడేని యాశ్రమమునఁ బ్రవేశింపఁ గోరినచో నేను తప్పక చేర్చుకొందునని వారికి స్పష్టముగాఁ జెప్పివయిచితిని.

'మీ నియమములను పరిపాలింపఁగల యంత్యజుఁ డెవఁడేని దొరకినపుడు చూతము లెం' డని యొక వైష్ణవమిత్రుఁడు తన మన

స్సంతోషమును వెల్లడించెను. తుదకు నేనమదావాదునం దాశ్రమము స్థాపింప నిశ్చయించితిని.

శ్రీ జీవనలాల్ దేశాయి బారిస్టరుగారు నన్నమదావాదులో నుండఁగోరినవారిలో ప్రధానులు. మేము వారి కోచరబ్-బంగాళా నద్దెకుఁగొని యందుంటిమి.

పిదప ఆశ్రమమునకు ఏమి పేరు పెట్టవలయు నని చర్చకు వచ్చెను. నేను మిత్రులతో నాలోచించితిని. సేవాశ్రమ మనియు, తపోవనమనియు నెవరికిఁ దోఁచిన పేళ్లు వారు చెప్పిరి. సేవాశ్రమ మను పేరు బాగుగనే యుండెనుగాని దాన సేవారీతి తెస్సగా తోఁపదు. ఇఁక తపోవన మనుపే రెటులు పెట్టుకొనఁజెల్లును? మాకు తపస్సనినఁ బ్రియమేకాని యీ పేరు మాతల దాఁటినది. మా యుద్దేశము సత్యమును పూజించుట, సత్యమును శోధించుట, సత్యము నెడలఁ బట్టుదల వహించుట, మరియు దక్షిణ-ఆఫ్రికాలో మేము చేసిన పద్ధతిని హిందూదేశమువారిచే చేయించుట, మరియు దాని శక్తి హిందూదేశమున నెంత పని చేయునో చూచుట నా యుద్దేశము. కావున నా సహచరులును, నేనును సత్యాగ్రహాశ్రమ మను పేరును నిర్ణయించితిమి. ఈపేరువలన సేవయు, సేవాపద్ధతియు సహజముగా గోచరించును.

ఆశ్రమమునకు నియమావళి యుండవలయును. చిత్తు తయారు చేసి యందఱ యభిప్రాయములను కోరితిని. అందఱ యభిప్రాయములలోను గురుదాస బెనర్జీగారి యభిప్రాయము నేఁటికిని నాకు గుర్తున్నది. వ్రతములలో నమ్రతనుగూడ నొక వ్రతముగా చేయవలయునని వారి యూహ. నేఁటి పిన్నవారలలో నమ్రత కొఱవడియున్నదని దీని యాశయము. నాకును ఈ సంగతి తెలియును గాని నమ్రతను

గూడ వ్రతములలోఁ జేర్చినచో నమ్రత నమ్రతగా నుండదు. నమ్రతను సంపూర్ణముగా నర్థము చెప్పవలసివచ్చుచో శూన్యత యని చెప్పవలసివచ్చును. శూన్యతాప్రాప్తికి వేఱే వ్రతము వలయును. శూన్యత యనిన మోక్షస్థితి. ముముక్షువునకుఁగాని, సేవకునకుఁగాని ప్రతివిషయమునందును శూన్యత-అభిమానము లేకుండుట-కావలయును. లేకున్నచో నతఁడు ముముక్షువు కాఁడు, సేవకుఁడును గాఁడు. అట్టివాఁడు స్వార్థపరుఁడు, అహంకారి.

అప్పు డాశ్రమమున నించుమించు పదుమూవురు ద్రవిడులు కలరు. దక్షిణ-ఆఫ్రికానుండి నాతో నయిదుగురు ద్రవిడబాలకులు వచ్చిరి. వీరితోఁగలిసి మే మందఱమును ౨౫ మందిమి. మా కందఱకును పాకశాల యొకటియే. మే మందఱమును ఏకకుటుంబమువారివలెనే నివసింపఁ బ్రయత్నించితిమి.

# ౧౦

## పరీక్ష!

ఆశ్రమము స్థాపింపఁబడిన కొలఁది కాలములోనే నే ననుకొనని విషయ మొకటి తటస్థించెను. భాయి అమృతలాలు ఠక్కరు గారికడ నుండి నా కొక యుత్తరము వచ్చెను: 'మిగుల దరిద్రుఁడును, యోగ్యుఁడును అగు నంత్యజుఁ డొకఁడు తనకుటుంబముతో మీ యాశ్రమమున నుండఁగోరుచున్నాఁడు. తా మతనిని స్వీకరింతురా?'

నే నుద్విగ్నుఁడ నయితిని. ఠక్కర్ బాబువంటి గొప్పవారి యనుమతి గొని యింత శీఘ్రకాలములో నొక యంత్యజకుటుంబ మాశ్రమమునకు వచ్చు నని నే ననుకొనియుండలేదు. నా సహచరుల కా చీటిని చూపితిని. వారు సంతోషించిరి. 'ఆ కుటుంబములోని వా రెల్లరును ఆశ్రమనియమములను పరిపాలింతురేని తప్పక మేము స్వీకరింతు' మని అమృతలాల్ ఠక్కరుగారికి తెలిపితిని.

దూదాభాయియు, అతని భార్య దానీ బహెన్, వారికూఁతురు లక్ష్మియు వచ్చిరి. లక్ష్మి యపుడు పాలు గుడుచు శిశువు. దూదాభాయి బొంబాయిలో పంతులు. వారు ఆశ్రమమునందలి నియమములను పరిపాలింప నంగీకరించిరి. ఆశ్రమమునఁ జేర్చుకొనఁబడిరి.

వీరిని జేర్చికొనుటవలన నాశ్రమమునకు సాయ మొనరించు మిత్రమండలిలో నలజడి పుట్టెను. ఇంటివారికి నూతిలో పాలు గలదు. ఆ నూతినుండి నీరు తెచ్చికొనుటకు మాకు కష్టము కలిగెను. అచట ఇంటివారికి నీరు తోడి యిచ్చువాఁడు మ మ్మాతంకపఱచెను. మా నీటిబొట్లు అతనికి తగులరాదు. అతఁడు మమ్ము తిట్టఁదొడఁగెను.

దూదాభాయిని తొలఁగింపుమని నిందింపఁగడఁగెను. 'నిందించినచో సైరింపుఁ' డనియు, 'నేమయినను సరియ నీకు తెం' డనియు నే నందఱకును జెప్పితిని. మేము మాఱు తిట్టకుండుటవలన నతఁడు సిగ్గిలి మరల మమ్ముఁదిట్టుట మానుకొనెను. కాని దీనివలన ధనసాహాయ్య మంతరించెను. మొట్టమొదట నంత్యజప్రవేశమునుగుఱించి శంకించిన మిత్రుఁడు నియమపరిపాలకుఁడగు నంత్యజుఁ డెచట దొరకు నని యనుకొనెను.

ధనసాహాయ్య మాఁగినపిదప సంఘబహిష్కారము వచ్చు నను వార్త నా చెవిని బడెను. బహిష్కారము వచ్చినను, సాయము నాఁగిపోయినను అమదాబాదు విడువఁగూడ దని నా సహచరులతో నాలోచించితిని. మాలగూడెమునకుఁ బోయి యచటనే నివసించి కూలినాలి చేసికొని వచ్చినదానితో జీవింత మని యనుకొంటిమి.

ఇటు లుండఁగా నొకనాఁడు—'రాబోవు నెలకు డబ్బు లేదు' అని మగన్‌లాల్ గాంధీ నాకు నోటీసిచ్చెను. 'అటు లగుచో మనము మాలగూడెమునకు తరలుద' మని చల్లగా నేను ప్రత్యుత్తరించితిని.

నా కిట్టి సంకటములు కలుగుట కిది మొదటితూరి కాదు. కాని పలుమాఱులు చిట్టచివరనిముసమున నాకు సాయము దొరకెను.

మగన్‌లాలు నాకు నోటీసిచ్చిన కొలఁదినాళ్లలో నొకనాఁటి ప్రొద్దున వడిగా పరువెత్తికొనివచ్చి యొక కుఱ్ఱఁడు—'వెలపట నొక మోటారు నిలువఁబడి యున్నది. ఒక సేటు మిమ్ము పిలువ మన్నాఁడు' అనెను. నేను మోటారుకడకు వెళ్లితిని. 'ఆశ్రమమునకు కొంచెము సాయము చేయఁదలఁచితిని. తాము స్వీకరింతురా?' అని యా సేఠ న న్నడిగెను. 'తప్పక స్వీకరింతును, ఇపు డిట్టిది చాల నావశ్యకము' అని నే నంటిని.

'నేను రేపుప్రొద్దున ఈవేళకే ఇచటికి రాఁగలను. మీరు ఆశ్రమముననే యుందురా?' అని సే ఠడిగెను. 'ఉందు'నని నే నంటిని.

సేఠు వెళ్లెను. మఱునాఁడు సరిగా ఆసమయమునకే మోటరు 'బంయి' మనెను. బాలకులు నాకీ వార్త తెచ్చిరి. సేఠు లోపలికి రాలేదు. నేనే వెలుపలికి వెళ్లితిని. అతఁడు ౧౩౦౦౦ రూపాయల నోట్లు నాచేతి కిచ్చి మాటాడకుండ వెళ్లిపోయెను. నే నీ సాయమును కలలోనేని తల పోయ లేదు. అతఁడు ధర్మము చేసిన పద్ధతియు ఆశ్చర్యకరముగా నుండెను. ఆయన యెప్పుడును ఆశ్రమమునకుఁగూడ రాలేదు. నేను వారి నొకతూరియే చూచియున్నట్లు గుఱుతు. ఆశ్రమములోనికి వచ్చుటా లేదు, అడుగుటా, నడుగుటా లేదు. సొమ్మిచ్చి బయటి వాఁడు బయటినుండియే నిష్క్రమించెను. ఇట్టి సంఘటన చూచుట నాకిదే మొదలు. ఈ సాయమువలన మాలగూడెమునకు పోవు నాలో చన మాఁగిపోయెను. ఈ సాయముతో నొక యేఁడాదివఱకును పరవా లేదనుకొంటిమి.

వెలుపలవలెనే యాశ్రమములోపలఁగూడ నలజడి యారంభ మాయెను. దక్షిణ-ఆఫ్రికాలో అస్పృశ్యులు మాయింటికి వచ్చుటయు, ఉండుటయు, భుజించుటయు వాడుకయేగాని యిప్పు డాశ్రమమునందు వారిని సాక్షాత్తు ప్రవేశపెట్టుకొనుట నాభార్య మొదలగు స్త్రీల కింపితము కాలేదు. దానీ బహేను నెడల మావారికి తిరస్కారము లేకున్నను ఔదాసీన్యము కలదని తీక్ష్ణమయిన నా నయన శ్రవణములకు గోచరమాయెను. ఆర్థిక సాహాయ్య మడుగంటిన నా కంత చింతయు, భీతియు లేకుండెను గాని యీ గృహకల్లోలము దుస్సహ మాయెను. దానీ బహేను అందఱాఁడువారివంటిదే. దూదాభాయి చదువులో సామాన్యుఁడే కాని మంచి వివేకము కలవాఁడు. అతని యోర్పునకు నే సంతసింతును. అతని కపుడపుడు క్రోధము కలుగుచుండెడిది కాని యతని సైరణ న న్నాకర్షించుచుండును. చిన్న చిన్న యవమానములను సైరింపుమని నేను దూదాభాయికి చెప్పఁగా నతఁ డంగీకరించుటయే గాక దానీ బహేనునుగూడ సైరింపు మని ప్రేరించుచుండువాఁడు.

ఈ కుటుంబము చేరుటవలన నాశ్రమము చాల పాఠములు నేర్చుకొనెను. మొట్టమొదటనే మే మాశ్రమమునం దస్పృశ్యత లేదని చాటితిమి కావున మాపని సులభమాయెను. మే మిటులు చాటి చెప్పినను, ఆశ్రమవ్యయ మధికమగుచున్నను దీనిని పోషించువారు ప్రధానముగా సనాతనమతావలంబకులగు హిందువులే కావున నస్పృశ్యత పునాదులు జవజవ లాడిపోయె నని స్పష్టమాయెను. ఇందుల కింకను చాల ప్రమాణము లున్నవి. కాని మేము అస్పృశ్యులతో సన్నపానము లాచరించుచుంటి మని తెలిసియు హిందువులు మాకు సాయము చేయుచున్నారు. వారు తమను సనాతన మతావలంబులనుగాఁ దలఁచుచున్నారు. ఇది యేమంత తక్కువ ప్రమాణమా?

ఈ యస్పృశ్యతను గుఱించియు, దీనికి సంబంధించి కలిగిన సూక్ష్మములగు చిక్కులను గుఱించియు, తలవని తలంపుగా వచ్చి పడిన కష్టముల నతిక్రమించుటను గుఱించియు, సత్యశోధనమునకు సంబంధించిన వివిధవిషయములను గుఱించియు తెలుపవలసియున్నను ప్రకృతము తెలుపకుండఁ బోవుటయు, ముందు ప్రకరణములలోఁ గూడ నీ దోష మెంతయో కొంత యుండుటయు తటస్థించుచున్నది. దీనికి నేను వగచుచున్నాను గాని యిది తప్పదు. కొన్ని ముఖ్యవిషముల నే నిందు విడనాడవలయును. ఏలన: ఈ నాటకమునందలి చాల పాత్రములు జీవించియున్నవి. వీని సమ్మతిని గైకొనక వీనికి సంబంధించిన విషయములను వాకొనుట యుచితమైన పని కాదుగదా! 'పోనీ, వానిసమ్మతి గొనరాదా?' యని యనవచ్చునుగాని ఆయా యీ ప్రకరణములు వ్రాయుతఱి వానివానికి సంబంధించిన సంగతులు వానివానికిఁ బంపి సంస్కారణము చేయించి, చీటికి మాటికి వాని సమ్మతులు గైకొనుట యసంభవము మాత్రమే కాక యీ యాత్మకథ హద్దుగూడ నతిక్రమించిన పని యగును. కావున నీశిష్టభాగము సత్యశోధకున కెఱుఁగఁజేయవలసియున్నను సంపూర్ణముగా నెఱుఁగజేయఁజాల నని వెఱగొందుచున్నాను. ఇటులయ్యు యీశ్వరేచ్ఛ యున్నచో నీ కథను నాన్‌కో ఆపరేషన్ రోజులవఱకు లాఁగుకొని రావలయు నని నే ఆసించుచున్నాను.

## ౧౧

## గిరిమిటుపద్ధతి నెత్తివేయుట

ఒడ్డిగమనములో జిక్కి మిడుతపాటున్న చందముగా తోలంగోలంతనే యాంతర బాహిరయుద్ధఝంఝామారుతములలోం జిక్కికొని బయటం బడిన మా యాశ్రమపు ముచ్చట ముగించి గిరిమిటియాల సంగతి కొంచెము విచారింపవలసిన సమయ మాసన్న మయినది. అయిదేండ్లు గాని, అంతకు లోపుగాంగాని పనిచేయుటకు కరారువ్రాసి యిచ్చి హిందూదేశము విడనాడి పోయినవారు గిరిమిటియాలు. నేటాలులో గిరిమిటియాలమీంద వేయంబడిన మూండుపౌనుల తలపన్ను ౧౯౧౪ సంవత్సరమున తీసివేయంబడెను. కాని యీ పద్ధతి యింకను ఆంపివేయంబడలేదు. ౧౯౧౬ సంవత్సరమున పండిత మదనమోహన మాలవ్యులు ఇంపీరియల్ లెజిస్లెటివ్ కౌన్సిలులో ఈవిషయమును గురించి ప్రసంగించిరి. లార్డు హార్డింగుగారు ఈ ప్రస్తావము నంగీకరించిరి. 'సార్వభౌములు సమయము వచ్చినపుడు ఈపద్ధతి నెత్తివేయుమని నాకు సెలవిచ్చిరిగాన తఱివచ్చినపుడెత్తివేయుదు' నని లార్డు హార్డింగుగా రుద్ఘోషించిరి. అస్పష్టమగు నీ వాగ్దానమున కిండియా తృప్తిపడంజాలదుగాన దీనిని వెంటనే యెత్తివేయింపవలయు నని నేం దలంచితిని. హిందూదేశ మిన్నాళ్లనుండియు నీపద్ధతిని 'బహుపరాకుగా' సైరించుచు వచ్చుచుండెను. ఇపుడు హిందూదేశము కొంచెము కన్ను తెఱచె నని నే ననుకొంటిని. కొందఱు మిత్రులతో సంప్రతించితిని; పత్రికలలో వ్రాసితిని. వెంటనే తీసివేయుటకే యందఱును అభిమత మని గ్రహించితిని. దీనియెడ సత్యాగ్రహమున కేమేని ప్రసక్తి కలదా? ప్రసక్తి కలదనుటలో నా కేమియు సందియము లేదు కాని దీని నెటు లుపయోగింపవలయునో అది తెలియలేదు.

ఈలోపుగా వైసరాయిగారు 'సమయము వచ్చినపుడు' అను మాటల కర్థమును విప్పిచెప్పిరి. 'ఈ పద్ధతికి బదులు మఱియొక పద్ధతిని ప్రవేశ పెట్టుటకు సరియగు సమయము చిక్కఁగనే ఈ పద్ధతి తీసివేయఁ బడు'నని వైసరాయిగారు ప్రకటించిరి. పిదప ౧౯౧౭ సాలున ఫిబ్రవరిలో వెంటనే యీ పద్ధతిని తొలఁగించుటకు బిల్లును మంజూరు చేయుఁడని ఇంపీరియల్ లెజిస్లెటివ్ కౌన్సిలులో పండిత, మదన మోహన మాలవ్యలు వైసరాయిగారి నడిగిరి గాని వారు నామంజూరు చేసిరి. నే నీ విషయమును హిందూదేశమునం దంతటను ప్రచారము చేయ నారంభించితిని.

హిందూదేశ మంతయు తిరుగుటకుముందు వైసరాయిగారిని చూచుట మే లని తలఁచితిని. నేను వారిదర్శనమునకు దరఖాస్తు పెట్టుకొంటిని. వెంటనే అది అంగీకరింపఁబడెను. వైసరాయిగారి కిపుడు మి. మేఫీ మంత్రి. అతఁడిపుడు సర్ జాన్ మేఫీ యాయెను. నాకు మి. మేఫీతో గాఢపరిచయ మేర్పడెను. లార్డ్ ఛెమ్స్ఫర్డు గారును, నేనును ఇష్టపూర్తిగా మాటలాడితిమి గాని వారు నిక్కచ్చిగా నే మాటయుఁ జెప్పరయిరి. కాని వారు తప్పక సాయము చేయుదు రని నే నాశ పెట్టుకొంటిని.

నా త్రిప్పటకు బొంబాయి మొదలు. జహాంగీరు పిటిట్ గారు సభను జరపించు భారము వహించిరి. ఇంపీరియల్ సిటిజన్‌షిప్ అసోసియేషనువారి తరపున సభ యాయెను. కార్యనిర్వాహకవర్గము వారు తీరుమానముల ముసాయిదా వ్రాయుటకు గుమిగూడిరి. డాక్టరు రీడ్, సర్ లల్లూభాయి శామలదాస్, మి. నటరాజన్ వగైరాలును, పిటిట్‌గారును అపుడు ఉండిరి. 'ఎపుడీ పద్ధతి నెత్తివేయుదు రని సరకారువారి నడుగవలయును?' అను చర్చ వచ్చెను. 'వీ లయినంత

త్వరలో'' నని యొకరును, '౩౧ వ జులైనాఁడెత్తివేయవలయు' నని మఱియొకరును, 'వెంటనే యెత్తివేయవలయు' నని మఱియొకరును గవర్నమెంటువారి నడుగుదమని వారు వారు సూచించిరి. '౩౧ వ జులై నాఁడు' అను మాట నాది. ఏదో యొక తేదీని నిష్కర్ష చేయుచో ఆనాఁటికి గవర్నమెంటువా రేమి చేయకున్న యెడల పై పనిని మనము విచారించుకొనుటకు వీలు కలుగు నని నా యభిప్రాయము. 'వెంటనే' అను మాట లల్లుభాయి గారిది. '౩౧వ జులైకంటె వడిగా కావలయు నని నాయుద్దేశము' అని లల్లుభాయిగా రనిరి. 'వెంటనే' అను మాట లోకులకు సరిగా అర్థముకాదని నేను తెలిపితిని. 'లోకులచే నేదేని పని చేయింపవలసివచ్చుచో నిశ్చయార్థబోధకమగు పదమునే వాడవలయును. 'వెంటనే' యనుదాని కెవనికి తోఁచి నటులు వాఁడర్థము చెప్పికొనుచుఁబోవును. గవర్నమెంటువా రొక యర్థము చెప్పుదురు; లోకు లింకొక యర్థము చెప్పుదురు. ౩౧ వ జులై యను నెలనిఁక నర్థభేదము పొసఁగదు. ఆ తేదీకి గవర్నమెంటువా రేమియు పరిష్కరింపనిచో మనపనిని మనము చేసికొనుటకు వీలు కలుగును' అని నే నంటిని. డాక్టరు రీడుగారు దీని శక్తిని వెంటనే గ్రహించిరి. లల్లుభాయిగారికిఁ గూడ తుద కిది రుచించెను. కడపట ౩౧వ జులై నిర్ధారింపఁబడెను. హిందూదేశమంతటను ఈ రీతి గనే సభలు జరిగెను.

బొంబాయినుండి శ్రీమతి జాయజీ పిటిట్‌గారి ప్రోద్బలమున స్త్రీల డెప్యుటేషనొకటి వైసరాయిగారికడకు వెళ్లెను. బొంబాయి నుండి వెళ్లినవారిలో లేడీ తాతా, స్వర్గీయ దిల్‌శాద్ బేగమ్ మొదలగువారు కలరు. అందఱి పేరులును నా కిపుడు గుర్తులేవు. ఈ డెప్యుటేషనువలన చాల పని యాయెను వైసరాయిగారు ఆశావర్ధకమగు ప్రత్యుత్తర మొసఁగిరి.

నేను కరాచీ, కలకత్తా మొదలగు చోటులకు వెళ్లితిని. ప్రతి చోటను పెద్ద పెద్ద సభ లాయెను. ప్రతియొరాలగమునను ఉత్సాహము పిక్కటిల్లెను. మొదట నే నిది తలపెట్టినపు డింతింత సభలు జరుగు ననియు, నిందఱు గుమిగూడుదు రనియుఁ దలంపలేదు.

ఆదినములలో నే నొంటరిగనే ప్రయాణము లొనరించు చుంటిని. దాన నలౌకికములగు ననుభవములు చేకూరెను.

సి. ఐ. డి. వారు వెన్నంటి యుండెడివారు కాని వీరితో జగడము పెట్టుకొనుటకు నాకు జరూరు లేదు. నాకు రహస్యమేమియు లేదు గాన నన్ను కష్టపెట్టవలసిన పని వారికి లేదు. వారిని కష్టపెట్టవలసిన పని నాకును లేదు. సౌభాగ్యవశమున నా కపుడు మహాత్మముద్ర లేదు. కాని నన్నెఱిగినచోట మహాత్మఘోష లేకపోలేదు. ఒక్కతూరి నేను రైలులో పోవుచుండఁగా చాల స్టేషనులలో 'సి. ఐ. డీ.' లు నాటిక్కెట్టు చూడవచ్చి నెంబరు వేసికొని కొంటెము గోలచేసిరి. వా రడిగిన ప్రశ్నలన్నిటికిని నేను వడిగనే సమాధాన మిచ్చుచువచ్చితిని. నా తోడి బాటసారు లందఱును నన్నొక సాధువుగనో, ఫకీరుగనో పరిగణించిరి. ప్రతి స్టేషనునందును నన్నిటులు కలవరపఱచుటచే బాటసారులు సి. ఐ. డి. వారిని తిట్టుచు 'పాప మీ సాధువును వృథాగా నేల కష్టపెట్టుచున్నా'రని తిరుగఁబడి నాదెసఁ జూచి 'ఈ బద్మాషులకు టికెట్టు చూపవల' దని నాకుఁ జెప్పిరి.

'టికెట్టు చూపుట నాకేమియు కష్టము కాదు. వారు వారి విధిని చేసికొనుచున్నారు.' అని నే నా బాటసారులకుఁ జెప్పితిని. బాటసారుల కీ నా మాట తృప్తిగా లేదు. వారికి నాపై చాల దయ గలిగెను. నిరపరాధుల నెందుల కిటులు హైరాణ పెట్టవలయు నని వారు ప్రతిఘటించిరి.

## ౧౧ గిరిమిటుపద్ధతి నెత్తివేయుట

సి. ఐ. డి. వారి బాధకంటె జనసమూహపు బాధయే నా కెక్కు డనిపించెను. లాహోరునుండి ఢిల్లీకి పోవుచు గుంపుల యొత్తిడిచే పడరాని పాట్లు పడితిని. నేను కరాచీనుండి కలకత్తాకుఁ బోవుచుంటిని. నడుమ లాహోరులో రైలు మార్చుకొనవలయును. నాకు రైలులో చో టెచటను దొరకలేదు. బలము గలవారికే చోటు. తలుపులు బిగించుచో జనులు కిటికీలనుండి లోపలికి దూఱుచుండిరి. నే ననుకొన్న నాఁటికి కలకత్తా చేరితీఱవలయును. ఈ రైలు దాఁటిపోవుచో నే ననుకొన్న నాఁడు దాఁటిపోవును. నాకిఁక చోటు దొరకునను నాశ యుడిగెను. ఎవరును నన్ను లోనికి రానీయలేదు. నేను వెతుకుకొనుచుండఁగా నొక పోర్టరు 'పండ్రెండణా లిచ్చుచో మీకు చోటు చూపింతు' ననెను. 'చోటు చూపించుచో తప్పక పండ్రెండణా లిత్తు'నంటిని. అతఁడు కనఁబడినవారి చేతులు కాళ్లు పట్టుకొని నాకు చోటుచేయుటకు బతిమాలాడెను. కాని యెవరు నంగీకరింపరయిరి. రైలు బయలుదేఱువేళ యాసన్నమాయెను. ఇంతలో నొక బాటసారి—'ఇచట చోటులేదు గాని అతనిని లోనికిఁ ద్రోయుము. అతఁడిచట నిలుచుండవలయును.' అని యనెను. 'మీకు సమ్మతమేనా?' యని పోర్టరు నన్నడిగెను. 'ఆ, సమ్మతమే, లోనికిఁ ద్రోయు'మని నే నంటిని. అతఁడు నన్నెత్తి కిటికీనుండి లోనికిఁ ద్రోసెను. ఈరీతిగా నేను లోపలఁ బడితిని. పోర్టరు పండ్రెండణాలు సంపాదించుకొనెను.

నా కది కాళరాత్రి. బాటసారు లందఱును ఎట్టెటులో కూరుచుండిరి. పై బల్లకు గల గొలుసును పట్టుకొని రెండు గంటలు నిలువఁబడితిని. 'ఇంతవఱకును కూర్చుండవే' మని నడుమనడుమ బాటసారులు నన్ను దబాయించుచుండిరి. 'కూర్చుండుటకు చోటు

తో దని వారిని సమాధానపఱచుచుంటిని గాని, నే నిటులు నిలువఁబడుట వారికి సమ్మతముగా లేదు. వారు కాళ్లు నిగుడఁదన్నుకొనియే పరుండిరి. వారు నన్ను కూర్చుండుమని దబాయించినకాలఁదియు నేను మిగుల శాంతముతో సమాధానము చెప్పుచుంటిని. దీనితో వారు కొంచెము శాంతించిరి. వారిలో నొకరు నా యూరుపేరు లడిగిరి. నాపేరు వినఁగనే వారు నొచ్చుకొని క్షమాపణ చెప్పి చోటు చేసిరి. శాంతికి ఫలము నాకపుడు కానవచ్చెను. నా తల గిర్రున తిరుగుచుండెను. కూర్చుండవలసిన సమయమున కీశ్వరుఁడు సరిగా చోటు చూపెను.

ఈ ప్రయాసతో అనుకొన్న నాఁటికి కలకత్తా చేరితిని. కాసింబజారు మహారాజుగారు నా కాతిథ్య మిచ్చిరి. వారే కలకత్తాసభ కధ్యక్షులు. కరాచీలోవలెనే కలకత్తాలోఁగూడ నుత్సాహమునకు మేర లేకపోయెను. అచటికి కొంద ఱాంగ్లేయులుఁగూడ వచ్చిరి.

౩౧ వ జులై రాకమునుపు కూలిపద్ధతి తీసివేయఁబడియె నని సరకారువారు చాటిరి. ౧౮౯౪ర సాలున దీనిని తీసి వేయుఁ డని మొదట నేను దరఖాస్తు చేసితిని. సర్ డబ్ల్యు. డబ్ల్యు. హంటరుగారు 'సెమీ-స్లేవరీ' యని పేరుకొన్న యీ కూలిపద్ధతి యెపుడో కూలిపోవు నని నే నాశించితిని. ౧౮౯౪వ సాలున ప్రారంభమయిన యీ పనికి పలువురు సాయము చేసిరి గాని యీతూరి ఇది సఫలమగుటకు పలువుర సాయముతోపాటు సత్యాగ్రహముగూడ సమ్మిళితమయి యున్నదని చెప్పక తప్పదు.

ఆనాఁటి ప్రచారమును, దాన పాలుగొనినవారి పనులను ఎఱుఁగఁ గోరువారు దక్షిణ - ఆఫ్రికా - సత్యాగ్రహేతిహాస మారయుదురుగాక !

## ౧౨

## నీలిమందు డాగు

చంపారణ్యము జనకుని రాజ్యములోనిది. చంపారనులో మామిడితోఁటలవలెనే ౧౯౧౭ సాలువఱకు నీలిమందుతోఁటలుండెడివి. అచటి రైతు లిరువదిపాళ్లలో మూడుపాళ్ల నేలయందు కౌమందుకు నీలిమందు వేసితీరవలయు నని లా కలదు. దీని కచట 'తీన్ కఠియా' అని పేరు. ఇరువది కఠాలగుచో నొక ఎకరము. ఇందు మూడు కఠాలలో నీలిమందు వేసి తీరవలయును. ఈరీతిగా నిది 'తీన్ కఠియా' అని ప్రసిద్ధ మాయెను.

చంపారను వెళ్లకమునుపు నాకు దానిపేరే తెలియదు. నీలిమందచట పండింపఁబడునని అసలే తెలియదు. నేను నీలిమందు పొట్లములను జూచియుంటిని గాని నీలిమందు చంపారనులో తయారగు ననియు, నచట వేలకొలఁది రైతు లిడుములఁ గుడుచుచున్నా రనియు ఎఱుఁగను.

రాజకుమారశుక్ల యనునతఁడు చంపారనులో నొక రైతు. అతనికి చాలఁ గష్టములు సంభవించెను. తనవలెనే కష్టము లనుభవించుచున్న రైతు లందఱి కష్టములను పోఁగొట్టుట కతఁడు ప్రయత్నము చేసెను. కాన నీ నీలిమందువలన నంటిన డాగు కడిగివేయ నుత్సాహ మినుమడించెను.

నేను కాంగ్రెసుకు లక్నో వెళ్లినపు డితఁడు నన్ను పట్టుకొనెను. మా కడగం డ్లన్నియు వకీలుబాబు మీకుఁ జెప్పఁగలఁడని యతఁడు నన్ను చంపారణ్యమున కాహ్వానించెను.

ఈ వకీలుబా బెవరో కారు; చంపారనులో నాకు ప్రియసహచరుఁడును, బిహారునందు సేవాజీవనమున కాయువుపట్టును అగు

వ్రజకిశోరబాబు. రాజకుమార శుక్ల యితనిని నా గుడారములోనికిఁ దీసికొని వచ్చెను. ఇతఁడు నల్లని ఆల్పాకా చొక్కాలాగులు తొడుగుకొని యుండెను. ఇతఁడు నాదృష్టి నాకర్షింపలేదు. వీరు నిఱుపేదలగు రైతుల డబ్బు కొల్లగొట్టు నొక వకీలుదొరగా రయి యుందు రని తలఁచితిని.

ఇతఁడు చంపారనునుగుఱించి కొలఁది మాటలు చెప్పఁగా విని, 'కనులారఁ జూడక నేను నా యభిప్రాయ మేమియును జెప్పఁజాలను; మీరు కాంగ్రెసునం దీ విషయమును ముచ్చటింపుఁడు; నేఁటికి నన్ను విడిచిపెట్టుఁ' డని నేను నా రివాజుచొప్పున బదులు చెప్పితిని. రాజకుమారశుక్ల కాంగ్రెసుసాహాయ్య మర్థించెను. వ్రజకిశోరబాబు చంపారనునుగుఱించి కాంగ్రెసులో మాట్లాడెను. వారి ప్రస్తావము సర్వజనాంగీకారమును బడసెను.

రాజకుమారశుక్లకు సంతోషము కలిగెనుగాని యింతటితోనే యంతయు సిద్ధించె నని యతఁడు తలపోయలేదు. 'స్వయముగా మీరు చంపారను వచ్చి యచటి రైతుల కడగండ్లు చూడవలయు'నని యతఁడు నన్నుఁ గోరెను. 'నేను నా సంచారములో నచటికి రాఁగలను, ఒకటి రెండు నాళ్లుండఁగల'నని నే నంటిని. 'మీ రొక్కనాఁ డుండినఁజాలును, కష్టము లన్నియు మీకుఁ దెలిసిపోవు' నని రాజకుమార శుక్ల యనెను.

లక్నోనుండి కాన్పూరు వెళ్లితిని. రాజకుమార శుక్ల అచట ప్రత్యక్షము. 'చంపారణ్య మిచటికి దాపు, ఒకదినము మాకు సెల వొసఁగుఁ'డని యతఁ డనియెను. 'ఈతూరి రాఁజాలనందులకు నన్ను క్షమింపుఁడు, ఇంకొకతూరి నేను తప్పక రాఁగల నని బాస యిచ్చు చున్నా'నని నన్ను నే బంధించుకొంటిని.

## ౧౨ నీలిమందుడాగు

నే నాశ్రమమునకు మరలితిని. రాజకుమార శుక్ల నా వెనుక వెనుకనే హాజర్. ‘ఏదో యొక తిథి నిర్ణయించి తెలుపుఁ’ డని యతఁడు కోరెను. ‘ఫలానా తేదీకి నేను కలకత్తా వెళ్ళుదును, నన్నచటఁ గలిసికొని తీసికొనిపొం’ డని నే నంటిని. ఎచటికి వెళ్లవలయునో, యేమి చేయవలయునో, యేమి చూడవలయునో నా కేమియుఁ దెలియదు. నేను కలకత్తాలో భూపేన్ వసుగారి యింటిలో కాలుపెట్టకముందే సర్వవ్యాపకుఁ డగు రాజకుమార శుక్ల యచట నాకొఱకు కనిపట్టుకొనియుండెను. అనక్షరాస్యుఁడును, అకలంకితుఁడును, పట్టుదలగల యీ రయితు నన్నీ రీతిగా లోఁగొనెను.

౧౯౧౭ వ సాలు మొదట కలకత్తానుండి మే మిరువురమును బయలుదేఱితిమి. మే మిరువురమును ఈడుజోడుగను, రయితులముగను చూపట్టుచుంటిమి. నా కే రైలెక్కవలయునో తెలియదు. అతఁడు నన్ను బండికడకుఁ గొంపోయెను. మే మిరువురము నొక బండిలోనే కూరుచుంటిమి. ప్రొద్దున పాట్నాలో దిగితిమి.

పాట్నా నాకుఁ గ్రొత్త. బసచేయుటకు నా యెఱిఁగిన వారెవరును అచట లేరు. కల్ల కపట మెఱుఁగని రయితు గావున రాజకుమారశుక్లకు పాట్నాలో నే కొంచెమో పలుకుబడియుండకపో దని నేఁ దలఁచితిని. రైలులో నితనిని గుఱించి కొంచెము నాకుఁ దెలియనాయెను. పాట్నా దిగిన తరువాత యితని సంగతి యంతయు తెలిసిపోయెను. అతఁడు శుద్ధ-అమాయికుఁడు. తనకు మిత్రులనుకొనిన వకీళ్లితనికి మిత్రులు కారు. పైఁగా రాజకుమారశుక్ల వారి కాశ్రితునివలెఁ దోఁచెను. ఇట్టి రయితు-క్లయంట్లకును, వకీళ్లకును వర్షర్తువునందలి గంగయంత యంతరము.

రాజకుమారశుక్ల నన్ను రాజేంద్రబాబుగారి యింటికిఁ గొం పోయెను. అతఁడు పూరికో, యింకొక యూరికో వెళ్లెను. బంగళాలో నొక రిద్దఱు నవుకరులుండిరి. కొంచెము తినుబండము నాకడ నుండెను. నాకు ఖర్జూరము కావలసిరాఁగా పాప మా శుక్ల బజారు నుండి తెచ్చిపెట్టెను.

బిహారునందు అస్పృశ్యతను గూర్చి చాల పట్టుదల. నా జాతి యేదియో యచటి నవుకరులకుఁ దెలియదు. వారు నీరుతోడుచుండఁగా నేను నీరు తోడుకొనుటకు వీలులేదు. నా నీటిబొట్లు వారిమీఁదఁబడి నచో వారి కపవిత్రత యంటుకొనును. రాజకుమారశుక్ల లోపలి మఱుఁగుదొడ్డిలోనికి దారి చూపెనుగాని అచటి నవుకరులు బయటి మఱుఁగుదొడ్డిని వ్రేలితోఁ జూపిరి. ఇట్టి యనుభవములు నాకు వేనవేలాయెనుగాన వీరి చేఁతలకు నాకక్కజముగాని, రోషముగాని కలుగ లేదు. పాప మా నవుకరులు తమ విధిని చేసికొనుచుండిరి. మరియు రాజేంద్రబాబుగారి కది సమ్మతమని వారి యభిప్రాయము. విచిత్రములగు నిట్టి యనుభవములవలన రాజకుమారశుక్లయెడల నాకు సదుద్దేశము పెంపొందెను. మరియు నతని విషయమంతయు చక్కఁగాఁ దెలిసెను. రాజకుమారశుక్ల నాకు మార్గదర్శకుఁడు కాఁజాలఁడని తెలిసికొని పాట్నానుండి లగాములు నా చేతిలోనే యుంచుకొంటిని.

## ౮౩

## బిహారువారి మంచితనము

లండనములో మౌలానా మజహరుల్ హక్కుగారును, నేనును సమకాలికులము. మరల ౧౯౧౫ సాలున బొంబాయిలో కాంగ్రెసునందు కలిసికొంటిమి. అపుడు వారు ముస్లింలీగున కధ్యక్షులు. అపుడు వారు మా ప్రాంత చెలిమిని గుఱుతుచేసి 'పాట్నాకు వచ్చినపుడు మా యింటికి తాము దయచేయవలయు'నని నన్నాహ్వానించిరి. దీనిని నే నాధారముగాఁ గొని 'నేను వచ్చియున్నటు' లొకచీటిని వారికి వ్రాసి పంపితిని. నా వచ్చిన పనినిగూడ అందు దెలిపితిని. వారు వెంటనే మోటారుకారు వేసికొనివచ్చి నా కాతిథ్య మొసఁగిరి. ఇందులకు నేను వీరికి ధన్యవాదము లొసఁగి 'మేము చేరవలసిన తావునకు మొదటి రైలులో మమ్ము పంపవలసిన'దని కోరితిని. నావంటి సరిక్రొత్తవానికి రైల్వేగైడుతో పని నెట్టదు. వీరు రాజకుమారశుక్లతో మాటాడి సంగతిసందర్భములను దెలిసికొని 'మీరు ముందుగా ముఝఫ్ఫర్‌పూరు వెళ్లవలసియుండు' నని యనిరి. నాఁటి సాయంకాలమే ముఝఫ్ఫర్‌పూరున కొక రైలు పోవును. వీరు మమ్మా రైలులో పంపివైచిరి. అపుడచట ఆచార్య కృపలానీగారుండిరి. నేను హైదరాబాదా వెళ్లిన నాఁటనుండియు వీరి నెఱుఁగుదును. వీరి త్యాగమును గూర్చియు, వీరి ప్రమితజీవనమునుగూర్చియు, వీరి ధన సాహాయ్యమున తాము నడిపించు నాశ్రమమును గూర్చియు డాక్టరు చోఇథరాముగారు చెప్పియుండిరి. వారు ముఝఫ్ఫర్‌పూరు నందలి గవర్నమెంటు కాలేజీలో ప్రొఫెసరుగా నుండిరి. నేను వెళ్లునప్పటికి ఆ పదవిని విసర్జించిరి. నేను వారికి తంతి యిచ్చితిని. రైలచటికి

నడిరేయిని జేరినను వీరు విద్యార్థిమండలితో వచ్చిరి. వీరి కచట నిల్లు వాకిలి లేదు. ప్రొఫెసరు మలకానీగారియింట వారి విడిది. వీరు నన్నుఁగూడ నా విడిదికే తీసికొనిపోయిరి. ఆ కాలములో గవర్నమెంటు ప్రొఫెసరొకఁడు నాబోటివానికి తనయింట నాతిథ్య మొసఁగుట చాల నసాధారణ మగు విషయము.

కృపాలినీగారు బీహారుదీనదశనుగూర్చియు, విశేషించి తిరహుత్ డివిజనుదీనదశనుగురించియు తెలిపి నే నడుకొనిన పని యెంత కఠిన మయినదియుఁ జెప్పిరి. వారికి బిహారువారితో గాఢపరిచయము కలదు. నావచ్చిన పనియంతయు కృపాలినీ గారుబిహారువారికిఁ జెప్పియే యుంచిరి. ప్రొద్దున కొందఱు వకీళ్లు నాకడకు వచ్చిరి. వీరిలో రామనవమీప్రసాదుగారి పేరు నా కింతవఱకును గుర్తే. వారి పట్టుదలయే దీనికి కారణము.

వీ రిటు లనిరి: 'మీరు ఇచట నుందురేని, అనఁగా ప్రొఫెసర్ మలకానీగారి గృహములం దుందురేని, మీతలపెట్టిన పని సాగదు. మీరు మాలో నొకరియింట విడిది చేయువలయును. ఇచట గయాబాబు పేరుపడ్డ వకీలు. వారి యింట మీరు బసపెట్టుట మంచిది. నేను వారి తరఫున మి మ్మాహ్వానించుచున్నాను. మాకు సరకారువారనినచో చాల భయము. కాని మాకు చేతనయినంత సాయము మేము చేయఁగలము. రాజకుమారశుక్ల చెప్పిన మాటలు చాలవఱకు నిక్కువము. మా నాయకులు నేఁ డిట లేకుండుట దౌర్భాగ్యము. వ్రజకిశోరప్రసాదుగారికిని, రాజేంద్రప్రసాదుగారికిని తంతి యిచ్చితిని. వారు తప్పక రాఁగలరు. మీకుఁ గావలసిన యానుపాను లన్నియు వారు చెప్పుదురు. మీకు సాయము చేయుదురు. దయయుంచి తాము గయాబాబుగారి యింటికి రావలయును.'

ఈ మాటలకు నేను లుబ్ధుఁడ నయితిని. నా విడిదివలన గయాబాబు స్థితి విషమ మగునేమోయని వగచితినిగాని గయాబాబీ విషయమున నన్ను నిశ్చింతుని గావించెను.

గయాబాబుగారి యిల్లు చేరితిని. వారును, వారి కుటుంబము నందలివా రందఱును నాపై ప్రేమ కుమ్మరించిరి.

వ్రజకిశోరబాబు దరభంగానుండియు, రాజేంద్రబాబు పూరీనుండియు వచ్చిరి. వ్రజకిశోరప్రసాదు నేను లక్నోలోఁ జూచిన వ్రజకిశోరప్రసాదు కాఁడు. బిహారుల నమ్రత, నిరాడంబరత, యోగ్యత, అసాధారణమగు విశ్వాసమును ఇతనియందు చూచి నే నుప్పొంగిపోతిని. వ్రజకిశోరబాబునెడల వకీళ్లందఱకును గల గౌరవము చూడఁగా నా కానందాశ్చర్యములు కలిగెను.

నాఁటినుండియు నా కీ వకీలుమండలితో స్నేహము నెలకొనెను.

వ్రజకిశోరబాబు నా కచటఁ గల విషయము లన్నియుఁ దెలిపెను. అతఁడు పేదలపాలిటి వకీలు. పేదల కేసు లపుడు రెం డుండెను. పేదల కేసేదియేని గెలిచినయెడలఁ దానీ పేదల కేకొంచెమో యుపకరించినటు లతఁ డెంచుకొనును. కొన్నిమాఱులు ఇట్టివానియందును అసాఫల్య మొందవును. ఇట్టి బీదరయితులకడనుండి యితఁడు ఫీజు గైకొనుచుండెను. త్యాగశక్తి కలవారయ్యును వ్రజకిశోర రాజేంద్రబాబులు ఫీజుగొనుటలో సంకోచము లేనివారే. 'ఫీజు పుచ్చుకొననిచో మా సంసార మెటులు నడచును? మరియు నీ పేదవారికి తగినంత సాయము మే మెటులుచేయఁగలము?' అని వీరి వాదము. వీరి ఫీజును, బంగాళ్-బిహారు దేశముల బారిష్టరుల ఫీజును వినఁగా నా గుండె చెదరెను.

సలహా యిచ్చుటకు ఫలానావారు ౧౦,౦౦౦ రూపాయలు పుచ్చుకొని రని నాకుఁ దెలిసెను. ఏకేసులోను నాలుగువేలకు తక్కువ వినలేదు.

ప్రేమపూర్వకమయిన నానిషేధము సహేతుక మని వారు గ్రహించిరి. నా మాటలకు వారు వేఱ అర్థము చెప్పలేదు.

ఈ కేసు లన్నియు నవగతము చేసికొని నే నిటు లంటిని: 'కోర్టుల కెక్కినందువలన నేమియు ప్రయోజనము లేదని నాకు తెల్ల మగుచున్నది. ఇట్టి కేసులకు కోర్టులలోఁ గలుగు మేలు కొలఁది. ప్రజ లింతగా విఱిగిపోయి భీతు లయి యున్నతఱి కోర్టులు నిరుపయోగ ములు. లోకులకు భయము పోఁగొట్టుటయే సరియగు మందు. తీన్‌కథియా పోవునంతవఱకు మనము నిదురపోవరాదు. నేను రెణ్ణాళ్లను కొని వచ్చితిని. కాని విచారించి చూడఁగా నిది రెండేండ్లపని. అక్కఱ పట్టుచో రెండేండ్లుగూడ నేను పనిచేసెదను. నాకు చేయవలసిన పని తెలిసెను. కాని మీ సాయము వలయును.'

వ్రజకిశోరబాబు నిశ్చితమనస్కుఁ డని నేను గ్రహించితిని. ఇతఁడు శాంతితో నిటులు జవాబుచెప్పెను: 'మేము చేయఁగలంత సాయమును చేయుదుము గాని యెట్టి సాయము చేయవలయునో తెలుపుఁడు!'

మే మిటులు మాటలాడుకొనుచు నడిరేయివఱకును గూరు చుంటిమి. నే నిటు లంటిని: 'నాకు మీ వకాలతు సాయముతో అట్టే పని లేదు. వ్రాయసకాఁడును, దుబాసియు కావలయును. ఇందు జైలుకు వెళ్లవలయు నక్కఱగూడఁ గలుగవచ్చును. మీరును వెళ్లఁగలుగుదు రేని నా కానందమే. కాని మీ కిష్టము లేనిచో నిఁక పైమాట లేదు. ఒక అనియత కాలమువఱకు మీరు వకాలతు మానివైచి

వ్రాయసకాండ్రుగా పనిచేయుటమాత్ర మంత తక్కువ పని కాదు. ఇచటి హిందీభాష తెలిసికొనుట నాకుఁ గడుఁ జిక్కుగా నున్నది. కైథీ, ఉరుదులలో వ్రాయఁబడిన కాకితములు నేఁ జదువజాలను. వీని యనువాదములకు మీమీఁద ఆశపెట్టుకొని యున్నాను. డబ్బిచ్చి యీ పని చేయించుట మన శక్తికి మించిన పని. ధనము పుచ్చుకొనకుండ సేవాభావముతో నీ పనియంతయు కావలయు నని కోరుచున్నాను.”

వ్రజకిశోరబాబున కిది యంతయు వెంటనే అవగతమాయెను. పిదప నతఁడును, అతని సహచరులును ఒకరితరువాత నొకరు నన్ను క్రాసు-పరీక్ష చేసిరి. నా మాటలకు ఫలితార్థముగా ‘సుమారు ఎంత కాలము మేము వకాలతు మానవలసియుండును? ఎంతమందిమి పని చేయవలసియుండును? కొలఁది కొలఁది మందిమి కొంత కొంతకాలము పనిచేసినచోఁ జాలునా?’ అని యీరీతిగా నన్ను ప్రశ్నించిరి. ‘మీరు మీ రెంతెంత త్యాగము చేయఁ గల’ రని వ్రజకిశోరబాబు వారివారి నడిగెను.

తుట్టతుదకు వారు తమ యభిప్రాయమును నా కిటులు తెలిపిరి: ‘మే మిందఱము మీరు చెప్పిన పనిని చేయ సంసిద్ధులము. మాలోఁ గొందఱము మీరు నియమించినంత కాలము మీకడఁ బనిచేయుదుము. చెఱసాలమాట మాకు సరిక్రొత్త. అయినను దాని ననుభవించుటకుఁ గూడ శక్తిని సంపాదింతుము.

౧౪

## అహింసాదేవి సాక్షాత్కారము

రైతులతో సంప్రతించుట నా యుద్దేశము. కామందులకును, రైతులకును నడుమ నున్న చిక్కులెంత సత్యములో తెలిసికొన వలసి యుండెను. కావున వేలకొలఁది రైతులను జూడవలయును కాని వీరిని చూచుటకు ముందు కామందులను కలిసికొని వారు చెప్పు సంగతులను దెలిసికొనుటయు, కమిషనరును జూచుటయు నావశ్యక మని తోఁచెను. కామందులకును, కమిషనరునకును చీటి వ్రాసితిని.

ప్లాంటర్స్ అసోసియేషన్-సెక్రటరీని చూచితిని. అతఁ డిటులు చక్కఁగా చెప్పివేసెను: 'మీ రీ దేశమువారు కారు. మీరు మా సంగతులు కల్పించుకొనవలదు. మీ రేమయినను చెప్పఁదలఁచి కొందురేని వ్రాసిపంపుఁడు.' నేను వివేకముతో నిటు లంటిని: 'నేను పరదేశి ననుకొనను. రైతులు కోరునెడల వారి స్థితిగతులు తెలిసికొనుటకు నాకు సంపూర్ణాధికారము కలదు'. పిదప కమిషనరును కలిసికొంటిని. అతఁడు నన్ను బెదరించి వెంటనే తిరహుత్ వీడి పొమ్మని యుపదేశ మిచ్చెను.

నా సహచరులకు నే నీ సంగతు లన్నియుఁ దెలిపి 'సరకారు వారు' 'బహుశా' నన్ను సంప్రతింప నియ్యరు; నే ననుకొనినదాని కంటె ముందే జైలుయాత్ర పొసఁగవచ్చును. అట్టిది పొసఁగ నేని మోతీహారిలోఁ గాని, లేక బేతియాలోఁగాని నన్ను పట్టు కొనినచోఁ జాల మేలు. కావున వీలయినంత వడిగా ఆ ప్రదేశము లకుఁ బోవు టుచితము' అని చెప్పితిని.

# ౧౪ అహింసాదేవి సాక్షాత్కారము

చంపారను తిరహుత్ ప్రదేశమునం దొక జిల్లా. దానికి మోతీహారి ముఖ్యపత్తనము. బేతియాకు దగ్గఱ రాజకుమారు నూరు. మరియు దీని చుట్టుపట్టుల నున్న కోఠీరయితులు జిల్లాలోని కెల్ల దరిద్రులు. వారిని నేను తప్పక చూడవలయు నని రాజకుమారుని యుద్దేశము. నాకును జూడవలయునని యుండెను.

కావున సహచరులను దీసికొని నే నానాఁడే మోతీహారికి పయనించితిని. గోరఖుబాబుగారు మా కాశ్రయ మొసఁగిరి. వారి యిల్లొక సత్ర మయిపోయెను. మాయందఱ కా యిల్లు చాలలేదు. ఎటులో ఒకటులు మే మందఱ మచట నుంటిమి. మోతీహారికి అయిదు మైళ్ల దూరమున నొకరయితు అన్యాయముగా దండింపఁబడె ననియు నాఁడే మేము వింటిమి. మఱునాఁటి ప్రొద్దున ధరణీధరబాబుగారితో నే నచటికిఁ బోయి చూచిరావలయు నని నిశ్చయించితిని. అనుకొని నటులే మఱుసటినాఁటి ప్రొద్దున ఏనుఁగుమీఁద బయలుదేఱితిమి. గుజరాతులో బండిమీఁద ప్రయాణ మెట్టిదో చంపారణ్యమున ఏనుఁగుమీఁద ప్రయాణ మట్టిది. సగముదూరము వెళ్లకముందే పోలీసు సూపరింటెండెంటుగారి బంటొకఁడు వచ్చి 'తమకు సూపరింటెండెంటుగారు అభినందనములు చెప్పుమనిరి' అని పలికెను. నా కర్థమాయెను. ఆ ప్రదేశమునకు వెళ్లి చూచి రమ్మని ధరణీధరబాబునకు చెప్పి జమాను తీసుకొనివచ్చిన వాడుఁగ బండిమీఁద నేను వెనుకకు మరలితిని. అతఁడు 'చంపారను విడిచి పొమ్ము' అను నోటీసొకటి నా కందిచ్చెను. నన్ను ఇంటికడ దిగవిడచి దానిమీఁద చేవ్రాలు పెట్టుమనెను. 'ఇచటి సంగతులఁ దెలిసికొనక చంపారనును విడిచి వెళ్లిపోను' అని నేను వ్రాసియిచ్చితిని. 'ఈ యాజ్ఞ నుల్లంఘించినందులకు రేపు విచారణ జరుగఁగల' దని నాకు సమను వచ్చెను.

ఆ రేయి నేను జాగరణ మొనరించి వ్రాయవలసిన యుత్తరము లన్నియు వ్రాసితిని. చెప్పవలసిన విషయము లన్నియు వ్రజకిశోర బాబుకు చెప్పితిని.

నాకు సమను వచ్చినటులు నలు దెస లల్లుకొనిపోయెను. మోతీహారిలో నిట్టి వింత లెన్నఁడును జరిగియుండలేదని యెల్ల రనుకొనిరి. గోరఖబాబుగారి యిల్లును, కచేరియు మనుజులతో నిండిపోయెను. రాత్రియెల్లయు చేయవలసిన పనిని చేసికొనియుంటినిగాన ఈ జన సమూహమును సంబాళించుకొనఁ గలిగితిని. నా సహచరుల విలువ నాకపుడు తెలిసెను. నే నెచటి కేఁగిన నచట నా చుట్టును జనము. నా సహచరులు వీరిని నియమప్రకార మునుపఁగలిగిరి. కలెక్టరు మేజిస్ట్రేటు సూపరింటెండెంటులకును, నాకును నొకమాదిరి మైత్రి సమకూరెను. నామీఁద అమలుఁజరుపఁబడిన నోటీసు వగైరాలను లా ప్రకారము నేను విరోధింపవచ్చును గాని నే నటులు చేయుటకు బదులు వారి నోటీసులమీద దస్కతు చేసి పుచ్చుకొంటిని గాన నేను వ్యక్తితిరస్కారము చేయలే దనియు, వారి హుకుములకు మాత్రమే సవినయమగు తిరస్కారము చేసితిననియు వారు గ్రహించిరి. దీన వీరి కొక ప్రకారముగా భయము పోయెను. వీరు న న్నేమియు నిబ్బంది పఱుపలేదు. ఇంతియకాక, లోకసమూహమును నియమముగా నుంచుటలో నా సాయమును, నా సహచరుల సాయమును సంతోష పూర్వకముగా నుపయోగపఱచికొనిరి. కాని తమ యధికారము నాఁడే లోపించె నని వారు కనులారఁ గనుఁగొనిరి. లోకుల కా క్షణమున దండభయము పోయెను. వా రీ క్రొత్త స్నేహితుని యధికార మునకు లోఁగిరి.

చంపారణ్యమునందు నన్నెవరు నెఱుఁగ రని గుర్తుంచుకొన వలయును. అచటి రయితు లందఱును పామరులు. చంపారణ్యము

గంగకు ఉత్తరపు తల. హిమాలయప్రత్యంతపర్వతముమీఁద దాని యునికి. దానికి నేపాళము బాసట. ఇది యిటు లోక క్రొత్త ప్రపంచము. ఇందు కాంగ్రెసుమాట చొఱలేదు. ఇందు కాంగ్రెసు సభ్యు లెవరును లేరు. కాంగ్రెసు పే రెఱిఁగినవా రున్నను వారికి 'కాంగ్రెసు' అని పలుకను, కాంగ్రెసులోఁ జేరను భయము. నేఁ డచట కాంగ్రెసుపేరితో గాక కాంగ్రెసు, కాంగ్రెసు- సభ్యులును ప్రవేశించిరి. కాంగ్రెసు అభయహస్త మొసఁగెను.

నా సహచరులతో నాలోచించి 'ఇచట కాంగ్రెసుపేర నేమియు జరుపరా' దని నిశ్చయించితిని. పని కావలయును గాని పేరితో నేమి పని! కూఁతలు వలదు; చేఁతలు వలయు. ఆ ప్రాంతము నందు వకీళ్ల వాగ్యుద్ధమే కాంగ్రెసని యర్థము; డొంక తిరుగుడుగా ర్లను సమర్థించుటయే కాంగ్రెసని యర్థము. మరియు కాంగ్రె సనఁగా బాంబు, రాజద్రోహము, మోసము. ఇట్టి యూహ సరకారుకును, సరకారువారి నీలికామందులకును గలదు. కాంగ్రె సిట్టిది కాదని మే మీ యిరువురకును తెలుపవలయును. కావున కాంగ్రెసుపేరు స్మరింప రాదనియు, లోకులకు కాంగ్రెసుయొక్క భౌతికదేహమును గుఱించి కూడ తెలుపరా దనియు నిశ్చయించితిమి. కాంగ్రెసుపేరు—వట్టి యక్షరములు— తెలియకున్న నేమి! దానియాత్మ నెఱిఁగి దాని ననుసరించినఁ జాలును. కావలసిన పని యిది.

కావున ముందుగా భూమికను తయారుచేయుటకు కాంగ్రెసు తరఫున చాటుగాఁగాని నీటుగాఁ గాని, మనుష్యు లెవరును అచటికిఁ బంపఁబడలేదు. వేలకొలఁది ప్రజను రాజకుమారశుక్ల సమర్థించుకొనఁ జాలఁడు. రాజకీయపు పని యిసుమంతయు నచట ప్రచారము చేయఁ బడియుండలేదు. వారు చంపారణ్యముతక్క బహిఃప్రపంచ మెఱుఁ

గరు. ఇటులయినను వారు నన్ను పురాణమిత్రునివలె గారవించిరి. కావున ఇట్టి యీ మహాజనసమ్మేళనమునందు నే నీశ్వరసాక్షాత్కారము, అహింసాసాక్షాత్కారము, సత్యసాక్షాత్కారము చేసియుంటి ననుచో నిసుమంతయు నతిశయోక్తి కాదు. ఇందు ప్రతియక్కరము నిక్కము. ఇట్టి సాక్షాత్కారమునకు లోకులయెడ నాకుఁగల ప్రేమ వినా మరొక కారణము లేదు. ఈ ప్రేమయు అహింసయెడల నచలమగు నా విశ్వాసమే కాని వేఱు కాదు.

చంపారణ్యమునం దా దినము నా జన్మములో మరవరానిది. నాకును, అచటి ప్రజకును ఆనాఁడు పండుగు.

లా ననుసరించి నేనే విచారింపఁబడవలసినవాఁడను గాని నిక్కమునకు సర్కారే విచారింపఁబడెను. కమిషనర్ నాకు పన్నిన బోనులో సర్కారునే త్రోసెను.

## ౧౪

## కేసు తీసివేసికొనుట

విచారణ మారంభ మాయెను. సర్కారు-వకీలు, మేజిస్ట్రేటు మొదలగు సాక్షీవరులు బెదరిపోయిరి ఏమి చేయవలయునో వారికిఁ దోఁచలేదు. కేసును వాయిదా వేయుమని సర్కారు-ప్లీడరు మేజిస్ట్రేటుకు నొక్కి చెప్పుచుండెను. కాని నే నడ్డుజొచ్చి వాయిదా వేయవలదనియు, చంపారణ్యమును విడిచి వెళ్లవలసిన దను మీ నోటీసును నే ననాదరించి యపరాధము నొప్పుకొనుచుంటి ననియు తెలిపి చిన్న వాఙ్మూల మిచ్చితిని.

'క్రిమినల్ ప్రొసీజరు కోడ్డు ౧౪౪ సెక్షన్ ప్రకారము మీరు నా మీఁద జారీచేయించిన నోటీసునెడల పైకిమాత్ర మవిధేయతవలె కానిపించు గంభీరమగు నీ యనాదరము నే నేల కావించితినో కోర్టువారి సెలవు తీసికొని రుజువుచేసికొనఁ దలఁచుచున్నాను. ఇది నా యుద్దేశమున ననాదరము కాదు, స్థానికపరిపాలనమునకును, నాకును గలిగిన మతభేద మని నా మనవి. నే నీ ప్రదేశమునకు జనసేవ చేయుటకును, దేశసేవ చేయుటకును వచ్చియుంటిని. నీలిమందు కామందులు రైతులకు న్యాయము చేయుట లేదని విని రైతులు తమకు సాయము చేయవలసినదని కోరఁగా నే నిటకు వచ్చితిని, ఈ విషయమంతయు సంపూర్ణముగా కనుఁగొనకుండ సాయ మెటులు చేయఁగలను? కావున ఈ విషయమును సంపూర్ణముగా తెలిసికొనుటకు వీలయినచో సరకారువారి సాయమును, నీలికామందుల సాయమునుగూడఁ బడయఁదలఁచితిని. నే నిచటికి వచ్చుటకు కొండొక యుద్దేశము లేదు. నే నిచటికి వచ్చినందుల శాంతిభంగముగాని, ప్రాణాపాయముగాని కలుగునని నమ్మఁజాలను. ఇట్టి విషయములలో నాకు చాల ననుభవము కలదు. కాని సరకారువా రన్యథా తలఁచిరి. వారి కష్టము నే నెఱుఁగుదును. చారులు చెప్పిన మాటలను వారు విశ్వసింపవలసియుందురని నాకు తెలియును. మీరు

నామీఁద జారీ చేయించిన ఆజ్ఞకు న్యాయబద్ధుని చందమున నేనును బద్ధుఁడను కావలయును. మరియు నాయుద్దేశముగూడ నట్టిదియే. కాని నే నిటుల చేసినచో నే నేపనిమీఁద నెవరికొఱకు వచ్చితినో వారియెడల నా కర్తవ్యము నతిక్రమించినవాఁడ నగుదును. నేను వారిలో నుండనిచో వారి కుపకరింపఁజాల ననుకొనుచున్నాను. కావున నాయంతట నేను చంపారనును విడిచిపెట్టి పోవఁజాలను. ఇట్టి ధర్మసంకటమున చంపారణ్యమునుండి నన్ను తొలఁగించు భారమును సరకారువారిమీఁద పెట్టక తప్పకపోయెను. భారత దేశమునందలి సార్వజనికజీవనమున నా పదవివంటి పదవిలో నున్న వారు ప్రముఖమగు కార్యముపట్లఁ గడు జాగరూకత వహింపవలసి యుండునని నేను లెస్సగా నెఱుఁగుదును. ఈ శ్లిష్టపరిపాలనమందు స్వాభిమానము కలవానికి నాకు పట్టిన స్థితిగతులే పట్టినచో నతఁడును, నే నేది చేయ నిశ్చయించితినో అదియే—అనఁగా నాజ్ఞ నుల్లంఘించి మాటాడకుండ దండము ననుభవించుటయే చేయవలయును.

నాకు వేయఁబడు శిక్ష తక్కువగా నుండవలయు నను నుద్దేశముతో నే నీ వాఙ్మూలము నీయఁ దలఁపలేదు. న్యాయము గల పరిపాలకులయెడ గౌరవలోపముచే నామీఁద జారీ చేయఁబడిన యాజ్ఞను నే నుల్లంఘింపలేదు. కాని యింతకంటె దొడ్డయాజ్ఞ యొకటి కలదు—అది అంతరాత్మ యాజ్ఞ. దాని ననుసరించుటయే నా యుద్దేశమని మనవిచేసికొనుచున్నాను.'

నే నిటుల వాఙ్మూల మిచ్చిన పిదప విచారణ నాఁపవలసిన పని యేమున్నది? కాని మేస్ట్రీటుగాని, సర్కారువకీలుగాని యిది యిటులు పరిణమించు నని తలపోయలేదు. కావున తీర్పు చెప్పుటకు మేస్ట్రీటు వాయిదా వేసెను. నే నీలోపుగా నీ సంగతియంతయు వైసరాయికిని, పాట్నాలోని స్నేహితులకును, పండిత మదనమోహనమాలవ్యులకును, తదితరులకును తంతియిచ్చితిని. నేను శిక్ష బడయుటకు కోర్టుకు వెళ్లకముందే 'యీ కేసును ఎత్తి వేసికొన వలసిన దని లెఫ్టి

నెంటు గవర్నరు తనకు తంతి నిచ్చెననియు, నీవిషయమును మీరిఁక విచారించుకొనవచ్చుననియు, ఆఫీసరులు మీకు కావలసిన సాయము చేయఁగల రనియు కలెక్టరు నాకు చీటి వ్రాసెను. ఇట్టి మే లింతలో కలుగు నని మే మనుకొనలేదు.

నేను కలెక్టరు హైకాకుగారిని సందర్శించితిని. అతఁడు న్యాయతత్పరుఁడయిన యోగ్యుఁడని నాకు తోఁచెను. 'మీకుఁ గావలసిన కాకితముల నన్నిఁటిని మీరు చూచికొనవచ్చును. నన్నెపుడు చూడఁదలఁచుకొనిన నపుడు చూడవచ్చు' నని యతఁడనెను.

భారతదేశమున కిది సత్యాగ్రహప్రథమపాఠము; లేక సవినయ మగు రాజకీయాజ్ఞోల్లంఘనమున ప్రథమపాఠము. పత్రికలలో నీ విషయము చాల చర్చింపఁబడెను. చంపారణ్యమును గుఱించియు, నా విచారణనుగుఱించియు మితి లేని వ్యాప్తి కలిగెను.

నా విచారణయెడల గవర్నమెంటువారు నిష్పక్షపాతు లయి యుండవలయును. దీనిని పత్రికలలో చర్చింపవలసినంత పనిలేదు. మరియు పత్రికలకు వార్తలు పంపువారితో పనిలేదు. ఇంతియ కాక దీనినిగుఱించి అతిశయమయిన టీకలును, పెద్దపెద్ద రిపోర్టులును చేసినచో నష్టముగూడఁ గలుగు నను భయము కలదు. కావున 'తాము తమ సంవాదదాతలను ఖర్చుపెట్టి యిచటికిఁ బంపవల' దని ముఖ్య పత్రికల సంపాదకులకు నే నుత్తరములు వ్రాసితిని. మరియుం ప్రకటింపఁదగిన విషయము లున్నయెడల నేను వ్రాయుదు ననియు వారికిఁ దెలిపితిని.

సర్కారువారికి నాయెడఁ గలిగిన సద్భావమునకు నీలిమందు కామందు లసంతుష్టు లయిరి. పైక్కు లేదు గాని ఆఫీసరులకును ఇది యిష్టముకాదు.

సత్యాసత్యములతోఁ గూడిన పత్రికావార్తలు వారి కోపమును రగులుకొలుపవచ్చును. దానిఫలము నే ననుభవించుటకు బదులు భయభ్రాంతులగు రైతు లనుభవింపవలసివత్తురు. మరియు నిందలి సత్యమును గనుఁగొనుటకు నాకు విఘ్న మేర్పడును. నే నింత జాగ్రత్తగా నున్నను నీలిమందుకామందులు నన్నుగుఱించి విషముగా ప్రచారముచేయఁ దొడఁగిరి. నన్ను గుఱించియు, నా సహచరుల గుఱించియు పత్రికలలో కల్లమాటలు వెలువడియెను గాని నే నతిజాగరూకతఁ గొనినందువలనను, కడుఁ జిన్న విషయములందుఁగూడ నేను సత్యము నంటిపెట్టుకొని యుండుటవలనను వారి ప్రయత్నములన్నియు విఫలము లాయెను.

నీలిమందు కామందులు వ్రజకిశోరబాబును నిందించుటలో నే మాటనుగూడఁ దాఁచికొనలేదు. కాని వారు నిందించినకొలఁదియు వ్రజకిశోరబాబుప్రతిష్ఠ వృద్ధిఁ బొందెను.

ఇట్టి చిక్కులో రిపోర్టరుల నచటికి రమ్మని నేను ఉత్సాహము కలిగింపలేదు. నాయకులకుఁగూడ రమ్మని వార్త పంపలేదు. 'అక్కఱ కలిగినపుడు తెలిపినచో వత్తు' నని మదనమోహన మాలవ్యాలు ఉత్తరము వ్రాసిరి. కాని నేను వీరి కిట్టి కష్టము కలిగింపలేదు. నే నీ రీతిగా నీ యాందోళనమునకు రాజనీతిస్వరూపము కలుగకుండఁ దప్పించితిని. అపుడపు డచటి వార్తలు ముఖ్యములయిన పత్రికలకుఁ బంపితిని. అవి వారికిఁ దెలియుటకే కాని ప్రకటింపఁబడుటకుఁ గాదు. తుదకు రాజనీతిలో పరిసమాప్త మయినను రాజనీతికి సంబంధింపని విషయమున కొక రాజనీతిస్వరూపమును గల్పించినచో నది పాడగు ననియు, ఉన్నదాని నున్నపాళముగా నుంచినయెడల నది దానికి దోహద మగుననియు నాకు పుష్కలమగు ననుభవము కలదు.

శుద్ధమగు లోకసేవయందు ప్రత్యక్షముగాఁ గాకున్నను పరోక్షముగా రాజనీతి వచ్చి దొరలు నను మాట చంపారణ్యసంగ్రామము సిద్ధముచేసిపెట్టెను.

## ౧౬

### కాండ్ర

చంపారణ్యవిచారణమును సంపూర్ణముగా వ్రాయుట యనఁగా చంపారణ్యపు రైతుల చరిత్రమును వ్రాయుటయే. ఆ చరిత్ర మంతయు నీ ప్రకరణములలో వ్రాయ శక్యము గాదు. చంపారణ్యవిచారణ మనఁగా నహింసాసత్యముల మహాప్రయోగము. దీనికి సంబంధించిన విషయములలో మంచి వని నాకుఁ దోఁచినవానిని మాత్ర మేతి యుదాహరించుచున్నాను. దీని నంతయుఁ దెలిసికొనఁగోరువారు రాజేంద్రప్రసాదులు హిందీభాషలో వ్రాసిన 'చంపారన్ మేఁ మహాత్మాగాంధీ' యను పుస్తకమును చదువవలయును.*

ప్రకృత మనుసరింతము. గోరఖబాబు గారి యింటనే యీ విచారణ జరుపుచో వారి యింటిని కాళీచేయ మనవలసివచ్చును. మాకొఱ కొక యిల్లద్దెకుఁ బుచ్చికొను ధైర్యము మోతీహారిలోని జనుల కింకను గలుగలేదు. కాని చతురుఁడగు వ్రజకిశోరబాబొక యిల్లెటులో దొరకించుకొనెను. ఇంటిముందు చాల స్థలము కలదు. మేము మా యింటఁ బ్రవేశించితిమి.

ధనము లేక పని సాగదుగదా! ఇట్టి పనుల కింతవఱకును ప్రజాసామాన్యముకడ ద్రవ్యభిక్ష గొనుట యలవాటులో లేదు. వ్రజకిశోరబాబుగారి సమాజము ముఖ్యముగా వకీలుసమాజము. అక్కఱ కలిగినయెడల వీరే చందాలు వేసికొనెడివారు; లేక మిత్రులచేత చందాలు వేయించెడివారు. 'ధనమునకు లోటు లేని మేము జన

*యస్. గణేశన్, ట్రిప్లికేన్, మద్రాసులో దీని కాంగ్లానువాదము ముద్రితము.

సామాన్యము నెటులు యాచింపఁగలము?' అని వారి యభిప్రాయము. ఇది వాదమునకు బాగుగనే యున్నది. చంపారను రయితులకడనుండి యొకపైస యేని వసూలు చేయఁగూడ దని నా నిశ్చయము. ఇటులు చేయుచో దీనికి విపరీతార్థము ప్రసక్తించును. మరియు నే నీ విచారణ నిమిత్తము హిందూదేశమునం దంతటను చందాలు వేయింపఁ దలఁప లేదు. ఇటులు చేయుచో దీనికి రాష్ట్రీయత్వమును, రాజనీతిస్వరూపమును సంఘటించును. బొంబాయి మిత్రులు ౧౫,౦౦౦ రూకలు పంపుదు మనిరి కాని నేను వందనపూర్వకముగా వల దంటిని. చంపారణ్యమున కావల నున్న ధనికులగు బిహారువారికడ వ్రజకిశోరబాబు చే వీలయినంత ధనము పోగుచేయింప నెంచితిని. చాలనిచో నాకు మిత్రులగు ప్రాణజీవసదాస మెహతాగారి నుపసర్పింపఁ దలఁచితిని. 'కావలయునది నాకడఁ దీసికొనుఁ' డని మెహతాగారు వ్రాసిరి. ఈరీతిగా మాకు ద్రవ్యచింత మాసెను. చంపారణ్యములోని పేద జీమి కనుకూలముగా మేము తక్కువలో తక్కువ వ్యయము చేయఁ దలఁచితిమి. కావున ధన మెక్కువ కూడఁబెట్టఁ దలఁపలేదు. చాల ధన మక్కఱ లేదని తుదకు మాకుఁ దెలిసిపోయెను. వెరసి రెండు మూడు వేలకంటె నెక్కువ వ్యయము కాలే దని నా యూహ. మరియు మేము పోగుచేసినదానిలో ఏ నూఱో, వేయో మిగిలినటులుం గుఱుతు.

మొదటమొదట నా సహచరుల పద్ధతి విచిత్రముగా నుండెను. నా కది చాల వినోదపాత్ర మాయెను. ఒకొక్క వకీలు కొకొక్క వంటవాఁడు; ఒకొక్క పాకశాల. భోజనము నడిరేయిని. ఎవరి ఖర్చులు వారివే యయినను వారి యనియమము నా కొక యుపద్రవ ముగా నుండెను. వారికిని, నాకును చాల నెయ్య మలవడెను గాన

దురర్థము చేసికొనక నా శబ్దబాణములను వారు ప్రేమతోచవి చూచిరి. నవుకరులను తీసివేయవలయు ననియు, ఏక-వంట చేయ వలయు ననియు, భోజననియమ మనుష్ఠింపవలయు ననియు తుద కందఱు నంగీకరించిరి. వీరిలోఁ గొందఱు మాంసాహారులు. రెండు వంటకములు వ్యయకరములు. కావున మాంసవర్జనము చేయఁబడెను. శాకాహారము గూడ ఎక్కు తొక్కు కాకుండఁ జేయఁబడెను. దీనితో వ్యయము తగ్గెను. మాకు పనిచేయు సామర్థ్య మెక్కువాయెను. కాలమును కలిసివచ్చెను. ఈ రెండును మాకపు డావశ్యకములు.

వాఙ్మూలము లొసఁగుటకు రయితులు గుంపులు గుంపులుగా వచ్చిరి. ఆ రయితులకు పలువురు సహచరులు. వీ రందఱితోడను వాకిలియు తోఁటయు నిండిపోయెను. దర్శనాభిలాషులనుండి నా సహచరులు నన్ను చాల రక్షింపఁ బూనుకొనిరి గాని యాపని వారిచేతఁ గాలేదు. ఒక నియతసమయమున నే నందఱకును గానిపింప వలసి వచ్చెను. అయిదుగురు మొదలుకొని, యేడుగురివఱకును వాఙ్మూలములు వ్రాసికొనుచున్నను తెమలక కొందఱు రయితులు ప్రొద్దుగ్రుంకిన పిదప యూరక వెళ్లవలసివచ్చెడివారు. నిక్కమున కిన్ని వాఙ్మూలములతో పనిలేదు. ఏలన నివి చాలవరకు పునరుక్త ములే. కాని వాఙ్మూల మీయనిచో వారికి తృప్తి లేదు. ఇచ్చినచో సంతోషము కలిగెడిది. వారి యీ యుద్దేశమునకు నేను సంతో షించితిని.

వాఙ్మూలములు వ్రాసికొనువారికి కొన్ని నియమములు కలవు. వ్రాయసకాఁడు ప్రతిరైతును క్రాసుపరీక్ష చేయవలయును. దీనికి తాళనివాని సాక్ష్యము గైకొనరాదు. దీనికి చాల సమయము పట్టినను ఇటులు చేయుటవలన చాల వాఙ్మూలములు తిరుగులేని వాయెను.

ఈ వాఙ్మూలములు వ్రాసికొనునపుడెల్ల నొక సి. ఐ. డి. ఆఫీస రుండెడివాఁడు. మేము సి. ఐ. డి. వారిని రాపుంపఁ జేయఁ గలము. కాని వీరిని రావింతమనియు, వీరితో సౌజన్యము నెఱపుద మనియు, వీరికిఁ గావలసిన విషయము చెప్పుద మనియు ముమ్మొదటనే నిశ్చయించుకొంటిమి. వాఙ్మూలములు వ్రాసికొనునపుడు వీరు దగ్గఱ నుండి చూచుచుండెడివారు, వినుచుండెడివారు వీ రిటులు చేయుట వలన లోకులకుభయము పోయెను. మరియు వీరియెదుట వాఙ్మూలము లిచ్చుటలో అత్యుక్తి తగ్గెడిది. కల్లలాడుచో పోలీసువారు కొట్టులోఁ బెట్టుదురను భయముతో రైతులు జాగ్రత్తగా నుండవలసివచ్చెడిది.

నే నీ సీమందు కామందులకు రొష్టు కలిగింప నెంచక సౌజన్యముచే వారిని లోఁగొనఁ దలఁచితిని. ప్రియాదు లెవరిమీఁద నెక్కువ పడినవో వారికి చీటి వ్రాయుటయు, వారిని గలిసికొని మాటాడుటయు నొక పనిగా పెట్టుకొంటిని. ప్లాంటర్స్ అసోసియేషన్ వారిని కలిసికొని రైతుల కష్టనష్టములను వారి కెఱుకపఱచి వారి యుద్దేశమును గయికొంటిని. వీరిలోఁ గొందఱు నన్నుఁ దిరస్కరించిరి; కొంద ఱౌదాసీన్యమును వహించిరి; మఱికొందఱు సౌజన్యము చూపిరి.

## సహచరులు

బ్రజకిశోరబాబు రాజేంద్రబాబులు జోడు. ఈ జోడునకు మఱి జోడు లేదు. వీరు నన్ను తమ ప్రేమచే ముందరి కొక యడుగేని వేయలేనంత కుంటివానిఁ జేసి వయిచిరి. వీరికి శిష్యు లనఁ గొనుఁడు, లేక సహచరు లనుకొనుఁడు—శంభుబాబు, అనుగ్రహబాబు, ధరణీబాబు, రామనవమిబాబు, మరియు నింక కొందఱు వకీళ్లెల్లప్పుడును వీరిని బరివేష్టించియుండిరి. అపుడపుడు వింధ్యాబాబు, జనకధారీబాబుగారలుగూడ వచ్చి సాయపడుచుండెడివారు. వీ రందఱు బిహారువారు. రైతుల వాఙ్మూలములు వ్రాసికొనుట వీరి ముఖ్యకార్యము.

ప్రొఫెసరు కృపలానీగారు మాకు తోడుపడకుండ నూరక కూరుచుండఁగలరా! అతఁడు సింధుదేశమువాఁ డయినను బిహారు దేశమువారికన్న నెక్కువ బిహారువాఁడాయెను. లోకమునందు కొందఱు దేశసేవకులు విచిత్రులు కలరు. వా రే దేశమున కేఁగిన నా దేశమునందు కలిసిపోవుదురు. వారిని పరదేశు లని యెవరును కనిపట్టఁజాలరు. అట్టివారిలో కృపలానీగా రొకరు. ఇతఁడు నా ప్రధాన ద్వారపాలకుఁడు. ఆ సమయమున నతఁడు దర్శనార్థులనుండి నన్ను బ్రతికించుచో తన జీవితము సార్థక మనుకొనెను. కొందఱను నవ్వించియు, కొందఱను హింసచేయకుండ బెదరించియు నాకడకు రాకుండఁ బంపివయిచుచుండెను. చీకటిపడఁగనే యధ్యాపకత్వము వహించుచుండువాఁడు. నవ్వించి సహచరుల పొట్టలు వక్కళ్లు కావించువాఁడు. పిఱికివాఁ డెవఁడేని వచ్చినయెడల శూరునిగా మార్చెడివాఁడు.

మౌలానా మజహరుల్ హక్కుగారు సహాయకకోటిలో నుండుటకు తమ హక్కును వ్రాయించి యిచ్చి నెల కొకటి రెండు మాఱులు వచ్చి చూచి పోవుచుండిరి. నాఁటి సాడంబర మగు వారి జీవితమునకును, నేఁటి నిరాడంబర మగు వారి జీవితమునకును రాజానకును, బంటునకును గల భేదము కలదు. వారి దొరవేసము బిహారు వారికి వింతగా నున్నను వారి హృదయము మాలోఁ గలిసిపోయి వారు మాలో నొక రయిపోయిరి.

నా కాయాయి ప్రదేశములం దనుభవ మెక్కు డయిన కొలఁది చంపారణ్యమున సరి యయిన పని చేయవలసి యుండుచో గ్రామములందు బడులు పెట్టక తప్ప దని తోఁచెను. రైతుల యజ్ఞానము, రామ రామ! చెప్పఁ దరము కాదు. వారు తమ బాలుర నూరక తిరుగనిత్తురు. లేదా, దుగ్గాని కూలికి ప్రొద్దున మొదలుకొని చీకటిపడువఱకును నీలితోఁటలలోనికిఁ బంపుదురు. ఆ నాళ్లలో మగవానికి కూలి పదికానులకంటె మించదు. ఆఁడువారి కాఱు, పసివారికి మూడు. కర్మము చాల కెవనికేని నాలు గణాలు కూలి గిట్టుచో వాఁడు మహాభాగ్యవంతుఁడు.

నా సహచరులతో నాలోచించి మొదట ఆఱు గ్రామములలో బాలురకు బళ్లు పెట్ట నిశ్చయించితిని. పంతుళ్లకు భోజనము, నివాసము మీరు ఏర్పాటు చేయుచో మిగిలినవానిని మేము చూచుకొందు మని గ్రామస్థులకుఁ జెప్పితిమి. పాపము వారి చేతిలో డ బ్బుండదు. కాన వారు ధాన్యము కొలఁతు మనిరి.

పంతుళ్ల నెచటనుండి పిలిపించుట యనునది చాల నాలోచింపఁదగిన విషయ మాయెను. బిహారులో జీతము తీసికొనక గాని, కొద్ది జీతము తీసికొని గాని మంచి పంతుళ్లు దొరకుట కష్టము. పిల్ల

లను మామూలు పంతుళ్లపాలు చేయుట నా కిష్టము కాదు. వారికి అక్షరజ్ఞాన మల్పముగఁ గలిగినను చరిత్రబలము చాలఁ గావలయును.

ఇందులకు స్వయంసేవకులు కావలయునని విన్నపము ప్రకటించితిని. దీనికి జబాబుగా గంగాధరరావు దేశపాండేగారు బాబా సాహెబ్ సోమణ్ గారిని, పుండలీకుగారిని పంపిరి. బొంబాయి నుండి అవంతికాబాయి గోఖలేగారు వచ్చిరి. దక్షిణమునుండి (పూనా) ఆనందీబాయిగారు వచ్చిరి. నే నాశ్రమమునుండి ఛోటేలాలును, సురేంద్రనాథుని, నా కుమారుఁడు దేవదాసును బిలిపించితిని. ఇంతలో మహాదేవ దేశాయియు, వారి భార్య దుర్గాబహేనును, నరహరి పరేఖుగారును, వారి భార్య మణిబహేనును వచ్చిరి. కస్తూరబాయినిగూడఁ బిలిపించితిని. ఇటు లాచార్యులు ఆచార్యాణులును ఆచార్యులును సాగయిరి. శ్రీ అవంతికాబాయియు, ఆనందీబాయియు విద్యావతులే కాని శ్రీ దుర్గాదేశాయికిని, మణిబహేను పరేఖు గారికిని గుజరాతీలో గల జ్ఞానము కొలఁది. కస్తూరబాయి కదియు లేదు. ఈ స్త్రీలు హిందీబాలకుల కెటులు చెప్పఁగలరు?

బాలురకు వ్యాకరణము, గోకరణము చెప్పవలసిన పని లేదు. వారికిఁ జెప్పవలసినది రీతి నీతి. వ్రాఁత కూఁతలకంటె శుచిశుభ్రతలు నేర్పవలయు నని నే నీ యాఁడువారికిఁ దెలిపితిని. హిందీ, గుజరాతీ, మరాఠీ—అక్షరములలో నత్యంత భేదము లేదనియు, మొదట అక్షరములు, అంకెలు నేర్పుట అంత చిక్కయిన పని గా దనియుఁ దెలిపితిని. దీనికి ఫలముగా నీస్త్రీలు చక్కగా బోధింపఁ గలిగిరి. దీన వీరి కాత్మవిశ్వాసము వృద్ధిచెందెను. వీరికి తమ పనియెడల నాసక్తి గూడఁ గలిగెను. అవంతికాబాయిబడి మేలుబడి యాయెను. ఆమె యిందులకు తన ప్రాణములను ధారపోసెను. ఆమె యీపనికి పెట్టినది

పేరు. మేమీ యేఁడువారివలన గ్రామములలోఁ బ్రవేశము కలిగించుకొనఁ గలిగితిమి.

నేను బడులు పెట్టుటతో నాఁగలేదు. గ్రామములందు మురికికి మేరలేదు. సందుగొందులలో చెత్తచెదారములు. నూతుల చుట్టును బురద, కుళ్లునీరు. వాకిళ్లలో కాలు పెట్టుటకు వీలు లేదు. పెద్దవారలకు శుచిత్వము నేర్పు టావశ్యకము. చంపారణ్యమునందలి వారికి పలుతెగల చర్మవ్యాధులు కలవు. వీలయినంతవఱకు వీనిని బాగుచేయుటకు ప్రయత్నింపవలయు ననియు, వారి జీవితప్రవిభాగములలోనికిఁగూడఁ జొఱఁబాఱవలయు ననియు తలఁచితిమి.

ఈ పనికి వైద్యులు కావలయును. డాక్తరు దేవుగారిని పంపుఁడని గోఖలే సొసయిటీవారిని గోరితిని. వీరితో నా కిదివఱకే స్నేహము మెండు. వారి సేవాలాభ మాఱునెలలు దొరకెను. పంతుళ్లు, పంతులమ్మలు వారికడఁ బని నేర్చికొనిరి.

వీ రెవరికిని నీలిమందు కామందులతోఁ గాని, రాజకీయవ్యవహారముతోఁ గాని జోక్యము లేదు. ఫిర్యాదు లేవేని యున్నచో నాకు మాత్రమే వానితో సంబంధము. ఎవరిపని వారిదే, యెవరిపాట వారిదే, వీరి కింకొక పనితో సంబంధ మిసుమంతయు లేదు. 'వరికి వారే యమునాతీరే.' చంపారణ్యమునందు నా యీ సహచరుల నియమపాలన మత్యద్భుతము. వీరిలో నెవరును నెంత్రుకవాసియైనను ఈ నియమముల నుల్లంఘించినటులు నాకు గుర్తు లేదు.

# గ్రామ ప్రవేశము

చాలవఱకు కొకొక్క బడిలో నొక పురుషుని, ఒకస్త్రీని నియమించితిమి. మందు లొసఁగుట, గ్రామారోగ్యము సరిచేయుట వీరు చూచుకొనవలయును. స్త్రీసాహాయ్యమున స్త్రీలోకములో ప్రవేశము కలిగించుకొనవలయును. మందుల పని చాలఁ దేలిక చేసిపెట్టితిమి. ఆముదము, క్వినిన్, గంధకలేపము-వీనిని ప్రతి బడిలోను నిలువచేసితిమి. నాలుకపై మకిల కానిపించినను, లేక మలబంధము కలిగినను ఆముద మొసఁగితిమి. జ్వరము వచ్చినవారి కాముద మిచ్చి పిదప క్వినిన్ వాడితిమి. చర్మవ్యాధులు గలవారికి గజ్జి మొదలగునది కల చోటు చక్కగా కడిగి గంధకలేప మంటించితిమి. ఇంటికి పట్టుకొనివెళ్లుట కే మందును ఈయమయితిమి. విశేషవ్యాధులు కలవారిని డాక్టరు దేవుగారికడ కంపితిమి. డాక్టరు దేవుగారు నియతవేళకు కొన్నికొన్ని తావుల కరిగి వైద్యము చేయుచుండెడివారు. ఈ సులభోపాయములు చాలమంది కుపకరించెను. మామూలు రోగములు కొలఁదిగా నున్నపుడును, అవి సులభోపాయములకు లొంగునపుడును పెద్ద వైద్యుల సాయమక్కఱలేదు గాన మే మేర్పఱచిన పద్ధతి హాస్యజనకము కాదు. ఇది అచటివారి కెవరికిని నవ్వులాటగా లేదు.

ఇఁక గ్రామసంస్కరణముకడ నట్టు. గ్రామమునందలి జనము తమంతఁ దా మేమియుఁ జేయరు. పొలములలో పాటుపడువారుగూడ తమ చేతితో తమ మలమును తీసి పాఱవైవరు. డాక్టరు దేవుగారు 'ఇఁక లాభము లేదు' అని అనుకొనెడివారు కారు. వారును, మఱి

కొందఱు స్వయంసేవకులును గలిసి యొక గ్రామమును పూర్ణముగా నిర్మలము చేయఁదలఁచి బజాఱు లూడ్చిరి; వాకిళ్లలోని పెంట నెత్తి వయిచిరి; నూతులకడ నున్న మురికిగుంటలను బాగుచేసిరి. ఇటులు చేసి కొందఱు స్వయంసేవకులను బంపుఁడని గ్రామస్థులను గోరిరి. కొన్నియూళ్లవారీ పనిని జూచి సిగ్గిలి పనిచేయ నారంభించిరి. మఱి కొన్ని యూళ్లవారు నా మోటరుకారు పోవు రోడ్లనుగూడ సుభ్రపఱిచిరి. ఈ మధురవిషయములతో పాటు లోకుల యుపేక్షవలన కటువిషయములుగూడఁ జవిచూడఁబడకపోలేదు. కొన్ని గ్రామముల వారీ పనియెడల మొగమోటమి లేక తమ యనిష్టమును దెలిపి నటులు నాకు గుర్తు కలదు.

నే ననేక స్త్రీల సభలలోఁ జెప్పుచు వచ్చిన యొక విషయ మిచట నుదాహరించుట అనుచితము కాదు. భీతిహరవా యను నొక చిన్న గ్రామము కలదు. దీనిప్రక్క నొక గ్రామటిక * కలదు. అచట నున్న కొంద ఱాఁడువారి బట్టలు చూతునుగదా మడ్డి యోడుచుండెను. వీరు బట్ట లేల యుతుకుకొనరో, వేఱు బట్ట లేల కట్టుకొనరో కస్తురబాయిని కనుఁగొమ్మంటిని. ఆమె వారి మంచిచెడుగులు కనుఁగొనెను. వారిలో నొకయామె కస్తురబాయిని తన గుడిసెలోనికిఁ గొంపోయి, 'ఇదిగో! మాకు పెట్టెలు గాని యలమరలు గాని, లేవు. నాకు వేఱే వస్త్రము లేవియు లేవు. ఈ కట్టుకొనిన దొక్కటే నాకుఁ గల బట్ట. ఏమి కట్టుకొని దీని నుతుకుకొందునో సెల విండు! మహాత్ములను నా కొక వస్త్రము నిమ్మనుఁడు! నేను ప్రతిదినమును తప్పక స్నానము చేసి వస్త్రము మతికికొని మంచి బట్ట కట్టుకొందును' అని చెప్పెను. హిందూదేశమునం దిట్టి గుడిసె యిది యొకటియే

*గ్రామటిక=మఱీ చిన్న పల్లె: గూడెము.

కాదు; వేన వేలు. పెట్టెయు బుట్టయు లేక, మాఱువలువ లేక మానము కాపాడుకొనుటకు చినుగుపాతలు దాల్చువారసంఖ్యాకులు గలరు.

మఱి యొక విషయ మిచట నుదాహార్యము. చంపారణ్యమున గడ్డికిని, వెదురునకును వెతకకొన నక్కఱలేదు. భీతిహరవాలో బడికిఁగాను మట్టిగోడలు పెట్టి గడ్డివెదుళ్లతో నొక పాకను వేసిరి. ఎవరో యొకరాత్రి దానికి నిప్పు పెట్టిరి. ప్రక్కనున్న నీలిమందు కామందుల తాలూకువాడని లోకు లనుమానించిరి. మరల నట్టి పాకయే వేయుట మంచి దనిపింపలేదు. ఆ బడిని శ్రీ సోమణుగారును, కస్తురబాయియుఁ జూచుచుండిరి. సోమణుగారు, ఇటుకతో గోడలు కట్టి పెంకుటిల్లు వేయ నిశ్చయించిరి. పలువు రతనికి సాయ పడిరి. వెంటనే యొక పెంకుటిల్లు లేచెను. ఇఁక దాని కగ్నిభయము లేదు.

ఈ రీతిగా బడులవలనను, ఆరోగ్యసంస్కరణమువలనను, ఔషధములవలనను లోకులకు స్వయంసేవకులయెడల నమ్మిక ప్రబలెను. వారియెడ మంచియుద్దేశము కలిగెను.

నే నీ పని యంతయు చిరస్థాయిగా నుండునటులు చేయఁదలఁచితిని గాని యది సాగలేదని చింతాపూర్వకముగా చెప్పుచున్నాను. వచ్చిన స్వయంసేవకులు కొలఁదికాలమే యుండుటకు వచ్చియుండిరి. క్రొత్తవారు పైనుండి వచ్చుట కష్టమాయెను. బిహారులో నిందు లకుఁ దగినవా రెవరును దొరకరైరి. చంపారణ్యమున నా పని ముగియువఱకు ఈ లోపుగా నాకొఱకు తయారగుచున్న మఱి యొక పని నన్నెత్తుకొనిపోయెను. నే నచట నున్న దాఱు నెలలే యయినను నాఁటి పని నేఁటికిని నచట నేదోవిధముగాఁ గానబడుచునే యుండును.

## ౧౯

# మంచి అధికారివలని ప్రయోజనము

వెనుకటి ప్రకరణములలోఁ జెప్పిన రీతిగా నొకవంక సంఘసేవ జరుగుచుండెను; మఱియొకవంక రయితుల దుఃఖకథలు వ్రాసికొనుటయు వృద్ధిబొందుచుండెను. వేలకొలఁది వాఙ్మూలములు పుచ్చుకొనఁబడినపిదప నవి యేమి లాభమునొసగక పోవునా? వాఙ్మూలము లిచ్చు జనము వేలకు దాఁటినకొలఁది నీలిమందు కామందుల క్రోధము హెచ్చఁదొడఁగెను. వారు నా విచారణను విఫలముగాఁ జేయుటకు విశ్వప్రయత్నముల నొనరించిరి.

నా కొకనాఁడు బిహారుసరకారువారికడనుండి యొక యుత్తరము వచ్చెను. 'మీ విచారణకు వలసినదానికంటె నెక్కువకాలము పట్టెను. మీ రిఁక దానిని ముగించి బిహారును విడిచి పోవరా?' ఈ యుత్తరము వినయముగనే యుండెను; గాని దాని యర్థము బట్టబయలుగనే యున్నది! నే నిటులు ప్రత్యుత్తరించితిని: 'నా విచారణ కింకను చాలఁ గాలము పట్టక తప్పదు. విచారణ ముగిసినపిదపఁగూడ నిచటి లోకుల కష్టములను బోఁగొట్టకుండ బిహారు విడిచిపెట్టి పోవుట నా కిష్టము కాదు.'

నావిచారణ నాఁపివేయుటకు సరకారువారికి రెండు మంచి దారులు కలవు. రైతుల కష్టములు నిక్కములని తెలిసికొని వానినిఁ బోఁగొట్టుట యొకటి. వారి వాఙ్మూలములఁ గయికొని సొంతముగా విచారణసంఘమును నియమించుట మఱియొకటి. గవర్నరు ఎడ్వర్డు గెయిట్ గారు నన్ను దమకడకు రమ్మనియు, సొంతముగా విచారణ సంఘము నియమించుటకుఁ దా మూహించుచున్నా మనియు, అందు

మీరుగూడ సభ్యత వహింపుడనియు నాకుఁ దెలిపిరి. మిగిలిన సభ్యుల పేరులు చూచి నా సహచరులతో సంప్రతించి యీదిగువ షరతుల ప్రకారము నేను సభ్యుఁడ నగుదు నని సమ్మతించితిని. ఆషరతు లివి: విచారణ జరుగుచుండు కాలమున నా సహచరుల సలహాను దీసికొనుటకు నాకు నిషేధము ఉండరాదు. నే నిందు సభ్యుఁడ నయితి నను కారణమున రైతులకు సలహాదారుగా నుండరా దను నిషేధము ఉండరాదు. మరియు నీ విచారణ ముగిసినపిదప నిది నాకు సంతోషము కలిగింపనిచో రైతులకు తగిన సలహా నిచ్చి వారిని నడిపించు స్వాతంత్ర్యము నాకు ఉండవలయును.

సర్ ఎడ్వర్డు గెయిట్‌గారు నా షరతులు మంజూరుచేసిరి. ఈ విచారణసంఘమునకు స్వ. సర్ ఫ్రాంక్ స్లాయిగా రధ్యక్షులుగా నియమింపఁబడిరి. విచారణసంఘము రైతుల ఫిర్యాదు సత్యమని నమ్మెను. నీలిమందు కామందు లనుచితముగాఁ దీసికొన్న సొమ్ములో కొంత పాలు తిరిగి యీయవలయుననియు, తీన్ కతియా పద్ధతిని చట్టముప్రకారము తీసివేయవలయు ననియు నభిప్రాయపడెను.

ఈ రిపోర్టేకవాక్యతగా నుండుటకును, తుదకు అగ్రేరియన్ బిల్లు ప్యాసుచేయించుటకును గవర్నరుగారి పాలెక్కువ. గవర్నరుగా రేమాత్రమేని దృఢముగా నుండకున్నను, తమ కౌశల్యమును సంపూర్ణముగా నుపయోగింపకున్నను,ఆ రిపోర్టున కైకకంఠ్య ముండెడిదికాదు. అగ్రేరియన్ బిల్లుగూడ ప్యాసయ్యెడిది కాదు. నీలిమందు కామందులకును చాల బల ముండెను. రిపోర్టువచ్చిన తరువాత నది బిల్లుగా మాఱకుండుటకుఁ జాలఁ బని చేసిరి. కాని సర్ ఎడ్వర్డు గెయిట్‌గారు తుదివఱకు నచలముగా నుండి విచారణసంఘమువారి సిఫారసులు సంపూర్ణముగా నెఱవేఱునటు లొనరించిరి.

నూరేండ్లనుండి నములులో నున్న యీ తీన్‌కతియా పద్ధతి యీ రీతిగా రద్దాయెను. దీనితోపాటు నీలికామందుల రాజ్యమస్తమించెను. విఱిగిపోయిన రైతుల కిపుడు మరల జీవము వచ్చెను. 'నీలిమందు మచ్చ యెన్నఁటికిని పోదు' అను సందేహము తొలఁగిపోయెను.

చంపారణ్యమునం దారంభము చేయఁబడిన యీ పనులను కొన్నియేండ్లవఱకును కొనసాగింపవలయు ననియు, నింకను బాల బడులు పెట్టవలయు ననియు, నింకను చాల గ్రామములు తిరిగిచూడ వలయుననియును నే ననుకొంటిని. క్షేత్రము సిద్ధముగనే యుండెను గాని పలుమాఱులు నాయభీష్టము నీశ్వరుఁడు కొనసాగనీయఁడు. దైవము నా కింకొక పని చూపి లాఁగుకొనిపోయెను.

# ౨౦

## కూలివారితో

చంపారణ్యమున కమిటీపనిని ముగింపునకుఁ దెచ్చునంతలో మోహనలాల్ పాండ్యలును, శంకరలాల్ పరీఖులును గలిసి నాకొక యుత్తరము వ్రాసిరి: 'ఖేడాజిల్లాలో పంటలు పోయెను. రైతులు శిస్తులు చెల్లింపఁజాలరు. వారికి రిమిషను ఇప్పింపవలయును. మీరీవిషయమునఁ గలుగఁజేసికొనవలయును.'

అచటికి వెళ్లి చూడనిదె సలహా చెప్పఁగల ఇచ్ఛయు, శక్తియు, సాహసమును నాకు లేవు.

అప్పుడే శ్రీ అనసూయాబాయియు నొక యుత్తరము వ్రాసెను. కూలివారి జీతములు చాలఁ దక్కువగా నున్నవనియు, కూలివారు చాలఁ గాలమునుండి జీతములను పెంపుచేయఁ గోరుచుండిరనియు నామె వ్రాసెను. నాకు కూలివారిని సరియగు దారిని నడపు నుత్సాహము కలదు. ఈ పని చాలఁ జిన్నదయినను ఇంత దవ్వునఁ గూర్చుండి నే నీ పనిని నడపఁజాలను. కావున వెంటనే అమదాబాదున కేఁగితిని. ఈ రెండు పనులను నెఱవేర్చికొని కొలఁదికాలములోనే చంపారణ్యమునకుఁ గ్రమ్మఱి యచటఁ దలపెట్టిన పనులనన్నింటిని పూర్తి చేయఁ గల ననుకొంటిని.

అమదాబాదు వెళ్ళి చూచికొనినతరువాతఁ జాలఁ గాలము పట్టును చంపారణ్యమునకు వెళ్ళ వీలు కలుగదని తేలెను. చంపారణ్యమునఁ బెట్టిన బడు లొకటితరువాత మఱియొకటి యెత్తివేయఁబడెను. నా సహచరులును, నేనును చాల నాకాశసౌధములను గట్టితిమి గాని యవియన్నియుఁ గొలఁదికాలములో నేలఁగూలెను.

చంపారణ్యమున బడులు పెట్టుట, గ్రామములను బాగుచేయుట యను నీ రెండు పనులేగాక గోరక్షణముకూడ జేయవలయునని తల పెట్టితిని. గోరక్షణమును, హిందీప్రచారణమును మార్వాడీలు [illegible]గా గొనినటులు నా త్రిప్పటలోఁ గనుఁగొంటిని. బేతియాలో నొకమారు వాడీ సజ్జనుఁడు తన సత్రమున నాకు బస యిచ్చెను. బేతియాలో నున్న చాలమంది మారువాడీలు నన్ను తమ గోశాలలలోనికిఁ దీసి కొనిపోయిరి. గోరక్షణమును గురించి నే నప్పటికే ఆలోచించి పెట్టుకొని యుంటిని. నేఁడు నాకుఁ గల యుద్దేశము లన్నియు నాఁటివే. గోవంశమును వృద్ధిపొందించుటయు, గోజాతిని సంస్కరించుటయు, ఎడ్లచే తగినంత పరిమాత్రము చేయించుటయు, మేలు బడులను క్షీరశాలల నెలకొలుపుట యీ మొదలగునవన్నియు గోరక్షణము క్రిందికి వచ్చును. మారువాడీ లీ పనికి చాల సాయపడుదు మనిరి గాని నేను చంపారనులోఁ జాలఁ గాల ముండఁజాలమి నాపని సగము సగముగానే యాఁగిపోయెను. బేతియాలో నింకను గోశాల పని జరుగుచున్నది కాని యది యింకను ఆదర్శమగు క్షీర శాల కాలేదు. చంపారణ్యమునందింకను ఎడ్లచే మితిమీరిన పనిని చేయించుచున్నారు. హిందూనామధారు లింకను ఎడ్లను దయమాలి పీడించి తమ ధర్మమును పాడుచేసికొనుచున్నారు. నే నిందుల కెపుడును వగచుచున్నాను. నేను చంపారణ్యమునకు వెళ్లినపు డెల్ల చేతఁగాక చాలించిన యీ పని కావేదనపడుటయు, బిహారువార లయు, మారువాడీలయు నెయ్యపు ముదలకింపులకు పాలగుటయుఁ దటస్థించుచున్నది.

కొన్ని కొన్ని తావులలో బడు లేవోమాదిరిగా సాగుచున్నవి. కాని గోసేవాకార్యక్రమము చక్కగా నెలకొనలేదు. కావున దానికిఁ దలఁచినంత పెం పొదవలేదు.

## ౨౦ కూలివారితో

అమదాబాదులో ఖేడాలోఁ జేయవలసిన పనినిగూర్చి యాలోచించుచు, ముందు కూలివారి పనిని జూడ నారంభించితిని.

నా స్థితి చాల విషమముగా నుండెను. కూలివారి వాదము సమంజసము. అంబాలాల్ సారాభాయి శ్రీ అనసూయాబాయికి సోదరుఁడు. అతఁడు మిల్లువారి పక్షము. శ్రీ అనసూయాబాయి కూలివారి పక్షము. వీ రిరువురికి నిందు తగవు వచ్చెను. ఇఁక నామాట. నాకును మిల్లువారలకును జాలఁ జెలిమి. కావున వారితో తగవులాడుట మఱికొంచెము చిక్కు. నేను వారితో సంప్రతించితిని. పంచాయతిచే తగవు తీర్చికొను మంటిని. కాని తమకును, తమ కూలివారికిని నడుమ నొక మాధ్యస్థ్యము వారి కొప్పుదల కాలేదు.

నా కిఁక కూలివారితో 'కట్టు కట్టుఁ' డని చెప్పక తప్పని సరి యాయెను. నే నిటులు చెప్పకముందు కూలివారితోడను, వారిలో పెద్దలతోడను బాగుగా మాటలాడి వారి స్థితిగతు లన్నియు తెలిసికొంటిని. కట్టిన కట్టు చెంగిపోకుండుట కీ క్రింది నియమములను విధించితిని:

౧. శాంతిభంగ మెన్నఁటికి కలిగింపరాదు.

౨. మరల బనిలోనికిఁ బోవువారిని బలాత్కరింపరాదు.

౩. బిచ్చ మెత్తరాదు.

౪. కట్టు జరుగునంతవఱకును తిరిగిపోకుండ నుండవలయును; కూడు లేనిచో మరియాద గల మఱియొక కూలిపనిని చేసికొనవలయును.

పెద్దల కీ నియమము లర్థ మాయెను, నచ్చెను. 'మన విన్నపము నంగీకరింపనంతవఱకుఁగాని, పంచాయతీని వేయనంతవఱకుఁ

గాని మనము పనిలోనికి పోఁగూడ దని కూలివారు ఒట్టు పెట్టుకొనిరి.

ఈ కట్టు జరుగుచున్నపుడే శ్రీ శంకర్‌లాల్ బాంకరును—శ్రీ వల్లభభాయిని నేను బాగుగా నెఱుఁగఁ గలిగితిని. ఇంతకుముందే శ్రీ అనసూయాబాయి నెఱిఁగియుంటిని.

సబర్మతీతీరమున నొక చెట్టుక్రింద దైనందినమీ కట్టు కట్టిన కూలివారి సభ జరుగుచుండెడిది. అచటికి వేలకొలఁది కూలివారు వచ్చెడివారు. నేను ప్రతిదినమును వారు పాటింపవలసిన షరతులను గుఱుతు చేయుచుంటిని. మరియు శాంతిని కాపాడవలయు ననియు, నాత్మగౌరవమును కాపాడుకొనవలయు ననియు బోధించు చుంటిని. వారు ఏక్ టేక్* అని వ్రాయఁబడిన జెండాలు గైకొని పెండ్లివారివలె నూరేఁగి వీథులలో సభకు హాజరగుచుండెడివారు.

కట్టిరువదియొక్క నాళ్లు జరిగెను. ఇది జరుగుచుండఁగా కూలివారికి న్యాయము కలిగింపవలసిన దని నేను మిల్లువారిని ప్రార్థించుచుంటిని. 'మేము మాత్రము ఒట్టు పెట్టుకొనలేదా? కూలివాండ్రు మాకు బిడ్డలవంటివారు, మేము తండ్రులవంటి వారము..... మానడుమ మూడవవాఁ డొకఁడు వేలు పెట్టనేల? మాకు పంచాయతీచేయువారొకరా?' అని ప్రత్యుత్తరము చెప్పు చుండెడివారు.

* శపథమును పాలింపుము.

## ౨౧

# ఆశ్రమము నొకతూరి తొంగిచూచుట

కూలివారలను ముందరకు నడిపింపక ముం దొకసారి యాశ్రమమును తొంగిచూచు టావశ్యకము. నేను చంపారణ్యమునం దుండినను ఆశ్రమముమాట మఱవలేదు. నడుమనడుమ నచటికిఁ బోయి వచ్చుచుంటిని.

అమదాబాదు ప్రక్కనున్న కోచరబ్ అను గ్రామమున మా ఆశ్రమము కలదు. కోచరబులో ప్లే గంటుకొనెను. బాలుర నచట సురక్షితులనుగా నుంచుట కష్టము. ఆశ్రమమునందు శౌచ నియమముల నెంత జాగరూకతతో పరిపాలించినను చుట్టుప్రక్కల నున్న యశౌచము నాశ్రమమునకు సోఁకకుండఁ జేయుట యసంభవము. ఆ సమయమున గ్రామస్థులచే శౌచనియమములఁ బరిపాలింపఁ జేయుటకును, లేక వారికి సేవచేయుటకును మాకు శక్తి లేదు. గ్రామమునకు దూరముగా—చిక్కు కలుగనంత దూరముగా—నాశ్రమము నుంచుట మా యుద్దేశము. ముం దెప్పుడో యాశ్రమమును స్థాపించినను ప్రకృతము భూమి కొని యచటికిఁ దఱలుదమని తలఁచితిమి.

'కోచరబు విడనాడి పొండు!' అనుట కీ ప్లేగు నోటీ సను కొంటిని. శ్రీ పుంజాభాయి హీరాచం దనునతఁ డాశ్రమమున కొకచుట్టము. అతఁడు చిన్నపనులనక పెద్దపనులనక యాశ్రమసేవ చేయుచుండెడివాఁడు. అమదాబాదులోఁ బ్రతిసంగతియు నతనికిఁ దెలియును. ఆశ్రమమునకుఁ దగిన తావు నితఁడు వెదకఁ దొడఁగెను. ఇతనితోడ నేనును కోచరబుకు ఉత్తరభాగమును, దక్షిణభాగమును తిరిగి చూచితిని. ఉత్తరమున మూడు నాలుగు మైళ్లలో

నొక భాగము దొరకుచో చూడుమని చెప్పితిని. ఇపుడు మే మున్న ప్రదేశము నతఁడు చూపెను. ఆ ప్రదేశము నాకు నచ్చుటకు చెఱసాల దాపుగా నుండుట యొక కారణము. సత్యాగ్రహాశ్రమవాసుల వెంగముఁందు జైలుప్రాఁత వ్రాయఁబడియుండుటచే కనులయెదుట జై లుండుట చాల మంచిది. శుచిగా నుండు ప్రదేశముల నడుమనే జైళ్లు కట్టుదురనియు నే నెఱుఁగుదును.

ఏ డెనిమిది దినములలో కొనుబడి యాయెను. భూమిలో ఇండ్లు వాకిండ్లుగాని, చెట్లు చేమలుగాని లేవు. ఏమి లేకపోయినను నిది నదీతీరమున నుండుటయు, నేకాంతముగా నుండుటయు నన్నిటికంటె గొప్ప విశేషము. అందు గుడారములు వేసికొని యుండఁ దలఁచితిమి. ఇండ్లు కట్టునంతవఱకు రేకుపాకలలో వంటఁ దలపెట్టితిమి.

ఆశ్రమము క్రమాభివృద్ధిఁ గనుచుండెను. పిన్నలు పెద్దలు, స్త్రీలు పురుషులు అందఱు చేరసి సుమారు నలుబది మంది కలరు. అందఱకు పాకశాల యొకటియే యగుటచే చాల వీలుగా నుండెను. ఆశ్రమము నిటనుండి యటకు మార్పఁ దలపెట్టుట నావంతు. పని చేయుట యంతయు మామూలు చొప్పున స్వ. మగన్‌లాల్ గాంధీవంతు.

మంచి యిండ్లు వేసికొని నిలఁద్రొక్కుకొనువఱకు మాకు వచ్చిన యిబ్బందులకు మితి లేదు. వానలు వంగెను. నాలుగు మైళ్ల దూరమునుండి సామానంతయు రావలయును. ఈపాంప్రెనేలలో పాములు కావలసినన్ని. అట్టిచోట పసివారితో నివసించుట సామాన్యము కాదు. పైగా 'పాములఁ మొదలగువానిని చంపరాదు' అని మాకు నియమము. మరియు మాలో పామనిన భయము లేనివా రెవరును లేరు; నేఁటికిని లేరు. స్థితిగతు లిట్టివి.

## ౨౧ ఆశ్రమము నొకతూరి తొంగిచూచుట

హింస చేయు జీవములఁ జంపరాదను నియమము ఫినిక్సు టాల్‌స్టాయి సబర్మతాశ్రమములందు యథాశక్తి యనుష్ఠింపఁబడుచు వచ్చుచుండెను. ఈ యాశ్రమములం దన్నిటను మేము పాంద్ర నేలలోనే కాలు పెట్టితిమి. ఈ మూడు తావులందును సర్పాదుల యుపద్రవ మెక్కువ. అయినను నేఁటివఱ కెవరిని పాము ముట్టలేదు. శ్రద్ధానేత్రముతోఁ దిలకించుచో నీశ్వరకృపయే దీనికిఁ గారణము. 'ఈశ్వరునకు పక్షపాత ముండునా? మానవుల పిచ్చి పనులలోఁ జేయి చేసికొనుటయే యాతని పనియా!' యని యెవరును నిరర్థకముగా శంకింపకుందురుగాక! అది యనుభవనీయమగు విషయము. దానిని భాషలోఁ బెట్టఁజాలను. లౌకికభాషలో నీశ్వరుని కార్యములను గుఱించి వ్రాయుచుంటినిగాని యవి వ్రాయుటకు వీలయినవి కావని నాకుఁ దెలియును. పామరుఁడగు మానవుఁడు వర్ణింపనెంచును బో మూకవాణియే యవలంబనము. సర్పములను జంపని మా యాశ్రమము వారి కిరువదియయిదేండ్లనుండియు నించుకయు సర్పబాధ కలుగకుండు టానుషంగిక మనుటకుబదు లీశ్వరకృపయే కారణ మనినచో నది వెఱ్ఱి నమ్మక మగునేని యట్టి వెఱ్ఱి నమ్మకమునే నే నంటి పట్టుకొని యుందును.

కూలివారు కట్టు కట్టిన సమయమున ఆశ్రమమున నేతసాలకు పునాదులు త్రవ్వితిమి. ఆశ్రమమున మొదటి పని నేత. వడుకుట మాకింకను తెలియలేదు. కావున తొలుత నే నేతసాల కట్టింపవలయు ననుకొంటిమి.

## ౨౨

# ఉపవాసము

కూలివారు మొదటి రెండు వారములును చాల ధైర్యము చూపిరి. మిగుల శాంతముగా నుండిరి. ప్రతిదినమును పలువురు సభకు వచ్చుచుండిరి. ప్రతిదినమును నేను వారికి శపథమును గుర్తునకుఁ దెచ్చుచుంటిని. 'చావనయినఁ జచ్చెదముగాని యొట్టు మీఱుదుమా!' యని వారు చెప్పిపోవుచుండిరి.

క్రమముగా కట్టు తప్పిపోవఁ జొచ్చెను. బలము పోయిననాఁడు చెనకఁ జూచును. అటులే కట్టులో బలము పోఁబోఁగినకొలఁది కట్టులో నున్నవారు కట్టు తప్పినవారిని ద్వేషింపఁ జొచ్చిరి. ఇఁక వీరిలో వీరికి తగవు లుప్పతిల్లునేమో యని యనుకొంటిని. [illegible] వీరిని కొట్టుకొనఁజేయకుండుట కష్టమని నాకు భయమెత్తెను. ప్రతిదినమును సభలో జనము పలుచన కాఁ దొడఁగెను. వచ్చినవారి మొగములమీఁదఁగూడ నౌదాసీన్యము ద్రేలాడుచుండెను. కూలివారందఱును ఊఁగులాడిపోవుచున్నటులు నాకు వార్తవచ్చెను. నాపని అట్టిట్టాయెను. నా విధి యేమని యాలోచించితిని. నాకు దక్షిణ-ఆఫ్రికాలో కూలివారికట్ల అనుభవము కలదు. కాని యిది క్రొత్త. ఏలన నిచట కూలివారు నా ప్రేరణచే కట్టుకట్టిరి. ప్రతిదినము నాకడ బాసచేసి పోవుచుండిరి. దీనికి నేనే సాక్షిని. ఇఁక వీరెటులీ ప్రతిజ్ఞను దాఁటఁగలరని నా యుద్దేశము. ఇది నా గర్వమో, కూలివారల యెడల నాకుఁ గల ప్రేమయో, లేక సత్యమునెడలఁ బ్రేమయో యెవరు చెప్పఁగలరు?

ప్రాతఃకాలము. నేను సభలో నుంటిని. ఏమిచేయను దోఁచ లేదు. 'కూలివారందఱును మరల కట్టులోనికిఁ జేరనంతవఱకును,

ఈ విషయము తేలుదనుక కట్టు నిభాయింపనంతవఱకును—ఇంత యేల? కూలివా రందఱును మిల్లువదలి బయటఁ బడనంతవఱకును నే నన్నము ముట్టను' అను నీ మాట లప్రయత్నముగా నానోట వెలు వడెను.

కూలివారు నివ్వెఱపోయిరి. శ్రీ అనసూయాబాయికనులవెంట నీ రూరఁ దొడఁగెను.

'మే ముపవసింపవలయుఁగాని మీ కేటి యుపవాసము? మీచేత నుపవాసము చేయనీయము. మా తప్పులు క్షమింపుఁడు! మేము మాబాసను దాఁటము.' అని కూలివారు గోలకెత్తిరి.

'మీ కుపవాసముతో పనిలేదు. మీరు మీ ప్రతిజ్ఞకు నిలువబడినచోఁ జాలును. మనకు ద్రవ్యము లేదు. భిక్షాన్న ముతో కట్టు కట్టరాదుగదా! మీరింకొక కూలిపని చేసికొని పొట్ట గడపుకొనినచో కట్టెన్నాళ్లున్నను నిర్భయము. ఇఁక నా యుప వాసమందురా? ఇది అటో యిటో తేలిపోవలెను' అని నే నంటిని.

ఈలోఁగా వల్లభభాయి మునిసిపాలిటీలో పనులకు వెదకు చుండెనుగాని సమకూరలేదు. ఆశ్రమమున నేఁతసాలలో నిసుక పోయవలసిన పని యున్నది. దీనికిఁ జాలమంది కూలివారి నుపయోగ పఱచికొనవచ్చునని మగనలాలు సూచించెను. కూలివారు పనికి తయారుగానుండిరి. శ్రీ అనసూయాబాయి నెత్తిమీఁద పళ్లిక నిడుకొని కూలివారికి దారి జూపెను. అప్పుడా కూలివారిని చూడ వలె ననిపించెను. కూలివారికిఁ గ్రొత్త బలము వచ్చెను. వారికి కూలి యిచ్చువాని చేయి పీఁకుకొని పోయెను.

ఈ యుపవాసమునం దొక దోషము కలదు. ఏలన: మిల్లువారల కును నాకును నెయ్యము కలదని లోఁగడ వ్రాసియుంటిని. కావున

నా యీ యుపవాసము వారిని స్పృశింపకుండ నుండఁజాలదు. వీరికి విరుద్ధముగా నుపవసించుట సత్యాగ్రహ మనిపించుకొనఁ బడదని నే నెఱుఁగుదును. వీరిని వంపవలయునది కూలివారికట్టె. నా ప్రాయశ్చిత్తము వీరి దోషమునకుఁ గాదు; మఱి కూలివారి దోషమునకు. నేను కూలివారి ప్రతినిధిని. కాన వారు దోషులగుదురేని నేనును దోషినే. నేను మిల్లువారికి వినయమునే చూపవలయును. వీరి కెదురుగా నుపవసించుట బలాత్కారములోనికి దిగును. ఇటులు నా యుపవాసము వారి కొరపిడి కలిగించు నని నాకుఁ దెలిసినను నాకుఁ జేయక తప్పని దాయెను. ఇట్టి దోషమయ మగు నుపవాసము చేయుట నాధర్మమని లెస్సగా తోఁచెను.

'నా యుపవాసమువలన మీరు మీదారినుండి కొంచెమేని తొలఁగవలసిన పని లేదని నేను మిల్లువారలకుఁ దెలిపితిని. వారు నామాటల కనుకూలార్థమునే గ్రహించిరి. అపుడపుడు తమాషాగా న న్నెత్తిపొడిచిరి. దీనికి వీరి కధికారము కలదు.

ఈకట్టున కెదిరినాయకుఁడు సేఠ్ అంబాలాలు. ఇతని పట్టుదల యాశ్చర్యజనకము. ఇతఁడు కల్లకపటములు లేనివాఁడు. ఇతనితో కయ్యము పొడుచుట నాకు రుచించెను. ఇట్టివాఁడు నాయకుఁడుగాఁ గల విరోధిపక్షమునకు నాయుపవాసము పీడాజనక మగుటచే నేను చాల వగచితిని. అతనిభార్య సరళాదేవికిని, నాకును కడు నెయ్యము. ఆమె నాకు సోదరివంటిది. నాకొఱ కామె వగచుట నేను చూడఁ జాలక పోయితిని.

శ్రీ అనసూయయు, కొందఱు మిత్రులును, కూలివారు కొందఱును తొలినాఁడు నాతోపా టుపవసించిరి. కాని పిమ్మట నతి కష్టముమీఁద వారిని మానిపించితిని.

ఈరీతిగా నలువంకలును క్షేమపూరితము లాయెను. మిల్లువారి హృదయములు ద్రవించెను. వెంటనే యీవిషయమును పరిష్కరింపఁ దలపోసిరి. శ్రీ అనసూయగారి యిల్లు వీరికి సభాగృహ మాయెను. శ్రీ ఆనంద శంకర ధ్రువగారు నడుమలో నందుకొనిరి. తుద కతఁడు పంచాయతీదారుగా నేర్పఱుపఁబడెను. వెంటనే కట్టు విరమింపఁబడెను. నాకు నాఁటితో మూఁడుపవాసములు. మిల్లువారు కూలివారికి మిఠాయి పంచిపెట్టిరి. ౨౧ దినముల కీరీతిగా సమాధానము కుదిరెను. సమాధానమున కొక సమ్మేళనము జరిగెను. దానికి మిల్లువారును, కమిషనరును హాజరయిరి. కమిషనరు కూలివారి కిటులు సలహా నిచ్చెను: 'మీ రెప్పుడును మి. గాంధీమాట వినుచుండుఁడు!' ఇది జరిగిన కొలఁదినాళ్లకే నాకును, ఈ కమీషనరుకును పెద్ద యుద్ధము జరిగెను. కాని కాలము మారెను; దానితోపా టతఁడును మారెను. అపు డతఁడు నామాటల వినవలదని ఖేడారయితులకు సలహా యిచ్చెను.

రసనీయమును, దయనీయమును నగు నొక విషయ మిట నుదాహరింపక యీ ప్రకరణమును ముగింపను. మిల్లువారు కూలివారికి పంచిపెట్టుటకు చాల మిఠాయి చేయించిరి. వేలకొలఁదిగా నున్న కూలీవారికి దానిని పంచిపెట్టుట యెటు లని శంక కలిగెను. శపథము తీసికొనిన చెట్టుక్రిందనే పంచిపెట్టుట బాగనిపించెను. ఇంతమందికి సరిపోవు చోటుగూడ వేఱొకచో దొరకదు. కావున ఆ చెట్టుచుట్టు ప్రక్కలఁ గల మైదానమునందు పంచిపెట్టుట నిశ్చితమాయెను. ౨౧ నాళ్లదుపాఙ్ఞలలో నున్నవారు విశేషప్రయత్నము చేయనక్కఱ లేకయే బారులు తీర్చి నిలువఁబడి మిఠాయి తీసికొనఁగలరనియు, తొందరపడి మిఠాయిమీఁద చేయిచేసుకొన రనియు నాకు వెఱ్ఱినమ్మ

కము. కాని పంచిపెట్టుట తటస్థించినపు డెన్ని ప్రయత్నములు చేసినను విఫలము లాయెను. పంచిపెట్టుట మొదలిడిన రెండు మూడు నిమసములకే బారులు చెదరిపోయి గోల కాఁజొచ్చెను. కూలీ పెద్ద లెంత ప్రయత్నించినను లాభము కలుగకపోయెను. తుదకు అందఱును ఒక్క గుంపై పోయిరి. మిఠాయి చాలభాగము మట్టిగింపఁబడెను. దానితో మైదానమున పంచిపెట్టుట ఆఁపివేయఁబడెను. మిగిలిన మిఠాయి మిర్జాపురమునందలి సేఠ్ అంబాలాలుగారి యింటికిఁ గొంపోఁబడెను. మఱునాఁడు వారి బంగళాకుంపిరి కౌస్థలమున పంచిపెట్టఁబడెను.

దీని హాస్యరసము స్పష్టమే. 'ఏక్ టేక్' చెట్టుక్రింద మిఠాయి పంచిపెట్టుదురని అమదాబాదు బిచ్చగాండ్ర కెటులో తెలిసెను. వారు మెల్లగా ఇటకు వచ్చిరి. మిఠాయిని కొల్లగొట్టుకొనిపోవుటకు వారి యాఁకలి కారణము. ఇది చాల శోచనీయము.

మన దేశమున ఆఁకటి చిచ్చుచే జచ్చువారి సంఖ్య క్రమాభివృద్ధి నొందుచున్నది. తినుటెడలఁ, ద్రాగునీటెడలఁగూడ నాఁకలి సామాన్యగౌరవమును కాపాడదు. మన ధనికులు వారికి పని చూపి తిండి పెట్టుటకుబదులు బిచ్చము లొసఁగి పోషించుచున్నారు.

## ౨౩

## ఖేడా-సత్యాగ్రహము

కూలివారి కట్టు ముగిసిన పిదప ఊపిరి తీసికొనుటకేని నాకు తీరిక లేకపోయెను. వెంటనే ఖేడాజిల్లాలో సత్యాగ్రహము నడపింపవలసివచ్చెను. ఖేడాజిల్లాలో క్షామమువంటి స్థితి కలిగెను. రిమిషను పొందుటకు రైతులు ప్రయత్నించుచుండిరి. శ్రీ అమృతలాల్ ఠక్కరుగారు విచారించి రిపోర్టు తయారు చేసిరి. రైతులకు నే నింకను తగిన సలహా నీయకముందే ఠక్కరుగారు కమీషనరుతో ప్రసంగించిరి. శ్రీ మోహనలాల్ పాండ్యాగారును, శ్రీ శంకరలాల్ పరీఖ్ గారును దీనిలో విఱుచుకొని పడిరి. వీరు స్వ. గోకులదాస్ కహాన్‌దాసు శ్రీ విఠలభాయి పటేలుగారలచే బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిలులో నలజడి కలిగింపఁజేసిరి. సరకారువారికడకు చాల డెప్యుటేషనులు వెళ్లెను.

నే నపుడు గుజరాతుసభ కధ్యక్షుఁడను. ఈ సభ సరకారు వారికి విన్నపములు పంపుకొనెను; తంతు లిచ్చెను; దీనికి ఫలముగా కమీషనరుగారి యవమానములకు లోనాయెను; బెదరింపులు చవిచూచెను; నాఁటి యాఫీసరుల చర్యలు నేఁడు పరికించినచో హాస్యజనకముగను, నమ్మఁదగనంత విచిత్రముగను ఉండును.

ఏమాత్రము చూచినను రైతుల కోరిక అసంగత మనిపింపదు. దానికి వాదుప్రియాదులతోఁ గూడఁ బనిలేదు. నాలుగవ వంతుకన్నఁ దక్కువ పంటలు పండినచో రైతులు రిమిషను కోరవచ్చు నని లాండ్ రివిన్యూ రూల్సులో అభ్యనుజ్ఞ కలదు. పంటలు నాలుగు వంతులకన్న నెక్కువ యుండెనని ఆఫీసరు లంచనా వేసిరి. రయితులు నాలుగు వంతులకన్న తక్కువ యుండు ననిరి. రయితులమాట సరకారుకు

నమ్మకమా? లోకులు పంచాయతీని కోరిరి. పంచాయతీని కోరుట రాజుగారిపై దండెత్తుట యని సరకారువారి యభిప్రాయము. ఇటులు ప్రార్థనలు, వినతిపత్రములు విఫలము లయినపిదప సహచరులతో నాలోచించి యిక సత్యాగ్రహము తలపెట్టుఁడని నేను రయితులకు సలహా యిచ్చితిని.

నా కింద ఖేడాజిల్లాలోని స్వయంసేవకులేకాక శ్రీ వల్లభభాయి పటేలు, శ్రీ శంకరలాల్ బాంకర్, శ్రీ అనసూయాబహెన్, శ్రీ ఇందూలాల్ కన్హైయాలాల్ యాజ్ఞిక, శ్రీ మహాదేవదేశాయి మొదలగువారు తోడయిరి. దినదిన మభివృద్ధి నొందుచున్న గొప్ప ప్రాక్టీసు నిందులకుఁగాను వల్లభభాయిగారు వదలుకొనిరి. పిమ్మటఁ గూడ వారిఁక నా పనికిఁ బోలేదు.

మేము నడియాద్-అనాథాశ్రమమున డేరా వేసితిమి. అచట విడిదికి విశేషకారణము లేదు. ఇందుకుఁ జాలిన తావు కొండొకట లేకుండుటయే యిందులకుఁ గల కారణము.

సత్యాగ్రహు లందఱీక్రిందిరీతి ప్రతిజ్ఞ చేసి చేవ్రాలు పెట్టిరి: "మా గ్రామములో పంటలు నాలుగవ పాలుకన్న తక్కువ యని మాకుఁ దెలియును. కావున పైసాలువఱకు శిస్తులు వసూలుచేయవలదని సరకారువారికి విన్నవించితిమి కాని వారు వసూలుచేయుట మాన లేదు. కావున ఈ దిగువ దస్కతుచేసిన మేము ఈ సాలునకు నిండు శిస్తుగాని, బకాయిగాని సరకారువారి కీయఁజాలము. కాని సరకారువారు శిస్తు వసూలు చేయుటకే దండనీతి ననుసరించినను మేము దాని ననుభవింపఁ దలఁచుకొన్నాము. మేము బుద్ధిపూర్వకముగా శిస్తు లిచ్చి మామాట కల్ల యనిపించుకొనుటకంటె, నాత్మగౌరవము నష్టమొనరించుకొనుటకంటె మా భూముల జప్తు చేయించుకొనుటయే

మాకు మేలు. ఇఁక మీఁద సర్కారువారు రెండవ కిస్తీవఱకును బకాయి వసూలు చేయుట నిలుపుచో మాలో శక్తి కలవారము నిండు శిస్తు ఈయవలసినచో నిండు శిస్తును, బకాయి యున్నచో బకాయిని ఇచ్చివేయఁగలము. తా మిచ్చినచో బీదలుగూడ నీయవలసివత్తురని శక్తి కలవారుగూడ నిప్పు డీయలేము. బీదల చట్టులు, కుండలు మొదలగునవి వేలము వేయఁబడును. వారి కీరీతిగా దుఃఖము కలుగును. ఇట్టి స్థితిలో దరిద్రులను కాపాడుట శక్తిమంతుల ధర్మమని మా నమ్మకము.”

ఈ పోరాటమున కెక్కువ ప్రకరణములను వినియోగింపఁజాలను. కాని నాఁడు జరిగిన చక్కని విషయములు చాల నడుగునఁబడిపోవును. ఖేడాసత్యాగ్రహమునుగుఱించి శ్రీ శంకర్‌లాల్ పరీఖుగారు ప్రామాణికమగు నొక గ్రంథమును * రచించియున్నారు. ఈ గొప్ప విషయమును లోఁతుగాఁ జూడఁదలఁచినవా రా గ్రంథమును జదువుదురుగాక !

* ఇది గుజరాతీభాషలో వ్రాయఁబడినది.

## ౨౪

## ఉల్లి దొంగ

చంపారణ్యాపు మారుమూల నుండుటవలనను, వార్తాపత్రికలకు సంబంధము లేకుండఁ జేయుటవలనను, అచటికి బయటినుండి జనులు మూఁగలేదు. ఖేడాపోరాటము నట్టులఁ గాదు. అచటి వార్తలు ప్రతిదినమును పత్రికలు ప్రచురించెను. గుజరాతీవారికీ క్రొత్త వస్తువుమీఁద మోజు పుట్టెను. వారు ధనము కురిపింపఁ దలపెట్టిరి. సత్యాగ్రహమున కెంతయో డబ్బక్కఱలేదని అంతలో వారికిఁ దెలియుట కష్టము. నే నెంత నివారించినను అక్కఱకు మించిన ధనమును బొంబాయిసేఠు లిచ్చిరి. సత్యాగ్రహమయినపిదప లెక్కలు చూడఁగా కొంత నిలువయుండెను.

మఱియొకదెస సత్యాగ్రహులకు నిరాడంబరజీవనమునుగూర్చి పాఠము చెప్పవలసివచ్చెను. వారు సంపూర్ణముగా నేర్చుకొనిరని చెప్పఁజాలను గాని కొంతకొంత సంస్కరించుకొనిరని చెప్పఁగలను.

రైతులకుఁగూడ నిది వింత వస్తువే. కాన నూరూరు తిరిగి సత్యాగ్రహరహస్యములు వీరికి బోధింపవలసివచ్చెను. సరకారు-ఆఫీసరులు రైతులకు యజమానులు కారనియు, నౌకరు లనియు, రైతు లొసఁగు పన్నులోనే జీతము గొందు రనియు తెలిపి రైతుల భయము పోఁగొట్టుట ముఖ్యమయిన పని యాయెను. భయము పోఁగొట్టినను వీరిచేత వినయపాలనము చేయించుటయు, వినయపాలనము చేయవలయునని యొప్పించుటయు కష్ట మనిపించెను. ఆఫీసరుల భయము దూసికొనిపోవఁగనే వారు చేయు నవమానములకు బదులు తీర్చుకొన కుండ నుండు టెటులు! సత్యాగ్రహికి అవినయము జత యగుచో

పాలలో విషము జతపడినట్లే. నేననుకొనినంతకంటెం నెక్కువ వినయమునే వీరు చూపఁ గలిగి రని తుదకు నాకుఁ దెలిసెను. సత్యాగ్రహములో వినయమే కఠినతమమగు నంశ మని యనుభవమువలన నేను దెలిసికొంటిని. వినయ మనఁగా గౌరవముగా మాటలాడుటయే కాదు. విరోధులయెడల మనస్సునందుఁగూడ నాదర ముంచుట, సరళభావముంచుట, హితము కోరుట: ఇట్టి ప్రవర్తనము వినయము. సత్యాగ్రహి కివి యన్నియు నావశ్యకములు.

మొదటి దినములలో లోకులు చాల ధైర్యము చూపినను సరకారువారు పని పుచ్చుకొనలేదు. కాని లోకులకు ధైర్యము వృద్ధి పొందె నని తెలిసినకొలఁదియు సరకారువారును ఉగ్రములగు నుపాయముల నవలంబింపఁ బూనిరి. ఆఫీసరులు పశువులను, ఇంటఁ గనఁబడిన వస్తువులను జప్తుచేసిరి. నాలవపాలు జరిమానాలకు నోటీసులు పంపిరి. కొన్ని గ్రామములలో పండిన పంటలు జప్తు చేసిరి. దీనితో రైతులు తల్లడిల్లిరి. కొందఱు రైతులు పన్ను లిచ్చిరి. కొందఱు తమ చట్టులను, ముంతలను జప్తు చేసికొనుఁడని ఆఫీసరుల యెదుటఁ బడవయిచిరి. మఱికొందఱు చచ్చినను సరే తుదివఱకు పోరితీరవలయు నని పట్టుమీఁద నిలువఁబడి యుండిరి.

ఇటు లుండఁగా రైతు లెవరో శంకరలాల్ పరీఖుగారి భూమికి శిస్తులు చెల్లించిరి. దీనితో హాహాకారములు బయలుదేరెను. తన రైతు శిస్తు చెల్లించిన భూమిని ధర్మార్థ మిచ్చి శంకరలాల్ పరీఖుగారు ప్రాయశ్చిత్తము చేసికొనిరి. ఇటులు ఆయన తన ప్రతిష్ఠను కాపాడుకొని యితరులకు మార్గదర్శకుఁ డాయెను.

ఒక పొలమున ఉల్లిపంటను అయోగ్యమగు రీతిగా జప్తు చేసిరి. భయపడిపోయినవారి కుత్సాహము కలిగించుటకు మోహనలాల్ పాండ్యాగారి నాయకత్వమున ఆ యుల్లిపాయల నచటినుండి వేఱొక

చోటునకుఁ గొంపొండని ప్రజలకు నేను సలహా నిచ్చితిని. నా యుద్దేశమున ఈపని చట్టము నతిక్రమించుట కాదు. నిలువయున్న పంటను జప్తుచేయుట చట్టమునకు సమ్మతమయినను నిది నీతి[illegible] సరిగా లేదు. కావున నక్రమముగా జరిగిన జప్తు ననాదరించుట ధర్మ మని నేను సూచించితిని. ఇట్లొనరించి ఖైదునకు వెళ్లుటయు, దండన మనుభవించుటయు తప్పనిసరి యని తెలిపితిని. మోహనలాల్ పాండ్యాగారికిని ఇదియే యిష్టము. సత్యాగ్రహమున కిసుమంతయు విరుద్ధము గాకుండ నే విషయమును గూర్చియైని శాసనాల [illegible]గకుండ ఖేడాపోరాటము ముగింపఁజేయుట మోహనలాల్ పాండ్యాగారికి సమ్మతము కాదు. కావున వీరు యుల్లిపంటను తొలఁగింపఁ బని పెట్టిరి. వీరికి ఏడెనమండ్రు మిత్రులు తోడైరి.

సరకారువారు వీరిని పట్టుకొనకుండ విడిచెదరా? వీరిని, వీరి సహచరులను అరెస్టు చేసిరి. లోకుల కుత్సాహము బలిసెను. జైలు నాలల భయము పోయినచో, రాజదండము లోకుల కధైర్యము కలిగించుటకు బదులు ధైర్యము కలిగించును. విచారణసమయమున కోర్టంతయు జనులచే క్రిక్కిరిసి పోయెను. పాండ్యాగారికిని, వారి సహచరులకును కొలఁదినాళ్లు ఖైదు విధింపఁబడెను. నా యుద్దేశమున నీ శిక్ష తప్పు. ఈ యుల్లిపంట నచటనుండి తొలఁగించుట పినల్ కోడులోని చౌర్యముక్రిందికి రాదు. కోర్టులకుఁ బోవుట మా యుద్దేశము కాదుగాన అప్పీలు చేయఁబడలేదు.

వీరిని జైలునకుఁ దీసికొనిపోవునపుడు ఒక పెద్ద యూరేఁగింపు వీరివెంట నడచెను. నాఁడు జనులందఱును 'ఉల్లిదొంగ' యను బిరుదముతో వీరిని సమ్మానించిరి. ఆ సమ్మానము నేఁటికిని వీ రను భవించుచున్నారు.

ఇఁక ఖేడాసత్యాగ్రహమును ముందరి ప్రకరణముతో ముగింతును.

# ౨౫

## ఖేడాసత్యాగ్రహసమాప్తి

ఈ పోరాటము తుదకు విచిత్రముగా ముగిసెను. జను లలసి పోయి రని తెల్లమాయెను. పట్టు విడనాడనివారు ఇంకను పీడింపఁబడి నశింపఁజేయఁబడుదు రని సంకోచించితిని. సత్యాగ్రహి కుపాకేయ మగు నుపాయ మేదేని యున్నచో దానితో నీ పోరాటమును ముగింపఁదలఁచితిని. అట్టి యుపాయ మనుకోకుండఁ దటస్థించెను. 'ధనికులగు రైతులు శిస్తులు చెల్లించినచో బీదలకడ నిస్తు వసూలు చేయుట మానఁబడునని నడియాదు-తాలూకామామ్లతుదారు నాకు వార్త పంపెను. నే నా సంగతిని వ్రాసిపంపఁ గోరితిని అతఁడు వ్రాసి పంపెను. మామ్లతుదారు తన తాలూకాకు జవాబుదారీ కాఁగలఁడుగాని జిల్లాకుఁ గాఁజాలఁడు గావున నే నీ సంగతిని కలెక్టరు కెఱుకపఱచితిని. 'ఇట్టి హుకుము మీకు తెలియలేదా? యని నాకు సమాధానము వచ్చెను. నే నీ వార్త వినియుండలేదు. కాని యిది నిక్కముచో ప్రజల ప్రతిజ్ఞ చెల్లినట్లే. ప్రతిజ్ఞాతమగు వస్తు విదియే. కావున నీ హుకుమువలన సంతసము కలిగెను.

కాని దీని సమాప్తివలన నాకు తుష్టి కలుగలేదు. సత్యాగ్రహ సంగ్రామము సమాప్తి పొందినతరువాత నుండవలసిన లక్షణ మిందు లేదు. కలెక్టరొక కట్టుబాటు ననుసరించినటులు కనఁబడక యీ హుకుమును నిర్వహించెను. మాట యిచ్చుటయేగాని దీన పేదలకు లాభ మంతగా కలుగలేదు. పేద లెవరో తేల్చవలసిన యధికారము ప్రజలది. కాని వా రం దధికరింపఁజేయఁబడలేదు. ప్రజ కిట్టి శక్తి లేనందులకు నేను చాలఁ జింతింతును. తుద కిది సత్యాగ్రహమువలనఁ గలిగిన జయ మని యుద్ఘోషింపఁబడినను నాచూపులో నిది నిస్తేజముగనే యుండెను.

ఆరంభముకంటె నంతమున సత్యాగ్రహులను బలవత్తరులఁగాఁ జేసి విడిచిన యెడలనే సత్యాగ్రహము శుద్ధముగా ముగిసె ననవలయును. ఇం దిది నాకుఁ గానరాలేదు.

ఇటు లయ్యెను దినివలన మనకు కనఁబడని మేళ్లు కొన్ని కలిగెను. వాని లాభమును మనము నేఁటికిని జూచుచున్నాము. ఇంకను పడయఁగలము. ఈ ఖేడాలడాయివలన గుజరాతురైతులకు ప్రబోధము కలిగెను. తన రాజనీతి తెలియ నారంభమాయెను.

శ్రీ బిసెంటుగారి హోమ్-రూలుప్రచార మీ రైతులను విశేషముగా స్పృశించెను గాని ఖేడాలడాయియే చదువుకొనినవారిని స్వయంసేవకులను రైతుల జీవితములలో సరిగా ప్రవేశపెట్టెనని చెప్పవలయును. సేవకులు రయితుల జీవితములో పలుచు నేకలుగాఁ గలిసిపోయిరి. ఈ పోరాటములో తమకుఁ గల క్షేత్రమర్యాద స్వయంసేవకులకుఁ జక్కఁగాఁ దెలిసెను. వీరి త్యాగశక్తి వర్ధిల్లెను. వల్లభభాయి యీ పోరాటమునకు తన నర్పించుకొనె నన్నచో దాని పరిణామము సామాన్యమనుటకు వీలులేదు. వెనుకటి సాలున వరదలు వచ్చినపుడును, ఈసాలున బారడోలీయందును వీరి ప్రయోజనము మనకు బాగుగా తెలిసెను. గుజరాతరాష్ట్రమున ప్రజాజీవనమందు నవ్యతేజ ముదయించెను. నవోత్సాహము చూపట్టెను. రైతులకు తమ శక్తి తెలిసెను. ఆశక్తి యింక నెన్నఁటికిని మఱపునకు రాదు. తమ ముక్తి తమమీఁదనే, తమ త్యాగశక్తిమీఁదనే యున్నటులు అందఱకుఁ దెలిసెను. ఖేడావలన గుజరాతులో సత్యాగ్రహము కూఁకటివేళ్లు పోసికొనెను. సత్యాగ్రహసమాప్తివలన నాకు తుష్టి కలుగకున్నను ప్రజల కుత్సాహము కలిగెను. ఏలనఁగా తమ శక్తికి మించిన ఫలమును వారు పడసి రనుకొనిరి. రాజనీతివలన దుఃఖము కలుగుచో దానిని నివారించు మార్గము తమకు దొరకె ననుకొనిరి. వారి యుత్సాహమునకీ జ్ఞానము చాలును.

కాని ఖేడాప్రజకు సత్యాగ్రహస్వరూపము తిన్నగా తెలియదు. కావున వీరికి చిక్కులు వాటిల్లినటులు మన ముత్తరప్రకరణములఁ జూడఁగలము.

## ౨౬

## ఐక్యమునకు ప్రయత్నము

ఖేడాలో సత్యాగ్రహము జరుగుచున్నపుడు మహాయుద్ధముగూడ జరుగుచుండెను. దాని సంబంధమున వైస్రాయిగారు నాయకులను ఢిల్లీ కాహ్వానించిరి. నన్నుఁగూడ రమ్మని పట్టుపట్టిరి. నాకును, లార్డ్ ఛేమ్స్‌ఫర్డునకును మైత్రి కలదని లోఁగడనే వ్రాసియుంటిని.

నే నీ యాహ్వానము నంగీకరించి ఢిల్లీకి వెళ్ళితిని. నే నిందు కలుగఁజేసికొనుట కొక సంకోచము కలదు. అలీసోదరులును, లోకమాన్యులగు నితరనాయకులును దీని కాహ్వానింపఁబడకుండుటయే నా సంకోచమునకు ముఖ్యకారణము. ఆసమయమున అలీసోదరులు చెఱలో నుండిరి. నేను వీరిని గుఱించి యెక్కువగా వినియుంటినిగాని ఒకటి రెండుమాఱులే చూచియుంటిని. వారి సేవను గూర్చియు, ధైర్యమును గూర్చియు పలువురు చెప్పఁగా వినియుంటిని. హకీమ్‌సాహెబుతో నాకు పరిచితి కాలేదు. స్వ. ఆచార్య రుద్రులును, దీనబంధువు ఆండ్రూజుగారును వీరిని మిగుల ప్రశంసింపఁగా వినియుంటిని. లక్నోలో జరిగిన ముస్లిమ్ లీగునందు శ్వేబ్ ఖురేశీగారితోడను, బారిస్టరు ఖ్వాజాగారితోడను పరిచయము సంపాదించితిని. డాక్టరు అన్సారీ, డాక్టరు అబుల్ రహమాను గారలతో సంబంధమును బంధించుకొంటిని. మంచి ముసలమానుల మైత్రి నన్వేషించుచుంటిని. పవిత్రులు, దేశభక్తులు నగు ముసలమానుల చెలిమి కలిగి ముసలమానుల ఆంతర్యము కనుఁగొనఁ దలఁచితిని. కావున ముసలమానులు నన్నెక్కడికి రమ్మనిన నక్కడికి వెళ్లుచుంటిని.

హిందువులకును, ముసలమానులకును సత్యమైన స్నేహము లేదని దక్షిణ-ఆఫ్రికాలోనే నాకుఁ దెలియును. ఈ యిరువురకును నడుమఁ గల భేదమును పోఁగొట్టుటకు నేనే యుపాయమును విడనాడలేదు.

ముఖస్తోత్రము చేసి గాని, స్వత్వమును గోలుపడిగాని రాజీపడుట నా కస్వాభావికము. వీరి నేకముచేయుటలో నా యహింస కొరపిడి కలుగు ననియు, దీనికి విశాలప్రయోగ మేర్పడు ననియు నేను దక్షిణ-ఆఫ్రికాలో నున్ననాఁటనుండియు అనుకొనుచునే వచ్చుచుంటిని. ఆ నమ్మిక నేఁటికిని ఆరిపోక నే యున్నది. ఈశ్వరుఁడు ప్రతిక్షణమునను ఒరపిడి కలుగఁజేయుచునే యున్నాఁడు. నా ప్రయోగము నడుచుచునే యున్నది.

ఇట్టి యాలోచనలతో నేను బొంబాయిరేవున దిగితినిగావున అలీసోదరులను జూడవలెయు ననుకొంటిని. మా చెలిమి పెరుఁగఁ జొచ్చెను. మా చెలిమి యింకను చిక్కనగాఁ పెనవైచికొనకముందే సరకారువారు అలీసోదరులను చెఱలో నిడిరి. బేతుల్ జైలునుండియు, ఛిందవాడా జైలునుండియు అభ్యనుజ్ఞ కలిగినపుడెల్ల మౌలానా మహమ్మదలీగారు నాకు పెద్దపెద్ద యుత్తరములు వ్రాయుచుండెడివారు. నే నలీసోదరులను జూచుట కనుజ్ఞ వేఁడితినిగాని యనుజ్ఞ పుట్టదయ్యె.

అలీసోదరులు జైలుకు వెళ్లినతరువాత ముసలమాను సోదరులు నన్ను కలకత్తాలో జరిగిన ముస్లిమ్ లీగునకుఁ దీసికొనిపోయిరి. నన్ను వా రుపన్యసింపఁ గోరఁగా అలీసోదరులను విడిపించికొనుట ముసలమానుల ధర్మమని ప్రబోధించితిని.

అటుపిమ్మట నన్నలీఘడ్ కాలేజికిఁ గొంపోయిరి. మాతృదేశమును సేవించుటకు ఫకీరులుఁ గం డని నేనచట పిన్నవారలకుఁ దెలిపితిని.

## ౨౩ ఐక్యమునకు ప్రయత్నము

పిదప నే నలీసోదరుల విడుదలనుగుఱించి సర్కారువారితో పత్రవ్యవహారమును సాగించితిని. ఈ సంబంధములో ఖిలాఫతును గుఱించిన వీరి ప్రవృత్తి నవగతము చేసికొంటిని. ముసలమానులతో చర్చించితిని. నేను ముసలమానులకు నిక్కపు నెచ్చెలి నగుదునేని అలీసోదరులను విడిపించుటకును, ఖిలాఫతును పరిష్కరింపఁజేయుటకును పూర్తిగా పాటుపడితీరవలయు ననుకొంటిని. ఖిలాఫతును గుఱించి యడుగుట నాకు చాల సహజ మనిపించెను. దాని గుణదోషములు గుఱించి విచారించుటతో నా కొట్టే పని కనఁబడలేదు. దీనిని గూర్చి ముసలమానులు ప్రార్థించుట నీతివిరుద్ధము కానిచో నే నిఁక దీనికి మద్దతు చేయవలసియే యున్నది. మతవిశ్వాస మన్నింటికిఁ బైది. ఒక వస్తువునుగుఱించి అందఱి విశ్వాసము నొకటియే యగుచో నిన్ని మతములతోఁ బనిలేదు. ఒక మతమే యుండును. ఖిలాఫతునుగుఱించి ప్రార్థించుట నాకు నీతివిరుద్ధముగా తోఁపలేదు. ఇంతియకాక బ్రిటిష్ ప్రధానమంత్రి లాయిడ్ జార్జికూడ నీ ప్రార్థన నంగీకరించెను. కావున ఆతఁ డిచ్చిన మాటను నెఱవేర్పఁజేయవలయు ననియు ననుకొంటిని. ముసలమానుల కోరికయందలి గుణదోషములను పరీక్షించుట నా యంతరాత్మను తృప్తిపఱచుకొనుటకే గాని ప్రధానమంత్రి మాట నిల్లుగనే వ్రాసచేసెను.

ఖిలాఫతు విషయమున నేను ముసలమానులతోఁ జేరినందులకు మిత్రులును, విమర్శకులును నన్ను వెగ విమర్శించిరి. వీని నన్నియు విచారించి చూచిన పిదపఁ గూడ నా యభిప్రాయమును మార్చికొన వలసిన పని నాకుఁ గానరాలేదు. ఇందులకు పశ్చాత్తాపము చెంద వలసిన పనియుఁ గానరాలేదు. నేఁడు ఇట్టి చిక్కు మఱి యొకటి వచ్చునేని నా యాచరణ మీరీతిగనే యుండఁగలదు.

ఇట్టి యాలోచనలు కడుపునఁ బెట్టుకొని నేను ఢిల్లీ కేఁగితిని. మూసలమానుల యిక్కట్టులఁగూర్చి వైసరాయితో మాటలాడఁ దలఁచితిని. నాఁటి కింకను ఖిలాఫతు ఒక సంపూర్ణస్వరూపమునకు రాలేదు.

నేను ఢిల్లీకి చేరఁగనే దీనబంధు ఆండ్రూజుగా రొక ప్రాశ్న్య పక్షము చేసిరి. ఇంగ్లండు ఇటలీల నడుమ నొక గుప్తసంధి జరుగుచున్న దని ఇంగ్లీషుపత్రికలలో ప్రకటిత మాయెను. కావున ఆండ్రూజుగారు 'ఇట్టి గుప్తసంధు లింగ్లండునకును, ఇతరదేశములకును జరుగుచున్నపుడు మీ రీ సభలో పాల్గొనుట నీతివిరుద్ధము కాదా?' యని నన్నడిగిరి. నా కీ గుప్తసంధి సంగతి తెలియదు. కాని దీనబంధువు చెప్పినఁజాలును. కావున ఆ సభలో నేను పాలుగొనుటకు శంకించుచుంటి నని లార్డ్ ఛెమ్స్‌ఫర్డుకు వ్రాసితిని. ఈ విషయమును గుఱించి చర్చించుటకు నన్నుఁ బిలువనంపెను. ఇతని తోడను, ఇతని కార్యదర్శి మి. మేఫీతోడను దీర్ఘముగా చర్చించితిని. తుట్టతుదకీ సభలో పాలుగొనుట కంగీకరించితిని. వైసరాయిగారి వాదసంక్షేప మిది : 'బ్రిటిషుమంత్రిమండలి చేయు ప్రతి పనియు వైసరాయికి తెలిసియుండు నని మీ రనుకొందురా? బ్రిటిషు సరకారువా రెన్నఁడును పొరపాటు చేయ రని నేనుగాని మఱి యెవరుగాని నిర్ధారింపఁ జాలరు. మొత్తముమీఁద బ్రిటిషు పరిపాలనము లోకమునకు కల్యాణము కలుగఁజేయు ననియు, మొత్తముమీఁద హిందూదేశము బ్రిటిషుసంబంధమువలన లాభము బడసె ననియు మీ రంగీకరింతురేని బ్రిటిషు రాజ్యమున కిట్టి యాపత్సమయమున సాయము చేయుట ప్రతివానికిని ధర్మమని మీ రెలుఁగెత్తి చెప్పరా? బ్రిటిషుపత్రికలలో గుప్తసంధినిగుఱించి నేనును

జదివియుంటిని. దీనివిషయ మింతకన్న నెక్కువగా నాకును దెలియదని ప్రమాణపూర్వకముగాఁ జెప్పుచున్నాను. పత్రిక లెన్ని గప్పాలు ప్రకటించునో మీకును దెలిసిన విషయమే. పత్రికలలో వచ్చిన యొక చెడు మాటవలన మీ రిట్టి యాపత్సమయమున సాయపడుట మానుకొందురా? యుద్ధము ముగిసిన తరువాత నీతిని గూర్చి మీయిష్టము వచ్చినన్ని ప్రశ్నలు వేయవచ్చును; మమ్ములను కావలసినంత విమర్శింపవచ్చునుగాని నేఁడుమాత్రము కాదు.'

ఈ వాదము క్రొత్తది కాదు. కాని ఆ సమయమున, ఆ రూపమున నాకది క్రొత్తగాఁ గానిపించెను. నేను సభకు వచ్చెద నని యంగీకరించితిని. ఇఁక ఖిలాఫతును గురించి వైస్రాయికి కమ్మ వ్రాయుటకు నిశ్చయించితిని.

## ౨౮

## యుద్ధమునకు జనులను పోగుచేయుట

సభకు నేను హాజరయితిని. యుద్ధమునకు మనుష్యులను పోగు చేయవలయు ననుప్రస్తావమును నా చేత సమర్థింపఁ జేయ వలయునని వైసరాయికిఁ జాల నిచ్ఛ యుండెను. నేను హిందీ, హిందూస్తానీ భాషలలో మాటలాడుదు నని ప్రార్థించితిని. వైసరాయి గా రందుల కంగీకరించుచు నింగ్లీషులోఁగూడ మాటలాడఁ గోరిరి. అచట దీర్ఘముగా నుపన్యసించవలసిన పని లేదు. నే నీ వాక్యము చెప్పితిని: 'నాకుఁ గల కార్యభారమును చక్కఁగా గ్రహించి నే నీ ప్రస్తావమును సమర్థించుచున్నాను.'

హిందూస్తానీలో మాటలాడినందుకు నాకుఁ జాల ధన్యవాదములు వచ్చెను. వైసరాయిగారి సభలో మే మెఱిఁగినంతవఱకు హిందూస్తానీప్రసంగమున కిదియే ప్రథమదృష్టాంత మని యంది అనుకొనిరి. ఈ ధన్యవాదములకును, ఈ ప్రథమదృష్టాంత మను మాటకును నా మనసు నొచ్చెను. నేను సిగ్గిలితిని. ఔరా మన గతి! మన దేశమునందు, మన దేశమునకు సంబంధించిన సభయందు, మన భాషను బహిష్కరించి యవహేళన చేయుట యెంత దుఃఖకారము! ఓహో! నే నొకటి రెండు హిందూస్తానీ మాటలు మాటాడినంతనే నాకు ధన్యవాదములా? ఈప్రసంగము మన దుర్దశను తెలుపదా? సభలో పలికిన యొక వాక్యమే నా కింత గౌరవము తెచ్చిపెట్టెను. నే నా సభనుగాని, నా సమర్థనమునుగాని మఱవఁజాలను. ఢిల్లీలో నా చేయవలసిన పని యొకటి కలదు. వైసరాయి కొక యుత్తరము వ్రాయవలసియున్నది. అది తేలికపనిగా తోఁచలేదు. సభకు నే

గెందులకు వెళ్లితినో, యెటులు వెళ్లితినో, భవిష్యదాశ యెట్టిదో, ప్రజలకును, సరకారువారికిని స్పష్టముగాఁ దెలుపుట యావశ్యకమని నే ననుకొంటిని.

వైసరాయికి కమ్మ వ్రాసితిని. అందు లోకమాన్య తిలక్, అలీ సోదరులను రావింపకుండుటకు నా ఖేదమును తెలిపితిని. మరియు ప్రజల కోరికలను, యుద్ధమువలనఁ బొడమియున్న ముసలమానుల కోరికలను ఉల్లేఖించితిని. ఈ యుత్తరమును ప్రకటించుటకు వైసరాయి యనుమతి వేడితిని. వైసరాయి సంతోషపూర్వకముగా ననుమతించెను.

సభ యంత ముగియఁగనే వైసరాయి సిమ్లా కరుగుటచే నే నీ కమ్మను సిమ్లాకుఁ బంపవలసివచ్చెను. టపాలోఁ బంపుచో నాలస్య మయిపోవును. ఈ యుత్తరము చాలఁ బ్రముఖమయినదని నా యుద్దేశము. ఎవరికో యొకరి కిచ్చి పంపుట కిష్టములేదు. పవిత్రుఁడగువానిచేఁ బంపవలయు నని నా తలఁపు. దీనబంధు ఆండ్రూజుగారును, సుశీల రుద్రులును రెవ. ఐర్లండ్ గారి పేరు సూచించిరి. 'చదివి చూచి కొందును. శుద్ధముగా నున్నదని తోఁచినయెడల నీ కమ్మను గొంపోవుదును' అని వా రనిరి. వారు చదివి చూచుకొనిరి; బాగున్నదని తీసికొనిపోవుదు ననిరి. రెండవతరగతి టికెట్టువెల యిత్తు నంటిని గాని వారు దాని కంగీకరింపక రేయి పయనమయినను ఇంటరులో నే వెళ్లిరి. వీరి నిరాడంబరత, సరళత, స్పష్టతయు నన్ను మోహింపఁ జేసెను. ఈరీతిగా పవిత్రపురుషుని చేతితోఁ బంపఁబడిన యీ కమ్మ నా యుద్దేశప్రకారము మంచిపనినే చేసెను. దీన నా మార్గము సరళ మాయెను.

యుద్ధమునకు మనుష్యులను బ్రోగుజేయుట నా రెండవ పని. నే నీ యాచనను ఖేడాలోఁ జేయక మఱి యేడఁజేయను? నా సహ

చరలనుగాక మొదట మఱి యెవరిని రమ్మందును? ఖేడా చేరఁగనే వల్లభభాయి మొదలగువారితో నాలోచించితిని. వారిలోఁ గొందఱు నా దరఖాస్తును సమ్మతింపలేదు. సమ్మతించినవారికిని పని జరుగు నని నమ్మకము లేదు. నేను రమ్మని కోరుచున్న ప్రజావర్గమునకును, గవర్నమెంటువారికిని ప్రేమ యన్నమాట లేదు. గవర్నమెంటువారి ఆఫీసరులవలన వారికిఁ గలిగిన దుఃఖానుభవము నింకను గుర్తు తప్పలేదు.

ఇటు లయ్యును వారు పనిచేయఁ దలఁచిరేని యంగీకరించిరి. కార్యారంభ మాయెను. వెంటనే సంగతిసందర్భములు నాకుఁ దెలియ వచ్చెను. నా ఆశావాదమున* కాఘాతము కలిగెను. ఖేడాపోరాటమున వీరు తమ బండ్లను చితముగా మా కిచ్చియుండిరి. ఒక సేవకునకు నలుగు రయిదుగురు స్వయంసేవకులఁ బంపిరి. అటువంటిచో యిప్పుడద్దె యిచ్చినను బండికి కఱవాయెను. ఇఁక స్వయంసేవకుల మాట చెప్పవలయునా? మే మింతటితో ఆశ లుడుగలేను. బండ్లను విడిచి రెండుకాళ్ల బండ్లమీఁదనే పయనించితిమి. రోజు కిరువది మైళ్లు నడువవలసి వచ్చెడిది. మాకు బండ్లనే యొసఁగనిచో నిఁక భోజన మిడుదురా? అన్న మడుగుటయు నంత బాగుగా లేదు. కావున ఎవరి జోలెలో వారు ఆహారమును గొనిపోవలయు నని నిశ్చయించితిమి. వేసవిగావున పడకసామానుతోఁ బని పట్టలేదు.

మేము వెళ్లిన చోటులనెల్ల సభలు జరిపితిమి. జనులు వచ్చెడివారు కాని యొకరో యిద్దఱో సిపాయిలుగాఁ జేరెడివారు. 'మీ రహింసావాదులు గదా! అస్త్రములు దాల్పఁ డని మా కెటులు చెప్పఁగలరు! సరకారువా రిండియా కేమి మే లొనరించిరి?

Optimism

మమ్ములను దోడు రం డనుటకు వారికి మొగ మెటులు చెల్లును?' అని యీ రీతిగాఁ బ్రశ్నలను నామీఁద గుప్పిడివారు.

ఇటు లయ్యును మా సత్ప్రయత్నము పనిచేసెను. తగి నంత మంది రాఁదొడఁగిరి. మొదటి తుకిడీని బంపినపిదప మార్గము సరళ మగు నని యూహించితిమి. 'ఈ కూటువమూఁక నెచట నంపవలయు' నని కమిషనరుతో నేను సంప్రతింప మొదలిడితిని.

కమిషనరులు ఢిల్లీనయూనాతో ప్రతిచోటను సభలు జరుప నారంభించిరి. అట్టి దొక సభ గుజరాతులోఁ గూడ జరిగెను. 'సహచరులతో రం'డని నా కాహ్వానము వచ్చెను. మేము సభకు హాజ రయితిమి. ఢిల్లీలోనే నాకు తక్కువ గౌరవము కలిగెనను కొంటిని. ఇక్కడ నంతకును దక్కువ. 'దేవరవారి దివ్యచిత్తము!' అని చేతులు నలుపుకొనవలసిన వాతావరణమునందు నాకు సుఖము లేదు. తుద కెటులో మాటలాడితిని. నే నిచటఁ గొంచె మెక్కువ సంభాషించితిని. నాసంభాషణమున ఆఫీసరుల ముఖస్తుతి లేదుగాని యొకటి రెండు చుఱుకు మాటలు కలవు.

సిపాయిలుగాఁ జేరవలసిన దని కొన్ని పత్రిక లచ్చొత్తించి యుంటిని. ఈ యాహ్వానమునఁ గల యొక విషయము కమిషనరుకు కటువుగా నుండెను. దాని సార మిది: "బ్రిటిషు రాజ్యము మన కపకారము చేయఁ దలపెట్టిన చట్టములలోనికెల్ల మన జాతిని జాతిని అస్త్రరహితముగాఁ జేసిన చట్టము చట్టములలోనికెల్ల పాడు చట్టము. ఆరమ్సు ఆక్టును రద్దు చేయించుటకును, అస్త్రశిక్ష నేర్చికొనుటకును ఇది మనకు పుణ్యకాలము. ఈ యాపత్సమయమున నడుమతరగతి జను లిచ్ఛాపూర్వకముగా సాయపడుదురేని యపనమ్మకము తొలఁగి

యస్త్రనిషేధ ముపసంహరింపఁ బడును." ఈ విషయము నెత్తి చూపి కమిషనరు 'మనకు మతభేదము లున్నను మీరు వచ్చుట నాకు సంతోషమాయెను. నాకుఁ జేతనయినంత మంచిమాటలతో నా మతమును నేను సమర్థించుకొంటిని.

వైస్రాయిగారికి వ్రాయఁబడిన ఉత్తరపు సారాంశ మిదిగో:

యుద్ధసభకు వచ్చుటకు నేను వెనుకాడితినిగాని మీతో మాటలాడినపిదప నాకు సంకోచము పోయెను. నాకుఁ దమయెడఁగల మహాదరమే దీనికి ముఖ్యకారణము. ఈసభకు లోకమాన్యులగు తిలకుగారిని, మిసెస్ బెసంటును, అలీసోదరులను ఆహ్వానింపకపోవుటయే నేను రాకపోయిన కారణములలో ముఖ్యకారణము. వీరు చాల శక్తి కల నాయకులు. ఇట్టివారి నాహ్వానింపక సరకారువారు చాల పొరపాటు పడిరని నే ననుకొనుచున్నాను. అయినను దాఁటినది లేదు. ఆయాయీ ప్రాంతములలో జరుగు సభలకు వీరి కాహ్వానము పంపవచ్చును. ఎంత మతభేద మున్నను ఏరాజ్యమేనియు నిట్టి నాయకుల ననాదరింపఁజాల దని విన్నవించుకొనుచున్నాను. స్థితిగతు లిట్లుండుటవలన నేను కమిటీలో చేరఁజాలక పోతిని. సభలో ప్రస్తావనమును సమర్థించుటతోడనే సంతుష్టి పడితిని. నా యంపిన సూచనలను సరకారువా రంగీకరింతురేని వెంటనే నే నీ పనిలోఁ బ్రవేశింపఁగలుగుదు నని తలఁచుచున్నాను.

ఏ రాజ్యమునం దికముందు మేము సంపూర్ణముగా భాగస్వాములము కాఁగలమని యాశ పెట్టుకొనుచున్నామో ఆ రాజ్యమున కాపద వచ్చినపుడు సాయపడుట మాకు ధర్మము. మరియు మేము సాయము చేసినచో మాకుఁ గావలసినదానిని వడిగాఁ బడయఁగలమను నాశయు మాకుఁ గలదు. కావున తమరు మా కాశపెట్టిన

## ౨౭ యుద్ధమునకు జనమును పోగుచేయుట

సంస్కరణములలో కాంగ్రెసు ముస్లిమ్ లీగుల ముఖ్యప్రార్థనలకును సమావేశము ఉండఁగల దని తలఁచుటకుఁ బ్రజల కధికార మున్నది. ఈ యుద్ధము జరుగుచున్నంతకాలము ప్రజలు హోమ్‌రూలు మొదలగు మాటలుఁగూడ మాటలాడకుండ జేయుటకుఁ బ్రయత్నించెదను. మరియు శక్తికలవారి నందఱను యుద్ధమునకుఁ బోవఁ బ్రేరణచేయుదును. ఇటులు చేయుటవలన భారతీయులు గొప్ప భాగస్వాములు కాఁగలరు. దీనితో వర్ణభేదము, దేశభేదమును సమసిపోఁగలవు.

చదువుకొనినవా రిందు చాలఁ దక్కువగా నుపకరించు మార్గము బట్టి జనసామాన్యమునందు వీరికి పలుకుబడి తక్కువ. నేను హిందూ దేశమునకు వచ్చిననాఁటనుండియు జనసామాన్యమునందు చాల పరిచయము సంపాదించితిని. వీరికి హోమ్‌రూల్ సంపాదింపవలయునని గట్టి పట్టు గలదు. హోమ్‌రూలు లేనిచో జనుల కించుకయు సంతసము లేదు. హోమ్‌రూలు సంపాదించుట కెంత త్యాగము చేసినను తక్కువయే యనిపించుకొనునని వీరి యుద్దేశము. కావున సామ్రాజ్యమున కెంతమంది స్వయంసేవకులను సమకూర్పఁగలనో అంతమందిని సమకూర్పఁగలనుగాని ఆర్థికసాహాయ్యమునుగురించి నేను చెప్పఁజాలను. అయినను భారతదేశము తన శక్తికి మించియే ధన మొసఁగెనని నాకుఁ దెలిసినంతలోఁ జెప్పఁగలను. నేను ప్రాణము లొడ్డఁ దలఁచియే యుద్ధసభలోని ప్రస్తావమును సమర్థించితి నని చెప్పఁగలను. కాని మా స్థితి వేఱు. మే మే దుకాణమునను భాగస్వాములము కాము. మా సాయపుఁ బునాది భవిష్యదాశకుఁ దీయఁబడినది. ఆ యాశ యెట్టిదో విశేషరూపముగాఁ దెలుపఁ దలఁచుచున్నాను. నేను బేరములాడుట లేదు. మే మిందు నిరాశుల మగుదుమేని నేఁటివఱకును మాకుఁగల గౌరవమెల్లయు కల్ల యయి పోవును.

మీలో మీకుఁ గల జగడములను మానుకొనుఁడని మీకుఁ జెప్పిన మాటలకు ఆఫీసరులు చేసెడి బాధను, అత్యాచారములను సహింపుఁడని యర్థమగుచో నట్టి సహన మసంభవము. చేయవలయు నని యొక పద్ధతి పెట్టుకొని దాని ప్రకారము చేయు బాధ నెదురుకొని యరికట్టుట నా ధర్మము. కావున ఎవరికేనియు నాపరింపవలదనియు, పూర్వ మెన్నఁడేని యాదరింపఁబడని ప్రజాభిప్రాయము నాదరింప వలయు ననియు తమ రాఫీసరులకు సూచన చేయువలయును. చంపారణ్యమున నేండ్లతరబడి యున్న బాధను విరోధించి నేను బ్రిటిషు న్యాయముయొక్క సర్వమహాత్త్వమును చాటితిని. సత్యమునకై గాను దుఃఖమును సహించు శక్తి కలిగినపుడు రాజ్యమునందు నిజముగ శక్తి లేదనియు, ప్రజాభిప్రాయమునందే కల దనియు ఖేడా ప్రజలు కనుఁగొనిరి. లోఁగడ రాజ్య మనిన శాపము పెట్టు ప్రజల కిపు డెంత కోపము లేదు. సరకారువారు సవినయమగు నాజ్ఞోల్లంఘనమును సహించిరి కావున ప్రజాభిప్రాయము నిఁక నెంతమాత్ర మనాదరింప రని వీరికి విశ్వాసము కలిగెను. ఇవన్నియు పరికించి చూడఁగా చంపారణ్యమునందును, ఖేడాయందును నా కావించిన పనులు యుద్ధమునకు సాక్షాత్తైన యగుచున్నవి. 'నీ విట్టి పనులను మాను' మన్నచో గాలి పీల్చుకొనవలదని శాసించినటులే. నేను శస్త్రబలమునకు బదులు ఆత్మబలమును, అనఁగా ప్రేమబలమును లోకప్రియముగాఁ జేయుటలో సఫలుఁడ నగుదునేని ముల్లోకము లెత్తివచ్చినను హిందూదేశము నెదురుగా నిలువఁబెట్టఁగలను. కావున అనేకసమయములందు దుఃఖమును సహించుట యను సనాతననీతి నాజీవనమునందు జీర్ణించిపోవునటులు నా యాత్మను నియమించుకొనుచున్నాను. మరియు నితరులనుగూడ నీ నీతినే యవలంబింపుఁ డని చెప్పుచున్నాను. మరియు నే నేమి యొనరించినను ఈ నీతి యద్వితీయమయిన దని తెలుపుటకే యొనరించుచున్నాను.

## ౨౭ యుద్ధమునకు జనమును పోగుచేయుట

తుట్టతుది మాట: ముసలమానుల రాజ్యములగుఱించి గట్టి మాట యిండని బ్రిటీషు-మంత్రులను తా మడుగవలయునని కోరుచున్నాను. ప్రతి ముసలమానునకును ఈ చింత కల దని తా మెఱింగియే యున్నారు. నేను హిందువునయియుండి వారి కష్టముల నూరక చూచుచుండఁజాలను. వారి దుఃఖములు మాకును దుఃఖములే. ముసలమానురాజ్యముల హక్కులఁ గాపాడుటలోను, వీరి ధర్మస్థలములను విచారించి యాదరించుటలోను, హిందూదేశము కోరిన హోము రూలు నిచ్చుటలోను సామ్రాజ్యక్షేమ మిమిడియున్నది. నా కాంగ్లేయులయెడఁ బ్రేమ కలదు గావున నే నీ కమ్మ వ్రాసితిని. మరియు ఆంగ్లేయులయందు నా కెట్టి నమ్మిక కలదో అట్టి నమ్మిక నే ప్రతిహిందువునందును కలిగింపఁదలఁచుచున్నాను."

## మృత్యుపథము

యుద్ధమునకై జనమును పోగుచేయుటలో నా మేను చివికెను. బెల్లము, గుంజిగాఁ జేసిన వేరుసెనగపప్పు, నిమ్మలు నా కానాఁటి ముఖ్యాహారము. వేరుసెనగ నధికముగా తినుట యపథ్యమని నాకుఁ దెలియునుగాని యధికముగనే తింటిని. దీనితో అతిసారము పుట్టెను. నడుమనడుమ నాశ్రమమున కరుగుట నాకు మామూలు. ఈమాత్ర మతిసార మే మంత చేయునని, నా మామూలు చొప్పున చీకటి పడువేళ నాశ్రమమున కరిగితిని. నే నా రోజులలో మందు వాడుట చాలవఱకు మానితిని. ఆనాఁ డుపవసించినచో తగ్గి పోవు నని నమ్మితిని. మఱునాఁటి ప్రొద్దున దేనిని ముట్టలేదు. దీనితో కొంత యుపశాంతి కలిగెను. ఇంకను ఒకటి రెండు లంఘనములు పడు నని నాకుఁ దెలియును. ఒకవేళ ఆఁకలి యగుచో ఫలరసము తక్క వే దియు పుచ్చుకొనఁగూడ దనుకొంటిని.

ఆనాఁ డేదో పండుగ. మధ్యాహ్నమునఁగూడ నేమియును గొన నని కస్తూరబాయికిఁ జెప్పినటులు గుఱుతు. కాని కస్తూరబాయి నన్ను మఱపించెను. నేనును మఱచితిని. నే నపు డే జంతువు పాలను త్రావుట లేదు. పాలనుండి పొడమిన ద్రవ్యములు గూడ నాకు నిషిద్ధములు గావున నేయిమజ్జిగలు గూడ నా కనుపాదేయములు. కాని నేతికిబదులు నూని కలిపి యొక గోధుమపిండివంటకమును నాకొఱకు ప్రత్యేకముగా కస్తూరబాయి తయారుచేసెను. ఒక గ్లాసెడు మినుపకట్టుగూడ నాకొఱకు ప్రత్యేకింపఁబడెను. నా కివి యిష్టము. 'కస్తూరబాయిమాట దక్కింపవలయును, నాలుకకుఁ

దృష్టిని చేయవలయును, శరీరరక్షణమును జూచుకొనవలయును' అని తలంచితిని. కాని ఎప్పుడా యని సైతాను నా నోటిముందే కావలి యుండెను. తినఁ దొడఁగితిని. కొంతవఱకుఁ దింటిని. రుచి తీరెను. యమునకు చీటి వెళ్లెను. తిని గంట కాకమునుపే అతిసారము ప్రకోపించెను.

రాత్రికి నడియాదు చేరవలయును. సాబరమతీ స్టేషనువఱకు నడచితిని. ఆ మైలుంబావు దూరముగూడ నాకు నడచుటకుఁ గష్టమాయెను. అమదాబాదు స్టేషనులో వల్లభభాయి నన్నుఁ గలిసెను. నాకు నొప్పి మిక్కుటమాయెను. నేను నలిగియుంటి నని యతఁడు గ్రహించెను. కాని ప్రాణాంతకమగు నీబాధ నితనికిఁ గాని, యొరులకుఁగాని నేను తెలియనీయలేదు.

సుమారు పదిగంటలకు నడియాదు జేరితిమి. స్టేషనుకును అనాథాశ్రమమునకును అర మైలులోపు. ఇది నాకు పదిమైళ్లనిపించెను. చచ్చి చెడి బసకు చేరితిని. బాధ హెచ్చిఁగిపోవుచుండెను. నిముస నిముసమునకును అనుమానము కలుగుచుండెను. దానితో నిఁక నిలువలేక పోతిని. నా బాధ నందఱకును జెప్పిసైచితిని. పడక వేసితిని. ఇంతవఱకు మఱుఁగుదొడ్డి కరుగుచుంటిని. అపుడు కమోడు గోరితిని. ఇందులకు చిన్నతనముగానే యుండెనుగాని కోరక వీలు లేకపోయెను. ఫూల్ చందుగారు మెఱుపువలెపరుగిడి కమోడు తెచ్చిరి. సహచరు లందఱును విన్నఁబోయి నా చుట్టును మూఁగిరి. వీరి ప్రేమ యపారము. కాని నా బాధ తీసివేయఁగలరా? పైఁగా నా పట్టుదలకు పారము లేదు. ఇది వారి సంతాపమునకు మఱికొంచెము తోడు. వైద్యుని పిలుచుకొని వత్తు మనిరి. నే వలదంటిని. మందు పుచ్చుకొనను, చేసిన పాప మనుభవింతు నంటిని. నా సహచరులు దీని నంతయు దుఃఖముతో

సహించిరి. ఇరువది నాలుగు గంటలలో ముప్పది నలుబది సారులావలికి వెళ్లవలసివచ్చెను. భోజనము మానితిని. గత దినమున ఫలరసముఁగూడ మానితిని. హితవును లేదు.

నేఁటివఱకు రాతివంటి దనుకొన్న నా శరీర మప్పటి కప్పుడు మట్టికన్న హీన మయిపోయెను. ఉన్న శక్తి యంతయు మఱుమాయ మాయెను. డాక్తరు కానుగా గారు విచ్చేసిరి. మందు గొనుఁడని బతిమాలిరి. నే నొప్పుకొనలేదు. ఇంజెక్షను నిత్తుననిరి. వల దంటిని. అపుడు నా కింజెక్షననఁ దెలియమి నవ్వుచేటు. అది దేనిదో రసి యనుకొంటిని. కాని పిదప నది యొక్క రోగావధీరసమని తెలిసెనుగాని తెలియుసరికి అక్కాల దాఁటిపోయెను. విరేక మాఁగలేదు. అలపు వలన కొఁకతగిలి సంధించెను. మిత్రులు గడబిడపడి డాక్తరులను బిలిచిరి. వారు వచ్చిరిగాని వారిమాట విననియీ కొఱపనఁగొయ్యి నెటులు కుదుర్పఁగలరు?

సేఠ అంబాలాలుగారును, వారి ధర్మపత్నియు నడియాదు వచ్చిరి. నా మిత్రులతో నాలోచించి అమదాబాదులోని తమ మీర్జాపురపుబంగళాలోనికి మిగుల జాగ్రత్తతోఁ దీసికొనిపోయిరి. నా కీ వ్యాధిలో జరిగిన యీ నిర్మలనిష్కామసేవకంటె నధికమగు సేవ యెవరికిని జరుగదు. ప్రతిదినము జ్వరము కొంచెముగాఁ దగులుచు వచ్చెను. శరీరము శుష్కించికొనుచుఁబోయెను. ఇంకను కొన్నాళ్లపాటిటులే యుండినచో లేవలేని స్థితి వచ్చు ననుకొంటిని. అంబాలాలుగారి బంగళాలో నింత ప్రేమతో, వేయి కనులతో నిటులు నేను చూడఁబడుచున్నను మనసు నిలువక ఆశ్రమమునకుఁ బంపుమని కోరితిని. నా పట్టుదల కతఁడు న న్నాశ్రమమునకుఁ గొంపోయెను.

## ౨౮ మృత్యుపథము

నే నిట్లు లాశ్రమమున మంచముపైఁ బడి యటు నిటు కొట్టుకొనుచుండఁగా 'జర్మనీ సంపూర్ణముగా ఓడిపోయె' ననియు, నిఁక జనులను పోగుచేయ నక్కఱ లేదనియు కమిషనరు కబురు చేసె ననియు వల్లభభాయి వార్త తీసికొనివచ్చెను. నే నంతటితో జనమును పోగుచేయవలయు నను చింతఁ బాసితిని. దీన శాంతి కలిగెను.

జలచికిత్సచే శరీరము కొంచెము నిలువఁబడియుండెను. అతిసార మాఁగిపోయెను. కాని బలము పట్టలేదు. వైద్యులు, డాక్టరులును పలురకముల సలహా లొసఁగిరి. కాని నే నే మందును గొన నెంచలేదు. ఇరువురు మువ్వురు మిత్రులు పాలమీఁద నొట్టున్నది గాన మాంసరసము గ్రోలు మనియు, మందుగా మాంసము గొన్నచో హాని లేదనియు నాయుర్వేదమునుండి ప్రమాణము లీయఁదొడఁగిరి. ఒక మిత్రుఁడు కోడిగ్రుడ్లఁ దినుమనెను. కాని నే నీ యుపదేశములలో దేని నేని గయికొనలేదు. అన్నింటికిని నా జవా బొకటియే.

నేను శాస్త్రమును ప్రమాణముగాఁ గొని ఖాద్యాఖాద్య నిర్ణయము గావింపలేదు. అది నా జీవనముతోపాటు స్వతంత్రముగా నిర్మిత మాయెను. ఆ వస్తువు నీ వస్తువును దిని బ్రతుకవలయు నను లోభము సుంతయు నాకు లేదు. నా పుత్రులకు, నా భార్యకు, నా మిత్రులకు విధించిన ధర్మమును నా దగ్గఱకు వచ్చినపుడు నే నెట్లు మానుకొందును?

ఇంత దీర్ఘవ్యాధి నా జీవితమున నిదియ మొదలు. ధర్మమును పరీక్షింపను, పట్టిచూచను నా కీ వ్యాధి యలభ్యయోగముగా తటస్థించెను. ఒక రాత్రి నే జీవింప ననుకొంటిని. మృత్యుదేవత నాయెదుట నిలువఁబడినట్లుండెను. శ్రీ అనసూయా బహేనుకు

వార్త పంపితిని. ఆమె పరువెత్తుకొని వచ్చెను. వల్లభభాయి వచ్చెను. డాక్టరు కానుగాగారు వచ్చి నాడి చూచి 'ఇప్పుడు భయపడవలసిన చిహ్నమిసుమంతయును నాకుఁ గానరాదు. నాడి బాగుగా నున్నది. బలము లేమివలననే మీకీ యలజడి' యని చెప్పిరి. కాని నేను నమ్మ లేదు. ఆరాత్రి గడచెను. నాకా రేయి నిదుర లేదు.

ప్రాతఃకాలము. మృత్యువు రాలేదు. కాని బ్రతుకఁగల నను నాశ నాకుఁ గలుగలేదు. మృత్యువాసన్నముగా నున్నదని తలఁచితిని. నా మిత్రుల వలన గీతలను వినుచు నున్నకాలము నుపయోగించుకొన నెంచితిని. ఏ పనికిని శక్తి లేదు. చదువుటకేని శక్తి లేదు. మాటాడుట కిచ్ఛ లేదు. ఒక్కమాట పలికినను తల గిర్రుమనును. బ్రదుకులో తీపి పోయెను. బ్రతుకుటకొఱకే బ్రతుకుట, అనఁగా ఊరక బ్రతుకుట యనుమాట నాకు గిట్టదు. పని పాటలు లేక, మిత్రులచే చాకిరి చేయించికొనుచు మెల్లమెల్లగా చివికి పోవు దేహమును జూచికొనుచు కూరుచుండుట నాకుఁ గష్టముగాఁదోఁచెను.

నే నిటులు మృత్యువునకు కని పెట్టుకొని యుండఁగా డాక్టరు తల్వలకరుగారు విచిత్రమగు నొకజంతువును వెంటఁబెట్టుకొని వచ్చిరి. ఆ విచిత్రజంతు వొక మహారాష్ట్రుఁడు. అతనికి హిందూస్తానీ రాదు. చూచే చూడఁగనే నావంటి వికారపువాఁడే యని తోఁచెను. అతఁడు తన వైద్యమును నామీఁద నుపయోగింప వచ్చెను. అతఁడు గ్రాంట్ మెడికల్ కాలేజీలో విద్యనంతయు పరిపూర్తి చేసికొనెను గాని డిగ్రీ పుచ్చుకొనకుండ వచ్చివేసెను. ఇతఁడు బ్రాహ్మసామాజికుఁడని నా కిటీవలఁ దెలిసెను. అతని పేరు కేలకర్. స్వభావముచేఁ గడు స్వతంత్రుఁడు. మంచువైద్యమునం దతనికిఁ గడు నమ్మిక. నా జబ్బు విని తన వైద్యము నాకు చేయ వచ్చిననాఁటనుండి

యితనికి 'ఐస్ డాక్టరు' అను బిరు దిచ్చితిమి. ఇతనికిఁ దన యభిప్రాయములయెడ పట్టుదల మిక్కుటము. డిగ్రీ గల డాక్టరులకు దెలియని కొన్ని విషయములు తాను దెలిసికొనె నని తన విశ్వాసము. తన నమ్మిక మితఁడు నాకుఁ గలిగింపఁజాలకపోవుట మా యిరువురకును చింత్యము. నే నొక హద్దుకల కీర్తని పద్ధతి నమ్మెదను. ఇతఁడు కొన్ని సిద్ధాంతములను తొందరపడి కావించె నని నా యభిప్రాయము.

అతఁడు కనుఁగొనిన విషయము లనిక్కము లగుఁగాక, కల్లలగు గాక. నాశరీరము నతని వైద్యపరీక్ష కిచ్చితిని. బాహ్యోపచారములచే నారోగ్యము గొనుట నా కిష్టమతమే. ఇంతియకాక మంచువైద్య మనఁగా జలవైద్యమే. కావున నా శరీరము నంతయు మంచుతో తోమ మొదలిడెను. అతఁడు చెప్పినంత ప్రయోజనము నా శరీరమునఁ గలిగె నని నమ్మకున్నను మృత్యువువాతఁ గాచుకొని యున్న నేను బ్రతుకుతెన్ను పట్టితిని. కొంచె ముత్సాహము కలుగఁజొచ్చెను. మానసోల్లాసముతోపాటు శారీరకోత్సాహమును గనుపట్టఁజొచ్చెను. ఆఁకలి పుట్టెను. పది పదిహేను నిమిషములు నడయాడఁ దొడఁగితిని. 'ఇఁక గ్రుడ్లరసముఁ గొనుఁడు! ఇంత కెక్కుడు పాటవము రాఁ గలదు. నా కిట్టి నమ్మకము కలదు. గ్రుడ్లు పాలవలె నిర్దోషములు. అవి మాంసకోటిలోఁ జేరవు. గ్రుడ్లన్నియు పిల్లలు కావు. పిల్లలు కాని నిర్బీజములగు గ్రుడ్లింగ్లండులో దొరకును. వానిని దినఁ దప్పిదము లేదు' అని కెలన్బెకుగారు నమ్మి చెప్పిరి. నిర్బీజములగు నండములఁగూడ నేను దిన నొల్ల నయితిని. కావలసిన పనులు కొంచెము కొంచెము చేసికొనఁగలుగుటకు నా కిప్పుడు కలిగిన బలము చాలును.

## ౨౯

## రౌలతుచట్టము - నా ధర్మసందేహము

మాథేరాను పోవుచో నారోగ్యము కలుగునని మిత్రులు చెప్పఁగా విని యచటికి పోతిని. కాని యచటి నీళ్లు బరువు. నావంటి రోగి కవి పడవు. అతిసారముచే మలద్వారము దుర్బల మాయెను. అచట పుండగుటచే మలము విడుచునప్పుడు మితిలేని బాధ కలిగెడిది. కావున నచటనుండ భయము పుట్టెను. ఒక వారములో మాథేరానుండి మరలి వచ్చితిని. శంకరలాలుగారు నా యారోగ్యమునకు శ్రద్ధఁ బూనిరి. దలాలుగారి సలహా గొనవలెనని పట్టుపట్టిరి. డాక్తరు దలాలుగారు దయచేసిరి. విషయమును వెంటనే గ్రహింపఁగల వీరి శక్తికి నే నచ్చెరువొందితిని. వీ రిటు లనిరి:

'తాము పాలు గొననంతవఱకు తమ శరీరము బాగుపడదు. కావున మీరు పాలు గొనవలెను. ఇనుము, పాషాణము వీనికి సంబంధించిన ఇంజెక్షనులఁ గొనవలెను. ఇటులగుచో మీ శరీరము యథాప్రకారము కాఁగలదని నేను గ్యారంటీ యీఁగలను.'

'ఇంజక్షనులు చేయించికొందును గాని పాలు త్రాగను' అని నే నంటిని.

'మీ ప్రతిజ్ఞాశరీక మెట్టిది?' అని దలాలుగా రనిరి.

'ఆవులకును, గేదెలకును ఫూకా తగిలించి దాని పాలోడ్చు ప్రక్రియ చేయుచున్నారు. ఈ సంగతి వినఁగా పాలపై తిరస్కారము కలిగెను. మరియు క్షీరము మనుష్యుని యాహారము కాదు గాన నేను క్షీరసన్న్యాసము గావించితి'నని యంటిని.

## ౨౯ రౌలటుచట్టము-నా ధర్మసందేహము

'అటులగుచో మేఁకపాలు పుచ్చుకొనవచ్చునుగదా' యని నామంచముకడ నిలువఁబడియున్న కస్తురిబాయి యనెను.

'మేఁకపాలు పుచ్చుకొన్నచో నాకుఁ జాలు'నని దలాలుగా రనిరి.

నేను లొంగిపోయితిని. సత్యాగ్రహసంగరపు సమ్మోహము నాకు జీవనలోభమును కలిగించెను. నేను ప్రతిజ్ఞాక్షర పాలనముతో సంతసించి ప్రతిజ్ఞాత్మహనన మొనరించితిని. ప్రతిజ్ఞాసమయమున నాకు గవ్యబుద్ధియు మాహిషబుద్ధియే యుండెను. అయినను ప్రతిజ్ఞాశరీరము క్షీరసామాన్యమునే చెప్పును. మనుష్యునకు క్షీరము సహజమగు నాహారము కాఁజాల దని నే ననుకొనునంతవఱకును నాకు పాలు త్రాగుట కధికారము లేదు. ఇది యెల్లయు నాకుఁ దెలిసియున్నను మేఁకపాలు పుచ్చుకొనుటకు సంసిద్ధుఁడ నయితిని. సత్యపూజకుఁడు సత్యాగ్రహసంగ్రామము నడపుటకు బ్రతుకఁదలఁచి సత్యమునకు బురద పూసెను.

దాని నామనసులో పుండింకను మానలేదు. మేఁకపాలు విడుచుటను గూర్చి నే నింకను విచారించుచునేయుంటిని. మేఁకపాలు త్రావుచు దినదినమును దుఃఖము ననుభవించుచునే యుంటిని. కాని సేవ చేయవలయు నను అతిసూక్ష్మమగు మోహము నన్నుఁ బట్టుకొని విడుచుట లేదు. అహింసాదృష్టితో ఆహారమును గుఱించిన పరిశోధనములు నాకుఁ బ్రియతరములు. వానివలన నా కానందము కలుగును; వినోదముకూడఁ గలుగును. అహింసాదృష్టిచే మేఁకపాలు నాకుఁ గష్టము కలిగింపవు గాని సత్యదృష్టిచేఁ గలిగించును. నే నహింసకన్న సత్యము నెక్కువ తెలిసికొనఁగల నని నా మనస్సున భాసించుచున్నది. సత్యమును విడనాడితినేని అహింసాగ్రంథిని

ఎన్నటికిని విప్పఁజాల ననుకొనుచున్నాను. చేసిన ప్రతిజ్ఞయొక్క శరీరమును, ఆత్మను—శబ్దార్థమును, భావార్థమునుగూడఁ బరిపాలించుటయే సత్యపాలనము. ప్రకృతము నే నాత్మను—భావార్థమును నాశనము చేసితిని. ఇది ప్రతిదినమును నాకు మనశ్శల్యముగా నుండును. ఇటు లిది యంతయు నాకుఁ దెలిసి యున్నను ప్రతిజ్ఞాసంబంధమున నా ధర్మమెట్టిదో నాకుఁ దెలియుట లేదు. లేక ప్రతిజ్ఞాపాలనమునకు నాకు ధైర్యము చాల దన్నమాట. ఈ రెండును ఒకటియే. ఏలన శంకామూలమున నమ్మకము లేదు. భగవంతుడా! నాకు నమ్మక మొసఁగుము!

మేకపాలు పుచ్చుకొన మొదలిడిన కొలఁది రోజులలో డాక్టరు దలాలుగారు మలద్వారమునందలి పుండు నాపరేషను చేసిరి. దాన ఫల మొందవేను.

నాలు గడుగులు వేయఁగల ననుకొంటిని. పత్రికలు చదువఁ దొడఁగితిని. రౌలతుకమిటీరిపోర్టు నా కంటఁ బడెను. అందలి విషయములు చూచి యదలిపోతిని. భాయి ఉమర్ శంకరలాలుగారలు వచ్చి మీ రేదో చేయకతప్ప దనిరి. సుమా రొక నెలలో నే నమదాబాదుకు వెళ్లితిని. వల్లభభాయి దైనందినము నాకడకు వచ్చుచుండెడివాఁడు. 'ఏదో యొకటి చేయవలె'నని నే నతనికి సూచించితిని. 'ఏమి చేయవలె?' నని యతఁ డనెను. 'కమిటీవారి యభిప్రాయములు లా యగునేని దాని నిరోధించుటకు ప్రతిజ్ఞ చేసి నిలువఁబడువారు పదిమంది దొరికినఁజాలు, సత్యాగ్రహ మారంభింతము. మంచమును పట్టుకొని యుండనిచో నే నొక్కఁడనే ముందు పోరాడెదని నావెనుక పలువురు రాఁగలరు. ఈ దుర్బలస్థితిలో నే నీ పనికిఁ దగను' అని నే నంటిని.

## ౨౯. రౌలటుచట్టము-నా ధర్మసందేహము

ఈ ప్రసంగమునకు ఫలముగా నాకు సంబంధించినవారి నొక చిన్న సభగా సమకూర్చుటకు నిశ్చయము చేయఁబడియెను. రౌలటు కమిటీ-రిపోర్టులో ప్రకటింపఁబడిన సాక్ష్యమును బట్టి కమిటీవారు చేసిన సలహాలప్రకారము లా చేయవలసిన పని లేదని నాకుఁ దోఁచెను. ఆత్మగౌరవము కలవాఁ డెవఁడును ఈ లాను అంగీకరింపఁ జాలఁ డనియు నాకు స్పష్టముగాఁ దోఁచెను.

పిదప సభ జరిగెను. ఇరువది మందికిఁ గాఁబోలు-ఆహ్వానము పంపఁబడెను. వల్లభభాయిగాక వచ్చినవారిలో శ్రీమతి సరోజిని, మి. హార్నిమన్, స్వ. ఉమర్ సోబానీ, శ్రీ శంకర్‌లాల్ బాంకర్, శ్రీమతి అనసూయా బహేను మొదలగువా రుండి నటులు గుఱుతు.

ప్రతిజ్ఞాపత్రము తయారుచేయఁబడెను. వచ్చినవా రెల్లరును దానిమీఁద చేవ్రాలు పెట్టినటులే గుర్తు. అపుడు నేను పత్రికను నడపుట లేదు. అయినను అపుడపుడు నా యుద్దేశములను దినపత్రికలలోఁ బ్రకటించుచుంటిని. అపుడును అటులే ప్రకటింప మొదలిడితిని. శంకర్‌లాల్ బాంకరుగా రాందోళనము చేయఁ నొడఁగిరి. ఒక పనికి పునాది వేయుటయందును, దానికి బలము కూర్చుటయందును వారికిఁ గల శక్తి యపుడే నా కనుభవమాయెను.

అపు డున్న సంస్థలు సత్యాగ్రహమువంటి యొక క్రొత్త అస్త్రమును చేపట్టఁ గలుగుట యసంభవ మని తలఁచి సత్యాగ్రహ సభ యొకటి స్థాపించితిమి. బొంబాయివా రిందు చాలమంది సభ్యులు గాన దీనికి కేంద్రము బొంబాయిలోనే ఉంపఁబడెను. ప్రతిజ్ఞా పత్రికలమీఁద పలువురు చేవ్రాలు పెట్టఁ నొడఁగిరి. ప్రతిసంగతియు నప్పటి కప్పటికిఁ దెలుపు పత్రికలు వెలువడఁ జొచ్చెను. ప్రతిచోటునను సభ లాయెను. ఇది యంతయు ఖేడాలడాయిని దలపించెను.

సత్యాగ్రహసభకు నే నధ్యక్షుండను. ఈ సభలో నున్న విద్యార్థికులకును, నాకును ఐక్యము కుదరలేదు. సభలో గుజరాతీ భాష నుపయోగించి తీరవలయు నని నే నంటిని. ఈ విషయమునకును, నా సూచించిన ఇంకొన్ని కార్యపద్ధతులకును వీరు విస్మితులయిరి. అయినను వీరిలో పలువురు నా పద్ధతుల నవలంబించుటకు కుదారత చూపి రని నే నొప్పుకొందును. కాని 'ఈ సభ యెంతకాలమో నిలువఁజాల'దని నేను మొదటనే యనుకొంటిని. సత్యమునుగురించి, అహింసనుగురించి నేను నొక్కి చెప్పుట సభ్యులలో పలువుర కిష్టము కాదు. అయినను ఈ సభ మొదటమొదట బాగుగా పనిచేసెను.

## ౩౦

## అద్భుతమగు హరతాళము

ఒకవంక రౌలతుకమిటీరిపోర్టునకు ప్రతికూలప్రచార మెక్కువగా జరగుచుండఁగా, మఱియొకవంక కమిటీవారిచ్చిన సలహాలను అమలులోనికిఁ దెచ్చుటకు సరకారువారి అనుకూల ప్రచారమును ఎక్కువగా జరుగుచుండెను. రౌలతు బిల్లు ప్రకటింపఁబడెను. నేను లెజస్లెటివ్ అసెంబ్లీ కెన్నఁడును వెళ్లియుండలేదు. ఈ బిల్లు చర్చింపఁబడునాఁ డచటికి వెళ్లితిని. శాస్త్రిగారు కూడ దాని గంభీరముగా మందలించుచు మహోపన్యాస మొసఁగిరి. వారి వేఁడి వాగ్ధారకు నైసరాయిగారు కనులు పెట్టుకొని చూచుచుండిరి. వీరి యుపన్యాసప్రభావము నైసరాయిగారి మీఁద ప్రసరించె నను కొంటిని. శాస్త్రిగారినుండి వెచ్చని యావిరి వెల్లి విరిసెను.

నిదురఁ బోవువానిని లేపవచ్చునుగాని దొంగనిదురఁ బోవు వాని చెవిలో డోలు వాయించియు లేపలేము. అచటి చట్టపుఁ జర్చ యొక ప్రహసనము. సరకారువా రా ప్రహసనమును ప్రదర్శించిరి. చేయవలసిన పనిని లోఁగడనే వారు నిశ్చయించుకొనిరి. కావున శాస్త్రిగారి మందలింపు మందునకును గొఱగాలేదు.

సవాకోటి బోడి జంగములలో ఈ బోడి జంగము నెవరు చూతురు? నేను నైసరాయిగారిని దర్శించితిని; చాల విన్నవించితిని. రహస్యములగు నుత్తరములు వ్రాసితిని; ప్రకటింపఁదగిన యుత్తరములు వ్రాసితిని. 'నాకు సత్యాగ్రహముతక్క వేఱు దారి లే'దని వీనిలో తేటతెల్లము చేసితిని. కాని అంతయు వృథా.

ఇంకను బిల్లు గజెటులో ప్రకటింపఁబడలేదు. నాశరీరము దుర్బలముగా నున్నను దీర్ఘప్రయాణమునకు సాహసించితిని. సభకు వలయునంత బిగ్గఱగా మాటలాడఁగల శక్తి నాకింకను గలుగలేదు. నిలిచి యుపన్యసింపఁగల శక్తి నేఁటివఱకును నాకు రానేలేదు. నిలువఁబడి యుపన్యసింపఁ దొడఁగితినా కొలఁది నిమిషములలోనే నాశరీర మంతయును కంపింపఁ దొడఁగి హృదయమునందును, ఉదరము నందును పోటు కలుగును. చెన్నపురినుండి వచ్చిన యాహ్వానమును అంగీకరింపవలయు నని తలఁచితిని. దక్షిణదేశము నాకు స్వగృహ మనిపించును. దక్షిణ-ఆఫ్రికా సంబంధమువలన తెలుఁగువారు, అఱవవారు మొదలగువారిమీఁద నాకు హక్కు కలదని నే ననుకొందును. ఇటు లనుకొనుటలో పొరపాటున్న దని నాకింతవఱకును తోఁపలేదు. కస్తూరి రంగ అయ్యంగారికడనుండి నా కాహ్వానము వచ్చెను. ఈ యాహ్వానముచాటున శ్రీ రాజగోపాలాచార్యులుగా రున్నయటులు చెన్నపట్టణము చేరినతరువాత నాకుఁ దెలిసెను. వారితో నాకదే ప్రథమపరిచయ మనుకొందును. కాకున్నను మేము పరస్పరము తెలిసికొనుట కదే మొదలు.

ప్రజాకార్యములలో నెక్కువ పాల్గొనుటకు కస్తూరి రంగ అయ్యంగారు మొదలగు మిత్రుల యామంత్రణముచే సేలము విడి రాజగోపాలాచార్యులుగారు చెన్నపురిలో వకాలతు చేయవ-వీ రున్న చోటుననే మా విడిది. ఆ గృహము కస్తూరి రంగ గారి దగుటచే మేము వారి యతిథులమే యని యనుకొంటిమి. రెండు మూణ్ణాళ్లకు మహాదేవ దేశాయి నా పొరపాటు దిద్దెను. గోపాలాచార్యులుగారు మా కెడమెడముగనే యుండుచుండిరి. కాని మహాదేవదేశాయి వారి పుట్టు పూర్వోత్తరము లన్ని యుం దెలిసి

కాని 'మీరు రాజగోపాలాచార్యులవారితో పరిచయము చేసి చూడ వలయు'నని నాతో ననెను.

నేను వీరితో పరిచయము చేసితిని. వీరితో ప్రతిదినమును కర్తవ్యమునుగూర్చి ముచ్చటించుచుంటిని. అప్పుడు సభలు తక్క మఱియొక దారి నాచూపులో లేదు. రౌలెట్ బిల్లు లా యగుచో దానిని వినయముతో భంగించు టెటులని యాలోచించితిని. సరకారువారు దానికి వీలు కలుగఁజేయుచో దానిని సవినయముగా భంగింపవచ్చును. ఇంకను ఏ చట్టములను మన మతిక్రమింపవచ్చును? అతిక్రమింపనగు నెడల అతిక్రమింపఁదగినవానికిని, అతిక్రమింపఁదగనివానికిని భేదక మేమిటి? ఇట్టి చర్చలు మాకు జరుగుచుండెడివి.

కస్తూరి రంగ అయ్యంగారు నాయకులను సభ కాహ్వానించిరి. ఇందు చాల చర్చ జరిగెను. అందు విజయరాఘవాచార్యులవారిది నిండు పాలు. చిన్న విషయమునుండియు పెద్ద విషయముదాఁక సత్యాగ్రహశాస్త్రమును రచింపవలయు నని వీరు కోరిరి. ఇది నా శక్తి మించిన దంటిని.

మే మిటు లాలోచనలు చేయుచుండఁగా బిల్లు గెజెటులో చట్టముగా ప్రకటింపఁబడెను. ఈ వార్త వచ్చిన నాఁటిరేయి ఆలోచించుచు పడుకొంటిని. మామూలు వేళకంటె వడిగా లేచితిని. అర్ధనిద్ర కాఁబోలును! కల వచ్చెను. ప్రొద్దుననే రాజగోపాలాచార్యులవారిని బిలిచి యిటులు తెలిపితిని :

'ఈ చట్టమునకు ప్రత్యుత్తరముగా మనము దేశములో హర్తాళమును ప్రకటింపవలయు నను సూచనను నే కలగంటిని. సత్యాగ్రహ మాత్మశుద్ధికి పోరాటము. ఇది ధర్మయుద్ధము. ధర్మకార్యము శుద్ధితో నారంభించుట మేలు. హిందూదేశమునందలి ప్రజ లెల్లరు

యొకనాఁ డుపవసింతురు గాక! పనిపాటలు మానుదురుగాక! ముసలమానులు 'రోజా' వినాగా ఉపవసింపరు గాన నిరువదినాలుగు గంట లుపవసింపఁ గోరుచున్నాను. మన కన్ని ప్రాంతములవారును తోడుపడుదురో, పడరో చెప్ప వీలులేదుగాని, బొంబాయి మద్రాసు బీహారు సింధుదేశములవారు తోడుపడుదు రని నా కాశ గలదు. ఈ ప్రదేశము లన్నియు తగిన రీతిగా హరతాళ్ మొనరించినచో మనము సంతుష్టులము కావచ్చును."

నా యీ మాట రాజగోపాలాచార్యులవారికి రుచించెను. పిదప వీరు మిత్రులకుఁ దెలిపిరి. అందఱును బాగుగా నున్న దనిరి. నే నొక చిన్న నోటీసును ప్రకటించితిని. ౩౦-౩-౧౯౧౯ నాఁడు హరతాళ మని నిర్ణయింపఁబడెను గాని పిదప ౬-౪-౧౯౧౯ కి మార్పఁబడెను. పని తొందరగా ప్రారంభింపవలసియుండుటచే లోకులకు కొలఁది యవకాశములోనే యీ సంగతి తెలుపఁబడెను.

కాని యిది యంతయు నిటులు జరుగు నని యెవ రనుకొనిరి! హిందూదేశమునం దెల్లెడల పత్తనములలో-పల్లెలలో నెటఁ జూచినను హరతాళమే. అది దర్శనీయము! అద్భుతము!

# ౩౧

## ఆ రోజులు (౧)

దక్షిణదేశమున కొంచెము సంచారము చేసి ౪ ఏప్రిలునకుఁ గాఁబోలు బొంబాయి చేరితిని. ౬ తేదీని గల కార్యక్రమము నెఱవేర్చుటకు బొంబాయి రావలసినదని శంకరలాల్ బాంకరుగారు నాకు తంతి యిచ్చిరి.

ఇంతకు ముందే మార్చి ౩౦ తేదీని ఢిల్లీలో హరతాళము జరిగిపోయెను. అచట శ్రద్ధానందులయు, అజమల్ ఖానులయు మాటయే ఆజ్ఞ. ఆఱవ ఏప్రిల్ వఱకును హరతాళ మాఁపవలయు నను సంగతి యచటి కాలస్యముగా నందెను. అట్టి హరతాళము ఢిల్లీ యెన్నఁడేని అనుష్ఠించియుండలేదు. హిందువులును, ముసలమానులును కలిసిపోయిరి. శ్రద్ధానందులు జుమా-మసీదున కాహ్వానింపఁబడిరి. ముసలమానుల కోరికచే వారచట నుపన్యసించిరి. దీనికి సరకారు-ఆఫీసరుల కన్నులు కుట్టెను. ఈ హరతాళయాత్ర రైలుస్టేషనుదెసకుఁ బోవుచుండఁగా పోలీసులు తుపాకులు పేల్చిరి. కొందఱకు గాయములు తగిలెను; కొందఱు చచ్చిరి. ఈరీతిగా ఢిల్లీలో దండనీతి యారంభమాయెను. వెంటనే రమ్మని నాకు శ్రద్ధానందులు వార్త నంపిరి. ఆఱవ తేదీని బొంబాయిలో కార్యక్రమమును పరిపూర్తిచేసికొనిన వెంటనే వత్తు నని నేను వారికి తంతి పంపితిని.

కొలఁది భేదముతో ఢిల్లీ ముచ్చటలే లాహోరు అమృతసరములలో జరిగెను. డా. సత్యపాలు కిచలూగారలు వెంటనే అమృతసరమునకు రమ్మని తంతి నంపిరి. నాకపుడు వారి పరిచితి లేదు. డిల్లీ వచ్చి పిదప అమృతసరమునకు రాఁగల నని వారికి తంతి పంపితిని.

ఆఱవతేదీ ప్రొద్దున లక్షలకొలఁది జనులు చౌపాటికడ సముద్రస్నానము చేసి యచటినుండి ఠాకుర్ ద్వారమునకు యాత్రగా బయలుదేఱిరి. అం దాఁడువారు, బాలురు, బాలికలును గలరు. ఇందు ముసలమానులును పలువురు పాల్గొనిరి. కొందఱు ముసలమాను సోదరులు దాపునఁ గల యొక మసీదునకు మమ్మాహ్వానించిరి. నన్నును, సరోజినీదేవిని నుపన్యసింపుమని కోరిరి. దేశభక్తికిని, హిందూ ముసలమానుల యైకమత్యమునకును ఆచట నందఱిచేత ప్రతిజ్ఞలు చేయింపవలయునని విఠలదాస జేరాజణీగారు సూచించిరి. ఇంత వడిగా ప్రతిజ్ఞలు గొనుటకు నేను సమ్మతింపలేదు. ఇపుడు జరిగినదానితో సంతోషపడుట మంచి దని నేను సలహా యిచ్చితిని. బాస చేసిన తరువాత దానిని మీఱరాదు. దేశభక్తి యన నేమో లెస్సగా తెలిసికొనవలయును. హిందూముసలమానుల యైక్యమునకు పూనవలసిన భారము చాల దొడ్డది. దానిని బాగుగాఁ దెలిసికొనవలయును. ఇట్టి ప్రమాణములు తీసికొనఁ గోరువారిందులకుఁగాను మఱునాఁటి ప్రొద్దున చౌపాటికడ సమావేశము కావలయు నని నేను తెలిపితిని.

బొంబాయిలో సంపూర్ణహరతాళము——

చట్టమును శాంతిముగా నతిక్రమించుటకు సంపూర్ణప్రయత్నము లొనరింపఁబడెను. రెండుమూఁడు చట్టము లతిక్రమింపఁదగినవి కలవు. అవియే మ మ్మతిక్రమింపుఁ డని చెప్పను. వానిని రద్దు చేయింపవలయును. వీనిలో నొక చట్టమునుమాత్ర మతిక్రమింపఁదలఁచితిమి. ఉప్పుచట్ట మందఱకు నసమ్మతము. దాని నాఁపుటకుఁ జాలఁ గాలమునుండి దొడ్డ ప్రయత్నములు జరుగుచు వచ్చుచున్నవి. కావున దీని నతిక్రమించుట కెవరి యిండ్లలో వా రుప్పును వండవలయు నని నేను సూచించితిని. సరకారువారు కొన్ని గ్రంథములను నిషేధించిరి. ఆ చట్టముగూడ నతిక్రమింపఁదగిన దని నేను సూచించితిని. ఇట్టివి

నా పుస్తకములు రెండు: హిందీ-స్వరాజ్యము, సర్వోదయము. ఈ రెంటిని అచ్చువేసి బహిరంగముగా అమ్మినచో నన్నిటికంటె సహజమైన శాసనోల్లంఘన మగును. కావున నీ గ్రంథములెక్కువగా ముద్రించితిమి. సాయంతనోపవాస మయినపిమ్మట జరిగిన మహాసభ ముగిసినతరువాత వీనిని అమ్మఁ జూచితిమి.

ఆనాటి సాయంకాలమున స్వయంసేవకు లీ పుస్తకముల నమ్మఁ గొసఁగిరి. సరోజినీదేవి యొక్క కారుమీఁదను, నేనొక కారు మీఁదను బయలుదేరితిమి. ముద్రించిన పుస్తకము లన్నియు అయిపోయెను. వసూలయిన సొమ్ము పోరాటమున కుపయోగింపఁబడెను. ఒక్కొక్క దాని వెల పావలా కాని నాకడను, సరోజినీదేవికడను ఎవరును పావలా యిచ్చి కొన్నట్టులు లేదు. జేబులో నున్నదెల్లయు నిచ్చి పుస్తకములు గొన్నవారు పలువురు. కొందఱు పది రూపాయలనోట్లును, కొంద ఱైదురూపాయలనోట్లను ఇచ్చిరి. ఒక పుస్తకమునకు ఏఁబది రూకల వెల వచ్చినట్లు గుర్తు. కొట్టిన బెట్టుదు రని గూడఁ గొనువారిని హెచ్చరించితిని. కాని ఆ సమయమున అందఱకును జైలు భయ మెగిరిపోయెను.

కాని మే మమ్మిన పుస్తకములు తమచే నిషిద్ధము లయినవి కావని సరకారువారి యభిప్రాయము. మొదట ముద్రింపఁబడిన పుస్తకములు జప్తుచేయ బడెను. వాని నమ్మినయెడలనే తప్పు. ఇది రెండవ కూర్పు. కావున నిది వారి మాపులో చట్టమునకు భంగము కలిగించుట కాదు. ఇటుల తెలియుటచే జనమునకు కులాసా లేక పోయెను.

దేశభక్తిని గుఱించియు, హిందూమహమ్మదీయసమ్మేళనమును గుఱించియు శపథము లొనరించుట కా మఱునాఁడు చౌపాటిలో

శోకసభ జరిగెను. తెల్లని వస్త్రము పాలుగా వని శ్యామదాస్ శేరాజణీ గారు తెలిసికొనుట కదియే ప్రథమపర్యాయము. కొలఁదిమంది సభకు వచ్చిరి. నాఁడు కూడిన యయిదారుగురు స్త్రీలు నాకు స్పష్టముగా గుర్తున్నారు. మగవారును కొలఁదిమందియే. నేను శపథమును వ్రాసి యుంచుకొంటిని. దాని యర్థమును వివరించితిని. కొలఁదిమందియే వచ్చినందులకు నా కాశ్చర్యముగాని, దుఃఖముగాని కలుగలేదు. చులుకపాలు గల్గిపనులలో ప్రజకు పక్షపాతము మెండు. ఉపయోగింపవలసిన పనులను ప్రారంభించుటలో నభిరుచి లేదు. నాకీ సంగతి మొదటినుండియు ననుభవము.

ఈ విషయమును వివరించుటకు వేఱొక ప్రకరణము కావలయును.

ఏడవ తేదీ రాత్రి నేను ఢిల్లీ అమృతసరములకు బయలుదేఱితిని. ఎనిమిదవ తేదీకి మథుర చేరితిని. అపుడే నన్ను పట్టుకొందు రను పక్వడి బయలుదేరెను. మథురకు తరువాత స్టేషనులో బండియాఁగెను. నన్నట గిదవాణీగారు చూడవచ్చిరి. 'మిమ్ము తప్పక పట్టుకొందురు; ఏమేని పని యున్న నేను చేయుదును' అని వీరు తెలిపిరి. 'మంచిది, అక్కఱ కలుగుచోఁ దెలుపుదు' నని నే నంటిని. పలవల్ స్టేషను చేరకమున్నే పోలీసు-ఆఫీసరొకడు నా చేతి కొక హుకు మిచ్చెను '—మీరు పంజాబులో ప్రవేశించునెడల నల్లరి జరుగునని మాకు భయము కావున మీరు పంజాబు త్రొక్కఁగూడదు.' పోలీసీ హుకుము నాకుఁ జూపి రైలు దిగుమనెను. 'అల్లరి జరిపించుటకు నే నచటికిఁ బోవుట లేదు; అల్లరి మాన్పుటకు నేను పోవుచుంటిని. అందులకు నాయకులు నన్ను రమ్మనిరి. కావున నే నీ హుకుము ననాదరింప వలసివచ్చినది. ఇది చింతాజనకము' అని నే నంటిని.

## ౩౧ ఆరోజులు (౧)

పలవల్ స్టేషను వచ్చెను. మహాదేవదేశాయి నాతోఁగూడ వచ్చుచుండెను. ఢిల్లీ వెళ్లి శ్రద్ధానందులకీ వార్త లందింపు మనియు, జనమును శాంతిముగా నుండఁ దెలుపు మనియు మహాదేవదేశాయికిఁ జెప్పితిని. మరియు నే నీ యాజ్ఞ మీఱుటకుఁ గల కారణమును దెలుపు మంటిని. మరియు శిక్షను నే ననుభవింప సంసిద్ధుఁడ ననియు, శిక్ష వేసినపిదపఁగూడ మన మోర్పు జూపినయెడలనే మనకు విజయము కలుగు ననియుఁ దెలుపు మంటిని.

పలవల్ స్టేషనులో నన్ను దింపి పోలీసుల వశ మొనరించిరి. కొలఁది సేపటిలోనే ఢిల్లీనుండి యొక రైలు వచ్చెను. నన్నం దొక మూఁడవ తరగతి పెట్టెలో నెక్కించిరి. పోలీసు సిబ్బంది నన్ను వెంబడించియుండెను. మథురలో దింపి నన్ను పోలీసు బారకాసుల లోనికిఁ దీసికొనిపోయిరి. నన్నేమి చేయఁదలఁచికొనిరో, నన్నెటకుఁ దీసికొని పోవఁగలరో యెవరికిని దెలియదు. తెలవాఱుజామున నాలుగుగంటలకు నన్ను లేపి బొంబాయి దెసకుఁ బోవు మట్టిబండిలో నెక్కించిరి. రెండుగంటలకు సవాయీ మాధోపురమున దింపిరి. లాహోరునుండి ఇన్‌స్పెక్టరు ఏ. బోరింగు బొంబాయిమెయిలులో దిగెను. వారు నన్ను వశపఱచికొనిరి.

నన్నిచట మొదటి తరగతి బండిలో నెక్కించిరి. దొర నాతోఁగూడ నుండెను. లోఁగడ నేను మామూలు ఖైదీని. ఇపుడు 'జెంటిల్ మేన్' ఖైదీని. ఈ యాఫీసరు సర్ మైకేల్ ఓడ్వైయరును స్తోత్రము చేయఁదొడఁగెను. 'సర్ మైకేలు గారికి మీయెడ వేఱుగా నెట్టి విరోధమును లేదుగాని మీరు పంజాబుకు వెళ్లుచో నచట గందరగోళము జరుగునని వారికి భయము' అని యీ రీతిగాఁ జాలఁ జెప్పెను. కావున మీ యంతట మీరు బొంబాయికి

మరలిపొండనియు, పంజాబుసరిహద్దు ద్రొక్కవలదనియుఁ దెలిపెను. 'ఈ హుకుమును పరిపాలింప వీలు లేదు. నాయంతట నేను బొంబాయికి పోఁజాలను' అని నే నంటిని. కావున నీకుఁ జేయునది లేక 'మీమీఁద అమలు జరిపెద' ననెను. 'ఏమి జరుపుదురు?' అని యంటిని. 'నాకును దెలియదు, పై ఆఫీసరుల ఉత్తరువు చొప్పునఁ జేయవలయును. కాని ప్రకృతము మిమ్ము నేను బొంబాయికి తీసికొనిపోవుచున్నాను' అనెను.

సూరతు స్టేషను వచ్చెను. మఱియొక పోలీసు-ఆఫీసరు నన్ను వశపఱచికొనెను. రైలు బొంబాయి సమీపించుచుండఁగా నతఁ డిటు లనెను: 'మీ కిచట విడుదల. మీరు మెరీన్ లైన్సు స్టేషను కడ దిగినచో బాగుండు నని తోఁచును. క్లోబా స్టేషనుకడ జనసమూహము మూఁగుట కవకాశ మున్నది.' నే నతని కోరిక నామోదింతు నంటిని. అతఁ డందులకు సంతసించి నాకు ధన్యవాదము లొసఁగెను. నేను మెరీన్ లైన్సు కడ దిగితిని. అచట నొక మిత్రుని గుఱ్ఱపుబండి కానవచ్చెను. దానిమీఁద రేవాశంకర్ ఝువేరీగారి యింటి కేఁగితిని. 'మిమ్ములను పట్టుకొని రని విని జనులు కోపపూరితు లయిరి. పాయధునికడ నల్లరులు జరుగు నని భయము కలుగుచున్నది. అప్పుడే మేజిస్ట్రేటును, పోలీసులును అచటికి వెళ్లిరి' అని రేవాశంకరులు చెప్పిరి.

ఉమర్ సోబానీ, అనసూయా బహేనుగారలు నావెనుకనే మోటరుమీఁద వచ్చి 'వెంటనే మీరు రావలయును. జన మాఁగుట లేదు. మేము వారి నాఁపఁజాలము. మీరు కనఁబడినఁ జాలును; అల్లరి ఆఁగిపోవును' అనిరి.

నేను మోటరులోకి గూరుచుంటిని. పాయధునికడఁ జాల జనము కానిపించుచుండెను. నన్నుఁ జూడఁగనే వారి కానంద మాఁగలేదు. వందేమాతరమ్, అల్లాహో అక్బర్ అను ధ్వనులతో

ఆకాశము బూరటిల్లెను. పాయధునికడ పోలీసు గుర్రపురౌతులు కనఁబడిరి. మేడలమీఁదనుండి ఇటుకల వర్షము కురియుచుండెను. "శాంతముగా నుండుఁడు; శాంతముగా నుండుఁ"డని చేతులు జోడించి నేను ప్రార్థించుచుంటిని. మేముగూడ ఆ యిటుకవానను తప్పించుకొనలేకపోతిమి.

అబ్దుల్ రహమాను వీధినుండి యీ యూరేఁగింపు క్రాఫర్డు మార్కెటుదెస కేఁగుచుండఁగా గుర్రపురౌతు లెదురుగా నిలువఁబడిరి. ఈ యూరేఁగింపు కోటదెస కేఁగకుండఁ జేయుటకు వారు చాలఁ బ్రయత్నించుచుండిరి. జనము అపరిమేయముగా నుండెను. జనము పోలీసులను చీల్చుకొని ముందులకు సాగుచుండెను. నా మాటయు సాగునటులు తోఁపలేదు. అపుడు పోలీసు-ఆఫీసరు గుంపును చెదరఁ గొట్టుట కాజ్ఞ యిచ్చెను. రౌతు లొక్కటూరి జనముపై గుర్రములను పరుగెత్తించిరి. లోకులకు బరిసెలు గ్రుచ్చుకొనుచుండెను. నాకును తప్పదనుకొంటిని గాని బరిసెలు మా మోటరును రాచికొనుచుఁబోయెను. రౌతులు గాలివేగముతోఁ బరుగిడిరి. జనము విరిసిపోయెను. ఎచటివా రచట పరుగిడఁ దొడఁగిరి. కొందఱు మట్టగింపఁబడిరి; కొందఱకు గాయములు తగిలెను. రౌతు లావలి కేఁగుటకు దారి లేదు; జనము పోవుటకు అంతకన్న లేదు. వెనుక కేఁగుటకును వీలులేదు; ముందఱ కేఁగుటకును వీలులేదు. రౌతులును, జనులును పిచ్చియెత్తినవారివలె నుండిరి. రౌతు లేమి చేయుచుండిరో రౌతులకే తెలియుటలేదు. కనులు మూసికొని గుర్రములను దౌడు తీయించిరి. అది యెల్లయు భయంకరముగా నుండెను. రౌతులును, జనమును ఆ గందరగోళమున 'కలగాపులగ' మయిపోయిరి.

ఈ రీతిగా జనము చెదరఁగొట్టఁబడెను. ఊరేఁగింపు ముందరకు జరుగకుండ జేయఁబడెను. మా మోటరును ముందరకుఁ బోనిచ్చిరి. కమిషనరు-ఆఫీసుముందు బండినిలిపి పోలీసువారి వ్యవహారమును ప్రియాదుచేయుటకు లోని కేఁగితిని.

౩౨

## ఆ రోజులు (౨)

కమిషనరు మేడమెట్లెక్కుదునుగదా, క్రిందినుండి మీఁదివఱకును సైనికులు తుపాకులతో నిలువఁబడి యుండిరి. వారిని జూచినవా రెవరును యుద్ధమునకు సన్నద్ధులుగా లే రనుకొనరు. బోరింగుగారు గ్రిఫిత్తుగారికడఁ గూర్చుండియుండిరి.

నా చూచిన సంగతు లన్నియు గ్రిఫిత్తుగారికిఁ జెప్పితిని. ఇతఁ డిట్లు సంక్షేపించి ప్రత్యుత్తర మొసఁగెను: 'ఈ యూరేఁగింపు కోట దెస కరుగుట నా కిష్టముకాదు. అచట గందరగోళము గాక తప్పదు. ఎంత చెప్పిచూచినను జనులు మరలలేదు. కావున అమలు జరిపింపక తప్పకపోయెను.'

నే నిటు లంటిని: 'దీనిలాభము మీకుఁ దెలియకపోదు. గుఱ్ఱపు డెక్కలక్రింద జనము నలిబిలిగాక తప్పదు. గుఱ్ఱపుసవారులను బంప వలసినంత పని లే దని నే ననుకొందును.'

దొరగా రిటు లనిరి: 'మీ రటులు నిశ్చయింపఁ దగదు. మీ బోధలు జనులచే నెట్టి పనులు చేయించునో ఆ సంగతి మీకంటె మా కెక్కువగా తెలియును. మేము ముందుగా జాగ్రత్త పడనిచో చాల హాని చేకూరును. జనులు మీ మాటలుఁగూడ విన రని నేను మీకుఁ దెలియఁజెప్పుచున్నాను. చట్టము నతిక్రమించుటయే లోకులకు చప్పున పట్టును గాని, శాంతి నెలకొలుపుట వారి శక్తి కతీతము. మీ హేతువులు చాల దొడ్డవి. కాని లోకుల కవి అర్థముకావు. వారి స్వభావమునే వా రనువర్తింతురు.'

'తమకును' నాకును మతభేద మచ్చటనే. స్వభావముచే లోకము కలహప్రియము కాదు, శాంతిప్రియము సుండీ!'

మే మిటులు చాలసేపు వాదించుకొంటిమి.

తుదకు గ్రిఫిత్తుగా రిటు లనిరి: 'మీమాట లోకులు విన రను కొనుడు! మీ రపు డేమి చేయుదురు?'

'నా కట్టి నమ్మకము కలిగినచో ఈ పోరాటమును కట్టిపెట్టుదును.' అని నే నంటిని.

'ఏమి? విడిచిపెట్టినచో వెంటనే పంజాబు వెళ్లుదు నని మీరు బోరింగుగారతో ననలేదా?'

'ఆ, అవును. తిరుగు రైలులోనే వెళ్ళఁదలఁచితిని. కాని అది యిఁక నేఁటి మాట కాదు.'

'మీరు కొంచెము శాంతి వహించియున్నచో సంగతులన్నియు మీకే తెలియును. ఇపు డమదాబాదులో నేమి జరుగుచున్నదో మీకుఁ దెలియునా? అమృతసరమున నేమి జరిగెనో తెలియునా? ఎల్లెడలను లోకులకు వెఱ్ఱి యెత్తినటు లున్నది. నాకును అన్ని సంగతులు తెలియలేదు. కొన్నిచోటుల తంతితీఁగెలు తెగఁగొట్టఁబడెను. ఈ దోస మంతయు మీదియే.'

'నా జవాబుదారీ ఉన్న చోట దోసమును నా నెత్తిమీఁదఁ బెట్టుకొనక మానను. అమదాబాదులో అల్లరి జరిగె ననఁగా నాకు వింతయు, వెతయుఁ గలుగుచున్నవి. అమృతసరమునకు నాపూచీ లేదు. నే నచటి కెన్నఁడును వెళ్ళియుండలేదు. నే నచట నెవరిని ఎఱుఁగను. కాని సరకారువారు నన్నచటికిఁ బోనిచ్చి యుండినచో నే నచటి శాంతిని కాపాడియుండువాఁడ నని ధైర్యముగాఁ జెప్పఁగలను. బన్నాఁపివైచి సరకారువారు లోకులను రెచ్చఁగొట్టిరి.'

వారి మాటలు వారు చెప్పిరి. నా మాటలు నేఁ జెప్పితిని. మాకు సామరస్యము కుదురలేదు. చౌపాటీలో సభ జరిపి జనులకు శాంతి బోధింతు నని నా యుద్దేశము వెల్లడించి వారికడ సెలవు గొంటిని.

చౌపాటీలో సభ జరిగెను. శాంతినిగూర్చి, సత్యాగ్రహ మర్యాదనుగురించి వివరించి సత్యాగ్రహము సత్యశీలుర కొక క్రీడ యనియు, లోకులు శాంతిని పరిపాలింపలేని వారికి సత్యాగ్రహమునకు నీరు వదలుకొనవలయు ననియుఁ జెప్పితిని.

అమదాబాదులో నల్లరులు జరిగెనని శ్రీ అనసూయాబేనకుఁ గూడ వార్త వచ్చెను. ఆమెకూడ అరెస్టు చేయఁబడెనని యెవఁడో పుకారు పుట్టించెను. దీనితో కూలివారికి కోప మెత్తెను. వారు హరతాళము చేసిరి, కోపముచే పిచ్చి పనులు చేసిరి. ఒక సార్జెంటు ంపఁబడెను.

నే నమదాబాదు వెళ్ళితిని. నడియాదుకడ రైలుపట్టాల నూడఁదీయుటకు ప్రయత్నములు జరిగెను. వీరామగామున ఒక గవర్నమెంటు ఆఫీసరు ఖూనీ చేయఁబడెను. నే నమదాబాదు చేరునరికి మార్షల్ లా చలాయించుచుండెను. లోకులు భీతు లయిపోయిరి. చేసినపనికి వడ్డీతో ననుభవింపవలసి వచ్చెను.

కమిషనరు ప్రాట్ గారికడకు నన్నుఁ దీసికొనిపోవుట కొకఁడు రైలు స్టేషనుకడ వేచియుండెను. నేను వారికడ కరిగితిని. ఆయన కోపముతో మండిపోవుచుండెను. నే నతనితో చల్లగా మాటలాడితిని. జరిగిన చావునకు నా ఖేదము తెలిపితిని. మార్షల్ లాతో పనిలేదనియు, శాంతికి వలయు ప్రయత్నము నేను చేయుదుననియుఁ దెలిపితిని. సబర్మతాశ్రమముకడ నింపులకుఁగాను ఒక సభ నేర్పాటుచేయుట కనుజ్ఞ వేఁడితిని. వారును సమ్మతించిరి. ౧౩ ఏప్రెల్ ఆదివారమున సభ యయినటులు గుర్తు. ఆనాఁడో, అమరునాఁడో మార్షల్ లాగూడ

రద్దయినటులు గుర్తు. నే నా సభలో లోకుల దోసము లెత్తి చూపితిని. నేను మూ డ్నాళ్లు ఉపవాసమును విధించుకొంటిని. ఒక దినము ఉపవసింపుఁ డని లోకులకు సలహా నిచ్చితిని. తప్పు లొనర్చినవారిని తమ తప్పుల నొప్పుకొనుఁ డనియు సలహా యిచ్చితిని.

నాధర్మము నాకు తెల్లముగాఁ దెలిసెను. నేను నాకుఁ గల తీరికలో నెక్కువ పా లెవరికొఱకు వినియోగించితినో, ఎవరికి నేను సేవ లొనరించితినో, ఎవరిమీఁద నేను పెద్దపెద్ద యాశలు పెట్టుకొని యుంటినో వారే యీ యల్లరిలో పాలుగొని రనినచో నాకు కష్టము కాదా! నాకును ఈ దోషమున పాలు గల దని గ్రహించితిని.

తప్పుల నొప్పుకొనుఁ డని నేను ప్రజకు సలహా యిచ్చినటులే తప్పులను క్షమింపుఁ డని సరకారువారికిని సలహా యిచ్చితిని గాని నామాట యెవరును వినలేదు.

స్వ. సర్ రమణభాయి లోనగు అమదాబాదు పెద్దలు సత్యాగ్రహమును నిలుపుఁ డని నన్నుఁ గోరవచ్చిరి. నన్నుఁ గోర నక్కఱయే లేదు. లోకులు శాంతిని జక్కగా నభ్యసింపనంతవట్టు సత్యాగ్రహమును నిలిపివేయవలయునని నేనే నిశ్చయించుకొనియుంటిని. దీనికి వారు ప్రసన్ను లయిరి.

దీనికి మఱి కొందఱు మిత్రు లప్రసన్ను లయిరి. సత్యాగ్రహమునకు శాంతి తప్పని నియమ మగుచో సాముదాయికసత్యాగ్రహము విఫల మగునని వీరి మతము. కాని నామతము వేఱు. నే నెవరిలో పని చేసితినో, నే నెవరిమీఁద ఆశ పెట్టుకొనియుంటినో వారే శాంతిని పాలింపనియెడల సత్యాగ్రహము జరుపుటకు వీలులేని మాట నిక్కము. ఎవరిచే సత్యాగ్రహము నడిపింపవలసియుండునో వారిచేత ఆ సత్యాగ్రహమునకుఁ గావలసిన శాంతి నంతయు పరిపాలింపఁ జేయఁ గలిగియుండుట నాయకుల కావశ్యకము. ఈ యభిప్రాయమును నేను ఇప్పటికిని మార్చుకొనఁజాలను.

# 33

## కొండంత తప్పు

అమదాబాదుతో సభ యయినవెంటనే నడియాదు వెళ్లితిని.

కొండంత తప్పనియు, హిమవత్పర్వతమంత తప్పనియు అని వాడుక యయిపోయిన ఉపమను మొట్టమొదట నేను నడియాదునందే ఉపయోగించితిని. అమదాబాదునందే నా తప్పు నాకు మసకమసకగాఁ గానిపించెను. నేను నడియాదులో జరిగిన ఘోరములు కనులారఁ గాంచితిని. ఖేడాజిల్లాలో ననేకు లరెస్టయిరని వింటిని. ఖేడాలోను, మిగిలిన చోటులను చట్టము నతిక్రమింపుఁ డని తఱి రాకముందే నే నభ్యనుజ్ఞ యిచ్చుట తప్పనియు, కొండంత తప్పనియు అని నా కర్థమాయెను.

నే నపుడు సభలో నుపన్యసించుచుంటిని. నే నీ తప్పిదమును ఒప్పుకొంటిని. అటు లొప్పుకొనుట నా కపహాస్యముగా నున్నను ఒప్పుకొనినందులకు నాకు పశ్చాత్తాపము లేదు. ఏనుఁగులంత యితరుల తప్పులు నలుసు లంతవిగను, ఆవగింజలంత మనతప్పులు కొండలంతలుగను మనము చూడఁగలుగుట నేర్చుకొనినచో మన దోషములయు, పరుల దోషములయు ప్రమాణము మన మెఱుఁగఁగలుగుదుము. సత్యాగ్రహి కాఁగోరువాఁ డీ సామాన్యనియమమును కడు సూక్ష్మముగా పరిపాలింపవలయును.

ఇఁక ఈ కొండంత తప్పేదియో కనుఁగొందము. చట్టమును వినయముతో నతిక్రమింప నర్హుఁ డగువాఁడు లాయెడ వినయమును, సమ్మతియును చూపవలయును. మనము చాలవఱకు దండభీతిచే లాకు బద్ధుల మయి యున్నాము. ఆ లాలు ముఖ్యముగా నీతికిఁగాని, అనీతికిఁ

గాని సంబంధించి యుండవు. ఎటు లనఁగా లా యున్నను, లా లేకున్నను మంచివాఁ డెవఁడును దొంగతనము చేయఁడు. ఆ మంచి వాఁడే చీఁకటిలో త్రొక్కుడుబండిమీఁద దీపమును ఉంచవలయు నను లాను అతిక్రమించి, అతిక్రమించినందులకు చింతింపఁడు. ఈ నియమము పాలింపవలసిన దని యెవరేని సలహా యిచ్చుచో ఎంత మంచివాఁడేని ఆ నియమపాలనమునకు సంసిద్ధుఁడు కాఁడు. కాని ఇట్టి చట్ట మొకటి పుట్టినపుడు దాని నతిక్రమించుచో జరిమానా తగులు నను భయము కలుగుచో ఆ జరిమానాను తప్పుకొనుటకే దీప ముంచును. ఈ నియమమును పరిపాలించుట దండమువలని భయముచేఁ గాని స్వేచ్ఛ చేఁగాదు.

కాని సత్యాగ్రహి సంఘమునకు సంబంధించిన 'లా'లను లెస్సగా తెలిసికొని గౌరవింపవలయు నను ధర్మ మెఱిఁగికొని స్వేచ్ఛాపూర్వకముగా గౌరవించును. సాంఘికమగు లా ను తెలిసికొని ఇచ్ఛాపూర్వకముగా పరిపాలించువానికి 'ఈ లా నీతికి సంబంధించినది, ఈ లా నీతికి సంబంధింపనిది' అని భేదము తెలిసికొను శక్తి కలుగును. ఈ చెప్పఁబడిన మేరలో లాను అతిక్రమింపఁగల అధికారము కలుగును. ఇట్టి యధికారము రాకముందే చట్టము నతిక్రమింపవలసిన దని నే నంటిని. ఇది తప్పు. ఈ తప్పు నాకు కొండంతగా కానిపించెను. ఖేడా జిల్లాలో కాలిడఁగనే తొల్లిటి సత్యాగ్రహమంతయు నాకు గుర్తు వచ్చి 'ఎదుటి గోడను గానక కనులు మూసికొని పరుగు లెత్తించితి' ననుకొంటిని. మరియు చట్టము నతిక్రమించు నర్హత కలుగకముందు దానిలో నిమిడియున్న అర్థము లన్నియు లెస్సగా తెలిసికొనవలయు ననుకొంటిని. ప్రతిదినమును బుద్ధిపూర్వకముగా చట్టము నతిక్రమించుచుండువారును, దొంగతనముగా పలుమాఱులు

చట్టము నతిక్రమించుచుండువారును ఒక్కతూరి దీని నెట్టులు తెలిసికొనఁగలరు? దీని మర్యాదాపాలన మెట్లు చేయఁగలరు?

లక్షలకొలఁది జనము దీనిని సమగ్రముగా పరిపాలింపఁజాల రను మాట తేటతెల్లము. కావున సాముదాయికముగా చట్టము నుల్లంఘించుటకు ముందు స్వయంసేవకుల సేన యొకటి తయారుకావలెను. వీరు లోకులకు చక్కగా తెలుపఁగలవారుగా నుండవలయును. ప్రతి క్షణమును దారి చూపఁగలవారుగా నుండవలయును. వీరికి సత్యాగ్రహ మర్యాద సమగ్రముగాఁ దెలిసియుండవలయును.

ఇట్టి యాలోచనలతో నేను బొంబాయి చేరితిని. సత్యాగ్రహ సభాద్వారమున స్వయంసేవకుల సేనను తయారుచేసితిని. వీరి సాయమున లోకులకు చట్టమును వినయముగా నుల్లంఘించుటనుగూర్చి తెలుపఁ దొడఁగితిని. సత్యాగ్రహరహస్యములఁ దెలుపుటకు చిన్న చిన్న పత్రికలు ప్రకటింప మొదలిడితిని.

ఇటు లీ పని జరుగుచున్నదికాని దీన లోకుల కభిరుచి కలిగినటులు నాకుఁ దోఁచలేదు. స్వయంసేవకులా, యెక్కువగా సమకూరలేదు. సమకూరినవారా, సత్యాగ్రహమును సమగ్రముగా నభ్యసింపలేదు. ఇంతియకాక క్రమక్రమముగా వీరి సంఖ్య పెరుగుటకు బదులు దిగజాఱఁ దొడఁగెను. నే నీ బండి నెంత వడిగా నడపవలయు నను కొంటినో అది అంత వడిగా నడవ దని తెలిసికొంటిని.

# ౩౪

## నవజీవన్ యంగిండియాలు

శాంతిని నెలకొలుపు నాందోళన మిటు లొకవంక మెల్లగా జరుగుచుండఁగా, సరకారువారి దండనీతి మఱియొక వంక జోరుగా సాగుచుండెను. పంజాబులో ఈ దండనీతిప్రభావము కానిపించెను. నాయకు లరెస్టు చేయఁబడిరి. 'లా లే' దనుటకు మాఱు పేరయిన మార్షల్ లా ప్రకటింపఁబడెను. క్రొత్త కోర్టు లేర్పాటు చేయఁబడెను. ఈ కోర్టులకు సాక్ష్య మక్కఱలేదు. ప్రమాణ మక్కఱలేదు. నిరంకుశాధికారమున కివి తావులు. అమృతసరమున ఏమియు నెఱుఁగని స్త్రీ పురుషులను పురుగులవలె పొట్టలమీఁద దేకించిరి. హిందూదేశమునకును, ప్రపంచమునకును తెలిసియున్న జలియన్‌వాలా బాగు-హత్యలుగూడ దీనిముందు నాకు తక్కువగాఁ గానిపించెను.

ఏ మయినను సరే వెంటనే పంజాబు రావలయు నని నాకు వార్త వచ్చెను. అనుజ్ఞకు వైసరాయిగారికి వ్రాసితిని; తంతి యిచ్చితిని గాని లాభము లేకపోయెను. సెలవు లేకుండ పంజాబు సరిహద్దును త్రొక్కుదునేని చట్టము నతిక్రమించితి నను సంతోషమే దక్కును. ఈ సంకట మెట్టులు తప్పించుకొందునా యని చింతించితిని. నే నిపుడు పంజాబునకు వెళ్లినయెడల నది చట్టమును వినయముతో నుల్లంఘించుట యనిపించుకొనదు. నేను కోరెడు శాంతి వాతావరణ మచట లేదు. పంజాబు-నాదిర్షాలచే లోకుల కశాంతి రెచ్చెను. నే నిట్టి తఱి చట్టమును ధిక్కరించుచో నిప్పులో నేయి పోసినట్టు లగును. కావున మిత్రులు నన్ను రమ్మని కోరినను నేను పోదలఁపలేదు. ఇట్టి నిర్ణయము నాకు చేఁదు మందే. నే నిట్టులు

ప్రతిదినమును పంజాబునుండి వచ్చు దురంతము లయిన వార్తలు వినుచు, పండ్లు కొఱుకుకొనుచుఁ గూర్చుండవలసి వచ్చెను.

ఎవరి చేతులలో బొంబే క్రానికల్ పత్రిక ప్రచండశక్తిగా నేర్పడెనో అట్టి హార్నిమనుగారిని సరకారువారు ఎవరికిని దెలియకుండ దేశాంతరమునకు బంపివేసిరి. ఈ దొంగపనికి నా కింకను దుఃఖము పోలేదు. హార్నిమనుగారు లా వల దనువారు కారని నే నెఱుఁగుదును. సత్యాగ్రహ- కమిటీవారి సలహా లేకుండ పంజాబు సరకారువారి హుకుమును మీఱుట వీరి కిష్టము కాదు. సత్యాగ్రహమును నే నాఁపకముందే సత్యాగ్రహము నాఁపుఁ డని వీరు నాకు ఉత్తరము వ్రాసిరి. టపాలో రావలయుటచే ఈ యుత్తరము నా ప్రకటనకు తరువాత నా కందెను. కావున వీరిని దేశాంతరము పంపుట నా కెంత యాశ్చర్యము కలిగించెనో అంత దుఃఖము గూడఁ గలిగించెను.

ఇటు లీ ఘటన జరిగిన తరువాత బొంబే క్రానికల్ పత్రికా వ్యవస్థాపకు లీ భారమును నన్ను వహింపఁ గోరిరి. బ్రెల్వీగా రచట నుండనే యుండిరిగాన నేను చేయవలసిన దంతగా కానరాకున్నను నా స్వభావము ననుసరించి నా జవాబుదారీ యెక్కు డయ్యెడిది. కాని నా కా భార మెన్నాళ్లో లేదు. సరకారువారి పుణ్యమా యని దానిని నిషేధించిరి. పత్రిక ఆఁగిపోయెను.

క్రానికల్ పత్రికాసంచాలకు లయిన ఉమర్ . సోబానీ, శంకర్ లాల్ బాంకరుగారల చేతులలోనే యంగిండియా అను మఱియొక పత్రికయు నుండెను. వీ రీ యంగిండియా భారమును నన్ను వహింపు మనిరి. క్రానికల్ పత్రిక నడఁచివయిచిరిగావున దాని లోటు తీర్చుటకు యంగిండియాను వారమునకు రెండు మాఱులు

ప్రకటింపు మని సూచించిరి. నాకును ఇది బాగుగనే యుండెను. సత్యాగ్రహరహస్యమును లోకులకుఁ దెలుపవలయు నను నుత్సాహము నాకు మెండుగాఁ గలదు. పంజాబును గుఱించి యోగ్యమగు మాట యొకటేని వ్రాయుటకు నాకు వీలు లేకపోయెను. కాని సత్యాగ్రహరూప మగు శక్తి దీనివెనుక నున్నదని సరకారువారికి తెలియును. కావున నే నీ మిత్రుల సూచనను స్వీకరించితిని.

ఇంగ్లీషు భాషచే ప్రజాసామాన్యమునకు సత్యాగ్రహమును గూర్చి తెలుపు టెటులు? నా పనికి ఘూర్జరరాష్ట్రము ముఖ్యక్షేత్రము. అపు డిందులాల్ యాజ్ఞిక్ గారు సోబానీ బాంకరుల సమాజములో నుండిరి. ఈ మిత్రుల ధనసాహాయ్యమున వారు నవజీవన మాసపత్రికను గుజరాతుభాషలో నడపుచుండిరి. వీ రందఱును ఈ పత్రికను నా చేత నిడిరి. దీని కార్యభారమును గూడ నిందులాలు గారు వహింతు మనిరి. ఈ మాసికపత్రిక సాప్తాహికపత్రిక యాయెను.

ఇంతలో బాంబేక్రానికల్ పునరుజ్జీవిత మాయెను. కావున యంగిండియా యథాప్రకారము వారపత్రిక యాయెను. దీనిని నే నమదాబాదు తీసికొని పోయితిని. రెండు వారపత్రికలను భిన్నస్థలములలోఁ బ్రకటించుట చాల వ్యయమునకును, అసౌకర్యమునకును తావల మగును గాన నవజీవనపత్రిక లోఁగడనే అమదాబాదులో ప్రకటింపఁ బడుచుండుటచే యంగిండియాగూడ నా సూచనచే అమదాబాదునకే మార్పఁబడియెను. ఈ మార్పున కింకను గొన్ని హేతువులు కలవు. నాకు ఇండియన్ ఒపీనియను తోలాకు అనుభవము కలదు. ఇట్టి పత్రికలకు సొంత అచ్చుకూటము లుండవలయును. ఏలన, అపు డిండియాలో నమలులోనున్న అచ్చుకూటము

లకు సంబంధించిన చట్టములఁజట్టి వ్యాపారదృష్టితో అచ్చుకూటములను నడపువారు నా యుద్దేశములను యథాతథముగా ప్రకటింప సంకోచింతురు. కావున ప్రత్యేకముగా ముద్రాశాలను నెలకొలుపుటకిది ప్రబల కారణము. దీనికిని అమదావాదులోనే చాల వీలుగావున యంగిండియాను అచటికి నడపితిని.

వీని ప్రకటనమువలన ప్రజలకు సత్యాగ్రహమునుగూర్చి నా శక్తి కొలఁది తెలుప నారంభించితిని. ఈ రెండు పత్రికలకును చాల ప్రాముఖ్యము కలిగెను. ఒక్కొక్క పత్రికకు ఇంచుమించు నలుబదివేల మంది చందాదారు లుండిరి. నవజీవన పత్రికకు వడిగను, యంగిండియా పత్రికకు మెల్లఁగను అభివృద్ధి కలిగెను. నేను జైలుకు వెళ్లినపిదప చందాదారులు తగ్గఁదొడఁగిరి. నేఁడు వీరి సంఖ్య ఎనిమిది వేలకు లోఁబడియుండును.

పత్రికలలో ప్రకటనములను ముద్రింపఁగూడ దని మొదటినుండియు నాకు పట్టుదల. దాన పత్రికల కేమియు లోటు లేదు. ఇంతియకాక పత్రికలలోని విషయముల స్వాతంత్ర్యమున కిది చాల నుపకరించె నని నా యభిప్రాయము.

ఈ పత్రికలవలన నేను నాలో శాంతిఁ బడయఁగలిగితిని. ఏలనఁగా, నేను వెంటనే శాసనధిక్కారమును జేయఁజాలకున్నను నా యుద్దేశములను ప్రకటింపఁ గలిగితిని. సలహాలను, సూచనలను ఈయఁగలుగుటవలన నా కూఱట కలిగెను. ఇట్టి కఠినసమయమున ఈ రెండు పత్రికలును ప్రజలకు చక్కఁగా సేవ చేసిన వనియు, మార్షల్. లా వలనఁ గలిగిన యన్యాయమగు శిక్షను తగ్గింప శక్తి కొలఁది పని చేసెననియు నా యుద్దేశము.

# ౩౬

## పంజాబులో

'పంజాబులో జరిగినవాని కన్నిటికిని నీవే కారణ'మని సర్ మైకల్ ఓడ్వాయరుగారనిరి. మార్షల్ లాకుఁ గూడ నీవే కారణమని యనుటలోఁ గొందఱు పాంచాలయువకులు వెనుదీయ లేదు. మీరు శాసనధిక్కారమును మాత్రము కొంచెము మాఁపకుండ నుండినచో జలియన్‌వాలాబాగునందు హత్యలు జరిగియుండెడివి కావని వీరు క్రోధావేశముతోఁ బలికిరి. పంజాబులో కాలు పెట్టినచో మిమ్ము హానీచేయక విడిచిపెట్టరనియుఁ గొందఱు బెదరించిరి.

కాని నా చేసిన పని తెలివి గలవారెవరును శంకింపనంత శుద్ధముగను, ఉచితముగను ఉండెనని నా యభిప్రాయము. పంజాబులో నెపుడు దూఁకుదునా యని యనుకొనుచుంటిని. లోఁగడ నెన్నఁడును నే నచటి కేఁగకుండుటచే నచట జరిగిన విషయములను కనులారఁ గనుఁగొనుటకు మఱి కొంచెము తొందరపడితిని. నన్నచటి కాహ్వానించిన డా. సత్యపాలు, డా. కిచలూ, పండిత రామభజదత్త చౌదరీగారలపుడు కారాగారమున నుండిరి. వీరిని, ఇతరులను సరకారువారు చాలఁ గాలము కొట్టున నుంపరని నాకుఁ జాల నమ్మకము. నేను బొంబాయికి వెళ్లినపుడెల్లఁ జాలమంది పంజాబువారు నను జూడ వచ్చుచుండెడివారు. వారు నాకడ ప్రోత్సాహముఁ బడసి ప్రసన్నులయి వెళ్లుచుండెడివారు. నా కపు డాత్మవిశ్వాసము చాల మెండు.

నేను పంజాబు వెళ్లుట దూరదూరముగా పోవుచుండెను. వైస్రాయిగారు 'ఇపుడు కాదు' అని ప్రతిమాటును జరుపుచుండెడివారు.

ఇంతలో హంటర్-కమిటీ యేర్పా టాయెను. మార్షల్ లా సమయమున పంజాబు-ఆఫీసరు లనులుజరిపిన పనులనుగుఱించి యీ కమిటీవారు విచారణచేయుదు రని ప్రకటింపఁబడెను. దీనబంధు ఆంద్రూజుగా రచటికి వెళ్లియుండిరి. వారి యుత్తరములు చదువఁగా గుండె నీ రయిపోయెను. పత్రికలలో ప్రకటితములయిన విషయములకంటె ఘోరతములగు విషయములు మార్షల్ లా వలన జరిగె నని యీ యుత్తరములు ధ్వనించెను. వెంటనే వచ్చి కలిసికొను మని వీ రుత్తరము వ్రాసిరి. వెంటనే పంజాబుకు బయలుదేఱవలయునని మాళవ్యులును వ్రాసిరి. నేను మరల వైసరాయిగారికి తంతి యిచ్చితిని. మీరు ఫలానా తారీఖుకు వెళ్ల వచ్చునని జవాబు వచ్చెను. ఆ తారీఖు సరిగా గుర్తు లేదు కాని ౧౭ వ అక్టోబ రయి యుండవచ్చును.

లాహోరు చేరితిని. నాఁడు నా చూచిన దెన్నఁటికిని మఱపునఁ బడదు. ఈ మూలనుండి యా మూలకు నేల యీనినటులు జనసముద్రము పెక్కేండ్లు వియోగము పొందిన ప్రియుని గలిసికొనవచ్చినటు లిండ్లు వదలి జనము స్టేషనులో నాకొఱ కెదురుచూచుచుండిరి. లోకులు నన్నుఁ జూచి హర్షోన్మత్తు లయిరి.

పండిత రామభజదత్త చౌదరీగారి బంగళాలో నా విడిది. వారి భార్య సరళాదేవి చౌదరాణీగారిని నే నిదివఱ కెఱుఁగుదును. నా కాతిథ్య మొసఁగు భార మామెపైఁ బడెను. నే నిచట 'ఆతిథ్య మొసఁగు భారము' అని యెఱిఁగి ప్రయోగించితిని. ఏలన, నేఁటివలెనే నాఁడును నే నున్నచో టొక ధర్మసత్ర మయిపోవుచుండెను.

పాంచాలప్రధాననాయకు లందఱును చెఱఁబడుటచే పండిత మాలవీయులును, పండిత మోతీలాలుగారును, శ్రద్ధానందస్వాముల వారును వారి స్థానముల నాక్రమించిరి. మదనమోహన శ్రద్ధానంద

స్వాములతో లోఁగడ నాకు గాఢపరిచయము కలదు. మోతీలాలు గారిని బాగుగా నెఱుఁగుట కిదే మొదలు. వీరును, జైలు గౌరవముఁ బడయని అభిజననాయకులును న న్నాత్మీయునిగాఁ జేసివయిచు కొనిరి. నాకచట క్రొత్త యనిపింపలేదు.

హంటర్-కమిటీ యెదుట సాక్ష్యము చెప్పఁగూడ దని మే మందఱమును ఒక్క త్రాటిమీఁద నుంటిమి. దానికి కారణ మప్పుడు ప్రకటింపఁబడెను గాన మరల నిచట వ్రాయను. ఇంతకాలము గడచిన పిదప నొకతూరి వెనుదిరిగి చూచినను 'హంటర్-కమిటీ యెదుట సాక్ష్య మీయఁగూడదు' అను నాఁటి నిశ్చయము శుద్ధముగాను, ఉచితముగాను తోఁచుచున్న దని చెప్పినఁ జాలును.

హంటర్-కమిటీని బహిష్కరించినపిదప లోకుల తరఫున, అనఁగా కాంగ్రెసుతరఫున విచారణసంఘము ఏర్పఱుపవలయుట తర్కసిద్ధము కదా! పండిత మోతీలాల్ నెహ్రూ, స్వ. చిత్తరంజనదాస్, శ్రీ అబ్బాస్ తైయబ్జీ, శ్రీ జయకరుగారును, నేనును పండిత మదనమోహనులచే సదస్యులముగా నేర్పాటు గావింపఁబడితిమి. సాక్ష్యము తీసికొనుటకు మేము వేఱు వేఱు చోటుల కరిగితిమి. పని నేర్పాటు చేయుట సహజముగా నావంతే. మరియు చాల చోటుల విచారణ చేయుట నాపాలఁ బడుటచే పాంచాలగ్రామములను, పాంచాలురను లెస్సగా నర్థము చేసికొను నలభ్యయోగము నాకుఁ గలిగెను.

ఈ విచారణలో నాకు పాంచాలస్త్రీలతోఁగూడఁ జాలఁ బరిచితి లభించెను. యుగముల తరబడినుండి మే మొండొండ నెఱిఁగినటు లుండెను. నేను వెళ్లిన తావుల నెల్ల స్త్రీలు గుంపుగుంపులుగా వచ్చెడివారు. తాము వడికి తెచ్చిన నూలుకట్టలను

నాముందు పెట్టెడివారు. పాంచాలము ఖాదీ కొక గొప్ప క్షేత్రము కాఁగలదని నేనీ విచారణలో అనాయాసముగాఁ దెలిసికొంటిని.

లోకులకుఁ గలిగిన ఘోరకష్టములను విచారించుచుఁ బోయిన కొలఁదిని రాచవారుచేసిన అరాచకము, ఆఫీసరులు కావించిన నాదిర్షా ప్రభుత్వము మొదలగు ఘోరములను వినఁగా వినఁగా నా కాశ్చర్యమును, దుఃఖమును గలిగెను. సరకారువారి కన్ని దేశములకన్న నెక్కువమంది సైనికుల నిచ్చిన దా పాంచాలదేశము. అచటి జనమే సరకారువారిచే నిట్టి యాతన లనుభవింపవలసివచ్చెను. ఈ విషయ మప్పటికినిప్పటికి నాకు విస్మయావహముగనే యున్నది.

ఈ కమిటీ రిపోర్టు నంతయు తయారుచేయు భారముగాపై నాపైఁ బెట్టఁబడెను. పంజాబునందు జరిగిన యత్యాచారముల నెఱుఁగఁగోరినవారు తప్పక ఆ రిపోర్టును చదివితీరవలయును. ఆ రిపోర్టునం దెచ్చఁగి చేసిన యత్యుక్తి యొకటియు లే దని నేను చెప్పఁగలను. అందలి ప్రతివిషయమునకును ప్రమాణము కలదు. ఇంతియకాక ఇం దుదాహరింపఁబడిన విషయము లన్నియూ పుచ్చుకొనిన వాఙ్మూలములం దేకదేశము. శంక కిసుమంతయేని యవకాశమున్న సాక్ష్యమొకటియు నీరిపోర్టునందు ప్రకటింపఁబడలేదు. ఈరీతిగా సత్యము నెదుట నిలుపఁబెట్టుకొని వ్రాయఁబడిన యీ రిపోర్టును పాఠకుఁడు చేతఁ దీసికొనినచో బ్రిటిషువారు తమ యధికారమును నిలుపుకొనుటకొఱ కెంత దూరము పోవఁగలరో, యెట్టి యమానుష కార్యములు చేయఁగలరో తెలిసిపోవును. నాకుఁ దెలిసినంతవఱకు రిపోర్టునం దొకమాటలోనేని యసత్యగంధము లేదు.

# 3౮

## బదులుకు బదులా?

పాంచాలహత్యాకాండను కాసంతసేపు విడనాడుదముగాక !

పంజాబునందలి డైయరు పరిపాలనమును గురించి కాంగ్రెసు విచారణము జరుగుచున్నతరి నా కొక పెద్ద పిలుపు వచ్చెను. ఇందు స్వ. హకీముసాహెబు భాయి ఆసఫాలీగారల చేవ్రాలు కలవు. శ్రద్ధానందస్వాములు గూడ వచ్చెద రని యందుఁ గలదు. వా రాసభ కుపాధ్యక్షు లనుకొందును. ఖిలాఫతును గూర్చి యాలోచించుటకు హిందూముసలమానుల సంయుక్తసభ ఢిల్లీలో జరుగును గాన నేనును ఆ సభ కాహ్వానింపఁబడితిని. ఆ సభ నవంబరులో జరిగెఁ గాఁబోలును.

ఆ యుత్తరమునందు ఖిలాఫతు చర్చమాత్రము కాక గోరక్షణ చర్చగూడ జరుపఁబడు ననియు, గోరక్షణను సాధించుట కది మంచి సమయ మనియు వ్రాయఁబడెను. నా కీ వాక్యశేషము బాగుగాఁ గనఁబడలేదు. నేను వచ్చుటకు ప్రయత్నింతు ననియు, ఖిలాఫతును గోరక్షణమును కలిపి బదులుకు బదులుగా చర్చింపవల దనియు, గుణదోషములను పురస్కరించుకొని యే విషయమున కా విషయమును విడివిడిగా విచారించి దాని దాని యోగ్యత నిర్ణయింపవలసియుండుననియు ప్రత్యుత్తరము వ్రాసితిని.

నేను సభకు వెళ్లితిని. వేనవేల జనము రాలేదుగాని చాల మంది వచ్చిరి. ఆ సభకు శ్రద్ధనందస్వాములవారు విజయంచేసిరి. తొలుత వారితో నేను పై విషయమునుగురించి మాటలాడితిని. వారికి నా యభిప్రాయము రుచించెను. 'సభాముఖమున కీ విషయమును గొనిరం' డని వా రనిరి. హకీముసాహెబుతోఁగూడ మాటలాడి చూచి

తిని. గుణదోషములను పురస్కరించుకొని యీరెండు విషయములను విడి విడిగా చర్చింపఁబడవలయు నని నా యభిప్రాయము. ఖిలాఫతు విషయమునందు సత్య మున్నయెడల గవర్నమెంటువారు దాని కన్యాయ మాచరించినయెడల హిందువులు ముసలమానులకు తోడుపడవలెను. దీనికి గోరక్షణమును జోడింపరాదు. హిందువు లిందులకు షరతులు కోరుట మంచి దనిపింపదు. 'మీరు మా ఖిలాఫతుకు తోడుపడుఁడు; మేము గోవధము మానుదుము' అని ముసలమాను లనుటయు మంచి దనిపింపదు. హిందువులు తమకు పొరుగువారగుటచేతను, ఏకభూమియం దుండువార లగుటచేతను హిందువుల మనోభావముల నాదరించుటకు ముసలమానులు స్వతంత్రముగా గోవధము చేయుట మానుకొనుట మంచిది. అది వారికి కర్తవ్యము. కాని ఇది స్వతంత్రవిషయము. నిక్కముగా నిది వీరికి కర్తవ్యమాయెనేని, తా మిది తమకు కర్తవ్యమని భావింతురేని హిందువులు ఖిలాఫతువిషయమున సాయము చేసినను, చేయకపోయినను ముసలమానులకు గోవధము మాను టుచితము. ఈ రెండు విషయములను ఈరీతిగా విడి విడిగా విచారించుట యుక్తము కావున సభలో కేవలము ఖిలాఫతును గూర్చి మాటలాడుట యుచితమని నా యభిప్రాయము. సభవారికిఁగూడ నా యభిప్రాయము సంగతముగా నుండెను. సభలో గోరక్షావిషయము చర్చకు రాలేదు. అయినను మౌలానా అబ్దుల్ బారీగా రిట్టు లనిరి: 'హిందువులు ఖిలాఫతుకు సాయపడినను సాయపడకున్నను, ఏకక్షేత్రనివాసు లగుటచే హిందువుల మనఃప్రవృత్తి ననుసరించి గోవధమును మానవలయును.' ఒకానొక సమయమున గోవధ మాఁగి పోయినట్లుఁగూడఁ గానవచ్చెను.

ఖిలాఫతుతో పాంచాలవిషయమును జోడింపవలయు నని కొందఱు సూచించిరి. ఇదియును నాకు గిట్టలేదు. ఈ పాంచాల

విషయము స్థానికము. పాంచాలమునకు మహాదుఃఖ మొదవె నని సామ్రాజ్యమునకు సంబంధించిన కాంతిశ్శత్నవమునుండి పాంచాలమును విడిగా నుంచుటకు వీలులేదు. సంధిషరతులనుండి యుద్భవించిన ఖిలాఫతు విషయముతో దీనిని జతపఱచుట యవివేకము నారోపించు కొనుటయే యగు నని నాయభిప్రాయము. ఇది యందఱకును సమ్మతి మాయెను.

ఆ సభలో మౌలానా హజరత్ మోహానీగా రుండిరి. నే నిదివఱకే వీరి నెఱుఁగుదును గాని వీ రింత యోద్ధ లని అదివఱ కెఱుఁగను. మా కిరువురకును చాల విషయములలో మత భేదము కలదు. అది యిదివఱకును అటులే యుండెను.

సభలో జరిగిన అనేక ప్రస్తావములలో హిందువులు, ముసలమానులు అందఱును స్వదేశీవ్రత మవలంబింపవలయు ననియు, అందులకుఁగాను విదేశవస్త్రములను బహిష్కరింపవలయు ననియు నొక ప్రస్తావము తీర్మానమునకు వచ్చెను. నాఁటివఱకును ఖాదీకి పునర్జన్మము కలుగలేదు. ఈ ప్రస్తావము హజరత్ సాహె బంగీకరించునది కాదు. ఆంగ్లసామ్రాజ్యము ఖిలాఫతునకు న్యాయము కలిగింపని యెడల పగ దీర్చుకొనవలయు నని వారి యభిప్రాయము. కావున వారు ఈ ప్రతిపాదనమున కెదురుగా 'బ్రిటిషువస్తుమాత్రమును యథాసంభవముగా బహిష్కరింప వలయు'నని వాదించిరి. బ్రిటిషువస్తుమాత్రమును బహిష్కరించుట అశక్యమనియు, నయోగ్యమనియు చాల హేతువులు నే నపుడు చెప్పితిని. ఇపు డా హేతువు లందఱకును దెలియును. నేను నా యహింసావిషయమును గూడ సభవారియెదుటఁ బెట్టితిని. నా వాదప్రభావము సభవారిమీఁద బ్రసరించినటులు కనుగొంటిని. హజరత్ మోహానీగారి యుపన్యాసము నాలకించి సభవారు

హర్షనాదము లొనరించిరి గాన నా తూతూ ఎవరికిని వినిపింప దనుకొంటిని. అయినను నాధర్మమును నేను జేసికొనవలయు ననియు, నా యభిప్రాయముల నేల దాఁచిపెట్టవలయు ననియు నేను లేచి మాటలాడుటకు సాహసించితిని. సభ్యులు నా మాటలను చెవి యొగ్గి వినిరి. ప్లాట్ఫారముమీఁది కొకరితరువాత నొకరుగా పలువురు వచ్చి నా యభిప్రాయమును సంపూర్ణముగా సమర్థించిరి. బ్రిటిషు వస్తుమాత్ర బహిష్కారమును తీరుమానించుచో కొంచె మయినను ప్రయోజనము కలుగకపోఁగా నగుబాటగు నని నాయకులకు తెలిసి పోయెను. ఆ సభయంతటిలో ఏదో సీమవస్తువు లేని మనుజుఁ డొకఁడును లేఁడు. ప్రతిపాదకులే యనుష్ఠింపఁజాలని విషయములు కల యీ తీరుమానమువలన చెఱుపేకాని మేలు లేదని ఆ సభలో పలువురు కనుఁగొనిరి.

'మేము మీ విదేశవస్త్ర బహిష్కారమువలన సంతోషించుచు కూరుచుండఁజాలము. మనము మన వస్త్రముల నన్నిటిని ఎపుడు వడికి నేసికొనఁగలము? ఇఁక విదేశవస్త్రబహిష్కార మెపుడు చేయఁగలము? సీమవారికి కాఁక పుట్టించు వస్తు వొకటి మనకుఁ గావలయును. మీ వస్త్రబహిష్కారముతో మాకు జగడము లేదు గాని దానితోపాటు కాఁక కలిగించు చుఱుకువస్తువు దేనినయినను మాకు పడవేయుఁడు!' అని మౌలానాగా రనిరి. 'క్రొత్త వస్తు విం కొకటి వలయు' నని నాకుఁ గూడఁ దోఁచెను. విదేశవస్త్ర బహిష్కారము వడిగా ఫలింపదని నా కపుడు తెలి యును. అచ్చుఖాదీని తయారుచేసికొనఁగల శక్తి మనలో నున్న దని తరువాతఁ దరువాత నాకుఁ దెలిసెను గాని అపుడు తెలియు లేదు. సీమబట్టలను ముట్టకుండుటకు కేవలము మిల్లులను నమ్ముకొనినచో దగా పడుదు మనియు నాకుఁ దెలియును. మౌలానాసాహెబు తన

ఉపన్యాసము ముగించునంతలో ప్రత్యుత్తర మొసఁగుటకు నేను తయారుగా నుంటిని.

ఈ క్రొత్త వస్తువులు దెలుపుటకు నాకు ఉరదూమాట గాని, హిందీమాటగాని దొరకలేదు. ఇట్టి శుద్ధముసలమాను సభలో యుక్తిప్రధానముగ నుపన్యాస మొసఁగుట నా కిదియ మొదలు. కలకత్తాలో జరిగిన ముస్లింలీగులో నేను కొంచెము ఉపన్యసించితిని గాని యది కొలఁది నిముసములే. మరియు నుపన్యాసమునందలి విషయము సభ్యుల హృదయములకు తన్మయత కలిగింపవలసినదే కాని యుక్తిప్రధానము కాదు. మరియు, నిచటి సభ్యులు నాకు విరోధులు కాకున్నను వీరి మతమును, నా మతమును భిన్నము. ఢిల్లీ ముసలమానులకడ శుద్ధముగను, సలక్షణముగను నగు ఉరదులో నుపన్యసింపఁ జాలను గాని వచ్చియు రాని హిందీలో నా యభిప్రాయమును వారికిఁ దెలుపఁగలిగినఁ జాలును. ఈ రీతిగా నా పనిని నేను నెఱవేర్చుకొంటిని. 'హిందీ - ఉరదు' భాష రాష్ట్రభాష యగుట కర్హమయిన దనుటకీసభయే ప్రత్యక్షప్రమాణము. నే నింగ్లీషులో నుపన్యసించినచో నా యభిప్రాయమును ఇప్పటివలె వారి మనస్సులకు పట్టింపగలిగి యుండెడివాఁడను గాను. మరియు మౌలానాసాహెబు చేసిన పూర్వపక్షమునకును అది తగి యయ్యెడిది కాదు. ఒకవేళ అయినను దానికి సమర్థమయిన సమాధానము నాకడనుండి వచ్చియుండెడిది కాదు.

తుద కెటులో చెప్పఁగలిగితినిగాని మొదట నా యీ క్రొత్తవస్తువును దెలుపుట కురదుమాటగాని, హిందీమాటగాని తట్టక పోవుట నాకు లోటుగా నుండెను. నాకు 'నాన్-కో-ఆపరేషన్' అను మాట దొరకెను. మౌలానాగా రుపన్యసించుచుండఁగా నా

కిటులని తోఁచెను: 'ఒకటి గాదు-రెండు గాదు: అనేక విషయములలో తాము గవర్నమెంటుకు సాయపడుచున్నారు. అట్టి గవర్నమెంటును బలవత్తరముగా నిరోధింపవలయు నని చెప్పుట వ్యర్థము. పోనీ కత్తి గట్టుద మందమా, కాని పని. కావున సాయము చేయకుండుటయే సరి యయిన నిరోధము' ఈరీతి గానే నా సభలో నాన్-కో-ఆపరేషన్ అను మాటను మొదటి మాటు వాడితిని. నా యుపన్యాసమున దీనిని సమర్థింపఁ దగిన యుక్తులను సభవారి మది కెక్కించితిని. ఈ మాట యెన్ని యర్థముల కాకరమో అపుడు నాకుఁ దెలియదు. కావున నేను దాని తపిసీలులోనికి దిగలేదు. నే నిటులు చెప్పినటులు గుర్తు:

ముసలమానులు ఒక గొప్ప విషయమును తీర్మానించుచున్నారు. వారికి సంధిషరతులు అనుకూలము కానిచో సర్కారు వారికి సాయ మాఁపివేసెదరు. ఇది ప్రజల హక్కు. సరకారువారి బిరుదులు మే ముంచుకొనము. వారి నౌకరి నిఁక మేము చేయము. ఖిలాఫతువంటి ఆవశ్యకమగు ధర్మవిషయమును సరకారువారు వ్యర్థపుచ్చుచో మే మిఁక వారి కెటులు సాయపడఁగలము? ఖిలాఫతు నెగురఁగొట్టుచో సాయము చేయకుండుట మా హక్కు.'

పిదపఁ గొన్ని నెలలవఱకును ఈ క్రొత్తవస్తువు ప్రచారములోనికి రాలేదు. కొన్ని నెలలవఱకు ఈ శబ్ద మీ సభలో నడఁగి యుండెను. ఒక నెలపిదప అమృతసరమున కాంగ్రెసు జరిగెను. నే నపుడు సహాకారము చేయవలయు నను తీరుమాన మామోదించితిని. హిందూ ముసలమానుల కెన్నఁడును ఆ సహాకారమున కక్కఱ గలుగు నని నే నపు డనుకొనలేదు.

## ౩౮

# అమృతసరపు కాంగ్రెసు

మార్షలు లా అమలులో నున్నపుడు పేరునకు మాత్రము సాక్ష్యము పుచ్చుకొని, నామమాత్రమునకు కోర్టులనువానిలో విచారించి వందలకొలఁది పంజాబువారిని నెలల తరబడి, యేండ్లతరబడి కైదులోఁ బెట్టిరి. ఈ దురన్యాయమునకు నలువైపులను హాహాకారములు బయలుదేఱుటచే సరకారువారు వారి నెంత కాలమో కైదులో నుంపఁజాలక పోయిరి. కాంగ్రెసు ప్రారంభము గాకముందే పలువురు విడుదల గావింపఁ బడిరి. హరికిషన్‌లాలుగారు మొదలగువారు ముందు వదలిపెట్టఁబడిరి. పిమ్మట కాంగ్రెసు నడుమ, అలీసోదరులు విడువఁబడి సూటిగా కాంగ్రెసునకు వచ్చిరి. నాఁడు లోకుల సంతోషమునకు మితి లేదు. తన ప్రాక్టీసు నంతయు త్యజించి పాంచాలమున బసపెట్టిన మోతీలాలు నెహ్రూగారపుడు కాంగ్రెసునకు అధ్యక్షులు. శ్రద్ధానందస్వాములవారు స్వాగతసభ కధ్యక్షులు.

హిందీభాషలో నొక చిన్న యుపన్యాస మిచ్చి హిందీ భాషకు వకాలతునామా పుచ్చుకొనుటయు, ఉపన్యాసమున వలస పోయిన హిందువుల స్థితిగతులనుగుఱించి చెప్పుటయుమాత్రమే ఇంతవఱకును కాంగ్రెసులో నాకుఁ గల పని. ఈ సంవత్సరమునఁ గూడ నింక కెక్కువ పని యుండ దని తలఁచితిని. కాని వెనుక పలుమాఱులు జరగిన చందముగనే ఈమాఱును కొంత కార్యభారము నామీఁద పడెను.

క్రొత్త సంస్కరణములను గుఱించి చక్రవర్తిగారి ఫర్మానా జారీ యాయెను. దానివలన నెవరికిని సంతుష్టికలుగలేదు. నాకుఁగూడ సంపూర్ణముగా సంతుష్టి కలుఁగలేదు. సదరు ఫర్మానాలో సూచింపఁ

బడిన సంస్కరణములలో లోపము లున్నను స్వీకరింపఁదగు నని అపుడు నాకుఁ దోఁచెను. చక్రవర్తిగారి ఫర్మానాలో లార్డు సింహా గారి సంతకము గూడ నుండుటచే ఆ సమయమున ఆ భావలో నా కాశాకిరణము కానిపించెను. కాని అనుభవశాలు లగు లోకమాన్యులు, చిత్తరంజనదాసులు మొదలగు పెద్దలు పెదవి విఱిచిరి. భారతభూషణము మదనమోహనులు మధ్యస్థులుగా నుండిరి.

మదనమోహనులు నన్ను తమ డేరాలో నుంచుకొనిరి. కాశీ విశ్వవిద్యాలయశంకుస్థాపనమున కేఁగినపుడు నేను వారి నిరాడంబర జీవితము నెఱిఁగియుంటిని గాని నే నిపుడు వారి సొంత డేరాలోనే యుండుటవలన వారి దిన చర్యలో ప్రతివిషయమును చూచి యానందాశ్చర్యముల నొందితిని. వా రున్న తావు పేదలకొల్ల సత్రము. దానిలో దారి దొరకదు. ఎటుఁ జూచినను మనుష్యులే. ఇందు వైశాల్యము లేదు; ఏకాంతమును లేదు. ఎవఁడే సమయమున నెంతసేపు మాటలాడఁ దలఁచికొనినను నచట లోటు లేదు. ఇట్టి వీరి యీ గదిలో నా దర్బారు—అనఁగా మంచము.

ఈ ప్రకరణము మాలవ్యుల జీవితపద్ధతిని వర్ణించుటలో వ్యయింపక ప్రకృత మనుసరింతును.

మాలవ్యులతో ప్రకృతస్థితిగతులగుఱించి మాటలాడుచుంటిని. అన్నగారి వలె వారు నా కన్ని పక్షములవారి యభిప్రాయములను దెలుపుచుండిరి. సంస్కరణముల గుఱించిన చర్చలలో నేనును భాగస్వామిని గావలయు నని తలఁచితిని. పాంచాలహత్యాకాండను గుఱించిన విచారణసంఘమున నాకు పా లుండెను. తత్సంబంధమున సరకారువారితో పని యున్నది. మఱియు, ఖిలాఫతు మాట యొకటి. మి. మాంటేగు హిందూదేశమునకు మిత్రమనియు భారతీయులకు దగాచేయఁ డనియు నా యభిప్రాయము. అలీసోదరుల విడుదల గూడ శుభచిహ్న మనుకొంటిని. ఇట్టి స్థితిలో సంస్కరణముల స్వీకరించుట మంచి దని తోఁచెను. సంస్కరణములు చాల నసంతోషకారకము లను, అఱగొఱలును గావున వానిని స్వీకరింపరా దని చిత్తరంజన

దాసుగారి యభిప్రాయము. లోకమాన్యులు కొంచెము తటస్థులయి యుండిరిగాని దేశబంధువు పక్షమునే సమర్థింపఁ దలఁచికొనిరి.

ముక్కాఁకలు తీఱిన యీ లోకనాయకులతో నా మతము వేఱుపడుట నాకుఁ గష్టమనిపించెను. ఇది యిట్లుండఁగా నా యంతర్వాణి నాకు విస్పష్టముగా వినఁబడుచుండెను. కాంగ్రెసు నుండి తప్పించుకొనిపోవఁ బ్రయత్నించితిని. నేను గైరుహాజరగు నెడల నన్ని కార్యములును చక్కఁబడు ననియు, గొప్పగొప్ప నాయకులకును నాకును మతభేదము లేకుండ బ్రతికిపోవుదు ననియును పండిత మోతీలాలుగారికిని మదనమోహనులకును దెలిపితిని.

ఈ పూజ్యపాదులకు నా మాట యిష్టము కాలేదు. ఎవరో యీ మాటను వారి కిషన్‌లాలుగారి చెవిలో నూఁదిరి. 'అట్లు లెప్పుడును జరుగఁగూడదు. ఇది పాంచాలురకుఁ జాలఁ గష్టము కలిగించును' అని వా రనిరి. లోకమాన్యులతోడను దేశబంధులతోడను జిన్నాగారితోడను సంప్రతించితిని. ఎంతయాలోచించినను దారి కానరాలేదు. నా వేదన యంతయు మాలవ్యాగారితో నిట్లు వెళ్ళఁబోసికొంటిని: 'మాకు సమాధానము కుదురునట్లు లేదు. నా ప్రస్తావమును తీర్మానమునకుఁ బెట్టుచో వోట్లు తీసికొనవలసి వచ్చును. దానికి వీలు కానఁబడదు. ఇంతవఱకును వోట్లు తీసికొనుటకు చేతు లెత్తించుచున్నారు. చేతు లెత్తునప్పుడు ప్రేక్షకులయు సభ్యులయు భేదము లేకుండఁ బోవుచున్నది. ఇంత పెద్ద సభలో నిక్కచ్చిగా వోట్లు పరిగణించుటకు సౌకర్యము లేదుగాన నేను నా పక్షమునకు వోట్లు కోరినను దానికి వీలు పొసఁగట్టదు.'

కాని లాలా హరికిషన్‌లాలుగారు దీనికి వీలు కలిగింప నేర్పాటుచేసిరి. 'వోట్లు తీసికొను నాఁడు ప్రతినిధులనేగాని ప్రేక్షకులను రానీయము. వోట్ల భారము నాది. అంతియె కాని, మీ రేమి! గైరుహాజరేమి?' అని హరికిషనుగా రనిరి.

తుద కొప్పింపఁబడితిని. తీర్మానమును వ్రాసితిని. కడు సంకోచముతో బ్రతిపాదింప నంగీకరించితిని. జిన్నా మాళవ్యులు

సమర్థకులు. నేను ప్రతిపాదించితిని. మాకుఁ గల మతభేదమునం దినుమంతయును టు్వ్యము చేయుచున్నను, మా యుపన్యాసములం దని యుక్తితర్క మతి యేమియును లేకపోయినను సభ్యు లింతవఱకు మతభేదమునుగూడ సహింపకపోయిరి. వారికి కష్టము కలిగెను. సభ నైకమత్య మిష్టము.

ఒక వైపున నుపన్యాసములు జరుగుచుండెను. ఒక ప్రక్క వేదికమీఁద రాజీప్రయత్నములు జరుగుచుండెను. ఒకరికొకరునుండి మఱియొకరి కడకు చీటులు నడచుచుండెను. మాలవ్యాగారు రాజీచేయుటకు సకలబాధలు పడుచుండిరి. ఇంతలో జయరామ దాసుగారు నా చేతిలో తమ చీటి నుంచి యీ సంకటమునుండి ప్రతి నిధులను తప్పించుటకు మిగుల మధురములగు శబ్దములతో నన్ను శోధించిరి. వారి తీరుమానమున నొకటి చేర్పవలయు నని చెప్పిన సూచన నాకు బాగుగఁ గానిపించెను. మాలవ్యాగా రదివఱకే నలు వైపులను సంధి కాశించుచుండిరి. 'జయరామదాసుగారు చేసిన సూచన యిరువాగుల వారికిని నుపాదేయముగాఁ గానిపించుచున్నది.' అని నే నంటిని. లోకమాన్యులకు దానిని జూపితిని. 'దాసు గారి కొప్పుదల యగుచో నాకును ఆపత్తి లేదు' అని వా రనిరి. తుదకు దేశ బంధులును మెత్తఁబడి విపినచంద్రపాలుగారి దెసఁ జూచిరి. మాలవ్యు లకు ధైర్యము కలిగెను. వా రా చీటిని చేతికిఁగొని దాసుగారి మోము నుండి 'సరే' అను మాట రాకమునుపే 'సభ్యులారా! తమ కింక సంతస మొందఁగలదు; సమాధానము కుదిరెను' అని చెప్పివేసిరి. ఇకఁ జెప్పున దేమి! కరతాళధ్వనులతో సభామంటప మంతయు మ్రోఁగిపోయెను. గంభీరములగు మోము లన్నియు సంతోషముతో ప్రజ్వలించెను.

ఆ తీర్మానమును సవరణను ఇచటఁ జర్చింపఁ బని లేదు. ఏలనఁగా, నీ తీర్మాన మెటులాయెనో చెప్పుటయే నా శోధనములకు విషయము.

ఈ సమాధానమువలన నా జవాబుదారి యెక్కుడాయెను.

# ౩౭

## కాంగ్రెసుతో సాక్షాత్సంబంధము

అమృతసరమున కాంగ్రెసు - వ్యవహారములం జూచినంత మాత్రమున మహాసభతో నాకు సాక్షాత్సంబంధము కలిగిన దని నే నుద్దేశింపలేను. లోగడ నేను కాంగ్రెసునకు వెళ్లుట నాకుఁ గల భక్తిని దానియందు దాఖలుచేసికొనుటకే. చిన్నచిన్న పనులు తక్క పెద్ద పను లేవియు నాకు అం దున్నటు లెన్నఁడును గోచరింపనూ లేదు. నేను 'కోరనూ' లేను.

నాకుఁ గల రెండు శక్తులు కాంగ్రెసునకు ఉపయోగించు నని అమృతసరమున నా కనుభవ మాయెను. పాంచాలవిచారణసంఘము నందు నా చేసిన పని లోకమాన్యులకును మదనమోహనులకును మోతీలాలు గారికిని దేశబంధువులకును, సంతోషము కలిగించె నని నే నెఱిఁగితిని. సలహాలకును సంప్రతింపులకును తమ యాంతరంగిక సభల లోనికి వీరు నన్నుఁ బిలువ నంపుచుండెడివారు. సరియగు విషయ నిర్ధారణ మిచటనే జరుగుచుండెడిది. కేవలము విషయముల నిర్ధారించు వారే యచట సమకూడెడివారు. నాయకుల విశ్వాసమునకుఁ దగిన వారే యచటికి రాఁగలవా రయినను చాటుమాటుగా పైవారుఁ గూడఁ గొందఱు దూఱకుండుట లేదు.

రాఁబోవు సంవత్సరమునఁ జేయవలసిన పనులు రెండు గలవు. అందులకు నాకుఁ గొంత సామర్థ్యము గలదు; చేయవలయు నను ఉద్దేశమును గలదు.

జలియన్‌వాలాబాగులో జరిగిన హత్యలను గుర్తుతెచ్చుట కొక చిహ్నమును నెలకొలుపుట యీ పనులలో నొకటి. కాంగ్రెసంతయు

# ౩౮ కాంగ్రెసుతో సాక్షాత్సంబంధము

యేర్పాటుగాని రాఁబోవు విషయములను విచారించు నేర్పాటుగాని నాఁటికి లేదు. దీనికి మంత్రులు మూవురు. కాని నిక్కమున నొక్కఁడే. అతఁ డయినను ముప్పొద్దులు పనిచేయ గలవాఁడు కాఁడు. ఈ యొకఁడే కాంగ్రెసు-ఆఫీసు నెటులు నడపును? భవిష్యద్విషయముల నెటు లాలోచించును? భూతకాలమునఁ దలపెట్టిన కార్యముల నెటులు నిర్వహించును? కావున నా యేఁడు అన్నిటికంటె నీ విషయము నాలోచించుటయే ఆవశ్యక మాయెను. కాంగ్రెసులో వేనవేల జనము. అందు ప్రజాకార్య మెటులు సాగును? ప్రతినిధుల సంఖ్యకు హద్దు లేదు. ప్రతిప్రాంతమునుండియు ఇందఱు ప్రతినిధులు రావలయు నను నియతి లేదు. మఱియు అందఱును ప్రతినిధులే కావచ్చును. కావున దీని కొక యేర్పాటు ఉండి తీరవలయు నని అందఱకును తోఁచెను. నే నొక షరతుతో ఈ యేర్పాటు చేయుటకు పూఁటపడితిని. జనములో పలుకుబడి గల మహానాయకు లిరువు రని నే నెఱుఁగుదును. ఈ కాంగ్రెసు-కార్యప్రణాళికను కూర్చుటలో జనులకు ప్రతినిధులుగా నాకు సాయము చేయుఁడని వా రిరువురిని నేను కోరితిని. కాని వా రిరువురికిని యీ విధానమును తయారు చేయుటకు తీరిక యుండ దని నాకుఁ దెలిసెను. దానఁ జేసి 'తమకు విశ్వాసపాత్రములగు నిరువురను నాకు తోడొసఁగుఁ'డని లోకమాన్యులను దేశబంధువులను యాచించితిని. ఈ కార్యప్రణాళి-సమితిలో వీరికంటె పైవా రెవరును ఉండఁగూడ దని సూచించితిని. నా సూచన యంగీకృత మాయెను. లోకమాన్యులు శ్రీ కేల్కర్ గారి పేరు చెప్పిరి. దేశబంధులు శ్రీ ఐ. బి. సేన్ గారి పేరు చెప్పిరి. ఈ మూవురును ఒక నాఁడైని కలిసి కూర్చుండలేదు. మేము టపాలో పరస్పరాభిప్రాయము లెఱిఁగికొంటిమి. తుదకు సమరసముగ నభిప్రాయముతో రిపోర్టు తయారుచేసితిమి. దీనిగుఱించి నే నొకమాట చెప్పుదును—'ఈ విధానము చొప్పున పని చేసికొనుచుఁ బోయినఁ జాలును; స్వరాజ్యము సిద్ధించును.' ఈ జవాబుదారీని నెత్తిమీఁదఁ బెట్టుకొనిన పిదపనే కాంగ్రెసుతో నాకు నిక్కమగు సంబంధము కలిగె నని నా యుద్దేశము.

## ఖాదీ పుట్టుక

౧౯౦౮ సాలువఱకు రాటమునుగాని, మగ్గమునుగాని నే నెఱుఁగను. అయినను రాటముచే హిందూదేశపు బీదతనము పోవునని నేను హింద్-స్వరాజ్యమున వ్రాసియుంటిని. హిందూ దేశమున పలువురు కడుపుకూటికి లేక చచ్చిపోవుచున్నారు. ఇట్లు చావకుండఁ జేయుట కే యుపాయము దొరకునో ఆ యుపాయమే స్వరాజ్యమునకుఁ గూడఁ ద్రోవ జూపు నను మాట యందఱకుఁ దెలిసినదే యని నేనా పుస్తకమున వ్రాసియుంటిని. ౧౯౧౫ సంవత్సరమున దక్షిణ-ఆఫ్రికా నుండి నేను ఇండియాకు వచ్చినపుడుగూడ రాటమును జూచి యెఱుఁగను. సత్యాగ్రహాశ్రమమును ఏర్పాటుచేసిన తరువాత నచటఁ గొన్ని మగ్గములు పెట్టితిమి. మగ్గములు పెట్టుటకుఁ గూడ మాకుఁ గడుఁ గష్టమాయెను. మే మందఱ మిట్టి పనుల కపరిచితులము. మాకు మగ్గము నడపుట సాగలేదు. మే మందఱమును వ్రాఁతవారమును, కోఁతవారమును గాని మగ్గముమీఁద చేయివేసి యెఱుఁగము. చేతిపనులు మా యెఱిఁగినవి కావు. కావున మగ్గమున్నను నేత నేర్పుటకు ఒకఁడు కావలసివచ్చెను. కాఠియావాడు పాలనపురములలో మగ్గములును, నేఁత నేర్పువాఁడును దొరికెను. ఆ నేఁతకాఁడు తన విద్య నంతయు మాకు నేర్పలేదు. కాని మొదలు పెట్టిన పనిని మగన్‌లాలు మానెడివాఁడు కాఁడు. పనివానితన మతనిసొమ్ము. కావున నేఁతలో నతఁడు నేర్పరియై ఆశ్రమమునం దందఱకును నొకని తరువాత నొకనికి నేఁత నేర్పివైచెను.

మా వస్త్రములను మేము నేసికొనవలయు నని మా యూహ. కాన నాఁటినుండియు బొమ్మ బట్టలను విసర్జించితిమి. ఇండియా

మిల్లులలో తయా రయిన నూలితో నేసిన వస్త్రములనే కట్టుకొన వలయు నని నిశ్చయించితిమి. దీనితో మాకు కావలసినన్ని సంగతులు తెలిసెను. సాలెవారి జీవనము, వారు నేయు వస్త్రముల మొత్తము, నూలు కొనుటలోఁ గల యిబ్బందులు, అందలి మోసము, తుదకు వారి యప్పు సొప్పులు ఈ మొదలగున వన్నియు మాకుఁ దెలిసిపోయెను. ఇట్టి స్థితిలో ఇంత వడిగా మాకుఁ గావలయు వస్త్రము లన్నియు మేము నేసికొనలేము. కావున సాలెవారికడ మా వస్త్రములఁ గొనవలయును. కాని ఇండియామిల్లు నూలితోడనే నేయఁబడిన వస్త్రములు బట్టలవర్తకులకడఁ గాని, సాలెవారికడఁ గాని దొరకవు. సాలెవారికడ నున్న సన్నబట్ట యంతయు సీమనూలే. ఇండియా మిల్లులు సన్న నూలు తయారు చేయలేవు. నేఁటికిని అవి తయారు చేయు సన్ననూలు కడుఁ గొలఁది. మఱీ సన్ననూ లవి తయారు చేయనే లేవు. మేము ప్రయత్నము చేయఁగాఁ జేయఁగా తాము నేసిన వస్త్రముల నన్నిఁటిని గొనినచో స్వదేశపు నూలితో నేసి పెట్టుదు మని కొంద అంగీకరించిరి. ఈరీతిగా ఇండియామిల్లునూలితో నేయఁబడిన వస్త్రములు మే మేర్పాటు చేసికొంటిమి. మా మిత్రులలోఁ గూడఁ బ్రచారము చేసితిమి. మే మీ రీతి నలవోకగా నూలు మిల్లుల కేజెంటుల మయితిమి. ఈ పరిచయమువలన వారి కార్యపద్ధతియు, వారు చేయు మోసము వగైరాలు మాకుఁ దెలియనాయెను. తామే వడికి తామే నేసి యీవలయు నని మిల్లువారి యుద్దేశము. చేమగ్గములవారికి వా రొనరించు సాయ మనిచ్ఛాపూర్వకము గాని యిచ్ఛాపూర్వకముఁ గాదు.

ఇది యెల్లయుఁ జూడఁగా మన నూలు మనమే వడుకుకొంద మనిపించెను. మనము వడుకుకొననంతవఱకును పరాధీనత తప్పదనుకొంటిమి. ఇండియామిల్లుల కేజెంట్ల మయి దేశసేవ చేయఁ గలుగుదు మనుకొన లేదు.

మాకు రాటము దొరకలేదు; రాటము త్రిప్పఁగలవాఁడును దొరకలేదు. పంటెలకును, కండెలకును మాకడ చక్రములు కలవుగాని వానిమీఁద దారము తీయుటకు వీలు కలదని మాకు తెలియదు. ఒకతూరి వకీలు కాళిదాసుగారు రాటముమీఁద దారము తీయఁగల యామె నొకతెను దీసికొని వచ్చి—'ఈమె మీకు నేర్పఁగల' దని చెప్పెను. క్రొత్త సంగతులను నేర్చికొనుటలో నేర్పరి యగు నొకనిని మా యాశ్రమమునుండి యామెకడ కంపితిమి గాని యతఁడును ఆ కళారహస్య మెఱుఁగఁజాలకయే వచ్చెను.

కాలము గడచిన కొలఁది నా కాతురత హెచ్చెను. ఆశ్రమమునకు వచ్చిన ప్రతివానితోడను నే నీ సంగతిని గోల పెట్టుచుంటిని గాని యేమి లాభము? ఏలన, వడుకుట ఆఁడువారి కిజారా. కావున ఆఁడువారే అట్టి యాఁడువారిని కనిపట్టవలయును.

౧౯౧౭ సాలున గుజరాతువారు నన్ను శిక్షా పరిషత్తున కధ్యక్షునిగా బ్రోచికి * తీసికొనిపోయిరి. అచట గంగాబాయి యను నామె నాకుఁ గానిపించెను. ఆమె తలచెడ్డది; చెడ్డసాహసము కలది. ఆమె వ్రాఁత కోఁత లెఱుఁగదు. వ్రాఁత కోఁతలు వచ్చిన యాఁడువారలెవ్వరికిని ఆమెసాహసము లేదు. ఆమె యస్పృశ్యతను దాఁటెను. ఆమె నిర్భయముగా నంత్యజులలోఁ గలసి మెలసి వారికి సేవ యొనర్చును. ఆమె ధనవతి. అయినను ఆమెకు కోరికలు తక్కువ. ఈమెశరీరము బలిష్ఠము. ఈమె ముక్కాఁకలఁ దిరిగినది; నదురుబెదురు లేక యెటకేని ఒంటరిగా వెళ్లఁగలదు. ఆమె గుఱ్ఱపు సవారు చేయఁగలదు. గోధరాలో నా కీమెతో నెక్కువ పరిచితి యొదవెను. నేను నా రాటపు సొద నామెకడ వెళ్లఁబోసికొంటిని. దమయంతి నలుని వెతకఁ బోయినటులు రాటమును వెదకఁబోవుదు నని చెప్పి యామె నా బరువు తగ్గించెను.

* భరుకచ్ఛము.

# ౪౦

## దొరకెను

గంగాబాయి గుజరా తంతయుఁ దిరిగి తిరిగి పిదప బడోదా రాజ్యమునందలి బీజాపురమను గ్రామమున రాటమును గనుఁగొనెను. అచటఁ జాల యిండ్లలో రాటము లున్నవిగాని యవి యట కలపయికిని, గోడలపయికిని ఎక్కియుండెను. అయినను ఏకు లిచ్చుట, తీసిన నూలంతయుఁ గొనుట: ఈ రెండు నియమము లున్నయెడల రాటముమీఁద దారము తీయుటకు అచటివారు సంసిద్ధులయి యుండిరి. గంగాబాయి నా కిటులు వార్త యంపఁగనే నా సంతోషమునకు మేర లేకపోయెను. ఏకులు చేయించుట కష్టమాయెను. స్వ. భాయి ఉమర్ సోబానీగారికీ సంగతి తెలుపఁగా వారు తమ మిల్లునుండి యేకుల కట్టలను పంపుటకు పూనుకొనిరి. నే నీ యేకులను గంగాబాయికిఁ బంపితిని. నాఁటనుండి మేము నేయఁ జాల నన్ని నూలుకట్టలు వచ్చి పడుచుండెను.

భాయి ఉమర్ సోబానీగా రుదారతతో పంపుచుండిరిగదా యని మన మూరక పుచ్చుకొనుచుండుటయేనా? దాని కొక మితి లేదా? పోనీ, వెల యిచ్చి పుచ్చికొందమన్న నాకు మనస్కరింపలేదు. మిల్లు-ఏకులు కొని నూలు తీయించుట నాకు దోష మని తోఁచెను. మిల్లు-ఏకులు కొనినచో నిఁక మిల్లునూలుమాత్ర మేల కొనరాదు? ప్రాచీనులకు మిల్లు లేకులు చేసి పెట్టినవా? కానిచో వా రేకు లెటులు చేయించుకొనిరి? ఇటు లాలోచించి దూదేకువా రెవరేని యేకులు చేసి యిత్తురేమో కనుఁగొను మని గంగాబాయికిఁ జెప్పితిని. ఆమె యంగీకరించెను. ఆమె దూదేకులవాని నొకనిఁ బట్టుకొనెను. అతఁడు నెలకు ముప్పదియయిదు రూకలడిగెను. అదియంతగా నెక్కువ కాదు.

అపుడు నేను వెలకు లెక్క చేయలేదు. ఏకినదూదితో నీమె బాలుర కేకులు చేయుట నేర్పెను. నేను దూదిబిచ్చమునకు బయలు దేఱితిని. భాయి యశవంత ప్రసాదదేశాయి దూదిని పంపు భారమును వహించెను. గంగాబాయి బూనిన యీపని యిట్లు లత్యంతము వృద్ధి చెందెను. బీజాపూరునందు వడికిన నూలు నేయించుటకు గంగాబాయి నేతగాండ్రను సంపాదించెను. ఇటులు బీజాపూరు — ఖాదీ పేరు మోఁగెను.

ఇటులు బీజాపూరులో ఖాదీ వృద్ధియగుచుండఁగా మా యాశ్రమములో రాటము నెలకొనుట కాలస్యము కాలేదు. మగన్‌లాల్ గాంధీ తన నేరుపుచే రాటమునకు కొన్ని సంస్కరణము లొనగూర్చెను. ఆశ్రమమునందే రాటములును, తకిలీలును తయారు కాఁజొచ్చెను. ఆశ్రమమున నేసిన ఖాదీగుడ్డ గజము వెల రు. ౧-౧-౦ ఆయెను నే నీ మోటు ఖాదీని నా మిత్రుల కిచ్చి గజము ౧-కి రు. ౧-౧-౦ వసూలు చేసితిని. వారు సంతోషముతో నొసఁగిరి.

నేను బొంబాయిలో మంచము పట్టియుంటిని. అయినను నా భోగట్టా నేను మానలేదు. అచట నూలు వడుకు ఆఁడువా రిరువురు దొరకిరి. వారు ఇరువది యొనిమిది తులముల సేరు నూలున కొక రూక పుచ్చుకొనిరి. నే నప్పటికి ఖాదీశాస్త్రమున కంధుఁడను. నాకు చేతినూలు కావలయును. మఱియు ఆఁడువారిచే వడికింపవలయును. గంగాబాయి యిచ్చు వెలయు, నా యిచ్చు వెలయు తా వేజా వేసి చూచికొనఁగా నేను టోపీలో పడితి నని తెలిసికొంటిని. వా రంతకు తక్కువ ధరకు ఒప్పుకొనలేదు. కావున వారిని విడనాడవలసివచ్చెను. కాని వారివలన మాకుఁ గలుగవలసిన యుపయోగము కలుగనే కలిగెను. వీరు శ్రీ అవంతికాబాయికిని, శ్రీ రమాబాయి కామదారుకును,

## ౪౦ దొరకెను

శ్రీ శంకర్‌లాల్ బాంకర్‌గారి మాతృ శ్రీ వసుమతీ బహేను గారికిని వడుకుట నేర్పిపోయిరి. నా గదిలో రాటము జుమ్మని మ్రోయఁ దొడఁగెను. నా జబ్బు పోఁగొట్టుటలో నీ రాటమునకు భాగము కలదని చెప్పినచో నతిశయోక్తి కాఁజాలదు. జబ్బు పోఁగొట్టుటకు మనస్సు మార్పు ఒక హేతువు; ఇది నిక్కము. మనుజాల రోగములను బోఁగొట్టుటలో మనస్సు పాలుమాత్ర మేమంత తక్కువా? నేనును రాటముమీఁదఁ జేయి వయిచితినిగాని అపు డంతగా పని చేయఁ జాలక పోయితిని.

బొంబాయిలోఁగూడ నేకులకుఁ గఱవాయెను. చేతియేకు లెచటను దొరకలేదు. రేవాశంకర్ ఝవేరీగారి బంగళా ముందు నుండి ప్రతిదినము దూదేకులవాఁ డొకఁడు దూది యేకు వింటిని మూపునఁ బెట్టుకొని పోవుచుండెడివాఁడు. నే నతనిని పిలిపించితిని. అతఁడు పఱుపులకు దూది యేకుచున్నటులు తెలిసికొంటిని. 'ఏకులు చేసిపెట్టెదవా?' యని యడిగితిని. కాని అత డెక్కువ వెల యడిగెను. వెల ఎక్కుడయినను ఇచ్చి యేకులు చేయించితిని. ఈ రీతిగా తయారయిన నూలు జపమాలలుగాఁ జేసి వైష్ణమిత్రుల కమ్మితిని. భాయి శివాజీ బొంబాయిలో నొక రాటపుశాల పెట్టెను. వీని యన్నిఁటికిని చాల వ్యయ మాయెను. శ్రద్ధాళురును, దేశభక్తులును ధన మొసఁగిరి. నేను ఖర్చు పెట్టితిని. ఈ వ్యయము వృథా కావని వినయముతో మనవి చేసికొందును. దీనివలన నేమెన్నో సంగతులు తెలిసికొంటిమి. వీనితోపాటు రాటమువలని యుపయోగ మంతయుఁ దెలిసెను.

నేను ధరించున వన్నియు ఖాదీమయ మయిపోయినదాఁక నాకు తోఁచలేదు. నాకట్టుబట్ట లిండియామిల్లువి. బీజాపురము నందును ఆశ్రమమునందును తయారయినవి చాల మోటుగా నుండెను.

మఱియు వాని పన్నా ముప్ప దంగుళములు. నలుబదియయి దంగుళముల పన్నా గల ఖాదీ దోవతు లొక నెలలోపుగా నాకుఁ బంపనిచో మోటు ఖాదీపంచలు కట్టుకొనవలసిన యిక్కట్టు కలుగు నని గంగాబాయికి వ్రాసితిని. గంగాబాయి గాబరాపడెను. సమయము చాల దనుకొనెను గాని ధైర్యము విడనాడలేదు. ఆమె యొక్క నెల లోపలనే ఏఁబది యంగుళముల పన్నా గల రెండు దోవతు లొసఁగి నా దారిద్ర్యమును బాపెను.

ఇంతలో భాయి లక్ష్మణదాసు లాఠీగ్రామమునుండి అంత్యజుఁడయిన, భాయి రామజీనిని, అతని భార్య గంగాబహేనును ఆశ్రమమునకుఁ దీసికొని వచ్చి వారిచే పెద్ద పన్నా గల ఖాదీబట్టల నేయించెను. ఖాదీవ్యాప్తికి ఈ దంపతులు చేసిన పని యింతింత కాదు. వీరు గుజరాతునందును తదితర దేశములందును చాలమందికి చేతి మారితో బట్టల నేతను నేర్పిరి. అక్షరములు రాకపోయినను సంస్కారవతియగు నీ గంగాసోదరిని మగ్గముమీఁద కూర్చున్నతఱిఁ జూచి తీరవలయును. ఆమె కపు డొకటి కనఁబడదు, మఱియొకటి వినఁబడదు. ఆమె మగ్గమున తన్మయతఁ జెందిపోవును.

## ఒక సంవాదము

స్వదేశీ ప్రచారమను పేరఁ బరఁగిన యీ ఖాదీప్రచార మారంభమయిన మొదటి దినములలో మిల్లువారి విమర్శము లెక్కువగా జరుగుచుండెడివి. భాయి ఉమర్ సోబానీ గారు సమర్థులగు మిల్లుయజమానులగుటవలన తమ జ్ఞానమును అనుభవమును నాకుఁ దెలుపుటయే కాక మిగిలిన మిల్లులవారి యభిప్రాయములను గూడఁ దెలుపుచుండిరి. మిల్లుయజమానులందఱిలో నొకని వాద మితనికి నచ్చెను. నన్నతనికడకు రమ్మనెను. సరే యంటిని. మేమతనికడ కరిగితిమి. మా కిటులు సంవాదమారంభమాయెను:

మీ స్వదేశీ-ఆందోళనమే మొదటిది కాదని మీ రెఱుఁగుదురే కదా?

ఔను. ఎఱుఁగుదును.

వంగవిభాగదినములలో స్వదేశీ-ఆందోళనము చాల జోరుగా జరిగియున్నటులును, మిల్లులకు చాల లాభము వచ్చినటులను మీ రెఱిఁగియుందురు. మే మపుడు వస్త్రముల విలువ హెచ్చించితిమి, చేయరాని పనులనుగూడఁ జేసితిమి.

నే నిదంతయు వింటిని. విని దుఃఖించితిని.

మీ దుఃఖము నే నెఱుఁగుదును. కాని దానికి కారణము లేదు. మేము పరోపకారమునకు వ్యాపారము పెట్టుకొనలేదు. మాకు లాభము ఉండవలయును. మేము వాటాదారులకు జవాబు చెప్పవల

యును. ఖర్చునుబట్టి వస్తువువెల యుండును. ఉత్పత్తిని, అమ్మక మును ఎవ రాపఁగలరు? తమ యాందోళనముచే స్వదేశవస్త్రముల వెల తప్పక హెచ్చునని బంగాళీవారికి తెలియవలదా ?

పాప మా పిచ్చివారు కూడ నావంటి వారే. వారికిని నావలె పిచ్చి నమ్మకమే. కావున మిల్లు యజమానులు లోక్కు స్వార్థపరులు కాఁజాల రని వారు నమ్మిరి; దగా చేయ రనుకొనిరి. విదేశవస్త్రములను స్వదేశవస్త్రము లని మభ్యపెట్టి యమ్ముదు రని వా రనుకొనలేదు.

మీకు వెఱ్ఱి నమ్మకమని నే నెఱుంగుదును. కావుననే మీకు హెచ్చరిక చేయఁ దలఁచితిని. అందులకే మి మ్మింతదూరము రమ్మని కష్ట పెట్టితిని. బోళా బంగాళీలవలె మీరును పప్పులో అడుగు వేయకుందురు గాక !

ఇటులు పలికి యాసేఠు తనమిల్లులో తయారయిన నమోనాల నిటు తెమ్మని కన్ను గిటె పెను. తీసి పాఱవయిచిన తుక్కునూలితో నేయఁబడిన కంబళికి నమోనాలు గ్రుచ్చఁబడి యుండెను. వాని పట్టుకొని యిటు లనెను : 'వీనిని చూచితిరా; క్రొత్తగా తయారు చేసితిమి! వీనికి చాల ఖర్చు. ఇవి తుక్కునూలితో తయారు చేయఁబడినవి గావునఁ జాల చౌక. వీనిని మేము హిమాలయము వఱకు రవాణా చేయుదుము. మాకు ఎల్ల చోటులను ఏజెంట్లు కలరు. మీరుగాని మీ యేజెంట్లుగాని తొక్కిచూడని చోటులలో, మీ మాటలుఁగూడ చొఱని చోటులలో మాకు కాతాలు కలవు. మా కింకను క్రొత్త యేజెంట్లతో పనిలేదు. హిందూదేశమునకు కావలసినంత వస్త్రము హిందూదేశములో తయారు కాదని మీరు తెలిసికొనుఁడు. కావున స్వదేశీ-ఆందోళనమున చేయవలసిన దే మనఁగా

ముఖ్యముగా వస్త్రోత్పత్తి. మనము వస్త్రపరిమాణమును, నాణెమును గూడ వృద్ధిచేసికొనఁ గలిగినచో విదేశవస్త్ర మప్రయత్నముగనే ఆఁగి పోవును. మీ రీ ప్రకృతపద్ధతిని ఆందోళన జరిపినచో లాభము లేదు గాన నింకను క్రొత్త మిల్లులను పెట్టించుటకు ఉద్యమించుట మంచి దని సలహా యిచ్చుచున్నాను. స్వదేశవస్తువుల ఖర్చు ఎక్కువ కోరుటకంటె స్వదేశవస్తువుల యుత్పత్తి యెక్కువ చేయవలయును.

నే నీ పనినే చేయుచున్నా నని తెలుపుచో నా కాశీర్వాదము లొసఁగుదురా?

ఏమీ? అది యెట్లు? మీరు క్రొత్త మిల్లులను పెట్టించుటకు ప్రయత్నము చేయుచో తప్పక ధన్యవాదముల కర్హులు.

ఆ పనిమాత్రము చేయుట లేదుగాని రాటమును పునరుద్ధరించుటకు చాలఁ బ్రయత్నించుచుంటిని.

అ దేటి పని?

రాటపు సంగతి యంతయుఁ జెప్పి యిటు లంటిని:

నేను మీతో సంపూర్ణముగా నేకీభవించుచున్నాను. నేను మిల్లుల కేజన్సీ పుచ్చుకొనఁగోరను. దీన హిందూదేశమునకు మేలునకు బదులు కీడు గలుగును. చాలఁ గాలమువఱకు మన మిల్లుల వ్యాపారమునకు లోటుండదు. చేతినూలితో వస్త్రముల నుత్పత్తిచేయించుటయు దానిని ఖర్చు పెట్టించుటయు నాపని. కావున నేను ఖాదీని తయారు చేయించుటకే పూనుకొన్నాను. ఖాదీమీఁదనే నాకు విశ్వాసము మెండు. ఏలయనఁగా, సగము సగము పనితో సగము సగ మాఁకటితో చచ్చిపోవు ఆఁడువారికి పని చూపింపఁగలను. ఆఁడువారిచే నూలు వడికించుటయు దానితో నేసిన వస్త్రములను హిందూ

దేశమునం దంతటను కట్టించుటయే నా పని. రాట మెంత సఫల మగునో నే నిపుడు చెప్పఁజాలను. ఇపుడే దీనికి గణేశపూజ జరిగెను. దీనియందు నాకు దొడ్డ విశ్వాసము కలదు. దీనివలన నిసుమంతయు హాని లేదనుట నిర్వివాదము. ఇది యెంత కొలఁదిగా నుత్పన్న మయినను దీనివలన హిందూదేశమునం దుత్పత్తి వృద్ధి యగును. ఉత్పత్తి యయినంత మేరకు లాభమును కలుగు గాన నీ ప్రయత్నమువలన మీరాపాదించిన దోషము లేదు.

మీరీ రీతిగనే యుద్యమము సాగించుచుందురేని నేఁ జెప్పున దేమియు లేదు. ఈ యంత్రయుగమున రాటము గిట్టునో గిట్టదో యనునది వేఱు మాట. అయినను నేను తమకు జయము కోరుచున్నాను.

# ౪౨

## అసహాకారము

పిదప ఖాదీ యెట్లు లెటు లభివృద్ధి చెందెనో యీ ప్రకరణములలోఁ జెప్పఁ జనదు. నా యొనర్చిన ఆయా యీ పనులు ఎటు లెటులు వ్యాప్తమాయెనో ఆ యితిహాసములోనికి దిగుట కిది తావు కాదు. అందు దిగినచో నొకొక్క విషయ మెుకొక్క పుస్తకమయిపోవును. నేను సత్యమును శోధించుకొనుచుఁ బోవుచుండఁగా ఒక విషయము తరువాత మఱి యొక విషయ మప్రయత్నముగా నెటులు తటస్థించెనో దానిని జెప్పుటయే నా యాశయము.

. కావున అసహాకారమును గూర్చి కొంచెము ప్రసంగించుట కిది తఱి యనవచ్చును. ఖిలాఫతును గుఱించి అలీ సోదరులు దిట్టముగా ఆందోళనము నడపుచుండిరి. స్వ. మౌలానా అబ్దుల్ బారీ మొదలగు ఉలేమాలతో నే నీ విషయమును గుఱించి లెస్సగా చర్చించితిని. ముసలమానులు శాంతిని, అహింసను ఎంతవఱకు పాలింపఁగల రను విషయము వివేచించితిమి. ప్రకృతోపయోగముకొఱకు కాక హద్దువఱకు శాంతిని అహింసను పరిపాలించుటలో ముసలమానుల నిస్లాము బాధింప దనియు, ఒకసారి అహింసాప్రతిజ్ఞను గైకొనినచో దానిని మీఱరా దనియును తుదకు వారు సిద్ధాంతీకరించిరి. ఖిలాఫతు-కాన్ఫరెన్సులో అసహాకారపు తీర్మానము వచ్చెను. దీర్ఘముగా చర్చలు జరిగిన పిదప నందఱును దీని నామోదించిరి. అలహాబాదునందీ విషయ మెుక రే యెల్లరయుఁ జర్చింపఁబడినటులు నాకు గుర్తు. హాకీము సాహెబునకు శాతిమయమగు అసహాకార మశక్యమని శంక యుండెను. కాని కొంత కాలమునకు వారికి శంక

పోయెను. తరువాత వీరు హృదయ మిచ్చి పని చేసిరి. వీ రీ యుద్యమమునకుఁ గావించిన సాయ మమూల్యము.

పిదప గుజరాతులో పొలిటికల్ కాన్ఫరె న్సాయెను. నే నీ సభలో అసహాకారపు తీరుమానము తెచ్చితిని. దీనిని కొంద ఱెదిరించిరి. వారి యుద్దేశ మిది: కాంగ్రెసు అసహాకారమును తీర్మానింపనంతవఱకు ప్రాంతసభలకు దీనిని తీర్మానించు హక్కు లేదు. నే నిటు లంటిని: ప్రాంతసభలు వెను కడుగు వేయు నక్కఱ లేదు; ముం దడుగు వేయుటకు వలయునంత అధికారము కలదు. ఇంతియుకాక ధైర్య మున్నచో ముందడుగిడుట గూడ ధర్మము. దీనివలన ప్రధానసంస్థకు అనఁగా కాంగ్రెసుకు గౌరవము హెచ్చును. ఇటులు నే ననిన పిదప ఈ విషయమునంవలి గుణదోషములు చెప్పుచు వచ్చెను. శాంతముగా పూర్వపక్షములు సిద్ధాంతములు జరిగెను. చీట్లు పుచ్చుకొనఁబడెను. అసహాకారమున కెక్కువ చీట్లు వచ్చెను; తీర్మానింపఁబడెను. ఇది తీర్మానింపఁబడుటలో అబ్బాస్ తైయబ్ జీ వల్లభభాయిగారల పా లెక్కువ. అబ్బాసుగా రధ్యక్షులు. వీరి యుద్దేశము అసహాకారముదెసనే మొగ్గెను.

ఈ సంగతి విచారించుటకు ౧౯౨౦ సం. సెప్టెంబరులో కాంగ్రెసు-ప్రత్యేకసభ జరిగెను. అందులకు పెద్దపెద్ద యేర్పాట్లు జరిగెను. లాలా లజపతిరాయలు అధ్యక్షులుగా నెన్నుకొనఁబడిరి. బొంబాయినుండి ఖిలాఫతు-స్పెషు లొకటియు, కాంగ్రెసు-స్పెషు లొకటియు బయలుదేరెను. సభ్యసముదాయముతో ప్రేక్షకసముదాయముతో కలకత్తా-కాంగ్రెసు కిటకిట లాడిపోయెను.

మౌలానా షౌకత్ అలీగారి మాటమీఁద రైలులో అసహాకారపు తీరుమానమునకు ముసాయిదా తయారు చేసితిని. నేఁటి

ఒఱిసను ముసాయిదాలలో శాంతిమయశబ్దమును వాడు నలవాటు నాకు లేదు. కాని యుపన్యాసములలో కలదు. అయినను శాంత్యర్థ బోధక మగు శబ్దము ఉరుదు మొదలగు భాషలలో నాకుఁ దెలియక పోవుటచే ముసలమానులు మాత్ర మున్న సభలలో ఆ యర్థమును దెలుపఁజాలక పోవుచుంటిని. కావున మౌలానా అబుల్ కలామ్ అజద్ గారి నడుగఁగా శాంత్యర్థము బోధించుటకు బా-అమన్ అని యు అసహకారార్థమునకు తర్క్-ఏ-మవాలాత్ అనియుఁ దెలిపిరి.

ఈ రీతిగా నేను గుజరాతీ హిందీ ఉరుదు పదములను తెలిసికొనుచుండఁగా కాంగ్రెసులో పై తీర్మానము తయారుచేయు భారము నాపాలఁ బడెను. ఆ ముసాయిదాలో శాంత్యర్థబోధక మగు పదము పడలేదు. చిత్తు తీరుమానమును రాత్రి రైలులో తయారుచేసి మౌలానా షౌకతలీ గారి చేతి కిచ్చితిని. ఉండవలసిన 'శాంతి' శబ్దము ముసాయిదాలో జాఱిపోయె నని రాత్రి గుర్తు వచ్చెను. 'అచ్చు కాక ముందే శాంతిమయశబ్దమును జోడింపవలయు' నని మహాదేవ దేశాయి గారిని పంపితిని. దీనిని జోడింపకముందే చిత్తుతీర్మాన మచ్చయి పోయినటులు గుర్తు. ఆ రాత్రియే విషయనిర్ధారక సభ. కావున ముందరనే శాంతిమయశబ్దమును చేర్పవలసివచ్చెను. ముందరనే నేను చిత్తుతీర్మానమును తయారుచేసికొని యుండనిచో చాల చిక్కు పడి పోవువాఁడనే యని పిదప తెలిసికొంటిని.

ఇల్లలుకఁగనే పండుగ కాలేదు. ముసళ్ల పండుగ ముందున్నది. నా తీర్మానము నెవరు సమర్థింతురో, మఱి యెవ రెదిరింతురో నాకుఁ గొంచెమేని తెలియలేదు. లాలాజీ యెటు మొగ్గు జూపునో కొంచెమేని తెలియదు. అనుభవము గల పురాణయోధు లందఱును కలకత్తాలో నుండిరి. వీరిలో విదుషి అనీబెసంటు, పండిత

మాలవ్యులు, విజయరాఘవాచార్యులు, పండిత మోతీలాలుగారు, దేశబంధులు లోనగు నాయకులు ముఖ్యులు. ఖిలాఫతు పాంచాల దోషముల నివృత్తికొఱకే అసహాకారము చేయఁబడు నని నా తీర్మానము. దీనితో శ్రీ విజయరాఘవాచార్యులవారికి సంతోషము కలుగలేదు. వీరు 'ఏవో కొన్ని అన్యాయములకు మాత్రమే సహాకారా మేమిటి? అన్యాయములలోని కెల్ల స్వరాజ్య మీయకుండుటయే దురన్యాయము. స్వరాజ్యమునకే అసహాకార మాచరింపఁదగు' నని చెప్పిరి. మోతీలాలుగారుగూడ నిటులే పలికిరి. నేను వెంటనే వీరి సూచన నొప్పుకొని నా తీర్మానములో స్వరాజ్యమును గూడఁ జేర్చితిని. దీర్ఘమును గంభీరమును నిశితమును నగు చర్చతో అసహాకారపు తీర్మాన మామోదింపఁబడియెను.

అందఱికంటె మొదట నీ యాందోళనమున మోతీలాలుగారు చేరిరి. నాఁడు నా రా తీర్మానముమీఁద మధురముగా కావించిన వాదము నేఁటికిని నాకు గుర్తున్నది. నా రందలి శబ్దములను కొన్నిఁటిని మార్ప సూచింపఁగా నేను మార్చితిని. దేశబంధువుల నిటు వైపు త్రిప్పుటకు వీరు చాలఁ బాటుపడిరి. దేశబంధువున కసహాకారమనిన ఇష్టమే కాని ప్రజలు దీని భారమును వహింపఁజాల రని వారికి సంకోచము. దేశబంధువులును, లజపతిరాయలును నాగపురమున పూర్తిగా అసహాకారవాదు లయిపోయిరి. ఇట్టి శిష్టసభలో లోకమాన్యులు లేని లోపమునకు నేను కడు చింతపడితిని. వా రత్తఱి నా సభలో నుండు రేని నా కాశీర్వాదము లొసఁగి యుందు రని నా యుద్దేశము. ఒకవేళ వారు ఖండించినను నా కది సౌభాగ్యమే. దానఁ గొంత నేర్చికొని యుందును. వీరికిని నాకును మతభేదము కలదు గాని యది చాల మధురము. 'మా బంధుత్వములు సన్నిహితము' లని వారు

తలపించెడివారు. ఈ పంక్తులు వ్రాయుచుండఁగా వారి మృత్యు చిత్రము నా యెదుట నిలుచుచున్నది. నా సహచరుఁడు పటవర్ధనుఁడు నడిరేయి యీ వార్తను నాకు టెలిఫోను చేసెను. వెంటనే 'నా డాలు తునిసి పడిపోయెను' అను వాక్యము నా నోరినుండి వచ్చెను. అపుడు నా చుట్టును సహచరులు కలరు. అపు డసహాకారము మూర్తిమంత మయి యుండెను. వారికడనుండి నాకు తేజస్సు వచ్చు ననుకొంటిని. వారి యుద్దేశ మే దెస నుండెనో దైవమున కెఱుక గాని ప్రజేతిహాసములో నట్టి కష్టకాలమున వారు లేకపోవుటం దలపను చింతాకర మని మాత్రము నా కెఱుక.

# నాగపురమున

కలకత్తాలో జరిగిన స్పెషల్ కాంగ్రెసునందు తీర్మానింపఁబడిన అసహకారమును నాగపురమునఁ గాఁబోవు కాంగ్రెసు స్థిరీకరింపవలయును. కలకత్తాయందుబలె నాగపురమునందును జనులు తండోపతండము. నాఁటికిని ప్రతినిధుల సంఖ్య నియతము చేయఁబడలేదు. కావున సుమారు పదునాలుగువేల ప్రతినిధులు వచ్చినటులు నాకు గుర్తు. విద్యాలయములకు సంబంధించిన తీర్మానములో కొంచెము మార్పు చేయవలసిన దని లాలాజీ పట్టు పట్టఁగా నే నందుల కంగీకరించితిని. ఇటువలె దేశబంధువు సూచించిన మార్పులను గూడ నంగీకరించితిని. తుదకు అహింసాత్మక మగు అసహకారప్రస్తావ మందఱిచేతను ఆమోదింపఁబడెను.

ఈ సభలోఁగూడ కాంగ్రెసునిబంధనల మార్పును గుఱించి పునరాలోచన జరుగవలసి యున్నది. కలకత్తా స్పెషల్ కాంగ్రెసులోనే నే నీ నిబంధనల ముసాయిదాను సభవారి యెదుటఁ బెట్టితిని. సభవా రందఱును దీనిని యథేచ్ఛముగా చర్చించిరి. శ్రీ విజయరాఘవాచార్యులవారు కాంగ్రెసు కధ్యక్షులు. నిర్ణాయక సభవారు నిబంధనలలో నొక పెద్ద మార్పు చేసిరి. నేను ౧౫౦౦ ప్రతినిధులను సూచించితిని. వారు ౬౦౦౦ చేసిరి. ఇది దూరదృష్టి లేని మార్పని నా యుద్దేశము. ఇన్నియేండ్ల యనుభవమునను బడసిన పిదపఁగూడ నా యుద్దేశము మాఱలేదు. ప్రతినిధుల సంఖ్యాబాహుళ్యమువలన పని బాగుగా జరుగు ననియు, ప్రజాస్వామ్యము చక్కఁగా నిర్వహింపఁ

బడుననియు ననుకొనుట వట్టి కల్ల. స్వయంనియుక్తులగు ప్రతినిధులు ఆఱువేలమంది ఉండుటకన్న ఉదారమనస్కులును ప్రజాస్వత్వపరిపాలకులును ప్రామాణికులును నగు ప్రతినిధులు పదియేనువందలమంది యున్నచో ప్రజాతంత్రము సురక్షితమగును. ప్రజాతంత్రమును నిర్వహించుటకు జనులలో స్వాతంత్ర్యము స్వాభిమానము ఐకమత్యము ఉండవలయును. జనులు యోగ్యులును సత్యసంధులును నగు ప్రతినిధులనే యెన్నుకొనవలయును. సంఖ్యామోహమున్నచో ఆఱువేలే యని మితి యేమి? ఇంకను ఎక్కుడింపవచ్చును. కావున నీ విషయమాలోచించి నిశ్చయింపఁబడువఱకు ఆఱువేలు ఖాయము చేయఁబడెను.

స్వరాజ్యమును గుఱించి కాంగ్రెసులో తీవ్రముగా చర్చ జరిగెను: 'వీలగుచో సామ్రాజ్యములో నుండవచ్చును. వీలు లేనిచో సామ్రాజ్యమునుండి విడిపోవచ్చును. ఎటులేని స్వరాజ్యము సంపాదింపఁదగును.' అని కాంగ్రెసుకార్యప్రణాళికలో నొక నిబంధన కలదు. స్వరాజ్యము సామ్రాజ్యాంతర్భాగమే కావలయు నని ఒక పక్షమువారి వాదము. దీనికి సమర్థకులు మాలవ్యులును, జిన్నాగారును. కాని వీరి కెందఱో బాసట కాలేదు. 'శాంతిసాధనములచేతనే, సత్యసాధనములచేతనే స్వరాజ్యము సంపాదింపవలయును' అని మఱియొక నిబంధన కలదు. ఈ షరతులకును వివాదము కలిగెను. కాంగ్రెసు ఈ వివాదము నంగీకరింపలేదు. నిబంధన లన్నిఁటిపై చక్కఁగా చర్చ జరిగెను. తుదకు తీర్మానము చేయఁబడెను. ప్రామాణికత్వముతోడను జాగరూకతతోడను ఈ నిబంధనలను లోకులు నిర్వహింతు రేని సంస్కారమును పొంది స్వరాజ్యమును బడయఁగల రని నా పరమవిశ్వాసము. అయినను ఈ విషయ మిచట నప్రస్తుతము.

హిందూముసలమానుల యైక్యమును గురించియు, అంత్యజులను గురించియు ఖాదిని గురించియు ఆ కాంగ్రెసులో తీర్మానములు చేయఁబడెను. నాఁటినుండియు కాంగ్రెసునందలి హిందూ సభ్యు లస్పృశ్యతాకలంకమును తుడిచివేయఁ బూనుకొనిరి. నాఁటినుండియు ఖాదీచేత కాంగ్రెసు కంకాళమాత్రావశిష్టు లగు నిరుపేదలతో పోరాని చుట్టఱికమును గలుపుకొనెను. ఖిలాఫతును అంగముగా అసహాకారమును జేపట్టి దాని మూలమున హిందూముసలమానుల యైక్యమునకుఁ జాలఁ దోడుపడెను. కాంగ్రెసు చేసిన పనులలో నిది చాల దొడ్డ పని.

# పూర్ణాహుతి

ఇప్పుడీ ప్రకరణములను ముగింపవలసిన సమయ మాసన్న మాయెను. ఇటుమీఁదట నా జీవితములో జనులకుఁ దెలియని విషయ మేదియు లేదు. మఱియు నేను ౧౯౨౧ సాలు నుండియు కాంగ్రెసునాయకులతో చాలఁ గలసి మెలసి పని చేసితిని. నాఁటినుండియు నా జీవితమున నే యంశమును ఎత్తికొనినను వారి సంబంధము తెలుపనిచో నది యథార్థవర్ణనము కాదు. వారి బాంధవ్యములు నా కింకను నూతనములుగా నున్నవి. శ్రద్ధానందులు దేశబంధులు లాలాజీ హకీముసాహెబు మనకు లేకున్నను సౌభాగ్యవశమున పలువురు దేశనాయకులు మన కున్నారు. కాంగ్రెసులో చాల పరివర్తనము కలిగినను దాని పదఁపటి చరిత్ర మింకను ప్రక్రియాదశయందే యున్నది. నా ముఖ్యశోధనము లన్నియు మహాసభాద్వారముననే జరిగెను గావున నా శోధనములను వ్రాయవలసివచ్చుచో నాయకులకును నాకును గల సంబంధము నుదాహరింప వలసి వచ్చును. ఔచితి నెఱిఁగి యిపుడు దీని నంట నొల్లను. మఱియు నేఁడు జరుగుచున్న శోధనలు నా యుద్దేశమున నిశ్చయాత్మకము లని యనిపించుకొనఁ దగవు గాన నీ గ్రంథము నిఁక ముగించుట నాకు విధి యని తలఁచుచున్నాను. నా కల మిఁక ముందరికి పోఁగవల దనుచున్నది.

పాఠకులకడ సెలవు తీసికొనవలసి వచ్చుటచే నాకు వెత గలుగుచున్నది. నాకు నా శోధనము లనర్ఘములు. వాని యథార్థ వర్ణనము చేయఁగలిగితినో లేదో నాకుఁ దెలియదు. నేను దేనిని దాఁచుకొనలేదు. ఉన్న దున్నటులు చెప్పితిని. సత్యమును పే

నే రూపమునఁ జూచితినో యే మార్గమునఁ జూచితినో ఆ రూపమున ఆ మార్గమునఁ దెలుపుట కెల్లప్పుడును ప్రయత్నించితిని. దీని నంతయును పాఠకుల యెదుట నిడి చిత్తశాంతి నొందుచున్నాను. ఏల యనఁగా, వీనిని పఠించుచో పాఠకుల హృదయములలో సత్యమునెడలను, అహింసయెడలను అధికముగు శ్రద్ధ కలుఁగఁగల దని నా కాశ.

సత్యముకంటె వేఱుగా పరమేశ్వరుఁ డొకఁ డున్నాఁడని నా కనుభవము లేదు. సత్యమున కహింసయే రాజమార్గ మని యీ గ్రంథమునందలి ప్రతిపుటయుఁ జెప్పఁజాలని యెడల నా యీ ప్రయత్న మంతయు వ్యర్థ మని తలఁతును. నా ప్రయత్న మంతయు వ్యర్థ మయినను నా సిద్ధాంతము వ్యర్థము కాదు. ఇంతవఱు నా యహింస సత్యమయినను అపక్వముగనే, అపూర్ణముగనే యున్నది. కావున నా కనుఁగొనఁగలిగిన దా సత్యసూర్యునిలో నొక కిరణమే. మఱియు వేల సూర్యు లయినను ఆ సత్యసూర్యునకు తీసికట్టు. సంపూర్ణమగు నహింస లేనిచో సంపూర్ణ మగు సత్యము దొరక దని ఇన్నాళ్లు శోధించిన పిదపఁగూడఁ జెప్పుచున్నాను.

వ్యాపకుఁ డగు నీ సత్య నారాయణుని ప్రత్యక్షదర్శనమునకు జీవమాత్రమును తనవలెనే ప్రేమించు టత్యావశ్యకము. ఈ సత్యమును బడయఁగోరువాఁడు జీవనమునందలి యే క్షేత్రమునకును ఆవల నుండఁజాలఁడు. కావుననే రాజనీతి క్షేత్రమునకు సత్యభక్తి నన్నీడ్చుకొని పోయెను. మతమునకు రాజనీతితో సంబంధము లే దని చెప్పువారికి మత మన నేమియో తెలియ దని నిస్సంకోచముగాఁ జెప్పుట వినయేతరము కా దనుకొనుచున్నాను.

ఆత్మశుద్ధి లేక ప్రాణిమాత్రముతో ఐక్యానుభవము కలుగదు. ఆత్మశుద్ధి లేక అహింసాపరిపాలన మసంభవము. ఆత్మశుద్ధి లేనిచో

ఆత్మదర్శనము దొరకదు. కావున జీవనక్షేత్ర మంతయు పరిశుద్ధము కావలయును. ఈ శుద్ధి సాధ్యము. ఏల యనఁగా, ఒకని శుద్ధి యనేకులను శుద్ధుల నొనరించును. వ్యష్టికిని సమష్టికిని ఇట్టి శుద్ధి కలుగఁ గలంత సన్నిహితసంబంధము కలదు. ఇట్టి శుద్ధికి ప్రయత్నింపఁగల శక్తిని సత్యనారాయణుఁడు ప్రతివానికిని ఇచ్చియే యున్నాఁడు.

ఈ శుద్ధిమార్గము చాల నెగుడు దిగుడయిన దని ప్రతిక్షణమును నా కనుభవ మగుచున్నది. శుద్ధుఁ డగుటకు మనోవాక్కాయములచే నిర్వికారుఁడును రాగద్వేషాదిరహితుఁడును గావలయును. ప్రతిక్షణమును సదుమద మగుచున్నను నే నట్టి నిర్వికారస్థితికడకుఁ జేరఁజాలకున్నాను. కావున లోకులస్తోత్రములు నన్ను మేలుకొలుపక పలుమాఱులు వేసట గొలుపుచున్నవి. శస్త్రయుద్ధ మొనరించి జగత్తును జయించుటకంటె మనోవికారములను జయించుట నాకు కష్ట మనిపించుచున్నది. హిందూదేశమునకు వచ్చిన పిదపఁగూడ నాలోఁ గొన్ని వికారములు తెలియకుండ నడఁగియున్నవని కనుఁగొని సిగ్గిలుచున్నాను గాని ధైర్యమును మాత్రము గోలుపోవలేదు. సత్యశోధనలలో నా కానందము కలిగెను. ఇంకను కలుగుచునే యున్నది. కాని యింకను అగ్నిపథము ముం దున్న దని నే నెఱుఁగుదును. కావున నే నింకను శూన్యతను బడయవలయును. అన్నిటికంటెఁ దన యల్పత్వము మానవున కెంతవఱకు గోచరము కాదో అంతవఱకును ముక్తి లేదు. ఈ వినయమునకు అహింస ఎల్ల. ఈ వినయము లేక ముక్తి లేదనుట అనుభవసిద్ధము. ఇట్టి వినయమును ప్రార్థించుచు, దీనికి లోకుల సాయమును యాచించుచు నిక నీ ప్రకరణములను ముగించుచున్నాను.